# ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి

'సహనమే సంస్కృతి'
(సర్. సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు.)

గ్రంథకర్తలు

ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం, ఎమ్. ఏ.,
ఉస్మానియా విశ్వవిద్యాలయాంధ్ర శాఖాధ్యక్షులు (రిటైర్డు)

శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరం, ఎమ్. ఏ.,
ఉపన్యాసకులు, వరంగల్ కళాశాల.






ప్రకాశకులు:

బాలసరస్వతీ బుక్ డిపో,
విద్యావిషయక ప్రచారకులు,
కర్నూలు.

బ్రాంచి ఆఫీసు : 6, సుంకురామశెట్టి వీధి, మద్రాసు - 1

 1965 [వెల రు. 8-00

# ఆశీస్సులు

ఆచార్య శ్రీ ఖండవల్లి - లక్ష్మీరంజనముగారి సన్నిధికి :—

మిత్రవర్యా, వందనములు :

తమచే రచింపబడిన "ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి" యను ఉద్గ్రంథమును, ఆమూలాగ్రము చదివి యానందించితిని.

సమగ్రమైన "ఆంధ్రుల చరిత్ర" యొకటి మన భాషలో ఇప్పటి వరకు లేనిలోపము తమ రచనవలన దీరుచున్నది. దీనిలో, రాజకీయచరిత్ర, సాంస్కృతిక చరిత్ర, ఇది యది యననేల, ఆంధ్రదేశమునుగూర్చియు ఆంధ్రులనుగూర్చియు, జిజ్ఞాసువగువాడు కోరు విషయములన్నియు ఒకచోటనే కలవని నాకు తోచినది. పై విషయములనుగూర్చిన యొక 'సర్వస్వము'గా దీనిని పేర్కొనవచ్చును.

ఈ పుస్తకము చదువువారికి తమ పరిశోధనాపటిమ, రచనా నైపుణ్యము, పరిశ్రమాబాహుళ్యము స్పష్టముగా గానవచ్చును. ఇట్టి యుత్తమ గ్రంథమును రచించి ఆంధ్రపాఠక లోకమునకు మేలు చేకూర్చినవారైతిరి.

ఉస్మానియా విశ్వవిద్యాలయమువారు దీనిని పట్టపరీక్షకు పాఠ్య గ్రంథముగా నిర్ణయించుట ఎంతయు తగియున్నది. ఆంధ్రగ్రంథాలయ నిర్వాహకుల వలనను, భాషాభిమానులగు ఇతర మహాశయులవలనను తమ ఈ కృషి సర్వ విధముల ప్రోత్సహింపబడుగాక !

ఆంధ్రకుటీరము,
హైదరాబాదు,
౫-౧౧-౧౯౫౧.

విధేయుడు,

మాడపాటి - హనుమంతరావు.

# పరిచయము

భారతదేశచరిత్రలో ఆంధ్రులు నిర్వహించిన పాత్ర మిక్కిలి ముఖ్యమైనది. అందునను దక్షిణాపథ చరిత్రమునందలి విశేషభాగము ఆంధ్రులచరిత్రమే. భారతీయ సంస్కృతియొక్క పరిణామమునకును ఆంధ్రు లొసగిన దోహదము ప్రసిద్ధమైనదే.

అయినను ఆంధ్రులచరిత్ర సంస్కృతులకు సంబంధించిన గ్రంథాదికములు విశేషముగ లభించుటలేదు. వానిరచనమున కుపయోగించు సాధనసామగ్రియు అసమగ్రముగనే ఉన్నది. ఆంధ్రచరిత్ర పరిశోధనకు అవసరమైన ప్రోత్సాహమును లభించుటలేదు. ఏ కొద్దిమందియో అనేక విధములగు నిబ్బందులకు లోనగుచు నీ పరిశోధనను సాగింపవలసి వచ్చుచున్నది. ఇటీవలనే కొన్ని కొన్ని రాజవంశములను గూర్చియు, ప్రత్యేకఘట్టములను గూర్చియు గ్రంథములు వెలువడినవి.

ఉపలబ్ధమగు సామగ్రియొక్కయు, గ్రంథములయొక్కయు, వ్యాసములయొక్కయు సహాయమున ఆంధ్రుల చరిత్ర సంస్కృతుల స్వరూప స్వభావములను సంగ్రహముగనైనను తెలియజేయు గ్రంథ మొకటి మిక్కిలి యవసరమైనది. కళాశాలలలో చదువుకొను విద్యార్థులకును, సామాన్య పాఠకులకును ఇట్టి గ్రంథము మరియును అవసరమైనది. 'ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి' గ్రంథము ఈ కొరతను తీర్పనుద్దేశింప బడినది.

శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం, బాలేందుశేఖరంగారలు ఆంధ్రుల చరిత్ర సంస్కృతులయెడ గాఢమైన అభిమానముగల విద్యాధికులు. ఇందు శ్రీ లక్ష్మీరంజనంగారు చాలకాలమునుండి ఎం. ఏ. తరగతి తెలుగు విద్యార్థుల కాంధ్రచరిత్ర సంస్కృతులను బోధించుచున్నారు. ఈ సోదరులు ఆంధ్రుల చరిత్ర సంస్కృతులయెడ తమకుగల పరిచయాభిమానముల నీ గ్రంథరూపమున ప్రశంసనీయముగ వెలువరించినారు.

ఇందు ఆంధ్రుల చరిత్రము ఆదినుండి నిన్న మొన్నటివరకును సూచింపబడినది. అందలి ముఖ్యరాజవంశముల చరిత్రముతోబాటుగ ఆయాకాలములలోని సాంఘిక సాంస్కృతిక పరిస్థితులును వర్ణింపబడినవి. గ్రంథకర్తలు ప్రామాణిక గ్రంథములను, వ్యాసములను ఆధారము చేసికొని యీ గ్రంథమును రచించిరి. ఈ గ్రంథమునందు సుప్రసిద్ధ పరిశోధకులందరి యభిప్రాయములును పేర్కొనబడినవి. విషయ విన్యాసము ఆంధ్రుల చరిత్ర సంస్కృతులను సులభముగ గ్రహించుట కనువైనదిగ నున్నది.

ఇందు కొన్ని చిత్రములను, ఆయా రాజ్యముల విస్తృతిని తెలుపు పటములను చేర్చియుండవలసినది.

ఈ గ్రంథమును రచించి విద్యార్థులయొక్కయు, సామాన్య పాఠకులయొక్కయు, కొరతను దీర్చి, ఆంధ్రుల చరిత్ర సంస్కృతుల స్వరూప స్వభావము-

సంగ్రహముగనైనను ఎల్లరకును దెలియజేసిన గ్రంథకర్తలు ప్రశంసనీయులు. ఆంధ్రలోకముయొక్క ఆదర ప్రోత్సాహములను తప్పక పొందగలదని నేను ఆశించుచున్నాను.

హైదరాబాదు,
4-11-1951.

[signature]

# గ్రంథకర్తల విజ్ఞప్తి

'ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి' ఇదియొక మధుకోశము. మకరంద తుందిల మందారసుమముకాదు. ఇది యాంధ్రమహాజనుల సాదరపరిశీలనము నందగల్గినచో కృతకృత్యులము.

గ్రంథమును తిలకించి ఆశీస్సుల నొసంగ నభ్యర్థించగా, హార్దిక ప్రశంసాత్మకమైన యుత్తరమునే ప్రసాదించిన పూజ్యులు, మా చిన్నతనమునుండియు మాయెడ వాత్సల్యపూరితులు, ఆంధ్రపితామహ శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులు, హైదరాబాదు కార్పొరేషను మొదటి మేయరుగారికి మాకృతజ్ఞతలు వెల్లడించు చున్నాము. ఆంధ్రచారిత్రకులలో ప్రతిభాగరీయులుగ పరిగణింపబడు చున్నవారు, ఈ పుస్తకమునకు దయతో పరిచయవాక్యముల వ్రాసినవారు డాక్టరు నూకెమండడ రామారావు పంతులుగారికి మా కృతజ్ఞతలు.

గ్రంథముయొక్క శుద్ధప్రతిని సంసిద్ధము చేయుటలో మిక్కిలి సహాయభూతులై, నడుమ నడుమ చక్కని యంశములను సూచించుచు తోడ్పడిన మా పూర్వ విద్యార్థులు చిరంజీవులు శ్రీ. బి. రామరాజు ఎం. ఏ. గారికిని శ్రీమతి ఇల్లిందల సుజాత ఎం. ఏ. గారికిని మా యాశీర్వచనములు.

ప్రకాశకులు శ్రీ బాలసరస్వతీ బుక్ డిపో కర్నూలు వారియొక్కయు, ముద్రణ కర్తలు వెల్డను ప్రెస్సు వారియొక్కయు సంపూర్ణసానుభూతి సహకారములు లేనిచో ఈ పుస్తకము లోకము కంటబడకయే యుండును. అయినను గృహమేధి తన్ను తాను ప్రశంసించుకొనరాదు గదా.

హైదరాబాదు,
8-11-1951.

ఖండవల్లి లక్ష్మీరంజనం.
ఖండవల్లి బాలేందు శేఖరం.

# అభిప్రాయములు

## మల్లంపల్లి సోమశేఖరశర్మగారు.

53, శరవన పెరుమాల్ వీధి, మద్రాసు-7.

ఆర్యా!

మీరుపంపిన "ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి" అందినది. దానిని చూచినాను. ఆంధ్రప్రదేశావతరణవరకు మన సమగ్రచరిత్రను తీసికొనివచ్చినందుకు చాల సంతోషముకలిగినది. ఇంత సంపూర్ణమైన ఆంధ్రులచరిత్రను తెలుపు గ్రంథము తెలుగులో యింతవరకు యిదొక్కటియే యేమో! మంచి గ్రంథములు ప్రకటించుచున్న మిమ్ము అభినందించుచున్నాను.

మద్రాసు-7,<br>8-6-57.

మల్లంపల్లి సోమశేఖరశర్మ.

## "ఆంధ్రప్రభ" దినపత్రిక

ప్రతిజాతికి ఒకవిశిష్టతవుంది. ఆవిశిష్టత జాతినుంచి వేరుచేయరానంత లోతులకు వేళ్ళు తన్నుకొని నిలిచివుంటుంది. సహస్రాబ్దాలు గడచినా ఎందరు రాజులు మారినా, ఎన్ని సిద్ధాంతాలు వ్యాపించి నశించినా, సంఘ వ్యవస్థ మారునంతవరకు దాని కూకటివేళ్ళు కదలవు; మెదలవు; అదే సంస్కృతి.........

రక్తములో రక్తంగా, జీవంలో జీవంగా రంగరించుకొని పోయిన ఈ సంస్కృతి చరిత్ర వ్రాయడం రాజుల రాజ్యాలచరిత్ర వ్రాసినంత తేలికపనికాదు; తెలుగుజాతి సంస్కృతిని గురించి కలం సాగనివ్వడం మరింత కష్టం.........

మన తాత ముత్తాతల సంగతి _ మన సొంతకథ _ మనవారి బ్రతుకు తీరు తెన్నులు తెలుసుకోవలసి వుంటుంది......శాతవాహనుల నాటినుంచి కాకతీయుల వరకు...ఆధునికయుగముతో కలసి 20 ప్రకరణాలలో తెలుగుజాతి చరిత్ర సంస్కృతి సంగ్రహంగా తెలుపబడ్డాయి.

గ్రంథరచయితలే విజ్ఞప్తిలో తెలుపుకున్నట్లు ఇదొక మధుకోశమే అయినా, మధు సంగ్రహణం, మొదటినుంచి తుదిదాక నిష్పక్షపాత దృష్టితో, విశాలాంధ్ర నిర్మాణవాంఛతో జరిగింది. తమకు తోడ్పడిన సామగ్రిని—"గాథాసప్తశతిలోని తెలుగుపాదాలు"వంటి మారుమూల వ్యాసాలనుకూడా_రచయితలు ఫుట్ నోటులో ఉదహరించి తమ చిత్తశుద్ధిని నిరూపించుకున్నారు.

మన చరిత్ర, సంస్కృతుల స్వరూప స్వభావాలను రేఖామాత్రంగా తెలియజేసే కోవకుచెందిన గ్రంథాల కిదే ఒరవడికావడం నిస్సందేహం. ఇకమీద వివిధ దృక్పథాలతో ప్రజాచరిత్ర వ్రాయడానికి అవకాశం కలుగగలదు. ప్రతి తెలుగువారి ఇంటిని, ప్రతి గ్రంథాలయాన్ని అలంకరించవలసిన గ్రంథమిది. దీనిని ప్రకటించిన బాలసరస్వతీ బుక్ డిపో కర్నూలు వారును అభినందనీయులు.

మద్రాసు,<br>16_3_52.

ఆంధ్రప్రభ.

---

# ప్రజావాణి

ఇదొక ఉద్గ్రంథము, ఆంధ్రులచరిత్రను శాలివాహనులకు పూర్వంనుండియు నేటివరకు సంగ్రహముగా తెలిపినారు. ప్రతి ప్రకరణములో చరిత్రతోపాటు ఆయా కాలములందలి యాంధ్రుల సంస్కృతిని తెలిపినారు. ఈ రెండు విషయాలను సంగ్రహముగా తెలిపినారు. గ్రంథమంతయు విషయభరితము. విజ్ఞానప్రదము. మొదటి 60 పుటలలో సంస్కృతి యననేమి? ఆంధ్రదేశ వ్యాప్తి యెంతవరకు? అందలి యాదిమజనులెవ్వరు? అన్న విషయాలు తెలిపినారు.

విష్ణుకుండి (పు 162) శబ్దమునకు మూలము వినుకొండయని తలంతుము. మలయ (164) శబ్దము మన నల్లమల యెఱ్ఱమల నుండి యేర్పడి సంస్కృతమై యుండును.

గ్రంథ విషయాలను చాలా పరిశ్రమతో సేకరించారు. బహు గ్రంథములను నాధారముగా తీసుకొన్నారు. తమ భావములను వాటికి సమకూర్చినారు. ఇట్టి గ్రంథము వ్రాయుట చాలా శ్రమతో కూడుకున్నది. దానిని చక్కగా ప్రశంసా పాత్రముగా నిర్వహించినారు. ప్రతి పాఠశాల ప్రతి గ్రంథాలయము ప్రతి విద్యావంతుడును దీనిని తెప్పించుకొని చదివి లాభము పొందవలెను. మనకు తూర్పు చాళుక్యుల కాలమునుండియే మన చరిత్ర యంతో అంత తెలియును. ఇందు తత్పూర్వ చరిత్ర సగము గ్రంథము నాక్రమించుకొన్నది. కావున దీని విలువ మరింత హెచ్చినది. ఈ ఉత్తమ గ్రంథమును వ్రాసిన రచయితలను, ప్రకటించిన బాలసరస్వతీ బుక్‌డిపో వారిని అభినందిస్తున్నాము.

హైదరాబాదు,
5-3-52.

ప్రజావాణి.



# విషయసూచిక

# దేశపటములు (Maps)



# చిత్రములు

## మూడురంగుల ముఖచిత్రము,

## ఆంధ్రరాష్ట్రంలోని మరుపురాని చారిత్రక దృశ్యములు



ఆంధ్రరాష్ట్రమునకు ఆత్మార్పణ చేసిన

**అమరజీవి "పొట్టి శ్రీరాములు" కు**

ఆంధ్రుల అఖండ జోహార్లు.

# ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి

## 1వ ప్రకరణము

## (సంస్కృతి నిర్వచనము)

ఆంధ్ర దేశమునకు సంబంధించిన చరిత్రాంశములపై 19 వ శతాబ్దమున పాశ్చాత్య పరిశోధకులును దేశీయ పండితులును అప్పటప్పట కొంత వెలుతురును ప్రసరింపజేయుటతో తృప్తిపడుచుండిరి. భారత దేశ చరిత్రవలెనే ఆంధ్ర దేశ చరిత్రను ఆద్యంతముగా ఒక యేకాఖ్యానముగా వ్రాయదగునని ఈ శతాబ్దారంభమున గుర్తించి ఒక్క కలముతో నిర్వహించిన మనీషి, చరిత్ర చతురానన చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు. నాటినుండి పలువురు పరిశోధకులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ, రాళ్ళబండి సుబ్బారావు, భావరాజు వెంకట కృష్ణారావు పంతులు, డాక్టరు నేలటూరు వెంకటరమణయ్య డాక్టరు మారేమండ రామారావు, శ్రీమాన్ దూపాటి వెంకటరమణాచార్యులు, శ్రీ కురుగంటి సీతారామ భట్టాచార్యులు ప్రభృతులు ఆంధ్ర చరిత్రలో అజ్ఞాతయుగములను అవిదితాంశములను చక్కగా పరిశోధించి చీకటికోణముల నెన్నిటినో తేజోవంతములు చేసినారు. "ఎందరో మహానుభావులు–వారందరికి వందనములు" అన్నారు త్యాగయ్యగారు. కాని, చారిత్రకుల పరిశోధన కాంతారములోనికి జొచ్చి దారితప్పక సూటిగా అడవి గడచి బయటపడగల శక్తి, సామాన్య పాఠకుల కుండుట అరుదు. కావున ఇంతవరకును జరిగిన పరిశోధన ఫలితములను ఏక కథానకముగా చిత్రించు నావశ్యకతను అనేకులు గుర్తించిరి.

మ-రా-శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర'ను వ్రాయుటలో అగ్రతాంబూలము నందిరి. విఖ్యాత చారిత్రకులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారిటీవల ఆంధ్ర దేశ చరిత్రను తమ రేడియో ప్రసంగములలో సాధికారముగ సింహావలోకనము చేసి

దేశోపకారము గావించిరి. ఆంధ్రుల చరిత్ర-సంస్కృతివిశేషములు, ఆద్యంతము, దిఙ్మాత్రప్రదర్శకముగ లిఖింపబడుచున్నవి.[1]

సంస్కృతి యన నేమి ? ఒక జాతి యభివృద్ధి మార్గమున నడచిన రీతిని సంస్కృతి యనుచున్నారు. వ్యక్తి చేయు అభివృద్ధి యత్నమును సంస్కారము అనవచ్చును. అతడు సంస్కారి. అనగా సంస్కారము గలవాడు, చక్కని మనోవికాసము గలవాడు అన్నమాట. పూర్వ సంప్రదాయము ప్రకారము సంస్కారి యనగా ఆహితాగ్ని, ద్విజునకు చెప్పబడిన కర్మలను యథావిధిగ నిర్వహించు దీక్షాపరుడు అని పూర్వ సంకేతము. ఇప్పటి పరిభాషలో సంస్కారి అనగా సంఘమందలి దురాచారములను సవరించుటకో నిర్మూలించుటకో కృషి చేయువాడు. వీరేశలింగము పంతులు సంఘసంస్కారి. సంస్కృతి, సంస్కృతము, సంస్కరణము, సంస్కారము మొదలగు పదములన్నియు ఒకే కుదుట బుట్టినవి. వీ టన్నిటికిని ఒకటే యర్థము. హీనదశ లేక ప్రాథమికదశనుండి ఉత్తమదశను చేరుటకై చేయు ప్రయత్న పరంపర. సంస్కృత భాషకు ఆపేరెట్లు వచ్చినదో అరయుడు. ప్రాకృతదశనుండి అనగా జనసామాన్య వ్యవహారపు టవస్థనుండి శిష్టజనవ్యవహారముచేతను వ్యాకరణాది నియమముల చేతను శుద్ధమైనభాష సంస్కృతభాష. అట్లే జాతులుకాని, సంఘములుకాని భౌతికముగను మానసికముగను ఉచ్చదశ నొందుటకై చేయు నిరంతర యత్నమే వారి సంస్కృతి యని చెప్పనగును.

సంస్కృతికి పర్యాయపదముగ కొందఱు నాగరకతయను పదమును వాడుచున్నారు. నగరమునందు నివసించువారు నాగరకులు. వారి వేష భాషా వైఖరులు నాగరకత యనబడును. పల్లెటూళ్ళలో నుండువారి కట్టుబొట్టులు మాటతీరులు కొంచెము మోటుగను అసంస్కృతములుగను ఉండునని లోకము తలంచును. అవి మోటుగ

1. తెలంగాణమునం దీ సాహస శ్రమకు బూనుకొన్నవారు శ్రీ ఖండవల్లి బాలేందు శేఖరముగారు. వీరి చిన్ని పొత్తము 'ఆంధ్రుల చరిత్ర' ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రచురణము, హైదరాబాదు.

మందు ననుటకన్న కల్లకపటములు చాటుమరుగులు లేనివై ప్రకృతికి మిక్కిలి దగ్గరగానుండు ననుట యుక్తము. పట్టణవాసులు తమ బాహ్య వేషమునందు ఎక్కువ సంస్కారము నేవళికము మృదు సౌందర్యము కలిగియుండుట చూతుము. మనుష్యుల వెలి జీవితము పల్లెలందును పట్టణములందును ఒకింత భిన్నముగా నున్నను లోపలి జీవితమునందు మనుష్య ప్రకృతియంతయు ఒకేతీరుగా నడచును. సహజ ప్రకృతికి కోమలత్వము అను ముసుగువేయుటయే నాగరకత యనిపించును. ఈ పదమును కొంచెము ఆక్షేపార్థములోకూడ లోకులు వాడుచున్నారు. గ్రామములలోగూడ ఈనాడు నాగరకత బలిసినది. వానికి నాగరకత ముదిరినది.ఇటువంటి వాక్యములు వినబడుచుండును.

కొందఱు విమర్శకులు సంస్కృతి-నాగరకత పదముల మధ్య సూక్ష్మభేదమును పాటించుచున్నారు. సంస్కృతి మానవుని ఆత్మ ధర్మమనియు నాగరకత దేహధర్మమనియు చెప్పుదురు. నాగరకత యనగా బాహ్య జీవితమనియు సంస్కృతి యనగా ఆంతర జీవిత మనియు వారిమతము. ఒకటి వేష భాషలందును ఆచార వ్యవహార ములందును భౌతిక జీవితమందును చూడదగినది. మరియొకటి మనో వికాసమునందును హృదయ వ్యాపారములందును ఆధ్యాత్మిక జీవిత మందును చూడతగినది. ఉదాహరణకు హైందవ నాగరకతకును పాశ్చాత్య నాగరకతకును భేదము గలదు. మనలో పురుషులు దోవ తియు స్త్రీలు చీరలును ధరింతురు. పాశ్చాత్యులలో సూటులును గౌనులును ప్రచారములో నున్నవి. మనవారు ముఖమున తిలకము పెట్టుకొందురు. వారు బొట్టు నెరుగరు. మనవారు పీటలపై కూర్చుండి విస్తరులలోనో కలవారు వెండి తళియలలోనో, భుజింతురు. వారు ఎత్తు బల్లలపై నాసీనులై పింగాణి పాత్రములందు చెంచాలతోను ముండ్లతోను ఎత్తి తిందురు. భారతీయులకును పాశ్చాత్యులకును బాహ్యాచారములందున్న భేదమిది. ఇవి యంత ప్రధానమైనవి కావు. దేశ భేదమునుబట్టియు వాతావరణ స్థితిని బట్టియు ఆయా ప్రజలు ఆయా వేషములను ఆచారములను పాటింతురు. భారతీయులకును

పాశ్చాత్యులకును విస్తారమైన భేదము వారి మానసిక రీతులందును ఆధ్యాత్మ ప్రవృత్తులందును చూడవలెను. భారతీయులు ఎక్కువగా హృదయవాదులు, పాశ్చాత్యులు బుద్ధిపరులు. మనవారు కర్మబద్ధులు. దైవబలమునే బలముగా నెంచువారు. పాశ్చాత్యులు కర్మసిద్ధాంతము నొప్పుకొనరు. పునర్జన్మను వా రంగీకరింపరు. వారు పురుషకారమునకే ప్రాధాన్యము నొసగుదురు. ఇట్లే భారతీయకవిత్వము, కళలు, సమస్త మానసిక వ్యాపారములు, పాశ్చాత్యుల ధోరణికన్న భిన్న మార్గమున నడువవచ్చును. ఇట్లు బాహ్య జీవితమును నాగరకత యనియు ఆంతర జీవితమును సంస్కృతి యనియు వ్యవహరింపవలెనని కొందర రభిప్రాయ పడుచున్నారు.

విషయవివేచనము సులభమగుటకై యీ శబ్దములనడుమ భేదము పాటించినను పాటించవచ్చును. కాని లోకులు ఇంతగా తల వెంట్రుక చీల్చినట్లు వ్యవహరించుట యరుదు. నాగరకత సంస్కృతి పదములు వారు యథేచ్ఛగా వాడుచున్నారు. శాస్త్రజ్ఞులైనను ఈ విభేదమును అసిధారగా నిర్వహించుటలేదు. కావున ప్రస్తుత గ్రంథమందు ఈ రెండు మాటలును వానివాని యర్థములందు వాడబడు చున్నవి.

చరిత్ర వ్రాయవలెనను ఉద్దేశము ఈనాడు క్రొత్తగా పుట్టినది కాదు. భారతదేశములోగూడ అనాదినుండియు చరిత్ర ప్రాముఖ్యము గుర్తింపబడియేయున్నది. మన పురాణములకు ఐదంగములుండును. సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరములు, వంశానుచరితము అను నైదింటిలో వంశము వంశానుచరితములను లక్షణ ద్వయము చరిత్ర బీజముకాకున్న మరేమి? ఇట్లు చరిత్రయుండగా సంస్కృతి చరిత్రయను నీ క్రొత్త కల్పనయేమి? ఇది విశ్వామిత్ర సృష్టికాదా యని కొందరడుగుదురు. దీనికి సమాధానము సంస్కృతి చరిత్ర అభూత కల్పనముకాదు. చరిత్రరచనా లక్ష్యముల విపులీకరణమే సంస్కృతి చరిత్రకు బీజము. చరిత్ర వెన్నెముక యైనచో సంస్కృతి చరిత్ర నిండు దేహము. చరిత్ర, చెట్టుబోదెయైనచో

సంస్కృతి చరిత్ర దాని శాఖోపశాఖలు, పచ్చని యాకులు, పుష్ప ములు, ఫలములు నగును. ఇంకను సూక్ష్మముగ చెప్పవలెనన్నచో చరిత్ర రాజనాయకము. సంస్కృతి చరిత్ర ప్రజానాయకము. చరిత్ర గ్రంథములలో రాజులు రాణులు, నాయకులు నాయకురాండ్రుగా నుండుచు వచ్చిరి. వారి జీవితము, వారి సూక్తులు, యుక్తులు, యుద్ధ ములు, సంధులు, రాజతంత్రము, సుపరిపాలనము - ప్రజాపీడనము ఇవన్నియు ప్రభువులను కేంద్రముగ నుంచుకొని బయలుదేరిన వ్యాస రేఖలు. సంస్కృతి చరిత్రయందు ప్రజలు నాయకులగుదురు. ఈ రెండవ వృత్తమునకు ప్రజాజీవితమే కేంద్రము. ప్రజల సుఖదుఃఖ ములు కష్టనిష్ఠురములు వారి నిత్యజీవితము, శాశ్వతజీవితము, ఐక మత్యము, అంతర్వైరములు, పునోభివృద్ధి, తిరోగమనము, లేదా ఉన్నస్థితిలోనే యుండిపోవుట ఈ మొదలైన లెక్కకు మీరిన సమ స్యలు సంస్కృతి చరిత్రలో వ్యాసరేఖలు కాగలవు.

అయినచో వీనిలో చరిత్రోద్దేశము నేది చక్కగా పూరింప గలదు అను ప్రశ్న యుదయించును. అసలు చరిత్ర రచనకును చరిత్ర పఠనమునకును లక్ష్యమేమి అని విచారింతము. ప్రతిమానవునకును తన పూర్వులెట్టివారో వారెట్టి ఘనకార్యములుగావించిరో తెలిసి కొనుటకు కుతూహలముండుట సహజము. మానవుని యభివృద్ధి చాల వరకును పరంపరగావచ్చిన అనుభవములమీదను జ్ఞానముమీదను ఆధారపడియున్నది. అనాదినుండియు, తండ్రినుండి కొడుకులకు వార సత్వముగా వచ్చుచున్న ఈ విజ్ఞానమును కాపాడుకొనుటకు ఆతనికి రెండు సాధనములను భగవంతుడిచ్చియున్నాడు. ఒకటి మనస్సు, రెండవది భాష. మనస్సుచే ఆలోచించి వివేచనచేసి జరిగిపోయిన అంశములను జ్ఞప్తియందుంచుకొని మానవుడు ముందుకు నడచును. తాను తెలిసికొన్న విషయములను తన సంతతికి తెలియజెప్పి వారిని వివేకవంతులనుచేయును. జంతువులకును పశువులకును ఈ రెండు సాధనములును - మనస్సు, భాష - లేకుండుటచే అవి తాము సంపా దించిన యనుభవజ్ఞానమును తమ సంతతికి అందజేయజాలవు. కావున

సృష్ట్యారంభమున ఇవి ఎట్లుండెనో నేడును ఇంచుమించు అట్లే యున్నవి. మానవుడట్లుకాక యుగయుగములనుండియు క్రమాభివృద్ధి నొందుచునే యున్నాడు. పరంపరాగత విజ్ఞానమే మానవ సంస్కృతికి మొదటిమెట్టు అని తెలిసికొనిననాడు చరిత్ర ప్రాముఖ్యము తెల్ల మగుచున్నది.

మరియు మానవుడు తన జీవయాత్రయందు రెండు ప్రబల శక్తులతో పోరాడవలసినవాడగుచున్నాడు. ఇందొకటి ప్రకృతి, రెండ వది మానవ సంఘము. ' ఇతర జంతువులవలెనే మానవుడుకూడ ప్రకృతిలో నొక భాగమేయైనను ఆతడు కొంత స్వతంత్రించి ప్రకృ తితో పోరాడి దానిని తనకు అనుకూలముగ మార్చుకొనుచున్నాడు. తిర్యక్కులు (పశుపక్ష్యాదులు) ప్రకృతికి లొంగియుండి జీవించును. దుర్భరమైన శీతలయుగమో లేక సహింపరాని వేడిమియో దాపు రించినదనుకొనుడు. మానవుడు సకాలములో ఈ ప్రమాదములను గుర్తించి స్థలాంతరమునకు పోవుటయో లేక ఉన్నచోటనే చలి యెండలనుండి తన్ను కాపాడుకొనుటకు కావలసిన విధానమును అవలంబించుటయో చేయును. జంతువులు మొద్దులైనవి అట్లు చేయ లేక మృతినొందుచుండును. ఆహార సంపాదనమునకుకూడ మానవుడు ప్రకృతితో పోరాడుచుండును. ప్రకృతి యనుకూలముగ నున్నచో దానికి దోహదముచేసి విశేషఫలమును సాధించుకొనును. ఇట్లు మాన వుడు తన జీవికకై ప్రకృతితో చేయు సంగ్రామమంతయు శాస్త్ర విషయము. దీని వివరము లచ్చుటనే తెలిసికొనవలయును. అయినను ఈ రంగమునం దాతడు సాధించిన విజయముల స్థూల చరిత్రముకూడ సంస్కృతి చరిత్రములో భాగమే యగుచున్నది. మానవుడు సాగించు రెండవరకము సంగ్రామము, మానవసంఘముతోనని చెప్పియుంటిమి. మానవుడు తనకుతాను శత్రువగుట వింత కాదాయనుపించును. వింత లలో వింతయైనను ఇది సత్యమే. జంతువులు తమలోతాము కల హించుకొనవే. వివేకవంతుడైన మానవుడెందుకు తోడిమానవునితో కలహించుచున్నాడు అను ప్రశ్న జనించును. దీని కెన్నియో కారణ

సృష్ట్యారంభమున ఇవి ఎట్లుండెనో నేడును ఇంచుమించు అట్లే యున్నవి. మానవుడట్లుకాక యుగయుగములనుండియు క్రమాభివృద్ధి నొందుచునే యున్నాడు. పరంపరాగత విజ్ఞానమే మానవ సంస్కృతికి మొదటిమెట్టు అని తెలిసికొనిననాడు చరిత్ర ప్రాముఖ్యము తెల్ల మగుచున్నది.

మరియు మానవుడు తన జీవయాత్రయందు రెండు ప్రబల శక్తులతో పోరాడవలసినవాడగుచున్నాడు. ఇందొకటి ప్రకృతి, రెండవది మానవ సంఘము. ' ఇతర జంతువులవలెనే మానవుడుకూడ ప్రకృతిలో నొక భాగమేయైనను ఆతడు కొంత స్వాతంత్రించి ప్రకృతితో పోరాడి దానిని తనకు అనుకూలముగ మార్చుకొనుచున్నాడు. తిర్యక్కులు (పశుపక్ష్యాదులు) ప్రకృతికి లొంగియుండి జీవించును. దుర్భరమైన శీతలయుగమో లేక సహింపరాని వేడిమియో దాపురించినదనుకొనుడు. మానవుడు సకాలములో ఈ ప్రమాదములను గుర్తించి స్థలాంతరమునకు పోవుటయో లేక ఉన్నచోటనే చలి యెండలనుండి తన్ను కాపాడుకొనుటకు కావలసిన విధానమును అవలంబించుటయో చేయును. జంతువులు మొదలైనవి అట్లు చేయలేక మృతినొందుచుండును. ఆహార సంపాదనమునకుకూడ మానవుడు ప్రకృతితో పోరాడుచుండును. ప్రకృతి యనుకూలముగ నున్నచో దానికి దోహదముచేసి విశేషఫలమును సాధించుకొనును. ఇట్లు మానవుడు తన జీవికకై ప్రకృతితో చేయు సంగ్రామమంతయు శాస్త్ర విషయము. దీని వివరము లచ్చటనే తెలిసికొనవలయును. అయినను ఈ రంగమునం దాతడు సాధించిన విజయముల స్థూల చరిత్రముకూడ సంస్కృతి చరిత్రములో భాగమే యగుచున్నది. మానవుడు సాగించు రెండవరకము సంగ్రామము, మానవసంఘముతోనని చెప్పియుంటిమి. మానవుడు తనకుతాను శత్రువగుట వింతగా దోచునుపించును. వింతలలో వింతయైనను ఇది సత్యమే. జంతువులు తమలోతాము కలహించుకొనవే. వివేకవంతుడైన మానవుడేందుకు తోడిమానవునితో కలహించుచున్నాడు అను ప్రశ్న జనించును. దీని కెన్నియో కారణ

లకు తరలిపోయి వలస లేర్పరచుకొనిరా? ఇట్లు వలసపోవుటకు వారిని ప్రేరేపించిన పరిస్థితులెవ్వి? విదేశములను జయించు అభిలాషయా? జనసంఖ్య పెరుగుటచే స్వదేశమునందు ఆర్థికావకాశములు చాలినన్ని లేకపోవుటచేతనా? అధికధనసంపాదనార్థము, బ్రతుకుదెరువు నిమిత్తము అన్యప్రాంతములకు పోయిరా? కరవులు కాటకములు మున్నగు దేశోపద్రవములవలననా? వాణిజ్య వ్యాపారములందలి మోజుచేతనా? సాహసిక జీవితమును జీవించుటలోని ఇచ్ఛచేతనా? స్వదేశమునందు ఏర్పడిన మతవిషయక నిర్బంధములు, హింసావిధానమునకు నిలువలేక స్థలాంతరములకు వలసపోవుట జరిగినదా? ఇత్యాది ప్రశ్నములకు సమాధానము లరయవలెను.

(ఇ) ఇట్లు విస్తరించిన జాతిజనులు నివసించు దేశవర్ణనము.

ప్రాచీనకాలమునుండి నేటివరకును ఆంధ్రులు వసించిన భూభాగము నాంధ్రదేశమనియు ఆంధ్రులు కారణాంతరములచే వలసపోయి నివసించుచున్న ప్రాంతములను ఆంధ్రవలస ప్రాంతములనియు వ్యవహరించుచున్నారు. సాధారణముగ ఒకజాతి యొక్క ప్రత్యేక ప్రభుత్వముక్రిందనుండి పరిపాలింపబడుట సహజము. చారిత్రక కారణములచే ఒక్కొక్కజాతికి ఇట్టి ఏకప్రభుత్వ సౌకర్యము లేకుండుటయు ఆ జాతి భిన్న ప్రభుత్వములకులోనయి భిన్నదృక్పథములతో పరిపాలింపబడుటయు జరుగుచుండును. అనేక ప్రభుత్వములకు లోబడియుండుట ఆజాతి జీవిత వికాసమునకును ఐక్య సంస్కృతికిని గొప్ప విఘాతమని ఇప్పు డందరును గుర్తించుచున్నారు.

భారత స్వాతంత్ర్యావతరణమునకు ముందు ఆంధ్రజాతి వేర్వేరు ప్రభుత్వములక్రింద నలిగి ఏటికిని కోటికిని లాగబడినది. అయినను ఆంధ్రులు స్వధర్మనిరతులయి తమ యైక్యసంస్కృతికి తీరని నష్టము వాటిల్లకుండ నిలుపుకొనుచువచ్చిరి. హైదరాబాదు సంస్థానముపై భారతజాతీయ ప్రభుత్వమువారు జరిపిన పోలీసుచర్య తరువాత తెలంగాణముపై శతాబ్దములుగా బిగిసిన ఇనుపగుప్పిడి పటాపంచలైనది. దీనితో ఆంధ్రసంస్కృతియొక్క జడపాయలను ముడుచుటకు

తను విజ్ఞానమును రాజకీయప్రాధాన్యమును సంపాదించు నుద్దేశ ముతో ఆంధ్రచరిత్రను చదువుట సక్రమ పద్ధతి. ఆంధ్రజాతి పూర్వ యుగములలో పరాజయపరాభవములకు గురియైనచో అట్టి సన్నివేశ ములకు కారణముల నరసికొని ఆయా లోపములు తిరిగి తలయెత్త కుండ జాగ్రత్తపడుటయు ఆంధ్రచరిత్ర పఠనముయొక్క లక్ష్యము కాదగును. కొన్నికొన్ని సందర్భములలో ఒక ప్రాచీనజాతి కారణాం తరములవలన హీనస్థితికిలోనై కీర్తి ప్రఖ్యాతులు లేకుండ పడియున్న ప్పుడు అట్టి జాతియం దాత్మవిశ్వాసము కార్యదీక్ష అభ్యుదయకాంక్ష పెంపొందించుటకు ఆ జాతి చరిత్రను పఠించుట సంజీవనివంటిది కాగలదు. ఈ యుద్దేశముతో ఆంధ్రులు సత్యమైన ఆంధ్రచరిత్ర రచించుటకును పఠించుటకును, దీక్షితులు కావలెను.



# ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి



2-వ ప్రకరణము

## (జాతివ్యాప్తి - జాతిసూత్రము)

జాతి జీవితచరిత్రను అన్వేషించునపుడు ఈ క్రింది యంశము లను దృష్టిలో నుంచుకొనవలసియుండును.

(అ) జాతిపేరు. ఆ పేరు సహజమా కాల్పనికమా? అది తనకు తాను ఇచ్చుకొన్నదా ఇతరు లాజాతికి పెట్టినపేరా? అట్టి నామ ధేయమువలన లభింపదగిన చరిత్రాంశములు. ఆ జాతివారు మాట్లాడు భాష.

(ఆ) ఈ జాతి ప్రస్తుతము నివసించు దేశభాగము. జాతిప్రజలు అనాదినుండియు నిక్కడవసించిరా ? అన్యదేశములనుండి వలసవచ్చి ఇచ్చట స్థిరపడినవారా ? స్వదేశమునుండి ఈ జాతిజనులు పరభూము

గల బలవత్తర అవరోధము తొలగిపోయినది. ఆంధ్రు లింకను భిన్న ప్రాంత ప్రభుత్వముల క్రిందనున్నవారనుట నిజము. కాని ఈ ప్రభుత్వములన్నియు ప్రజాధీన ప్రభుత్వములగుటచే ఆంధ్రుల నైక్యతను విరోధించి నిరోధించునవికావు. భిన్నమండలవాసులైన ఆంధ్రులందరును ఏకగ్రీవముగా కోరినచో సమగ్రాంధ్రరాష్ట్ర మేర్పడుటయు విశాలాంధ్ర ప్రభుత్వము ఆంధ్రుల భాగ్యమునకు విధాతయగుటయు జరుగు శుభసమయము సమీపముననే యుండగలదు. అప్పుడుకాని యాంధ్రసంస్కృతికి సంపూర్ణదోహదము జరుగదనుట సత్యేతరము కాకపోవచ్చును.

ఒక జాతిని మరియొక జాతినుండి వేరుగా నిరూపించుటకుగల చిహ్నములేవి ? (1) ఆ జాతి మాట్లాడుభాష (2) వారి ఆచార వ్యవహారములు, వేషము, ఆ జాతి ప్రత్యేకాభిరుచులు, ఆ యభిరుచులను సాధించుకొనుటకు వారవలంబించు విధానములు (3) ఆ జాతిమత విశ్వాసములు కొంతవఱకును. మతమును పురస్కరించుకొని జాతిత్వ నిర్ణయముచేయుట ప్రమాద భూయిష్ఠము. ఈ యపసిద్ధాంతమే అఖండ భారత దేశ విభజనమునకును పాకిస్థానము ఏర్పడుటకును కారణభూతమైనదనుట మరువరాదు. (4) జాతి నివాసదేశము. ఒక్కొక్క దేశమునందే విభిన్నసంస్కృతులుండవచ్చును. భారత దేశము పెక్కు సంస్కృతుల కూడలి. పూసలలో దారమువలె ప్రాంతీయ సంస్కృతు లన్నిటియందును వ్యాపించి వానిని ఏక సూత్ర బద్ధము చేయు అఖండ భారత సంస్కృతి యొకటి యుగయుగముల నుండియు గలదు. ఇదియే భారత జాతీయతకు ఆయువుపట్టువు.

నిజమైన సంస్కృతి మానవాభ్యుదయమునకును కళ్యాణమునకును దారితీయవలెను. మానవ సంఘైక్యతకు తోడ్పడునదియే సంస్కృతి. మానవులను విడదీసి జాతిద్వేషములకును యుద్ధములకును రక్తపాతమునకును హేతుభూతమగునది సంస్కృతి కాదు. దానిని యహంకృతి యనవలెను. ఇది సర్వథా విసర్జింపదగినది. సహావమే సంస్కృతియొక్క ప్రథమచిహ్నమని సర్. యస్. రాధాకృష్ణ

పండితుడు నుడివియున్నాడు. కావున భిన్న సంస్కృతులకు నిలయమైన భారతదేశప్రజ ఏకజాతి యగుచున్నది. వర్తమాన ప్రపంచమున ఆయాజాతులవారు తమ సంఘబలమును యుద్ధబలమును పెంపొందించుటకై నిరంతర ప్రయత్నముల జేయుచున్నారు. సంఖ్యాబాహుళ్యముకొఱకై ప్రపంచములో ఇంగ్లీషు భాషను మాతృభాషగాగల వారందరును ఏకజాతిగా నిలువవలెనని ఇచ్ఛగించుచున్నారు. భావిప్రపంచములో మతసూత్రముకన్నను ప్రాదేశిక సూత్రముకన్నను భాషాసూత్రమే జాతుల యైక్యతకు తోడ్పడవచ్చును.

ప్రస్తుత కాలమున ప్రయాణసౌకర్యము లపారముగ వృద్ధిబొందినవి, జాతులనడుమ రాకపోకలు, ఇచ్చి పుచ్చుకొనుటలు, భావ వాణిజ్యము మెండైనవి. పూర్వకాలమునందువలె ఒకజాతి జనులు ఒక ప్రత్యేక ప్రాంతమందే నివసించుటయు నేడు జరుగుట లేదు. ఒకజాతి జీవితము మరియొక జాతి జీవితముతో పెనవేసికొనిపోవుచున్నది. సంస్కృతుల నడుమ సీమారేఖలు మాసిపోవుచున్నవి. అట్లయ్యును ఒకజాతి మాట్లాడుభాష ఇప్పటికిని ఆ జాతి ప్రత్యేక చిహ్నముగ పరిగణింపబడుచున్నది. ఆంధ్రము మాతృభాషగాగలవారు వారే ప్రాంతమందు నివసించుచున్నను ఆంధ్ర జాతీయులుగ పరిగణింపబడుచున్నారు.

---

# ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి

3-వ ప్రకరణము

## (సంస్కృతి - దాని విభాగములు)

ఒక జాతి ప్రజానీకముయొక్క సంపూర్ణ జీవిత చరిత్రయే సంస్కృతి చరిత్రయని ఇదివరలో తెలిసికొన్నాము. జాతి జీవితము జీవనది వంటిది. ఉదాహరణకు దానిని గోదావరి నదితో పోల్చికొందము. పడమటి కనుమలలో నాసికాత్ర్యంబకమువద్ద జన్మించి

నప్పుడు గోదావరి మిక్కిలి చిన్నదై పిల్లకాలువను మించియుండదు. ఆంధ్రజాతి జన్మవృత్తాంతముకూడ ఇట్లే దృశ్యాదృశ్యముగ నుండుట సహజము. కృశాంగియైన ఈ గోదావరియే కనుమలుదాటి దేశములు గడచి వచ్చుచు ప్రాణహిత ఇంద్రావతి మంజీర మొదలగు ఉపనదుల జలములను కానుకలుగా గొనుచు భద్రాచలము శ్రీరామ పాదుకల కడ సువిస్తీర్ణమైన నది యగుట గాంతుము. ఈ నదీమతల్లి ఇంకను ముందుకు బోయి తూర్పు చాళుక్యుల పట్టణమైన రాజమహేంద్ర వరముకడ రమారమి ఏడుమైళ్ళు వ్యాపించిన జలార్ణవమయి ఏడుపాయలుగా చీలునంత యగుచున్నది. ఇట్లే ఆంధ్ర జాతియు అనేక ఇతర జాతుల జనులను తనలో కలుపుకొనుచు శాతవాహనుల నాడింతయై, కాకతీయుల నాడంతయై, విజయనగర సామ్రాజ్య కాలమున మరింతయై యుగ యుగ ప్రవర్ధమానమగుచు వర్తమాన స్థితికి వచ్చినది.

జాతి జీవితము ప్రవహించు కాలువలు అసంఖ్యాకములు. మున్ముందు దీనిని రెండు పెద్దపాయలుగా విభజింపదగును. జాతి (అ) నిత్యజీవితము. (ఆ) శాశ్వత జీవితము. జనుల నిత్యజీవితము నందుకూడ మరి రెండు శాఖలు గుర్తింపనగును. (క) వ్యక్తి జీవితము. (గ) సమష్టి జీవితము లేక సంఘ జీవితము.

అ-(క) నిత్యజీవితము – వ్యక్తిగతము. నిత్య జీవితమునకు రంగము గృహము. దీనిక్రింద పఠింపదగిన వివరములు. (1) ఆంధ్రుల గృహములు, గృహనిర్మాణ రీతులు, గృహోపకరణములు, సౌకర్య ములు. (2) ఆహారము, రుచులు, ఆంధ్రుల ప్రత్యేకమైన వంటక ములు. (3) తెలుగువారి వేషము (వివిధ వర్ణములవారిలోను వివిధ ప్రాంతములలోను) దేహాలంకారములు, స్త్రీల నేపథ్యము. (4) కుటుంబ జీవితము. సమష్టి కుటుంబ పద్ధతి, వ్యష్టి కుటుంబ పద్ధతి. (5) ఆస్తి, అది సంక్రమించు పద్ధతులు వారసత్వపు హక్కు – కొడుకులకా కూతు ళ్ళకా, స్త్రీధనము, పితృ యజమానసంఘమా (Patriarchal-Society) మాతృ యజమాన సంఘమా (Matriarchal-Society) (6) వివాహము

అందలి వివిధ సంప్రదాయములు, మేనరికము, వివాహములో ఆర్యుల నుండి వచ్చిన యాచారములు, దేశీయములైన వేడుకలు నియమములు, బహు భార్యాత్వము, ఏక భర్తృకత్వము, మారుమనువు, విడాకులు, వరశుల్కము, కన్యాశుల్కము, బాల్యవివాహము, రజస్వలానంతర వివాహము (7) పండుగలు పర్వములు. పురుషులకు సంబంధించినవి, స్త్రీలకు ప్రత్యేకమైనవి. స్త్రీల వ్రతములు నోములు. (8) పురుషులు, పౌరుషోద్దీపకములు, శౌర్య సాహసములు, దేహపరిశ్రమలు ఆటలు. (9) స్త్రీ జీవితము, సౌకుమార్యము, అందచందములు, గృహిణి కవసరమైన శిక్షణము, బాలికల ముచ్చటలు ఆటలు పాటలు (10) గృహపరిశ్రమలు (11) అంత్య సంస్కారములు దహన ఖనన పద్ధతులు.

అ - (X) సమష్టి లేక సంఘజీవితము (1) ప్రాచీనాంధ్రులు సంచారశీలురుగానుండిరా లేక స్థిరనివాసములు కలవారై యుండిరా, (2) సంఘజీవితమునకు రంగము గ్రామము. గ్రామ నిర్మాణ పద్ధతులు, గ్రామము లెచ్చట నిర్మించుచుండిరి. గ్రామములో తప్పక ఉండదగినవారు "అప్పిచ్చువాడు వైద్యుడు । నెప్పుడు నెడతెగక పారు నేరును ద్విజుడుర్ । జొప్పడిన యూరనుండుము । చొప్పడకున్నట్టి యూరు చొరకుము సుమతీ" (సుమతిశతకము) (3) గ్రామ పరిపాలనావిధానము పంచాయతీలు (4) వర్ణవిభజనము. వర్ణాశ్రమ వ్యవస్థ ఆర్యులనుండి వచ్చుట, వివిధకులములు, కులకట్టుబాట్లు వారి వృత్తులు. (5) వ్యవసాయము - వ్యవసాయపద్ధతులు - పంటపైరులు, నీటి పారుదల సదుపాయములు-వర్షాధారమా? నదులు చెఱువులు, పశుసంపద - దుర్భిక్షములు, కరవులు, కర్షకుడు - దారిద్ర్యము, ఋణభారము. (6) వాణిజ్యము, స్వదేశ వ్యాపారము, విదేశ వాణిజ్యము, ఎగుమతి దిగుమతి సరకులు, సముద్రయానము, రేవులు నౌకాస్థానములు, ఆంధ్రదేశపు సముద్రతీరము నాటుప్రయాణము, రహదారులు, బాటలు, రైలుమార్గములు, విమానదారులు, (7) నగరములు, నగర జీవితము, నగరములు ఇటీవలికాలమున

ఎక్కువగా పెరుగుట, పెద్ద కర్మాగారములు, భారీ పరిశ్రమలు, (8) కార్మిక వర్గము, ఉద్యమములు సమస్యలు, వ్యవసాయకూలీలు, ఫాక్టరీకూలీలు, వెట్టిపని, దేశాంతర కూలి జీవనము. (Indentured labour) (9) విద్యావిధానము. గ్రామపు బడులు, పూర్వపు విద్యావిధానము, రాజుల పోషణము, అగ్రహారములు విశ్వవిద్యాలయముల వంటి విద్యాసంస్థలు, గోళకీమఠములు, దేవాలయములు - విద్యాప్రదానము, గ్రంథాలయములు, ఇప్పటి విద్యావిధానము, నిర్బంధ ప్రాథమికవిద్య. వయోజనవిద్య-నేటి విశ్వవిద్యాలయములు. యావన్మంది బడులు (Public schools) స్త్రీవిద్య, వృత్తివిద్య. (10) ప్రభుత్వము, పరిపాలనా పద్ధతులు, రాజ్యము లేర్పడుట, రాజ కుటుంబములు-రాజవంశముల చరిత్ర. (11) జమీందారీవిధానము. ఎస్టేట్లు ప్రభుత్వమునకును రైతునకును నడుమ అంతరువులు. జాగీర్దారు, దేశముఖు, దేశపాండ్య, మక్తాదారు, ఇనాందారు, అగ్రహారీకులు. (12) దేశరక్షణ, సైన్యములు, యుద్ధములు, యుద్ధతంత్రము, ఆయుధములు (13) దేశసంపద, భూమిపై పండునవి, భూగర్భమున దొరకునవి అనగా ఖనిజసంపద, అడవులు, అటవీసంపద, శక్త్యుత్పాదకములు. పెట్రోలియంవంటి నూనెలు, నేలబొగ్గు, విద్యుచ్ఛక్తి, జలపాతములు, జలవిద్యుత్తు కవకాశములు (14) ఆర్థిక వ్యవస్థ. ప్రజల భోగభాగ్యములు, ధనాదాయమార్గములు, ధననిక్షేపసౌకర్యములు, బ్యాంకులు, సహకారసంస్థలు, భీమా కంపెనీలు, ధనికులు - ధనవ్యయము; ప్రజాహితకార్యములు, ధర్మసంస్థలు. (15) ప్రజారోగ్యము వైద్యసదుపాయములు. ఆయుర్వేదము ఆంధ్రదేశములో నెట్లు వర్ధిల్లినది.

(ఆ) జాతి - శాశ్వత జీవనము.

ఏ కార్యములు వ్యవస్థల మూలమున ఒకజాతికీర్త్యపకీర్తులు పుణ్యాపాపములు మొదలగు మహత్తర ప్రయోజనములను సాధించుచున్నదో వానినిందు చేర్చదగును. (1) మతము, ధర్మము, ఆదిమనివాసులమతవిశ్వాసములు, ఉగ్రదేవతలపూజలు, బలులు, నాగులు-వారి

మతాభిప్రాయములు, హిందూ బౌద్ధ జైన మతములు, వీరశైవము, వైష్ణవము, వల్లభమతము. (2) దేవాలయములు స్తూపములు వీని కిచ్చిన దాన శాసనములు, అంగరంగ భోగములు, దేవాలయముల కనుబంధమైన సంస్థలు, పుణ్యక్షేత్రములు. (3) నైతిక ధార్మిక జీవితము, జాతిశీలము, ప్రజల మనస్తత్వము. స్వార్థపరులా? పరోపకార పారీణులా? అన్యభావములను అన్య సంస్కృతులను సహించువారా లేక ఏకాకిత్వము నాశ్రయించువారా? కార్యవాదులా ఖడ్గవాదులా, వితరణ బుద్ధిగలవారా, పిసినిగొట్టులా, పోదపరులా, సత్యప్రియులా, వంచకస్వభావులా, జాతినడవడిపై అన్యప్రాంతీయుల యొక్కయు విదేశ యాత్రికులయొక్కయు అభిప్రాయములు ప్రమాణతమములు, (4) మానసిక వికాసము. శాస్త్రములందు ఆంధ్రులకృషి, ప్రాచీన కాలపు శాస్త్రములందును నేటి కాలపు భౌతిక శాస్త్రములందును. (5) భాష తల్లక్షణములు దాని వికాస చరిత్ర, లిపిచరిత్ర వ్రాత సాధనములు. భాషాశాస్త్ర కృషి, వ్యాకరణములు, అర్థ వివేచన శాస్త్రము (నిరుక్తము) (Linguistic Paleontology) దాని వలన తెలియదగిన జాతి చరిత్ర విశేషములు.

(6) కళాజీవితము. (అ) శిల్పము, రాతి శిల్పము, దారు శిల్పము, లోహశిల్పము, మట్టి బొమ్మలు దేవతావిగ్రహములు, స్తూపదేవాలయాది నిర్మాణము, ఏకాండిశిలమలచినవి, రాతికట్టడ ములు, ఇటుకకట్టడములు గుహాశిల్పములు (ఆ) చిత్రలేఖనము గృహదేవాలయాలంకరణము, వస్త్రములమీద అద్దకము, ప్రాచీన కాలమున కుండలమీద రంగులతో చిత్రించుట. (ఇ) సంగీతము - కర్ణాటక సంగీతమునకు ఆంధ్రులు చేసిన మేలు భక్తి శృంగారరస ములు. వీణాదివాద్యములు, ఆధునిక యుగమున తెలుగువారు సంగీ తము నుపేక్షించుట, హిందుస్తానీ సంగీతపు బాణీలు. (ఈ) నాట్యము- ఆంధ్రుల కృషి కూచిపూడివారి భరతనాట్యము. (ఉ) సాహిత్యము, శిష్ట సాహిత్యము, జానపదకవితారీతులు, సాహిత్యము జాతిజీవిత ప్రతి

బింబమగుట. కవులు వారి చరిత్రము. ప్రాచీనాధునిక సాహిత్య ప్రక్రియలు. గ్రంథములు శాసనములు చాటుపద్యములు వానివలన తెలియదగు విశేషాంశములు. సాహిత్యమే మానవుని సంస్కృతి జీవనమునకు గొప్ప ఉపనిషత్తు.

సంస్కృత ప్రాకృత భాషాసాహిత్యములలో ఆంధ్రులస్థానము.

---

# ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి

* 4_వ ప్రకరణము

## (ఆంధ్ర దేశము - భౌతికవర్ణన)

ఆంధ్రులు అత్యధిక సంఖ్యాకులుగ నివసించుచు ప్రాచీన కాలమునుండియు ఆంధ్ర నివాసభూమిగ పరిగణింపబడిన ఏక భూఖండము ఆంధ్ర దేశము. కారణాంతరములవలన ఆంధ్రులు వలసపోయి జీవనమేర్పరచుకొన్న అన్యప్రాంతములను ఆంధ్ర వలసస్థానములని చెప్పవలెను. వలసపోయిన ఆంధ్రుల అభ్యుదయమును, యోగక్షేమములును కూడ ఆంధ్ర చరిత్రలో వర్ణింపదగినవైనను వారు ప్రస్తుతము నివసించు వలస ప్రదేశములు ఆంధ్ర దేశ నిర్వచనము క్రిందికి రావు. ఇట్లు ఏక భూఖండమై నిర్వివాదముగ ఆంధ్రుల కాణాచియైన దేశస్వరూపమును దాని భౌతిక సంపదను వర్ణింతుము.

వర్తమాన కాలమున ఆంధ్రుల స్థిరనివాసమైన దేశము, పొట్టి దండము కలిగిన వీణను పోలియుండును. ఈ వీణ తలకాయ పెద్దదిగా నుండును, దండము కుఱుచగా నుండును. చిలుక సరస్సునకు దక్షిణమున ఋషికుల్యానది వెంబడి యొక రేఖ బయలుదేరిన దనుకొనుడు.

---

* ఈ ప్రకరణమును దీని తరువాతి ప్రకరణమును వ్రాయుటలో శ్రీ మాగంటి బాపినీడుగారి సంపాదకత్వమున ప్రకటింపఁబడిన "ఆంధ్ర సర్వస్వము" మిక్కిలి తోడ్పడినది.

దానిని పశ్చిమమునకు జయపూరు సంస్థానము (ఒరిస్సాలోనిది) నడిమినుండి, బస్తరురాజ్యములో ఇంద్రావతినది దక్షిణ తీరము వెంబడి, మధ్య పరగణాలలోని చాందాజిల్లా దక్షిణ భాగమును కలుపుకొని, హైదరాబాదు సంస్థానములోని ఆదిలాబాదుజిల్లా పడమటి ఎల్లవరకును పొడిగించదగును. ఈ ప్రాంతమున గోదావరి కుపనది యగు పెనుగంగ ఆంధ్రదేశపుటుత్తర సరిహద్దు కాగలదు. పెనుగంగ వెన్నుదన్ని బయలుదేరిన రేఖ, దక్షిణాభిముఖముగ జని, హైదరాబాదు రాజ్యములోని నిజామాబాదు మెదకు మహబూబునగరు జిల్లాల పడమటి హద్దునంటి, బీదరును స్పృశించి, రాయచూరు జిల్లా వెనుబద్ద వెంబడి నడచి తుంగభద్రను దాటి కర్నూలును చుట్టి బళ్ళారి జిల్లాలోని ఆదోని ఆలూరు రాయదుర్గము తాలూకాలను కలుపుకొని అనంతపురము జిల్లాను లోగొని మైసూరురాజ్యమునందలి (చిత్రదుర్గము) కోలారు (బెంగుళూరు) జిల్లాలను దనలో జేర్చుకొనుచున్నది. అక్కడనుండి ఉత్తర ఆర్కాడు చెంగల్పట్టు జిల్లాల మధ్య భాగమున సాగి తిరిగి బంగాళాఖాతమును చేరుచున్నది. ఉత్తరమున గోపాలపురమునుండి దక్షిణమున మద్రాసువరకు, రత్నాకరమే ఆంధ్రదేశమునకు తూర్పుపాలిమేర.

ఈ క్రిందిజిల్లాలును ప్రాంతములును ఆంధ్రదేశములో చేరదగినవి. [1](అ) భారత సమాఖ్యలోని శ్రీకాకుళము విశాఖపట్టణము తూర్పుగోదావరి పశ్చిమగోదావరి కృష్ణ గుంటూరు నెల్లూరు చిత్తూరు కడప కర్నూలు అనంతపురము బళ్ళారి జిల్లాలోని ఆదోని ఆలూరు రాయదుర్గము తాలూకాలును, ఉత్తరఆర్కాడు చెంగల్పట్టు జిల్లాలో కొంత భాగమున్ను (ఆ) హైదరాబాదు రాజ్యమందలి తెలంగాణ ప్రాంతము అనగా వరంగలు, నల్లగొండ, మహబూబునగరు, కరీంనగరము, ఆదిలాబాదు, మెదకు, నిజామాబాదు, హైదరాబాదు జిల్లాలును, రాయచూరుజిల్లాలో అలంపూరు గద్వాలు ప్రాంతములును, గుల్బర్గాజిల్లాలో తాండూరు వరకున్ను, (ఇ)

1. శ్రీ యన్. సి. కేల్కారుగారి పరిష్కారము ప్రకారము.

మైసూరురాష్ట్రములో (బెంగుళూరు) కోలారుజిల్లాలు (చిత్ర దుర్గమున్ను) (ఈ) 1 నూతన ఉత్కళరాష్ట్రములో చేర్చబడిన బరంపురం, ఛత్రపురం, ఆస్కా, పర్లాకిమిడి తాలూకాలో ఆంధ్రులు విరివిగానున్న ప్రాంతములున్ను, (ఉ) మధ్యపరగణాలలో ఆంధ్రుల సంఖ్య విస్తారముగాగల చాందాజిల్లా దక్షిణభాగమున్ను, బస్తరు జయపురసంస్థానములలోని భాగములును, ఇవి ఆంధ్రదేశపు భాగములు. మద్రాసు మహానగరములోని కువ్వమ్ నదికి ఉత్తర భాగము ఆంధ్ర రాష్ట్రాంతర్గము కాదగిన ప్రదేశము.

ఆంధ్రదేశమునకు వెలుపల, సమీపప్రదేశములందును, దూర భూములందునుకూడ ఆంధ్రులు చిరకాలముగ స్థిరనివాసము చేయు చున్నారు. (1) వీరిలో అత్యధికసంఖ్యాకులు తమిళనాడు జిల్లాలలో వసించుచున్నారు. విజయనగర సామ్రాజ్యకాలమున ఆంధ్రనాయక రాజులు తంజావూరు, మధుర, జింజి మున్నగు ప్రాంతముల నేలిరి. ఈ నాయకరాజులతోపాటు వారి సిబ్బందియు, ఆశ్రితులును పెక్కు ఆంధ్ర కుటుంబములును, దక్షిణాదిని, స్థావర మేర్పరచుకొనిరి. (2) వీరి తరువాత బొంబాయి ప్రాంతవాసులైన యాంధ్రులు పేర్కొన దగినవారు. వీ రక్కడ ఇటీవల చేరినవారు కారు. మహారాష్ట్ర సామ్రాజ్య పతనానంతరము తెలుగువారు ఆంగ్ల సేనలలో సైనికులుగ చేరి పూనా మున్నగు ప్రాంతములలో స్థిరపడిపోయిరి. (3) భారీ పరి శ్రమలలోను, యంత్రాలయములలోను, కూలి నాలి చేసి జీవించు టకై పలువురు తెలుగువారు స్వదేశమును వీడి తరలిరి. (4) దేశాంత రములలోకూడ వర్తకము నిమిత్తమును కార్మిక జీవితము నాశ్ర యించియు పలువు రాంధ్రులు నివసించుచున్నారు. ఇట్టివారు బర్మా లోను దక్షిణాఫ్రికాలోను గలరు.

---

1. ఆస్కాలో నూటికి 30 మందియు, పర్లాకిమిడిలో నూటికి 60 మందియు, ఆంధ్రుల జనసంఖ్య గలదు. బరంపురం, ఛత్రపురం, పర్లాకిమిడి తాలూకాలలో ఆంధ్రులు విస్తారముగా నుండుటచే వీటిని ఉత్కళరాష్ట్రములో చేర్చరాదని ఆ రాష్ట్ర నిర్మాణ సంధర్భమున సర్. కె. వి. రెడ్డినాయుడుగారు వాదించిరి.

ఆంధ్రుల జనసంఖ్య, వివిధప్రాంతములందు

1. భారత సమాఖ్యలోని తెలుగు జిల్లాలు
   (1951 జనాభా ప్రకారము) 20883204

2. తెలంగాణా జిల్లాలు (1951 జనాభా) 10489764

3. మైసూరు రాష్ట్రములో ఆంధ్రులు
   (1931 జనాభా ప్రకారము) 11 లక్షలకు పైబడి

4. నూతన ఒరిస్సా రాష్ట్రములోని బరంపురం, ఛత్రపురం, ఆస్కా, పర్లాకిమిడి తాలూకాలు. (సంఖ్యలు తెలియరాలేదు)

5. మధ్య పరగణాలు, చాందా, బస్తరు, జయపూరు, (1931 జనాభా) 130343

6. రాష్ట్రేతరాంధ్రులు.
   (అ) తమిళనాడు జిల్లాలు, పుదుక్కోట.
   (1931 జనాభా) 35 లక్షల వరకు
   (ఆ) బొంబాయి ప్రాంతము.
   (1931 జనాభా) 163000
   (ఇ) బీహారులోని జంషెడ్‌పూరు.
   టాటానగరం కర్మాగారములలో పనిచేయు తెలుగువారు.
   (1931 జనాభా) 15000

7. దేశాంతరములందలి ఆంధ్రులు.
   (యుద్ధమునకు పూర్వపు సంఖ్యలనుబట్టి)
   (అ) బర్మా. 160640
   (ఆ) ఫీజీద్వీపము. 8000
   (ఇ) దక్షిణ ఆఫ్రికా. 219928
   (ఈ) మారిషస్. 10000

## ఆంధ్రుల జనసంఖ్య, వివిధప్రాంతములందు

1. భారత సమాఖ్యలోని తెలుగు జిల్లాలు
   (1951 జనాభా ప్రకారము) — 20883204

2. తెలంగాణా జిల్లాలు (1951 జనాభా) — 10489764

3. మైసూరు రాష్ట్రములో ఆంధ్రులు
   (1931 జనాభా ప్రకారము) — 11 లక్షలకు పైబడి

4. నూతన ఒరిస్సా రాష్ట్రములోని బరంపురం,
   ఛత్రపురం, ఆస్కా, పర్లాకిమిడి
   తాలూకాలు. — (సంఖ్యలు తెలియరాలేదు)

5. మధ్య పరగణాలు, చాందా, బస్తరు,
   జయపూరు, (1931 జనాభా) — 130343

6. రాష్ట్రేతరాంధ్రులు.
   (అ) తమిళనాడు జిల్లాలు, పుదుకోట.
   (1931 జనాభా) — 35 లక్షల వరకు
   (ఆ) బొంబాయి ప్రాంతము.
   (1931 జనాభా) — 163000
   (ఇ) బీహారులోని జంషెడ్‌పూరు.
   తాతానగరం కర్మాగారములలో
   పనిచేయు తెలుగువారు.
   (1931 జనాభా) — 15000

7. దేశాంతరములందలి ఆంధ్రులు.
   (యుద్ధమునకు పూర్వపు సంఖ్యలనుబట్టి)
   (అ) బర్మా. — 160640
   (ఆ) ఫీజీద్వీపము. — 8000
   (ఇ) దక్షిణ ఆఫ్రికా. — 219928
   (ఈ) మారిషస్. — 10000

ఆంధ్రదేశము—ఎల్లలు:—ఆంధ్రదేశమునకు ఉత్తరమున ఒరిస్సా రాష్ట్రము మధ్య పరగణాలును, పశ్చిమమున మహారాష్ట్ర కర్ణాట దేశములును; నైరృతిని మైసూరు సంస్థానమును; దక్షిణమున తమిళనాడును; తూర్పున బంగాళాఖాతమును ఎల్లలుగా నున్నవి.

కొండలు:—ఆంధ్రదేశపు తూర్పుతీరమునకు సమీపమున తూర్పుకనుమలు అను పేరుగల పర్వతపంక్తి ఉత్తరమునుండి దక్షిణమునకు వ్యాపించి యున్నది. ఇవి పడమటి కనుమలంత ఎత్తైనవి కావు. ఈ దేశపు పశ్చిమభాగము ఎత్తుగనుండి తూర్పునకు బోయిన కొలదిని ఏటవాలుగ నుండును. తూర్పు కనుమలకును, సముద్రమునకును నడుమ మిక్కిలి సారవంతమైన భూములు కలవు. పురాణ ప్రసిద్ధమైన మహేంద్రపర్వతము ఈ దేశమున కుత్తరమున గలదు. తూర్పు కనుమలకే ఆయా జిల్లాలలో వేరువేరు పేళ్లు ఒసగబడినవి. మలయకొండలు, పాలకొండలు, గోలకొండలు, పాపికొండలు, వెలికొండలు, తూర్పు కనుమలకే పేళ్లు. ఇవిగాక నగరికొండలు, శేషాచలపుకొండలు, ఎఱ్ఱమల నల్లమల కొండలు గలవు. విశాఖపట్టణము జిల్లాలో సింహాచలపు కొండయు, తూర్పు గోదావరి జిల్లాలో అన్నవరపు సత్యనారాయణ దేవుని కొండయు, ఏజన్సీ ప్రాంతములో భద్రాద్రికొండయు, కృష్ణాజిల్లాలో వేదాద్రియు, కనకదుర్గకొండయు, కర్నూలు జిల్లాలో శ్రీశైలపర్వతమును, చిత్తూరు జిల్లాలో తిరుపతి వెంకటేశ్వరుని కొండలును పుణ్యక్షేత్రములు. గుంటూరు జిల్లాలో గనికొండ, నాగార్జునకొండ, బెల్లముకొండ, కొండవీడు, మంగళగిరి, ఉండవల్లి, కోటప్పకొండ, వినుకొండ, చీమకుర్తి కొండలు గలవు. కడపజిల్లాలో పాలకొండలు, శేషాచలము కొండలున్నవి. కర్నూలు జిల్లాలో నల్లమలలు ఎత్తైనకొండలు. వెలిగొండలు కర్నూలు నెల్లూరు జిల్లాల సరిహద్దున నున్నవి. ఎఱ్ఱమల కొండలు నెల్లూరు జిల్లాలో కలవు. అనంతపురం జిల్లాలో పెనుగొండలు, మడకసిర మల్లప్ప కొండలును ఉన్నవి. బళ్లారి జిల్లాలో సాందూరు కొండలు ముఖ్యమైనవి.

తెలంగాణము చాలభాగము గుట్టలు పర్వతముల మయముగ కాన్పించును. ఇచ్చట పెద్ద పెద్ద బండరాళ్ళు ఒకదానిమీద నొకటి పేర్చినట్లు విడ్డూరముగ నిలిచియుండును. సహ్యాద్రి కొండల పంక్తి ఆదిలాబాదు జిల్లాలో ఆరంభించి ఔరంగాబాదు జిల్లావరకును వ్యాపించియున్నది. ఈకొండలలోనే అజంతా ఎల్లోరా గుహలు గలవు. వరంగలు జిల్లాలో కందికల్లుగుట్టలు ఉత్తర దక్షిణములకు వ్యాపించి యున్నవి. ఈ జిల్లా ములుగు తాలూకాలోని కొండలలో రామప్ప దేవాలయ మున్నది. హనుమకొండవద్ద గుట్టలపై కాకతి పద్మాక్షి దేవాలయమును, సిద్ధేశ్వరాలయమును ఉన్నవి. నల్లగొండ జిల్లా విస్తారముగ శిలామయమై యున్నది. మెదకుజిల్లా వికారాబాదు తాలూకాలో అనంతగిరికొండలు గలవు. వీనిమీద సమశీతోష్ణముగ నుండి ఆరోగ్యస్థానముగా పరిగణింప బడుచున్నది. తెలంగాణము యొక్క ఘనతకు అచ్చటి పర్వత దుర్గములు కొంతవఱకు మూలమని చెప్పవచ్చును. వరంగలు జిల్లాలో కొండపల్లి ఖమ్మము జఫర్ గడము (వేల్పుగొండ) నల్లగొండ జిల్లాలో భువనగిరి రాచకొండ దేవరకొండ దుర్గములును, మెతుకు దుర్గమును నిజామాబాదు (ఇందూరు) దుర్గమును హైదరాబాదు సమీపమందలి గోలకొండ దుర్గమును సుప్రసిద్ధములు. ఇవి కాక, స్థలదుర్గములు పెక్కు గలవు. వరంగలు సమీపమందు కాకతీయుల బ్రహ్మాండమైన కోటగలదు. కరీంనగరము జిల్లాలో జగ్త్యాల, మలంగూరు, మనిగందల సమీపమునను ఆదిలాబాదు జిల్లాలో రాజూరు, నిర్మల, వద్దను ప్రసిద్ధములైన దుర్గము లున్నవి.

ఆంధ్రదేశపు నదులు :—వింధ్య దక్షిణదేశమందలి గొప్ప నదులైన గోదావరి కృష్ణానదులు ఆంధ్రదేశమునే విశేషముగ పునీతము చేయుచున్నవి. వీటిని తెలుగునదులన్నను ఆక్షేపణ యుండదు. జన్మస్థానమైన నాసికాత్ర్యంబకమునుండి తొమ్మిదివందలమైళ్లు ప్రవహించు గోదావరి జీవనది. తెలంగాణమునందలినిజామాబాదుజిల్లాలో నీ నదీమతల్లి మొదటిమారు తన చల్లని పాదముపెట్టినది. ఇచ్చట

బాసరవద్ద దీనిపై రైలువంతెన గలదు. ఆంధ్రదేశ ప్రాంగణమున ఆసీనమైన ఈ నదీరాజమునకు మంజీరానది, కుడివైపునుండి ప్రవహించివచ్చి తన జలమును తొలికానుకగా సమర్పించుచున్నది. మానేరుకూడ కుడివైపునుండి వచ్చి ఆదిలాబాదుజిల్లాలో గోదావరిని కలియుచున్నది. ఈజిల్లాలోనే ఎడమవైపునుండి పారుచువచ్చి ప్రాణహితయను ఉపనది కాళేశ్వర క్షేత్రమువద్ద గోదావరిలో సంగమించుచున్నది. ఇదియొక ఉపనదిమాత్రమేకాదు. పెనుగంగ, వరద, వైన్యగంగయను మూడు నదుల జలరాశి ప్రాణహితయగుచున్నది. మఱియొక పెద్దఉపనదియైన ఇంద్రావతి బస్తరుసంస్థానమునకు దక్షిణమున ఎడమయొడ్డునుండి గోదావరిలో పడుచున్నది. ఇవికాక శబరి మొదలగు చిల్లర నదులును వాగులును గోదావరిలో గ్రుంకుచున్నవి. ఈ నది భద్రాచలరాముని పాదములంటి పారి రాజమహేంద్రవరము క్రింద గౌతమి వసిష్ఠయను రెండు పెద్ద పాయలుగ చీలుచున్నది. సముద్రముచేరులోపల నిది యేడు చిల్లర పాయలుగా చీలుటచే దీనికి సప్తగోదావరమను ప్రసిద్ధివచ్చినది. రాజమహేంద్రవరము క్రిందనుండియే ఈ నది యొండుమట్టిచే నేర్పడిన గోదావరి డెల్టా వ్యాపించియున్నది. ఈ పట్టణమునకు చేరువలోనున్న ధవళేశ్వరము వద్ద గోదావరికి ఆనకట్టలుకట్టి నదీజలమును కాలువలగుండ డెల్టాలోనికి ప్రవహింపచేయుచున్నారు. దీనిచే ఈ డెల్టా ప్రదేశము మిక్కిలి సారవంతమై అపారముగ పంటల నీనుచున్నది. అది మట్టిగాదు మహాత్కనకము అనిచెప్పినను అతిశయోక్తికాబోదు. ఈ పుణ్యకార్యమును క్రీ. శ. 1852 ప్రాంతమున సాధించిన మహనీయుడు సర్ ఆర్థరు కాటను అనుదొరవారు. జనులు భక్తివిశ్వాసములతో ఈయన నామమును కాటను మహర్షియని చెప్పుకొనుచుందురు. వసిష్ఠ గోధావరికి పాయయైన వైనతేయమువిూద గన్నవరము అను గ్రామమువద్ద 'అక్విడక్టు' అను చిత్రమైన ఏర్పాటు గలదు. నదీ ప్రవాహాముపైన ఒక పెద్ద దోనెవంటిది కట్టబడి, దీని లోనుండి కాలువనీరు పారును. దీనిక్రింద ఏరు ప్రవహించుచుండును.

గోదావరికి ధవళేశ్వరమువద్దనే కాక రాజమహేంద్రవరమున కెగువ 150 మైళ్లమీద, దుమ్ముగూడెమువద్ద మఱియొక ఆనకట్ట కట్టి యున్నారు. ఈ జీవనది పర్వతములనుండి గొనివచ్చు భూరి జలరాశిని వ్యర్థముగ పోనీక ఆనకట్టలుకట్టి కాలువలగుండ నీటిని పారించినచో ఊసరక్షేత్రము లెన్నియో పంటభూములు కాగల్గును. ఈ యుద్దేశముతో గోదావరికి పోలవరము సమీపమున రామపాద సాగరమను పేరుతో మఱియొక ప్రాజెక్టు కట్టదగునని సర్. శొంఠి వెంకటరామమూర్తి పంతులుగారు విశ్వప్రయత్నముచేసిరి. కాని ధనాభావముచే ఈ బ్రహ్మాండమైన ప్రాజెక్టు ఇంకను చేపట్టబడలేదు. ఇది నెరవేరినచో ఆంధ్రదేశము ఆహారవిషయములో తాను స్వయంపోషక మగుటయేకాక భారతదేశములో పెక్కు ప్రాంతములకు అన్నదానము చేయగల్గియుండును.

గోదావరికి చెల్లెలైన కృష్ణానది పడమటి కనుమలలో మహాబలేశ్వరముకడ జన్మించి 800 మైళ్ళు ప్రవహించి సాగరసంగమము చేయుచున్నది. దీని మొదటి యుపనదియైన భీమానది ఎడమవైపు నుండివచ్చి రాయచూరు జిల్లాలో కృష్ణలో పడుచున్నది. ఇచ్చట నుండి కృష్ణానది తెలుగు దేశములో కాలుపెట్టుచున్నది. కుడివైపు నుండి వచ్చు తుంగభద్రానదీజలమును సంగమేశ్వరమువద్ద కలుపుకొని, కృష్ణానది మహబూబునగరు నల్లగొండ కృష్ణా జిల్లాలగుండ ప్రవహించి హంసలదీవివద్ద సముద్రమును చేరును. మూసి, మునేరు అను ఉపనదులు తెలంగాణముగుండ ప్రవహించి ఎడమనుండి వచ్చి కృష్ణలో కలియుచున్నవి. హైదరాబాదు మహానగరము మూసి యొడ్డుననే యున్నది. మహబూబునగరం జిల్లా శ్రీరామపురమువద్ద కృష్ణమీదను, కర్నూలువద్ద తుంగభద్రమీదను రైలువంతెనలు గలవు. బెజవాడవద్ద కృష్ణానదికి ఆనకట్టకట్టి నీటిని ఆపుచేసి కాలువలగుండ కృష్ణ డెల్టాలోనికి ప్రవహింపచేయుచున్నారు. ఇక్కడి భూములు బంగారము పండును. కృష్ణ కాలువలలో నొకదానిని ఏలూరువద్ద గోదావరి కాలువతో కలియునట్లు త్రవ్వినారు. ఇట్లీ పెద్దనదులు చేతులుచాచి కాలువలను వ్రేళ్ళ కొనలతో ఒకదాని

నొకటి స్పృశించుచున్నవి. బెజవాడవద్ద కృష్ణపై బలిష్ఠమైన రైలు వంతెనకలదు. గోదావరి కృష్ణానదులు మిక్కిలి పవిత్రవాహినులుగ ఆరాధింపబడుచున్నవి. ఈ నదులు పంట పర్యాయములకేకాక కొంతవఱకును పడవ ప్రయాణములకును ఉపయోగపడుచున్నవి.

కృష్ణా గోదావరీ నదులు ఆంధ్రదేశపు హృదయమునను నాభి దేశమునను ప్రవహించుచున్నవి. ఇవికాక ఎన్నియో చిన్న నదులు ఆంధ్ర భూమికి జలదానము చేయుచున్నవి. ఈ దేశమున కుత్తరమున ఋషికుల్య, వంశధార, నాగావళి, శారదానదులును, దక్షిణభాగమున గుండ్లకమ్మ, ఉత్తర పినాకిని, చిత్రావతి, పాపఘ్ని మొదలగు నదులును కలవు. ఇవి నీటి రహదారులుగ ఉపయోగింపకున్నను పైరు పంటలకు తోడ్పడజాలియున్నవి. ఉత్తర పినాకిని లేక ఉత్తర పెన్న యనునది మైసూరు రాజ్యమున బుట్టి నెల్లూరు జిల్లాగుండ ప్రవహించుచున్నది. నెల్లూరువద్ద ఈ నదికి ఆనకట్టకట్టి పంటకాలువలు త్రవ్వినారు. ఈ జిల్లాలో సువర్ణముఖియను చిన్న యేరుకలదు. ఇది శ్రీ కాళహస్తీశ్వర క్షేత్రమునంటి పారును. పాలేరునది చిత్తూరు నెల్లూరు జిల్లాలగుండ పోవును. పాపఘ్నినది కందుకూరు చెరువున కాధారమై కడపజిల్లాలో ప్రవహించుచున్నది. గుంటూరు జిల్లాలో చరిత్రప్రసిద్ధిగన్న నాగులేరు చంద్రవంకలును, ఎత్తిపోతల జలపాతమునుగలవు.

సరస్సులు - చెఱువులు :— ఆంధ్రదేశపు టుత్తర సరిహద్దున చిల్కాసముద్రము కలదు. దక్షిణమున నెల్లూరు చెంగల్పట్టు జిల్లాల సరిహద్దున పులికట్టువద్ద నొక సరస్సుకలదు. విశాఖపట్నం జిల్లాలో కొండకర్ల ఆవ, కొమరువోలు ఆవ మున్నగు పెద్ద సరస్సులు గలవు. పశ్చిమ గోదావరి జిల్లాలో కొల్లేరు అను మంచినీటి సరస్సున్నది. ఇది కొంగలకు నివాసమగుటచే కొల్లేటి కొంగలు అనువాడుక యేర్పడినది. గుంటూరు జిల్లాలో భవాని చెఱువు, కర్నూలు జిల్లాలో కంభము మార్కాపురం చెఱువులు, నెల్లూరు జిల్లాలో కలిగిరి చెఱువు మొదలగు పెద్ద జలాశయము లీ దేశమున గలవు. మఱియు తెలంగాణము పురాతనములును అధునాతనములును అగు ననేక తటాకములకు

నిలయమై చెఱువుల దేశము అని పేను వడసినది. వీనిలో పాకాల రామప్ప, లక్నవరం, శంకరభూపాలము మొదలగు చిన్నసముద్రముల వంటి చెఱువులు ప్రాచీనములు. ఇవి కాకతీయుల కాలమున నిర్మింప బడినవై ఈనాటికి నిలిచియున్నది. నిజామాబాదు జిల్లాలోని పోచా రము చెఱువును మెదక జిల్లాలోని రాయనిపల్లి చెఱువును ఎన్నదగి నవి. వీటన్నిటినుండియు పంటకాలువలు త్రవ్వబడి భూమిసాగుబడికి తోడ్పడుచున్నవి. మహమ్మదీయ సుల్తానుల పరిపాలన కాలములో కట్టబడిన రెండు పెద్ద చెఱువులు కలవు. హుస్సేను సాగరు అను చెఱువు హైదరాబాదు సికిందరాబాదు నగరముల నడుమ వ్యాపించి యున్నది. హైదరాబాదు పుర నిర్మాణముకన్న ముందే ఇబ్రహీం కుతుబుశాహ (1550-80) కాలములో దీనికి కట్టవేయబడినట్లు తెలియుచున్నది. దీనికన్న పెద్ద తటాకము హైదరాబాదునకు ఆగ్నేయ దిశయందున్న మీరాలం చెఱువు. దీని వాస్తునిర్మాణము ప్రశంసనీయమైనది. టిప్పు సుల్తానుతోనైన యుద్ధములలో నిజాము నవాబుల వంతునకు వచ్చిన యుద్ధపరిహారధనముతో దీనిని నిర్మించి రట. దీని విస్తీర్ణము ఎనిమిది చదరపుమైళ్లు. ఈ రెండు చెఱువులును చిరకాలమునుండి హైదరాబాదు సికింద్రాబాదులకు త్రాగుటకు పానీయము నిచ్చుచుండెడివి.

నీటి వనరులు :—నీటిపారుదల సదుపాయములపై ఏ దేశపు వ్యవసాయమైనను ఆధారపడియుండును. దేవమాతృకములు అనగా వర్షాధారముకల భూములకన్న నదీమాతృకములు అనగా ఏటినీళ్లు పారు పొలములు శ్రేష్ఠములు. వర్షము సకాలమునకు కురియకపోవుట చేతను అతివృష్టి అనావృష్టి కారణములవలనను పంటలు చెడిపోయి కాటకములు సంభవించును. ప్రజానీకము విస్తారముగా మరణించు టయో చెల్లాచెదరయిపోవుటయోతటస్థించును. నదీమాతృకములైన భూములకు వరదల ప్రమాదము కలదు. దేశపు నాగరకత పుష్కల మైన యాహార సంపదపై ఆధారపడియుండునని గుర్తించినచో నీటి వనరులు ప్రజా నాగరకతకెట్లు మూలాధారములగుచున్నవో తెలిసి

కొనవచ్చును. ఆంధ్ర దేశమున నొకప్పుడు దేవ మాతృకములైన భూములు వర్తమానకాలమున నదీమాతృకములై అన్న సమృద్ధి కలిగి నిత్యకళ్యాణము పచ్చతోరణములుగా నుండుట చూచు చున్నాము. పూర్వము నదీతటాక మాతృకములైన భూములు నేడు దేవమాతృకములై వానదేవుని చాపల్యమునకు గురియై కఱవులకు ఆటపట్టయి జనులు ఇక్కట్టులు పడుచుండుటయు గాంచుచున్నాము. ఓడలబండ్లును బండ్లపై ఓడలును వచ్చుట విధికృతముగదా! వీటిలో మొదటిభాగమున కుదాహరణముగ గోదావరి, కృష్ణాడెల్టా భూము లనే చెప్పవచ్చును. ఆనకట్టలు ఏటికాలువలు లేనికాలమున ఈ డెల్టా భూములు వర్షాధారముకలవియై మెట్టపంటలు పండించుచు ఎవరును వాంఛింపని పొలములుగ నుండెడివని యూహింపవచ్చును. ఇప్పుడివి బంగారు పండించు భూములైనవి. రెండవ విభాగమునకు రాయల సీమనే యుదాహరణముగా గొందుము. విజయనగర సామ్రాజ్య కాలమున రాయలవిహారభూములై, సస్యక్షేత్రములతోను ఉద్యానవనములతోను విరాజిల్లిన దేశము, నేడు మైళ్ళకొలది పచ్చని మొలకలేక, బుగులు బుగులు మనుచుండుటకు కారణము, అక్కడ నీటివనరులు మృగ్యములగుటయే. రాయలకాలపు నీటిసదుపాయ మార్గములు బాగు మరమ్మతులు లేకుండుటచే శిథిలమయి రత్నసీమ రాళ్ల సీమయయినది. అనాదికాలమునుండియు నదీతీరమందే నగరము లేర్పడుటయు నాగరికత నెలకొనుటయు ప్రతి దేశచరిత్రయందును కాననగును. కావున ప్రాణాధారమైననీరు. నీటిసౌకర్యములు సంస్కృ తికి ఆయువుపట్టులని గ్రహింపవలెను.

ఉత్తరసర్కారులోని డెల్టాకాలువలనుగురించి ప్రసంగించి తిమి. ఆంధ్ర దేశపు టితరప్రాంతములందును తెలంగాణమునందునునీటి వనరులస్థితిని గమనింతము : విశాఖపట్టణముజిల్లాకూడ నీటియెద్దడిగల ప్రాంతమే. అయినను వంశధార నాగావళి నదులకు ఆనకట్టకట్టిపంట కాలువలు త్రవ్వుటచేవ్యవసాయము సాగుచున్నది. ఆంధ్ర దేశములో కెల్ల క్షామమునకు తరచు గురియగుప్రాంతము రాయలసీమ జిల్లాలు.

ఇక్కడి నదులకు ఆనకట్టలుకట్టి నీటిపారుదల సదుపాయములను వృద్ధి నొందించుట దేశముయొక్క ముఖ్య కర్తవ్యము. తుంగభద్రానదికి హొస్పేటదగ్గర కట్టబడు ప్రాజెక్టుమూలమున రాయలసీమ కష్టములు గట్టెక్కనని తలచవచ్చును. ఇచ్చట విద్యుచ్ఛక్తి నుత్పాదనచేయు పథకముగూడ కలదు. సంగమేశ్వరప్రాజెక్టును కుముద్వతీప్రాజెక్టును రాయలసీమ సస్యసమృద్ధమగుటకు అవసరము. రాయలసీమ నీటి వనరులలో కడప కర్నూలు కాలువ పేర్కొనదగినది. ఇది తుంగభద్రానదిని ఉత్తరపెన్నతో కలుపునట్లు త్రవ్వబడినది. ఈ కాలువ వ్యవసాయ కార్యముల కుపయోగపడుచున్నది.

ఈ యంశమునందు తెలంగాణము కొంతవఱకు అదృష్టవంతమని చెప్పవచ్చును. ప్రాచీనములైన తటాకములటుంచి ప్రస్తుత యుగమున పెక్కు ప్రాజెక్టులు నిర్మితములయి వ్యవసాయమునకు నీటి సదుపాయము కలిగియున్నది. వీటిలో మొదట పేర్కొనదగినది మంజీర నదికి అడ్డగట్టువేయుటచే ఏర్పడిన నిజామునాగరు చెఱువు. దీనికాలువల వలన 260000 ఎకరముల భూమి సాగుబడి కాగలదు. ఇచ్చటి పొలములలో చెఱకుపంట విరివిగా సాగుచున్నది. ఈ చెఱకు నుపయోగించుకొను పంచదార కర్మాగారము సమీపముననే బోధను నగరములో కలదు. ఇవిగాక వరంగలుజిల్లాలో వైరా, పాలేరు ప్రాజెక్టులును హైదరాబాదు జిల్లాలో ఉస్మానుసాగరు హిమాయతుసాగరు ప్రాజెక్టులును ఇట్టి వెన్నియో చిన్నవి పెద్దవి జలాశయము లేర్పడి తెలంగాణమునందు అన్నసమృద్ధిని ప్రసాదించుచున్నవి. తెలంగాణమునందు బావులు వ్యవసాయమునకై విశేషముగ నుపయుక్తములగుచున్నవి. బావుల త్రవ్వకము, అవసరమైన మరమ్మతులు చేసికొను వ్యయము, రైతు స్వయముగ భరింపవలసియుండుటచే బావులక్రింద సాగగు భూములపై సర్కారు పన్నులు తగ్గించుట యుక్తమని ఆంధ్ర మహాసభవారు వాదించి కృషిచేసిరి.

కాలువలు:—పంటకాలువలుగాక రహదారులుగ పడవల రాకపోకల కుపయోగించు కాలువలు ఆంధ్రదేశమునందు తక్కువగా

నున్నవి. గోదావరి కృష్ణాకాలువలు రెండువిధములుగను ప్రయోజనకారులగుచున్నవి. మనదేశమందలి పెద్ద కాలువలలో చెప్పదగినది బకింగుహాము కాలువ. ఇది 260 మైళ్ల పొడవున తూర్పు సముద్ర తీరము వెంబడినడచి మద్రాసును కాకినాడను కలుపుచున్నది. ఈ కాలువ చెంగల్పట్టు, నెల్లూరు, గుంటూరు, కృష్ణా, గోదావరి జిల్లాల గుండ పోవును. ఇది వ్యాపారమునకు ప్రసిద్ధికెక్కినది. బరువు సరకులను, కలప, రాళ్లు, ఉప్పు మొదలగువానిని నాటుదారిని రవాణా చేయుటకన్న నీటిపై పంపుట చవుకగా జరుగును. నీటి రహదారులభివృద్ధినొందినచో రైళ్లమీద సరకుల ఒత్తిడి తగ్గి జనుల ప్రయాణమునకు సౌకర్య మేర్పడును. కడప-కర్నూలు కాలువ సంవత్సరమునందు కొన్నిమాసములుమాత్రమే పడవల రాకపోకల కుపయోగించుచున్నది. రామపాదసాగరు నిర్మాణమువలన పారుదలకాగల కాలువలు మధ్యపరగణాలవరకు వ్యాపించి పడవల నడకకు చాలియుండునని యూహింపబడినది.

---

# ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి

## 5-వ ప్రకరణము

### (ఆంధ్రదేశము – సిరిసంపదలు)

వ్యవసాయము – పైరుపంటలు:—ఆంధ్రదేశము మొత్తముమీద వ్యవసాయము ప్రధాన వృత్తిగాగల దేశము. వ్యవసాయమునకు మూలసాధనమైన నీటి వనరులను గురించి కొంత ప్రసంగించియుంటిమి. ఆంధ్రదేశపు భూసారమునుగూర్చియు పండు పంటలను గూర్చియు ముచ్చటింతము. ఒకచోట పెరుగు సస్యము అచ్చటి మన్ను, అచ్చట కురియు వాన, నీటివసతి, శీతోష్ణస్థితి వీనిపై నాధారపడియుండును. ఆంధ్రదేశములో సారవంతమైన నల్లనేల, కంకరతో

నిండియుండు నేలలు, పట్టుభూములు, బీడు భూములు అన్ని రకముల నేలలును గలవు. తూర్పు కనుమలకు సమీపముననున్నవి ఎఱ్ఱమట్టి నేలలు. ఇవి ఉత్తరసర్కారు జిల్లాలలోనున్నవి. గుంటూరు నెల్లూరు రాయలసీమ జిల్లాలలో ఎఱ్ఱనేలయు నల్లరేగడి లేక ప్రత్తిరేగడి నేలయు కలిసియున్నవి. నల్లరేగడినేలమీద వర్షము తక్కువైనను, వీటికి నీటిని నిలువచేసికొను శక్తి యధికము. నదులతో కొట్టుకొని వచ్చు వండుమట్టినేలలు గోదావరి, కృష్ణా, నెల్లూరు జిల్లాలలో నున్నవి. ఈ భూమి, పై రెండురకముల నేలలకన్నను శ్రేష్ఠమైనది. సముద్రతీరమున ఇసుక మేటవేసిన తేలిక భూములున్నవి. తెలంగాణ జిల్లాలయందలి భూమి ఇసుక కలసియున్నది. రాతిపాలును ఎక్కువ. దీనిలోని నీటి పదను నల్లరేగడిభూమియందువలె చాల కాలము నిలిచియుండజాలదు.

ఈ దేశపు ప్రధానసస్యము వరి. ఇది కృష్ణా గోదావరి పెన్నా డెల్టాలలోను తెలంగాణములో చెఱువులు బావుల క్రిందను పైరగుచున్నది. దీని తరువాత చెప్పదగినది చెఱకుపంట. దీనికిని వరిచేలకువలె పుష్కలమైన జలమును ఉష్ణాధిక్యతయు సారవంతమైన భూమియు కావలెను. వరిపైరు చేయబడు జిల్లాలలో చెఱకును ఉత్పత్తియగుచున్నది. ఇవి రెండును మాగాణి పైరులు. మెట్టపంటలలో జొన్న, మొక్కజొన్న ముఖ్యములు. వీటికి నీరు ఎక్కువగా పనిలేదు. కడప కర్నూలు అనంతపురము బళ్లారి మొదలగు జిల్లాలలోను తెలంగాణములోను జొన్న పండును. తెలుగుదేశములోని ఏప్రాంతము కూడ గోధుమపంటకు అనుకూలించునదిగ కాన్పించదు. గోధుమకు పొడిగల శీతోష్ణస్థితి యుండవలెను. ఆహారధాన్యములలో పప్పుగింజలు కందులు మినుములు పెసలు సెనగలు అనుములు మొదలైనవియు మన దేశమున పండును. మేలిరకము మిర్చికి వరంగలు పెట్టినదిపేరు. రెండవకారు పంటలలో ఆవాలు మెంతులు ధనియము వావింటి గింజలును తెలుగునాట పెంచబడును. లేత ధనియము మొక్కలను కొత్తిమిరియందురు. ఇదియు కరివేపాకును తెలుగువారు వంటకము

లలో మిక్కిలి మక్కువతో వాడుదురు. ఆహారేతర సస్యములలో ప్రత్తిపంట ఎన్నదగినది. దత్తమండలముల భూసారము దీనికి మిక్కిలి యనుకూలించునదిగా నున్నది. కావున నిక్కడ ప్రత్తి విస్తారముగ పండును. నూనెగింజలగు నువ్వులు ఆముదములు వేరుశనగ అవిసెలు తెలంగాణమునందు సమృద్ధిగ పెరుగును. కృష్ణా గోదావరి డెల్టాల లోని మెరకభూములందు కొబ్బరిచెట్లను విరివిగ పెంచుచున్నారు. ఏటిలంకలు పొగాకు పండించుట కనువైన ప్రదేశములు. గోదావరి లంకలలో ప్రశస్తమైన పొగాకు ఉత్పత్తియగును. కూరగాయలకును దుంప దినుసులకును ఈ దేశమున కరవులేదు. కంద, పెండలము, చేమ, చిలగడము, పసుపు, ఉల్లి మొదలగునవి వలసినంత దొరకును. ఆకుకూరలలో తోటకూర, బచ్చలి, గంగపావిలి, పాలకూర, మెంతి, గోంగూర మున్నగునవి ఆప్యాయముతో చూడబడుచున్నవి. ఫల జాతులలో అరటి, నారింజ, మామిడి, సీతాఫలము తరుచు లభించు నవి. కొన్ని ప్రాంతములలో పేదసాదలు తాటిపండ్లగుంజును తేగలను తిని ధాన్యపు కొరతగల నెలలను గడుపుచున్నారు. నారసరకులలో జనుము గోగు చెప్పదగినవి. వరిచేలుకోసినతరువాత రైతు, పొల ములో జనుము చల్లును. జనుము పశువుల మేతకును నారకొరకును పనికివచ్చును.

వ్యవసాయమునకును పశువులు చాల అవసరము. మన దేశ ములో ఎడ్లును దున్నపోతులును పొలము దున్నుటకు బరువు మోయుటకును ఉపయోగపడుచున్నవి. తెలుగునాటి పశుజాతిలో రెండువంతులు గోజాతి, ఒకవంతు మహిషజాతి. ఒంగోలు పశువులు అఖిలభారతమునందు ప్రశస్తి గడించినవి. ఇవి పాడికిని పనికినిగూడ అగ్రస్థానము వహించుచున్నవి. గోజాతిలో హానుమకొండ మట్టెవాడ జాతులు మిక్కిలి పౌరుషమైన జాతులు. పశుసంపద పెరుగుటకు పచ్చ గడ్డినేలలు గ్రామ సమీపములందు విశేషముగా విడువవలెను. అధి కాహారోత్పత్తి కార్యక్రమముక్రింద బీడుభూములు చాలవరకు నాగలి క్రిందికి వచ్చుచుండుటచే పశువుల మేతకు లోప మేర్పడుచున్నది.

తెలుగు జిల్లాలలో మేకలు గొఱ్ఱెలమందలు విరివిగనేయున్నవి. ఇవి పాడిలోపమును తీర్చుచు ఉన్నిని ఇచ్చుచున్నవి. ఇటీవల వనమహోత్సవములు వృక్షారోపణములు జరిగిన పిమ్మట మేకలు చెట్లు పాడు చేయునుగనుక ఇవి క్షుద్రజంతువులుగ పరిగణింపబడుచున్నవి. మేక జాతి నశించినచో వ్యర్థమైన వృక్షజాతి అపారముగ లేచి ఆకు రొట్ట పెరిగిపోవును. మేకలు ఈ రొట్టను తినివేయుచున్నవి. దేహారోగ్యమునకు పోషకమైన పాలను ఇచ్చుచున్నవి. పొలములలో మేకలను మందకట్టి ఎరువు కల్పింతురు. మృతపశువులన్నియు తోళ్ళకై యుపయోగపడుచున్నవి.

అడవులు:—దేశముయొక్క ఆర్థిక సంపదకు అడవులు అనేక విధముల తోడ్పడుచున్నవి. ప్రాచీనకాలమునుండియు మన దేశపు రాజులు అడవుల యుపయోగములను గుర్తించి వాని రక్షణ పాలనములకై ప్రత్యేకోద్యోగులను అటవీశాఖలను స్థాపించుచుండిరి. కౌటిల్యునిఅర్థశాస్త్రము, శుక్రనీతి మొదలగు అర్థశాస్త్ర గ్రంథములందు అడవులనుగూర్చి ప్రత్యేకాధ్యాయములు గలవు. అడవులు దట్టముగా పెరుగుటకు సూర్యరశ్మి, మెండుగా వర్షము కావలెను. మన దేశములో ఎక్కడెక్కడ పర్వతములు గలవో అచ్చటచ్చట అడవులు గలవు. అడవులు దట్టముగా పెరిగిన కొలదిని వర్షము లధికముగా కురియును. దేశముయొక్క శీతోష్ణస్థితిపై అడవుల ప్రభావము ఎక్కువ. ప్రాచీనకాలమున ఆంధ్రదేశము దండకారణ్యమయమై యుండినట్లు రామాయణ వర్ణనమువలన దెలియుచున్నది. అడవులను పాడుచేయుటవలన వర్షపాతముతగ్గి క్షామభయమేర్పడుచున్నది. అడవులు దట్టముగానున్న ప్రదేశమందు వానలధికముగా కురియుటే గాక వర్షజలమును అడవులు పీల్చుకొని నదులకు వరదలు రాకుండ అరికట్టును. కావున అడవులను నరికివేయుటయు కొంటెతనమునకై నిప్పుముట్టించుటయు మిక్కిలిహానికరములని గ్రహించవలెను. కొట్టివేత చెట్లస్థానములో క్రొత్తవృక్షములను నాటించి ప్రభుత్వ అటవీ శాఖవారు పెంచుచుందురు.

మన దేశములో విశాఖపట్నము గోదావరి జిల్లాల ఏజన్సీ ప్రాంతములందును కడప కర్నూలు జిల్లాలయందును మంచిరకపు అడవులు గలవు. ఇందులో విశాఖపట్నం గోదావరి కర్నూలు జిల్లాలోని యడవులు చాల పురాతనమైనవి. తెలంగాణమునం దడవులు విస్తారముగ గలవు. ముఖ్యముగ వరంగలు ఆదిలాబాదు జిల్లాలయందివి మెండు. దేశోపయోగకరమగు నీ యరణ్యములు సంఘ ప్రతికూల శక్తులకు ఈనాడు దాగుడుస్థలములగుట శోచనీయము. వీనియందన్ని రకములైన చెట్లుగలవు. గృహనిర్మాణమునకును గృహోపకరణములు తయారుచేయుటకును పనికివచ్చు టేకు, మద్ది, చంద్ర ఇరుగుడు చేవ, వెదురు, చందనము మొదలగు వృక్షములును ఆహారపదార్థములకు పనికివచ్చు చింత, వెలగ, నేరేడు, తునికి, మామిడి, జీడి, చారపప్పు మొదలగు చెట్లును; తేనెయు రంగులకుపనికివచ్చు కరక కాయ, లక్క-చెట్లబెరడు మున్నగుపదార్థములను కుంకుడు సీకాయ మైనము మొదలగునవియు మన దేశపు టడవులలో దొరకును. ఔషధములు వండుట కుపయోగించు అమూల్యములగు మూలికలెన్నియో వనములలో లభించును. కుటీరపరిశ్రమలలో కాగితము సబ్బులు లక్క-పిడతలు చాపలు పలకలు తయారుచేయుటకు కావలసిన ముడిపదార్థము లడవులనుండి వచ్చును.

ఖనిజసంపద :—దేశముయొక్క పారిశ్రామికాభివృద్ధి యచ్చట లభించు లోహములనుబట్టియుండును. లోహముల పరిచయమే మానవుని నాగరకతా వికాసమునకు తొలిమెట్టు. ఇప్పుడు మన దేశములో దొరకు ప్రధానమైన ఖనిజములు బంగారము ఇనుము గనిబొగ్గు అభ్రకము మాంగనీసు మొదలైనవి. గనులనుండివచ్చు ముడిపదార్థములను శుద్ధిచేసికొని పారిశ్రామిక వృత్తుల కుపయోగించుటకుమారుగా వాటిని ముడిసరకులుగానే విదేశముల కెగుమతిచేసి తయారైన వస్తు సముదాయమును దిగుమతిచేసికొనుట జరుగుచున్నది. దేశ పురోగమనము దృష్ట్యా ఇది అసంతృప్తికరమైన

పరిస్థితియనియే చెప్పవలెను. మన దేశములో దొరకు ముఖ్యమైన ఖనిజములు:

(1) ఇనుము :—ప్రస్తుత పారిశ్రామిక యుగమునందు లోహములలో ఇనుమునకే యగ్రతాంబూలము. బళ్ళారిజిల్లాలో సాండూరు కొండలలోను, కర్నూలుజిల్లాలో నంద్యాలవద్దను, గోదావరిజిల్లాలో పోలవరమువద్దను, నెల్లూరుజిల్లాలో సింగరాయ కొండవద్దను, విశాఖపట్నంలో నారాయణపేట మాడుగులవద్దను, తెలంగాణములో వరంగలుజిల్లా, కొన్నితాలూకాలలోను, ఆదిలాబాదుజిల్లా రాజూరా ఎల్లడవులకు సమీపమందును ఇనుము దొరకుచున్నది. ఇంతేకాక గోదావరి వార్ధానదుల లోయలలోకూడ ఇనుము విశేషముగా నున్నది.

(2) నేలబొగ్గు :—దీనినే రాక్షసిబొగ్గు అనికూడ అందురు. కుడిచేతికి ఎడమచేతి సహాయమువలె ఇనుమునకు రాక్షసిబొగ్గు అత్యవసరము. బొగ్గుగనులు సమీపమునలేనిచో ముడిఇనుమును త్రవ్వితీయుట లాభదాయకముగాదు. గోదావరిజిల్లా భద్రాచలం తాలూకాలో నేలబొగ్గు విస్తారముగానున్నది. వరంగలుజిల్లా సింగరేణిబొగ్గుగనులు చాల ప్రసిద్ధమైనవి. అచ్చటి గనులలోని బొగ్గుతగ్గిపోవుటచే క్రొత్తగూడెములో బొగ్గుగనులు త్రవ్వుట నారంభించిరి. ఆదిలాబాదుజిల్లాకు చెందినబెల్లంపల్లి తాండూరుసాస్తిపావుని అను ప్రదేశములనుండి విరివిగ బొగ్గు త్రవ్వి యెత్తబడుచున్నది. ఆదిలాబాదు జిల్లాలో ఇనుము నేలబొగ్గు సమీపప్రదేశములందే లభించుచుండుటచే దీనికి గొప్ప పారిశ్రామిక భవిష్యత్తుకలదు. గోదావరిలోయస్కీము అనుపేరుతో ఈజిల్లాలోని రామగుండమువద్ద పారిశ్రామిక నగర నిర్మాణము జరుగుచున్నది.

(3) రాగి:—ఇనుము నేలబొగ్గుల తరువాత పారిశ్రామిక లోహములలో రాగి ముఖ్యమైనది. రాగిగనులు నెల్లూరుజిల్లా కావలికొండవద్దను, ఉదయగిరి తాలూకాలోను, కాళహస్తి జమీందారీలోను, తెలంగాణములో నల్లగొండ జిల్లాయందును గలవు.

(4) అభ్రకము:—ఇది యౌషధములకే కాక విద్యుచ్ఛక్తి యంత్రములకు సంబంధించిన సామగ్రికిని, గ్రామఫోను, టెలిఫోను, పరికరములకును, ఉపయోగించుచున్నది. అభ్రకము నెల్లూరుజిల్లా గూడూరువద్దను, విశాఖపట్టణంజిల్లాయందలి పలు ప్రదేశములలోను, తెలంగాణములో వరంగలు, నిజామాబాదు జిల్లాలయందును, లభించుచున్నది.

(5) మాంగనీసు:—ఇది ఇనుమును శుద్ధిచేయుటకును, ఉక్కు తయారుచేయుటకును, అవసరమైన వస్తువు. ఇది ఎక్కువగా బళ్ళారి, విశాఖపట్నం, కర్నూలుజిల్లాలలో గనులలోదొరకుచున్నది. విశాఖపట్నంజిల్లాలో ఎత్తబడు మాంగనీసు, భారతదేశమునందే కాక ప్రపంచమంతటను మేలైనరకము అను ప్రఖ్యాతి కలదు.

(6) బైరైట్సు:—దీనికే బేరియం సల్ఫేటు అని కూడ పేరు. ఇది రంగులు, కాగితములు, పింగాణీ సామగ్రి, మోటారుటైర్లు చేయుటయం దుపయోగపడును. నెల్లూరు, కడప, కర్నూలు, అనంతపురం జిల్లాలలో బైరైట్సు దొరకును.

(7) ఎస్‌బెస్టాసు:—దీనిని సాధారణముగా రాతినార యందురు. ఇది నారవలె మెత్తగా నుండు ఖనిజము. రాతినారతో చేయు వస్తువులకు అగ్నిప్రమాదముండదు. ఇది కడపజిల్లా, పులివెందల తాలూకా గనులలోను, అనంతపురం, కర్నూలు జిల్లాలలోను ఎక్కువగా దొరకుచున్నది.

(8) గ్రాఫైటు:—ఇది వజ్రసంబంధమైన రసాయన ద్రవ్యము. వేలకొలది డిగ్రీల వేడిమిని భరించగల మూసలును, మోటార్లు, డైనమోలు, పెన్సిళ్ళు తయారు చేయుటకును, దీనినుపయోగింతురు. ఇది గోదావరిజిల్లా, భద్రాచలం, పోలవరం తాలూకాలలోను, విశాఖపట్నం జిల్లాలోను, కృష్ణాజిల్లాలో బెజవాడవద్దను దొరకును.

(9) బంగారము:—అనంతపురంజిల్లా ధర్మవరం తాలూకాలోను, కృష్ణా గోదావరీ నదుల ప్రవాహముతో కొట్టుకొనివచ్చు ఇసుక రేణువులలోను, బంగారము దొరకుచున్నది. చిత్తూరుజిల్లా

(4) అభ్రకము:—ఇది యౌషధములకే కాక విద్యుచ్ఛ్చక్తి యంత్రములకు సంబంధించిన సామగ్రికిని, గ్రామఫోను, టెలిఫోను, పరికరములకును, ఉపయోగించుచున్నది. అభ్రకము నెల్లూరుజిల్లా గూడూరువద్దను, విశాఖపట్టణంజిల్లాయందలి పలు ప్రదేశములలోను తెలంగాణములో వరంగలు, నిజామాబాదు జిల్లాలయందును, లభించుచున్నది.

(5) మాంగనీసు:—ఇది ఇనుమును శుద్ధిచేయుటకును, ఉక్కు తయారుచేయుటకును, అవసరమైన వస్తువు. ఇది ఎక్కువగా బళ్ళారి, విశాఖపట్నం, కర్నూలుజిల్లాలలో గనులలోదొరకుచున్నది. విశాఖపట్నంజిల్లాలో ఎత్తబడు మాంగనీసు, భారతదేశమునందే కాక ప్రపంచమంతటను మేలైనరకము అను ప్రఖ్యాతి కలదు.

(6) బైరైట్సు:—దీనికే బేరియం సల్ఫేటు అని కూడ పేరు. ఇది రంగులు, కాగితములు, పింగాణీ సామగ్రి, మోటారుటైర్లు చేయుటయం దుపయోగపడును. నెల్లూరు, కడప, కర్నూలు, అనంతపురం జిల్లాలలో బైరైట్సు దొరకును.

(7) ఎస్‌బెస్టాసు:—దీనిని సాధారణముగా రాతినార యందురు. ఇది నారవలె మెత్తగా నుండు ఖనిజము. రాతినారతో చేయు వస్తువులకు అగ్నిప్రమాదముండదు. ఇది కడపజిల్లా, పులివెందల తాలూకా గనులలోను, అనంతపురం, కర్నూలు జిల్లాల లోను ఎక్కువగా దొరకుచున్నది.

(8) గ్రాఫైటు:—ఇది వజ్రసంబంధమైన రసాయన ద్రవ్యము. వేలకొలది డిగ్రీల వేడిమిని భరించగల మూసలును, మోటార్లు, డైనమోలు, పెన్సిళ్ళు తయారు చేయుటకును, దీనినుపయోగింతురు. ఇది గోదావరిజిల్లా, భద్రాచలం, పోలవరం తాలూకాలలోను, విశాఖపట్నం జిల్లాలోను, కృష్ణాజిల్లాలో బెజవాడవద్దను దొరకును.

(9) బంగారము:—అనంతపురంజిల్లా ధర్మవరం తాలూకా లోను, కృష్ణా గోదావరీ నదుల ప్రవాహముతో కొట్టుకొనివచ్చు ఇసుక రేణువులలోను, బంగారము దొరకుచున్నది. చిత్తూరుజిల్లా

కల్పిత జలపాతములచే పరిమితమైన విద్యుచ్ఛక్తిని ఉత్పాదన చేయ వచ్చునని ఊహించుచున్నారు. ప్రస్తుతము తెలుగుదేశములో థర్మల్ స్కీము విధానము పైననే బిజ్లీ సృష్టించి పంపకముచేయుట జరుగు చున్నది. దీని ఉత్పాదన వ్యయ మధికము. ఉత్తర సర్కారులలో విశాఖపట్నము, కాకినాడ, బెజవాడలవద్దను తెలంగాణములో హైదరాబాదు, వరంగలు, నిజామాబాదులలోను థర్మల్ స్టేషన్లు గలవు. తుంగభద్ర ప్రాజెక్టు నిర్మాణ ఫలితముగ విద్యుచ్ఛక్తిని కల్పించుటకు వీళ్ళు కలుగుననియు, దీనిచే రాయలసీమ కంతకును, మైసూరులో కన్న చవుకగ శక్తి సరఫరా యగుననియు, ఈజిల్లాలువ్యవసాయము నందే కాక పరిశ్రమలందును, శుభదినములు చూడగలవనియు ఇంజనీర్లు తలచుచున్నారు.

పరిశ్రమావకాశములు:—ఆంధ్రదేశపు ప్రజలు ఎక్కువ సంఖ్యలో వ్యవసాయమే వృత్తిగాగలవారు. సేద్యమున కనుకూలించు భూమి పరిమితముగా నున్నది. కావున వ్యవసాయముమీద ఒత్తిడి తగ్గించవలెనన్నచో ఈ జనమును కొంతవరకైనను పరిశ్రమలవంకకు మరల్పవలెను. పరిశ్రమలు నెలకొల్పుటకు ముడిసరకులు, కార్మిక వర్గము, విద్యుచ్ఛక్తి, నేలబొగ్గు, పెట్టుబడి, నిర్మాణమైన వస్తువు లమ్ముటకు విపణులు లేక మార్కెట్టులు, రవాణాసౌకర్యములు మొదలైనవి ముఖ్యావసరములు. ముందు కార్మికవర్గముమాట తీసికొందము. కుంపినీవారి పరిపాలనమునకు ముందు భారతదేశము, దానితో పాటు మన తెలుగుదేశముకూడ పారిశ్రామిక రంగములో గణనీయముగ ఉండెడివి. కావున మన కార్మికులకు పనితనములో వేలెత్తి చూపవలసినది లేదు. మన దేశములో ఉత్పత్తియగు ముడిసరకుల నుపయోగించుకొను పరిశ్రమల నారంభించుట లాభదాయకము. శక్తి దాయకములగు విద్యుచ్ఛక్తి, నేలబొగ్గు ధారాళముగ దొరకకుండుట యొకలోపము. నేలబొగ్గువరకైనచో తెలంగాణములోని గనులు ఆంధ్ర దేశపుటవసరములను తీర్చగలుగును. పెట్టుబడి సాధనములు ఆంధ్రదేశములో తగినంత లేవు. ఆంధ్రబ్యాంకు, ఆంధ్ర ఇన్సూరెన్సు

(భీమా) కంపెనీలు మాత్రమే ఇచ్చట చెప్పదగియున్నవి. ఉత్పత్తియైన వస్తువుల పంపకమునకు విపణులను మనమంతగా వెదకనక్కర లేదు. జీవితావసరములు సమృద్ధిగా దొరకని మన దేశము తనంత తానే వీటిని భుక్తపరచుకొనును. కొన్ని ముఖ్య పరిశ్రమలు.

(1) ధాన్యపుమరలు:—కృష్ణా గోదావరీనదుల కాలువలక్రింద వరిపంట యభివృద్ధియైనకొలదిని బియ్యపుమరలు దేశము నలుమూలల తలయెత్తినవి. వరంగలు జిల్లాలోను నిజామాబాదులో కూడ ఇవి యున్నవి.

(2) నేత పరిశ్రమ:—కృష్ణ, గుంటూరు, బళ్ళారి జిల్లాలలో ప్రత్తిపండును. ఆంధ్ర దేశమున చేనేత పరిశ్రమలేని చోటులేదు. గుంటూరు ఏలూరులలో నారమిల్లులు గలవు. వరంగలులోని ఆజంజాహి బట్టలమిల్లు సుప్రసిద్ధమైనది.

పట్టుబట్టల నేతకు తెలంగాణము పేరు మోసియున్నది. ఈ ప్రాంతమున ఆముదపుపంట యెక్కువ. ఆముదపాకులు పట్టుపురుగుల కాహారము. మట్టెవాడలోను మెదకుజిల్లా సంగారెడ్డి, సిద్ధిపేటలోను మహబూబునగరంజిల్లా నారాయణపేటలోను తయారగు పీతాంబరములు, పట్టుచీరలును మిగుల నాణ్యమైనవి. నిజామాబాదుజిల్లా ఆర్మూరులోను, ఆదిలాబాదుజిల్లా చెన్నూరులోను పొత్తుబట్టలు నేయబడుచున్నవి. వరంగలు తివాసీలు జంపుఖానాలు, మహబూబునగరం జిల్లా నాగర కర్నూలు అమరాబాదులలో నేయబడు కంబళ్లును ప్రసిద్ధి చెందినవి.

(3) పంచదార:—వరి తరువాత మన దేశమున ముఖ్యమైన మాగాణిపంట చెరకు. దీనినుండి బెల్లము, చక్కెర తీయబడుచున్నవి. చక్కెర మిల్లులు బొబ్బిలి, సామర్లకోట, వుయ్యూరులలోను నిజామాబాదుజిల్లా బోధనులోను ఉన్నవి.

(4) కాగితపు పరిశ్రమ:—ఆంధ్ర దేశపు టడవులలో వెదురు, కాగితము చేయుటకు పనికివచ్చు గడ్డియు దొరకును. రాజమండ్రి కాగితపు మిల్లులో విస్తారముగ కాగితము తయారగునని ఆశింపబడి

శక్తి కాని నిర్వాహణ లోపముచే నది సాగుట లేదు. ఆదిలాబాదుజిల్లా సిర్పూరువద్దనున్న కాగితపు కర్మాగారము మిక్కిలి పెద్దది. దీని ఉత్పత్తియు విస్తారము.

(5) లోహపరిశ్రమ:—బెజవాడలో స్టీముగోలింగు మిల్లులు పనిచేయుచున్నవి. మన దేశమునందు కమ్మరి, కంచరి, కంసాలి వృత్తులలో చాలమంది నియుక్తులై యున్నారు. ఇవి చాలవరకు గృహపరిశ్రమలు. రాజమహేంద్రవరమున అల్యూమినము పాత్రలు చేయుట విరివిగా సాగుచున్నది. ధవళేశ్వరమువద్ద ఇనుపసామానులు తయారగుచున్నవి. మెదకుజిల్లా సిద్ధిపేట రామాయంపేటలలోను, నిజామాబాదుజిల్లా సంగములోను, నల్లగొండజిల్లా పానుగల్లులోను ఇత్తడిపాత్రలు విస్తారముగా చేయబడును. కరీంనగరములో వెండి తీగ యల్లికపని నాణ్యముగా జరుగును.

(6) సిమెంటుపరిశ్రమ:—బెజవాడవద్ద మంగళగిరిలో సిమెంటు కర్మాగారముకలదు. బందరు నగరములో నెలకొల్పబడిన ఆంధ్ర సైంటిఫిక్ కంపెనీ (శాస్త్రపరికరముల నుత్పత్తిచేయు కర్మాగారము) విజయవంతముగ సాగుచున్నది.

(7) నౌకాపరిశ్రమ:—పూర్వకాలమున ఆంధ్ర నౌకలు జావా, సుమత్రా మొదలగు తూర్పుదీవులవరకును సింహళము, భరుకచ్ఛము, అరేబియా, రోము, గ్రీసులవరకును వెళ్లి వ్యాపారము చేసెడివి. మోటుపల్లి, కోరంగి, తాళ్లరేవు మొదలగు రేవులలో నౌకానిర్మాణము జరుగుచుండెడిది. బ్రిటిషువారి పరిపాలనాకాలమున ఈ పరిశ్రమ మూలబడినది. కాని రెండవ ప్రపంచ యుద్ధసమయమున భారతదేశములో నౌకానిర్మాణము ప్రోత్సహించుట వారి కవసరమనిపించెను. దీనికి కేంద్రముగ విశాఖపట్నము నిర్ణయింపబడుట ఆంధ్రదేశముయొక్క అదృష్టము. ఇచ్చట స్టీమర్లు నిర్మింపబడుచున్నవి. మధ్యపరగణాలయందలి రాయపూరుతో విశాఖపట్నమునుకలుపుచు రైలుమార్గము వేయబడినది. ఇందువలన ఈ రేవుపట్టణముయొక్క ప్రాముఖ్యము కడుంగడు హెచ్చినది.

(8) సినిమా పరిశ్రమ:—మిక్కిలి ఆధునికములైన పరిశ్రమ లలో నొకటియైన ఇది ఆంధ్రుల కళాజీవితమునకు ప్రతిబింబముగా నున్నది. దీనియందు పలువురు ప్రతిభావంతులు పనిచేయుచున్నారు. ఆంధ్రులలో నిరుద్యోగమును తొలగించుట కిది కొంతవరకు తోడ్పడుచున్నది.

రవాణాసౌకర్యములు:—దేశముయొక్క నాగరకతాభివృద్ధి రాకపోకల సౌకర్యములపై నెక్కువగా నాధారపడును. రాజమార్గ ములు లేనిచో వర్తకముసాగదు. రాచరికము నెరపుటయు దుర్ఘట మగును. ఇప్పటి రవాణా పద్ధతిలో రైలుమార్గములు గొప్ప ప్రాధా న్యము వహించియున్నవి. ఆంధ్రదేశపు తూర్పుతీరము పొడుగునను అయోమార్గము కలదు. ఇదిపెద్దలైను. తూర్పు సముద్రపు టొడ్డున నున్న మచిలీపట్టణమును పశ్చిమసముద్ర తీరముననున్న మార్మో గోవాతో కలుపు చిన్నలైను బెజవాడ గుంతకల్లులమీదుగా పోవుచు రాయలసీమజిల్లాలను సేవించుచున్నది. బెజవాడనుండి 'వాడి' పోవు రైలుమార్గము ఉత్తరసర్కారులను తెలంగాణముతో కలుపు చున్నది. మన్మాడునుంచి బెంగుళూరువైపు వేయబడిన చిన్నలైను తెలంగాణమును రాయలసీమతో చేర్చుచున్నది. నల్లగొండ జిల్లా మీదుగా తెలంగాణమును, పలనాటితో కలుపు రైలుబాట త్వర లోనే నిర్మాణమగునను ఆశ కలదు. మద్రాసునుండి ఢిల్లీకి పోవు గ్రాండు ట్రంకు రైలుమార్గము తెలంగాణములో కాజీపేట జంక్షను నుండి ఉత్తరాభిముఖముగ పోవుచున్నది. దోర్నకల్లునుండి క్రొత్త గూడెము బొగ్గుగనులకుపోవు చిట్టిమార్గము భద్రాద్రి కోదండరామ స్వామివారి సమీపమునకు గొనిపోవజాలియున్నది. ఆంధ్రదేశమునం దాయా ప్రాంతములను కలుపు చిన్నచిన్న మార్గములును కలవు. గోదావరి డెల్టాభూమిని రాజమహేంద్రవరముతో కలుపు అయో మార్గ మవసరమని తత్ప్రాంతీయులు తలతురు.

ఆంధ్రదేశపు రేవులు:—గోపాలపురమునుండి మద్రాసువరకు ఆంధ్రదేశపు సముద్రతీరము ఆరువందలమైళ్ళ పొడగున కలదు. కాని

సముద్ర మిచ్చుట ఒడ్డున లోతు లేకపోవుటచే పెద్దపెద్ద యోడలు తీరముదాకవచ్చి లంగరువేయజాలవు. విశాఖపట్టణము రేవొక్కటియే సహజమైన నౌకాశ్రయ లక్షణములు కలిగి గొప్ప వర్తక కేంద్రము కాగలిగియున్నది. మచిలీపట్టణము కాకినాడ రేవులలో మహానౌకలు ఒడ్డువరకును రాలేవు. అయినను ఈ రేవులుకూడ వర్తక సరళికి పేరువహించియున్నవి. విశాఖపట్నం జిల్లా తీరమున భీమునిపట్నము కళింగపట్నము రేవుస్థానములై యున్నవి. ఆంధ్ర దేశపు తీరమువరకైనను నౌకాయానమును ఆంధ్రులు నిర్వహించుకొనుట లాభదాయకము.

---

# ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి

## 6-వ ప్రకరణము

### (ఆంధ్ర దేశము - పూర్వకాలపు పేర్లు - మండలములు)

వర్తమానయుగమున మన దేశము నాంధ్ర దేశమనియు తెలుగు దేశమనియు వ్యవహరించుచున్నాము. వీనిలో ప్రధానముగ మూడుప్రాంతములుగలవు. సముద్రతీరపు జిల్లాలు, దత్తమండలము లేక రాయలసీమ, హైదరాబాదు రాష్ట్రిమందలి తెలంగాణపు జిల్లాలు. తీర ప్రాంతములోని యుత్తరజిల్లాలు ఉత్తరసర్కారులను పేర బరగుచున్నవి. [1]ఉత్తర సర్కారులనుపేరు మధ్యయుగమున ముసల్మాను పరిపాలకులచే పెట్టబడినది. ఆ కాలమున నీ జిల్లాలొక ప్రాంత పరిపాలనగానుండెను. ఈ మండలము సముద్రతీరమున వ్యాపించుటచే 'సాగరసీమ' యని పిలుచుట నేడు సముచితముగానుండును. గోదావరి జిల్లాలోని అమలాపురము తాలూకాకు కోనసీమ యనుపేరు పూర్వమునుండి నేటివరకును చెల్లుచున్నది.

---

1 దిట్టకవి నారాయణకవి తన 'రంగరాయచరిత్ర'లో ఉత్తర సర్కారులను పదము వాడియున్నారు. ప్రథమాశ్వాసము, 116వ పద్యము.

కోణముగ సముద్రములోనికి జొచ్చుకొనియుండుటవలన ఈ పేరు వచ్చెనని చెప్పుదురు.

తెలుగువారు నివసించు ప్రదేశమునకు ఆదికాలమునుండియు నెట్టి నామముగలదో తెలియదు. ఐతరేయ బ్రాహ్మణమునందలి శునశ్శేపుని కథలో ఆంధ్రజాతి పేర్కొనబడినది. కాని వారుండు దేశము పేరులేదు. అత్యంత ప్రాచీనయుగములో నీ భూభాగము అగ్నిపర్వతమయమై జనావాసమునకు అనువుగాకుండినట్లు తోచును. వేగి కేయీ పేరు చెల్లును. రామాయణ కాలమునం దీ జనపదము దండకారణ్యముచే నావరింపబడియుండెను. ఇక్ష్వాకు వంశీయుడగు శ్రీరామచంద్రుడు నడచిన దండకారణ్యపు పట్టులు కొన్ని ఆంధ్రదేశమునందుగలవు. అట్టివానిలో భద్రాచల సమీపమునందలి పర్ణశాలయొకటి. ఇక్కడ సీతారాములు కొంతకాలము వాసముచేసిరని యైతిహ్యముకలదు. శూర్పణక సోదరులైన ఖరదూషణాది రాక్షసులుండిన జనస్థానము పర్ణశాలకు సమీపమందేయుండెను. కావున నిదియు ఆంధ్రదేశభాగము కావచ్చును. మహాభారతములో నాంధ్రజాతి యుదహరింపబడినది. పౌండ్రులు ద్రవిడులు ఓఢ్ర కేరళులు 1 తాలవన(తలకడ్) ప్రాంతీయులు కళింగులు ఉష్ట్రకర్ణికులుఆంధ్రులు కలిపి పేర్కొనబడిరి. వీరిలో తాలవనవాసులు ఉష్ట్రకర్ణికులునుదప్ప మిగిలినవారు ప్రసిద్ధజాతులవారే. దీనినిబట్టి మహాభారతకాలమునకాంధ్రులు దక్షిణాపథవాసులనియు వారి నివాసభూమి యాంధ్రదేశమనియు చెప్పవచ్చును.

బౌద్ధ యుగములో నీ దేశమునకు మంజీర దేశమనియు, వజ్రదేశమనియు, నాగభూమి యనియు పేర్లు వినవచ్చుచున్నవి. మంజీర దేశ మిప్పటి తెలంగాణమునకు పర్యాయముగానుండి యుండును. నిజామాబాదు జిల్లాగుండా ప్రవహించు మంజీరనది వల

1 తాలవనప్రాంతము వంగదేశము కావచ్చును. ఇచ్చటి జనులు 'సుహ్మలు' అనబడు క్షత్రియజాతివారు. వీరు నౌకాయుద్ధకుశలురు. చూడు. రఘువంశము చతుర్థసర్గ, శ్లోకములు 34-36.

నసే ఈ దేశమున కీ నామధేయము కలిగియుండును. ఇది గోదావరి ఉపనది. దీనిని [1]వంజర యని కూడ పిలుచుచున్నారు. మంజీరికా దేశము కళింగదేశమునకు ముఖ్యపట్టణమైన దంతపురమునకు దక్షిణమున నున్నట్లు బౌద్ధ గ్రంథములు చెప్పుచున్నవి.

వజ్రదేశము :—ఆంధ్ర దేశమునకు వజ్రదేశమను వ్యవహారము కూడ బౌద్ధ జాతక గ్రంథములో గాన్పించుచున్నది. ధరణికోట (ధాన్యకటకము) కస్త్తరముననను, పరిటాలవద్దను, ప్రాచీనకాలము నుండియు వజ్రములు దొరకుచుండెను. బౌద్ధుల వ్రాతలలో బుద్ధుని దంతమును గుఱించి యనేక గాథలు గలవు. కళింగదేశపు రాజకుమార్తెయు, ఆమె భర్తయు బుద్ధభగవానుని దంతముగల పెట్టెను తీసికొని దంతపురమునుండి బయలుదేరి యోడనెక్కి సింహళమునకు ప్రయాణము చేయుచుండిరి. దారిలో వీరియోడ 'వజ్రాలదిన్నె'యను చోట మెరకనెక్కెను. ఈ 'వజ్రాలదిన్నె' ధాన్యకటకప్రాంతమని యూహింపబడినది. ఇచ్చట నాగరాజులు పాలించుచుండిరి. ధర్మాశోకుడను నాగరాజు వజ్రాలదిన్నెకడ ఒక దేవాలయము (అమరావతి స్తూపము కావచ్చును) నిర్మించుచుండెనని సింహళదేశపు గ్రంథములో వర్ణింపబడినది. వజ్రాల దిన్నెయనగా కృష్ణానదీ తటమని చెప్ప వీలగుచున్నది. ఆ కాలమున గోదావరి తూర్పున గల భూభాగము కళింగముగాను కృష్ణా గోదావరీనదుల యంతర్భూమియు కృష్ణకు దిగువనుండెడు దేశమును నెల్లూరు, గుత్తికందనోలుమండలములును, వజ్రభూమిగాను పరిగణింపబడెను.

నాగభూమి:—బౌద్ధుల గాథలలో ఆంధ్ర దేశము నాగభూమిగా కూడ వర్ణింపబడినది: గంగానదీ ముఖద్వారమునకును, సింహళద్వీపమునకును, నడుమనుండు ప్రదేశము నాగుల నివాసభూమిగానుండెను. నాగులు బుద్ధుని మతమందు భక్తి విశ్వాసములు గలిగి యుండిరి. నాగరాజు తథాగతుని పవిత్రమైన అస్థికలను సంపాదించి వానిపై

1 అనంతమాహాత్మ్యని భోజరాజీయములో వంజరనది యుదంతము కథగా వర్ణింపబడినది.

వజ్రాలదిన్నెకడ స్తూపము నిర్మించుచుండెను. ఇదియే అమరావతి— ధాన్యకటక ప్రాంతమై యుండును. ఈ నాగరాజు సింహళద్వీపాధిపతి యైన మేఘవర్ణునకు మిత్రుడని బౌద్ధకథలు వర్ణించుచున్నవి. నాగరాజుకడనున్న బుద్ధుని అస్థికల మంజూషికను మేఘవర్ణుడు యాచించెను. మొదట నాగరాజు యస్థులను ఇచ్చుటకు నిరాకరించెను. మేఘవర్ణు డాతనికి బుద్ధుని బొమికలను మరి కొన్నిటిని సమర్పించి తన కోరిన పవిత్ర శల్యములను బడసెనని చెప్పబడియున్నది. ఈ కథ యాంధ్రదేశమునకు సంబంధించినది. బౌద్ధయుగమున సింహళద్వీపమునకు నాగద్వీపమనియు, రత్నద్వీపమనియు పేళ్ళు.

త్రిలింగదేశము :—ఆంధ్రదేశమునకు పూర్వకాలమునుండి నేటివరకును చెల్లు సంకేతములలో తెలుంగుదేశము అనునది ముఖ్యమైనది. తెలుంగు శబ్దమునకు పూర్వరూపము త్రిలింగ, త్రికళింగ ములను వాదములు పండిత లోకమునగలవు. ఆంధ్రదేశము మూడు ప్రసిద్ధ శైవ క్షేత్రములచే పావనమైనదనియు, ఆ శివలింగములు శ్రీశైల, కాళేశ్వర, ద్రాక్షారామములందు నెలకొనియున్నవనియు ఇవియే [1] త్రిలింగ సంజ్ఞను ఈ దేశమునకు కలిగించినవనియు, కాకతీయ ప్రతాపరుద్ర చక్రవర్తి యాస్థానకవియైన విద్యానాథకవి తన ప్రతాపరుద్ర యశోభూషణములో నుడివెను. త్రిలింగ శబ్దము యొక్క వికృతి తెలుంగని వైయాకరణులు చెప్పెదరు. తెలుంగు అనురూపమే మొదటిదనియు, త్రిలింగ శబ్దము పండితులుచేసిన సంస్కృతీకరణమనియు [2] ఆధునిక విమర్శకులు తలంచుచున్నారు. త్రిలింగశబ్దము విద్యానాథునికన్న కడు ప్రాచీనమైనది. క్రీ. శ. 150

---

1. యైర్దేశ స్త్రిభిరేష యాతి మహతీం ఖ్యాతిం త్రిలింగాఖ్యయా,
   యేషాం కాకతి రాజకీర్తి విభవైః కైలాస శైలాః కృతాః,
   తే దేవాః ప్రసరత్ప్రసాద మధురా శ్రీశైల కాళేశ్వర,
   ద్రాక్షారామ నివాసినః ప్రతిదినం త్వచ్ఛ్రేయసే జాగ్రతు.

   ప్ర. రు. నాటక ప్రకరణము.

2. "లక్ష్మణరాయ వ్యాసావళి" కీ॥ లక్ష్మణరావు పంతులుగారు.

సంవత్సర ప్రాంతములందుండిన గ్రీకు భూగోళశాస్త్రజ్ఞుడు టాలెమీ తన గ్రంథమునందు 'టిలింగాఇ' అను పదము వాడియున్నాడు. ఇది త్రిలింగ శబ్దరూపమే యనుట నిర్వివాదము. అప్పటికే సంస్కృతీకరణమునొందిన 'తిలింగ' శబ్దము నాతడు వినియుండవచ్చును. బర్మాలో 'తలైంగు' అని పిలువబడు జాతిప్రజలు గలరు. వీరికిని తెలుగువారికిని సంబంధమేమైనగలదో తెలియదు. తలైంగు, తిలింగు శబ్దములు సంస్కృతములయి 'త్రిలింగ' అయి యుండును.

మరికొందఱు పరిశోధకులు త్రిలింగశబ్దము త్రికలింగ శబ్ద భవమని చెప్పుచున్నారు. [1] త్రికళింగ పదము శాసనములలో గాన్పించుచున్నది. గోదావరి తూర్పుతీరమునుండి మహానదివరకు గల దేశము పూర్వకాలమున కళింగముగా పరిగణింపబడుచుండెను. తెనాలి రామకృష్ణకవి తన పాండురంగ మాహాత్మ్యమునందు పీఠికాపురము కళింగ దేశాభరణమని వర్ణించెను. పీఠికాపురమనగా పిష్ఠపుర మనబడిన పిఠాపురము. ఇది గోదావరి కుత్తరమున నున్నది. కళింగము మూడు భాగములుగా నుండెను. మహేంద్రగిరినుండి విశాఖపట్టణముజిల్లా భీముని పట్టణమువరకు గల ప్రాంతము ఉత్తర కళింగము లేక ఉత్కళము. భీమునీ పట్టణము తాలూకాకు చెందిన భోగపురము మధ్యకళింగ దేశములోనిదని తూర్పు చాళుక్య వంశీయుడైన కొక్కిలివర్మ మహారాజు బొడ్డేరు శాసనములో చెప్పబడినది. గోదావరినుండి భీమునిపట్టణమువఱకుగల ప్రదేశము దక్షిణకళింగము. ఈ మూడు కళింగముల సమీకరణమే త్రికలింగము. త్రికలింగ శబ్దమునుండి ఉచ్చారణ వేగముచే 'క' కారము భ్రష్టమయి త్రిలింగ

1. గుణగవిజయాదిత్యుని సాతలూరు శాసనము.

'సన్దక్షిణాపథ స త్రికళింగ దేశ మన్వపాలయత్'

శబ్దము మిగిలిన దనుచున్నారు. ఇట్లేర్పడిన త్రిలింగ శబ్దము వాడు కలో నుండగా విద్యానాథుడో లేక ఆతనికి ముందుండిన సంస్కృత విద్వాంసులో వ్యుత్పత్తి చెప్పబోయి మూడు శివలింగముల నడిమి దేశమని యుక్తి యుక్తముగ అర్థసారస్యమును కల్పించియుందురు. మొత్తముమీద తిలింగ, తెలైంగు, రూపములే ప్రజలు వాడుకొనిన వనియు త్రిలింగరూపము పండిత కల్పితమనియు నొప్పుకొనవచ్చును.

పై మూడు శివక్షేత్రములలో నొక్కటగు శ్రీశైలము ప్రస్తుత కర్నూలు జిల్లాయందును, ద్రాక్షారామము లేక దాక్షారామము (దక్షప్రజాపతి ఆరామము) తూర్పుగోదావరిజిల్లా యందును, కాళే శ్వరము తెలంగాణమునందలి ఆదిలాబాదుజిల్లాలో గోదావరి ప్రాణ హిత సంగమస్థానమందును ఉన్నవి. ఇట్లు ఆంధ్ర దేశములోని ప్రసిద్ధ విభాగములయిన రాయలసీమ, సాగరసీమ, తెలంగాణములు మూడును తెలుగువారిపవిత్రమైనకాణాచియని సూచితమగుచున్నది. 'త్రిలింగశబ్దమునకు ప్రాతిపదకములుగా తోచుచున్న తిలింగ్ - తెలైంగ్ పదముల తొల్లింటి యర్థమేమైయుండును ?' అని విచారణ సేయుటకు ఆధారములు బొత్తిగాలేవు. ఇచ్చటఊహలుమాత్రమే మనకు శరణ్యము. ప్రాచీనకాలమునుండియు తిలింగ, కళింగజాతుల వారు సోదరజనులు. వీరొక్క కుదుటబుట్టినవారు. ఆచార వ్యవహా రములందును భాష యందును తిలింగ, కళింగు లొండొరులకు సన్ని హితులు. కళింగులకాపేరు సముద్రతీర భూములయందు నివసించిన వారగుటచే వచ్చియుండును. కళింగము అనగా అనూపము, జలమయ ప్రదేశము అను వాడుక ఇప్పటికిని కలదు. వీరికి వెనుక మెట్టదేశము నందు పీఠభూమియందుండినవారు (స్థల - తల - తలైంగు) తిలింగు జాతివారై యుందురు. [1] తిలింగులు జనసమృద్ధిగలవారై క్రమముగా

1. ఆచార్య శ్రీ కురుగంటి సీతారామయ్యగారిట్టి భావమునే వహించి యున్నారు. చూడు : ఆంధ్రుల విస్తరణము శాతవాహన సంచిక.

సముద్రతీరమువరకు వ్యాపించి కళింగులను గోదావరి కుత్తర దేశము నకు నెట్టగల్గిరి. కావుననే యాంధ్రదేశపు సాగర ప్రాంతమునకు కళింగ సంజ్ఞ చాలకాలమువరకు నిలచినది. భారతదేశమునుండి తూర్పుసముద్రదీవులకును, దేశములకును మొట్టమొదట వలసపోయిన సాహసికులు కళింగులు. ఆయా ప్రదేశములలో వీరు స్థిరనివాసము లేర్పరచుకొనిరి. వీరి తరువాత ఈ దూరదేశములకు వలసవెళ్లినవారు ఆంధ్రులు, తమిళులు. ప్రాథమిక వలస జనులు కళింగులగుటచే అనంతరము వచ్చిన వారినికూడ ప్రాచ్యదీవులయందలి జనులు కళింగులుగా భావించి వ్యవహరింప జొచ్చిరి. వీరు కళింగులను 'క్లింగు' లని పిలచిరి.

తెలుగుశబ్దము వలెనే తెనుగు అను పదముకూడ ఆంధ్రులను పేర్కొనుటలో ప్రాముఖ్యము వహించియున్నది. గ్రంథప్రయోగ మునుబట్టి చూచినచో తెలుగుపదముకన్న తెనుగుపదమే ప్రాచీన మనిపించును. వాగనుశాసనుడని కీర్తివడసిన నన్నయభట్టారకుడు తన ఆంధ్రమహాభారత పీఠికలో [1] తెనుఁగు అని ప్రయోగించి యున్నాడు. ఈ శబ్దమువలన నాంధ్రజాతి ప్రాచీన చరిత్ర యేమైన ప్రకాశితమగుచున్నదేమో కనుగొందము. తెలుగుశబ్దము త్రిలింగ శబ్దమునుండివలె తెనుగు పదము త్రినగ శబ్దభవమని పండితులు చెప్పుదురు. త్రినగములనగా మూడు పర్వతములు కాని ఇంతకన్న సహజమైన వ్యుత్పత్తి 'తెꠂ+అగు' అనునది. తెꠂ అనగా ద్రావిడ భాషయందు దక్షిణము అను అర్థమునిచ్చును. తెꠂ అగువారుదక్షిణ మునసుండినవారు లేక దక్షిణాభిముఖముగ సంచరించినవారు తెనగు వారు. ద్రావిడజాతికి చెందిన ఈ తెనగువారు మొట్టమొదట వింధ్య పర్వత పాదములందు నివసించుచు ఆర్యులైన యాంధ్రుల ఒత్తిడిచే

1. క॥ జననుత కృష్ణద్వైపా, యనముని వృషభాభిహిత మహాభారత బ
ద్ధ నిరూపితార్థ మేర్పడఁ, దెనుఁగున రచియింపు మధికధీయుక్తి మెయిన్॥
—మహాభారతము.

ఇంకను దక్షిణమునకు సర్దుకొనవలసినవారైరి. కావున వీరు దాక్షిణాత్యులు లేక తెనగువారు అని వ్యవహరింపబడియుందురు. తెనుగు పదమందలి 'న' కారము కాలాంతరమున 'ల' కారముగా మారినట్లు తోచును. లకార నకారములు రెండును దంతోచ్చారణము కలవియగుటచే ఈ మార్పు సహజముగ కలిగియుండును. కావున తెనగువారు తెలగవారి క్రింద మారిరి. తెలగాలు తెలంగాణము తెలగాణ్యులు (బ్రాహ్మణులలో నొక శాఖవారు) మొదలగు శబ్దములిట్లే పరిణమించియుండును. తెనుగోళ్ళు తెలుగోళ్ళువంటి జనవ్యవహారము తరుచు వినవచ్చుచునే యుండును.

వేఁగిదేశము :—తూరుపు కనుమలనుండి సముద్రమువఱకును కృష్ణా గోదావరులమధ్య వ్యాప్తమైయుండు తీర ప్రాంత దేశమునకు పూర్వము వేంగియను పేరు చెల్లుచుండెను. దీనిని దగ్ధరాష్ట్రమనియు జెప్పటకలదు. ఒకానొకప్పుడిది యరణ్యాక్రాంతమై జననివాసమునకు యోగ్యముగాకయుండగా నాయరణ్యమును దగులబెట్టి వాసయోగ్యముగ జేయబడుటవలన దీని కీ పేరు వచ్చియుండును. నన్నయభట్టారకుడు రాజమహేంద్రవరమును వేగిదేశమునకు నాయకమణియని భూషించెను. ఈ పేరు శాలంకాయన మహారాజుల కాలమునుండి తూర్పు చాళుక్యులవరకు తెలుగుదేశమునకు ముఖ్యపట్టణముగా నుండుచు వచ్చిన వేంగి నగరమునుండి పుట్టినది. సముద్రగుప్తుని అలహాబాదు శాసనములో నీ ప్రాంతము నేలినరాజును 'వైంగేయక హస్తివర్మ' యని వ్యవహరించిరి. వేంగి లేక వేంగి నగరము ఇప్పటి యేలూరు పట్టణమునకు సమీపముననుండెడిది. ఇది యిప్పుడు తొల్లింటి వైభవమును గోల్పోయి చిన్నపల్లెగా మాత్రము నిల్చినది. పెదవేగి చినవేగి అను కుగ్రామములే దీని యవశేషములు. ఇచ్చట భూగర్భమునందు త్రవ్వినచో ప్రాచీన శిథిలములు కానవచ్చునని చెప్పుదురు. ఏలూరు రైల్వేస్టేషనుకు తర్వాతనున్న దెందులూరుకూడ పూర్వకాలమున చరిత్రప్రసిద్ధివహించినదియే. ఇది విష్ణుకుండిన వంశీయులైన రాజులకు ముఖ్యనగరముగానుండెను. కృష్ణా

గోదావరీనదుల నడుమనున్న దేశమే వేగిదేశము. వేంగి నగర మునకు సమీపమందు మంచినీళ్ల జలాశయమొకటి కడుపెద్దది కలదు. దీనిని కొల్లేరు సరస్సు అందురు. ఇది జల పక్షులకు నిలయమై మిక్కిలి విస్తీర్ణముగలదై రమ్యముగా నుండును.

ఆంధ్ర దేశము - మండలములు, విషయములు:—ఈనాడు జిల్లాలు తాలూకాలవలెనే పూర్వకాలమున ఈ దేశము పరిపాలనా సౌకర్యమునకై రాష్ట్రము విషయము అహారము నాడు మొదలగు విభాగములు కలిగియుండెను. వీని సరిహద్దులను నేడు నికరముగ గుర్తింప వీలుకాదు. వానివాని ముఖ్యపట్టణముల పేర నివి పిలువబడు చుండినట్లు కాన్పించును. సాతవాహనుల కాలమున అహారము లను మాండలక సంజ్ఞ లుండెను. [1]గోవర్ధనాహార [2]మామలాహార [3]సాతవాహనాహారములు శాసనములలో పేర్కొనబడినవి. గోవర్ధననగరము (ఇది మహారాష్ట్ర దేశమందున్నది) కేంద్రస్థాన ముగాగలది గోవర్ధనాహారము. సాతవాహనాహారము బళ్ళారిజిల్లా ఆదోని తాలూకాకు సరిపడును. ఇది సాతవాహనుల జన్మమండల మని కొందఱు పరిశోధకులు తలచుచున్నారు. బృహత్ఫలాయన జయ వర్మ మహారాజు కొండముదిశాసనములో 'కూడూరహారము'నందలి పాంటూరగ్రామము దానముగా నొసగబడినది. కూడూరహారము ప్రస్తుతపు బందరు ప్రాంతమునకు వర్తించును. 'పథము' అనునది మరి యొక విభాగము. పైఠనపథము దీని కుదాహరణము. పథము అను సంజ్ఞ మండలముకన్న సువిస్తీర్ణమైన దేశభాగమునకుకూడ వాడబడి నది. 'దక్షిణాపథము' వింధ్యకు దక్షిణముననున్న విస్తృత దేశమును సూచించును. శివస్కందవర్మ పల్లవుని మైదవోలు శాసనములో ఆంధ్ర దేశమును 'అంధపథము' అని వ్యవహరించిరి. రాష్ట్రము అను విభాగము అల్లూరు శాసనమునందు పేర్కొనబడినది. అమరావతీ

1—2. వాసిష్ఠీపుత్ర పులమావి నాసిక కార్లీ శాసనములు.
3. శ్రీ పులమావి మ్యాకదోని శాసనము.

శాసనములలో నొకటి పూగిరాష్ట్రము నుదహరించినది. ఇది యనంతరమున పాకనాడుగా కనవచ్చును. ఇక్ష్వాకువంశీయుడైన వీరపురుషదత్తుని జగ్గయ్యపేట శాసనమునందు 'కర్మరాష్ట్ర' నివాసియైన యొకదాత ప్రశంసవచ్చినది. ఇది ప్రస్తుత గుంటూరు మండలమునకు చెల్లును. ప్రస్తుత కడప మండలమునందలి జమ్మలమడక తాలూకా కానాడు 'హిరణ్యరాష్ట్రము' అనిపేరు. [1]"క్రీ. శ. ప్రారంభశతాబ్దములందు కృష్ణకు దక్షిణమున తూర్పు సముద్రతీరమునుండి పశ్చిమమున కోలారు మండలమువరకుగల దేశము ఆంధ్రపథమనుపేర బరగుచుండెను. మనకు దెలిసినంతవరకిది నాలుగు రాష్ట్రములుగ విభజింపబడియుండెను. ౧. తూర్పున కర్మరాష్ట్రము. ౨. దానికి పశ్చిమమున హిరణ్యరాష్ట్రము. 3. దానికి బడమట కన్నాడు. ౪. కడపట నిప్పటి బళ్ళారి ప్రాంతమున సాతవాహన రాష్ట్రము."

మధ్యయుగమునందు స్థానిక విభాగములలో 'నాడు' అను సంజ్ఞ సర్వసామాన్యము. ఇట్టివానిలో వేగినాడు, వెలనాడు, పాకనాడు, పల్నాడు, (పల్లవనాడు) మొదలైనవి ప్రసిద్ధములు. తూర్పు సముద్రమునకును కనుమలకును కృష్ణా గోదావరీనదులకును మధ్యనున్న ప్రాంతము వేగినాడు. గుంటూరు మండలములోని చందవోలు ప్రాంతము వెలనాడన బరగినది. వెలనాటి చోడులక్కడ పరిపాలన చేసిరి. గుంటూరునుండి మన్నేరు వరకును వ్యాప్తమైన దేశమునకు కమ్మనాడనిపేరు. మన్నేరునుండి పెన్నవరకునుగల ప్రాంతము పాకనా డనబడుచుండెను. పల్లవుల జన్మస్థానమైన విభాగము పల్లవనాడు లేక పల్నాడు. ఆంధ్రవైదిక బ్రాహ్మణులలో వేగినాటి వెలనాటి ములకనాటి కాపలనాటి శాఖలవారుగలరు. (ములకలు అనువారు మెదకు జిల్లా బ్రాహ్మణేతరులందునుగలరు.) వీరు ఆయా నాడులలో మొదట నివసించినవారగుటచే వారి శాఖల కా సంజ్ఞలు కలిగినవి. ములకనాటి వారిని అజ్ఞతచే మురికినాటివారని లోకము

1. " ఆంధ్రులు - చరిత్ర " డాక్టరు యన్. వెంకటరమణయ్యగారు, ఆంధ్రసారస్వత పరిషత్తు ప్రచురణ, హైదరాబాదు.

వ్యవహరించుచున్నది. ములకనాడనునది మిక్కిలి ప్రాచీనమైన దేశవిభాగముగా గోచరించును. గౌతమీపుత్ర శాతకర్ణి జయించిన రాష్ట్రములలో ములకదేశముకలదు. ఇది పైఠను ప్రాంతమునకు వర్తించుచునని చారిత్రికులు తెలుచుచున్నారు. కాని తరువాతికాలమున నీ పేరిప్పటి కడపజిల్లాలో కొంతభాగమునకు చెల్లుచువచ్చినది. [1]కాసలనాడు తెలంగాణములోని పటంచెరువు (పొట్లచెఱువు) పరిసరములు కావచ్చును. ఆంధ్రనియోగి బ్రాహ్మణులలోకూడ పూర్వము నాడు విభాగము లుండినట్లు తోచును. మహాకవి శ్రీనాథుడు 'పాక నాటింటివాడవు' అని సంబోధింపబడెను. నియోగులలో మిక్కిలి ప్రాచుర్యముగల ఆరువేల శాఖవారు ఆరువేలనాడునకు చెందినవారు. ఈ యారువేలనాడు వెలనాడునకు నామాంతరము–వెలనాడాఱువేల గ్రామముల పరిమితిగలదగుటవలన దీని కాపేరు కలిగినది. దీనికి సంస్కృత నామము [2]షట్సహస్రదేశము. కృష్ణానదికి దక్షిణ ప్రాంతము ఆరువేలనాడుగా వ్యవహరింపబడుచుండెను.

తెలంగాణమునందలి ప్రాచీన మాండలిక సీమలు అస్పష్టముగా తెలియవచ్చును. విజయవాడకు పశ్చిమమున మధిరప్రాంతము నతవాటిసీమయన బరగుచుండెను. దీనికి పశ్చిమమున [3]కొలఅవి సీమ. ఇది ఇప్పటి డోర్నకల్లు మానుకోట పరిసరదేశము. కొలఅవికి పడమట అనుమకొండ విషయము. ఇప్పటి కరీంనగరు జిల్లాకు ఆనాడు సబ్బిసాయిరమండలము, సబ్బినాటి మండలము అనుపేర్లు చెల్లుచుండెను. పద్మపురాణోత్తరఖండమును వ్రాసిన మడికి సింగనకవికి ఒకానొక

1. పొన్నికంటి తెలగన 'యయాతి చరిత్ర' ప్రథమాశ్వాసము 31 పద్యము.

2. 'ఆంధ్రుల చరిత్ర' ప్రథమభాగము 15_వ ప్రకరణము.

3. కొలఅవిగ్రామము మానుకోటకు సమీపముననున్నది. ఇచ్చటి దైవము శ్రీ వీరభద్రస్వామి, కొలఅవిలో స్వామివారి జాతర పెద్ద పెట్టున సాగును. కొలఅవి శాసనము కొఱకు చూడు: తెలంగాణా శాసన సంపుటము, శ్రీ లక్ష్మణరాయ పరిశోధకమండలి, హైదరాబాదు.

కందనమంత్రి యాశ్రయమిచ్చెను. కందనమంత్రి నేలినరాజు ముప్ప భూపాలుడు. ఈ ప్రభువు గౌతమికి దక్షిణముననున్న సబ్బినాటి మండలము నేలెనని చెప్పబడినది. ముప్పభూపాలుని రాజధాని నగరము 'రామగిరి'. ఇది ములుగు తాలుకాలోనున్న రామప్ప దేవాలయ సమీపమందుండిన పూర్వపట్టణము. ఈ నగర మిప్పుడు నశించినది. దీనిస్థలమున [1]పాలంపేట యను గ్రామము కలదు. ఇప్పటి మెదకుజిల్లాను పూర్వము మెతుకుసీమ యనుచుండిరి. ఇచ్చట వరి పంట పుష్కలము. అన్న సమృద్ధిగల మండలమగుటచే దీని కీపేరు వచ్చెనేమో. నిజామాబాదుజిల్లా బౌద్ధయుగమున మంజీరికా దేశమన బరగుచుండెను. శాతవాహనుల కాలమున దీనికి 'అశ్మక' దేశమను వ్యవహారముగానవచ్చును. దీని ముఖ్యపట్టణము 'పోతన' నగరము. ఇది ఇప్పటి 'బోధను' అను నగరము. గౌతమీపుత్ర శాతకర్ణి జయించిన దేశములలో మూలక అశ్మక రాష్ట్రములు గలవు.

---

# ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి

## 7-వ ప్రకరణము

## ఆంధ్ర ప్రజానీకము

'ఏఱుల జన్మంబు నెఱుగనగునె' నదీమతల్లుల పుట్టుపూర్వోత్తరములవలెనే జాతుల యుత్పత్తి వృత్తాంతములుగూడ సమగ్రముగ తెలియరావు. ఏయొక్కజాతియు, అది పుట్టినప్పటినుండి నేటివరకును అన్యజాతి సంపర్కము సమ్మిశ్రణము పొందక విశుద్ధముగా జీవించిన దని చెప్పుట పొసగదు. కావున జాతి సంస్కృతికూడ ఇంద్రధనుస్సు వలె బహువర్ణ సమీకరణముచే నేర్పడుచున్నది కాని రంగులపెట్టె యందలి వేర్వేరు రంగు కణికలవంటిదికాదు. ఈ సూత్రము ఆంధ్ర జాతికిని వర్తించును. ఆయా చరిత్ర యుగములందు భిన్నభిన్న ప్రజలు

---

1. పాలంపేట శాసనము, హైదరాబాదు ప్రభుత్వ ప్రచురణము.

ఆంధ్ర దేశములో ప్రవేశించి అంతకుముందిచ్చటనున్న జనానీకముతో కలిసిపోయి, నేటి తెలుగుజాతి యేర్పడినది.

వర్తమానాంధ్ర జాతియొక్క శారీరకమును, ఆచార వ్యవహారములను, భాషను పరిశీలించిన యీ యంశము ధ్రువపడును. మన ప్రజలలో ఆజానుబాహువులును, పొట్టివారును, దబ్బపండు చాయగలవారును, నల్లని నలుపురంగు గలవారును, భిన్న ప్రాంతములలోనేకాక ఒకే మండలమునందును, ఒకే కుటుంబమునందునుగూడ కనవత్తురు. పల్నాటివారు సమున్నత విగ్రహులు. సాగరసీమవాసులు పల్చని అంగయష్టిగలవారు. తెలంగాణవాసులు ఎక్కువ పొడగరులుకాని పొట్టివారుగాని కాకుందురు. మనవారి ఆచార వ్యవహారములను దిలకించినచో, విభిన్న సంప్రదాయములు సమన్వయము నొందినట్లు తెలును. ఉదాహరణకు వివాహకాండను పరికించినచో ఆర్యపద్ధతులు బ్రాహ్మణులయందును, అనార్యాచారములు ఇతర వర్ణములందును కాననగును. పాణిగ్రహణము, సప్తపదివంటివి వివాహమునందు ఆర్యులమార్గములు. మంగళసూత్రధారణము [1]ఐరేణికుండలు తెచ్చుట, క్రంతనడుపుట మొదలగునవి దేశీయాచార విశేషములు. సంస్కృత ప్రాకృత దేశభాషా పదములు చక్కగా కలిసి, ఆంధ్ర భాషగా పరిణమించినవి. ఇట్లాంధ్రజాతిలో సమ్మేళనము పొందిన కొందఱు జనులనుగూర్చి తెలిసికొందము.

ఆంధ్ర దేశమునందు మిక్కిలి ప్రాచీనకాలమున నివసించిన జనులనుగూర్చి కొన్ని విశేషములు తెలిసికొనుటకు [2]'కెయిరనులు' మనకు సహాయపడుచున్నవి. కెయిరనులనగా పూర్వకాలపు సమాధులు. భూగర్భమును త్రవ్వుటవలన ఇవి బయల్పడుచుండును. కెయి

1. మాదయగారి మల్లన్న రాజశేఖర చరిత్ర మూడవ ఆశ్వాసము 175 వ పద్యమున నీ యాచారము పేర్కొనబడినది. ఇదిగాక "ఐరేణికుండకు అంచులు లేవు-అల్లునకు పెదిమెలులేవు" అని యొక హాస్యపు సామెత లోకమునం దున్నది.

2. చూడు శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారు గోల్కొండ పత్రికలో ప్రకటించిన వ్యాసరాజము.

రనులు ఆంధ్రదేశమునందు పెక్కు తావులందు గానవచ్చుచున్నవి. రాయలసీమయందును, తెలంగాణముననూ, తండోపతండములుగా నున్నవి. ఇవి మెట్ట, గుట్ట, మొరము గల ప్రదేశములలో జననివాసములకు సమీపమునందు కట్టబడినవి. ప్రాచీన ఖనన పద్ధతి ఏమనగా, ఒక పెద్దగోయితీసి అందు రాతి పలకలతో చిన్న గృహామువలె నిర్మించి, దానిలో మృతకళేబరమునుంతురు. వారివారి మత విశ్వాసముల కనుగుణముగ, వస్తుసామగ్రిని సమాధిలోనుంచి, దానిని మట్టితో పూడ్చివేయుదురు. సమాధి చుట్టును వలయాకారముగ పెద్ద పెద్ద బండరాళ్ళను పేర్చుదురు. వీటినిజూచి జనులు ఆశ్చర్యపడి, వీనికి రాక్షసగుళ్ళు అని పేరు పెట్టిరి. బేగంపేట, బాలానగరు, మౌలాలి, రాయగిరి, మానుకోట, డోర్నకల్లు, చింతకాణి, మధిర ప్రాంతములందు కెయిరనులు కనబడినవి. ఈనాటి రైలుబాట వెంబడినే ఈ సమాధులు కాన్పించు టొక విశేషము. అత్యంత పూర్వకాలమునగూడ జనపదములీ త్రోవనంటియే యుండెననుట కిది యొక నిదర్శనము: భూమిలోకట్టిన రాతిగృహములో శవమునుంచి, చనిపోయినవానిపరలోకయాత్ర సుఖవంతముగానుండుటకై బంధువులును,మిత్రులును కానుకలు సమర్పించుచుండిరి. ప్రతి కెయిరనునందును,వివిధ పరిణామములుగల కుండలు కనిపించినవి. ఆకుండలపై కొన్ని సంకేత చిహ్నములుగలవు. ఇట్టి చిహ్నములు మొహెంజోలోను అత్యంత ప్రాచీననాణెములమీదనుకనబడుచున్నవి. ఈరకము చిహ్నములుగల కుండలు, రాయగిరిలో దొరకినవి. కెయిరనులలో తూర్పున గొడ్డలి, పడమట మంటిపాత్ర, ఉత్తరమున రాగిగిన్నె, దక్షిణమున కుండలు ఉంచుచుండిరి. మౌలాలి కెయిరనులలో అందమైన కత్తి దొరికినది. ఇందలి మృతపురుషుడు వీరుడై యుండవచ్చును. డోర్నకల్లు సమాధిలో కొడవలి దొరికినది. ఇతడు కృషీవలుడై యుండును. రాయగిరిలో జపమాలలు అస్థులు కాన్పించినవి.

కెయిరనులనుబట్టి మనకు తెలియవచ్చు నంశము లేవనగా రెండు మూడువేల సంవత్సరములకు పూర్వకాలమునందే తెలంగాణ

మున నాగరకత నెరిగిన జనులుండిరి. అప్పటి మనుష్యులు అయిదు న్నర ఆరడుగుల పొడవుగలవారు. వీరు స్థిరనివాసముగలవారై వ్యవసాయము మొదలగు శాంతవృత్తుల నవలంబించి యుండిరి. వారిలో నేర్పరులైన కమ్మరులును కుమ్మరులును ఉండిరి. వారు చక్కని పనిముట్లను చేయుచుండిరి. ఆకాలపు శిల్పులు పెద్ద పెద్ద బండరాళ్ళను మలచు కౌశల్యము గలిగియుండిరి. వీరికి పునర్జన్మము నందు నమ్మకమున్నట్లు తోచును. జల సమృద్ధియు తృణకాష్ఠ సమృద్ధియు కలిగిన ప్రదేశములనే వీరు గ్రామ నిర్మాణమునకు స్థానము లుగా చేపట్టుటచూడ, వీరు నాగరకతయందు అభ్యున్నతిని పొందిన వారనియే చెప్పవలయును. ఎచ్చట వీరు ప్రాచీన కాలమున గ్రామ ములు నిర్మించిరో, అచ్చటనే నేటికిని పల్లెలు ఊళ్ళు వెలయుచుండుట వీరి వాస్తు పరిజ్ఞానమునకు చక్కని తార్కాణమని చెప్పవలెను.

ఆంధ్రులు :—వీరికి [1]'అంధ్రులు' అని కూడ వ్యవహార మున్నది. ఇట్టి జనుల ప్రశంస మొదటిసారి ఐతరేయ బ్రాహ్మణము నందు హరిశ్చంద్రుడు, శునశ్శేపుడు, విశ్వామిత్రుడు వీరి వృత్తాంత ములలో గాన్పించుచున్నది. ఈగ్రంథము ఋగ్వేదమునకుసంబంధించి నది. దీని కాలము క్రీ. పూ. 1000 సంవత్సరముల మాటకావచ్చునని పండితు లూహించుచున్నారు. అనగా నిప్పటికి మూడువేల వర్షముల నాడే యాంధ్రులనువా రుండిరి. విశ్వామిత్రమహర్షి తన కుమారులలో ఏబదిమందిని,తనయాజ్ఞ మీరినందున కోపగించి శపించెననియు,వారు ఆంధ్రపుండ్ర పుళింద మూతిబ శబరజాతుల వారైరనియు, 'ఐతరేయ బ్రాహ్మణము' వాకొనుచున్నది. వీరేదేశమునందు నివసించిరో యా బ్రాహ్మణము చెప్పుటలేదు. [2]వాయుపురాణమునందు ఆంధ్రులను

1. 'ఆంధ్రుల-చరిత్ర' డాక్టరు యన్. వి. రమణయ్యగారు.

2. 'అంధ్ర' శబ్దమే పరిణామవశమున శుభప్రదమైన 'ఆంధ్ర' శబ్ద మిట్టిది కాదనియు శ్రీ భావరాజు వెంకటకృష్ణారావు పంతులుగారు చెప్పుచున్నారు.

వారు తుషారజాతితోఁ కలిసి, 'అక్షు' నదీతీరమునందు వసించినట్లు చెప్పబడినది. అక్షునదియనగా ఆక్ససునది. ఇది హిందూకుషుపర్వత శ్రేణి కవతలనున్నది. దీనినిబట్టి యాంధ్రులు తదితర ఆర్యులవలెనే మధ్య ఆసియా ప్రాంతవాసులై భారతదేశమును ప్రవేశించిరని చెప్ప వీలుపడుచున్నది.

శ్రీమద్రామాయణ కథనమునుబట్టి విశ్వామిత్రుడు తన పుత్రులను శపించినప్పుడు పుష్కరక్షేత్రమున తపస్సుచేయుచున్నట్లు తెలియుచున్నది. పుష్కరక్షేత్రము రాజపుత్ర స్థానమందలి అజ్మీరు సమీపమునందుండినట్లు 'రాప్సను' పండితుడూహించెను. దీనినిప్పుడు 'పోఖారా' యని యనుచున్నారు. అట్లు శప్తులైన యాంధ్రులు తూర్పునకును దక్షిణమునకును తరలి వ్యాపించిరి. ఆంధ్రగణముల వారు కొందఱు కరూశదేశమును ప్రవేశించిరి. చాణూరుడను జగజెట్టియైన మల్లుడు కరూశదేశమువాడు. ఈత డాంధ్రుడని హరివంశము చెప్పుచున్నది. ఈ చాణూరుడు కంసునిచే ప్రేరితుడై శ్రీకృష్ణునితో మల్లయుద్ధముచేసి చంపబడెను. అనార్య జాతులవారైన పుండ్ర పుళింద శబరజాతులవారు వింధ్యపర్వత ప్రాంతములనుండిరి. వీరితో కలిపి యాంధ్రులు పేర్కొనబడిరి. విశ్వామిత్ర సంతతివారగుటచే నాంధ్రులు క్షత్రియ జాతివారని యూహింపవచ్చును. ఆర్యక్షత్రియులైన వీరు అనార్య సంబంధముచేతను అనార్యాచారము లవలంబించుటచేతను ఆర్యులచే గర్హింపబడి యనార్యులతో చేర్చబడిరని చెప్పవచ్చును. ఇదియే విశ్వామిత్రమహర్షి శాపమున కర్థమని చెప్పవచ్చును. స్వసంఘమునుండి వెలిబెట్టబడిన వారైనను ఆంధ్రులు ఉత్సాహశీలురును వీరులును అగుటచే సంతతితో నశించలేదు. ఆయుధజీవులైన వీరు వింధ్య దక్షిణదేశములకు వ్యాపించి తమకు ముందచ్చట నివసించుజనులతో నైక్యమునొందిరి. చివరకు వీరు గోదావరీకృష్ణానదుల మధ్యదేశమునందు స్థిరనివాసమేర్పరచుకొని, రాజ్యములు స్థాపించిరి. ఆంధ్రు లీ ప్రాచీనకాలమున మాటలాడిన భాష యొకానొక ప్రాకృతమై యుండును. ఆంధ్రజాతిలోనొక గణము

వారైన శాతవాహనుల శాసనములన్నియు ప్రాకృతములో వ్రాయ బడినవి. వారు పోషించిన వాఙ్మయముకూడ ప్రాకృతమునందున్నది. కాలముగడచిన కొలదియు ఆంధ్రులు ప్రాకృతమునువీడి తెలుగును మాటాడజొచ్చిరి. ఇట్లు వీరు తెలుగువారిలో కలసిపోయిరి.

పుళిందులు:— ఐతరేయ బ్రాహ్మణమునందు పుళిందులు ఆంధ్రులతో కలిపి పేర్కొనబడిరి. అశోకుని శాసనములందుకూడ 'ఆంధ్ర పుళింద దేషు' అని యీ రెండు తెగల జనులనుగూర్చి ప్రశంసింప బడినది.

శబరులు:— శబరజాతిజను లార్య సహవాసముచే గాబోలు పూర్వకాలముననే నాగరికత గలవారుగా నుండిరి. వీరి మంత్రతంత్ర విద్యను, ఆర్యులు మన్నించి స్వీకరించిరి. శాబరమంత్ర ముల ప్రసిద్ధి ప్రాచీన సంస్కృత సారస్వతములో కనబడును. గోదా వరికి ఉపనదియైన శబరికి ఆపేరు వీరివలన వచ్చియుండును. శబరులు సంచారశీలురుగ నుండక, పూర్వకాలముననే స్థిరనివాసములు గల వారై రాజ్యములు స్థాపించి మంచిదశలోనున్నట్లు కాన్పించును. కళింగదేశములో గంగవంశమును స్థాపించిన కామార్ణవుడు (క్రీ. శ. 730) శబరాదిత్యుడనురాజు నోడించి, రాజ్యము నాక్రమించినట్లు 'కొర్ని' శాసనములో కలదు.

ప్రాచీన శబరుల సంతతివారే ఇప్పటి సవరజాతిజనులు. వీరు గంజాం విశాఖపట్టణ మండలములలో నిప్పటికిని గలరు. సవరలు కూడ మంత్రతంత్రములకు ప్రసిద్ధిచెందిరి. వైద్యమునకును ఓషధుల కును సంబంధించిన విజ్ఞానము వీరిలో నిప్పటికిని ఉన్నది. ఎక్కడ బావులు త్రవ్విన నీరు పుష్కలముగా పడునో సవరలు బాగుగా నెరుగుదురు. వీరికి అధ్యాత్మ విషయములలోకూడ కొంత జ్ఞానము కలదు. సవరల వివాహ నియమములు ఆర్యాచారములకు భిన్న ముగా నున్నవి. వీరిలో ప్రేమించి వివాహముచేసికొనుటగలదు. విధవా వివాహము, దేవరన్యాయము, కన్యాశుల్కము, విడాకు లిచ్చుట వీరి యాచారములు.

ద్రావిడులు:—ఆర్యులు హిందూదేశమునకు రాకపూర్వము ద్రావిడజాతుల వారీదేశములో వ్యాపించియుండిరని పరిశోధకులు తలచుచున్నారు. ఋగ్వేదాదిగ్రంథములందు ఆర్యులకంటె భిన్నులైన జనులు కొందరుండినట్లు వర్ణనలుగలవు. ఆర్యులు వీరిని దస్యులనియు 'అయజ్యులు' (యజ్ఞాదికర్మలు చేయనివారు) అనియు పిల్చుచుండిరి. దస్యులుగాను, వికృతాకారులుగాను, నల్లని మేనిరంగు గలవారుగాను, నిరసింపబడిన వీరు ద్రావిడజాతులవారు కావచ్చును. ఆర్యేతరులైన వీరు నాగరకతగలవారై, బలవంతులైనట్లు ఋగ్వేదమే సాక్ష్యమిచ్చుచున్నది. ఈ యనార్యులకు సైన్యములును, కోటలును ఉండెడివి. ఋగ్వేదమునందు గొప్ప ప్రశస్తినహించిన దాశరాజ యుద్ధములో పదిమంది యనార్యరాజు లొకసమితిగా నేర్పడి, సుదాసుడను ఆర్య రాజన్యునితో సంగర మొనర్చిరి. వీరికి యుద్ధతంత్రము, వ్యూహజ్ఞానము కూడ ఉండినట్లు తోచును. ఆర్యులు బలవత్తరులై విజృంభించిన కొలదిని ద్రావిడజాతులవారు, భారతదేశముయొక్క తూర్పు, దక్షిణ భాగములకు తరలవలసిన వారైరి. ద్రావిడులనగా (దు-గతౌ అను ధాతువువలన) తరుముబడిన వారనియు, పరశురామునిచే ఓడి, పారిపోయిన క్షత్రియజాతివారే ద్రావిడులనియు, మహాభారతములో చెప్పబడినది. వీరు అనార్యుల నడుమను వానరుల నడుమను నివసించుచు, వర్ణాశ్రమధర్మమును విడుచుటచే, మ్లేచ్ఛులైరని భారతమున సూచింపబడినది. ఏ దేశమునందు వర్ణాశ్రమధర్మవ్యవస్థ నెలకొనదో, ఆ దేశము మ్లేచ్ఛదేశమని బోధాయనుడు, మనువు, మొదలగు ధర్మశాస్త్రకారులు విధించియున్నారు.

ఆంధ్రము, కన్నడము, తమిళము, మలయాళము, తులు మున్నగు భాషలను ద్రావిడభాషలని విజ్ఞులు చెప్పుచున్నారు. ఇంతకుముందు తెనుగు శబ్దవిచారము చేయుచున్నప్పుడు, దక్షిణ దిక్కుగా నివసించినవారు తెనుగువారని చెప్పనైనది. తెనుగువారు

[1]ద్రావిడజాతి జనులని యూహింపనగుచున్నది. ఆర్యజాతివారైన యాంధ్రులు తెనుగువారిని మొదట జయించి, వింధ్యదక్షిణ ప్రాంతములకు తరిమినను ఈ యుభయజాతులును ఏకమై ప్రస్తుతపు ఆంధ్ర-తెనుగు ప్రజానీక మేర్పడినది. వీరిభాషలు పెనవేసికొనిపోయి నేటి ఆంధ్ర-తెలుగుభాషగా పరిణమించినవి.

యక్షులు:—కసియాఖండ మధ్యపీఠభూములలో నివసించు పసిమిరంగు జాతులవారు (Yellow races) త్రివిష్టపము నేపాలు నడుమ గల పర్వతమార్గములగుండ భారత దేశము ప్రవేశించిరి. వీరు మొదట గంగానదీతీరభూముల నాక్రమించి, తరువాత తామ్రలిప్తి రేవునుండి వెడలి, దక్షిణహిందూదేశమునకు వచ్చిచేరి, యిచ్చటి ప్రజలలో కలిసిపోయిరి. ఆంధ్రదేశములో [2]జక్కులనబడు తెగవారు ఈ యక్షజనుల సంతతివారు కావచ్చును. వల్లభరాయని క్రీడాభిరామములో జక్కుల పడతి వర్ణింపబడినది. జక్కులు ప్రాకృత నాటకము లాడించుటలో నేర్పరులు. యక్షగానములు వీరినాటక సంప్రదాయము కావచ్చును.

నాగులు:—ఆంధ్రదేశమున ప్రాచీనకాలమునందు నివసించిన జనులలో నాగులు ముఖ్యులు. ఈ దేశమునకు నాగభూమియని పేరు వీరివలననే కలిగియుండును. నాగరాజు, కృష్ణాతీరమున రాజ్యపాలనము చేసినట్లు బౌద్ధగాథలు తెలుపుచున్నవి. వీరు సర్పములను పూజించుటచేత నాగులనబడియుందురు. ఈ జాతి

---

1. ద్రావిడులు ఆర్యులకంటె భిన్నులు కారనియు ద్రావిడ శబ్దముయొక్క పూర్వరూపము 'ధ్రమిళ' యనియు, ఇది ప్రాకృతపదమనియు, ధ్రమిళ అనగా ధర్మమును–అనగా బుద్ధధర్మమును–అవలంబించినదేశమనియు ధమిళపదమునుండియే ద్రమిళ ద్రవిడ శబ్దములు పుట్టినవనియు డా. చిలుకూరి నారాయణరావుగారు వ్యుత్పత్తి చెప్పుచున్నారు.

2. తెలంగాణమునందు జక్కులవాళ్లు, పంబళ్లు, (బైండ్లవారు), పోతరాజువాండ్రు మొదలగు తెగలవారు కలరు. గ్రామదేవతల పూజయందు వీరికి ముఖ్యస్థానము కలదు.

జనులు ప్రాచీన కాలమున భారతదేశమంతయు వ్యాపించియుండిరి. మహాభారతమునందు వీరిని గురించి యెన్నియో గాథలుకలవు. వీరు కౌరవ పక్షపాతులుగను, పాండవులకు వ్యతిరేకులుగను, కన్పింతురు. ఆంధ్రదేశముతో వీరికి సన్నిహిత సంబంధముండినట్లు మనవారిలో తరచుగావచ్చు నాగన్న, నాగమ్మ మొదలగు మనుజుల పేర్లవలనను, నాగవరము, నాగులపాడు, నాగులేరు, మున్నగు స్థల నదీనామముల వలనను చెప్పవచ్చును. ఇంతకన్న ప్రబలమైన సాక్ష్యము నాగుల యాచారమైన సర్పపూజ మనవారిప్పటికిని చేయుచుండుట. [1] కార్తిక శుద్ధ చవితి నాగులచవితిగా పరిగణింపబడుచున్నది. ఈనాడు స్త్రీలు పాముపుట్టలో పాలుపోయుదురు. నాగమయ్య ప్రతిమచేసి, చలిమిడి పానకము లారగింపు పెట్టుదురు. నాగమయ్యకు దీపముపెట్టరు. వేడి వస్తువులు పనికిరావు. నాగమయ్య ప్రసాదము స్త్రీలకు కడుపు చలవ యనియు, ఇంటినిండ పిల్లలు జల్లలు కలుగుదురనియు నమ్ముదురు. నాగరాజును పూజించి వనితలిట్లు మొక్కుకొందురు. "నాగేంద్రుడా! ఫణీంద్రుడా! మావాళ్లు చీకటవాకట తిరుగుతారు. నడుముత్రొక్కితే నావాళ్ళనుకో, పడగత్రొక్కితే పారిపోతండ్రి" ఈ నాగపూజ విస్తారముగ, మహిళాలోకమునందును బ్రాహ్మణేతర వర్ణములందును, వ్యాపించియున్నది. అమరావతీ స్తూపశిల్పములందు రాజులకును, రాణులకును, ఇతర ప్రసిద్ధ వ్యక్తులకును, శిరస్సువెనుక ఒకటి మొదలుకొని ఏడువరకు ఫణములు చెక్కబడియున్నవి. ఇవి నాగరాజుల చిహ్నములని చెప్పవచ్చును.

చరిత్ర యుగములోకూడ నాగులు ప్రముఖపాత్ర వహించిరి. మౌర్యులకును, నందులకును, ముందు మగధసామ్రాజ్యమును పాలిం

1. తెలంగాణము మొదలగు ప్రాంతములలో శ్రావణ శుద్ధపంచమి 'నాగపంచమి'గా పాటింపబడుచున్నది. ఇది మహారాష్ట్ర సంప్రదాయమనియు, కార్తిక శుద్ధచవితినాడు చేయుటయే తెలుగు సంప్రదాయమనియు, ఇదియే విష్ణుమూర్తి విద్రనుంచిలేచు ఉత్థానైకాదశికి సమీపముండుటచే యుక్తమనియు, కార్తిక చవితినాటినుండియు జ్యోతిర్మండలమునందు, అనంతశయనాకృతి గోచరించు ననియు శ్రీ ఆదిరాజు వీరభద్రరావు పంతులుగారు తెల్పిరి.

చిన శిశు నాగవంశమువారు [1]ఆర్య క్షత్రియులు కారనియు, నాగ జాతివారై యుందురనియు పరిశోధకులు తలచుచున్నారు. క్రీ. శ. రెండవ శతాబ్దమునందు విదేశీయులైన కుషానుల పరిపాలన మంత మొందించి, ఆర్య ధర్మాచారములను పునఃప్రతిష్ఠించినవాను [2]భార శివనాగులు. వీరు గంగాతీరమునందు పది యశ్వమేధములు చేసిన ప్రదేశమే దశాశ్వమేధ ఘట్టమనబడుచున్నది. [3]ఆంధ్ర దేశమునందు నెల్లూరు మండలములో 15 వ శతాబ్ద ప్రారంభమున పరిపాలన చేసిన దర్శి, ఫణివంశపు రాజులు నాగజాతివారని తెలియుచున్నది. ప్రాచీన తమిళ కావ్యములందుకూడ నాగుల ప్రశంస విశేషముగ కలదు.

నాగయుగమునందలి మతాచారపరిస్థితులు, ఈనాటికి తెలుగు దేశములో నిలచియున్నవని చెప్పనైనది. ఆనాడు సర్పములనే కాక శిలలను పూజించుచుండిరి. వృక్షపూజ యార్యులలోకూడ నుండినట్లు కన్పించును. ఆర్యులు రావిచెట్లను, జమ్మిచెట్లను పవిత్రముగా నెంచిరి. యాగములందు అగ్ని నిపుట్టించుటకై అశ్వత్థవృక్షమునందు మొలచిన జమ్మివృక్షశాఖతో అరణుల నిర్మించుచుండిరి. నాగులు వేపచెట్టును ఆరాధించువారు. వేము ఔషధ ప్రక్రియలకు ఉపయోగించు వృక్షము. దీని ఆకులు, ఈనెలు, బెరడు, లోపలిచెక్క, వేళ్లు, అన్నియును క్రిమిహరములు. ఇది దేశమందంతటను స్వేచ్ఛగా పెరుగు తల్లిచెట్టు. వేపగాలి చల్లగను, ఆరోగ్యప్రదముగను ఉండును. ఉగాది పండుగకు తెలుగువారు తీపి తినకముందు, వేపపువ్వును బెల్లముతో కలిపి భక్షింతురు. తొలుత కష్టములు గుడిచి తరువాత సుఖపడుట సంతోషదాయకమని, యీ యాచారము సూచించునేమో! వేపకు గ్రామదేవతల పూజావిధిలో స్థానముగలదు. శుభసమయములలో మామిడి తోరణములవలె, మారిమసగి రోగములు చెలరేగినప్పుడు, వేపమండలు ప్రత్యక్షమగును. అనంతరకాలమున నాగులును ఆర్యు

1. కేంబ్రిడ్జి హిందూదేశ చరిత్ర.
2. కె. పి. జయస్వాలుగారు.
3. ఆంధ్రుల చరిత్ర మొదటిభాగము.

లును ఒండొరులఆచారములను కలబోసికొని యొక సమష్టి నాగర కతను సృష్టించుకొనిరి. ఈనాడు మనవారు రావిచెట్టునకును, వేప చెట్టు నకును కలిపి పెండ్లి చేసి ఒకేకుదురులో పెంచుట గానవచ్చును. ఇది ఆర్య నాగభావ సమ్మేళనమునకు చక్కని ఉదాహరణము.

శ్రావణ బహుళ అమావాస్యనాడు ముత్తయిదువలైన ఆంధ్ర స్త్రీలు కందచెట్టును స్థాపించి పూజించుట యాచారము. సాగరసీమ వాసు లీ యమావాస్యను పోలేరమ్మ యమావాస్యయందురు. చెట్టు మొలచిన కందదుంపను తెచ్చి దానికి పసుపు కుంకుమలు పెట్టి పూజింతురు. కంద పిలకలవలెనే తమకును సంతానము తామరతంపరగా పెరుగవలయుననుటయే ఈ వ్రతముయొక్క ఉద్దేశము. వృక్షపూజకు ఇది మరియొక ఉదాహరణము. ఇదికూడ ప్రాచీనమునుండి వచ్చు చున్న నోము. ఈనాడు పనస ఆకులలో మినుపకుడుములను వండి భుజింతురు. తెలంగాణా వాసులు శ్రావణ బహుళ అమావాస్యను పొలాల (పొలముల) అమావాస్య యనుచున్నారు. ఇది వ్యవసాయ మునకు సంబంధించిన శుభదినము. ఆనాడు ఎద్దులు మున్నగు పశువులకు ఆటవిడుపు. ఆనాడు పనులు చేయించరు. పశువులను కడిగి కొమ్ములకు పసుపు నూనె రాచి, బెల్లము నువ్వులు నూనె మున్నగునవి తినిపింతురు. ఇవి పెట్టుటచే దుక్కిటెద్దులు ఆొమ్ము తాకుడు (బరువులు లాగుటచే గుండెలకు గలుగు శ్రమ) లేక బలముకలిగియుండును.

నాగులు వృక్షములను, శిలలమీద చెక్కిన నాగవిగ్రహము లనేకాక వీర దేవతయగు కాళినిగూడ పూజించుచుండిరి. ఈ దేవతకు భయంకరమును వికృతమునైన రూపము కల్పించి దేవిముందు వీర నాదములతో నృత్యములు సల్పుచుండిరి. కాళికి జంతువులను బలి సమర్పించుచుండిరి. గణాచారిణి యనబడు గురువురాలు కాళి పూనినయట్లు సివమెత్తి యాడుచుండును.

పైన వర్ణింపబడిన జనులేకాక ఇతరులును—కర్ణాటకులు, తమిళులు, మహారాష్ట్రులు, ఓఢ్రులు, మహమ్మదీయులు చరిత్ర ప్రవాహము వెంటవచ్చి యాంధ్రులలో నైక్యమొందిరి. ఆయా సందర్భములందు వీరినిగూర్చి తెలుపబడును.

# ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి

8-వ ప్రకరణము

## (ఆంధ్రభాష)

ఈ భాషకు ఆంధ్రము, తెనుఁగు, తెలుఁగు, అను పేర్లు చెల్లుచున్నవి. వీనిలో మొదటి రెండును జాతిని, మూడవది దేశమును బోధించునవిగా ప్రథమమున పుట్టినట్లిదివరలో చర్చింపనైనది. ఈ నాడీ శబ్దములన్నియు ఆంధ్రజాతికిని, ఆంధ్రభాషకును సమానముగ వర్తించుచున్నవి. ప్రాచీనాంధ్రులు ఆర్యక్షత్రియ సంతతివారగుటచే వీరు ప్రాకృతము మాతృభాషగాగలవారుగా నుండిరి. ఆంధ్రులును తుషారులును, ఒకే ప్రజాగణమునకు చెందినట్లు పురాణములు సూచించినవిగదా. తుషారులు లేక [1]తుఖారులభాష యార్యభాషా కుటుంబమునకు చెందినదని విమర్శకులు నిరూపించిరి. వీరికి సజాతీయులైన ఆంధ్రులుకూడ తుఖారులభాషవంటి భాషనే మాటలాడుచుండిరనుట సంభావ్యము. దీనికి ఉపబలకముగ శాతవాహనాంధ్రులు తమశాసనములను ప్రాకృతములో వ్రాయించుటయు, ప్రాకృత కావ్యములను, కవులను పోషించుటయు పేర్కొనవచ్చును. దేశ పరిపాలకులైన ఆంధ్రశాతవాహనులు ప్రాకృతమును భాషించుచుండగా, పాలితులైన జనబాహుళ్య మేభాషను వాడుచుండెనను ప్రశ్న యుదయించును. వారినాటి తెనుగునకు మాతృకమైన యొకానొక ద్రావిడభాషా భేదమును మాట్లాడుచుండిరని యూహింప వీలున్నది.

బృహత్కథయను పైశాచి ప్రాకృత గ్రంథమొకటి శాత వాహనుల కాలమున రచింపబడెను. ఇది తరువాత సంస్కృతము **నందలి** కథా సరిత్సాగరమునకు మూలమయ్యెను. బృహత్కథను

---

1. 'ఆంధ్రులు-చరిత్ర' ఆంధ్ర. సా. పరిషత్తు ప్రచురణము, హైదరాబాదు

రచించినవాడు గుణాఢ్యుడను పండితుడు. ఈతడొకప్పుడు సాతవాహనరాజును విద్వాంసుని చేయువిషయమై, శర్వవర్మతో నిట్లు ప్రతిజ్ఞ చేసెనట. "నీవు రాజును ఆరునెలలలో విద్వాంసుని చేయగలినచో నేను సంస్కృతమును, ప్రాకృతమును, దేశభాషను పరిత్యజింతును." శర్వవర్మ నిశ్చయముగనే రాజును నిర్ణీతకాలములో పండితునిగా దిద్దగలిగెనట. అప్పుడు గుణాఢ్యుడు తన ప్రతినమేరకు భాషాత్రయమును విసర్జించి, బృహత్కథాకావ్యమును పిశాచముల భాషలో (పైశాచియనబడు ప్రాకృతభేదము) వ్రాసెనని కథ చెప్పబడుచున్నది. ఈ కథలో సూచింపబడిన దేశభాషయే, జనసామాన్యమానాడు వాడుకొన్న భాషయని యూహింపబడుచున్నది. ఇది ప్రాకృతమునకంటె భిన్నమైనదై యుండవలెను. శతాబ్దములు గడువగా ఆంధ్రులు వ్యవహరించిన ప్రాకృతమును, ప్రజాసామాన్య భాషయైన దేశభాషయు కలిసి, ఈనాటి తెనుగుభాషగా మారినవని తలపోయుట యుక్తము. దీనికి తార్కాణముగ ఆంధ్ర వైయాకరణులు తెలుగు శబ్దములను మూడు విభాగములుగ చెప్పుదురు. ఇవి తత్సమ, తద్భవ, దేశ్యములు. సంస్కృత ప్రాకృత శబ్దములు మార్పులేక తెలుగు విభక్తులతో కూడి వ్యవహరింపబడినచో తత్సమములు. ఈ శబ్దములే వర్ణాగమము, వర్ణలోపము మొదలగు మార్పులు చెంది తెలుగున ప్రవేశించినవి తద్భవములు. ఇవికాక మిగిలినవి దేశ్యములు అనగా ఆంధ్రదేశమునకు సహజమైనవి.

తెనుఁగు అను పదము, మొట్టమొదట, నన్నయభట్టారకుని ఆంధ్రమహాభారతమునందు ప్రయోగింపబడి కనబడుచున్నదని చెప్పితిమి. ఇది పదునొకండవ శతాబ్దమునాటిమాట. అంతకుపూర్వ మీభాష యుండెనా లేదా యను శంక కలుగవచ్చును. ఈ భాష యుండినమాట వాస్తవమే కాని అందులో రచింపబడిన గ్రంథములేవియు ఆంధ్రభారతమునకు ముందున్నవి లభింపలేదు. నన్నయభట్టారకునికి పూర్వము నాలుగు శతాబ్దములనుండియైనను (క్రీ. శ. ఏడవ శతాబ్దమునుండియు) తెలుగులో వ్రాయబడిన శాసనములు

కన్పట్టుచున్నవి. అంతకుపూర్వముండిన సంస్కృత ప్రాకృత శాసనములలోకూడ గ్రామనామములును, వ్యక్తులపేర్లును తెలుగుభాష యొక్క యునికిని సూచించునవిగా నున్నవి.

భాషలను, వాటివాటి యన్యోన్య సంబంధమునుబట్టి, కుటుంబములుగ విభజించుట, ఈనాటి భాషాశాస్త్రములో నొక మర్యాద. ఆయా భాషల పదజాలమునుబట్టియు, వ్యాకరణ సామ్యమునుబట్టియు ఈ సంబంధమును నిరూపింతురు. ఆంధ్రభాష ఏ భాషా కుటుంబమునకు చెందినదను అంశముపై, మన భాషా పరిశోధకులలో రెండు భిన్న మార్గములు గలవు. [1]ఒక రిది సంస్కృత ప్రాకృతములనుండి పుట్టిన భాషయనియు, ఆర్యభాషా కుటుంబమునకు చెందినదనియు, విశ్వసింతురు. మన ప్రాచీన వైయాకరణుల భావముకూడ ఇట్టిదిగానే యుండెను. నన్నయభట్టారక విరచితమని చెప్పబడు 'ఆంధ్రశబ్ద చింతామణి' యను వ్యాకరణము, ఈ మతమునే ప్రతిపాదించినది. [2]మరికొందరు తెలుగుభాష ద్రావిడభాషా కుటుంబమునకు చెందినదని సయుక్తికముగ నిరూపింతురు. దక్షిణదేశ భాషలైన తెనుగు, కన్నడము, అరవము, మలయాళము, తులు మరికొన్ని గ్రంథరచనా దశకురాని భాషలును—ఇవన్నియు ఒక్కకుదురులో పుట్టిన భాషలని చెప్పుదురు. వీనికే ద్రావిడభాషలనిపేరు. ఈ భాషలు సంస్కృత పదములను విస్తారముగ ఎరువు తెచ్చుకొన్నను, మూలస్థితిలో నివి వానికంటె భిన్నమైనవి. ఇవి తమలో తాము విశేషముగ పోలికలు గలిగియున్నవి.

సంస్కృతపదజాలము నెరువు తెచ్చుకొనుటలో, ఆంధ్రభాష సోదర ద్రావిడ భాషలకంటె ముందు పరువెత్తినది. మలయాళము

---

1. ఆంధ్రభాషా చరిత్రము డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు.

2. మొదట బిషప్పు కాల్డువెల్ అను పాదిరీ ఈవాదమును ప్రతిపాదించెను. తరువాత శ్రీకోరాడ రామకృష్ణయ్యగారు శ్రీ గంటిజోగి సోమయాజులు గారు శ్రీ పరవస్తు రామానుజస్వామిగారు మొదలగు పలువురు దీనిని ఈషద్భేదములతో సమర్థించుచున్నారు.

కూడ సంస్కృత పదబాహుళ్యము కలదని చెప్పుదురు. సంస్కృత ప్రాకృతముల పుట్టినిల్లైన, ఆర్యావర్తమునకు తెనుగువా రత్యంత సమీపములో నున్నారు. కావున వీరిభాషపై ఆర్యభాషా ప్రభావము గాఢముగా నుండుట సహజము. కేవల తెలుగు పదములను ఆచ్ఛికము లనియు, శుద్ధాంధ్రమనియు, వ్యవహరింతురు. తద్భవపదములనుకూడ దీనిలో చేర్చుట పరిపాటి. వర్తమానాంధ్రభాషలో ఆచ్ఛికపదముల కన్న సంస్కృతభాగమే విపులముగానున్నది. సంస్కృత పదసంబంధము లేక, చక్కని గద్యపద్యములు తెలుగులో వ్రాయుట, దుస్తరము. ఒకవేళ వ్రాసినను ఆ రచనలు తెనుగువారికే యర్థముకావు. [1]పూర్వ కవులలో కొందఱు చమత్కారమునకై, శుద్ధాంధ్రకావ్యములు వ్రాసెడివారు. కాని యవి పండితలోకమునందే నిలచిపోయినవి. జనులు వాటిని చదివి, యానందింపజాలరు. సంస్కృతభాషా సంపర్క ముచే తెలుగునకు గొప్పమేలుకలిగినను, కొంత కీడుకూడ కలిగినది. భావబోధకములును, మురిపెమైనవియునగు, సహజాంధ్ర శబ్దము లెన్నియో వాడుకలోనుండి తొలగిపోయినవి. దీనివలన సంస్కృతము ఊత లేక, ఆంధ్రభాష నిలువజాలని దుఃస్థితి సంభవించినది. సంస్కృత పదములపై మోజు సాగరసీమవాసుల భాషలో నెక్కువగా నచ్చొత్తి నది. తెలంగాణమునందు, రాయలసీమ ప్రాంతమునను, అచ్చ తెలుగు మాటలెన్నియో చక్కనివి నేటికిని జనుల వాడుకలో నిల్చియున్నవి. తెనుగు తొల్లిటి నుడికారము ఈ మండలములో నింకను సజీవమై యున్నదని చెప్పనొప్పును.

సంస్కృతభాషా సాహచర్యము తెనుగునకు చేసిన మేలు మరువరానిది. ఉదాత్త రసభావములుగల వాఙ్మయమునకును, విజ్ఞాన ప్రదమైన శాస్త్రములకును, గీర్వాణభాష పెన్నిధి వంటిది. దీనిలోని ప్రశస్తతరమైన పురాణ కావ్యనాటక సారస్వతమును, మన మహా కవులు తెనుగులోని కనువదించి యాంధ్రభాషను సారవంతముచేసిరి.

1. పొన్నిగంటి తెగల నార్యుని యయాతి చరిత్ర, కూచిమంచి తిమ్మకవి అచ్చ తెలుగు రామాయణము, నీలాసుందరీ పరిణయము వంటివి.

ఆంధ్రవ్యాకరణము సంస్కృత వ్యాకరణముయొక్క అడుగుజాడల లోనే నడచినది. మన యలంకార శాస్త్రముకూడ సంస్కృతమను విపణిలో విలిచినదే. శాస్త్రవిజ్ఞానమున కింకను సంస్కృత సారస్వతము పెట్టినదే భిక్ష. ముమ్ముందు శాస్త్రవిజ్ఞానము నాంధ్రములో రూపొందించు ప్రయత్నమునందు, గీర్వాణవాణియే తెనుగుభాషకు చేదోడు వాదోడు కాగలదు. ముఖ్యముగ శాస్త్రపరిభాషా పదములను నిర్మించుకొనుటలో, మనము సంస్కృతమునే యాశ్రయించవలెను. మూలశబ్దమునుండి క్రొత్తక్రొత్త భావచ్ఛాయలను సూచించుటకై, నూతన పదములు సృష్టించుటకు దేవభాష, మిక్కిలి అనువుగనున్నది. ఉపసర్గలు, ప్రత్యయములు, చేర్చుటవలన పదమును చేద త్రాడువలె పొడిగించ నక్కరలేకుండగనే, నూతనార్థములను సంస్కృత శబ్దములచే చెప్పించవచ్చును. ఇదే ప్రయోజనమునకై, తెలుగు కూర్పుచేయ దలచినచో, అది కడు దీర్ఘముగ నేర్పడి పద సంగ్రహము సాధ్య పడకుండును. సంస్కృత పదబాహుళ్యము, మరియొక విధముగ ఈనాడు తెలుగున కుపకరించును. ఇప్పుడు భారతదేశమున హిందీభాష జాతీయ భాషా స్థానము నలంకరించినది. ఈ నూతన రాజభాష నభ్యసించుటకును, ప్రయోగించుటకును, గీర్వాణశబ్ద పరిచితి యాంధ్రులకు గొప్ప సాయము కాగలదు.

ఆంధ్రభాష విషయములో తెలుగువారు తప్పకగర్వించ దగినది దాని సహజమాధుర్యము—సంగీతానుకూలత. ఇది కర్ణరసాయనమైన భాష. దక్షిణదేశ భాషలలో గానకళకొరకు, ఆంధ్రమే తదితర భాషలకన్న మిన్నయని, ఆ కళావిశారదులు తలతురు. తెలుఁగు తెనుఁగు శబ్దముల వ్యుత్పత్తియే ఈ మాధుర్యమును సూచించునని మన పండితులు చెప్పుదురు. తేనె+అలుగు= తెలుగు అనగా తేనెవంటి ప్రవాహముకలదియనియు, తేనె+అగు = తెనుగు అనియు ఈ మాటల కర్థము కల్పింపబడినది. ఇది భాషావేత్తల చమత్కారమని త్రోసివేసినను, ఈ భాషతో పరిచయము గల్గిన స్వదేశీయులును విదేశీయులునుకూడ, ఏకగ్రీవముగ తెనుగుతీపిని చవి

ఆంధ్రవ్యాకరణము సంస్కృత వ్యాకరణముయొక్క అడుగుజాడల లోనే నడచినది. మన యలంకార శాస్త్రముకూడ సంస్కృతమను విపణిలో విలిచినదే. శాస్త్రవిజ్ఞానమున కింకను సంస్కృత సారస్వతము పెట్టినదే భిక్ష. ముస్ముందు శాస్త్రవిజ్ఞానము నాంధ్రములో రూపొందించు ప్రయత్నమునందు, గీర్వాణవాణియే తెనుగుభాషకు చేదోడు వాదోడు కాగలదు. ముఖ్యముగ శాస్త్రపరిభాషా పదములను నిర్మించుకొనుటలో, మనము సంస్కృతమునే యాశ్రయించవలెను. మూలశబ్దమునుండి క్రొత్తక్రొత్త భావచ్ఛాయలను సూచించుటకై, నూతన పదములు సృష్టించుటకు దేవభాష, మిక్కిలి అనువుగనున్నది. ఉపసర్గలు, ప్రత్యయములు, చేర్చుటవలన పదమును చేదత్రాడువలె పొడిగించ నక్కరలేకుండగనే, నూతనార్థములను సంస్కృత శబ్దములచే చెప్పించవచ్చును. ఇదే ప్రయోజనమునకై, తెలుగు కూర్పుచేయ దలచినచో, అది కడు దీర్ఘముగ నేర్పడి పద సంగ్రహము సాధ్య పడకుండును. సంస్కృత పదబాహుళ్యము, మరియొక విధముగ ఈనాడు తెలుగున కుపకరించును. ఇప్పుడు భారతదేశమున హిందీభాష జాతీయ భాషా స్థానము నలంకరించినది. ఈ నూతన రాజభాష నభ్యసించుటకును, ప్రయోగించుటకును, గీర్వాణశబ్ద పరిచితి యాంధ్రులకు గొప్ప సాయము కాగలదు.

ఆంధ్రభాష విషయములో తెలుగువారు తప్పక గర్వించ దగినది దాని సహజమాధుర్యము—సంగీతానుకూలత. ఇది కర్ణరసాయనమైన భాష. దక్షిణదేశ భాషలలో గానకళకొరకు, ఆంధ్రమే తదితర భాషలకన్న మిన్నయని, ఆ కళావిశారదులు తలతురు. తెలుంగు తెనుంగు శబ్దముల వ్యుత్పత్తియే ఈ మాధుర్యమును సూచించునని మన పండితులు చెప్పుదురు. తేనె+అలుగు=తెలుగు అనగా తేనెవంటి ప్రవాహముకలదియనియు, తేనె+అగు = తెనుగు అనియు ఈ మాటల కర్థము కల్పింపబడినది. ఇది భాషావేత్తల చమత్కారమని త్రోసివేసినను, ఈ భాషతో పరిచయము గల్గిన స్వదేశీయులును విదేశీయులునుకూడ, ఏకగ్రీవముగ తెనుగుతీపిని చవి

యున్నది. సంస్కృతమునందున్న వివిధ ధ్వనులును, వర్ణములును, దీనిలో నుండుటయే దీనికి మూలము. ఆంధ్ర బ్రాహ్మణులు వేదము నందలి ధ్వనులన్నిటిని, విస్పష్టముగ నుచ్చరించగలరు. అందును, సప్త గోదావరమునందలి విప్రోత్తములును, తెలంగాణమునందు మంథెన, ధర్మపురి, మున్నగుచోటులందలి వేదవిదులైన బ్రాహ్మణులును, నిర్దుష్ట వేదపఠనమునకు ఘనకీర్తిని సంపాదించిరి. ఈ ప్రాచీన ప్రశస్తిని వీరీనాడు చాలవరకు గోల్పోవుట శోచనీయము. శంకరుడు అనుటకు 'షంకర్'అనియు, శాస్త్రము అనుటకు 'షాస్తర్' అనియు, అపభ్రంశ పదముల నుచ్చరించవలసిన యావశ్యకత ఆంధ్రులకు బొత్తుగా లేదు. సంస్కృతములో లేని విశేష ధ్వనులుకూడ తెలుగులో కలవు. హ్రస్వములైన ఎ, ఒ అను అచ్చులును, చ జ అను హల్లులును, తెలుగులో హెచ్చుగనున్నవి. ఈ భాషలో అర్ధానుస్వారము, శకటరేఫము (బండి ఱ) కూడ అదనముగా నున్నవి. అరసున్న పలుకుబడియం దిప్పుడు కాన్పించదు. నేడర్ధానుస్వార యుక్తములుగానున్న పదములలో ఒకప్పుడు నిండుసున్న యుండెడిదని సూచించుటకిది తోడ్పడును. శకటరేఫము రకారద్విత్వముగల పదములను (మఱ్ఱి, గుఱ్ఱమువంటివి) వ్రాయుట కుపయోగించుచున్నది. దీనికిపుడు ప్రత్యేక ధ్వనిలేదు. ప్రాచీనకాలమున ర, ఱ, వర్ణముల యుచ్చారణములో, నొకింత భేదముండినట్లు తెలియుచున్నది. పూర్వకాలమున తెలుగులో నొకవింత యక్కరముండెడిది. దీనికి 'ఴ'అను గుర్తు పెట్టబడెను. ఇట్టి ధ్వనిగల వర్ణము అరవమునందు నేటికిని వాడుకలోనున్నది. తెనుగులో నిది యదృశ్యమై డ, ళ, అను ధ్వనులుగా మారినది.

మాండలిక పదభేదములలో, సాగరసీమవాసులు తత్సమ పదముల నెక్కువగా వాడుదురనియు, తెలంగాణవాసులు అచ్చపు తెలుగుమాటల నధికముగా వాడెదరనియు చెప్పియుంటిమి. నుడికారమునందును వైచిత్రి యెంతయోకలదు. 'అయ్యగారిని తోలుకొని రమ్మని' 'దొరసానిని పడగొట్టిరమ్మని'వంటి వాక్యములు తెలంగాణ

మున వింతగా దోపవు. అన్యప్రాంతీయు లివి విని యాశ్చర్యపడుదురు. 'వండడము' 'చేయడము' అను రూపములు, సాగరసీమ యందును 'వండుడు' 'చేసుడు' వంటి రూపములు తెలంగాణమునను గలవు. తొల్లింటి క్రియారూపములు, తెలంగాణపు భాషలో కొంతవరకును, సాగరసీమ భాషలో పూర్తిగను, మారినవి. వచ్చినవాడు అనుటకు తెలంగాణమున 'వచ్చిండు' అనియు సాగరసీమలో 'వచ్చాడు' అనియు రూపములు. అది ఇది వంటి పదములు ఆరంభమునం దొక హల్లుచేర్చుకొని, గది, గాడ, గీడ అను రీతిని తెలంగాణమునందు వినవచ్చుచున్నవి. బహువచనమునందు బట్టలు గొట్టెలు అనుటకు మారు బర్రలు, గొర్రలు, వంటి రూపములు తెలంగాణమున కొన్ని మండలములలో వినవచ్చును. ఇది వర్ణవ్యత్యయముచే నేర్పడియుండును. తెలంగాణావాసులు తమ సంభాషణలో, ఉర్దుపదములను సాగరసీమ వాసులు ఆంగ్లభాషా పదములను, విరివిగా వాడుచుందురు. ఇంచుగా గమునుచేర్చి, ఉర్దూమాటలను తెలుగు ధాతువులుగా చేసికొనుట తెలంగాణములో కానవచ్చును. బనాయించు, రుకాయించు, పిలాయించువంటివి, ఇట్టివి. ఆంగ్లపదములనిట్లు స్వతంత్ర ధాతువులుగా మార్చుటకు వలనుపడదు. చేయువంటి సహాయధాతువుల తోడ్పాటుతో మాత్రమే ఇవి వాడబడుచున్నవి. కాపీచేసెను, పర్చేజు (Purchase) చేసెను వంటివి ఉదాహరణములు. ఉచ్చారణ వైఖరులందును భిన్నమార్గములు కలవు. సాగరసీమవాసులు పదము చివర దీర్ఘముతీసి 'వస్తావూ³' అని పలుకుదురు. ప్లుతస్వరము శబ్దాంతమున నున్నది. 'తెలంగాణమునందది పదమధ్యమందే విన్పించును. 'వస్తా³ ఉర, తింటా³వే.' ఉభయులును ప్లుతస్వర ప్రియులే.

తెలుగు లిపి:—ఆంధ్రభాషయం దన్ని ధ్వనులును గలవని చెప్పనైనది. వీని కన్నిటికిని వ్రాతలో సంకేతములును ప్రాచీన కాలమునుండియు గలవు. ఈభాషయొక్క అక్షర సమామ్నాయము సంపూర్ణమైనది. అన్యభాషా సంపర్కముచే, మన భాషలోచేరిన క్రొత్తశబ్దములందలి ధ్వనులనుకూడ గుర్తించి, మనవైయాకరణులు

వానికి లిపిసంకేతములను గూర్చినారు. [1]కాఫీ, ఫర్లాంగు, వంటి పదములలోని 'ఫ' కు వర్ణముకల్పింపబడినది. ఇట్లే తాటాకు, చద్దన్నము వంటి పదములలోని వింత 'అ' కార ధ్వనినికూడ వీరు గుర్తించినారు. తెలుగు వర్ణమాల, బ్రాహ్మీలిపినుండి పుట్టినదని విజ్ఞులు చెప్పుచున్నారు. మన యక్షరములు, నాగరలిపిలోని వర్ణములవలె గీతలు కలవికావు. ఇవి ముత్యములవలె, గుండ్రముగా నుండును. దీనికి కారణము లేఖనసాధనములు. పూర్వము మనవారు తాటాకుమీద గంటముతో వ్రాసెడివారు. అడ్డగీతలు గీచినచో తాటాకు చిట్లునుగాన ఈపద్ధతిమాని, గుండ్రకత్తు వ్రాయవలసిన యావశ్యకత యేర్పడినది. ఇది మన లిపికొక క్రొత్త విన్నాణమును ఆపాదించినది. చక్కని తెలుగు దస్తూరి వ్రాసినచో ఆణిముత్తెముల సరులవలె చూడముచ్చటగా నుండును. [2] ముత్యాల కోవవలె వ్రాయనేర్చుట యొక ఘనతగా నెంచబడెడిది.

మౌర్యులతోపాటు బ్రాహ్మీలిపి దక్షిణమునకు వచ్చెను. క్రీస్తుశకారంభమున నిది ఆంధ్ర - కర్ణాటలిపిగా పరిణమించెను. ఆ కాలమున తెలుగు - కన్నడ లిపులు ఒకటిగానుండెడివి. దీనినే వేంగి లిపి యనికూడ అనుచున్నారు. శాలంకాయన మహారాజులకాలమున ఆంధ్రులు తూర్పు సముద్రతీర దీవులకును, దేశములకును, వలసపోయినప్పుడీ వేంగి లిపిని తమవెంట గొనిపోయి, యచ్చట స్థాపించిరి. [3]పూర్వపల్లవరాజులకాలమునందు తెలుగు - కన్నడ లిపియే తమిళదేశమునందును వాడుకలోనుండెను. పల్లవులాంధ్రులగుటయుఅంతకు ముందుద్రవిడ దేశమునమరియొకలిపియుండినసూచనలు లేకుండుటయు,

---

1. ఆంధ్రభాషాను శాసనము. బ్ర. శ్రీ. మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు.

2. పాండురంగ మాహాత్మ్యమును కృతిపొందిన విరూరి వేదాద్రిమంత్రి ముద్దులొలుకు దస్తూరిర్వ్రాయువాడని తెనాలి రామకృష్ణకవి ప్రశంసించెను.

పాండురంగమాహాత్మ్యము. ప్రథమాశ్వాసము 71 పద్యము.

3. 'ఆంధ్రులు - చరిత్ర' ఆం. సా. పరిషత్తు.

యేదీనికి హేతువులు. క్రీ. శ. 7-వ శతాబ్దము తరువాత, ఈలిపియే క్రమక్రమముగ మార్పుచెంది, నేటి యరవ లిపిగ రూపాంతరము నందెను. ఇప్పటికిని కర్ణాటాంధ్రలిపు లొకదానినొకటి పోలియుండుట గమినించదగినది. ముద్రణయంత్రములు వచ్చినతరువాత తెలుగు లిపిని సంస్కరింపవలసిన యవసరమేర్పడుచున్నది. అక్షరములకు ఒత్తులలో వేర్వేరు సంకేతము లుండుటయు, సంయుక్తాక్షరములు ఒకదానిక్రింద నొకటి వ్రాయబడుటయు, అచ్చులలో తలకట్టులు, గుడులు. సుడులు ఉండుటయు ముద్రణ సౌకర్యమున కడ్డు తగులు చున్నవి. [1]ఆంధ్రలిపి సంస్కారమునుగూర్చి పలువురు సూచనలు చేయుచున్నారు. సంక్షిప్త లేఖనమునకు (Short hand writing) టైపు రయిటింగు (Type writing) నకును అనువగునట్లు మన లిపిని సంస్కరింపవలసిన యావశ్యకత యెంతేనిగలదు. ఈ యత్నములు కొంత వరకు సాగినవి. భారతదేశమునకు ఏకజాతీయ భాషవలెనే, ఏక లిపియు నుండుట సమైక్యతకు కారణమని విశ్వసింపబడుచున్నది. అట్టిచో తెలుగు లిపియొక్క భవిష్యత్తు ఎట్లుండవలెనను సమస్య ఉదయించును. ఎట్లైనను, కొన్నితరములవరకైన, ఆంధ్ర ప్రజానీకము శతాబ్దములనుండి వచ్చు తమ లిపిని విడువజాలరనుట తథ్యము.

---

1. శ్రీ. వేటూరు ప్రభాకరశాస్త్రిగారు, శ్రీ. సురవరము ప్రతాపరెడ్డిగారు, ఇతరులు.

# ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి

## 9-వ ప్రకరణము

### (ఆంధ్ర స్త్రీలు)

తెలుగుభాషలో క్రియారూపముల ఏకవచనమునందు స్త్రీలింగ పదములును, జంతువాచకములును, అప్రాణివాచకములును, సమానరూపము కలిగియుండును. సీత పాడుచున్నది-చిలుక పలుకుచున్నది. చెట్టు పూచినది. నిర్దేశక సర్వనామములలో స్త్రీని గూర్చి ఏకత్వమునందు 'అది' అనుటయు నాచారము. వ్యాకరణ ప్రయోజనములకొఱకు స్త్రీవాచకములను అమహత్తులతో జేర్చి చెప్పుట [1]ప్రాచీన సంప్రదాయము. ఈ తెలుగు నుడికారమును ఆధారముగ చేసికొని, కొందఱు [2]భాషాశాస్త్రజ్ఞులు, ఒకవింత వాదమును ప్రతిపాదించిరి. తెలుగువారి దృష్టిలో స్త్రీలు జంతువులతోను, జడపదార్థములతోను, సమానలు. చైతన్య విరహితమైన వస్తువులకన్న వీరి కధికస్థానములేదు. ఈ విపరీతవాదమునకు సమాధానమరయుటకై దూరము పోనక్కరలేదు. ఈభాషయందే బహువచనమున స్త్రీవాచకములకును, అమహత్తులకును, వేర్వేరు రూపములున్నవి. స్త్రీలు నృత్యము సేయుచున్నారు. నెమళ్లు ఆడుచున్నవి. నిర్దేశక సర్వనామములందుకూడ పిన్నవారిని, తక్కువవారినిగూర్చి పలుకునప్పుడే 'అది' అనుచున్నారు. కాని వయస్సులో పెద్దవారినిగూర్చియు సమ్మాననార్హులనుగూర్చియు సంభాషించునప్పుడు 'ఆమె, ఆవిడ' మొదలగు పదములను వాడుచున్నారు. ఆధునిక వ్యాకరణములందు

1. "స్త్రీ పశు జడాః విశేష్యమహదాఖ్యాః" ఆంధ్రశబ్దచింతామణి-నన్నయ. "స్త్రీతిర్యగ్జడ భిన్నంబులును వాని విశేషణంబులును మహత్తులనంబడు" బాలవ్యాకరణము-చిన్నయసూరి.

2. **Comparative grammar of Dravidian languages, Caldwell**

మహద్వాచకములు, మహతీవాచకములు అమహద్వాచకములుఅని మూడు లింగములను వేరుగా చెప్పుచున్నారు. ఇవియే పుంలింగ స్త్రీలింగ నపుంసకలింగములు – 'అది' యనుప్రయోగమైనను, చిన్న తికమును, ముద్దును, పరిచయమును, మైత్రిని, సూచించును గాని తిర స్కారభావనచే పుట్టియుండదు. స్త్రీలను ప్రేమ గౌరవములతో చూడవలెననియు, వారిని దుఃఖపెట్టరాదనియు, తెలుగునీతిశతకములు చాటుచున్నవి. "కలకంఠకంఠి కన్నీరొలికిన సిరి యింటనుండనొల్లదు సుమతీ" అను సుమతిశతక పద్యము ఆంధ్రుల మహిళా సమాదర ణకు చక్కని నిదర్శనము కాగలదు.

అట్లగుట స్త్రీల జీవితము, కష్టసుఖములు, సమస్యలు ఆచార వ్యవహారములు, విజ్ఞానము, ఆటపాటలు, జీవితాదర్శములు మున్నగు నవి ప్రత్యేక పఠనమునకును, పరిశీలనమునకును అర్హములగుచున్నవి. ఈయంశముపై మనప్రాచీనులదృక్పథమును పరికింతము. ధర్మసూత్ర కారుడైన ఆపస్తంబ మహర్షి, వివాహబంధము పరమపవిత్రమనిఅను శాసించెను. భార్యతో కలసి భుజించుట అనురాగమును, కలివిడితన మును సూచించునుకదా. ఈయాచారము దాక్షిణాత్యులందు కలదని స్మృతులవలన తెలియవచ్చుచున్నది. సారస్వతము తరువాత, ప్రాచీన సాంఘిక జీవితమును గురించి మనకు సాక్ష్యమిచ్చునవి, శిల్పనిర్మాణ ములు. అమరావతీ స్తూప శిలలపై చెక్కిన చెక్కడములు, ఆనాటి స్త్రీపురుషుల వేషమును, అలంకారములను ప్రదర్శించుచున్నవి. అప్పటి స్త్రీలు కటిపైభాగమున విశేషవస్త్రాదికము ధరించినట్లు తోచదు. పైటవేసికొను మర్యాద మహారాష్ట్ర స్త్రీలనుండి, పూర్వాంధ్ర వనితల కలవడినదని శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగా రూహించిరి, పైట అను శబ్దము పైఠను పదమునుండి వచ్చినదనియు, ఈనగరము మహారాష్ట్ర ప్రాంతములో ఇప్పటి ఔరంగాబాదు జిల్లాలో నుండుటవలన, అచ్చట నేర్చిన పైటవేసికొను ఆచారము నకు ఈ పేరు వచ్చెననియు, శాస్త్రిగారి మతము. పూర్వాంధ్ర స్త్రీలు తొడిగికొను రవికలను 'పైఠణీలు' అనుట ప్రబంధములలో

గాన్పించును. ఇదియు పైఠను సంబంధమును మహారాష్ట్ర నేపథ్య విధానమును జ్ఞప్తికి దెచ్చును. ఆంధ్రస్త్రీలు పైటవెరుగకుండి రనియు కంఠోక్తిగా చెప్పవీలుపడదు. 'పయ్యెద' అను పదముకూడ కలదు. అనగా ఎదపై ధరించు వస్త్రము. దీనినిబట్టి నడుము పైభాగ మును అచ్ఛాదనచేయు వాడుక తెలుగునాటి యాడువారిలో పూర్వ ముండెడిదనియే చెప్పనగుచున్నది. అమరావతీ శిల్పములందలి స్త్రీలు రవికలు ధరించినట్లు గోచరించుచునే యున్నవి.

[1]ఆకాలమున స్త్రీలు పలురకములైన యాభరణములను దాల్చుచుండిరి. అజంతా అమరావతీ చిత్రణములందు కాంతల నడుములకు, ఒడ్డాణములు కలవు. వారు సన్నని నడుముకలవారై కృశాంగులుగ చిత్రింపబడిరి. బిళ్ళలతో గూడిన మెడసరములను వారు ధరించుచుండిరి. చెవిపోగులు పెద్దవిగ నుండి, భుజములమీదికి వ్రేలాడుచుండినవి. ఇవి ఇప్పటి జారుడు లోలకులవంటివని చెప్ప వచ్చును. చేతులకు మణికట్లులకు, బరువైన కంకణములు గలవు. కాళ్ళకు బరువైన కడియము లుండినవి. పచ్చని బొట్టు స్త్రీల ముఖము నలంకరించియుండెను. ఇప్పటికిని పల్లెటూరి పడుచులు శ్రమకోర్చి, మీచేతులమీద పచ్చబొట్టుతో, తమ పేరును భర్త నామధేయమును, మురిపెముగ పొడిపించుకొనుట వాడుకగా నున్నది. స్త్రీలు దీర్ఘ కేశభారముకలిగి యుండిరి. శిరోజములను జడ లల్లు కొనియు, ముడులుగ చుట్టి పైన నగలు చెక్కుకొనియు, వనితలు చూపట్టుదురు. కాంతలు ముగ్ధలై బిడియపడుచున్నట్లు తీర్చబడిరి. బాలికలు దృఢగాత్రలై నవ్వుచు, వ్రేలుచు, నాట్యమాడుచు ప్రత్యక్షమగుదురు.

ఆ కాలపు స్త్రీలు విశేష స్వాతంత్ర్యముగలవారై, బహి రంగ జీవితమున కలవడియుండిరి. వారు యవనిక చాటుననుండినట్లు కాన్పించదు. ఈశిల్పములలో స్త్రీ పురుషులు నిర్బంధము లేక ఒం డొరులతో స్వేచ్ఛగ కలసి తిరుగుచుండినట్లు కనబడును. కొన్ని

1. Budhistic remains in Andhra Desa - K. R. Subrahmanian.

గృహ చిత్రములలో, స్త్రీలు పురుషుల మ్రోల స్వేచ్ఛగ మెలగు చున్నట్లును, భార్యలు తమ భర్తల సమక్షమున ఆసీనలై యున్నట్లును, చెక్కబడినది. సంగీత సభలలోను, విద్వద్గోష్ఠులయందును, నాట్యమండలులలోను, స్త్రీలు పురుషులతోపాటు సమాన ప్రతిపత్తియు, గౌరవాదరములును పొందుచుండుట ప్రశంసావహము.

ప్రాచీనాంధ్ర మహిళామణులపేర్లు కొన్ని మనకు శాసనముల మూలమున తెలియవచ్చుచున్నవి. వీరికి దేవి, సిరి (శ్రీ), భట్టారిక వంటి గౌరవ ఉపపదములు పేర్లకు ముందును, వెనుకను చేర్చబడు చుండెను. భర్తల రాజకీయాధికార సూచకములైన బిరుదులు, వారి వారి భార్యలకుకూడ చెల్లుచుండెను. దేవి నాగనిక అను నామె సాతవాహన చక్రవర్తియైన మొదటి శాతకర్ణిరాణి. ఈమె తన భర్తచేసిన క్రతువులను, వానిలో ఇచ్చిన భూరి దక్షిణలను ప్రశంసించుచు, నానేఘాటువద్ద శాసనము వేయించినది. నాగానిక రాణి యోగ్యశీలము శాసనములో నిట్లు వర్ణింపబడినది: "ఈమె ప్రతిమాసము ఉపవసించునది. గృహమందుండియు తాపసివంటిది. బ్రహ్మచర్యము చరించునది. దీర్ఘయజ్ఞ వ్రతములందు దీక్షితురాలు."

గౌతమి బాలశ్రీ :—ఈ ధన్యురాలు శాతవాహన చక్రవర్తులలో నగ్రగణ్యుడగు సాతకర్ణితల్లి. ఈతడు గౌతమీపుత్ర శాతకర్ణియను పేర ప్రసిద్ధుడు. ఈమె మనుమడును, వాసిష్ఠీ పుత్రుడును అగుపులోమావి నాసిక శాసనములో నిట్లు గౌతమి భూషింపబడినది: "మహాదేవి గౌతమి బాలశ్రీ సత్యదాన అహింసా నిరతురాలు, తపోదమ నియమోపవాస తత్పర, రాజర్షి పత్నికి గల యోగ్యత పూర్తిగ గలది. ఈమె బౌద్ధ భిక్షువుల యుపయోగార్థమై గుహను దొలిపించెను."

రాణి వాసిష్ఠీదేవి:—ఈమె గౌతమీపుత్ర సాతకర్ణి చక్రవర్తిభార్య. గౌతమి బాలశ్రీ కోడలు, పులోమావితల్లి, ఈ యత్త కోడండ్రు కుంతీ ద్రౌపదుల సరసను నిలువదగినవారు. వాసిష్ఠీ దేవి ధర్మకార్యము లొక నాసిక శాసనములో చెక్కబడినవి. తాను రాజ

మాత ననియు, జీవసుత (చిరంజీవియైన కుమారుడు కలది) యనియు నీమె సముచితముగ చెప్పుకొన్నది. తిరణ్హుపర్వతమునందొక గుహను బౌద్ధ భిక్షువులకై, దొలిపించి యిచ్చి, యాశ్రమణకుల జీవనము నకై, ఈమె యొక గ్రామము దానముచేసెనట. కాని వారా గ్రామమునందు నివసించక, ఆగ్రామ క్షేత్రములను వ్యవసాయము చేయనందున, గోవర్ధన నగరమునకు చెందిన రాజక్షేత్రమునుండి, మరికొంతభూమి దానముచేసి శాసనము వేయించినది. వాసిష్ఠిరాణి సౌమ్యశీలము గలదివలె తోచును. గోవర్ధనమునందలి రాజోద్యోగికి పై దాన సంబంధమైన ఆజ్ఞను పంపుచు ఈమె మున్ముందు ఆతని యారోగ్యమునుగూర్చి కుశలప్రశ్న చేయుట, ఎంతయు పొగడదగి యున్నది.

గౌతమీపుత్ర సాతకర్ణి కాలమునుండి, సాతవాహన చక్ర వర్తులు మాతృభక్తిపరులై, తమ తల్లిపేరు ముందు చెప్పి, తమ పేరు తరువాత చెప్పుకొనెడివారు. వాసిష్ఠీపుత్ర పులోమావి, మాఢరీపుత్ర శకసేనుడు, గౌతమీపుత్ర యజ్ఞశ్రీ శాతకర్ణి-ఇట్టి పేరులు శాతవాహనులలో నుండెను. ఈ యాచారమునే వీరి తరు వాత ఆంధ్ర దేశమునేలిన ఇక్ష్వాకువంశ రాజులుకూడ పాటించిరి. వాసిష్ఠీపుత్ర శాంతమూలుడు, మాఢరీపుత్ర శ్రీ వీరపురుషదత్తుడు, మొదలైనవి వారి నామధేయములు. ఇక్ష్వాకులకు సమకాలికులై, కన్నడదేశమేలిన చూటుకుల శాతకర్ణులును, ఈ సంప్రదాయము లోనివారే. పల్లవులుమాత్రము మాతృనామమును గ్రహించు నాచారమును వదలి పితృనామమును స్వీకరించుచుండిరి.

ఇక్ష్వాకు రాజులనాటి యాంధ్రస్త్రీలు భర్తల బిరుదులను దాల్చుచుండుట కాన్పించును. మహాతలవరి అడవి శాంతిశ్రీ. పెనిమిటి మహాతలవరి అనగా సేనాధిపతివంటి యుద్యోగి. భర్త బిరుదమునే ఈమెకును వాడిరి. మహాసేనాపతిని చూళశాంతి సిరినిక భర్త, సేనా పతి, స్కందచలికి రెమ్మణకుడు. వీరపురుషదత్తునియొక్క రాణిపేరు మహా దేవిరుద్రభట్టారిక. ఈమె యుజ్జయినీశక రాజుల యింటిపడుచు. ఆనాటి

రాజకాంతలపేర్లు ఇట్లుండెను: బాపిసిరినిక, మహాసిరినిక, శాంతిసిరి నిక. సునీతిసిరి, స్కందసిరి, నాగసిరి, నాగవాసుసిరి, రామసిరి, సురసిక, కుసుమలత. వీరు నాగార్జునకొండ శాసనములలో వినవచ్చు చున్నారు. ఈ యంతఃపుర స్త్రీలందరును బుద్ధధర్మ పరాయణలు; నాగార్జునకొండ మహాచైత్యమునకు ధనదానముచేసియు, ఆయక స్తంభములు ఎత్తించియు, పుణ్యముత్రోవపోయిన సాధ్వీమణులు. ఇక్ష్వాకువీరపురుషదత్తుని రాజ్యకాలములో, బోధిసిరియను సంపన్న బౌద్ధగృహస్థురాలుండెను. ఈమె తన ధర్మదానములచేత రాజ కాంతలనుకూడ క్రిందుచేసినది. ఇక్ష్వాకురాజుల ముఖ్యపట్టణమైన విజయపురియందలి శ్రీ పర్వత సంఘారామమున, ఈమె యెన్నియో ధర్మకార్యముల నెలకొల్పినది. కాశ్మీరము, గాంధారము, చీనీ దేశము, శిలాత, తోసలి, అపరాంతము, వంగ, వనవాస, యవన, ద్రవిడదేశములు, పాలూరు, తామ్రపర్ణి ద్వీపముల జనులను, సౌగత ధర్మములో ప్రవేశపెట్టిన బౌద్ధ సన్యాసుల యుపయోగార్థ మీామె యొక చైత్య గృహమును నిర్మాణముచేయించి, దానియందు సమస్త సౌకర్యములను కల్పించెను. ఇట్లు ప్రాచీనాంధ్రస్త్రీలు గృహమునకును, సంఘమునకును గూడ అలంకారప్రాయలై, పురు షులతో సమానమైన స్వేచ్ఛను వహించుచు, స్వతంత్ర ధర్మ కార్యములు సేయుచు వన్నెకు వాసికి నెక్కిరి.

మధ్యయుగమందలి యాంధ్రస్త్రీలిట్టి స్వేచ్ఛావాతావరణము ననుభవించినట్లు తోచదు. వారు చాలవరకు గృహమునందును, రాణివాసమునందును జీవితము గడిపినట్లూహించవలసియున్నది. దీనికి హేతువు ఆకాలపు కల్లోల రాజకీయ పరిస్థితులని చెప్పవలెను. మున్లానుల దాడులవలన దేశము అట్టుడికినట్లుడుకుచుండెను. స్త్రీ మానసంరక్షణము, గోబ్రాహ్మణరక్షణము, వీరుల రక్తతర్పణమును గోరిన దినములవి. కావున నబలలు సాధారణముగ గోప్యముగ బ్రతుకుచుండిరి. వారెండకన్నెరుగరు. అసూర్యంపశ్యలను వర్ణనము ఈకాలపు స్త్రీలయెడ సార్థకమయ్యెను. మహమ్మదీయులతో యుద్ధ

ములు సమసి, వైరాగ్ని కొంత చల్లారినమీదటకూడ, స్త్రీలకు తొల్లింటి స్వతంత్రత తిరిగి రాలేదు. యవనాచారమైన పరదా, గోషాపద్ధతి, హిందువులలోకూడ కొంతవరకు పాదుకొనెను. అట్లయ్యును మధ్య యుగపు టాంధ్రచరిత్రయందు ప్రతిభావంతురాండ్రైన స్త్రీలు పలువురు లేకపోలేదు. పల్నాటి వీరచరిత్రమునందు పేరుమోసిన నాగమ్మ, శీలమ్మ, మాంచాల, కాకతీయ చక్రవర్తిని రాణి రుద్రమ్మ, ఆమె సోదరి కోటగణపమ్మ, వంటివారు అంధకారమునందలి దీపికలు. రాజకీయరంగమునందును, ధార్మికరంగమందును, వన్నెగాంచిన వనితామతల్లులు కొందఱు శాసనములవలన దెలియవచ్చుచున్నారు.

కామసాని:—ఈమె దుర్జయాన్వయమందు బుట్టిన విరియాల యెఱ్ఱనరేంద్రుని ధర్మపత్ని. ఈ నారీలలామ చరిత్రము [1]గూడూరు శాసనమునుండి, అస్పష్టముగ మాత్రమే తెలియవచ్చుచున్నది. ఉపలభ్యమైనంతవరకు, ఈమె రాజకీయ కార్యచతురురాలును, వీరవనితయు నైనట్లు గాన్పించును. కామసాని భర్తయైన ఎఱ్ఱనరేంద్రుడు పొట్టిబేతరాజు (కాకతి బేతరాజు) పక్షమునవహించి, యాతని శత్రువులను సంహరించి, బేతని కొరవిదేశమునందు ప్రతిష్ఠించెను. కొలదికాలముననే బేతరాజు శత్రువులచే సిలుగులపడి, రాజ్యము పోగొట్టుకొను స్థితివచ్చినప్పుడుకాబోలు, కామసాని యాతని నాదుకొని, రిపులనణచి, భాస్కరనిభుడైన చక్రవర్తిని సందర్శించి, కాకతీయులను పునఃప్రతిష్ఠించి కీర్తిగాంచినది. ఈ భాస్కరనిభుడైన చక్రవర్తి కళ్యాణి చాళుక్యరాజైన త్రిభువనమల్ల విక్రమాదిత్యుడు. ఇట్లు కామసాని తనభర్త యారంభించిన కాకతి ప్రతిష్ఠాపన కార్యమును నిర్వహించిన ధీరవనితయని చెప్పనొప్పుచున్నది.

[2]ఎఱకసానమ్మ:—ఈ ధర్మాత్మురాలు రేచెర్ల పిల్లలమఱ్ఱి బేతిరెడ్డి సతీమణి. శా. శ. 1130 సంవత్సరమున నీమె పిల్లలమఱ్ఱి

1. తెలంగాణశాసనములు. లక్ష్మణరాయ పరిశోధకమండలి. హైద్రాబాదు.

2. చూడు. పిల్లలమఱ్ఱి శాసనముపై గ్రంథము.

యందు తనపేర శ్రీ ఎఱుకేశ్వర దేవుని ప్రతిష్ఠచేసి, ఆ దేవుని గుడికి సమస్తసదుపాయములును, తానే కల్పించినది. ఎఱుక సముద్రమను గ్రామమును స్థాపించి, తనపేర ఎఱుక మఠమును గట్టించినది. వీటి నిర్వాహణముకై విశాలమైన మాగాణిభూములను దానముచేసినది. ఇచ్చట గమనించవలసిన ముఖ్యాంశమేమన, ఈ సత్రములో విద్యార్థులు నివసించుచు చదువుకొనుచుండెడివారని తోచుచున్నది. ఏలనన విద్యార్థుల 'గ్రాసవాసస్సులకు' (అన్నవస్త్రములకు) కొన్ని ఎకరముల భూమి ప్రత్యేకింపబడినది. సత్రమున కనుబంధముగ చలివెందలయు దానికి నీళ్లు నడపెడివారికిని, వేరుగా క్షేత్రములు కేటాయింపబడినవి. ఇట్లీ ఎఱుకసానమ్మగారు సాక్షాత్తు అన్నపూర్ణవంటిదని చెప్పిన అత్యుక్తికాబోదు.

మధ్యయుగ స్త్రీలనుగూర్చి మనము పరికించదగిన యొక విశేషాంశము గలదు. వీరి నామధేయములు సంస్కృత వాసన బొత్తుగా లేని శుద్ధ దేశీయపదములు. ముమ్మక్క, కుయ్యమ్మ, మైలమ్మ, నాగసాని, కామసాని, ఎఱుకసాని, నంటివి వారిపేళ్లు. ప్రాచీనాంధ్ర స్త్రీల పేర్లు మనకు లభించినంతవరకు నోటికిని, చెవికిని నిండైన సంస్కృత పదములు.

వీరశైవ మత విజృంభణము మధ్యయుగ స్త్రీలోకమునందొక గొప్ప జాగ్రతి కలిగించినట్లు తోచుచున్నది. భక్తిప్రధానమైన మతమగుటచే, నిది స్త్రీలను మిక్కిలి యాకర్షించెను. భార్య శివభక్తురాలయి భర్తకాకుండినచో, నామె పెనిమిటిని నిరసించవచ్చునని [1]మల్లికార్జున పండితారాధ్యులు బోధించెను. బసవేశ్వరుని సోదరి నాగాంబ యాతనితోకలసి, ఇల్లువెడలిపోయి తపస్సుచేసినది. అంగనాజనము పురుషులతో కలిసితత్త్వవిచారము సేయుచుండెను. పండితారాధ్యులవారితో శైవధర్మ ప్రశంసలో పాల్గొన్న యాపె పోరండ్ల

1. శివతత్త్వసారము పద్యములు 231-234

సూరసానమ్మగారను భక్తురాలు. పాల్కురికి సోమనాథుని బసవ పురాణమునందు నిమ్మవ్వ, గుడ్డవ్వ, సంగళవ్వ, బెజ్జమహాదేవి, దుగ్గళవ్వ, మొదలగు భక్తురాండ్రచరిత్ర లెన్నియో వర్ణింపబడినవి. బసవేశ్వరుడు వర్ణధర్మమును దెగడి, సర్వవర్ణ సమానత్వమును బోధించెను. కావున వీరశైవము అగ్రవర్ణములందుకన్న, తదితర ప్రజానీకమునం దెక్కువ వ్యాప్తిగాంచెను. శివభక్తురాండ్రు తరుచు ఈతరగతుల వారుగా గన్పింతురు.

విజయనగర సామ్రాజ్య వైభవము చెల్లిన శతాబ్దములలోను, నాయక రాజయుగమునందును స్త్రీలు కార్యక్షేత్రమునందుకన్న, కళారంగమునం దెక్కువగా ప్రత్యక్షమగుచున్నారు. లలిత కళలైన సంగీతము, చిత్రలేఖనము, నృత్యము వారి సొంతసొమ్ములు. ఆంధ్ర సారస్వతమందలి ప్రబంధనాయక లందరును వీణావాదన కుశలు రాండ్రు. వరూధిని, కలభాషిణి, గిరికాదేవి మొదలగువారికి గానము వెన్నతోబెట్టిన విద్య. పింగళి సూరన [1] ప్రభావతీ ప్రద్యుమ్నకథను బట్టి అంతఃపుర కాంతలు చిత్రలేఖనము నభిమాన విద్యగ నేర్చుచుండి రని యూహింపవచ్చును. [2] నాట్యకళ గణికాజనమువారి యధీనములో నుండినట్లు నాయక రాజయుగమున ఎన్నియో నిదర్శనములు గలవు. తమ ప్రత్యేక కళాసీమల నేలుటతో తృప్తిపడక, ఈకాలపు నారీ రత్నములు పురుషుల కాణాచిగా తలపబడుచుండిన సాహిత్య క్షేత్రము లోనికికూడ ప్రవేశించి, తమ లలిత ప్రజ్ఞను వెలయించియున్నారు. [3] మొల్ల, ముద్దుపళని రంగాజమ్మవంటివారిని గణింపవచ్చును. కొందఱు విదుషీమణులు గీర్వాణభాషాకావ్యములగూడ విరచించి, వాసి కెక్కిరి. రామభద్రాంబయను కవయిత్రి రఘునాథాభ్యుదయ కావ్య

1. రాగవల్లరి, రాజకుమారుల చిత్రములను వ్రాసి ప్రభావతికి చూపుట.

2. రాధికా సాంత్వనము – ముద్దుపళని.

3. చూడు. ఆంధ్రకవయిత్రులు. ఆంధ్రసాహిత్య చరిత్రసంగ్రహము ఖం ॥ లక్ష్మీరంజనము.

మును సంస్కృతములో వ్రాసెను. మధురవాణియనునామె రఘునాథుని రామాయణమును సంస్కృతీకరించెను.

స్త్రీలు చిత్రవస్త్రములను, చిత్రభూషణములను, ధరించుటకు ముచ్చటపడుచుండిరి. నగలు పెట్టుకొనుట సౌభాగ్యహేతువనియు, అవి లేకుండుట మాంగల్య లోపమనియు, కాంతామణులు విశ్వసించుచుండిరి. పింగళి సూరనకవి కళాపూర్ణోదయములోని సుగాత్రీ శాలీనుల కథ దీనికి చక్కని యుదాహరణము కాగలదు.

యుగయుగములనుండియు పురుషులయందు వ్యాపించియున్న బహుభార్యాత్వము నారీలోకమునకొక బాధాకరమైన సమస్యగా నుండెను. ప్రాణభయముకన్న, కులకాంతను సపత్నీసంభవము వెఱపు గొలుపుచుండెను. వీనికితోడు గోఱుచుట్టుపై రోకటిపోటన్నట్లు, వారవనితలు, చకోరికలై కుటుంబినుల సుఖసంతోష చంద్రికల మెసవి, యుల్లసిల్లుచుండిరి. బహుకాంతాప్రీతి పురుషులకొక అలంకారము, గౌరవ హేతువుగా చెల్లుచుండెను. అనేకమంది వనితలను సమానముగ వలచి, వలపింపజేయగల పురుషుడు దక్షిణనాయకుడను విశేషఖ్యాతిని పొందెను. ఒక పడతికి ఒకేభర్త. జీవితమునందొక్కమారే అనెడి కఠినసూత్రము ధర్మశాస్త్రములు విధించెను. ఇట్లగుట స్త్రీ జీవితము కత్తిమీద సాముగా నుండెడిదని యూహింపవచ్చును. అంగనకు రెండవ వివాహము నిషేధింపబడినందున, భర్తయే ఆమె జీవిత సర్వస్వముగా నుండెను. పేదకు పెన్నిధివలె ఈ పెనిమిటి యను ధనమును, సర్వదా రక్షించుకొనుటయు, వాని గుణావగుణములతో సంబంధము లేక యాతని రంజింపచేయుటయు, స్త్రీకి విధ్యుక్తము, జీవితలక్ష్యమునయ్యెను. జీవభర్తృక యగుటయే వనితలకు మహాద్భాగ్యము, అను విశ్వాసము పరిపరి విధముల బోధింపబడుచుండెను. ఈ వ్యవస్థవలన గృహజీవితము నిరపాయమై, సంఘక్షేమము చాల వరకు సాధింపబడుచుండెడిదనుట నిర్వివాదాంశము. స్త్రీకి సుఖము, భద్రత, తగుమాత్రమైన జీవితస్థైర్యము, సంఘమునందు పరపతి

లభించుచుండినమాట వాస్తవము. కాని తన జీవితనౌకను తనయిచ్ఛ వచ్చినట్లు, సంసార సముద్రమున విహరింపజేసికొను స్వేచ్ఛ, యా కాలపు మహిళలకు లేకుండెను. ఈ రెండవ వ్యవస్థ వర్తమాన కాలమున సంఘసంస్కర్తల కృషిచేతను, ప్రభుత్వశాసనముల మూలమునను, నారీలోకమునకు అందజేయబడుచున్నది. దీని ఫలితమగు సుఖదుఃఖములు, సమస్యలు భవిష్యద్గర్భమందిమిడియున్నవి.

శంకాశీలమైన సంఘమునందు, మాంగల్యమే స్త్రీకి నైతిక కవచముగను, పెట్టని కోటగను, ఉండుటచేత దానిని నిరపాయముగ కాపాడుకొనుటకై వేయిదేవుళ్లకు మ్రొక్కుట యామెకు శరణ్యమయ్యెను. స్త్రీలు ఆచరించెడు నోములు, వ్రతములు పూజలకన్నిటికి నిదియే లక్ష్యము. కాంతాజనమును కాటియపెట్టిన మరొక సమస్య సమష్టి కుటుంబపద్ధతి. కలసి శ్రమించుట - కలసి సుఖించుట అను సూత్రముమీద నేర్పడిన ఈ విధానము మంచిదయ్యెను, కుటుంబ రాజులయందు సామరస్యము లేకుండినచో, అది పెద్ద నరకముగా మారుచుండెను. సమష్టి సంసారములలో పురుషులొక విధముగా కలిసి జీవించగల్గినను, స్త్రీలు మాట యతుకక, కలహించుట గాంచనగును. "రెండుకత్తులొక యొరలోనిముడునుగాని రెండుకొప్పులొకయింటిలో నిముడవు" అనునది సామెత యయ్యెను. సమష్టి కుటుంబములలో వినవచ్చు కిరకిర, అపశ్రుతులు, ప్రస్తుతకాలమునందే పుట్టినవనియు పూర్వము గృహము శాంతిధామముగా నుండెడిదనియు, పూర్వాచార పరాయణులు చెప్పుచుందురు. కాని అవియంత విశ్వసనీయములు గావు. కుటుంబ కలహము లీనాటివిగావు. [1]ప్రాచీన సంఘమందును ఉండెడివి. అత్తలాడుబిడ్డలనడుమ మెలగగలుగుట పడతులు నేర్వవలసిన తొలిశిక్షణముగా నుండెను. క్రొత్తకోడలికిని, అత్తవారింటి స్త్రీలకును, మెఱమెఱలునిత్యదృశ్యముగా నుండెను. ఆడుబిడ్డ సగము మగడు, అత్తలేనికోడలు ఉత్తమురాలు, కోడలులేని అత్త గుణవంతురాలు, మొదలగు పెక్కుసామెతలు గృహవనితాజన

1. చూడు. భోజరాజీయము అనంతామాత్యుడు. ఆఱవ ఆశ్వాసము.

మందలి కలహకంఠితనమునుండియే పుట్టినవి. విద్యాగంధము లేకుండుటయు, కష్టపడి సంసారపు ముక్కచాకిరితప్ప, మనోరంజకములగు వ్యావృతులు లేకుండుటయు, స్త్రీలు కలహశీలురుగ నుండుటకు హేతువులని యెంచవలెను. నూతన వధువుకు భర్తృగృహమునందు లభించవలసిన స్థానము విషయమై, ఆర్యాచారములు దేశీయాచారములకన్న ప్రశంసనీయములుగా నున్నవి. క్రొత్త కోడలిని ఇంటిదాసిగా చూచుట దేశ్యాచారము. వధువును గృహరాజ్ఞిగా సంభావించుట [1]యార్యపద్ధతి.

మాంగల్య సంరక్షణ, మూసిన ముత్తెమువలె అత్తవారింట సంచరింపగల్గుట, అను లక్ష్యద్వయ సాధనమునకై ఎన్నియో నోములు ఆచరణలోనికి వచ్చెను. బాలికలును, ముద్దియలును, పెరిగి పెద్దవారగు లేతవయస్సునందు, వారికి సౌశీల్యము మితభాషిత్వము పులుగడిగిన ముత్తెమువలె నుండుట, మొదలగు ప్రశంసనీయమైన లక్షణములను నేర్పుటకీ నోములెంతయో తోడ్పడుననుట నిర్వివాదాంశము. పాశ్చాత్య నాగరకతయు, నాస్తికతయు, పెచ్చు పెరిగిన వర్తమానకాలమున స్త్రీలనోములు అపహాస్య భాజనములై మాటుపడుచుండుట మహిళాలోకమునకును, సంఘమునకునుగూడ నష్టహేతువని చెప్పకతప్పదు. అర్థవంతమైన ఈ నోములలో స్త్రీజనవిజ్ఞాన మెంతయో యిమిడియున్నది. అట్టివానిని కొన్నిటిని పరికింతము.

(1) కన్నె తులసమ్మనోము:—ఇది పెండ్లికాని లేబ్రాయపు బాలిక లాచరించు నోము. తులసికోట యింటి కల్పవృక్షము. ఇల్లాలు లేని యిల్లువలె తులసిలేని యంగణము శూన్యము. భారత స్త్రీలు భూమికవతరింపజేసిన, శాంతిదూత తులసియని చెప్పనొప్పును. కన్నెపిల్లలు ప్రొద్దుప్రొద్దున లేచి, శుచులై, తులసమ్మవద్ద ఐదు

1. మాకు. మంత్రపన్నములు. వివాహకాండ సమ్రాజ్ఞీశ్వశురేభవ సమ్రాజ్ఞీ శ్వశ్ర్వాంభవ ననాందరిసమ్రాజ్ఞీభవ - సమ్రాజ్ఞీ అధిదేవృషు, స్నుషాణాగంశ్వశురాణాం ప్రజాయాశ్చధనస్యచ - పతీనాంచ దేవరాణాంచ సజాతానాం విరాడ్భవ.

పద్మములు ముగ్గులుపెట్టి, ఐదువత్తులు వెలిగించి పూజింతురు. ఈ నోము శివరాత్రికి నారంభించి యొకవత్సరము చేయవలెను. కన్నె కకు మాత్రమే ఉద్యాపనచేయుదురు. ఉద్యాపనమనగా నిర్ణీత వ్రతాంతమున దాన ధర్మము లాచరించి వ్రతసమాప్తి చేయుట.

స్త్రీల నోములు కొన్ని ఏకవార్షికములు. కొన్ని బహువార్షికములు. ఏకవార్షికములు సాధారణముగ రథసప్తమికి (మాఘశుద్ధ సప్తమి) గాని శివరాత్రికిగాని యారంభించి, యొక ఏడాదిపాటు చరించునవి. అనగా ఉత్తరాయణమునందివి పూనుట యాచారము. బహువార్షికములు సంవత్సరమునందే దేని యొకమాసమునగాని, దినమునగాని, చరించునవి. అట్లనేక పోయసనములు నడుపవలెను.

నూతనముగా పెండ్లియయి వచ్చుచున్న మొగ్గలవలెఉన్న తరుణ బాలికలు పట్టవలసిన నియమములు, నోములు నెన్నియో కలవు. ఇప్పటినుండియే వీరి శీలాభ్యసన మారంభమగును. మగపిల్లలకు ఉపనయనము నియమాచరణమునకు శ్రీకారమైనట్లే, బాలికలకు పెండ్లియగుట, ఆత్మసంయమన పథమునందు మొదటి మజిలీ.

పెండ్లి జరిగిన బాలలు పట్టునోములు:—

(1) చిట్టిబొట్టు:—ప్రతినిత్యము ఐదుగురు పేరటాండ్రకు పసుపుకుంకుమ, గంధము, అక్షతలు, ఉదయమున ఇచ్చుట. ఒక యేడాది ఇట్లు నడిపి, సంవత్సరాంతమున నైదుగురు పుణ్యస్త్రీలకు, ఐదు కుంకుమ బరణులతో ఉద్యాపనచేయుట. సౌభాగ్య చిహ్నములైన హరిద్రా కుంకుమలయెడ బాలికలకు, శ్రద్ధాభక్తులు పోషించుటకిది యుద్దేశింప బడియుండును. పెద్దవారైన స్త్రీలయెడ భక్తిని బోధించును.

(2) ఉదయకుంకుమ—సూర్యోదయమునకు పూర్వమే లేచి, పుణ్యస్త్రీకి కుంకుమపెట్టి, తానలంకరించుకొనుట. కాంతాముఖశ్రీకి తిలకము వన్నెదెచ్చుననుటను ఇది బోధించును. బరిణె నిండు కుంకుమతో నుద్యాపనము చేయుదురు.

(3) నిత్యశృంగారము:—నిత్యము సాయంసమయమున నొక ముత్తయిదువకు పసుపురాచి, పారాణిపెట్టి, తాంబూలమిచ్చి, దువ్వె

నతో పాపట సవరించి, అద్దముచూపుట దీనివిధానము. బాల్యము వీడి, తొలి యౌవనమునందు కాలూదుచున్న, ముగ్ధలకు అందము చేసికొనుటను శిక్షించుటకిది యుపకరించును.

(4) దంపతి తాంబూలము:— నిత్యము దంపతులకు తాంబూలమిచ్చి యక్షతలు వేయించుకొనుట. పుణ్యాదంపతుల యాశీస్సుల వలన, నోమిన పడుచునకుగూడ అనుకూలదాంపత్యము సిద్ధించుగాక యని వేడుట దీని సారాంశము.

దీర్ఘకాలము పట్టునోములు కొన్ని వివరింపబడుచున్నవి. ఇవి సాధారణముగ శ్రావణమాసముతో మొదలిడును.

(1) శ్రావణమాసమునవచ్చు ప్రతి మంగళవారమునను క్రొత్తగా పెండ్లిఅయిన బాలికలు మంగళగౌరీవ్రతము చేయుదురు. శివునికొమ్మ సౌభాగ్యపురెమ్మ. ఈ మాసమునందే పూర్ణిమకు ముందువచ్చు శుక్రవారమునాడు స్త్రీలు వరలక్ష్మీపూజ చేయుదురు. వరలక్ష్మిదేవి సంపదలిచ్చును. వ్రతములు నోములతోపాటు, వానిని ప్రశంసించుకథ యొకటి చెప్పబడుచుండును. ఇవి బ్రాహ్మణముల లోని అర్థవాదముల వంటివి. వరలక్ష్మిని కొల్చిన చారుమతి యను భక్తురాలి కథ యింపుగానుండును. నూతనవధువునకు అత్తవారి వ్రతము నాటికి బంగారుసొమ్ములు తెచ్చుట యాచారము. ఈ వ్రతము ఐదు వత్సరములు చేయవలెను.

(2) పొలాల అమావాస్య:—శ్రావణ బహుళ అమావాస్య ప్రాధాన్య మిదివరలో ప్రశంసింపబడినది. పిలకలతోనున్న కంద దుంపకు పసుపురాచి, బొట్లుపెట్టి, ప్రౌఢస్త్రీలు కొలుతురు. ఇది సంతానపు క్షేమమునభిలషించిచేయు వ్రతము. తోరమునకు పసుపు కొమ్ములుకట్టి ముత్తైదువలు మెడలో వేసికొందురు. చివరకిట్లు దీవన పల్కుదురు: "శక్తితప్పినా భర్తతప్పరాదు – వాక్కుతప్పినా వరము తప్పరాదు-అక్షతలు తప్పినా ఐదువతనము తప్పరాదు."

(3) అట్లతదియ:—ఆశ్వయుజ బహుళ తదియనాడు, రోహిణీ నక్షత్ర యుక్తుడైన చంద్రుని వనితలు పూజింతురు. నిశానాథునివంటి

పద్మములు ముగ్గులుపెట్టి, ఐదువత్తులు వెలిగించి పూజింతురు. ఈ నోము శివరాత్రికి నారంభించి యొకవత్సరము చేయవలెను. కన్యకకు మాత్రమే ఉద్యాపనచేయుదురు. ఉద్యాపనమనగా నిర్ణీత వ్రతాంతమున దాన ధర్మము లాచరించి వ్రతసమాప్తి చేయుట.

స్త్రీల నోములు కొన్ని ఏకవార్షికములు. కొన్ని బహు వార్షికములు. ఏకవార్షికములు సాధారణముగ రథసప్తమికి (మాఘశుద్ధ సప్తమి) గాని శివరాత్రికిగాని యారంభించి, యొక ఏడాదిపాటు చరించునవి. అనగా ఉత్తరాయణమునం దివి పూనుట యాచారము. బహువార్షికములు సంవత్సరమునం దేదేని యొకమాసమునగాని, దినమునగాని, చరించునవి. అట్లనేక హాయనములు నడుపవలెను.

నూతనముగా పెండ్లియయి విచ్చుచున్న మొగ్గలవలెఉన్న తరుణ బాలికలు పట్టవలసిన నియమములు, నోములు నెన్నియో కలవు. ఇప్పటినుండియే వీరి శీలాభ్యసన మారంభమగును. మగపిల్లలకు ఉపనయనము నియమాచరణమునకు శ్రీకారమైనట్లే, బాలికలకు పెండ్లియగుట, ఆత్మసంయమన పథమునందు మొదటి మజిలీ.

పెండ్లి జరిగిన బాలలు పట్టునోములు:—

(1) చిట్టిబొట్టు:—ప్రతినిత్యము ఐదుగురు పేరటాండ్రకు పసుపుకుంకుమ, గంధము, అక్షతలు, ఉదయమున ఇచ్చుట. ఒక యేడాది ఇట్లు నడిపి, సంవత్సరాంతమున నైదుగురు పుణ్యస్త్రీలకు, ఐదు కుంకుమ బరిణులతో ఉద్యాపనచేయుట. సౌభాగ్య చిహ్నములైన హరిద్రా కుంకుమలయెడ బాలికలకు, శ్రద్ధాభక్తులు పోషించుటకిది యుద్దేశింప బడియుండును. పెద్దవారైన స్త్రీలయెడ భక్తిని బోధించును.

(2) ఉదయకుంకుమ—సూర్యోదయమునకు పూర్వమే లేచి, పుణ్యస్త్రీకి కుంకుమపెట్టి, తానలంకరించుకొనుట. కాంతాముఖశ్రీకి తిలకము వన్నె దెచ్చుననుటను ఇది బోధించును. బరిణె నిండు కుంకుమతో నుద్యాపనము చేయుదురు.

(3) నిత్యశృంగారము:—నిత్యము సాయంసమయమున నొక ముత్తయిదువకు పసుపురాచి, పారాణిపెట్టి, తాంబూలమిచ్చి, దువ్వె

నతో పాపట సవరించి, అద్దముచూపుట దీనివిధానము. బాల్యము వీడి, తొలి యౌవనమునందు కాలూదుచున్న, ముగ్ధలకు అందము చేసికొనుటను శిక్షించుటకిది యుపకరించును.

(4) దంపతి తాంబూలము:— నిత్యము దంపతులకు తాంబూలమిచ్చి యక్షతలు వేయించుకొనుట. పుణ్యదంపతుల యాశీస్సుల వలన, నోమిన పడుచునకుగూడ అనుకూలదాంపత్యము సిద్ధించుగాక యని వేడుట దీని సారాంశము.

దీర్ఘకాలము పట్టునోములు కొన్ని వివరింపబడుచున్నవి. ఇవి సాధారణముగ శ్రావణమాసముతో మొదలిడును.

(1) శ్రావణమాసమునవచ్చు ప్రతి మంగళవారమునను క్రొత్తగా పెండ్లిఅయిన బాలికలు మంగళగౌరీవ్రతము చేయుదురు. శివునికొమ్మ సౌభాగ్యపురెమ్మ. ఈ మాసమునందే పూర్ణిమకు ముందువచ్చు శుక్రవారమునాడు స్త్రీలు వరలక్ష్మీపూజ చేయుదురు. వరలక్ష్మీదేవి సంపదలిచ్చును. వ్రతములు నోములతోపాటు, వానిని ప్రశంసించుకథ యొకటి చెప్పబడుచుండును. ఇవి బ్రాహ్మణముల లోని అర్థవాదముల వంటివి. వరలక్ష్మిని కొల్చిన చారుమతి యను భక్తురాలి కథ యింపుగానుండును. నూతనవధువునకు అత్తవారీ వ్రతము నాటికి బంగారు సొమ్ములు తెచ్చుట యాచారము. ఈ వ్రతము ఐదు వత్సరములు చేయవలెను.

(2) పోలాల అమావాస్య:—శ్రావణ బహుళ అమావాస్య ప్రాధాన్య మిదివరలో ప్రశంసింపబడినది. పిలకలతోనున్న కంద దుంపకు పసుపురాచి, బొట్లుపెట్టి, ప్రౌఢస్త్రీలు కొలుతురు. ఇది సంతానపు క్షేమమునభిలషించిచేయు వ్రతము. తోరమునకు పసుపు కొమ్ములుకట్టి ముత్తైదువలు మెడలో వేసికొందురు. చివరకిట్లు దీవన పల్కుదురు: "శక్తితప్పినా భర్తతప్పరాదు – వాక్కుతప్పినా వరము తప్పరాదు–అక్షతలు తప్పినా ఐదువతనము తప్పరాదు."

(3) అట్లతదియ:—ఆశ్వయుజ బహుళ తదియనాడు, రోహిణీ నక్షత్ర యుక్తుడైన చంద్రుని వనితలు పూజింతురు. నిశానాథునివంటి

యాహ్లాదకరుడైన పెనిమిటి లభించవలెనని ఈ నోము చేయబడు చున్నది. వృద్ధుడును, వికలాంగుడు నైన భర్తరాకుండుటకూడ కాంక్షితమే. తదియ తెల్లవారకట్ల బాలికలు పెరుగన్నముతిని ఉదయమగువరకును స్వేచ్ఛగా ఆటలాడుకొందురు. పగలంతయు నుపవసించి, చంద్రోదయము కాగానే పూజచేసికొందురు. వ్రత లోపమునకు శిక్ష ముసలిమగడు కలుగుట. ఇది స్త్రీలకు, అందును ముక్కుపచ్చలారని బాలికలకు మిక్కిలి దుఃఖహేతువు. [1] "ఒకప్పుడు బాపనారక్కమ్మ, రాచారక్కమ్మ, కోమటారక్కమ్మ యీనోము పట్టిరి. రాచకన్య సుకుమారియగుటచే ఆకలికి తాళజాలకపోయెను. ఆమె యన్నలు జాలివహించి, చంద్రదర్శనమైనట్లు భ్రమ కల్పించి, యామెచే అట్లు నారగింపచేసిరి. తత్ఫలితముగా రాచారక్కమ్మకు వయసు చెల్లిన వరుడురాగా, ఆమె తన తప్పిదమును తెలిసికొని యథావిధిగ ఈనోము నాచరించెనట" ఇది పది సంవత్సరములు నడుపవలసిన వ్రతము.

(4) మూగనోము:—దీపావళిమొదలు కార్తీకశుద్ధ పూర్ణిమ వరకును బాలికలు దీనిని నోముదురు. వాఙ్నియమమును వారికల వరచుట దీని యుద్దేశము. సమష్టి కుటుంబములో మెలగవలసిన పడతికి, మూగనోము మంచి శీల పోషకము. సాయంకాలము నాల్గు గడియలవేళ అన్నముతిని, సింగారముచేసికొని, గౌరిదేవిని పూజించి, ఊరిపేరంటాండ్రకు వధువు బొట్టుపెట్టి రావలెను. తరువాత నక్షత్ర ములను లెక్కపెట్టవలెను. బొట్టుపెట్టుటకు బయలు దేరునప్పటి నుండి తారకాసందర్శనమువరకును, బాలిక మాటలాడరాదు. ఎవ్వ రెట్లు పలుకరించినను, పరియాచకమాడినను, పెదవి విప్పరాదు. ఆకాశము మేఘావృతమై రిక్కలు కనబడనప్పుడు జల్లెడ దీపమున కడ్డముపట్టి చిల్లులను లెక్కింతురట. ఇది మిక్కిలి రమ్యమైన నియ మాచరణము. మూగనోము మూడేండ్లు పట్టుదురు. గౌరీపూజానంతర మొకపాట పాడుదురు. సాంధ్యశోభను వర్ణించునీగేయము ముద్దులు

1. చదువుము. పూర్ణమ్మ శోకాంతగాథ - గురుజాడకవి ముత్యాల సరములు

మూటగట్టుచుండును. ఈ నోమునకు మరియొక పేరు మోచేటిపద్మము (మొగుచు ముకుళించు పద్మమేమో)

మోచేటి పద్మమ్ము పట్టేటివేళ
మొగ్గల్లు తామర్లు ముడిగేటివేళ
ఆవుల్లు లేగల్లు వచ్చేటివేళ
ఆంబోతురంకెల్లు వేసేటివేళ
సందేళ దీపమ్ము పెట్టేటివేళ
చాకింటి మడతల్లు తెచ్చేటివేళ
బీరాయి పువ్వుల్లు విడిచేటివేళ
కోడల్లు పసుపుల్లు కొట్టేటివేళ
కూతుళ్లు గుండు గిన్నెల్ల కడిచేటివేళ
ముద్దుల మొగము అద్దాన్నిబోలు
ముద్దురాలిమొగము మోచేటి పద్మమ్ముబోలు
పద్మమునోచిన చానకు పదివేల ఐదవతనము.

(5) నాగులచవితి:—కార్తిక శుద్ధ చవితికి స్త్రీలు నాగపూజ సేయుదురు. "అత్తగారుకొల్చిన నాగేంద్రుడా. అత్తగారత్తగారు కొల్చిన నాగేంద్రుడా! నేనుగొల్చిన నాగేంద్రుడా" అని చెప్పుచు పుట్టలో పాలు పోయుదురు. నాగుమయ్యకు దీపము పనికిరాదు. వేడి వస్తువులు వర్జ్యములు.

(6) బొమ్మల నోము:—ఇది సంఘవ్రతమని చెప్పదగును. గ్రామపు ముత్తైదువలందరును బాలికలును కలసి, యొకచోగూడి ఈ నోము చేయుదురు. దీనికగు వ్యయమును వారందరును కలసి భరింతురు. సంక్రాంతినుండి దీనియారంభము. మూడుపండుగలు వెళ్లిన ముక్కనుమనాడు స్త్రీలందరును మేళతాళములతో, కుమ్మరి ఇంటికి పోయి, బొమ్మలు రేగడిమట్టితో చేయించి తెచ్చుకొందురు. వానికి ధాన్యమును బహుమతి ఇత్తురు. సావిత్రి గారిదేవియు, పంచాంగపు బ్రాహ్మణుడును, ప్రధానమైన పుత్రికలు. తొమ్మిది దినములు

దినమునకొక పిండివంటచేసి నైవేద్యము లిడుదురు. ఇట్లు తొమ్మిది సంవత్సరములు చేయవలెను. ప్రతిదినమును ప్రార్థనావాక్యముల వంటివి చెప్పుకొనవలయును. వానిలో ప్రధానమైనవి.

(అ) దండనాలు:—బియ్యము తిరుగబోయుచు పలుకవలెను. "తల్లిదండన, తండ్రిదండన; అత్తదండన మామదండన పురుషుడి దండన, పుత్రుని దండన, రాచదండన, యమదండన ఎప్పటికివద్దు. సహోదరదండన చాలాకావాలె. స్వర్గానికి వెళ్లినా సవతిపోరువద్దు. మేడమీదికి వెళ్ళినా మారుతల్లివద్దు. సావిత్రి గౌరిదేవమ్మ! నీదండన ఎల్లకాలం కలగాలి." 'న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి' యను శోకభావ మును బాలికల మనస్సున కెక్కించుట కివి పుట్టియుండును.

(ఆ) దీపము నీళ్లలో ప్రతిఫలింపజేసి యిట్లు చెప్పుకొందురు. "చూస్తిచూస్తి ఏం జూస్తి. దేవదేవరచూస్తి. దేవి దేవర ఏం చేస్తున్నారు. ముత్యాలు రత్నాలు జూదమాడుతున్నారు. ఎవరుగెల్చి రెవరోడిరి. ఇద్దరూ ఏకసమమే. అందు కెవరుసాక్షి, నందిసాక్షి నాగమయ్యసాక్షి, కోటసాక్షి, కొమ్మసాక్షి, కోటలోఉండే పంచాంగ బ్రాహ్మణుడుసాక్షి. ఎడనున్న ఎల్లసాక్షి, కడనున్న గంగమ్మ సాక్షి, సావిత్రి గౌరిదేవమ్మ నీకు నేను సాక్షి, నాకు నీవు సాక్షి."

(ఇ) నీళ్లు తలపై చల్లుకొనుచు నిట్లుపఠింతురు.

"కంటికంటి ఏం గంటి. కిందాన కిల్లుగంటి (క్రింద నొక యిల్లు కంటి కావచ్చును) మీదాన మెట్లుగంటి, సావిత్రి గౌరిగంటి చల్ల మెట్ల గౌరుగంటి కోరని కొడుకులగంటి తరగని ఐదువతనముగంటి పాయక శ్రీ గౌరి పాదాలగంటి."

బతకమ్మ పండుగ[1]:—ఇది తెలంగాణా స్త్రీలోకమునందు విశేష ప్రచారములోనున్న కళామయ పూజావిధానము. పేరును బట్టియే దీనియందు భక్తియు వినోదమును మేళవింపబడినవని గోచ

1. విశేషములకొరకు. చూడు. వ్యాసము. "స్త్రీలపండుగలు - బతకమ్మ పండుగ" శ్రీమతి నందగిరి ఇందిరాదేవిగారు మేధావి సంపు 1. సంచి 6. హైదరాబాదు.

రించును. బతకమ్మ - బ్రతుకుఅమ్మ - జీవనాధారమైన తల్లి కావచ్చును. స్త్రీలకు మాంగల్యమునిచ్చి, రక్షించు చల్లనితల్లి బతకమ్మయైయుండును. లేదా, జరామరణదూరమై శశ్వత్ప్రకాశముగలతల్లి బతకమ్మ అనియైన చెప్పవచ్చును. బతకమ్మ పేర మంగళగౌరీదేవి పూజింపబడుచున్నది. ఇంతకుముందు వర్ణించిన బొమ్మల నోమువలెనే, బతకమ్మ పండుగకూడ సంఘ పూజావిధాన మని చెప్పవలెను. బొమ్మలనోమునందువలె దీనియందు, నిష్ఠానియమములు కట్టుబాటుగా విధింపబడుటలేదు. ఆశ్వయుజశుద్ధ పాడ్యమి నుండి మహార్నవమివరకు స్త్రీలు బతకమ్మను కొలుతురు. బతకమ్మ పండుగకు ముందు తొమ్మిది రోజులు బొడ్డెమ్మ పండుగ నడుచును. బొడ్డెమ్మ మహాలయ అమావాస్యతో పరిసమాప్తమగును. మహాలయ పక్షము, ఆర్యులకు పితృదేవతల నర్చింపవలసిన పవిత్రకాలము. ఈ దివసములే దేశీయులకు హాసలీలా క్రీడలతో వెల్లింపదగిన శుభ సమయమగుట గమనింప దగినవి. ఇట్టి పండుగలలో ఒకటి వర్ష ఋతు సమాప్తిని, మరియొకటి శరదృతువు ఆగమనమును సూచించును. వర్షాశరత్సంధ్యా ప్రకృతిలీలను అనుగమించుచు, బయలు దేరిన ఈ పండుగలు, ఋతులక్ష్మి సమారాధనమని చెప్పనొప్పును. బొడ్డెమ్మను నోముట బాలికలవంతు. పీటమీద మన్నుతో అరుగు కట్టి, పూవులు నాలుగు మూలలగ్రుచ్చి, కలశారోపణముచేసి ఆడుకొందురు. బాలికలు, ముత్తైదువలు, అందరును కలసి సేవించు దేవత బతకమ్మ. ఈఋతువులలో ప్రకృతి, పుష్ప సమృద్ధమయి హాసలీలను విరజిమ్ముచుండును. తంగేడు, గునుగు, రుద్రాక్షు, గుమ్మడి, గోరంట, బంతి, పిరంగిబంతి, పట్నంబంతివంటి సర్వమంగళ సుమజాతమును కుప్పలుతిప్పలుగ తెచ్చి, బతకమ్మను నేర్పుతో పేర్చెదురు. బతకమ్మను పూలతో ఎత్తుక పేర్చు టొకశిల్ప విన్నాణము. పూజావిధానములో నొకఅంగముగ స్త్రీలందరును పాటలు పాడుచు, నృత్యము సేయుదురు. వన్నెవన్నెల చీరలతో, తీరుతీరు శృంగారములతో, గిల్లిన పాల్గారు బాలికలనుండి, పండు తముల పాకువంటి ముసలి ముత్తైదువలవరకు బతకమ్మ సన్నిధిని లాస్యము

చేయుట ఒక సుందర దివ్య సన్నివేశము. తొమ్మిదవనాడు బత కమ్మల నన్నిటిని చెఱువులోగాని నదిలోగాని వాలారింతురు.

స్త్రీల సభ్యతా విశేషములు వారు పాడుకొను అసంఖ్యాకము లైన పాటలయందు గాంచనగును. అవి కరుణరసాత్మకములై, మృదుహాస్యయుతములై, యుండును. పౌరాణిక కథలన్నియు నీపాటలరూపమున స్త్రీలకు పరిచయము చేయబడినవి. తత్త్వబోధ కములైన పాటలుకూడ పెక్కుగలవు.

# ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి



## 10–వ ప్రకరణము

### (క్రీ. పూ. 6, 5 శతాబ్దములలో ఆంధ్రదేశస్థితి)

ఆంధ్రదేశమునకు సంబంధించినంతవరకు ఈ కాలమును చరిత్రకందని యుగముగా పరిగణింపవలెను. ఇప్పటి చరిత్రకు సాధనములు (1) బౌద్ధవాఙ్మయము (2) హిందువుల సూత్ర వాఙ్మయము, స్మృతులు మొదలైనవి. వీనియందు లభించు కొన్ని సూచనలను బట్టియే ఆంధ్రదేశస్థితిని ఊహించవలెను. క్రీ. పూ. ఆరవ శతాబ్దమున ఉత్తరదేశమునందు మగధరాజ్యము ప్రబలశక్తివంతమై, విజృంభించెను. ఇప్పుడు మగధను పాలించినవారు శిశునాగ వంశమువారు. వీరిలో క్రీ. పూ. 543 నుండి 491 వరకు పరిపాలించిన బింబిసారుడును క్రీ. పూ. 491 నుండి 459 వరకు రాజ్యము చేసిన అజాత శత్రువును, మిక్కిలి సమర్థులు. ఈ కాలమునందే మహనీయుడగు గౌతమబుద్ధుడు క్రీ. పూ. 563 – 483 నడుమ జీవించి తన యుత్తమ ధర్మమును బోధించెను. జైనమత నిర్మాత యైన మహావీరుడు, అజాత శత్రువు రాజ్యమునకు రాక పూర్వమే ఇహయాత్ర చాలించెను.

ఈ కాలమున నాంధ్రదేశము అనార్యులయిన నాగరాజుల వశమునందుండినట్లు బౌద్ధ కథలవలన తెలియుచున్నది. ఆర్యులకు ముందు నాగులు దండకారణ్యమును ప్రవేశించి, యచ్చట రాజ్యములు స్థాపించిరి. ఆర్యజాతివారైన యాంధ్రు లీసమయమున దక్షిణాపథమునకునచ్చి ఆంధ్రదేశమున స్థావరము లేర్పరచుకొనుచుండిరి. ఆంధ్రదేశముయొక్క ఉత్తర సరిహద్దు తేలి వాహానదియైనట్లు బౌద్ధ జాతకములు సూచించుచున్నవి. ఇది మహానది కుపనదియై 'తేల్' అను పేరుతో బరగుచున్నది. బౌద్ధధర్మము నాగుల యాదర గౌరవములకు పాత్రమై, ఆంధ్రదేశమున వ్యాపించెను. నాగరాజు కృష్ణాతీరమున స్తూపనిర్మాణముచేయు బౌద్ధజాతకకథ వర్ణించనైనది. గోదావరి కుత్తరదేశము కళింగమనబడుచుండెను. ఇచ్చటకూడ బౌద్ధమతమునకు స్థానము దొరకెను. సింహళమును నాగద్వీపమనుచుండిరి. ఈ నాగద్వీపమునకును, మంజీరికాదేశమునకును, (ఆంధ్రదేశము) నడుమ వర్తకము సాగుచుండినట్లు బౌద్ధ గాథలు సూచించుచున్నవి.

ఆంధ్రులు ఈ ప్రాచీనకాలముననే సముద్రయానముచేయుచున్నట్లును, నౌకాజీవనము గడుపుచుండినట్లును, సూచనలు గలవు. బంగాళాఖాతమువంటి యాంధ్రదేశపు తీర రేఖ సుదూరము వ్యాపించి యుండుటచే, ఆంధ్రులకు సముద్రాభిగమనమునకు ప్రత్యేక సౌకర్యములుండెను. నౌకానిర్మాణమునకు వలయు శ్రేష్ఠమైన కలపగల అడవు లీ భూమియందుండెను. ఇచ్చటి రేవులు మహానౌకల రహదారిలోనుండుట మఱియొక విశేషము. ఆ కాలమున వర్తకపుటోడలు హిందూదేశపు పశ్చిమ తీరమందున్న భరుకచ్ఛము (Broach) శూర్పారాగము (సొపారా - సూరతు) రేవులనుండి బయలుదేరి, సింహళ ద్వీపమును చుట్టివచ్చి ఆంధ్రకళింగ తీరములందలి నౌకాశ్రయములను చూచుకొని, గంగానదిపైనున్న తామ్రలిప్తివరకు పోవుచుండెడివి. ప్రాచీనాంధ్రులీ వర్తకమునందు పాల్గొని లాభము నొందుచుండిరి. కళింగతీరమున దంతపురము, అడ్జిటా రేవులును, కృష్ణా ముఖద్వారమున వజ్రాల దిన్నెయు, పినాకినీ

ముఖమునందలి రేవునగరమును గొప్ప రేవు స్థానములుగా నుండినట్లు బౌద్ధుల జాతకకథలు చాటుచున్నవి. ఆంధ్రుల సముద్రయానము తీరముతో నాగిపోలేదు. సువర్ణ భూమియనబడు బర్మాదేశమునకు కూడ ఆంధ్రనావికులు వ్యాపారార్థమై యేగుచుండిరి.

ప్రాచీన కాలమునుండియు భారతీయులు నౌకా జీవనమున కలవాటు పడియుండిరి. సముద్రయానము చేసిన బ్రాహ్మణులు పతితు లగుదురని ధర్మశాస్త్రకారులు విధించినను, ప్రజలు వ్యాపారము కొఱకును, మతధర్మప్రచారమునకును, దేశాంతరములకును, ఖండాంతరములకును, ఓడలపై పోవుచునే యుండిరి. భారతీయనౌకానిర్మాణ కళ యున్నతస్థితికి వచ్చియుండెను. [1] భోజుడను నృపాలుడు రచించిన యుక్తికల్పతరువు అనుగ్రంథములో రాజనీతితోపాటు నౌకానిర్మాణ శాస్త్రముకూడ చేర్చబడినది. ఇందు నౌకానిర్మాణమున కనువగు కలపను గూర్చియు, నౌకా లక్షణములు వాని యుపయోగములను గూర్చియు, వ్రాయబడినది. పూర్వపు వద్రంగులు ఓడలు కట్టుటకు పనికివచ్చు కలపను, బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్ర జాతులుగ విభజించిరి. వీనిలో క్షత్రియజాతి కలపతో నిర్మింపబడిన యోడ అగాధ సముద్రయానమున కనుకూలించునదై, సుఖసంపదల నొసగునని వారు తలచుచుండిరి. మహాసముద్రములమీద పోవలసిన యోడల అడుగుభాగమందలి చెక్కల నతుకుటకు ఇనుపమేకులను ఉపయోగింపరాదనియు, అట్లు ఉపయోగించినచో సముద్రమధ్యముననుండు అయస్కాంత శిలలచే, నాకర్షింపబడి, నౌకలు బ్రద్దలగుననియు భోజుడు హెచ్చరించెను. యుక్తికల్పతరువునందు చెప్పబడిన యోడలు వాని పరిమాణమునుబట్టియు, ఇతర లక్షణములనుబట్టియు 'సామాన్యములు' 'విశేషములు' అని రెండు తెగలుగ విభజింపబడినవి. సామాన్య తరగతి నౌకలు నదులయందును సరస్సులయందును ప్రయాణముల కనుకూలములు. విశేషలక్షణములు గల నౌకలు సముద్రములు తరించుటకు సమర్థములైనవి.

---

1. ప్రాచీనాంధ్రనౌకా జీవన చరిత్ర - శ్రీ భావరాజు వెంకటకృష్ణారావుగారు.

ముఖమునందలి రేవునగరమును గొప్ప రేవు స్థానములుగా నుండినట్లు బౌద్ధుల జాతకకథలు చాటుచున్నవి. ఆంధ్రుల సముద్రయానము తీరముతో నాగిపోలేదు. సువర్ణ భూమియనబడు బర్మాదేశమునకు కూడ ఆంధ్రనావికులు వ్యాపారార్థమై యేగుచుండిరి.

ప్రాచీన కాలమునుండియు భారతీయులు నౌకా జీవనమున కలవాటు పడియుండిరి. సముద్రయానముచేసిన బ్రాహ్మణులు పతితులగుదురని ధర్మశాస్త్రకారులు విధించినను, ప్రజలు వ్యాపారము కొఱకును, మతధర్మప్రచారమునకును, దేశాంతరములకును, ఖండాంతరములకును, ఓడలపై పోవుచునే యుండిరి. భారతీయనౌకానిర్మాణ కళ యున్నతస్థితికి వచ్చియుండెను. [1]భోజుడను నృపాలుడు రచించిన యుక్తికల్పతరువు అనుగ్రంథములో రాజనీతితోపాటు నౌకానిర్మాణ శాస్త్రముకూడ చేర్చబడినది. ఇందు నౌకానిర్మాణమున కనువగు కలపను గూర్చియు, నౌకా లక్షణములు వాని యుపయోగములను గూర్చియు, వ్రాయబడినది. పూర్వపు వడ్రంగులు ఓడలు కట్టుటకు పనికివచ్చు కలపను, బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్ర జాతులుగ విభజించిరి. వీనిలో క్షత్రియజాతి కలపతో నిర్మింపబడిన యోడ అగాధ సముద్రయానమున కనుకూలించునదై, సుఖసంపదల నొసగునని వారు తలచుచుండిరి. మహాసముద్రములమీద పోవలసిన యోడల అడుగుభాగమందలి చెక్కల నతుకుటకు ఇనుపమేకులను ఉపయోగింపరాదనియు, అట్లు ఉపయోగించినచో సముద్రమధ్యముననుండు అయస్కాంత శిలలచే, నాకర్షింపబడి, నౌకలు బ్రద్దలగుననియు భోజుడు హెచ్చరించెను. యుక్తికల్పతరువునందు చెప్పబడిన యోడలు వాని పరిమాణమునుబట్టియు, ఇతర లక్షణములనుబట్టియు 'సామాన్యములు' 'విశేషములు' అని రెండు తెగలుగ విభజింపబడినవి. సామాన్య తరగతి నౌకలు నదులయందును సరస్సులయందును ప్రయాణముల కనుకూలములు. విశేషలక్షణములు గల నౌకలు సముద్రములు తరించుటకు సమర్థములైనవి.

1. ప్రాచీనాంధ్రనౌకా జీవన చరిత్ర - శ్రీభావరాజు వెంకటకృష్ణారావుగారు.

హైందవుల సూత్రవాఙ్మయమునందుకూడ భారతీయ నౌకా జీవన విశేషములు ప్రసక్తములయినవి. బోధాయనుడు, ఆపస్తంబుడును సూత్రకారులలో ప్రసిద్ధిచెందినవారు. సముద్ర గమనముచే బ్రాహ్మణులు వర్ణభ్రష్టులగుదురని బోధాయనుడు అనుశాసనము చేసెను. కాని మఱియొకచో సముద్ర వ్యాపారముమీద వర్తకులు రాజునకు చెల్లించవలసిన సుంకముల నీతడు సూత్రించెను. ఈ సుంకము నాతడు నూటికి పదింటిచొప్పున విధించెను. స్మృతికారులలో ముఖ్యుడగు మనువు, సముద్రయానము చేసివచ్చిన బ్రాహ్మణుడు శ్రాద్ధ భోక్తగ నుండుట కనర్హుడని శాసించెను. ఐనను రాజుభాండారమును వృద్ధినొందించుటకై, సముద్రవర్తకముమీద సుంకముల విధించుట నీత డనుమతించుచు, ఈ కార్యమునకై విదేశ వాణిజ్యరీతుల నెరిగిన ప్రత్యేకాధికారిని రాజు నియమింపవలెనని చెప్పెను. మనువు మరికొన్ని విశేషాంశములను పేర్కొనెను. నౌకా వర్తకము కొఱకై బదులీయబడిన మూలధనముపై వృద్ధియు (వడ్డి) లాభమును సముద్రయానమునం దారితేరినవారు నిశ్చయింపవలెను. ఓడల కేవును (రేటును) నిర్ణయించుటలో సముద్రయాన కుశలురు, దేశకాల పాత్రములను విచారించి న్యాయముగ ఏర్పాటుచేయవలెను. ఈ నియమము నదులయందును, కాల్వలయందును. చరించు పడవలకు మాత్రమేచెల్లును. గాలిసహాయమున మహాసముద్రముల పయిపోవు ఓడల కేవులను, నావికుడు తన శ్రమ కనుగుణముగ పుచ్చుకొనవచ్చునని మనువు అనుమతించెను. ఓడలమీద సరకులను భద్రముగ తెచ్చువిషయమై మనువు చెప్పినది గమనించదగినది. నావికుల యజాగ్రత్తచే సరకులు నష్టపడినచో, ఆనష్టమును కళాసులు భరింపవలెను. అట్లుగాక ఈ నష్టము దైవిక కారణములచే గల్గినచో, వారేమియు దండుగనిచ్చు కొనన క్కఱలేదు. విదేశములతో వర్తకము నెఱపుటకును, ఆయా దేశములందు విశేషముగ బేరమగు వస్తుసామగ్రిని, అచ్చట లభించు సరకులను తెలిసికొనుటకును, ఆదేశజనులు మాట్లాడు భాషలు నేర్చుకొనుటకును, మనువు ఒక ప్రత్యేకవర్ణమువారిని నియోగించెను.

బోధాయనుడు – ఆపస్తంబుడు:—సూత్రకారులలో ప్రసిద్ధులైన వీరు దక్షిణాపథవాసులుగ గన్పట్టుచున్నారు. సూత్రమనగా విపులమైన యంశమును మిక్కిలి సంక్షిప్తపరచి, చిన్నచిన్న వాక్యములలో కంఠస్థము చేయుటకు వీలైనంత పరిమితిలో వ్రాయుట. సూత్రములు సులభముగా నర్థముకావు. పూర్వాపరములను చక్కగా గుర్తించుకొనినగాని విషయబోధకాదు. ఒక్కొక్క సూత్రమును విడగొట్టినచో, ఎంతయో విశేషార్థము గోచరించును. కల్పసూత్రము లీ సూత్రవాఙ్మయమునకు చెందినవి. ఇవి మూడు భాగములుగా నుండును. శ్రౌతసూత్రములు గృహ్యసూత్రములు ధర్మసూత్రములు అని ముత్తెరగులు. యజ్ఞయాగాది క్రతువులను చేయు విధులను బోధించునవి శ్రౌతసూత్రములు. గృహస్థులు నిర్వర్తించవలసిన పదునారు కర్మలను వివరించునవి గృహ్యసూత్రములు. వ్యవహారధర్మమును న్యాయపాలనమును విధించునవి ధర్మసూత్రములు. ఆపస్తంబుడు సూత్రకారులలోకెల్ల విద్వద్వరేణ్యుడని పండితులు తెలిపెదరు. ఈ మహనీయుడు ఆంధ్రుడనుటకు కొన్ని హేతువులు గలవు. గృహ్యకర్మలలో ముఖ్యమైన వివాహమును, అంత్యవిధులను, ఆంధ్రులలో నత్యధిక సంఖ్యాకులు నేటికిని ఆపస్తంబుడు విధించిన ప్రకారమే ఆచరించుచున్నారు. ఇవి పితృపితామహ క్రమమున అనూచానముగ సంప్రాప్తమైనవి. [1]ఆంధ్రబ్రాహ్మణులలో అధిక సంఖ్యాకులు ఆపస్తంబ సూత్రములను పాటించువారుగా నున్నారు. ఈ సూత్రములను చక్కగా పరిశోధించిన బూలరు పండితుడుకూడ ఆపస్తంబ మహర్షి యాంధ్రుడనియే అభిప్రాయ పడెను. ఈ సూత్రకర్త బోధాయనుని తరువాతివాడై క్రీ.పూ. 4 లేక 5 వ శతాబ్దమున నుండియుండునని బూలరుమతము.

[2]ఆపస్తంబుని జీవితమును గురించియు ఆతని జన్మభూమిని గురించియు పరిశోధనచేసి బ్రహ్మశ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి

1. నన్నయతిక్కనలు ఆపస్తంబసూత్రికులు. చూడు. ఆం. మ. భారతము నిర్వచనోత్తర రామాయణ పీఠికలు.

2. చూడు. నవకథామంజరి పీఠిక.

గారు కొన్ని ముఖ్యాంశములను తేటపరచిరి. ఈ మహర్షి ఆంధ్ర జాతీయుడు. ఇతడు తన ధర్మశాస్త్ర గ్రంథములను యమునాతీరము నందలి సాల్వదేశముననుండి వ్రాసెను. క్రీ. పూ. ఏడవశతాబ్దమున నీతడు వర్ధిల్లియుండును. ఆకాలమున మన యాంధ్రజాతివారు సాల్వ, వత్స, కరూశ దేశములలో వ్యాపించియుండిరి. సీమంతోన్న యనము (గర్భవతియగు స్త్రీకి నాల్గవమాసమున చేయబడునొక కర్మము) నందాపస్తంబుడు సాల్వదేశీయులకు ప్రత్యేకముగ కొన్ని మంత్రములను విధించెను. ఇతర సూత్రకారులెవరును వీటిని చెప్పి యుండలేదు. ఈశుభకర్మమునందు, వీణాగాయకులను పిలిచి, ఏ దేశ మునందు నివసించుచున్నారో ఆ దేశపు ప్రభువునుగూర్చియు, ఏనదీ తీరమందు ప్రజలు వర్తించుచుండిరో ఆనదినిగూర్చియు, గానము చేయించుట ఆచారము. ఈ సందర్భములో సాళ్వదేశీయులు యౌగంధరి రాజునుగూర్చియు, యమునానదిని గురించియు, గానము చేయవలెనని ఆపస్తంబుడు సూత్రించుట గమనింపదగినది. దీనిని బట్టియే ఈ మహర్షి యౌగంధరి అను రాజుపాలనమున, యమునా తీరమందలి సాల్వదేశమునం దుండెనని యూహింపబడినది.

ఈమహర్షియుని తల్లిదండ్రుల నామధేయములు తెలియ వచ్చుటలేదు. బోధాయను డీతని గురువను లోకప్రథ, కలదుగాని ఆపస్తంబు డెచ్చటను బోధాయనుని స్మరింపలేదు. తన గ్రంథములో తరచు శ్వేతకేతుని తండ్రియగు ఉద్దాలక మునీంద్రుని శిష్యుడైన వాజసనేయుని బ్రాహ్మణమును, ఆపస్తంబుడు పరమ ప్రమాణ ముగ గ్రహించుచువచ్చెను. ప్రాచీన బ్రహ్మవాదియైన యాపస్తంబ మహర్షి ఉపనయనానంతరము ముప్పదియారు సంవత్సరములు బ్రహ్మచర్య వ్రతమును అసిధారగా నడిపి, సమస్తలౌకిక పార మార్థిక విద్యలను అభ్యసించెను. వేదములను, వేదాంగములను, రాజనీతి సాంఘిక నీతిశాస్త్రములను, పశుపక్షి క్రిమికీటాది శాస్త్ర ములను, సాకల్యముగ పఠించెను. ఇట్లు అఖండ జ్ఞానసంపన్నుడై, యీబ్రహ్మర్షి సత్తముడు తన కాలమునకు మిక్కిలి హీనస్థితిలో

నున్న స్వసంఘమైన ఆంధ్రజాతి నుద్ధరించుటకు వలయు విధానము లను, ధర్మశాస్త్ర నియమములను గావించుటకు గడగెను.

ఆపస్తంబుని కాలమునకు ఆంధ్రజాతి ధర్మచ్యుతినొంది, స్మృతికారులగు మనువు మొదలగువారిచే నీచజాతిగా పరిగణింప బడుచుండెను. మహాభారతయుద్ధము తరువాత సంఘమునందు విపరీత పరిస్థితు లేర్పడెను. పురుషులు విశేషముగ మరణించిరి. స్త్రీలు భర్తృరహితలై, దుష్టవర్తనలుగా నుండిరి. మగవారియందు బ్రహ్మచర్యనియమము లోపించెను. సంఘక్షేమమును కాంక్షించి, సంతానవృద్ధికొరకై ధర్మశాస్త్రకారులైన యాజ్ఞవల్క్య బోధాయనుల వంటివారు, నియోగపద్ధతి (సంతానముకొరకై భర్తయనుమతితో పరపురుషుని గలియుట) ని ఆమోదించిరి. బ్రహ్మచర్యలోపమే సంఘముయొక్క నైచ్యతకును, పతనమునకును, హేతువని నిశ్చయించి, ఆపస్తంబ మహర్షి పురుషులు బ్రహ్మచర్యమును పాటించుటకు, స్త్రీలు పతివ్రతలుగా నుండుటకును, ప్రత్యేక నియమముల రచించెను. వీటి నతిక్రమించువారికి రాజదండమును నరకప్రాప్తిని ఉల్లేఖించెను. ఇట్లీ జాత్యుద్ధారకుడు ఆంధ్రుల నైతికాభ్యున్నతికి చక్కని రాచబాట వేసి, కీర్తనీయుడయ్యెను.

బోధాయనుని కాలమున సందిగ్ధములుగను, అపరిశుద్ధములుగను, ఉండిన ధర్మశాస్త్ర విషయములను పెక్కింటిని ఆపస్తంబుడు సంస్కరించెను. ఆపస్తంబునకు పూర్వము సంఘాచారములంత కట్టుదిట్టము గలవికాక, వర్ణసాంకర్యమును ఉపేక్షించి, సహించునవిగా నున్నవి. అట్టి సాంకర్యమును నిరోధించు సూత్రముల నాపస్తంబ మహర్షి గావించెను. బోధాయన ఆపస్తంబుల నాటికి ఆర్యులు పెక్కండ్రు దక్షిణా పథమునకువచ్చి, యాంధ్రదేశములో నివాసము నేర్పరచుకొనిరి. వీరు వైదికకాలమునందు వలెనే, త్రేతాగ్నులను తమ యిండ్లలో నిలిపి వ్రేల్చుచుండిరి. యజ్ఞయాగాది క్రతువులను అభినివేశముతో నాచరించుచుండిరి. క్రతువిఘ్నముచేయు అనార్యులమండి, వీరు రాజరక్షణము పొందుచుండిరి. అశ్వమేధము, గోమేధము

మొదలగు వేదవిహిత క్రతువుల చేయుచు ఆనాటి యార్యబ్రాహ్మణులు మాంసభోజనము చేయుచుండిరి. మధుపర్క కలాపమునందు (అతిథిసత్కార క్రియ) పూజనీయుడైన యతిథి వచ్చినప్పుడు లేగ దూడనుగాని, ముసలి యెద్దునుగాని, సంహరించి మాంసము వండి పెట్టుట ప్రాచీనాచారమైనట్లు భవభూతి తన యుత్తర రామచరిత్ర నాటకములో నుదహరించెను. క్షత్రియుడైనను, జనకరాజు మాంస భోజనము విసర్జించెనని అందేయున్నది. ఈకాలముననే ఆర్య సంఘములో ఔత్తరాహులకును, దాక్షిణాత్యులకును, ఆచార భేదము లేర్పడినవి. ఆర్యమతమునందు ప్రవేశపెట్టబడనివారితో కలసి భుజించుటయు, చల్దియన్నము తినుటయు, మేనత్తల కూతుండ్రను పెండ్లి యాడుటయు, దక్షిణదేశమునందు తప్పుగాని యాచారములుగా నుండును. గొఱ్ఱె మొదలగు కొన్ని జంతువుల రోమములతో వ్యాపారము చేయుటయు, బెల్లపు సారాయి త్రాగుటయు, ఆయుధ వ్యాపార మవలంబించుటయు, నౌకా యాత్రచేయుటయు, నుత్తర దేశమున మాత్రమే తప్పుగాని యాచారముగా నుండెను. ఔత్త రాహులు దాక్షిణాత్యాచారములను వీరి యాచారములను వారును అవలంబించుట నిషేధింపబడుచుండెను.

[1] ఆపస్తంబునకు పూర్వముండిన బోధాయనాది సూత్ర కారులు శాస్త్రీయ సంతానమునకును, అశాస్త్రీయ సంతానము నకును, భేదమెంచక, ద్వాదశవిధ పుత్రుల నంగీకరించి, జ్యేష్ఠ పుత్రునకు ఆస్తిలో జ్యేష్ఠభాగమును విధించియుండిరి. ఆపస్తంబుడు దీని నాక్షేపించి, అశాస్త్రీయ సంతానమునకు శాస్త్రీయ సంతాన ముతోపాటు సమానముగ భాగమిచ్చుట కూడదనియు, జ్యేష్ఠపుత్రు నకు తక్కినవారికంటె ఆస్తిలో అధికభాగ మీయరాదనియు, వచించెను. సంకర సంతానమును ఔరస పుత్రునితో సమముగా పరిగణించుట, ఆపస్తంబుడు నిషేధించెను. బ్రాహ్మణునకు శూద్ర స్త్రీయందు జనించినవానిని నిషాదునిగా చెప్పినను, పూర్వధర్మ

1. ఆంధ్రులచరిత్ర, ప్రథమభాగము. చి॥ వీరభద్రరావుగారు.

శాస్త్రకర్తలు నిషాదునికూడ ఔరసునితోపాటు టంగీకరించిరి. ఇదియును ఆపస్తంబుడు నిరాకరించెను. భార్యకాని భర్తకాని వివాహ ప్రతిజ్ఞను ధిక్కరించి, వివాహ బంధమును త్రెంచి, స్వేచ్ఛగా సంచరించినచో వారు నరకమునకు బోవుదురని ఈ మహర్షి మిక్కిలి యుచితముగ శాసించెను.

లోకజ్ఞుడైన యాపస్తంబ మహర్షి, రాజనీతి విషయమునను చక్కని వ్యవస్థగావించెను. రాజునకు బాలురు, వృద్ధులు, స్త్రీలు, అంగవికలులు, మత ప్రవర్తకులగు శ్రోత్రియులును, విద్యార్థుల పోషించువారును, ఏవిధమగు పన్నుల నీయనవసరములేదని శాసించెను. వ్యవసాయకులు తమ పంటలో ఆరవవంతును, వర్తకులు తమ లాభములో ఇరువదవవంతును, రాజునకు పన్నుగా చెల్లించవలెనని ఈయన విధించెను. చోరుల బాధనుండి గ్రామనగర వాసులను రక్షించుటకీ సూత్రకర్తచేసిన నియామకము గమనింపదగినది. గ్రామమునందును, దానికి చుట్టుపట్ల క్రోశము దూరమునను, గ్రామస్థుల యాస్తిని చోరులపహరింతురేని, ఆగ్రామరక్షణకు నియోజితులైన రాజపురుషులా నష్టమును తాము అచ్చుకొనవలెనని యీతని శాసనము. నగరములకును ఇది వర్తించును. రాజు తన దేశమునందలి ప్రజలకు రెండేండ్లకాలము సరిపడు ధాన్యమును నిలువయుంచవలెనని పరహితైకబుద్ధియైన ఈ మహర్షి సూత్రించుట కడు ప్రశంసనీయము.

విజ్ఞానఖనియైన ఆపస్తంబమహాని ధర్మశాస్త్రమునందేకాక, లౌకిక విద్యలయందును గొప్ప మేధావియని ప్రశస్తిగాంచెను. యాగవేదికలను వేయుటకును, భూమిని కొలుచుటకును, అనువైన క్షేత్రరేఖాగణిత సంబంధములగు 'శుల్బ' సూత్రముల నీతడు రచించెను. ఈతని ఖగోళశాస్త్ర విజ్ఞానము ఆధునికులనుకూడ మెప్పించుచున్నది. వేదీ నిర్మాణ విధులలో, ఈతడు శిల్పకళకు బునాదులు వేసినవాడయ్యెను. ఆపస్తంబుని శ్రౌతసూత్రములలో 'చైత్య' నిర్మాణమునకు విధులుగలవు, చైత్యము మొదట వైదిక చిహ్నమై, తరువాత బౌద్ధులచే తమ శిల్పవిద్యయందంగీకరింపబడి, ఎన్నియో సుందర చైత్యనిర్మాణములకు హేతువైనది. ఆపస్తంబ

శాస్త్రకర్తలు నిషాదునికూడ ఔరసునితోపా టంగీకరించిరి. ఇది యును ఆపస్తంబుడు నిరాకరించెను. భార్యకాని భర్తకాని వివాహ ప్రతిజ్ఞను ధిక్కరించి, వివాహ బంధమును త్రెంచి, స్వేచ్ఛగా సంచరించినచో వారు నరకమునకు బోవుదురని ఈ మహర్షి మిక్కిలి యుచితముగ శాసించెను.

లోకజ్ఞుడైన యాపస్తంబ మహర్షి, రాజనీతి విషయమునను చక్కని వ్యవస్థగావించెను. రాజునకు బాలురు, వృద్ధులు, స్త్రీలు, అంగవికలులు, మత ప్రవర్తకులగు శ్రోత్రియులును, విద్యార్థుల పోషించువారును, ఏవిధమగు పన్నుల నీయనవసరము లేదని శాసించెను. వ్యవసాయకులు తమ పంటలో ఆరవవంతును, వర్తకులు తమ లాభములో ఇరువదవవంతును, రాజునకు పన్నుగా చెల్లించవలెనని ఈయన విధించెను. చోరుల బాధనుండి గ్రామనగర వాసులను రక్షించుటకీ సూత్రకర్త చేసిన నియామకము గమనింపదగినది. గ్రామమునందును, దానికి చుట్టుపట్ల క్రోశము దూరమునను, గ్రామస్థుల యాస్తిని చోరు లపహరింతురేని, ఆగ్రామరక్షణకు నియోజితులైన రాజపురుషు లా నష్టమును తాము అచ్చుకొనవలెనని యీతని శాసనము. నగరములకును ఇది వర్తించును. రాజు తన దేశమునందలి ప్రజలకు రెండేండ్ల కాలము సరిపడు ధాన్యమును నిలువయుంచవలెనని పరహితైకబుద్ధియైన ఈ మహర్షి సూత్రించుట కడు ప్రశంసనీయము.

విజ్ఞానఖనియైన ఆపస్తంబమహాని ధర్మశాస్త్రమునందేకాక, లౌకిక విద్యలయందును గొప్ప మేధావియని ప్రశస్తిగాంచెను. యాగవేదికలను వేయుటకును, భూమిని కొలుచుటకును, అనువైన క్షేత్రరేఖాగణిత సంబంధములగు 'శుల్బ' సూత్రముల నీతడు రచించెను. ఈతని ఖగోళశాస్త్ర విజ్ఞానము ఆధునికులనుకూడ మెప్పించుచున్నది. వేదీ నిర్మాణ విధులలో, ఈతడు శిల్పకళకు బునాదులు వేసినవాడయ్యెను. ఆపస్తంబుని శ్రౌతసూత్రములలో 'చైత్య' నిర్మాణమునకు విధులుగలవు, చైత్యము మొదట వైదిక చిహ్నమై, తరువాత బౌద్ధులచే తమ శిల్పవిద్యయందంగీకరింపబడి, ఎన్నియో సుందర చైత్యనిర్మాణములకు హేతువైనది. ఆపస్తంబ

స్వరూపుడు. అతడు భేషజ తంత్రమునకు మూలము. రోగములను, అరిష్టములను, మృత్యువును తొలగించువాడు. ఆర్యులును అనార్యులును ఏకదేశమునందు నివసించుచు, కష్టసుఖములలో భాగస్వాములగుచుండుటచే, వారిలో సమన్వయ మేర్పడెను. వారి యారాధ్య దైవతములును ఏకమూర్తినందిరి. శివుడును రుద్రుడును కలిసి, అనంతర కాలపు త్రిమూర్తులలో ప్రధానుడైన మహేశ్వరుడుగా రూపొందెను. నాగులు కొల్చు భయంకర దేవత కాళి, ఈశ్వరుని భార్యయయ్యెను. వారుపూజించు సర్పములు శివునకు భూషణములయ్యెను. ఇట్లు ఆర్యమత ప్రభావము అనార్యులమీదను అనార్యుల విశ్వాసముల ప్రభావము ఆర్యులమీదను ప్రసరించి, జాతిద్వయ సమ్మేళన మేర్పడెను. వారు పరస్పర విరోధముల మానిరి. ఆర్యమతభావముల సంపర్కముచే నాగులు మున్నగునారు, తమ క్రూరాచారములనువీడి సత్త్వస్వభావులు కాజొచ్చిరి. ఆర్యులు రాకముందు ఆంధ్ర దేశములో వర్ణాశ్రమ ధర్మపద్ధతి లేకుండెను. ఈ యుగము నుండియు తెలుగు దేశమున చాతుర్వర్ణ్య విధానము పొడుకొనెను.

---

# ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి

## 11-వ ప్రకరణము

### (ఆంధ్ర రాజ్య స్థాపనము)

మౌర్యచంద్రగుప్త చక్రవర్తి కాలముననే, ఆంధ్రరాజ్యము మగధసామ్రాజ్యము తరువాత మిక్కిలి బలశక్తి సమన్వితమైనదని మెగస్తనీసు వ్రాతలనుబట్టి తెలియవచ్చుచున్నను, ఆంధ్రరాజ్య స్థాపన మెప్పుడు ఎట్లు జరిగెనో, నిర్ణయించుటకు ఆధారములు కానరావు. క్రీ. పూ. 320 ప్రాంతమున నందరాజుల కూలద్రోసి, చంద్రగుప్తుడు మౌర్యసామ్రాజ్యమును స్థాపించెను. ఈతని యాస్థానమందుండిన గ్రీకురాయబారి మెగాస్తనీసు, తనకాలపు భారతదేశ వర్ణన

చేయుచు, ఆంధ్రులనుగూర్చి యిట్లు వ్రాసెను. "తరువాత ఎన్నదగినది ప్రబలశక్తిసమన్వితమైన ఆంధ్రజాతి. వీరికి అసంఖ్యాకములైన గ్రామములును, ప్రాకారసమావృతములై, కోటకొమ్మలుగల. ముప్పది నగరములును గలవు. వీరిరాజునకు ఒక లక్ష కాల్బలమును, రెండు వేల యాశ్వికదళమును, వేయి ఏనుగులును గలవు." క్రీ. పూ. 4-వ శతాబ్దపు చరమపాదముననే యింత దుర్ధర్షమైన సైన్యబలము కలిగిన ఆంధ్రరాజ్యము, అట్టి స్థితికి వచ్చియుండుటకు, ఒక శతాబ్దమైనను పట్టియుండుననుకొనవచ్చును. కావున ఆంధ్రరాజ్యస్థాపనము క్రీ. పూ. ఐదవ శతాబ్దియందో, అంతకు కొంచెము ముందో, అయియుండుననుట విశ్వసనీయము. మెగాస్తనీసు పేర్కొనిన ప్రాచీనాంధ్ర నగరములలో కొన్నిటిని, డాక్టరు మారేమండ రామారావుగారిట్లు నిరూపించుచున్నారు. వేంగి ప్రాచీననగరము. ప్రఖ్యాత బౌద్ధ క్షేత్రము. కళింగరాజగు ఖారవేలుని హాతిగుంఫ శాసనములో పిథుదమనునగరము, ప్రస్తావింప బడియున్నది. కాని ఇది దక్షిణదేశమునం దెచ్చటనుండెనో చెప్పుటకు వీలులేదు. ధాన్యకటకము క్రీ. పూ. 3 వ శతాబ్ది నుండి యుండెను. విజయపురియను నాగార్జునకొండకడనుండిన పట్టణమును ప్రాచీనమే. భట్టిప్రోలువద్ద క్రీ. పూ. 3. వ శతాబ్దమునుండియు, ఒక నగరముండి యుండవలెను. ఇటీవల హైదరాబాదు రాజ్యమున కొండాపురము, గాజులబండ, ఫణిగిరులలో ప్రాచీననగరములు బయలుపడినవి. బౌద్ధ జాతకములలో పేర్కొనబడిన అంధక నగరమొకటి. (ఇది మహానది కుపనదియగు, తెలివాహానదీ తీరమున నుండినట్లు వర్ణింపబడినది).

ఆంధ్రరాజ్యము నెవరు నెలకొల్పిరను ప్రశ్నకు చారిత్రకమైన సమాధానము చెప్పవీలుపడదు. బ్రహ్మాండ పురాణమునందు ఆంధ్రరాజ్యమునుగూర్చి యొక్క కథ చెప్పబడినది. సుచంద్రుని కొడుకు ఆంధ్రవిష్ణువు. ఈతడు గోదావరీ తటమునందు, నిశుంభుడను దానవుని సంహరించి, వానిరాజ్యము నాక్రమించెను. ఆంధ్రవిష్ణువునకు రాక్షస సంహారమునందు సురలు తోడ్పడిరి. నిశుంభుని చంపి,

ఋష్యాశ్రమములకు, వానినుండి భయము నీతడు మాన్పెను. మరియు మహేంద్ర పర్వతము, భీమేశ్వరము, కాళేశ్వరము, శ్రీశైలము గలిపి, యాంధ్రవిష్ణువు తన రాజ్యమునకు ప్రాకారము నిర్మించెను. దాని చతుర్ద్వారము లందును శివుడు త్రిశూల పాణియై, ప్రమథగణములతో నిలిచి, యారాజ్యమును రక్షించును. పై వానిలో భీమేశ్వర, కాళేశ్వర, శ్రీశైలము లీ దేశమునకు త్రిలింగసంజ్ఞ యొసగినవని ఇదివరలో చెప్పియున్నాము. ఆంధ్రకౌముదియను గ్రంథమందు, ఆంధ్రవిష్ణువునుగూర్చి, మరియొక యంశము తెల్పబడినది. ఈతడు శ్రీకాకుళమును పాలించిన చంద్రుని కుమారుడు. ఆర్యమంజు శ్రీమూలకల్పమను బౌద్ధగ్రంథముకూడ సుచంద్రుని పేర్కొనుచున్నది. సుచంద్రుని రాజధానియైన శ్రీకాకుళము, ప్రాచీనకాలమున కృష్ణానది యొడ్డున నుండెడిది. అది వెల్లువలకు కొట్టుకొనిపోయి దాని సమీపముననే ప్రస్తుత శ్రీకాకుళగ్రామము నిల్చియున్నది. ఇది విజయవాడకు ఇరువదిమైళ్లలోనున్నది. శ్రీకాకుళమునందు ఆంధ్రవిష్ణువు దేవాలయము నేటికిని విరాజమానమై యున్నది. ఈ దేవునే [1] ఆంధ్రనాయక స్వామియని యందురు. శ్రీ కృష్ణదేవరాయలవారు కళింగదేశముపై విజయదండయాత్ర సాగించకమున్ను, శ్రీకాకుళాంధ్ర దేవుని నారాధించిరి. ఆంధ్రనాయకస్వామి రాయలకు కలయందు దర్శనమిచ్చి, ఆముక్తమాల్యద ప్రబంధమును నిబంధింపుమని యనుగ్రహించెను.

బ్రహ్మాండపురాణగాథనుండి, కొన్ని చారిత్రకాంశములను సేకరింపవచ్చును. ఆంధ్రవిష్ణు వొక ప్రఖ్యాతాంధ్ర వీరుడు. ఇతడు గోదావరీ తటమున రాజ్యముసేయు నొక నాగరాజును జయించి యుండును. నిశుంభుడు ఆంధ్రులకు ముందీ దేశములో నొక భాగము నేలుచుండిన రాజు కావచ్చును. ఈ నిశుంభుడును, ఆతని పరిజనులును, ఆర్య ఋషులకు వ్యతిరేకులుగ నుండియుందురు. వీరు నిజముగ దానవులైనను కావచ్చును. ఏలనన రామాయణ ప్రసిద్ధులైన ఖరదూషణాదులు పర్ణశాల సమీపమందుండిన జనస్థానము నేలిరిగదా!

1. ఆంధ్రనాయకశతకము - కాసుల పురుషోత్తమకవి.

నిశుంభదానవుడు వారి సంతతివాడైనను కావచ్చును. ఆంధ్ర విష్ణువు వీనిని ఉక్కడగించి, ప్రథమాంధ్ర రాజ్యస్థాపనముచేసెను. ఈతనిప్రభుత్వము మహేంద్ర పర్వతమునుండి, శ్రీశైలమువరకుగల విశాలభూమిపై చెల్లియుండును. ఆంధ్రవిష్ణువొక్కడే కాకపోయినను, ఆంధ్రవీరులు పలువురు, తెలుగు దేశమును ఆక్రమించి, అచ్చటచ్చట స్వతంత్రపాలనము సాగించియుందురు. అనంతర కాలమున ఆంధ్రవిష్ణువొక విజేతయను భావము విస్మరింపబడి, ఆతడుసాక్షాత్తు విష్ణు నవతారమని లోకులు భావించి యుందురు. వీరారాధనము ప్రాచీన కాలమున మతములో నొక భాగము. ఆంధ్రవిష్ణువుపేర శ్రీకాకుళమున దేవాలయము ఇట్లు వెలసియుండును. పూర్వకాలపు రాజులు తమపేర దేవతలను ప్రతిష్ఠించుటగూడ కాంతుము. కాకతీయుల కాలమున నీ యాచారము ప్రసిద్ధముగా నుండెను. ఆంధ్ర విష్ణువు స్వయముగ, తన రాజధానియందు భక్తి సూచకముగ తన పేరనే దేవుని ప్రతిష్ఠించియుండును. శ్రీకాకుళ మిపుడు వైష్ణవ క్షేత్రమైనను, ప్రాచీనకాలమున నిది శివక్షేత్రమై యుండవచ్చును. [1]ఆంధ్రవిష్ణువు రాజ్య సంరక్షణమునకు బూనిన వాడు శివుడు. కావున అత్యంత పురాతన కాలమున, నిక్కడ శివుడే ప్రతిష్ఠింపబడియుండును. తొలుదొల్త ఆంధ్ర దేశమున శైవమే వ్యాపించియుండెను. వైష్ణవము తరువాత వ్యాప్తిగాంచెను.

ఆంధ్ర విష్ణువు స్థాపించిన రాజ్యోదంతము ఇంతకుమించి తెలియరాదు. కథాసరిత్సాగరమున దీపకర్ణియను మరొకరాజు చరిత్ర వర్ణితమైనది. ఈతడు దక్షిణాపథము నేలుచుండెనని చెప్ప బడినది. దీపకర్ణి సంతాన విహీనుడై యుండెను. ఒకనాడాత డరణ్యమునకు వేటకుబోయెను. అక్కడ సాతుడను నొక యక్షుడు సింహ పరాక్రమముగల యొక బాలుని, దీపకర్ణికి పెంచుకొనుమని యప్పగించెను. ఈ బాలుడే తరువాత ప్రసిద్ధుడైన సాతవాహనుడు. ఈ కథనుబట్టి, దీపకర్ణిమహారాజు మరియొక యాంధ్రగణమునకో, లేక యక్షరాజ కుటుంబమునకో, చెందిన సాతవాహనుని దత్త

1. రుద్రేశ్వరము, గణపేశ్వరము, ఎఱకేశ్వరము.

పుత్రునిగా స్వీకరించె నని తోచును. చరిత్ర ప్రసిద్ధమైన సాత వాహనవంశమున కీతడు మూలకర్తయయ్యెను.

సాతవాహన వంశస్థాపనమునకు కొంచెము పూర్వము, కుబ్బీరకుడను రాజు (కుబేరకుడు కావచ్చును) ఈ దేశములో నొక భాగమునకు పరిపాలకుడై యుండినట్లు భట్టిప్రోలు శాసనములవలన తెలియవచ్చుచున్నది. ఇచ్చట అతి ప్రాచీనమైన బౌద్ధ స్తూపము గలదు. ఈ స్తూపమునందు లభించిన శాసనములనుబట్టి, కుబ్బీరకుడు సింహగోష్ఠికి నాయకుడనియు, అతని ప్రేరణచే సాగతి నిగమమువారు బౌద్ధాలయమునకు ఒక యద్దముల పెట్టెయు, రాతి పెట్టెను, దానముచేసినట్లును చెప్పబడినది. అరహదినగోష్ఠివారు కూడ కుబేరకరాజు ననుమతిపై బౌద్ధసంఘమునకు కొన్ని బరిణెలు దానముచేసిరి. వీనిమీద చెక్కడముపనికి ఈ రాజు ప్రేరకుడయ్యె నట. భట్టిప్రోలు శాసనము లిపినిబట్టి ఇవి అశోకచక్రవర్తి కాలమునకు చెందినవని లిపిశాస్త్రజ్ఞులు నిర్ణయించిరి. కుబేరకుడనునామము యక్షుల సంబంధమును సూచించు చున్నది. కుబేరుడు యక్షులకును గుహ్యకులకును అధిపతి. ఈ గణములవారు సింహమును పవిత్ర జంతువుగా నెంచిరని తోచును. దీపకర్ణి మహారాజునకు సాతవాహనుని సమర్పించిన గుహ్యకుడును, ఆతనిభార్యయు, శాపవశమున సింహములుగా మారిరి. మాతృ విహీనుడైన సాతవాహనుని ఇతర సింహికలపాలమీద తండ్రి పెంచెను. రాజా కుబేరకుని సింహగోష్ఠి యక్షులగణమై యుండును. యక్షులు మొదట శివారాధకులు. బౌద్ధ మతము ఆంధ్ర దేశములో ప్రవేశించిన వెనుక, వీ రాధర్మము నవలంబించియుందురు. కుబేరకరాజు దీపకర్ణికి సమకాలికుడై కృష్ణా మండలములో నొక భాగమునకు ప్రభువై యుండును. ఐనచో దీప కర్ణి రాజ్యము కుబేరకుని రాజ్యమునకుపశ్చిమమున, ప్రస్తుత తెలంగాణా సరిహద్దుల వ్యాపించియుండును. ఈతని తరువాత గొప్ప రాజ్యమును నిర్మించిన, సాతవాహనరాజు పేరుగల నాణెములు[1] తెలంగాణములో ఓరుగల్లు సమీపమున దొరికినవి.

1. భారతి 1949 నవంబరు, డాక్టరుమారేమండ రామారావుగారి వ్యాసము.

శాతవాహన రాజ్యస్థాపనమునకు ముందు, ఆంధ్ర దేశము యొక్క మతసాంఘికపరిస్థితులను సంగ్రహముగా తెలిసికొనవచ్చును. క్రీ. పూ. నాల్గవ శతాబ్దమునాటికి ఆంధ్ర దేశమున బౌద్ధమతము బాగుగ కాలూనెను. దీనికి భట్టిప్రోలు స్తూపమే ప్రబల నిదర్శనము. ఆంధ్ర బౌద్ధులలో వివిధ నిగమములవారును ఉండిరి. భట్టిప్రోలు స్తూపశాసనములు ప్రాకృతభాషయందు చెక్కబడినవి. వైదికమతము వారికి సంస్కృతము పవిత్రభాషయైనట్లే, బౌద్ధులకు పాలీ ప్రాకృత భాషలు, పవిత్రభాషలుగ నుండెను. శైవముగూడ ఆంధ్ర దేశములో జనాదరణమును బొందుచుండినట్లు, ఆంధ్రవిష్ణువుకథ సాక్ష్య మిచ్చును. ఈ కాలమున సాంఘికాచారములు, వర్ణసంకరమునకు తావిచ్చుచు సహించుచుండెనని, పెక్కు వృత్తాంతముల నాధారము చేసికొని చెప్పవచ్చును. సాతవాహనరాజుతండ్రి సాతుడొక యక్షుడు, సాతవాహనుని తల్లియొక మునికన్య. ఈమె నదియందు స్నానముచేయుచుండ సాతు డామె సౌందర్యమును గాంచి, మోహించి, గాంధర్వవిధిచే పెండ్లియాడెనట. ఈ వివాహమును సమ్మతించక ఆ ఋషికన్యవంకవారు, యక్షుని అతని ప్రియురాలుని సింహములు గండని [1]శపించిరి. సాతవాహనుని మంత్రియు, బృహ త్కథయను కథాకావ్యమును వ్రాసినవాడును, అగు [2]గుణాఢ్య పండితుని జన్మవృత్తముగూడ వర్ణసమ్మేళనమునే సూచించుచున్నది. గుణాఢ్యునితల్లి యొక బ్రాహ్మణకన్య. వాసుకి యను నాగరాజు తమ్ముడామె యందమునకు వలచి, గాంధర్వ విధిచే నామెను వరించెను. ఆంధ్ర దేశములో స్థిరనివాసమేర్పరచుకొన్న యార్యుల సంఖ్య స్వల్పముగానుండెను. వారి సంఘము సంకుచితమైనదగుటచే, దేశీయులైన నాగులతో ఇష్టమున్నను లేకున్నను వివాహములు చేసికొనజొచ్చిరి. ఇట్లు జాతిద్వయ సమ్మేళన మేర్పడెనని యూహింప వలసియున్నది.

---

1. కథా సరిత్సాగరము.
2. కథా సరిత్సాగరము.

క్రీ. పూ. 6-వ శతాబ్దమునుండియు, ఉత్తరాపథమున మగధ రాజ్యము ప్రాబల్యమునందుచుండెను. శిశునాగవంశము తరువాత నందవంశమువారు మగధ నేలిరి. వీరు బహు బలాన్వితులు. నంద రాజులు కళింగము జయించినట్లు కొన్ని యాధారములుగలవు. కాని వీరికిని ఆంధ్రులకును ఎట్టి సంబంధముండెడిదో తెలియదు. క్రీ. పూ. 322 ప్రాంతమున నందవంశము నంతమొందించి మౌర్య చంద్ర గుప్తుడు ఉత్తరాపథమున బ్రహ్మాండమైన సామ్రాజ్యమును స్థాపించెను. ఈతడాంధ్రులను జయించి వశపరచుకొన్నట్లు నిదర్శనములు లేవు. చంద్రగుప్తుని మనుమడు అశోక చక్రవర్తి కాలమున (క్రీ.పూ. 272-236) ఆంధ్రులాతనికి మిత్రులో, సామంతులో, అయియుండిరని యూహింపబడినది. అశోకుని ధర్మశాసనములు కర్నూలుజిల్లా ఎఱ్ఱగుడిలోను, రాయచూరుజిల్లా మస్కీ-వద్దనుపొడగట్టినవి. మస్కీ-సమీపమందలి సువర్ణగిరియందు, మౌర్య సామ్రాజ్యపు రాజప్రతినిధి యుండెడివాడు. అశోకుని 13-వ శిలాశాసనమునందు ఆతని రాజ్యములో యవనకాంభోజనాభకనాభపంక్తిభోజపిటినిక ఆంధ్ర పుళిందులుండిరని చెప్పబడినది. ఆంధ్రదేశమున ధర్మప్రచారముచేయుటకై అశోక చక్రవర్తి మహాదేవుడను భిక్షువును పంపెనట. అశోకుడు బౌద్ధమత ప్రచారమునకు నడుముగట్టుటకు కడుపూర్వమే, ఆంధ్ర దేశమునం దీ ధర్మము వెలసియుండెను. కావున ఆచక్రవర్తి ధర్మసందేశము ఆంధ్రులచే ప్రీతితో స్వీకరింపబడి యుండును. అశోకుడు కళింగముపై దండెత్తి, గొప్ప రక్తపాతముతో గూడిన విజయమును సాధించుట చరిత్రాంశము. కాని యాతడాంధ్ర దేశముపై యుద్ధముచేసి, స్వాధీనము చేసికొన్నట్లు ఆధారములు లేవు. కావున ఆంధ్రులుమౌర్యుల సామ్రాజ్యశక్తినిగుర్తించియు, అశోకుని ధర్మ ప్రచారమునకు మిక్కిలి సుముఖులై యుండియు, ఆతని సామ్రాజ్య ప్రజలలోనివారుగా మెలగియుందురు. నామమాత్రముగ వీరశోకుని స్వామిత్వము నంగీకరించినను, వాస్తవముగ స్వతంత్రులై యుండిరని చెప్పవచ్చును. ఈ చక్రవర్తి శాసనము

లందు పేర్కొనబడిన రధికులు మహారాష్ట్ర ప్రజలు. భోజులు విదర్భయనబడెడి బీరారు నివాసులు. పిటినికులు గోదావరీతీరమున పైఠను నగరపరిసర వర్తులైన జనులు. వీరికి తూర్పున ఆంధ్రులుండిరి. ఆంధ్రులకు ప్రాగుత్తరమున కళింగదేశీయులు వ్యాపించిరి.

అశోకుని మరణానంతరము, మౌర్య సామ్రాజ్యభానుడు దీప్తిచల్లారి సన్నగిలజొచ్చెను. ఈతని కుమారులును మనుమలును అసమర్థులై భిన్నభిన్న ప్రదేశములలో స్వతంత్రాధికారమును నెరప జొచ్చిరి. ఈ యవకాశమును గనిపెట్టి, దక్షిణాపథమందలి కరిక, భోజక, పిటినికులు, మౌర్యుల యధికారమును ధిక్కరించిరి. మహాబల సమన్వితులైన యాంధ్రులు సహజముగనే సామ్రాజ్య బంధములను త్రోసిరాజని, స్వతంత్ర వైభవముతో విజృంభించిరి. కాళింగులుకూడ వీరి ననుసరించినట్లు తోచును.

---

# ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి

## 12-వ ప్రకరణము

### (సాతవాహనయుగము. క్రీ. పూ. 225—క్రీ. శ. 225)

ఏవంశమువారు నాలుగున్నర శతాబ్దుల దీర్ఘ కాలము ఆంధ్ర దేశమును తమ క్షేమంకరమయిన పాలనలో సుఖింపజేసిరో, ఎవరు దక్షిణాపథపతులనియు, త్రిసముద్రాధిపతులనియు, కీర్తింపబడిరో, ఎవరు మహాపరాక్రమ సమన్వితులై, ఉత్తరాపథమునగూడ తమ విజయఖడ్గమును జళిపించి, మగధరాజ్యమును పాదాక్రాంతము గావించుకొనిరో, ఎవరు ముష్కరులగు శక యవన పహ్లావాదుల విజృంభణము నణచి, వారిని సాధుల జేసిరో, అట్టి శాతవాహనవంశపు రాజులు ఆంధ్రజాతివారని తెలిసికొనుటకు ఏ యాంధ్రుడు గర్వింపడు! హర్షాశ్చర్యపులకితుడుగాడు! శాతవాహ

నుల జగజ్జేగీయ మానమైన కీర్తి ప్రతిష్ఠలకు ముగ్ధులయి, ఇటీవలి మహారాష్ట్ర చరిత్రకారులు కొందరు శాతవాహను లాంధ్రులు కారనియు, వారు తొలుత మహారాష్ట్రులైయుండి, తరువాత తెలుగుదేశమును జయించి అచ్చట స్థిరపడి, పిదప ఆంధ్రులైరను వాదమును లేవదీసిరి. కొందరు అరవపరిశోధకులు దీనికి తాళము వేయుచున్నారు. కాని నిష్పక్షపాతబుద్ధితో చరిత్ర విమర్శనకు గడగిన మొదటితరము మహారాష్ట్ర చారిత్రకులు డాక్టరు భండార్కరువంటివారును, మధ్యస్థులుగా నుండ దగిన పాశ్చాత్య విద్వాంసులందరు ఏకగ్రీవముగను, శాతవాహను లాంధ్రజాతీయులే యని ఉద్ఘోషించియున్నారు.

శాతవాహనులనే సాతవాహనులనియు, శాలివాహనులనియు, శాతకర్ణులనియు, వేర్వేరుగా పిలుచుచున్నారు. పురాణములలో ఈ వంశము వారిని ఆంధ్రులనియు, [1]కొండొకచో ఆంధ్రభృత్యులనియు గూడ వ్యవహరించిరి. మహోజ్జ్వలమైన కీర్తిని వెదజల్లిన, ఈ వంశ చరిత్రను తెలిసికొనుటకు సాధనములు విస్తారముగా లేవు. శాతవాహన చరిత్రను కొంతవర కైనను పునర్నిర్మాణము చేయుటకీ క్రిందిసాధనములు తోడ్పడుచున్నవి. సాతవాహనుల కథనమునే కాదు, హిందూరాజన్యుల చరిత్ర నంతయు, ఇట్లే వివిధసాధనముల నుండి మిక్కిలి క్లేశములతో జతకూర్పవలసియున్నది.

1. [2]శాసనములు:—పూర్వరాజవరేణ్యులు పుణ్యహేతువని దానధర్మాదికములను చేయుచుండిరి. అట్టి దానములను శిలలమీద చెక్కించియు, రాగిరేకులమీద వ్రాయించియు ప్రకటించుచుండిరి. ఇవియే శిలాశాసనములు, తామ్రశాసనములు అనబడుచున్నవి. శాత

1. "ప్రధానములైన మత్స్యవిష్ణువాయుబ్రహ్మాండ భాగవత పురాణముల ప్రమాణ ప్రతులలో నెచ్చటను ఈ యాంధ్రరాజు లాంధ్రభృత్యులుగ వర్ణింపబడలేదు. ఆంధ్రభృత్యపదము అనంతర కాలమునందు వచ్చిన చూటు శాతకర్ణులకు చెల్లును." సాతవాహన సంచిక. పుట. 69.

2. విశేషాంశముల కొరకు : చూడు "సాతవాహన సంచిక"
సంపాదకులు : డాక్టరు మారేమండ రామారావుగారు.




శాతవాహన సామ్రాజ్యము పేజీ 10

వాహనులనాటి శిలాశాసనములు కొన్ని లభించినవి. ఇవి పెక్కు మహారాష్ట్ర దేశమునందును కొన్ని మాత్రమే ఆంధ్ర దేశమునందును గాన్పించుచున్నవి. వీరి శాసనములు ప్రాకృత భాషలో, బ్రాహ్మి లిపియందు వ్రాయబడినవి. ఇవి చరిత్రరచనకు పరమ ప్రమాణములు.

2. నాణెములు:— శాసనముల తరువాత ప్రమాణములు కాదగినవి రాజుల నాణెములు. వీనినిబట్టి ఆయా ప్రభువుల నామ ధేయములు, రాజముద్రికలు తెలియవచ్చును. సాతవాహన నాణె ములు మహారాష్ట్రముననను, బేరారు మధ్య పరగణాలలోను, ఆంధ్ర దేశముననను, ద్రవిడదేశమున మద్రాసు కడలూరు మధ్యను, ఇంకను పలుప్రదేశములలోను దొరకినవి. నాణెముల యునికిని ఆధారముగ చేసికొని రాజుల రాజ్య విస్తీర్ణమును నిర్ణయించుటయు గలదు.

3. పురాణములు:— ఇవి రాజవంశావళులను పేర్కొను చుండును. మన పురాణములలో అద్భుత వృత్తాంతములు పుష్కల ముగ నుండుటచే, నివి చరిత్రాధారములు కావని సామాన్యముగ తలచుటగలదు. కాని నిపుణతతో పరిశీలించినచో, నివి సత్యాంశ ములను పెక్కింటిని తెల్పునవిగా నున్నవని చారిత్రకులు కనుగొనిరి. పూర్వకాలపు రాజులు అశ్వమేధాది యాగములు చేయునప్పుడు, సూతులు, చారణులు, భట్టులు మొదలగు గాయకులు, ఆ భూపతుల విజయములను అక్కడ సమావేశమయిన మహర్షి సంఘము మ్రోల గానము చేయుచుండిరి. ఈ బిరుదుపాఠములే క్రమముగా పురాణము లలో చేర్చబడి, మనకు నూతనాంశములను అందించుచున్నవి. పురాణములలోని రాజవంశకథనము గుప్తవంశ స్థాపనమువరకును గొనిరాబడినది. సముద్రగుప్తుని ప్రశంస వానిలో లేదు. కావున గుప్తరాజ్య నిర్మాణమునకు ముం దీ పురాణములు సంకలితము చేయబడెనని యూహింప వీలగుచున్నది. రాజవంశావళులను పేర్కొను పురాణములలో వాయుపురాణము ప్రాచీనతమమనియు, మత్స్య విష్ణు బ్రహ్మాండ పురాణములు దీని తరువాత ప్రమాణము

లనియు, కడపటిది భాగవతమనియు డాక్టరు భండార్కరు వచించెను. [1]భవిష్య పురాణము వీని కన్నిటికి మాతృక యని ఇటీవలి వాదము.

4. వాఙ్మయము:—ఈ కాలపు వాఙ్మయము ప్రధానముగ ప్రాకృత భాషలో నుండెను. అప్పటి కావ్యములలో పేర్కొనదగినవి గుణాఢ్యుడు పైశాచి ప్రాకృతములో వ్రాసిన బృహత్కథా కావ్యము. హాలుడు సంకలితము చేసిన గాధా సప్తశతి. ఈ యుగమున వెలసిన సంస్కృత గ్రంథములలో ముఖ్యమైనవి శర్వవర్మ విరచితమైన కాతంత్ర వ్యాకరణము. వాత్స్యాయన మహర్షి ప్రోక్తములైన "కామసూత్రములు". వీని నాధారముగగొని సాతవాహనశక చరిత్రను అన్వయించవలెను.

5. శిల్ప నిర్మాణములు:—పూర్వపు భూనాయకులు తమ దైవభక్తిని కళాభినిరతిని శాశ్వతరూపము నొందించుటకై అద్భుత శిల్పఖండములను సృష్టించుచుండిరి. ఈ కార్యమునందు రాజులేకాక ధనాఢ్యులగు గృహస్థులును, భక్తిసంపద మాత్రమేగల కార్మికులును, శిల్పులునుగూడ పాల్గొనుచుండిరి. సాతవాహనయుగము బుద్ధధర్మమునకు పండుగ దినములు. కావున ఇప్పటి శిల్ప నిర్మాణము లన్నియు బౌద్ధమత ప్రేరితములు. భట్టిప్రోలు, అమరావతి, నాగార్జున కొండ స్తూపములును, సాంచీస్తూపము; మహారాష్ట్ర దేశమునందలి నాసిక, కార్లీ, కన్హేరీ గుహాలయములును ఈనాటివి. ఇవికాక యసంఖ్యాకములైన చిన్న కట్టడములును కలవు.

6. విదేశీయుల వ్రాతలు:—సాతవాహన యుగమునందు గ్రీసు, రోము, మొదలగు ఖండాంతర దేశములతో ఆంధ్రులు వాణిజ్యము సాగించుచుండిరి. ఆ దేశస్థులు భారత దేశపు భౌగోళిక పరిస్థితులను తెలిసికొని, వ్యాపారమును వృద్ధినొందించుకొన గోరుచుండిరి.

1. సాతవాహన సంచిక, పుట. 11.

కావున ఈ దేశ గ్రంథకారులు భారతదేశమునుగూర్చి విన్నకన్న యంశములను వ్రాసిపెట్టుచుండిరి. అట్టివానిలో కొన్ని ఆంధ్ర దేశ ప్రశంస గలిగియున్నవి. ఇదివరలో మెగాస్తనీసును గురించి నుడివితిమి. క్రీ॥ శ॥ ఒకటవ శతాబ్దములో ప్లినీ అను నతడు "నాచురల్ హిస్టరీ" అను గ్రంథము వ్రాసెను. ఇదే శతాబ్దము మూడవ పాదమందు రచింపబడిన మరియొక గ్రంథము 'పెరిప్లసు' (Periplus of the Erythrean sea). ఈ రెండును సాతవాహనాంధ్రుల వాణిజ్య వైభవమును పొగడుచున్నవి. క్రీ॥ శ॥ 130 ప్రాంతములందుండిన టాలెమీ అను భూగోళ శాస్త్రజ్ఞుడు సుప్రసిద్ధుడు. ఈతని గ్రంథము కూడ ఆంధ్ర దేశపు తీరమును వర్ణించుచు, ఆంధ్ర చక్రవర్తియైన శ్రీపులోమావిని, శకరాజైన చస్తనుని పేర్కొనుచున్నది. ఇట్లీ విదేశీయుల గ్రంథములు ఆంధ్రచరిత్ర నిర్మాణమున కుపకరించుచున్నవి.

7. గాథలు :—దేశీయములైనసాధన సామగ్రిలోనే పేర్కొనదగినవి, ప్రజానీకమునందు వ్యాప్తిలోనున్న కథలు గాథలు మున్నగునవి. శాలివాహనుడను వీరునిగూర్చియు, విక్రమాదిత్యునిగూర్చియు, అద్భుతాంశములతోగూడిన కథలు ప్రచారమునందున్నవి. వీనినిగూడ నిపుణముగ వివేచనము చేసినచో, నిక్కపు చారిత్ర కాంశములుకొన్ని బయలుపడగలవు. లేదా ఇదివరలో తెలిసిన సత్యములను సమర్థించి, స్థిరపరచుటకైనను ఇవి తోడ్పడును.

పురాణములు ఆంధ్రరాజుల పేర్లను, వారి పరిపాలనా సంవత్సరములను, ఇచ్చుచున్నవి. శాసనములవలనను, నాణెములవలనను, తెలియవచ్చు సాతవాహనుల పేర్లు పౌరాణిక పట్టికలతో చాలావరకు సరిపడుచున్నవి. ఈ సాదృశ్యమునుబట్టియే, ఈ రెండు కథనములును ఒకే రాజవంశమునుగూర్చియని పరిశోధకులు సముచితముగ నిర్ణయించిరి. ఆంధ్రుల నివాసస్థానము ఆంధ్రదేశమనుట జగద్విదితము. ఐనను కొందరు చారిత్రకులు సాతవాహనులును, పురాణ ప్రసిద్ధులైన ఆంధ్ర చక్రవర్తులును ఒక్కరుకారని వాదించుచున్నారు. వీరి మతమున సాతవాహనుల జన్మస్థానము తొలుదొల్త

మహారాష్ట్ర దేశము కాని, బళ్ళారి మండలముకాని అయియుండును. బళ్లారి జిల్లాలో నొకభాగమునకు సాతవాహనీహారము అనుపేరు శాసనములలో కనబడినది. ఇదియే సాతవాహనుల జన్మమండల మనియు, ఇచ్చటనుండి వీరు తూర్పునకు విజృంభించిరనియు, వీరి వాదసారాంశము. సాతవాహనుల శాసనములు విస్తారముగా మహారాష్ట్రమునం దున్నవి. ఈ వంశముయొక్క మహారాష్ట్రోత్పత్తికి, ఇదియొక ప్రబల నిదర్శనమని వారు వాకొందురు. [1] కాని సాతవాహనులును, ఆంధ్రులును ఒక్కటే వంశమనియు, వీరి జన్మస్థాన మిప్పటి యాంధ్రదేశమనియు, వీరు తూర్పునుండి పశ్చిమమునకు విజేతలై వ్యాపించిరనియు, అత్యధిక సంఖ్యాకులైన చారిత్రకులు విశ్వసించుచున్నారు. 'సాతవాహను' లనునది వీరివంశనామము. వీరు జాతిచేత ఆంధ్రులు. [2] సాతకర్ణి లేక శాతకర్ణియను ఉపపదము వీరి గోత్రమును సూచించును.

శాతవాహనుల పరిపాలనా కాలమును గురించికూడ చారిత్రకులలో భిన్నాభిప్రాయములు కలవు. ముప్పదిమంది యాంధ్రరాజులు సుమారు నాలుగున్నర శతాబ్దముల పర్యంతము భూమిని పాలింతురని పురాణములు చెప్పుచున్నవి. కొన్ని పురాణములు మూడువందల సంవత్సరములే ఈ వంశ ప్రభుత్వమున కిచ్చుటగలదు. పురాణముల కథనమునుబట్టి, ఆంధ్రచరిత్రలో నొక ముఖ్యఘట్టము, ఈ వంశమువాడైన సింధుకుడు కాణ్వాయన సుశర్మను అంతమొందించి మగధరాజ్యము నాక్రమించుటయై యున్నది. ఆంధ్ర చక్రవర్తుల పరిపాలనా పరిమితి మూడు శతాబ్దములని భండార్కరుగారు గ్రహించి, ఈ వంశస్థాపనము క్రీ. పూ॥ 73 సంవత్సర ప్రాంతమని లెక్కవేసిరి. దీనినే ఆంధ్ర చరిత్రకారులు చిలుకూరి వీరభద్రరావు పంతులుగారును స్వీకరించిరి. శిశునాగ వంశీయుల తరువాత మౌర్యులు 137 సంవత్సరములును, తరువాత శుంగ వంశస్థులు 112 వర్షములును, వీరియనంతరము కాణ్వాయన కుటుంబము 45 శరత్తులును

1. చూడు : సాతవాహనసంచిక, పుటలు 21-31.

2. పైగ్రంథము పుట 53.

మగధ నేలుదురని పురాణములు నుడివినవి. మౌర్యరాజ్యస్థాపనము క్రీ॥ పూ॥ 322 కావున, 137 సంవత్సరములు పాలించిన ఈ యన్వయము క్రీ॥ పూ॥ 185 లో అంత మొందుచున్నది. శుంగాన్వయులు ఇప్పటినుండి 112 సంవత్సరములు పాలించిరిగాన వీరు క్రీ॥ పూ॥ 73 వరకు నేలుబడి సాగించియుందురు. కాణ్వాయనులు శుంగవంశము వారి భృత్యులు. వీరి పరిపాలనా కాలమైన 45 శరత్తులును శుంగుల ప్రభుత్వములోనే ఇమిడియున్నవి. ఇట్లు శుంగ – కాణ్వాయన పరిపాలనము క్రీ॥ పూ॥ 73 లో తుదముట్టింపబడినది. దీనిని సాధించినవాడు ఆంధ్రుడైన సింధుకుడు. ఇప్పటినుండియే ఆంధ్రుల అభ్యుదయమని భండార్కరుగారి మతము.

[1]కాని ఈనాడు చారిత్రకు లందరును సాతవాహనాంధ్రుల విజృంభణము క్రీ॥ పూ॥ 3 వ శతాబ్దియందే ప్రారంభించెనని ఏక కంఠముగా చెప్పుచున్నారు. ఈ వంశ ప్రతిష్ఠను మొదట నెలకొల్పినవాడు శ్రీ ముఖశాతవాహనుడు. (ప్రాకృతములో సిముకుడు). దీనికి నిదర్శనములిట్లు చూపించుచున్నారు. మహారాష్ట్ర దేశమున నానేఘాటు (నానాఘట్టము) వద్ద నొక గుహలో సాతవాహనరాజుల విగ్రహములు కొన్ని చెక్కబడియున్నవి. వానిలో మొట్టమొదటిది రాయ (శ్రీ)ముఖ సాతవాహనునిది. తరువాత దేవినాగనీక, రాయ సిరిసాతకర్ణి మొదలైనవారు కలరు. సాతకర్ణి దేవేరియైన నాగనీక నానేఘట్టము నొద్ద నొక శాసనము వేయించి, తన భర్తపుణ్యకార్యములను ప్రశంసించినది. ఈ శాసనలిపినిబట్టి ఇది క్రీ॥ పూ॥ రెండవ శతాబ్దినాటిదని, పరిశోధకులు నిర్ణయించిరి. అనగా మొదటి సాతకర్ణి క్రీ॥ పూ॥ 2 వ శతాబ్దమువాడని చెప్పబడినది. శుంగవంశమును స్థాపించిన పుష్యమిత్రుడును, కళింగదేశము నీకాలమున పాలించిన ఖారవేలుడను ప్రతాపశాలియైన రాజును, మొదటిసాతకర్ణికి సమకాలికులు. ఈ కళింగాధిపతి

---

1. Cambridge History of India.

క్రీ॥ పూ॥ 156 లో హాతిగుంఫయనుచోట వేయించిన శాసనము చరిత్రపథములో నొక ముఖ్యమైన మజిలీగా ఎంచబడుచున్నది. ఈయంశములను పురస్కరించుకొని, శ్రీముఖ శాతవాహన రాజు క్రీ॥ పూ॥ 225-220 నడుమ ఆంధ్ర సామ్రాజ్యమును స్థాపించెనని విశ్వసనీయముగ తలపబడుచున్నది. అశోకచక్రవర్తి క్రీ॥ పూ॥ 236 ప్రాంతమున మరణించెను. అతని యనంతరము కొలది సంవత్సరములకే శాతవాహనులు మౌర్యసామ్రాజ్యమును ధిక్కరించి, స్వతంత్ర ప్రతిపత్తిని ప్రకటించిరని యూహించుట సమంజసము.

ఈ వంశ చరిత్రము నింకను కొంచెము వెనుకకు గొనిపోవుటకు సాధనము ఇటీవల లభించినది. సాతవాహనుడను రాజుపేరు గల నాణెమొకటి ఓరుగల్లు ప్రాంతమున దొరకినది. ఇతడే ఈ వంశముయొక్క మూలపురుషుడనియు, ఇతని పేరనే ఏతద్వంశమునకు సాతవాహన నామధేయము కలిగినదనియు తెలియుచున్నది. ఈ మూలపురుషుడు క్రీ॥ పూ॥ 220 కి పూర్వమే పరిపాలనచేసి, స్థిరమైన రాజ్యమును, సంపాదించి, తన కుమారుడు శ్రీముఖ సాతవాహనున కప్పగించి యుండును.

కథా సరిత్సాగరములో నీ రాజునుగూర్చి యొక కథ వర్ణింపబడినది. వీరావతంసుడైన యీతడు అక్బరు, శివాజీ మున్నగు కార్యశూరులవలె, విద్యావ్యాసంగమంతగా లేకుండినవాడుగా గన్పట్టును. ఈతని రాణులలో విదుషీమణియైన యాపె యొకర్తె యుండెను. ఆమె జలక్రీడా సమయమున సంస్కృతములో రాజును పరిహాసించెను. తన యజ్ఞానమునకు సిగ్గిలి, సాతవాహనరాజు శర్వవర్మ యను మంత్రి సహాయమున, శీఘ్రకాలముననే సంస్కృత భాషాజ్ఞో విదుడయ్యెను. ఈ శర్వవర్మయే 'కాతంత్రవ్యాకరణము'ను వ్రాసినవాడు. సాతవాహనరాజీ మంత్రిసత్తమునకు, భరుకచ్ఛమును దానముచేసెనని చెప్పబడినది. నూతనముగ సంపాదించిన గీర్వాణ భాషాప్రియత్వమువలన ఈరాజు గుణాఢ్యపండితుడు పైశాచి ప్రాకృతమున గూర్చిన "బృహత్కథ"ను, మొదటనిరాదరణచేసెను.

తరువాత తన తప్పును గుర్తించి సాతవాహనుడే దీనికి కథాపీఠమును వ్రాసెనట. [1]ఇట్లు బృహత్కథయు, కాతంత్రవ్యాకరణమును గాథాసప్తశతికన్న కడు ప్రాచీనములుగా దోచును. ఈ మూడు గ్రంథములును హాలసాతవాహనుని కాలముననే వెలసియుండునని, విన్సెంటుస్మిత్తుపండితు డభిప్రాయపడెను.

శ్రీముఖ సాతవాహనుని కాలముననే కృష్ణానది యొడ్డుననున్న అమరావతి, ఈ వంశమువారికి ముఖ్యపట్టణముగా నుండెను. దీనినే ధాన్యకటకము, ధాన్యవాటి, ధనకటకము మొదలగు పేర్లతో పిల్చుచున్నారు. తత్పూర్వ రాజులకు శ్రీకాకుళము రాజధానిగా నుండెను. ఇట్లు బీజము వేయబడిన సాతవాహనాంధ్రరాజ్యము అచిరకాలములోనే మహావృక్షముగా పెరిగి శాఖోపశాఖలతో విరాజిల్లెను. దీనికికారణము ఈ కులమునందు అత్యంతసమర్థులగు చక్రవర్తులు పలువురు పుట్టుటయే. శ్రీముఖ సాతవాహనుడు మహారాష్ట్రమును జయించి దానిని తనరాజ్యములో కలుపుకొనెను. ఈతడు గొప్ప విజేతయగుటయేకాక, దూరదృష్టిగల రాజనీతిజ్ఞుడుగా గన్పించును. మహారాష్ట్రమును జయించి, ఆ ప్రాంతము నదివరలో పరిపాలించు సామంతరాజ కుటుంబములతో బాంధవ్యము కలుపుట క్షేమంకరమని ఇతడు తలపోసెను. తన కుమారుడైన మొదటి సాతకర్ణికి మహారాష్ట్ర బాలికయగు దేవి నాగనీకను పెండ్లిచేసి, పరాజితులైన యచ్చటి సామంతులను తనకు సుముఖులనుగ జేసికొనెను. మహారాష్ట్రము నేలిన రాజులను మహారథులనియు, విదర్భపాలకులను భోజకు లనియు చెప్పుదురు. శ్రీముఖుడు క్రీ. పూ. 221–198ల నడుమ రాజ్యముచేసియుండును.

శ్రీముఖుని తరువాత ఆతని తమ్ముడు కృష్ణశాతవాహనుడు 18 ఏండ్లు పాలించెను. వీనియనంతరము క్రీ. పూ. 180–170 ల

1. బృహత్కథ రచనాకాలము క్రీ.పూ. 200–150 సంవత్సరముల ప్రాంతము కావచ్చునని శ్రీ త. శివశంకరశాస్త్రిగారు వ్రాయుచున్నారు. చూడు, వ్యాసము "గుణాఢ్యుడు—బృహత్కథ" సాతవాహన సంచిక.

నడుమ ప్రభుత్వము నెరపిన మొదటి శాతకర్ణి మహాసమర్థుడు. ఈతడు దక్షిణాపథపతియనియు, పృథివికి ఏకవీరుడనియు, ఈతని రాణియైన నాగనీక శాసనములో ప్రశంసింపబడెను. ఈతడు రెండశ్వమేధములను జేసెను. ఆకాలపు భూపతులు, తాము సాధించిన గొప్ప విజయములను ఉద్ఘోషించుటకై, అశ్వమేధయాగములను చేయుచుండిరి. మొదటి సాతకర్ణి కాలమున శాతవాహనాధికారము, ఉజ్జయిని ముఖ్యపట్టణముగాగల పశ్చిమ మాళవము (అవంతి) లోనికి వ్యాప్తినొందెను. ఈరాజు ప్రబలురును, రాజ్యకాంక్షులును, అయిన సమకాలిక ప్రభువులతో డీకొనవలసివచ్చెను. వారిలో శుంగవంశ స్థాపకుడైన పుష్యమిత్రుడొకడు. పుష్యమిత్రుడు కడపటి మౌర్యరాజును తొలగించి, క్రీ॥ పూ॥ 185 ప్రాంతమున మగధ సామ్రాజ్యము నాక్రమించిన సాహసికుడు. శుంగులకును, ఆంధ్రులకును, విదర్భపై యాధిపత్యమునకై పోరాటముసాగి, యారాజ్యము రెండుగా చేయబడెను. ఈ యంశము కాళిదాస మహాకవి రచించిన మాళవికాగ్నిమిత్ర నాటకమునందు సూచితమైనది. సాతకర్ణి రెండవ ప్రత్యర్థి కళింగాధీశుడైన ఖారవేలుడు. ఈతడు సాతవాహన సామ్రాజ్యముపై దండయాత్రలు సాగించెను. గాని సాతకర్ణిని చలింపజేయలేకపోయెను. మొదటి సాతకర్ణి గొప్ప శూరుడగుటయేకాక, పరమధార్మికుడై యుండెను. ఈతడు వైదిక మతదీక్షితుడై, పుణ్యక్రతువుల ననేకముచేసి, భూరిదక్షిణల నొసగి, గోహిరణ్యా దానములను చేసినట్లు నాగనీక శాసనము ప్రకటించుచున్నది.

ఈవంశమున ప్రశస్తిగాంచిన చక్రవర్తులలో రెండవ సాతకర్ణియొకడు. ఈతడు క్రీ॥ పూ॥ 152-96 వరకు సామ్రాజ్యము శాసించెను. ద్వితీయ శాతకర్ణి తన విజయసైన్యములను తూర్పు మాళవముపై పంపి, దానిని జయించెను. ఆకరము, దశార్ణము, అను పేరులుగల ఈప్రాంతమునకు, విదిశానగరము ముఖ్యపట్టణము. విదిశ పరిసరములందు బౌద్ధస్తూపము లెన్నియోగలవు.

వీటిని భిల్సాతోపులందురు. ఇచ్చట సాంచీస్తూపము శాతవాహన శిల్పమునకు ముఖ్యోదాహరణము. ఈ స్తూపముకడ సాతకర్ణి పేరు గల శాసనముకలదు. కావున ఈ చక్రవర్తియే శిల్పకళా ప్రపంచమునందు పేరుగాంచిన సాంచీద్వారములకు కారకుడని తలపబడుచున్నది. రెండవ సాతకర్ణి కళింగమునుకూడ జయించెను. ఈతని రాజ్యావసాన కాలమున, అనగా క్రీ॥ పూ॥ 100 ప్రాంతమున, శకులు శాతవాహనులనుండి ఉజ్జయినిని జయించి తమరాజ్యము నచ్చట స్థాపించిరి.

విదేశీయులును, యుద్ధప్రియులును, క్రూరులును అగు శకులు మిడతల దండువలె సాతవాహన సామ్రాజ్యపు పశ్చిమభాగముపై పడిరి. క్షహరాటానహపాణుడను శకవీరుడు, ఘూర్జరము నాక్రమించి, పాలింపనాగెను. ఆంధ్రసామ్రాజ్యములో భాగమైన మహారాష్ట్ర ప్రాంతమునుగూడ నహపానుడు జయించి, అచ్చట తన యల్లుడును, సేనాపతియునగు ఋషభదత్తుడను వానిని తన ప్రతినిధిగా నిల్పెను. విదేశీయులైన శకయవన పహ్లావాదులు హిందూ బౌద్ధమతముల నవలంబించి, భారతీయులలో కలిసిపోవుచుండిరి. కావున దేశమునందు సాంఘిక విప్లవము సాగుచుండెను. ఋషభదత్తు డెన్నియో ధర్మకార్యములను జేసెను. [1]నహపానుడును, ఋషభదత్తుడును క్రీ॥ పూ॥ ప్రథమశతాబ్దికి చెందినవారని యొక మతమును, క్రీ॥ శ॥ రెండవ శతాబ్దము ప్రారంభమున నుండిరని మరియొక మతమును, చారిత్రకులలో గలవు. ద్వితీయ శాతకర్ణి యనంతర రాజులకు శకులబాధ మిక్కుటమయ్యెను.

---

1. నహపానుని మంత్రి ఆయముడను బ్రాహ్మణుడు వేయించిన జున్నారు శాసనములో ఒకశకము 46వ సంవత్సరము పేర్కొనబడినది. ఇది శాలివాహన శకమైనచో నహాపణుని కాలము క్రీ. శ. 124 అగును. సాతవాహన సంచిక ననుసరించి ఆయమునిశాసనము విక్రమ శకమునకు సంబంధించినదిగా ఇచ్చట గ్రహింపబడినది.

కుంతలశాతకర్ణియను ఆంధ్రచక్రవర్తి క్రీ॥ పూ॥ 38-30 ల నడుమ రాజ్యభారమును వహించెను. ఈతడు కాణ్వాయన వంశీయుడైన సుశర్మను ఓడించి, మగధరాజ్యము నాక్రమించెనని తెలియ వచ్చుచున్నది. మగధరాజ్యాక్రమణము కుంతలుని తరువాతివాడైన మొదటి పులోమావి కాలమున క్రీ॥ పూ॥ 28 లో జరిగెనని, కొందరు చారిత్రకులు తలచుచున్నారు. ఇప్పటినుండి క్రీ॥ శ॥ 28 వరకు, అనగా నొకశతాబ్దము పర్యంతము, పాటలీ పుత్రముపై [1] ఆంధ్రులయాధిపత్యము చెల్లెను. [2] గుణాఢ్య శర్వవర్మలు కుంతల శాతకర్ణి కాలము వారనియు, బృహత్కథ యీతని యాస్థానమున వెలసిన కావ్యమనియు మరియొక యభిప్రాయముగలదు. వాత్స్యాయన కామసూత్రములలో కుంతల శాతకర్ణియు, అతని రాణి మలయవతియు పేర్కొనబడిరి. ఈ గ్రంథము క్రీ॥ శ॥ మూడవ శతాబ్దినాటిదని పరిశోధకులు చెప్పుచున్నారు.

క్రీ॥ శ॥ 19-24 నడుమ రాజ్యముచేసిన హాలశాతవాహన చక్రవర్తి కాలము, ప్రాకృత వాఙ్మయమున స్వర్ణయుగమని చెప్పనొప్పును. ఈతని యాస్థానముననే గాథాసప్తశతియను ప్రాకృత కావ్యము కూర్చబడెను. లీలావతియను మరియొక ప్రాకృత కావ్యమీసమయముననే వెలసెను. హాల సాతవాహనరాజు సింహళరాజ పుత్రియైన లీలావతిని ప్రేమించి, పెండ్లియాడుట, దీనిలోని ఇతివృత్తము. దీనికి కార్యరంగము సప్తగోదావరీ తీరమున ప్రసిద్ధిగాంచిన భీమేశ్వరక్షేత్రము. హాలుడు అశ్మక రాజ్యమునందలి ప్రతిష్ఠానమునేలుచుండినట్లు లీలావతీ కావ్యము వర్ణించుచున్నది. దీనికన్న జగద్విఖ్యాతమైన కావ్యము గాథాసప్తశతి. ఇందు అత్యంత సుందరములును, కోమలములును, రసనిర్భరములును, అగు ఏడువందల శృంగారగాథలు కలవు. గాథయన ప్రాకృత పద్యము. ఈపద్యములొకదానితో నొకటి సంబంధించినవి కాక స్వతంత్రములు. గాథ

---

1. సాతవాహన సంచిక పుట 81
2. పైగ్రంథము పుట 82

లను రచించిన కవులును, అనేకులున్నారు. 'శాలివాహన సప్తశతి' యని పేరు దీనికుండుటచే, ఈకావ్యమంతయు హాలుడు వ్రాసినదని తలపరాదు. హాలచక్రవర్తి స్వయముగ విద్వాంసుడును, రసికుడునై, కొన్ని గాథలను తాను లిఖించెను. హాలుని యాస్థానమును సందర్శించిన కవివరేణ్యులు చెప్పిన గాథలే అధికసంఖ్యలో నున్నవి. వీనిలో మిక్కిలి రమణీయమైన వాని నేర్చికూర్చి, శ్రీపాలితుడను మహాకవి, సప్తశతిగా రూపొందించెనని తెలియుచున్నది. గాథలను రచించిన వారిలో పురుషులేకాక స్త్రీలును ఉండుట ప్రశంసనీయము. కవయిత్రులలో అణులక్ష్మి, అనుపలబ్ధ, రేవ, మాధవి మొదలగు మానినీమణుల రచనలు గాథాసప్తశతిలో స్థానము నలంకరించినవి. ఇట్లనేకమంది కవుల కాశ్రయమిచ్చినందున, హాలునకు 'కవివత్సలుడు' అను ఖ్యాతిగల్గెను. ఆకాలపు సాంఘిక జీవితము, తత్రాపి కల్లకపటము లెరుగని గ్రామీణుల ప్రేమవిలాసములు, ఈ పద్యములందు అద్దమునందువలె ప్రతిఫలించినవి. ఇందు శృంగారమే ప్రధాన రసమైనను, గాథలు సభ్యరుచికి దూరముగాకుండ ఉన్నవని పండితులు ప్రశంసింతురు. లీలావతీ గాథాసప్తశతి కావ్యములు రెండును, మహారాష్ట్రి ప్రాకృతములో వ్రాయబడినవని పలువురు తలచుచున్నారు. క్రీ॥ శ॥ మొదటి శతాబ్దమునాటికి ప్రాకృతములో ప్రాంతీయశాఖలు పుట్టలేదనియు, మహారాష్ట్రిము మున్నగు విభాగము లేర్పడలేదనియు, కావున గాథాసప్తశతి ఆనాటిసర్వసామాన్యమైన ప్రాకృతములో వెలసెననుట యుక్తమనియు, శ్రీ[1] కురుగంటి సీతారామ భట్టాచార్యులవారు నిరూపించుచున్నారు.

హాలశాతవాహనుని తరువాత రాజ్యమునకు వచ్చినవారు సమర్థులైన పాలకులు గాకుండిరి. క్షహరాటులును, ఉజ్జయినీ క్షాత్రవులును, సామ్రాజ్యముయొక్క పశ్చిమ భాగమును, పశ్చిమోత్తర దేశమును, ఆక్రమించుకొని యేలసాగిరి. క్రీ॥ శ॥ 78 ప్రాంతము

1. చూడు ఆంగ్లవ్యాసము
Journal of Deccan History of Culture Vol. I.

నకు పాటలీపుత్రముపై ఆంధ్రుల యాజమాన్య మంతమొందెను. ఉత్తర హిందూస్థానమునందు [1] కుషానుల విజృంభణమే దీనికి కారణము. ఆంధ్ర కళింగదేశములు మాత్రమే సాతవాహనుల పాలనమునకు లోగియుండెను. ఇట్లీ వంశముయొక్క కీర్తిప్రాభవములు, కడుకృశించియున్న సమయమున, దైవనిర్దేశమున గౌతమీపుత్ర శాతకర్ణి క్రీ. శ. 78 ప్రాంతమున ధాన్యకటక సింహాసనమధిష్ఠించెను. ఈమహావీరుడు చంద్రగుప్త కృష్ణదేవరాయలవలె గొప్ప విజేతయై ఖ్యాతిచెందెను. మిక్కిలి హీనస్థితిలోనున్న సాతవాహన ప్రతిష్ఠ నీతడు తన విజయములచే సంపూర్ణముగ నిలువబెట్టెను. ఈతని తల్లి గౌతమీ బాలశ్రీయొక్క నాసిక శాసనము ఈతని దిగ్విజయ పరంపరను ప్రశంసించుచున్నది. గౌతమీ పుత్రుడు "అసిక అసక ముళక సురఠ కుకుర అపరాంత అనుప విదభ ఆకరావంతు" లకు ఏలిక. మూడు సముద్రముల నీరు త్రాగిన వాహనములు గలవాడు. తన తల్లికి అవిపన్నమైన శుశ్రూష చేయువాడు. క్షత్రియుల దర్పమును, మానమును, అణగగొట్టినవాడు. శక యవన పహ్లవులను నాశనము చేసినవాడు. క్షహరాటవంశమును నిర్మూలించినవాడు. చాతుర్వర్ణ సంకరమును నిరోధించినవాడు. ఏక ధనుర్ధరుడు, ఏక బ్రాహ్మణుడు ఇత్యాది విశేషణములకు నిలయమైనట్లు వర్ణింపబడెను. ఈతడు శకులను పీచమడంచి, వారి యధీనమునందున్న వివిధప్రాంతములను మాళవము, మహారాష్ట్రము, సౌరాష్ట్రము, నర్మదాతీరము, మొదలగు విశాల భూభాగములను జయించి శాతవాహన సామ్రాజ్యములో నంతర్భవింపజేసెను. క్షహరాట నహపానుడు స్థాపించిన వంశమును, గౌతమీపుత్రుడు నిర్మూలించి యేవంకనుండి ప్రమాదములేకుండ జేసికొనెను. తన విజయసూచకముగ నహపానుని నాణెములపై తన ముద్రికను వేయించి, తిరిగి ముద్రింపించెను. గౌతమీపుత్రుని యుద్ధాశ్వములు

---

1. కుషానుల పరిపాలనము. క్రీ. శ. 28—225 నడుమ సాగెనని తెలియవచ్చును. వీరిలో కనిష్కుడు సుప్రసిద్ధుడు.

మూడు సముద్రములలోను నీరుత్రావెనని చేయబడిన ప్రశంస, అత్యుక్తికాక వాస్తవమనియే విశ్వసింపదగును. ఈతని సామ్రాజ్యము తూర్పు పడమర సముద్రములనంటి విస్తరించెను. దక్షిణ సముద్రతీరపు రాజులు ఈతని మిత్రులో సామంతులో అయియుండిరి.

గౌతమీపుత్రుడు క్రీ. శ. 78-102 నడుమ సామ్రాజ్యాండము ధరించెను. ఈతని ఘనకార్యములను ప్రశంసించుట కడు దీర్ఘమైన కార్యము. శకయవన పహ్లావుల దాడులచే దేశ మరాజకమై వర్ణసాంకర్య మేర్పడుచుండెను. ఈమహారాజు ఈరెండు ప్రమాదములనుండి దక్షిణ భారతము నుద్ధరించిన వాడాయెను. కుషానుల విజృంభణమునకు పాల్పడిన ఉత్తర భారతమునందు శాంతియు, వర్ణ ధర్మరక్షణమును కొఱవడెను. గౌతమీపుత్రుడు బ్రాహ్మణుడును, వైదికధర్మపరాయణుడుగను, ఉండినట్లు తోచును. అయినను సాతవాహన సామ్రాజ్యమునందు బౌద్ధమతము ప్రశాంతముగ వర్ధిల్లెను. చక్రవర్తిమాతయు, పరమసాధ్వియునగు గౌతమిబాలశ్రీ స్వయముగ బుద్ధధర్మనిరతురాలై, భిక్షుసంఘమునకు గుహావిహారములు నిర్మించి, యిచ్చెను. గౌతమీపుత్రుడు అనేక సద్గుణ గరిష్ఠుడు. వీని గుణములలో నెక్కువ పొగడదగినది ఆతని మాతృభక్తిపరాయణత్వము. ఈ చక్రవర్తినాటినుండియు, సాతవాహనరాజులు తమతల్లి పేరుతో కలిపి, తమ నామధేయముల చెప్పుకొనుచుండిరి. ఇప్పటినుండియు ఈ వంశీయులు శాతకర్ణులనుపేర బరగుటయు, గమనింపదగినది. ఈ యంశములనుబట్టి గౌతమీపుత్రునితో ఆరంభించి, సాతవాహన వంశమునందే మరియొక శాఖవారు సామ్రాజ్యము నధిష్ఠించియుందురని చారిత్రకు లూహించుచున్నారు. గౌతమీపుత్రుడు, 'బెణ్ణాకటక స్వామి' యని ఈతని యొక శాసనమునందు ఉదహరింపబడినది. బెణ్ణా యనగా కృష్ణవేణీనది. దీని యొడ్డున నుండిన ధాన్యకటకమే బెణ్ణాకటకము. చక్రవర్తియైన గౌతమీపుత్రుడు సామ్రాజ్యమునకు ముఖ్య రాజధానియైన ధాన్యకటకమునుండి పరిపాలన చేయుచుండెను. ఆతని పుత్రుడును, పరాక్రమాదికములచే తండ్రికి తుల్యుడును, అగు

వాసిష్ఠీ పుత్రపులోమావి గోదావరియొడ్డున నుండిన ప్రతిష్ఠానమును ఉపరాజధానిగా చేసికొని, సామ్రాజ్యముయొక్క పశ్చిమ భాగము లను శాసించుచుండెను. ప్రతిష్ఠానమునే ఇప్పుడు పైఠను అందురు. ఇది ప్రస్తుతపు ఔరంగాబాదు జిల్లాలో నున్నది.

శాతవాహన యుగమునందు రెండు ముఖ్యశకములు ప్రచారములోనికి వచ్చెను. ఇవి విక్రమాదిత్యశకము శాలివాహనశకము అనబడునవి. విక్రమశకము క్రీ. పూ. 58 సంవత్సరమునుండియు, శాలివాహనశకము క్రీ.పూ. 78 నుండియు లెక్కింపబడుచున్నవి. ఒక మహత్తరచారిత్రకఘట్టమునకు జ్ఞాపకార్థముగా, శకములు ఆరంభింపబడుచుండును, అట్లయినచో, విక్రమ శాలివాహన శకముల స్థాపనకు మూలములైన చారిత్రక సన్నివేశము లెట్టివి అను ప్రశ్న జనించును. విక్రమాదిత్యుని గూర్చియు, శాలివాహనుడను వీరాగ్రణిని గురించియు, పెక్కు గాథలు ప్రజానీకమునందు వ్యాపించియున్నవి. విక్రమాదిత్యుడు శకుల నోడించుటకు స్మృతిచిహ్నముగ, విక్రమశకము మొదలిడెననియు, శాలివాహనుడు విక్రమాదిత్యుని జయించుటకు స్మారకముగ. శాలివాహనశకము స్థాపితమయ్యెననియు చెప్పుదురు. శాలివాహనుని గురించిన గాథలు, ఆంధ్రశాతవాహనచక్రవర్తులలో నొకరికి సంబంధించినవని తలచుట యుక్తము. గౌతమీపుత్రశాతకర్ణి క్రీ. శ. 78 లో రాజ్యాభిషిక్తుడైనట్లు తోచును. ఈ వీరాగ్రేసరుడు శకుల మదము నడగించెను. శాలివాహనుడు ప్రతిష్ఠానము నేలుచుండినట్లు, కథలు సూచించుచున్నవి. విక్రమాదిత్యుడు ఉజ్జయిని పాలకుడు. ఈ యంశములను సమన్వయముచేసి, గౌతమీపుత్రుడో లేక యతని కుమారుడు పులోమావియో, ఉజ్జయినీ క్షాత్రవుడగు నొక శకరాజును జయించెననియు, ఈ విజయ చిహ్నముగను, గౌతమీ పుత్రుని విజయరాజ్యప్రారంభమునకు గుర్తుగను. క్రీ. శ. 78 లో శాలివాహనశకము నెలకొల్పబడెనని యూహించుట సమంజసము. ఉజ్జయినీక్షాత్రపు నొకనిని పరాభవించినవాడు,

వాసిష్ఠీపుత్రపులోమావి కావచ్చునని [1]డాక్టరు భండార్కరు అభిప్రాయపడెను.

గౌతమీ పుత్రుని యనంతర మాతని నందనుడు పులోమావి చక్రవర్తియై, క్రీ. శ. 102-130 ల నడుమ పరిపాలనము చేసెను. ఈ పరాక్రమశాలి, దిలీపమహారాజునకు రఘువువలె, తండ్రి విజయములకు చేదోడు, వాదోడై యుండెను. జనకు డొసంగిన సువిశాల సామ్రాజ్యము నీతడు చెక్కుచెదరకుండ చాలకాలము గుప్త పరచెను. ఈతని శాసనములును, నాణెములును ఆంధ్రరాష్ట్రి విదర్భలలో లభించినవి. ఈతని రాజ్యాంతమున చస్తనుడను శకక్షాత్రపుడు ఉజ్జయినీ ప్రదేశమును, సాతవాహనులనుండి జయించి నూతన రాజ్యమును స్థాపించెను. క్రీ. శ. 130 ప్రాంతమువాడైన టాలెమీ యను గ్రీకు భూగోళశాస్త్రజ్ఞుడు, సిరిపులోమావిని, చస్తనుని తన గ్రంథములో పేర్కొనెను.

పులోమావి తమ్ముడు సాతకర్ణి ప్రభుత్వకాలమున, ఉజ్జయినీ పాలకుడును, మహాక్షాత్రపుడును, అగు రుద్రదాముడు విక్రమించెను. రుద్రదాముడు చస్తనుని మనుమడు. తన 'జునాగడు' శాసనములో, దక్షిణాధిపతియైన శాతకర్ణిని రెండు పర్యాయములు లోడించియు, బంధుభావముచేత విడిచిపుచ్చితినని, రుద్రదాముడు ప్రకటించుకొనెను. దీనిని బట్టి రుద్రదాముని కుమార్తె, సాతకర్ణి భార్యయనియు, అల్లుడగుటచే సాతకర్ణి నోడించియు, రుద్రదాముడు విడిచిపుచ్చెననియు చారిత్రకు లూహించుచున్నారు.

పులోమావి యానంతరికులు సమర్థులు కాకపోవుటచే, సామ్రాజ్య పశ్చిమోత్తర భాగమును మహారాష్ట్రమును వీరు ఉజ్జయినీ క్షాత్రపులకు గోల్పోయిరి. ఈ వంశములో కడపటి గొప్ప చక్రవర్తి గౌతమీపుత్ర యజ్ఞశ్రీ శాతకర్ణి. ఈతడు క్రీ. శ. 174-203 నడుమ పాలనచేసెను. యజ్ఞశ్రీ ప్రతిభాశాలియు, పరాక్రమ

1. Early History of The Deccan.

వంతుడునై, తన పూర్వులు గోల్పోయిన సామ్రాజ్య భాగములను తిరిగి జయించి, పరిపాలించినట్లు నిదర్శనములు గలవు. ఈతని శాసనములును, నాణెములును, గుజరాతు, కథియవాడు, బరోడా, మాల్వా, అపరాంతము, మహారాష్ట్రాంధ్ర దేశములలోను, మధ్య దేశములోను, దొరకినవి. వీనిని బట్టి గౌతమీపుత్ర శాతకర్ణివలెనే యజ్ఞశ్రీకూడ త్రిసముద్రాధిపతియై విశాల సామ్రాజ్యము నేలెనని ధ్రువపడుచున్నది. యజ్ఞశ్రీ నాణెములపై ఓడబొమ్మ, మరియు లంగరు, చిత్రింపబడియుండు టొక విశేషము. ఈతని కాలము నందును అంతకు పూర్వముకూడ సాతవాహన రాజ్యమునందు సముద్రవ్యాపారము విస్తారముగ సాగుచుండెననుట కివి ప్రమాణములు.

యజ్ఞశ్రీ శాతకర్ణి రాజ్యకాలము ప్రాముఖ్యము వహించుటకు మరియొక హేతువు కలదు. ఈతని కాలములోనే ఆచార్య నాగార్జునుడను విఖ్యాత బౌద్ధమతగురువు జీవించి. ఆంధ్రబౌద్ధమునకు దిగంతవ్యాప్తకీర్తిని, గడించిపెట్టెను. నాగార్జునాచార్యు డొక సాతవాహన చక్రవర్తికి మిత్రుడనియు, రాజున కతడు 'సుహృల్లేఖ'యను బౌద్ధధర్మ ప్రతిపాదకమైన లేఖను వ్రాసెననియు, ఇత్సింగను చైనా యాత్రికుడు వ్రాసెను. ఈ సాతవాహనరాజు యజ్ఞశ్రీ శాతకర్ణి యని పరిశోధకులు నిర్ణయించుచున్నారు. ఆచార్య నాగార్జునుని జీవిత విశేషములు ముున్ముందు తెలుపబడును. యజ్ఞశ్రీ యనంతరము సాతవాహన సామ్రాజ్యము తన ప్రదీప్తిని కోల్పోయి, మరియొక తరము నాటికి నామమాత్రావశిష్టమై, యస్తమించెను. ఈతని తరువాత విజయశ్రీ, చంద్రశ్రీ పులోమావియను వారలు శాతవాహనాధికార మును పూనిరి. కాని వారెవ్వరును పరాక్రమవంతులు కాకపోవుటచే, సామ్రాజ్య భాగములు హస్తచ్యుతములై పోజొచ్చెను.

ఆభీరులు ఈశ్వరసేనుని నాయకత్వమున మహారాష్ట్రదేశము నాక్రమించుకొనిరి. మాఢరిపుత్ర శకసేనుడను సాతవాహన వంశ

జుడు, ఆభీరుల విజృంభణమును కొంతకాల మరికట్టగలైను. ఈతడు అప్పటి రాజగు చంద్రశ్రీని తరిమివేసి, కృష్ణాగుంటూరు మండలములకూడ నాక్రమించి పాలింపసాగెను. చంద్రశ్రీ మరణానంతరము కొందరు శాతవాహనులు, విదర్భయందు స్వతంత్ర ప్రభుత్వమును నెలకొల్పిరి. శాతవాహనులలో కడపటివాడగు మూడవ పులోమావి శాసనము, బళ్ళారిజిల్లా మ్యాకదోనిలో దొరకినది. ఈతని యధికారము ఆంధ్రదేశములోను, కొంతవరకు విదర్భలోను, చెల్లినట్లు కాన్పించును. ఇంతటినుండి శాతవాహనులు కాలప్రవాహమున నదృశ్యులైరి. మహోజ్జ్వల వైభవమున కాకరమై నాలుగున్నర శతాబ్దుల దీర్ఘకాలము దక్షిణాపథమునకు శాంతిసౌఖ్యములు ప్రసాదించిన, ఈ యద్భుత సామ్రాజ్యము క్రీ. శ. 225 నాటికి అస్తమించెను. సాతవాహనుల తిరోధానము క్రీ. శ. 218 ప్రాంతమనికొందరు చారిత్రకులు గణించుచున్నారు. సామ్రాజ్యభాగములు, వివిధశక్తుల హస్తగతమయ్యెను. నాసిక ప్రాంతము తిరిగి యాభీరుల వశమాయెను. గుజరాతు కథియవారు ప్రాంతములను, శకరాజులాక్రమించిరి. అపరాంతమున మహారథులు స్వతంత్రులైరి. కుంతలము (కన్నడప్రాంతము) న చుటువంశీయులు, శాతకర్ణి బిరుదాంచితులై, పరిపాలింప సాగిరి. వారికి ప్రాగ్దక్షిణమున ద్రవిడదేశము వరకుగల భాగమున నాగులు బలవంతులుగా నుండిరి. ప్రాగాంధ్రమున విజయపురి రాజధానిగా చేసికొని ఇక్ష్వాకులు ప్రభుత్వము నెరపిరి.

సాతవాహనయుగ సంస్కృతి విశేషములు:—సాతవాహన సామ్రాజ్యము అత్యున్నతదశలో నున్నప్పుడిది బ్రహ్మాండమైన విస్తృతి గలిగియుండెనని చెప్పనొప్పును. ఈశాన్యమున పాటలీపుత్రమునుండి, నైఋతిమూలను కుంతలదేశమువరకును, వాయవ్యమున సౌరాష్ట్రమునుండి ఆగ్నేయమూలను తూర్పుతీరముననున్న కడలూరు వరకైనను, ఈ సామ్రాజ్యము వ్యాపించెను. దీనిలో

ఆంధ్రులు, మహారాష్ట్రులు, కన్నడిగులు, ద్రావిడులు, ఘూర్జరులు కాళింగులు, విదేశీయులైన శకయవన పహ్లావాదులు, మొదలగు అసంఖ్యాక జనులు. అన్నదమ్ములవలె కలసిమెలసి, నివసించిరి. ఈ సామ్రాజ్యమునందలి మతములలో హిందూ బౌద్ధ జైన మతములు ప్రధానములు.

ఆంధ్రసామ్రాజ్యమునందు, బౌద్ధమతము సర్వాతిశాయియైన జనాదరమును పొందుచుండెను. బుద్ధభగవానుని కాలమునుండియు, ఆంధ్రదేశము సౌగతమతముపై భక్తితాత్పర్యములు గలిగియుండెను. కాలము గడువగా, బౌద్ధమతమునందెన్నియో భేదము లేర్పడి, అవాంతర శాఖలు బయలువెడలెను. వీరిలో పూర్వాచారపరాయణులశాఖకు థేరవాదమని పేరు. ఆచారములందు సంస్కారము, మార్పు కోరువారిని మహాసాంఘికులని పిల్చుచుండిరి. మహాసాంఘిక సిద్ధాంతములనే అశోకుడు దేశదేశముల ప్రచారము చేయించెను. బౌద్ధమత ప్రచారమునకై అశోకుడు మహాదేవ భిక్షువనువానిని, ఆంధ్రదేశమునకు పంపెను. మరికొంతకాలమునకు బౌద్ధమతమునందు హీనయాన మహాయానములను రెండు ప్రధానవర్గము లేర్పడెను. మహాయానమునే మాధ్యమికవాద మందురు. ఆంధ్రదేశమున వెలసిన బౌద్ధము, మహాయాన పథమునకు చెందినది. ఆంధ్రదేశపు శాసనములలో చైత్యక, రాజగిరి, పూర్వశైలీయ, అపరశైలీయ, శాఖలు పేర్కొనబడినవి. యజ్ఞశ్రీ శాతకర్ణికి సమకాలికుడుగా చెప్పబడిన, ఆచార్య నాగార్జునుడు మాధ్యమికవాదమునకు గొప్ప ప్రవక్తయు, మూలస్తంభముగా నుండెను.

[1] నాగార్జునాచార్యుని ధన్యజీవితమును గురించి సమగ్రముగ చెప్పదలచినచో, నెంతయో చెప్పదగియున్నది. గౌతమబుద్ధుని తరువాత బుద్ధధర్మ నిర్మాతలలో నితడగ్రేసరుడుగ పరిగణింపబడు

1. విశేషములకొరకు చూడుడు(అ) Budhist Remains in Andhra by K. R. Subrahmaniam(ఆ) నాగార్జున చరిత్ర-శ్రీకొండాలిలక్ష్మీనారాయణగారు.



ఆచార్య నాగార్జున

పేజీ 126

చున్నాడు. ఈతనిని మహాముని యనియు, బోధిసత్త్వుడనియు, బౌద్ధులు గౌరవింతురు. ఈయాచార్యుడు మొదట బ్రాహ్మణుడై వేద విద్యలను కడముట్ట నభ్యసించెను. తరువాత నీతడు బౌద్ధ ధర్మము నవలంబించి, శ్రీ పర్వతసంఘారామమును తన నెలవుగా చేసికొనియెను. శ్రీపర్వతమునే ఇప్పుడు నాగార్జునకొండ యనుచు న్నారు. ఇది కృష్ణాతీరమున ధాన్యకటకమునకు నాతిదూరమునం దున్నది. ఇక్కడ శాతవాహనరాజు, ఆచార్య నాగార్జునుని కొరకై గొప్ప వైభవోపేతమైన సంఘారామము నిర్మించియిచ్చెను. చీనా యాత్రికులగు ఫాహియాను, యువానుచాంగు లిద్దరును, శ్రీపర్వత సంఘారామమును అద్భుతావహముగ వర్ణించిరి. ఇక్కడ వందల కొలది బౌద్ధభిక్షువులు సుఖజీవయాత్ర గడుపుచు, తత్త్వవిచేచనము చేయుచు, ముముక్షువులై యుండిరి. ఈ సంఘారామమునందొక బ్రహ్మాండమైన గ్రంథాలయము కూడ నుండెడిది. ఈప్రశాంత సామ్రాజ్యమున కధినేత మహామేధావియు, పరమ కారుణికుడును, అగు నాగార్జునాచార్యుడు.

నాగార్జునుడు సర్వవిద్యలయందును నిష్ణాతుడు. వేదాంతము తర్కము, రసాయన శాస్త్రము, వైద్యవిషశాస్త్రములు, వృక్ష శాస్త్రము, ఇదియది యననేల, ఈమేధా సంపన్నునకు తెలియని విద్యయే లేకుండెననుట అతిశయోక్తి కానేరదు. ఈతడు దయార్ద్ర హృదయుడు. మనుష్యుల మానసిక రోగములను బాపుకొనుటకై, బౌద్ధ ధర్మసూత్రములను, అశోకుడుశిలా స్తంభములపై చెక్కించినట్లే కరుణాళువైన ఆచార్య నాగార్జునుడు, మనుష్యుల దేహరోగముల బాపుకొనుటకవసరమగు వైద్యశాస్త్ర సూత్రములను, స్తంభముల మీద చెక్కించి ప్రకటించెనట. ఈతని యాధ్వర్యమున నాగార్జున కొండ సంఘారామము ఒక గొప్ప పరిశోధనాగారముగ పరిణమించె నని చెప్పుదురు. డిస్టిలేషను (Distillation) కాల్సినేషను (Calcination) మున్నగు రసాయన ప్రక్రియలను, నాగార్జునుడు కనిపెట్టెను. లోహ

విజ్ఞానమునం దీతడు ప్రథమాధికారి. బీదసాదల దారిద్ర్యమును తొలగించునిచ్ఛగలవాడై, క్షుద్రలోహములను సువర్ణముగా మార్చు విద్యను సాధించుటకై, ఈ శాస్త్రజ్ఞ శిఖామణి యెంతయో కృషి చేసెనట. దీనినే పరశువేధవిద్య యందురు.

ఆచార్య నాగార్జునుడు ప్రకృతి శాస్త్రవేత్త యగుటయేకాక ప్రధానముగ వేదాంతజ్ఞుడు. ఈతని సిద్ధాంతమును శూన్యవాదమని చెప్పుదురు. "ప్రపంచము పూర్ణమైన సత్తుగాని, అసత్తుకాని, కాదు. ప్రపంచ అస్తిత్వము కొన్ని నిబంధనలకు లోనైయుండును. ఏపదార్థమునకును స్వతః అస్తిత్వములేదు. అట్లగుటచే ప్రపంచ కారణానుబంధము కలదై, కూపఘటీ యంత్రమువలె తిరుగుచుండును. సృష్టి ప్రళయములును, జననమరణములును సంబంధానుబంధముల భావములు—ఇవియన్నియు యథార్థముగ అయథార్థములు. వీనివలన రాగద్వేషములు పుట్టుచున్నవి. వానియందే అశాంతి దుఃఖబీజములు నిక్షిప్తములైయున్నవి. శూన్యత్వమే నిర్వాణము. అది కారణరహితమైన యస్తిత్వము. దానియందన్ని పరిణామములును సమత్వము నొందుచున్నవి." ఇది నాగార్జున శూన్యవాద సారాంశము. అనంతర కాలమున ఆచార్య శంకరుడు స్థాపించిన మాయావాదమునకు, నాగార్జునుని శూన్యవాదమే ప్రాతిపదిక యయ్యెనని తత్త్వజ్ఞులు తలచుచున్నారు. ఈ బౌద్ధాచార్యుడు శూన్యవాదమునకు మూలకందమైనను, భక్తిమార్గమునకుకూడ నీతడే బౌద్ధులలో ప్రథమోదాహరణమగుట, వింతగా కన్పించును. ఈతని మహాయాన బౌద్ధమతము హిందూ భక్తితత్త్వమునకు దారితీసెను. ఇప్పటినుండియు బౌద్ధులలో విగ్రహారాధనము, బుద్ధప్రతిమలను పూజించుట, సర్వసామాన్యమయ్యెను. ఈపరిణామము గౌతమబుద్ధుని ఉపదేశములకు వ్యతిరేకమైనను, శిల్పకళాదృష్ట్యా మిక్కిలి ప్రయోజనకారియైనది. నాగార్జునాచార్యుడు శాతకర్ణి చక్రవర్తికి వ్రాసిన సుహృల్లేఖ ప్రశంసింపనైనది. ఈమనీషియొక్క రచనలన్నియు, సంస్కృతమున నున్నవి. ప్రజ్ఞాపారమిత శాస్త్రము, మూలమాధ్యమిక శాస్త్రము,

శూన్యసప్తాధి, వివాద సమానశాస్త్రము, ప్రమాణ విహేతన శాస్త్రము మొదలగున వెన్నియో ఉపగ్రంథములు నాగార్జున కృత ములు వినవచ్చుచున్నవి.

నాగార్జున నామధారులు ఇద్దరు తెలియవత్తురు. మొదటి నాగార్జునుడు జగద్విఖ్యాతుడైన మహాయానవాది. మాధ్యమిక వాదమునకు పట్టుకొమ్మ. రెండవ నాగార్జును డీతని తరువాత జీవిం చినవాడు. అతడు వజ్రయాన బౌద్ధమతస్థుడు. తంత్రవిద్యా కుశ లుడు. ద్వితీయ నాగార్జునుడు స్వర్ణవిద్యనభ్యసించినవాడు. ఈతడు ధ్యానకటక దేశమునందు ఆరవ శతాబ్దమున నుండెను.

నాగార్జునాచార్యుని ముఖ్యశిష్యులలో పేర్కొనదగినవాడు ఆర్యదేవుడు. ఈతడు గొప్పవక్త, మహావిద్వాంసుడు. దేశసంచార మును విస్తారముగ చేసెను. తన గ్రంథములలో సాంఖ్య వైశేషిక ముల నీతడు ఖండించెను. చిత్తవిశుద్ధి ప్రకరణమను గ్రంథమందు, బ్రాహ్మణులకు గంగానదిపైగల మూఢభక్తి నీత డపహసించెను. ఈతనికి "అంధక విందసుత్తాంతమును" ప్రవచించుట మిక్కిలి ప్రీతి యని చెప్పబడినది. నాగార్జునకొండ శాసనములలో ఆచార్య నాగార్జునుని మరి కొందరి శిష్యులపేర్లు తెలియవచ్చుచున్నవి. భదంత ఆనందుడు, ధర్మనంది, చంద్రముఖ, నాగ మొదలైనవారు పేర్కొనబడిరి.

శాతవాహనయుగము బౌద్ధమతమునకు శరత్పూర్ణిమానిశి యనుట తెల్లము. కాని వైదికధర్మమీకాలమున వెనుకబడియుండె నని తలపరాదు. వేదప్రోక్తములైన యజ్ఞయాగాది క్రతువులును, వర్ణాశ్రమ ధర్మవిధానమును, ఆదరమును పొందుచునే యుండెను. దేవి నాగనీక భర్తయైన, మొదటి సాతకర్ణి రెండశ్వమేధములను, అగ్న్యాధేయము, అనారంభణీయము, అప్తోర్యామము మొదలగు విశేష క్రతువుల నెన్నియో ఆచరించెను. గౌతమీపుత్ర శాతకర్ణి చాతుర్వర్ణ్య సంకరము నివారించినవాడని ప్రశంసింపబడెను. గృహ పతులుకూడ యజ్ఞము లాచరించుచున్నట్లు యజ్ఞశ్రీ శాతకర్ణి

చినగంజాం శాసన విషయములనుబట్టి ఊహింపవచ్చును. ఈకాలమున విదేశీయులైన శకయవనపహ్లావులు, దేశమునందు స్థిరనివాసము లేర్పరచుకొనిరని, చెప్పియుంటిమి. వీరజాతులైన వీరికి, శాంతిప్రధానమైన బౌద్ధమతమంతగా రుచించలేదు. కావున వీరిలో పలువురు వైదికమతానుయాయులైరి. స్వధర్మ రక్షణార్థమై బ్రాహ్మణులు వీరిని క్షత్రియులుగా పరిగణించి, సంఘమునం దున్నతస్థానమును వీరికి కల్పించిరి. ఇట్లీ శూరశిఖామణులు బ్రాహ్మణుల కండమై, బౌద్ధమును ప్రతిఘటించుటలో, వారికి తోడ్పడిరి. శకపహ్లావరాజులు ఆర్య బ్రాహ్మణులను మంత్రులుగా చేసికొని, పరిపాలన సాగించుచుండిరి. నహపానుని మంత్రి ఆయముడను బ్రాహ్మణుడు. ఈ విదేశీయులనుండి ఆర్య వైదికమతమునకు గొప్ప ప్రాపు లభించెను.

శకులును హిందూరాజన్యులవలె దానధర్మములు చేయ జొచ్చిరి. నహపానుని జామాతయగు ఋషభదత్తుడు (ఉషవదాతుడు) గొప్పవితరణశాలిగా కీర్తిగాంచెను. ఈతని దానశాసనములు నాసికగుహాలలో దొరికినవి. ఈతడు గోవర్ధనములోని పర్వతశిఖరములపై గుహాయును చెరువులును ద్రవ్వించెను. బ్రాహ్మణులకు మూడులక్షల గోవుల దానముచేసెను. యాత్రికుల సౌకర్యమునకై, ఒక నదికి సోపానములు కట్టించెను. దేవాలయములకును, బ్రాహ్మణులకును, గ్రామములను దానముచేసెను. భరుకచ్ఛమునందు చతుర స్రములను విశ్రాంతి ప్రదేశములను నిర్మించెను. బాటసారుల సౌకర్యమునకై రాజమార్గముల కిరుప్రక్కలను, విశ్రాంతి స్థలములను, చలివెంద్రలను, పెట్టించెను. ఋషభదత్తుడు వైదిక మతాభిమానిగా గన్పించినను బౌద్ధభిక్షువులనుకూడ ఆదరించెడివాడు. బౌద్ధసన్న్యాసుల యుపయోగార్థమై, గుహావిహారములను వారికి సమర్పించెను. ఈతడు చేసిన మరియొక వ్యవస్థ ప్రశంసనీయముగా నున్నది. గోవర్ధనమునందలి నేతగాండ్రకూటమువద్ద, ఈతడు రెండువేల కర్షపణములు నిక్షేపముగా నుంచెను. దీనిపైవచ్చు

సంవత్సరపు వడ్డీ నూరుకర్షపణములు. ఈ వృద్ధిధనముతో, తాను నిర్మించిన గుహావిహారములందు నివసించు బౌద్ధభిక్షువులకు, వర్షాకాలమునందు దుప్పటములు కొనియిచ్చుటకై, నేత సంఘము వారితో ఏర్పాటు గావించెను. ఈ యాజ్ఞలు గోవర్ధనమునందలి పౌరసభవారిచే తీర్మానింపబడి, విహారముయొక్క తలుపుమీద లిఖింపబడినవి.

ఋషభదత్తుని దానశాసనములలో గానవచ్చు మత సామరస్యము ఆతని ప్రత్యేకతకాక, శాతవాహనయుగ చరిత్ర సర్వసాధారణ లక్షణముగ, వైదిక బౌద్ధధర్మముల నడుమ తాత్త్విక సంగ్రామము జరుగుచుండినను, ఉభయమతానువర్తుల నడుమను, వాస్తవిక యుద్ధములును, రక్తపాతమును మచ్చునకైనను, లేకుండెనని ఘంటాపథముగ చెప్పవచ్చును. జైనమతముకూడ ఆకాలమున వ్యాప్తిలో నుండెను. కళింగరాజైన ఖారవేలుడు జినమతావలంబకుడు. సాతవాహన చక్రవర్తుల చరిత్రయంతయు, పరమత సహనమునకును, ప్రజాక్షేమ పరాయణతకును, గొప్ప నిదర్శనము. ఒక వంక అశ్వమేధావభృథస్నాన పవిత్రదేహు లయ్యును ఈ రాజచూడామణులు బుద్ధభగవానుని భక్తులను అచంచల దీక్షతో రక్షించి, పోషించుచుండిరి. సాతవాహన రాజ్ఞులును బౌద్ధభిక్షువుల సౌకర్యమునకై, ఎన్నియో దానములు చేయుచుండిరి. ఇందుకు గౌతమి బాలశ్రీ వాసిష్ఠీరాణి మున్నగువారి ధర్మప్రతిష్ఠాపనములు సాక్ష్యము కాగలవు. గౌతమీ పుత్రుడును, పులోమావియు, బౌద్ధసంఘమున కెన్నియో ధర్మకార్యము లాచరించిరి. "యథా రాజా తథా ప్రజా" యన్నసూక్తి మేరకు ఈ యుగమునందలి గృహస్థులు ఏమాత్రపు సిరిసంపత్తులు గలవారైనను, బౌద్ధగురువుల ప్రీతికై గుహలు దొలిపించియు, విహారములు నిర్మించియు, తమ భక్తిని ప్రకటించుకొనుచుండిరి. లక్ష్మీపుత్రులైన వణిజులు ఇట్టి [1] దానములను విరివిగా చేయుచున్నట్లు కాన్పించును. ధర్మకార్య

1. చూడు (అ) హాడారి పుత్రశకసేనుని. కాలపు కన్హేరి శాసనము, (ఆ) యజ్ఞశ్రీ శాతకర్ణినాటి కన్హేరి శాసనము.

ములు చేయునప్పుడు వీరు భార్యాపుత్ర సమేతముగ చేయుచుండిరి. కార్మికులుకూడ యథాశక్తిగ దానధర్మము లాచరించుచుండిరను టకు, రెండవ సాతకర్ణి సాంచీశాసనమునందలి వాసిష్ఠీపుత్ర ఆనం దుని ధర్మము నిదర్శన మీయగలదు.

సాంఘికజీవితము :—ఈకాలపు జనుల జీవితము భక్తిధర్మ భరితమైనట్లే, సుఖభోగ విలసితముగాగూడ నుండెననుటకు, పెక్కు సాధనములుకలవు. ఇప్పటి శాసనములు ప్రజల ధార్మిక జీవనమును ఉద్ఘోషించినట్లే, ఈయుగవాఙ్మయము వారి గృహజీవితమును, సుఖ సంతోషములను, కష్టనిష్ఠురములను ప్రతిబింబించుచున్నది. ముఖ్య ముగ [1]గాథాసప్తశతి కావ్యము గ్రామప్రజల కుటుంబ రహస్య ములను పుక్కిట బట్టినది. సమష్టి కుటుంబపద్ధతి ఆనాడు అమలులో నుండెను. స్త్రీపురుషులు పొలములలో స్వేచ్ఛగా పనులు చేసికొను చుండిరి. వారు నర్మహాస్యము లాలికించుచు, కాయక్లేశముయొక్క శ్రమను బాపుకొనుచుండిరి. ప్రజలు సర్వసాధారణముగా పూరి యిండ్లలో నివసించుచుండిరి. అగ్నిప్రమాదములు ఎక్కువగా జరుగు చుండెడివి. అగ్నిభయము కలిగినప్పుడు నగారాలు మ్రోయించు చుండిరి. పురుషులు పెద్ద పెద్ద తలపాగలను ధరించుచుండిరి. స్త్రీలు ఎఱ్ఱకోకలను మక్కువతో చూచుచుండిరి. వారు స్నానమాడు నప్పుడు శరీరమంతయు పసుపుపూసికొనెడివారు. కబరీభరమునందు దాసానిపూవులు తురుముకొనుట వారికి ప్రీతి. ఆనాడు పెండ్లిండ్లు ఐదుదినములు వేడుకగా జరిగెడివి. సుముహూర్తమైన తరువాత వరుడు అత్తవారింట నాలుగురోజులుండి, శేషహోమము పూర్తి చేసికొని, స్వగృహమునకుపోవును. వివాహమునకు ముందు వధు వును పెండ్లికుమార్తెనుచేసి, పెద్ద ముత్తయిదువలు మంగళాచార గీతములు పాడుచుండిరి. పల్లెటూరి పడుచువాండ్రు, ఖలశాలులై, కపటము లేనివారై, ప్రియానురాగము కలిగియుండిరి. వ్యవసాయము

1. చూడు వ్యాసము 'హాలుడు - గాథాసప్తశతి' శ్రీగట్టినరసింహశాస్త్రి, శాతవాహన సంచిక.

ఆనాడుకూడ ముఖ్యవృత్తి. పచ్చగా పెరుగుచు, వెన్నువేసి పాలు పోసికొనుచున్న పైరుపొలమునుచూచి, హాలికుడు, కడుపునిండ పాలుత్రావి మట్టిలో పొరలి యాడుకొనుచున్న కుమారునిచూచి, యానందించినట్లు సంబరపడెడివాడని చెప్పబడినది. వరి, శనగ, జనుము, చెరకుమొదలైనవి అప్పటిపంటలు. చెరకుగానుగలు, తైల యంత్రములు ఏతాములు—వీనివద్ద స్త్రీలుగూడ పనిచేయుట అల వాటు. గ్రామాధికారికి పలుకుబడియు, చెల్లుబడియు చాల ఉండెను. దొంగతనముచేసినవారికి ప్రాణదండన విధించుటయు కలదు.

ఈ యుగపు నాగరక జీవితమును తెలిసికొనుటకు, వాత్స్యా యన కామసూత్రములు మిక్కిలి తోడ్పడుచున్నవి. మంచిసేటి సదుపాయముగలిగి, చక్కని ఉద్యానము వేసికొనుటకు వీలగుచోట వారు ఇండ్లు కట్టుకొనుచుండిరి. ఇంట అనువగు కుర్చీలు, బల్లలు, సుగంధద్రవ్యములు, తాంబూల ద్రవ్యములు, పుస్తకములు, ద్యూతఫలకములు, పక్షులుగల పంజరములు, అద్దములు కలిగి యుండిరి. నాగరికుడు నిత్యకృత్యములను దీర్చికొనినపిదప, కోడి పందెములు, పొట్టేళ్ళ పోరాటములు, తిలకించుచు దినముపుచ్చును. వీరనేక వినోదములతో కాలము గడుపుచుండిరి. విద్యాగోష్ఠులు, వేశ్యాభవన సమావేశములు, మధుపానము, వనవిహారములు, వెన్నెల జాగరములు, మొదలగునవి వారి వినోదములు. స్త్రీలు చతుష్షష్టి కలాపారీణులై యుండిరట. నృత్య సంగీతములు వారి ప్రత్యేక వినోదములు. ఇట్లు నాగరక జీవితము సమస్త సౌకర్య ములుకలిగి, సుఖస్వప్నముగా నుండెను.

వాఙ్మయము:—ఈ కాలపు వాఙ్మయమునుగూర్చి ఆయా సందర్భములలో కొంత తెల్పితిమి. బృహత్కథ ప్రాచీన కథా కావ్యము. ఇది పైశాచీభాషలో వ్రాయబడెనని చెప్పుచున్నారు. ఈ గ్రంథమిప్పుడు ప్రచారములోలేదు. పైశాచియనగా శౌరసేని మహారాష్ట్రీ ప్రాకృతముల అపభ్రంశము అనగా వ్యవహారరూపము అని పండితులు తలచుచున్నారు. బృహత్కథను మూలముగా చేసి

కొని సంస్కృతములో పెక్కు గ్రంథములు వెలువడినవి. వానిలో సోమదేవసూరి కథాసరిత్సాగరము ప్రధానమైనది. ఈ కవి క్రీ॥ శ॥ 1063-1081 నడుమ కాశ్మీరదేశము నేలిన అనంతరాజు కాలములో నుండెను. ఇదే శతాబ్దమున (1020-1080 నడుమ) క్షేమేంద్రు డను కవి, బృహత్కథను మిక్కిలి సంక్షిప్తపరచి, బృహత్కథా మంజరిని రచించెను. రామాయణ మహాభారతములకు సంస్కృత ములో నెట్టి ఆదర ప్రపత్తులుగలవో, ప్రాకృత భాషయందు బృహ త్కథకంత గౌరవము కలదు. భాసుడను ప్రాచీన సంస్కృత నాటక కారుడు బృహత్కథలోని వృత్తాంతములనుబట్టియే, 'ప్రతిజ్ఞా యౌగంధరాయణము' 'స్వప్నవాసవదత్త' నాటకములను వ్రాసెను. గాథాసప్తశతికికూడ ప్రాకృత వాఙ్మయమున మహోన్నత స్థానము కలదు. ఇంతేకాదు. సంస్కృతభాషలోని 'ఆర్యాసప్తశతి' 'అమరు కము' వంటి లలితశృంగార రచనలకు, గాథాసప్తశతియే శ్రీకారము చుట్టినది. ఆంధ్ర చక్రవర్తుల యాస్థానమున వెలసినదగుటచే, దీనిలో ఆంధ్ర జీవితము ఆచారములు చక్కగా ప్రతిఫలించినవి.[1] అచ్చపు తెనుగుపదములని చెప్పదగినవి కొన్ని సప్తశతిలో కాన్పించు చున్నవి. అత్త, అమ్మ, అందము, పొట్ట, పాడివంటివి. ఆంధ్రనది యైన గోదావరి దీనిలో పలుమారు ప్రశంసింపబడినది.

శిల్పము:—[2] సాతవాహనయుగము కళారంగమున నెంతో ఘనతను సాధించినది. అందు శిల్పము, చిత్రలేఖనము అగ్రేసరము లైనవి. ఈకాలపు కళాకావ్యములకు ఆత్మయైనది బౌద్ధధర్మము. బౌద్ధమత ప్రశస్తికొరకును, తద్భక్తుల యైహికజీవనము సౌఖ్య వంతము చేయుటకును, పెక్కు నిర్మాణములు కావింపబడినవి. వీనిలో స్తూపములు, చైత్యములు, విహారములు, గుహలు మున్నగు

1. విశేషములకొరకు చూడు వ్యాసము 'గాథాసప్తశతి' లోని తెనుగుపదాలు శ్రీ. టి. రామచంద్రగారు. భారతి సంపు. 25, సంచిక 5.

2. సమగ్రాంశములకొరకు చూడు వ్యాసము "సాతవాహనయుగము-కళా వైభవము" డా. మారేమండ రామరావుగారు సాతవాహన సంచిక.



అమరావతి స్థూపము

పేజీ 185

పలురకముల కట్టడములు కలవు. స్తూపములును చైత్యములును ఆరాధన మందిరములని చెప్పవచ్చును. ఇవి బుద్ధభగవానుని శరీరావశేషములపై గాని, పవిత్ర భస్మముపైగాని, కట్టబడుచుండినవి. కొన్ని స్తూపములు శిలానిర్మితములు. కొన్ని ఇటుక కట్టడములు. ఆంధ్రదేశమున సంఘారామమువద్దను, బొజ్జన్న కొండమీదను, శిలాస్తూపములు కలవు. ఇటుకతో కట్టబడిన మహాచైత్యములలో, అమరావతిస్తూపము, భట్టిప్రోలు స్తూపము, గొప్ప నిర్మాణములు. ఇట్టి స్తూపము లాంధ్రదేశమునందు కుప్పలు తిప్పలుగా నున్నవి. శాలిహుండము, రామతీర్థము. సంఘారామము, ఆదుర్రు, పిఠాపురము, గుంటుపల్లి, జగ్గయ్యపేట, నందిగామ, గుడివాడ, ఘంటసాల, అమరావతి, భట్టిప్రోలు, నాగార్జున కొండ – గోలి, చినగంజాము, మొదలగు పలుస్థలములలోను, తెలంగాణమున గుమ్మడిదుర్రు, అల్లూరు, కొండాపురము, ఫణిగిరి, గాజులబండలలోను గలవు. బౌద్ధభిక్షువుల నివాసములకును, సభా సమావేశములకును, కొండలు దొల్చి గుహాలు, గుహావిహారములు కల్పించుచుండిరి. ఇట్టి గుహాలు ప్రధానముగ మహారాష్ట్రదేశమునందు కన్పించుచున్నవి. కన్హేరీ, నాసిక, కార్లా మున్నగుచోట్ల నిష్ఠురపర్వతముల దొలచి, దేవేంద్ర సభవంటి సభాభవనములుగా తయారుచేయుట, శాతవాహనాంధ్ర శిల్పులకే చెల్లెను. వారి భక్తి భావమునకును, కళానైపుణ్యమునకును, కొండలుకూడ మైనమువలె మెత్తబడెనా యనిపించును. ఆంధ్రదేశమున శంఖరం (బొజ్జన్న కొండ) కోరుకొండ, ఎఱ్ఱంపాలెము, గుంటుపల్లి మున్నగుచోట్ల గుహాలుకలవు.

పైని వర్ణింపబడిన వాస్తువులలో, కొన్ని స్థలములందు లోకోత్తర శిల్ప చాతుర్యము ప్రదర్శింపబడినది. మహాయాన బౌద్ధము వికసించిన కాలదిని, బౌద్ధశిల్పము చిత్తజల్లుగ కురిసినది. సాంచీ స్తూపద్వారములును, అమరావతీ స్తూప శిల్పమును, శాతవాహన శిల్పముయొక్క మహోన్నత శిఖరములు. అమరావతీ స్తూపము చుట్టును పాలరాతితో నిర్మింపబడిన ప్రాకార ముండెడిది. ఈ యవ

కాశమును గైకొని, ఆంధ్రశిల్పుల బౌద్ధజాతక కథలను బుద్ధభగ వానుని జీవిత సన్నివేశములను లోకమోహనముగ శిల్పించి, అజ రామర కీర్తినొందిరి. చిత్రలేఖనముకూడ ఈ కాలమున వర్ధిల్లినది. బేడ్సా, పితల్‌ఖోరా, జునారులలో కొన్ని గుహలయందును, అజంతా లోని మూడు ప్రాచీనగుహలయందును, ఆంధ్ర చిత్రకారుల అమర హస్తము వర్ణచిత్రములతో విహరించినది.

పౌరసభలు – పారిశ్రామిక సంఘములు:—సాతవాహన యుగపు ప్రజలు తమ యోగక్షేమములకై ఎల్లప్పుడును రాజుల మీద ఆధారపడెడివారు కారు. వారికి పౌరజీవితవిధానము సుపరి చితమైయుండెను. మతసంస్థల నిర్వాహణమునకును, పారిశ్రామిక వ్యవస్థకును, వారు నిగమములు, సభలు, అనబడు సంఘములు కలిగి యుండిరి. భట్టిప్రోలు శాసనములో, మతసంబంధమైన నిగమములు పేర్కొనబడినవి. పౌరసభాసభ్యుల నామములుకూడ వీనిలో నుదహ రింపబడినవి. వాణిజ్యమును పరిశ్రమలను నడుపుటకై వర్తక సంఘ ములు, శ్రేణులు ఉండెడివి. నేతగాండ్రకు, గాంధికులకు, ధాన్యక శ్రేణులకు, నూనె మొదలగునవి అమ్మువారికి ప్రత్యే[illegible] సంఘము లేర్పడుచుండినవి. కమ్మరులు, సువర్ణకారు[illegible]కులు, [illegible]యి మెఱుగు పెట్టువారు) వడ్రంగులు, శిల్పులు[illegible] [illegible]పనుల వారుకూడ సమిష్టి వ్యవహారములకై, నికా[illegible] చే[illegible]డుచుండిరి. ఒక్కొక్క సంఘమునకు శ్రేష్ఠియను నాయ[illegible]ను. ఈసంఘము లన్నియు క్రమనిబంధనలు, నిర్వాహణము, కలవై యుండినవని తెలియుచున్నది. కావుననే ప్రజలు వీరిని నమ్మి, వీరివద్ద ధనమును ఇప్పటి బ్యాంకులలోవలె దాచుకొనుచుండిరి. నిక్షేపధనముపై జను లకు వడ్డీ లభించుచుండెను. నహపణుని యల్లుడు ఋషభదత్తుడు గోవర్ధనపు నేతగాండ్రతో చేసిన వ్యవస్థ ఇదివరలో చెప్పనైనది. ఈ కాలపుప్రజలకు తమరాజుల నెన్నుకొను అధికారముకూడ కొన్ని ప్రాంతములలో నుండినట్లు తోచుచున్నది. జునగడ శాసనమువలన ఈయంశము ఊహింపనగుచున్నది. సర్వవర్ణములవారును, తన్ను

చేరి, రక్షణార్థమై ప్రభువుగా వరించిరని రుద్రదాముడను క్షాత్రప రాజు ఈ శాసనములో ప్రకటించుకొనెను.

సముద్రయానము - విదేశసంబంధములు:— శాతవాహన యుగము, ఆంధ్రుల సముద్ర గమనాభిరతికి పెక్కు నిదర్శనము లిచ్చుచున్నది. సామ్రాజ్యము శాంతిసౌఖ్యములలో నోలలాడుచు, పరిశ్రమలను, కళలను, అపారముగ పెంపొందించుకొనెను. అట్లగుటచే భారత దేశము తీరము వెంటగల ప్రాంతములతోను, పశ్చిమమున గ్రీసు, రోమువంటి దూర దేశములతోను, తూర్పున బర్మా, సయాం, చీనా, తూర్పుసముద్ర దీవులతోను ఆంధ్రులు గొప్ప నౌకా వ్యాపారము సాగించుచుండిరి. పెరిప్లసు, టాలెమీ భూగోళము మున్నగు గ్రంథముల సాక్ష్యమునుబట్టి, కృష్ణానదీ ముఖ ద్వారము ఖండాంతర వాణిజ్యమునకు కేంద్రముగా నుండెను. ఈ ప్రాంతమును వారు మసేలియా యని పిలుచుచుండిరి. కృష్ణానదిని టాలెమీ తన గ్రంథమున మైసోలస్ అని వ్యవహరించెను. ఇచ్చటినుండి అత్యంత సున్నితమైన రవసెల్లాలును, విలువగల వజ్రములును, పాశ్చాత్యసీమల కెగుమతి యగుచుండెను. నెల్లూరు సమీపమున క్రీ. శ. రెండవ శతాబ్దమునాటి రోమక నాణెములు భూమిలోనుండి త్రవ్వితీయబడినవి. ఆంధ్ర దేశమునకు ఖండాంతర దేశములతో నడచిన వర్తకమున కివి నికరమైన నిదర్శనములు. టాలెమీ కథనమునుబట్టి ఆంధ్ర దేశపు తీరమున కొంటకొస్సిల (ఘంటసాల) అల్లొసైని (కోరంగి) కొడ్డూర (గూడూరు) రేవులు ముఖ్య నౌకాస్థానములుగాను, వ్యాపార కేంద్రములుగాను, ఉండెను. సముద్రవ్యాపారముతోపాటు నాటువర్తకముగూడ ఉచ్చస్థితిలో నుండెను. ఆకాలపు నాటు రహదారులలో ముఖ్యమైనది తూర్పున ధాన్యకటక సమీపమున బయలుదేరి, దేశమధ్యము నుండిపోయి, గోదావరిమీది ప్రతిష్ఠానముగుండ పశ్చిమ సముద్ర తీరమున నుండిన భరుకచ్ఛము (బ్రోచ్) సొపారా (సూరతు) రేవులకు సరుకులను, సార్థవాహులను గొనిపోవుచుండెను. మరియొక

రాజమార్గము పశ్చిమతీరపు రేవులనుండి బయలుదేరి, తూర్పు మాళ వమునందలి విదిశానగరముగుండ, ఉత్తరాభిముఖమై చని పాటలీ పుత్రముతో కలియుచుండెను. ఇట్లు అంతర్దేశవర్తకము ఖండాంతర వాణిజ్యము అభివృద్ధి దశలోనుండి శాతవాహనాంధ్రుల సిరి సంపద లకు కానుక పెట్టుచుండెను.

వర్తకముతోపాటు బౌద్ధధర్మముకూడ నిర్బంధము లేకయే వివిధ దేశములకు ప్రాకి ఆంధ్రుల శాంతి సందేశమును దూరదేశస్థు లకు విన్పించుచుండెను. ఆంధ్రనాగరకతయు, ఆంధ్రబౌద్ధమును ప్రాచ్యదేశములకు ప్రాకెను. టాలెమీ గ్రంథము దీనిని స్ఫురింప చేయుచున్నది. ఆరకాను దేశపు ముఖ్యపట్టణము పేరు 'త్రిలింగ' అనియు, సయాము జలసంధిమీద 'కాకులము' అను నగరముండె ననియు, టాలెమీ యుదహరించుట గమనింపదగినది. ఈ రెండు పేర్లను నిర్వివాదముగ ఆంధ్రదేశసంబంధమును సూచించును. మాతృదేశమునుండి తరలిన ప్రజలు తమ జన్మస్థానముపైగల భక్తి చేత, ఈ క్రొత్తప్రదేశములకు తమకు పరిచితమైన పేర్లు పెట్టుకొని యుందురు. ఇవిగాక ప్రాచ్యదేశములందలి మరికొన్ని స్థల నామ ములు—పాండురంగ, అమరావతి, విజయ, కౌథూర (కొత్తూర) కళింగ—మొదలగునవి ఈ దేశమునందలి నాగరకతకు, ఆంధ్ర కళింగములతోగల సన్నిహిత బాంధవ్యమును సూచించును.



# ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి



## 13-వ ప్రకరణము

## క్రీ. శ. 225-625 నడుమ ఆంధ్రదేశము

సాతవాహనాంధ్ర సామ్రాజ్యమునుండి ఆంధ్రదేశమున తూర్పుచాళుక్యుల రాజ్యము నెలకొల్పబడువరకు, రమారమి నాలుగు శతాబ్దములు గడచినవి. ఈమధ్యకాలపు చరిత్ర వివరింపబడు చున్నది. సాతవాహనులతోపాటు ఉత్తరదేశమున కుషానుల పరి పాలనకూడ అంతమొందెను. సాతవాహనాధికారము పడిపోవుటకు గల ప్రత్యక్షకారణములు, స్ఫుటముగా తెలియరాలేదు. విదేశీయు లైన, శకరాజుల విజృంభణముచే నిది జరిగెనని చెప్పవీలుపడదు. ఏలయన రుద్రదాముని తరువాత వానియంత పరాక్రమశాలురగు శకనృపతు లుండినట్లు గాన్పించదు. సాతవాహన సామ్రాజ్యపు భాగములు, సామంత ప్రభుకుటుంబముల హస్తగతము లయ్యెను. వారిలో ఇక్ష్వాకులనువారు తీరదేశములో కొంతభాగము నాక్ర మించుకొని, అర్ధ శతాబ్దమువరకు ప్రకాశమానముగ పరిపాలించిరి. నాగార్జున కొండలోయలోని శాసనములు బయటపడువరకు, ఈ వంశస్థులొకరుండినట్లు లోకమునకు తెలియకుండెను. ఇవి కనుగొన బడిన తరువాత ఒకానొక ప్రతిభావంతమైన రాజకుటుంబము తెలుగుదేశము నేలినట్లు ఋజువైనది. ఇక్ష్వాకులు మిక్కిలి ప్రాచీన రాజవంశీయులు. శ్రీరామచంద్రుని జన్మచే, లోకాతీతమైన కీర్తి గాంచిన గొప్ప వంశమిది. తరువాత గౌతమబుద్ధుడు, వర్ధమాన మహావీరుడుకూడ ఇక్ష్వాకు వంశీయులే యని కొందరు చెప్పు చున్నారు. క్రీ. పూ. శతాబ్దులలోనే ఇక్ష్వాకు కుటుంబమువారు కొందరు, దక్షిణ కోసలముమీదుగా ఆంధ్రదేశమును చేరినట్లు

"ధర్మామృతము" [1] అను కన్నడ కావ్యమునుబట్టి యూహింప వీలగుచున్నది. ఒక యంశము మిక్కిలి పురాతనమైనది యనిచెప్ప దలచినప్పుడు తెలుగువారు "అది ఇక్ష్వాకులనాటి కథ" అనుచుందురు. దీనినిబట్టియే ఇక్ష్వాకుల ప్రాచీనత సూచితమగుచున్నది. వీరి నాయకులు మొదట సాతవాహన చక్రవర్తులకు సామంతులుగను, దండనాయకులుగను, ఉండి కేంద్రప్రభుత్వము దుర్బలమగుట కని పెట్టి విజృంభించి యుందురు. ఇక్ష్వాకుల చరిత్రను నిర్మించుటకు సాధనభూతములైనవి నాగార్జునకొండ, జగ్గయ్యపేట, రామిరెడ్డిపల్లి శాసనములు. ఇవి ప్రాకృతములో వ్రాయబడినవి.

కడపటి, శాతవాహనరాజైన మూడవ (నాల్గవ?) పులోమావి తరువాత తీరాంధ్ర దేశమున కొంతభాగము నాక్రమించినవాడు ఇక్ష్వాకు మహారాజు [2]వాసిష్ఠీపుత్ర శాంతమూలుడు. ప్రాకృత భాషాశాసనములలో, ఇతనిని చాంతిమూలుడని వ్యవహరించిరి. తన విజయసూచకముగ శాంతమూలుడు అశ్వమేధ మొనర్చెను. దిగ్విజయముచేసి పరమండలముల నాక్రమించినరాజన్యులు అధికారప్రదర్శనము కొరకు పూర్వకాలమునందు రాజసూయము, అశ్వమేధము మొదలగు మహాక్రతువులు చేయుచుండిరి. ఇక్ష్వాకుల రాజధాని విజయపురి అనబడు ప్రాచీన మహానగరము. ఇట్టి పట్టణ ముండినట్లు నాగార్జునకొండ శాసనములవలన తెలియవచ్చుచున్నది. ధాన్యకటకనగర సమీపమున సుప్రసిద్ధమైన అమరావతీ స్తూపము వలెనే విజయపురి సమీపమున గొప్పబౌద్ధ చైత్యముండెడిది. ఆచార్య నాగార్జునుడో లేక అతనికొరకు శాతవాహన చక్రవర్తులో దీనిని నిర్మించిరి. ఏ పర్వతరాజముపై నీ చైత్యము విలసిల్లెనో దానిని గౌరవ సూచకముగ శ్రీపర్వతము అనిరి. శ్రీపర్వతముమీద

---

1. చూడు **Early 'Dynasties of Andhra'** పుట. 122. శ్రీ భావరాజు వెంకటకృష్ణారావు పంతులుగారు. తెలుగులో దీనిని "ప్రాచీనాంధ్ర రాజవంశ చరిత్ర" అని వ్యవహరించినాము.

2. చూడు పై గ్రంథము ఇది క్రీ. శ. 210 ప్రాంతమున జరిగెనని ఈ గ్రంథము చదువుచున్నది.

విజయపురి ముఖ్యపట్టణముగా గలవారు కావున, ఇక్ష్వాకు వంశీయులను పురాణములు 'శ్రీపర్వతీయులు, శ్రీపర్వతీయాంధ్రులు' అని పేర్కొనినవి. నాగార్జునకొండ కృష్ణానదికి దక్షిణతీరమున నున్నది. ఇదియొక అపూర్వబౌద్ధక్షేత్రము. ఇంత విస్తీర్ణమైన బౌద్ధశిల్పావశేషములు ఆసియాఖండమునం దెచ్చటను లేవని చారిత్రకులు ప్రశంసింతురు. శ్రీపర్వతమునే శ్రీశైలమని కొంతకాలము లోకము తలంచెను. ఈ రెండును నల్లమల కొండలలోని పుణ్యస్థానములగుట నిజమే కాని అందొకటి—శ్రీపర్వతము బౌద్ధ పవిత్రక్షేత్రము, రెండవదియగు శ్రీశైలము శైవులకు దివ్య ప్రదేశము. ఇది కర్నూలు జిల్లాలో నున్నది.

వాసిష్ఠీపుత్ర శాంతిమూలుడు పరమ ధార్మికుడు, ప్రజాహిత తత్పరుడుగా కాన్పించును. ఈతని కుమారుడైన శ్రీవీరపురుషదత్తుని శాసనములలో శాంతమూలుడు "అగ్నిష్టోమ, వాజపేయ అశ్వమేధాది యాగములు చేసినవాడనియు, హిరణ్యకోటులను గోశతసహస్రములను, హలశతసహస్రములను దానముచేసినవాడనియు" వర్ణింపబడినది. హలము అనగా నాగలి. శాంతమూలుడు నాగళ్ళను దానముచేసెననగా, వ్యవసాయమునకు గొప్పసావకాశములను కల్పించెనని చెప్ప వీలగుచున్నది. సాతవాహనాధికారము తుదముట్టిన కాలమున, దేశమునం దరాజక పరిస్థితు లేర్పడి, కృషివాణిజ్యాది శాంతవృత్తులు క్షీణించి యుండును. అట్టియెడ ప్రజాహిత చింతకుడైన శాంతమూల మహారాజు, రైతులను ప్రోత్సహించుటకై, నాగళ్లు మొదలగు వ్యవసాయ పరికరములను దానము చేసి యుండును. హలమనగా ఒకనాగలి దున్నదగినంత భూమి. అట్టిక్షేత్రముల నెన్నిటినో బ్రాహ్మణులకు శాంతమూలుడు దానము చేసెననియైన చెప్పవచ్చును. శాంతమూలుడు 'విరూపాక్షపతి మహాసేన పరిగృహీతుడు' అని వర్ణింపబడినాడు. కావున ఈతడు మహాసేన (కార్తికేయుడు) భక్తుడును, మహేశ్వరుడును అని చెప్పవచ్చును. ఎట్లైనను ఈ మహారాజు శాంతి ప్రియుడు. వైదిక

మతాభినివేశము కలవాడు అని చెప్పనగును. ఈతని కుమారుడు మాఠరీపుత్ర శ్రీ వీరపురుషదత్తుడు. శాంతిమూలుని కుమార్తె అడవి శాంతిసిరి. ఈమె ధనిక కుటుంబమునకు చెందిన మహాతలవర, మహాదండనాయక, మహాసేనాపతి స్కందవిశాఖ నాగుని పెండ్లి యాడెను. శాంతిమూలునకు ఇద్దరు ఆడుతోబుట్టువులుండిరి. వారిలో మహాసేనాపతిని, శాంతిశ్రీయను నామె, పూగీయ వంశమువారి యింటికోడలు. ఈమె కుమార్తె తన మేనమామ కుమారుడు వీర పురుషదత్తుని ఉద్వాహమయ్యెను. శాంతమూలుని మరియొక సోదరి 'హమ్మసిరి'. ఈమె కూతుండ్రుకూడ వీరపురుషదత్తుని రాణులైరి. ఈ పద్ధతిని ఎదురు [1] మేనరికమందురు.

శాంతమూలుని యనంతరము, వీరపురుషదత్తుడు విజయపురీ సింహాసన మధిష్ఠించి 21 ఏడులు పాలించెను. ఈతని రాజ్యకాలము ఇక్ష్వాకువంశమువారి యత్యున్నతదశను తిలకించెను. రాజకీయ ముగ చూచినచో, శాంతిమూలుడు తన కుమారునకు రాజ్యమును నిష్కంటకముచేసి, అప్పగించెను. ఇరుగుపొరుగు రాజవంశములతో వివాహ సంబంధములు కలుపుకొని, వీరపురుషదత్తుడు వారిని తనకు మిత్రులుగా చేసికొనెను. ఉజ్జయినీ క్షాత్రపుల బాలికయైన రుద్ర ధారా భట్టారిక నీతడు పాణిగ్రహణము చేసెను. తన కుమార్తె యగు కోడబలిశ్రీని, వనవాసమహారాజునకిచ్చి, పరిణయమును చేసెను. ఆంధ్ర భృత్యులనబడు చూటుకుల సాతకర్ణులు వైజయంతీ పురము (వనవాసి) రాజధానిగా (కర్ణాట) దేశమును పాలించు చుండిరి. వీరిని నాగరాజులనికూడ చెప్పుదురు. ఇట్లే తన రాజ్య మందలి బలవంతులైన, సామంతప్రభు కుటుంబములతోకూడ సం బంధ బాంధవ్యములుచేసి, ఈరాజు తన స్థానమును బలపరచు కొనెను.

---

1. మేనరికము అనగా మేనత్తకుమారుని పెండ్లియాడుట, ఆంధ్రులలో చిర కాలమునుండియు అభిప్రేతమైన వివాహాచారము.

వీరపురుషుని కాలమున, ఆంధ్రదేశమునందు బౌద్ధమతము మున్నెన్నడు ఎరుగనంతిగా వ్యాప్తినందెను. దీనికి నాగార్జునకొండ చైత్యముప్రత్యక్ష చిహ్నముగా నుండెను. వీరపురుషదత్తుడు స్వాయముగ బౌద్ధమునందు గొప్ప పరాకాష్ఠగలవాడు. తండ్రివలెనే ఈతడును ప్రథమమున వైదికమతానువర్తకుడైయుండి, తరువాత బౌద్ధదీక్షను గొనియుండును. ఈతని మేనత్తలును, రాణులును, ఇతర రాజకాంత లందరును బుద్ధధర్మమునం దభిమానముగలవారై, నాగార్జునకొండపై ఎన్నియో దానములు చేసిరి. ఇచ్చటి మహాచైత్య నిర్మాణమునకు కారకురాలు శాంతమూలుని సోదరి శాంతసిరి. అంతఃపురస్త్రీలు విహారములను, మండపములనునిర్మించి, అయస్తంభముల నెత్తించిరి. [1]బోధిసిరియను సంపన్నురాలైన ఉపాసిక, బౌద్ధసంఘమునకు చేసిన దానములనుగూర్చి ఇదివరలో ప్రశంసింపనైనది. విజయపురియందలి బౌద్ధసంఘారామములు, గాంధారము సింహళము, మలయా ద్వీపకల్పము, చీనా, ప్రాగ్ద్వీపులు మొదలగు దూరదేశములనుండి వచ్చిన భిక్షు భిక్షుకీ గణములతో కిటకిటలాడుచుండెనట. నాగార్జునకొండ, బౌద్ధులు సందర్శింపవలసిన పవిత్రక్షేత్రమయ్యెను. వీరపురుషదత్తుడు బౌద్ధమతము నభిమానించుటతో తృప్తిపడలేదు. మతాభినివేశము గలవాడై, ఈతడు వైదికమతమును శైవధర్మమును, నిరాదరణ చేసినట్లుతోచును. నాగార్జునకొండలో దొరకిన ఒక శిలాఫలకముపై ఒకరాజు శివలింగమును, తనపాదముల క్రింద త్రొక్కుచున్నట్లు, శిల్పింపబడినది. ఈసన్నివేశము వీరపురుషదత్తునికి సంబంధించినదిగా శిల్ప శాస్త్రజ్ఞు లెన్నుచున్నారు. పూర్వపు మహారాజు లందరును వైదిక బౌద్ధమతములను, సమానాదరముతో చూచుచుండిరి. వీరపుషదత్తుడు ఈ సదాచారమునకు భిన్నముగ ప్రవర్తించుటచే, అచిరకాలములోనే ఇక్ష్వాకురాజ్యము ప్రజాగ్రహమునకు గురియై నశించెను. నాగార్జునకొండ చైత్యము

1. చూడు. ప్రకరణము 'ఆంధ్రస్త్రీలు'

నందలి బౌద్ధాచార్యులకు, అపరమహావన శైలీయులని పేరు. మహా సాంఘికులలో వీరొక శాఖవారు.

వీరపురుషదత్తుని తరువాత రాజ్యమేలిన వాడాతని కుమారుడు వాసిష్ఠీపుత్ర బహుబల శాంతమూలుడు. ఈతని తల్లి మహాదేవి వాసిష్ఠీ భట్టిదేవి. ఇక్ష్వాకు మహారాజులుకూడ శాతకర్ణులవలెనే తమ తల్లుల పేర్లతో కలిపి, తమ నామధేయములను చెప్పుకొనుట గమనింపదగినది. బహుబల శాంతిమూలుడు పదమూడేండ్లు పాలన చేసెను. ఈతని రాజ్యవిశేషములు తెలియరావు. ఈతనికాలపు శాసనములనుబట్టి ఆంధ్రబౌద్ధులలో మహింసాసకులు, బహుశ్రుతులు అను మరిరెండు శాఖలుండినట్లు విదితమగుచున్నది. ఇక్ష్వాకువంశము వారు మొత్తము ఏబదిరెండుసంవత్సరములు ప్రభుత్వము నెరపినట్లు పురాణములు సూచించుచున్నవి. మూడవశతాబ్దముయొక్క తృతీయ పాదమునందును, దక్షిణదేశమున రాజ్యవిక్రాంతి జరిగెను. ఇక్ష్వాకులును వైజయంతీపుర ఆంధ్రభృత్యులును, ఉజ్జయినీ క్షాత్రపులును, నిర్వీర్యులై రాజకీయ రంగమునుండి అదృశ్యులు కాజొచ్చిరి. పల్లవులు నానాటికి బలము చేకూర్చుకొనుచు దక్షిణాపథమున బలవత్తర సామ్రాజ్యము నిర్మించుచుండి. ఆభీరులు శకరాజ్యమును కబళించి, ఉత్తరమున దృఢశక్తి సమన్వితులైరి.

శాతవాహనుల కాలమునందువలెనే ఇక్ష్వాకుల పరిపాలనము నందును ఆంధ్రదేశము సుఖసంపదలకు ఆటపట్టై విలసిల్లెను. సాతవాహనుల పరిపాలనావిధానమునే వీరును అవలంబించిరి. ఈవంశము వారి రాజచిహ్నము సింహమని తోచుచున్నది. వీరికాలమున విదేశ వాణిజ్యము చక్కగా సాగెను. నాగార్జునకొండ శిల్పములనుబట్టి, ఆంధ్రశిల్పులు మయవిశ్వకర్మలవంటి నిపుణులని లోకముకొనియాడు చున్నది. ఇక్ష్వాకుల కాలమున వాఙ్మయ ముండెనేమో తెలియరాదు. వీరు ప్రాకృత భాష నభిమానించిరి. ఉజ్జయినీ క్షాత్రపులు సంస్కృతభాషాభి మానులుగ నుండిరి. ఉజ్జయినీ నగరము సంస్కృత విద్యలకు ఆలవాల మైనది. జ్యోతిషమును శకరాజులు శ్రద్ధతో

పోషించిరి. ఇప్పుడు వాడుకలోనున్న [1]పంచాంగము, తిథివార పక్షమాసాదులతో గూడినది, మొదటి శకరాజాస్థానమున ఉజ్జయినిలో ప్రభవించినది. సాతవాహనుల కాలములోను ఇక్ష్వాకుల కాలములోనుగూడ సంవత్సరమునకు మూడు ఋతువులే గణింపబడుచుండెను. ఇవి గ్రీష్మము, వర్షము, హేమంతము. ఒక్కొక్క ఋతువునకు నాలుగు మాసములు, ఎనిమిది పక్షములు లెక్కింపబడుచుండెను. ఇప్పటిచాంద్రమాన వ్యవహారము శకరాజ్యముల నుండి వచ్చినట్లు కన్పించును.

ఇక్ష్వాకులనాటి సామంతప్రభుకుటుంబములలో ముఖ్యమైనవారు, ధనకులు, పూగియులు, హిరణ్యకులు, కులహకులు మొదలగువారు. వీరుఇక్ష్వాకులతో సంబంధములు చేయుచు రాజబంధువులై యుండిరి. రాజ్యమందలి ఉన్నతోద్యోగములలో వీరు నియుక్తులగుచుండిరి. వీరి బిరుదులలో మహాతలవర, మహాసేనాపతి, వంటి పదములు కాన్పించును. తలవరశబ్దము తెలుగుపదము. నేడిది పూర్వపు గౌరవార్థమును పోగొట్టుకొని 'తలారి' గ్రామపు కాపరియను సామాన్యార్థములోనికి దిగినను, ఇక్ష్వాకులనాడు తలవర శబ్దము గొప్ప పదవీ సూచకముగా నుండెను. ఆనాడు తలవర అనగా ధర్మాధికారి, ప్రధాన న్యాయమూర్తి, యనురీతిని వాడబడినట్లు తోచును. తెనుగుభాష ఇక్ష్వాకుల కాలమునకూడ వాడుకలో నుండెననుటకు ఇట్టి పదములు నిదర్శనము. పూగియులు నివసించుచుండిన రాష్ట్రమునకు వారిపేర [2]పూగిరాష్ట్రమని పేరు కలిగినది. పూగేయులు పూగవిషయనివాసులు. పూగవిషయ మనగా, తరువాత పాకనాడని వ్యవహరింపబడిన ప్రాంతము. ఇది సముద్రతీరమునుండి పెన్న గుండ్లకమ్మలమధ్య వెలిగొండల మీదుగ కడప జిల్లాలోని బద్వేలురాజంపేట తాలూకాల వరకును వ్యాపించెను. ఇచ్చట పోకలు (వక్కలు) విస్తారముగా పండుచుండుటచే, దీనికి

1. ఆంధ్రదేశచరిత్ర సంగ్రహము పుట 20. శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు. 2. చూడు **Dynasties of Andhra**. పుట 44.

పోకనాడు, పాకనాడు, అనునామము కలిగినట్లు తోచును. హిరణ్యాకులు హిరణ్యారాష్ట్రవాసులు. ఇది కడపమండలమునందలి జమ్మలమడుగు ప్రాంతమునకు వర్తించును. హిరణ్యాకుల నాయకుడు 'స్కందచలికిరెణ్ణకు'డని ఇక్ష్వాకు శాసనములు తెల్పుచున్నవి. ఈ పేరులోని చలికి పదము గమనింపదగినది. చాళుక్యుల మొట్ట మొదటి ప్రశంస ఈ పేరులో కన్పించుచున్నదని పరిశోధకులు తలచుచున్నారు. హిరణ్యారాష్ట్రము చాళుక్యుల పుట్టుకస్థాన మని దీనివలన సూచితమగుచున్నది.

పల్లవవంశము:—శాతవాహనుల తరువాత దక్షిణాపథమునందు గొప్ప సామ్రాజ్యము నిర్మించినవారు పల్లవులు. వీరు క్రీ॥ శ॥ మూడవ శతాబ్దిమధ్యనుండి తొమ్మిదవ శతాబ్దాంతమువరకును, దుర్నిరీక్ష్య తేజోవిరాజితులై, కాంచీపురము రాజధానిగా పరిపాలన చేసిరి. మొదటి పల్లవులకు ఆంధ్రదేశముతో సంబంధముండుటచేతను. కృష్ణానదికి దక్షిణముననున్న తెలుగుదేశము వీరి యధీనములోనుండుటచేతను, పల్లవ చక్రవర్తుల చరిత్ర కొంత వరకు మనకును పఠనీయమగుచున్నది. దక్షిణాపథ చరిత్రయందు, పల్లవులకు మహోన్నతస్థానముకలదు. ఉత్తరాదిని వాకాటకులును, గుప్తవంశీయులును, నిర్వహించిన ప్రాముఖ్యమునే, దక్షిణమున పల్లవులు నిర్వహించిరి. వీరును సంస్కృత భాషాభిమానులుగా నుండిరి. గుప్తాన్వయులవలెనే, పల్లవులును తాము పరమభాగవతులమని, అనగా విష్ణుభక్తినిరతులమని ప్రకటించుకొనుచుండిరి. పల్లవ చక్రవర్తులలో పరమమాహేశ్వరులుకూడ పలువురు లేకపోలేదు. మొత్తముమీద, వీరు దక్షిణాపథమునందు వైష్ణవమునకు గొప్ప స్థానము కల్పించి, వైదికబ్రాహ్మణ మతములతోపాటు పోషించిరి. పల్లవరాజన్యులు గొప్ప శిల్పకళాప్రియులు. వీరెన్నియో దేవాలయములు, మండపములను, అద్భుత శిల్ప ప్రావీణ్యమును ప్రదర్శించు వాటిని, నిర్మించి కీర్తిగాంచిరి. వీరి రాజధానియైన కాంచీపురము భారతదేశమునందలి సప్త పవిత్ర నగరములలో నొక్కటిగా వినుతి

కెక్కెను. ఇది విద్యలకు నిలయమై, ధాన్యకటకము, విజయపురి, నగరములవలె గొప్ప విద్యాపీఠముగా పేరుగాంచెను.

పల్లవ చరిత్రకు ముఖ్యాధారములు వారి శాసనములు. వీనిలో మొదటి శ్రేణికి చెందినవి ప్రాకృతభాషలో నున్నవి. ఇవి మిక్కిలి ప్రాచీనములు. ప్రాకృతశాసనముల తరువాత వచ్చునవి సంస్కృత శాసనములు. ఇవి పల్లవచరిత్రలో రెండవదశను సూచించును. మూడవతరము శాసనములు సంస్కృతములోను అరవభాషలోను ఉన్నవి. ఈ కాలమునకు పల్లవులు ఆంధ్రదేశములో తమ యాధిపత్యమును గోల్పోయి, కేవలము ద్రావిడరాజ కుటుంబముగా మారిపోయిరి. ఈ కడపటి శాసనములు రూపించు కాలముతో మనకంతగా ప్రసక్తిలేదు.

పల్లవుల యుత్పత్తినిగురించి చారిత్రకులు భిన్నాభిప్రాయులుగ నున్నారు. వీరిలో [1]బహుళ సంఖ్యాకులు పల్లవులు తొలుదొల్త ఆంధ్రులేయని విశ్వసించుచున్నారు. గుంటూరుజిల్లాలో పల్నాడు అను ప్రాంతము సుప్రసిద్ధముగదా. ఈ పలనాడే పల్లవులనాడు. అనగా పల్లవులు నివసించిన మండలమని పరిశోధకులు, లెస్సగా ఊహించినారు. బౌద్ధవాఙ్మయములో, దీనికి పల్లభోగ్గము అను వ్యవహారముండెను. పల్లవులు శకయవన పహ్లావులని చెప్పబడు విదేశీయులలో నొక జాతివారనియు, పహ్లావులే పల్లవు లయిరనియు చెప్పవచ్చును. ఆయుధ జీవులైన పహ్లావజాతివారు, కొందరు సాతవాహన చక్రవర్తులకడ ఉద్యోగములకు కుదిరి, వారి సామ్రాజ్యపు ప్రాగ్దక్షిణదేశమున రక్షణకొరకై, నిల్పబడియుందురు. క్రమముగా వీరచ్చట స్థిరపడి, బలవంతులై, శాతవాహనుల అనంతరకాలమున, స్వతంత్ర రాజ్యనిర్మాణము చేసియుందురు. వేగవతినది మీదనున్న కాంచీపురమును వీరు రాజధానిగా చేసికొనిరి. వీరిది వృషభలాంఛనము. ఇట్లు విఖ్యాత చరిత్రగల పల్లవవంశము ఆంధ్రదేశమునుండి

1. విన్సెంటుస్మిత్తు పండితుడు, డాక్టరు కృష్ణస్వామయ్యంగారు, డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారు మున్నగువారు ఈ వాదమునకు చెందినవారు.

వెడలియుండుననని యూహింపవలెను. పల్లవుల విజృంభణము ఆంధ్ర దేశమునుండి జరుగలేదనియు, వీరు కొంకణము (మహారాష్ట్రము) నుండి బయలుదేరి, వనవాసి రాజులైన చూటుకుల శాతకర్ణులతో వివాహసంబంధములచే బలవంతులై, తూర్పునకు వ్యాపించి, రాజ్య నిర్మాణముచేసిరనియు [1]శ్రీ భావరాజు వేంకటకృష్ణారావు పంతులు గారు తలచుచున్నారు.

పల్లవులు భారద్వాజ గోత్రోద్భవులైన బ్రాహ్మణులు. ఆ కాలపు మహారాజ కుటుంబములలో పెక్కు బ్రాహ్మణవంశములు గన్పట్టుచున్నవి. శాతవాహనులు, మానవ్య గోత్రీకులైన చూటు శాతకర్ణులు, శుంగులు, కాణ్వాయనులు, కదంబులు వీరందరును క్షాత్రవృత్తి నవలంబించిన బ్రాహ్మణులు. ఇక్ష్వాకులు [2]క్షత్రియు లనియు, బ్రాహ్మణులనియు, రెండభిప్రాయములు గలవు. వాకాట కులు పల్లవులవలెనే భారద్వాజ గణమునకు చెందిన బ్రాహ్మణులు. దీనినిబట్టియు, ఇతర సామ్యములనుబట్టియు, పల్లవులు వాకాటకుల సామంతులై యుండవచ్చునని డాక్టరు జయస్వాలు పండితుడు లిఖిం చెను. పల్లవులు తాము ద్రోణాచార్యుని కుమారుడైన అశ్వత్థా మనుండి జనించినట్లు చెప్పుకొనుచుండిరి. ఈ వంశస్థాపకుడు వీర కూర్చవర్మయను వీరుడు. ఇది యీతని నిజమైన పేరుకాక బిరుదమై యుండును. వీరకూర్చుడు నాగాన్వయులైన చూటు శాతకర్ణుల కన్యను పెండ్లియాడి, అనుకూల సమయముగాంచి (క్రీ॥ శ॥ 233) వనవాస రాజ్యమునే ఆక్రమించుకొనెను. తరువాత ఇక్ష్వాకు రాజ్య మును కూలద్రోసి, వనవాసరాజ్యమునుకూడ తమ సామ్రాజ్య ములో కలుపుకొనిరి. క్రీ॥ శ॥ 3 వ శతాబ్ది తృతీయ పాదమునకు పల్లవాధికారము దృఢముగా నెలకొల్పబడెను. సామ్రాజ్య నిర్మాణ సూచకముగ వీరకూర్చవర్మ ([3]మొదటి కుమారవిష్ణువు)

---

1. **Early dynasties of Andhra. Pages 167—173.**

2. ఇక్ష్వాకులు క్షత్రియులని డాక్టరు భండార్కరుగారి మతము. చూడు మీది గ్రంథము పుట 37.

3. వీరకూర్చుని పేరు కుమారవిష్ణువని శ్రీ భావరాజు కృష్ణారావుగారు.

అశ్వమేధముచేసెను. ఈతడనేకయజ్ఞములుచేసి, బ్రాహ్మణులకు భూరిదక్షిణలిచ్చి, వైదికమతమును పోషించెను. పూర్వపల్లవుల చరిత్రకు ముఖ్యములైన మైదవోలు, కందుకూరు, హిరహడగల్లి తామ్రశాసనములు గుంటూరు నెల్లూరు బళ్లారి మండలములలో దొరికినవి. దీనినిబట్టి ఆంధ్రప్రాంతమైన ఈజిల్లాలు పల్లవరాజ్య భాగములుగ నుండెనని చెప్పవచ్చును.

వీరకూర్చుని కుమారుడు శివస్కందవర్మ మహారాజుకూడ తండ్రివలెనే పరాక్రమశాలి. జనకుని వలెనే ఈతడును వైదికధర్మ పరాయణుడై అనేక క్రతువులను చేసెను. ఈతడు తండ్రికాలము లోనే కాంచీపురమునుండి, ఆంధ్రపథమున ధాన్యకటకములో తన తండ్రికి ప్రతినిధియైన ఉద్యోగికి (వ్యాపృతుడు) ఆజ్ఞనిచ్చుచు, ఒక దానమును ప్రకటించెను. ఇదియే మైదవోలు శాసన మనబడు చున్నది. దీనినిబట్టి పల్లవుల యధికారము ఆంధ్రదేశములో కృష్ణా నది దక్షిణతీరమువరకు, వ్యాపించెనని చెప్ప వీలగుచున్నది. శివ స్కందవర్మ ధర్మమహారాజాధి రాజు అను బిరుదము చేకొనెను. ఈతడు పితృభక్తిపరాయణుడై, తండ్రిని 'బప్పస్వామి' యని భూషించెను. శాతకర్ణులు, ఇక్ష్వాకులు, మున్నగువారు తమ మాతృ నామములను స్వీకరించుచుండిరి. పల్లవులీయాచారమును విడిచిపెట్టి, పితృనామధేయమును స్మరించిరి. శివస్కందవర్మ ప్రకటించిన హిర హడగల్లి శాసనమువలన, ఆకాలపు పరిపాలనా విశేషము లెన్నియో తెలియుచున్నవి. ఈశాసనము బళ్లారి మండలములో దొరకినది. దీనికి శాతవాహనరాష్ట్రమని అప్పటిపేరు. బప్పస్వామి (ఈరాజు తండ్రి) ఆపిట్టి గ్రామవాసులైన కొందరు బ్రాహ్మణులకు దానము చేసిన గ్రామమును వారికి స్థిరపరచుచు, మరికొంత భూమిని తాను సమర్పించుచు, శివస్కందు డీశాసనమును వేయించెను. ఈ శాసన మునందు పలువురు రాజోద్యోగులు పేర్కొనబడిరి. రాజకుమారులు, సేనాపతులు, రఠికులు (జిల్లాఅధికారులు) సుంకపుటధికారులు, దేశాధికృతులు (స్థానిక పరిపాలకులు) గ్రామభోజకులు (మునసబు

కరణములవంటివారు) వల్లవులు (పశువుల మందలు కలవారు) గోవల్లవులు, అమాత్యులు, ఆరక్షాధికృతులు (రక్షకభటులు), భద్రమనుష్యులు (సైనికులు), ఆయుక్తకులు, నైయోగికులు, సంచారాంతకులు (చారులు) ఇంకను చిల్లర ఉద్యోగులు ఆనాడుండిరి. ఈ శాసనమునందు మరియొక విశేషము కలదు. రాజులు దానముచేయునప్పుడు, అష్టాదశ పరిహారములతో దానము చేయుచుండిరి. అనగా దానముచేయబడిన క్షేత్రముమీదను, గ్రామముమీదను, ప్రభువునకు చెందవలసిన సమస్తాధికారములును హక్కులును ప్రతిగ్రహీతలకు సమర్పింపబడుచుండెను. అట్టి పరిహారములలో, కొన్ని ఈ శాసనములో ఉదాహృతములైనవి. పన్నులు చెల్లించనక్కర లేకుండుట; పాలు, పెరుగులు ఉప్పు, పంచదారలలో భాగమీయ నక్కర లేకుండుట; వెట్టిచాకిరి లేకుండుట. ఎద్దులను (రాజుపొలముల దున్నుటకై కావలెను) ఎరువు ఇచ్చుట, గడ్డి, వంటకట్టెలు, కూరగాయలు ఇవ్వనక్కర లేకుండుట—ఈ మొదలైన పరిహారములతో, శివస్కందవర్మ దానము చేసెను. శాసనమును వ్రాయించిన వాడు రాజుయొక్క రహస్యాధికారి భట్టిశర్మ.[1] శాతవాహన దానశాసనములందును, ఇట్టి పరిహారము లుండెడివి. దానములు దేవభోగములు, బ్రహ్మదేయములు, అని రెండు విధములు. దేవాలయముల కిచ్చినవి దేవభోగములు. బ్రాహ్మణుల కిచ్చినవి బ్రహ్మదేయములు.

పల్లవవంశమువారు సుమారు ఆరున్నర శతాబ్దుల దీర్ఘకాలము పరిపాలనచేసిరి. వీరిలో ఎందరో మహాసమర్థులయిన రాజులు గడచిరి. పల్లవ రాజవంశావళి నిర్ణయము మిక్కిలి చిక్కు సమస్యయై, చారిత్రకులను కలవరపెట్టినది. అనేక శాసనములలో గనవచ్చు రాజులపేర్లను, ఒక వంశవృక్షములో సమన్వయముచేయుట కష్టకార్యమయ్యెను. పల్లవులలో రెండు శాఖలుండెననియు, అందు ప్రధానశాఖ కాంచీపురమునుండి పాలించెననియు, ఉపశాఖ యొకటి ఆంధ్ర

1. గౌతమీపుత్ర శాతకర్ణి నాసిక శాసనము.

దేశమును ఏలె ననియు, ఈ యుభయ శాఖలును అన్యోన్యమైత్రి కలిగి, సహకారముతో మెలగెననియు కొందరు చారిత్రకులు తలచుచున్నారు. మరికొందరీ శాఖాద్వయ కల్పనమును అంగీకరింపరు. ఎట్లైనను, ఆంధ్రదేశపు దక్షిణ మండలములు—కర్మరాష్ట్రము [1]ముండరాష్ట్రము (ఇప్పటి నెల్లూరుజిల్లా) హిరణ్యరాష్ట్రము (కడప జిల్లా), సాతవాహనరాష్ట్రము (బళ్లారి) వెంగోరాష్ట్రము (చిత్తూరు జిల్లా)—కృష్ణానదికి దక్షిణముగానున్న భాగమంతయు క్రీ. శ. 625 ప్రాంతమువరకును పల్లవుల యధీనమందుండెననుట తథ్యము. ఈ మండలములలో వీరి శాసనము [3]లెన్నియో కన్పించుచున్నవి ఆరంభమునుండి కడవరకును, ఈ ప్రాంతముపై పల్లవాధిపత్యము నిరాటంకముగ సాగెనని, చెప్పవీలులేదు. ఆనందగోత్రీకులు, విష్ణు కుండినులు, చాళుక్యులు, తెలుగు చోళులు మొదలగు ఆంధ్రరాజ కుటుంబములవారు పల్లవులను, తెలుగు దేశమునుండి తరిమివైచుటకు, అప్పటప్పట కృషి చేయుచునే యుండిరి. కాని తూర్పు చాళుక్య యుగప్రారంభమువరకు, ఈయత్నము సంపూర్ణముగ కొనసాగలేదు.

పల్లవులకును, కదంబులకును, బద్ధవైరముండెను. మయూర శర్మయను బ్రాహ్మణవీరుడు వనవాసదేశమున, కదంబవంశమును స్థాపించెను. పల్లవులకును వీరికిని ఉత్తరకర్ణాట స్వామిత్వముకై తరములబడి యుద్ధముసాగుచువచ్చినది; తుదకు కదంబులే విజయమును పొందిరి. పల్లవులలో సమర్థులైన రాజు లనేకులుండిరి. విష్ణు గోపవర్మ యను పల్లవరాజు సముద్రగుప్తుని దండయాత్రకాలమున (క్రి. శ. 340) ఉండెను. క్రీ. శ. ఐదవ శతాబ్దాంతమున స్కందవర్మయను

1. చూడు-ప్రా. ఆం. రాజవంశచరిత్ర పుట. 227.

2. పై గ్రంథము పుట. 236.

3. చూడు-Inscriptions of **Andhra** dynasties IV Pallavas—డాక్టరు మారేమండ రామారావుగారు.

చక్రవర్తి యుండెను. ఈతడే త్రిలోచన పల్లవుడని [1]కొందరిమతము. ఈతనికి ముక్కంటికాడువెట్టియని మరియొక పేరు. త్రిలోచన పల్లవుని గూర్చి ఎన్నియో కథలు చెప్పబడుచున్నవి. తెలుగు సామంత కుటుంబముల వారెందరో త్రిలోచన పల్లవునిచే, రాజ్యలాభమును పడసినట్లు తెలియుచున్నది. చాళుక్యుల మూలపురుషుడైన విజయాదిత్యుడతనితో పోరాడి, యుద్ధమునందు చంపబడెను. విజయాదిత్యునిభార్య గర్భవతియైయుండి, ప్రాణరక్షణమునకై పారిపోయి, హిరణ్యరాష్ట్రమున ముడివేము అగ్రహారమునందు విష్ణుభట్ట సోమయాజి యను బ్రాహ్మణుని చాటు జొచ్చెనట. ఈమెకు జనించిన కుమారుడు విష్ణువర్ధననామమును వహించి, తరువాత పల్లవుల నోడించి, చాళుక్య రాజ్యస్థాపనము చేసెనని యొక కథ అర్వాచీన పూర్వచాళుక్య శాసనములలో చెప్పబడుచున్నది. త్రిలోచన పల్లవుని మరియొక శత్రువు కరికాలచోళుడు. ఈ మహావీరునిగూర్చి ఎన్నియో అద్భుత వృత్తాంతములు తమిళ వాఙ్మయమున గలవు. తెలుగు చోడవంశములవారుకూడ, తాము కరికాలచోళుని సంతతి వారమని చెప్పుకొందురు. కరికాలుని ఘనకార్యములలో ముఖ్యమైనది త్రిలోచన పల్లవుని సంగ్రామమున జయించి, ఆతనిచే కావేరినదికి గట్టులు పోయించి, ఊడిగము చేయించుకొనుట. కరికాల చోళుడు ద్రావిడ వీరుడని తమిళ చారిత్రకులు విశ్వసింతురు. క్రీ. శ. ఏడవ శతాబ్ది ప్రారంభమున మహేంద్ర విక్రమవర్మ యనంతరము, ఆంధ్ర దేశములో పల్లవాధికారము చాలవఱకు నిర్మూలింపబడెను. పల్లవరాజన్యులు వేదవేత్తలైన బ్రాహ్మణుల కెన్నియో భూదాన అగ్రహార దానముల చేసిరి. వేదశాస్త్రములను, సంస్కృతమును, వీరు శ్రద్ధతో పోషించిరి. ఆంధ్ర దేశమునకు వీరు చేసిన మేలు విద్యాపోషణమని చెప్పవలెను. ఆకాలపుటవసరములనుబట్టి, వీరు సంగ్రామశీలురుగ నుండిరి. కావున వాఙ్మయమును, కళలను,

1. Early dynasfies of Andhra Desa.

2. పై గ్రంథము పుట. 282 నుండి.

పెంపొందించుటకు పూర్వపల్లవుల కవకాశములు తక్కువగానుండె ననిపించును.

బృహత్ఫలాయనులు:— ఈ వంశమువారి తామ్రశాసన మొక్కటిమాత్రము దొరకినది. ఇది బృహత్ఫలాయన జయవర్మ మహారాజు కొండముది శాసనము. ఇది ప్రాకృతభాషలో నున్నది. దీని లిపినిబట్టి, ఇది శివస్కందవర్మ పల్లవుని మైదవోలు శాసనము నకు సమీపమున నుండవచ్చునని, లిపిశాస్త్రజ్ఞులు తలచిరి. ఈతడు క్రీ॥ శ॥ 270-285 ల నడుమ ప్రభుత్వము నెరపియుండును. జయ వర్మ బృహత్ఫలాయన గోత్రోద్భవుడు. మహేశ్వరపాదపరిగృహీతు డని యాతని శాసనము తెల్పుచున్నది. ఇక్ష్వాకుల పతనానంత రము శైవము తిరిగి ప్రకాశించెను. జయవర్మ మహారాజు విజయ స్కంధావారముననుండి, కూడూరులో, తన వ్యాపృతునకు (ప్రాంత పరిపాలకుడు) ఆజ్ఞను ప్రకటించుచు కూడూరుహారమందలి పాంటూ రను గ్రామమును సర్వపరిహారములతో బ్రహ్మదేయముగ ఎనమండు గురు బ్రాహ్మణులకు దానముచేసినట్లు ప్రకటించెను. రాజాజ్ఞను చెక్కించినవాడు మహాతగవర మహా దండనాయక బాపహానవర్మ యనువాడు. పాంటూరుగ్రామ మిప్పుడు తెనాలి తాలూకాలో పాటూరు అను పేరనున్నది. కొండముది (కొండమూడి?) గ్రామము కూడ దీనికి సమీపముననే యున్నది. కూడూరుహార మనగా కూడూరు ముఖ్యనగరముగాగల విషయము. కూడూరు గ్రామము ఘంటసాల నమీపమునందలి [2]కోడూరుగా గుర్తింపబడినది. ఇచ్చట పూర్వకాలపు శిథిలములు విస్తారముగ కన్పించుచున్నవి. జయవర్మ శాసనములో పేర్కొనబడిన పరిహారములు కొన్ని గమనింపదగినవి. దానముచేసిన గ్రామములో రాజభటులు ప్రవేశింపరాదనియు, రాజోద్యోగులు పన్నులకై అగ్రహారీకులను సమీపించరాదనియు, ఉప్పుకొరకు త్రవ్వుహక్కు వారికే విడువబడినదనియు, శాసనము

1. Budhist Remains in Andhra etc. K. R. Subrahmanyam'
2. Early dynasties of Andhra desa.

నుడువుచున్నది. దానశాసనము వ్రాయించిన బాపహానవర్మకు 'మహా తగవర' బిరుదు వేయబడినది. తగవరి అనగా తగవు తీర్చు వాడు. ఉచితానుచితజ్ఞుడు అని సామాన్యార్థము. శాసనమునం దిది ధర్మాధికారి యను నర్థములో వాడబడినట్లు తోచును. ఇక్ష్వాకు శాసనములందలి మహాతలవర శబ్దమువలెనే, మహాతగవర పదము కూడ తెలుగుపదము. అట్టి ప్రాచీన కాలములోనే, తెలుగు భాష ప్రచారములో నుండెననుటకు గ్రామనామములును, వ్యక్తుల పేర్లును, బిరుదు శబ్దములును, సాధకము లగుచున్నవి. బృహత్ఫలాయనుల యధికారము జయవర్మ మహారాజుతోనే యంతమొందినట్లు చెప్ప వలెను.

ఆనందగోత్రీకులు:— బృహత్ఫలాయనుల తరువాత కృష్ణా తీరాంధ్రదేశమున ఆనందగోత్రప్రభువులు రాజ్యము చేసిరి. మార్కండేయ పురాణములో, గోలాంగూలు లనువారు, దక్షిణా పథరాజవంశములలో నొక్కరుగా పేర్కొనబడిరి. ఆనంద గోత్రీకు లకు గోలాంగూలము ధ్వజచిహ్నముగా (కపిధ్వజము) నుండినట్లు, వారి శాసనమువలన తెలియవచ్చుచున్నది. వీరి ముఖ్యపట్టణము కపోతకందర పురము. గుంటూరు జిల్లా నర్సారావుపేట తాలూకా చేజెర్ల గ్రామమున కిది సరిపోవును. ఇచ్చట కపోతేశ్వరుని యాల యము కలదు. ఈ వంశచరిత్రకు ఆధారములైన శాసనములు మూడు లభించుచున్నవి. దామోదరవర్మ మట్టిపాడు శాసనము, అత్తివర్మ (హస్తివర్మ) గోరంట్ల శాసనము, కందరనృపుని చేజెర్ల శాసనము. మట్టిపాడు శాసనము సంస్కృత ప్రాకృతములలోను, గోరంట్ల శాసనము సంస్కృతములోను వ్రాయబడినవి. కాలాను పూర్విని బట్టి ప్రాకృత శాసనములు ప్రాచీనములనియు, సంస్కృత ప్రాకృత ములు మిశ్రమమైనవి తరువాతివనియు, సంస్కృత శాసనములు వానియనంతరము వచ్చుననియు చారిత్రకుల యభిప్రాయము. దామోదరవర్మ క్రీ. శ. నాల్గవ శతాబ్ది ప్రారంభమున నుండియుం డును. ఈతడు బౌద్ధమతాభిమానియైనట్లు మట్టిపాడు శాసనము నందు

ఈతనికిగల 'సమ్యక్సంబుద్ధ స్వపదానుధ్యాతస్య' (బుద్ధుని పాదములు ధ్యానించువానికి) అను వర్ణనమువలన తెలియుచున్నది. బుద్ధభక్తుడైనను దామోదరవర్మ వేదవిదులైన బ్రాహ్మణులకు కంగూర గ్రామమును, సర్వపరిహారములతో, దానము చేసినట్లు మట్టెపాడు శాసనము ప్రకటించుచున్నది. ఈ దానమాతని ప్రశంస్యమైన మతసహనమునకు నిదర్శనము. దానము గ్రహించిన విప్రవర్యులపేర్లు భావజ్జ, నందజ్జ, కొండిన్న మొదలైనవి. వీనిలోని 'అజ్జ' అను ఉపపదమే తరువాత 'అయ్య'గా మారియుండును. దీని సంస్కృత మూలము 'ఆర్య' శబ్దము.

ఈవంశములో మరియొక ప్రసిద్ధుడైన రాజు గోరంట్ల శాసనమును ప్రకటించిన అత్తివర్మ మహారాజు. తాన్టికొన్త్రయను గ్రామములో కొంత భూమిని, అంతుకూరను గ్రామమును పూర్తిగను, ఈతడు బ్రహ్మదేయముగ కోటిశర్మయను బ్రాహ్మణునకు దానము చేసెను. ఇందులోని తాన్టికొన్త్రయే ఇప్పుడు తాడికొండ యనబరగుచు, కృష్ణకు దక్షిణమున, గుంటూరుకు సమీపములో నున్నది. పూర్వము మన భాషలో 'ఌ' అను వింత వర్ణముండెనని చెప్పియుంటిమి. అది కాలక్రమమున 'డ' గా మారిపోయినది. తాడికొండపదము ఇట్లే ఏర్పడినది. కోటిశర్మ త్రివేదియట. అనగా మూడు వేదములు పఠించినవాడు. ఇట్లాకాలపు బ్రాహ్మణులు వేదాధ్యయనమునందు మిన్నగా నుండిరి. [1]అత్తివర్మ క్రీ. శ. 5 శతాబ్ది ప్రారంభమున నుండియుండును. ఈతడు పరాక్రమవంతుడైన రాజు. ఈతడు ప్రజలను చక్కగా పరిపాలించుటచే కీర్తినొందెనని గోరంట్ల శాసనము వర్ణించుచున్నది అత్తివర్మ శివభక్తుడు. వంకేశ్వర శంభువును ఈత డారాధించెను. దామోదరవర్మ కాలమునకు

1. Early dynasties of Andhra desa page 341.

బౌద్ధమత మింకను రాజాదరణము పొందుచుండెను. అత్తివర్మ నాటి కామతమునకు ఆంధ్ర దేశములో ప్రాబల్యము తగ్గెను.

ఆనందగోత్రపురాజులు చిరకాలము స్వతంత్రులుగా నుండ లేకపోయిరి. దామోదరవర్మ తరువాత శాలంకాయన వంశమువారు బలవంతులై, ఆనందగోత్రీకుల నణచివేసి, నూతన రాజ్యమును స్థాపించిరి. దామోదరవర్మకు ఇంచుమించు ఒక శతాబ్దము తరువాత, అత్తివర్మ జీవించెను. ఈతనికాలమున నీవంశ దీపము మరియొక వెల్గు వెల్గెను. కాని అచిరకాలములోనే మరియొక బలవత్తర రాజ్యము తలయెత్తుటచే ఆనందు లణగిమణగి యుండవలసిన వారైరి. ఈ క్రొత్త శక్తి విష్ణుకుండి వంశమువారిది. ఆనందగోత్రీకులలో మనకు తెలియవచ్చు మరియొకరాజు కందరుడు. ఈతడు త్రికూటాధిపతియనియు, రెండు జనపదముల నేలెననియు చేజెర్ల శాసనము తెల్పుచున్నది. త్రికూటమనగా కోటప్పకొండ యనబడు పర్వతము. ఇది నర్సారావుపేట తాలూకాలోనున్నది. ఆనంద గోత్రీకుల రాజ్యము కృష్ణకు దక్షిణముననను, ఉత్తరముననను కొంత దూరము వ్యాపించియుండెను. ఇదియే వారు పాలించిన రెండు జనపదములై యుండును. కృష్ణ దక్షిణ జనపదమునకు కర్మరాష్ట్ర మని పేరుండెను. కందరరాజు ధాన్యకటక యుద్ధములో శత్రువుల ఏనుగుబలమును ఖండించెనట. [1] ఈతని చరిత్ర ఇట్లన్వయింప బడు చున్నది. క్రీ. శ. 7 వ శతాబ్ద ప్రథమ పాదాంతమున చాళుక్య చక్రవర్తి రెండవ పులకేశి ఆంధ్ర దేశముపై దండెత్తివచ్చి, అప్పు డచ్చట రాజ్యము చేయుచున్న విష్ణుకుండినుల నోడించి, వేగిదేశ మును జయించెను. ఈ దండయాత్రయందు పులకేశికి అతని తమ్ము

1. Early dynasties of Andhra desa page 344.

డైన కుబ్జవిష్ణువర్ధనుడు ప్రబలసహాయమొనర్చెను. తరువాత అయి దారేండ్లకు మరల దండయాత్ర వెడలి, కృష్ణానదీ దక్షిణతటమందలి కర్మరాష్ట్రమును జయించి, యచ్చటినుండి పల్లవులను తఱిమివేసి, యచ్చట తన యధికారమును స్థిరముగ నెలకొల్పెను. ఈయవాంత రములో ఆనందగోత్రజులు సమసి పోయిరి.

కందరాజు ప్రజారంజకుడై పాలించెను. ఈతని జనపదములు వస్తుసమృద్ధి కలిగియుండెనట. మహేంద్రవర్మ అనుమతిపై నీతడు శిథిలమైన కపోతేశ్వరాలయమును పునర్నిర్మాణముచేసి, దానికి వన్నె తెచ్చెను. ఈ యాలయము మొట్టమొదట బౌద్ధుల పవిత్ర స్థలముగ నుండెను. బుద్ధమతము ఆంధ్రదేశములో క్షీణించిన తరు వాత, నిది శివాలయముగా మార్చబడినట్లు తోచును. ఈ కాలమున ఎన్నియో బౌద్ధక్షేత్రము లిట్లు హిందూదేవాలయములుగా రూపొం దుట గాంచనగును. జగత్ప్రసిద్ధమైన అమరావతి బౌద్ధక్షేత్రము. అర్వాచీన కాలమున శైవపుణ్యక్షేత్రముగా మారెను. ఇచ్చటి దేవుడు అమరేశ్వరుడు, [1]ఆనందగోత్రమువారు చిన్న రాజ కుటుంబ మైనను స్వాతంత్ర్య పిపాసచే ఘనకీర్తిని పొందవలసినవారుగా ఉన్నారు.

శాలంకాయనవంశము క్రీ॥ శ॥ 300-420:—ఈ వంశపు రాజులు తమ గోత్రనామమునే వంశనామముగా గ్రహించిరి. శాలంకాయనుడను వేదర్షి కలడు. వీరును స్తోత్రవృత్తి నవలం బించిన బ్రాహ్మణులుగా గన్పింతురు. పల్లవులకును వీరికిని సంబం

1. ఆనంద గోత్రికులు క్రీ. శ. 375-500 నడుమ నుండిరనియు, వీరిలో చేజెర్ల శాసనములో పేర్కొనబడిన కందరనృపతి మొదటివాడనియు, దామో దరవర్మ అత్తివర్మలు తరువాతివారనియు, కందరపుర మనగా గుంటూరుజిల్లాలోని కంటేరనియు డాక్టరు మారేమండ-రామారావుగారు వ్రాయుచున్నారు. చూడు ఆంగ్ల వ్యాసము 'The Ananda Gotra kings' Journal of Andhra History & Culture Vol I. No. 1.

ధము కలదని కొందరు చారిత్రకులు తలచిరి. పల్లవులవలెనే శాలంకాయనులుకూడ వృషభలాంఛనులు. ఉభయులును పితృభక్తి సూచకముగ 'బప్ప భట్టారక పాదభక్త' అను విశేషణమును తమ శాసనములలో వేసికొనుచుండిరి. పల్లవులవలెనే తామును పరమ భాగవతులమని శాలంకాయనులు వర్ణించుకొనిరి. ఈయన్వయము వారి ప్రధాన ఆరాధ్య దైవతము భగవంతుడైన చిత్రరథస్వామి. చిత్రరథు డనగా సూర్యుడు. శాలంకాయనుల రాజధానియైన వేంగిపురమునందు చిత్రరథస్వామి ఆలయముండెడిదట. ఆంధ్రనగర మనియు, గొప్ప విద్యాపీఠమనియు ప్రసిద్ధిగన్న వేంగిపట్టణము ప్రస్తుతము రూపుమాసినది. దీని స్థానమున పెదవేగి చిన వేగి యను పల్లెలు నిల్చియున్నవి. ఇవి ఏలూరు స్టేషనుకు సమీపమున నున్నవి. ప్రాచీనకాలమున వేగిపురము మహాశోభాన్వితమై యుండెను. దీనికి సమీపముననే కొల్లేరు అను పెద్ద జలాశయము కలదు. శాలంకాయనులు శాతవాహనాంధ్రుల కాలములోనే గణుతి కెక్కియుండిరి. టాలెమీతన గ్రంథములో 'సలకినాయ్' (Salakenoi) అను ప్రజలను పేర్కొనుచు, వారు గోదావరి పశ్చిమభాగములో నివసించుచుండి నట్లును వారికి కొన్ని నగరములుండినట్లును వర్ణించెను. వీరు మూడవ శతాబ్దాంతమున బలసమన్వితులై గొప్ప రాజ్యమును స్థాపించిరి.

శాలంకాయన చరిత్రకు పునాదియైన [1] శాసనము లైదు లభించుచున్నవి. శాలంకాయనుల రాజరికమును మొదట స్థాపించిన వాడు విజయ దేవవర్మ మహారాజు. ఈతడు పరాక్రమశాలియై, శత్రువుల నోడించి, అశ్వమేధయాగము సల్పెను. అనగా నీతడు స్వతంత్ర రాజ్యస్థాపనమును ప్రకటించెను. ఈతని ఏలూరు ప్రాకృత శాసనలిపి, బృహత్ఫలాయన జయవర్మ శాసనలిపిని బోలియున్నది.

1. (అ) విజయదేవ వర్మ ఏలూరు శాసనము, (ఆ) విజయనందివర్మ కొల్లేరు శాసనము. (ఇ) నందివర్మ పెదవేగి శాసనము. (ఈఉ) రెండు కంతేరు శాసనములు.

విజయదేవవర్మ క్రీ॥ శ॥ నాల్గవ శతాబ్ది ప్రారంభమున దిగ్విజయము చేసి, స్వతంత్ర పరిపాలన మారంభించియుండును. ఈ ప్రయత్నమునం దీతడు ఆనందగోత్రీకుల నోడించి, కృష్ణకు ఉత్తరముననున్న వారి రాజ్యభాగము నాక్రమించియుండును. కృష్ణానదికి దక్షిణముననున్న తెలుగుదేశము, శాలంకాయనుల కాలమున, పల్లవుల యధీనమందే నిల్చిపోయెను. ఈ రెండు వంశములవారు వైరములేక, సఖ్యతతో నుండినట్లు కాన్పించును. పల్లవుల మైత్రికి మూల్యముగ శాలంకాయనులు దక్షిణాంధ్రమును, వారి యాజమాన్యమునకు విడిచియుందురు. పల్లవులకు కదంబులు ప్రక్కలో బల్లెమై యుండిరి. తమ రాజ్యమున కుత్తరమున శాలంకాయనులవంటి మిత్రరాజ్యముండుట పల్లవులకు ఆవశ్యక మనిపించెను. శాలంకాయనుల కుత్తరమున, మధ్యదేశమున వాకాటకులును పశ్చిమమున కదంబులును వ్యాపించిరి. ఇట్లు ప్రధానముగ కృష్ణాగోదావరీనదుల నడిమిదేశమును, శాలంకాయనులు, ఒక శతాబ్దముపైబడి ఏలిరి. విజయదేవవర్మ పరమమాహేశ్వరుడనని ఏలూరు శాసనములో చెప్పుకొనెను. ఇందు 'మున్యద' అను రాజకీయోద్యోగి పేర్కొనబడెను. ఈతడు గ్రామాధికారి కావచ్చును.

ఈ వంశమున మరియొక ప్రసిద్ధరాజు హస్తివర్మ. గుప్తచక్రవర్తి సముద్రగుప్తుడు (క్రీ॥ శ॥ 343) దక్షిణ దిగ్విజయమున కేతెంచినప్పుడు శాలంకాయన హస్తివర్మ మహారాజు అతని నెదిర్చెను. ఈత డనేకశత్రురాజులను జయించినట్లు పెదవేగి శాసనములో వర్ణింపబడినది. ఈతని కుమారుడైన నందివర్మ సాత్త్వికబుద్ధి గలవాడు. ఈతడు 'వివిధధర్మప్రధానుడు' అని చెప్పబడుటచే వైదిక బౌద్ధమతములను సమదృష్టితో చూచెనని చెప్ప వీలగుచున్నది. నందివర్మ కుమారుడు చండవర్మ (చంద్రవర్మ?) పరాక్రమశాలియై పలువురు సామంతరాజులను గెలిచెను. చండవర్మ పెద్ద కొడుకు విజయనందివర్మ. ఈతడే పెదవేగి శాసనమును వేయించినవాడు. ఈతడు పరమభాగవతుడు, అనగా విష్ణుభక్తిశీలుడు. ప్రాలూరు

గ్రామమునందలి విష్ణుగ్రహస్వామికి అరుతూరు ముందూరు, చెంజె రువు, [1]కంబురాం చెఱువు గ్రామములలో కొంతభూమి నీతడు 'దేవహాలముగ' దానము చేసెను. దేవహాలము అనగా దేవతల కొరకు దున్నబడు క్షేత్రము. ఈ పొలములు సేద్యము చేయుట, అరు తూరు గ్రామమునందలి గొల్లవారికి అప్పగింపబడెను. కంబురాం చెఱువు ఇప్పుడు కమ్మర చెఱువు అనబడుచున్నది. ఈ గ్రామము లన్నియు పెదవేగి సమీపమున నున్నవి. ప్రాలూరు (పాలురు) గోదా వరి ముఖమునందుండిన యొక గొప్ప రేవు పట్టణము. ఇది యిప్పుడు నష్టమైనది. టాలెమీ దీనిని తన గ్రంథములో పేర్కొనెను. విజయనందివర్మయే కొల్లేరు శాసనమునుగూడ ప్రకటించెను. ఈతని కాలములో శాలంకాయనాధికారము క్షీణింప మొదలిడెను. కళింగ దేశమునందు ఒక నూతన వంశము అధికారమునకు వచ్చుటచే గోదావరి కుత్తరమున శాలంకాయనుల ప్రభుత్వము సన్నగిల్లెను. నందివర్మ తమ్ముడు —— విజయస్కందవర్మతో [2]శాలంకాయన రాజ్యము క్రీ॥ శ॥ 420 ప్రాంతమున అంతమొందెను. ఈతడు దానము చేసిన కంటేరు శాసనములోని యోగ, నియుక్త, యుక్తక, విషయపతి మొదలగు రాజోద్యోగులు పేర్కొనబడిరి. విష్ణుకుండిన వంశము వారి ధాకకు తాళజాలక, శాలంకాయను లస్తమించియుందురు.

---

1. ఈ రూపము గమనింపదగినది, పూర్వపు తెలుగుభాషలో, పూర్ణానుస్వారము పూర్వమందుగల 'బ' కారము (ంబ, ంబు, వంటివి) తరువాత మకార ద్విత్వముగా మారినవి. కంబురాం చెఱువు-కమ్మర చెఱువు - వనంబు - వనమ్ము. 'ంబు' కు పూర్వము దీర్ఘస్వర మున్నచో అది మకారముగా మాత్రమే నిల్చినది. పాంబు - పాము; వేంబు - వేము.

2. శాలంకాయనులు క్రీ॥ శ॥ 275 నుండి 450 వరకు పరిపాలన చేసి యుందురనియు, మహారాజ విజయ దేవవర్మకును హస్తివర్మకు నడుమ మరియిద్దరు రాజులు (1) విజయనందివర్మ (2) విజయబుద్ధవర్మ అనువార లుండియుందురనియు డాక్టరు సుబ్రహ్మణ్యంగారి మతము. See Budhistic remains in Andhra etc.

శాలంకాయనుల వంశము ఆంధ్రచరిత్రయందు సమున్నత స్థానము వహించెను. వీరి కాలమున బౌద్ధమతము ఆంధ్రదేశమున స్థానము గోల్పోయి, ప్రాక్సముద్ర దీవులకును, బర్మా, సయాం, కంబోడియా దేశములకును వ్యాపించెను. శాలంకాయన రాజులు పరమమాహేశ్వరులును పరమభాగవతులును, అయి అశ్వమేధాది యాగములను చేసినవారైనను, బౌద్ధమతమును సహనముతోను, ఆదరముతోను జూచిరి. వీరి కాలమున కొందరు ప్రసిద్ధ బౌద్ధాచార్యులు ఆంధ్రదేశమునందు నివసించి, గ్రంథరచనమునందును, మతప్రచారము తత్త్వవివేచనమునందును, నిమగ్నులైయుండిరి. బుద్ధపాలితుడు, భావవివేకుడు, ఆచార్య దిఙ్నాగుడు వంటి మహాబౌద్ధ విద్వాంసు లాంధ్రదేశముతో సంబంధము కలిగియుండిరి. దిఙ్నాగాచార్యునిగూర్చి యువాన్‌చాంగు తన గ్రంథములో ప్రశంసించెను. కాంచీపుర సమీపమందలి సింహవక్త్రపురములో దిఙ్నాగుడు బ్రాహ్మణకుటుంబమున జన్మించెను. వేదశాస్త్రములయం దీతడు నిష్ణాతుడయ్యెను. తరువాత నీతనిదృష్టి బౌద్ధమతమువంకకు మరలెను. దిఙ్నాగుడు గొప్పవేదాంతి యనియు, కర్క-శతర్క-పండితుడనియు, విఖ్యాతినొందెను. బౌద్ధమత ప్రచారమునం దీతడు అందెవేసినచేయి. మొదట నీ యాచార్యసత్తముడు హీనయాన బౌద్ధము నవలంబించెను. కొంతకాలమునకు దీనిని విడిచి, వసుబంధు వను గురువు ప్రోత్సాహమున, మహాయాన బౌద్ధవాది యయ్యెను. కళింగమునను, మహారాష్ట్రమునను, సంచారమొనర్చి, జీవితముపై సాంధ్యరాగము లలమునప్పుడు, దిఙ్నాగుడు వేంగినగర సమీపమందలి యొక బౌద్ధాలయమునందు నివసించుచు, జీవిత శేషమును గడపెనట. ఈ బౌద్ధ విద్వాంసుడు శతాధిక గ్రంథములను రచించెనని చెప్పబడుచున్నది. శుద్ధతర్క-విద్యకు ఈతడు పునాదివైచెను. తర్కమును వేదాంతమునుండి విడదీసి, దానికొక ప్రత్యేక శాస్త్రప్రమేయమును కల్పించెను. 'ప్రమాణగుణ సముచ్చయము' ఈతని మహోన్నతవాద సరణిని ప్రదర్శించును. దిఙ్నాగుడు కాళిదాస

మహాకవికి సమకాలికుడై క్రీ॥ శ॥ 5 వ శతాబ్ది ప్రారంభమున నుండెను. కాళిదాసుని కీతడు ప్రతిపక్షియని మేఘసందేశ వ్యాఖ్యానములో మల్లినాథసూరి వివరించెను. భావవివేకుడను మరియొక ఆచార్యుడు నాగార్జునమతము ననుసరించినవాడు. ఈతడు ధాన్యకటకమునకు నైరృతి మూలలోనున్న యొకగుహాలో నివసించెను. ఈత డాంధ్రుడుగా దోచును. ఆచార్య నాగార్జునుని 'ప్రజ్ఞాలంప' శాస్త్రముపై ఈతడు వ్యాఖ్యానము వ్రాసెనట.

ఈకాలమున ఆంధ్రులు సముద్రయాన కుశలులుగ నుండిరి. శాలంకాయనరాజులు విదేశాభిగమనమును ప్రోత్సహించిరి. శాసనాలంకారమును బౌద్ధగ్రంథమునందు, ఒక తలైంగు (తెలుగు) రాజు బర్మాలో ఇరావతీ నదీప్రాంతమున రాజ్యము చేసెనని చెప్పబడినది. ఈ రాజు శాలంకాయన కుటుంబమునకు చెందినవాడు కావచ్చునని పరిశోధకులు తలచుచున్నారు. ఈ తెలుగురాజు బర్మాలో బౌద్ధమతవ్యాప్తికి కారణభూతుడయ్యెను. ఇట్లు శాలంకాయనయుగము వలసరాజ్యనిర్మాణయుగ మని చెప్పనొప్పినది.

విష్ణుకుండి వంశము :—ఆంధ్రదేశములో శాలంకాయనుల అధికారమును తుదముట్టించినవారు విష్ణుకుండులు. వీరి జన్మస్థానము గుంటూరుజిల్లా యందలి వినుకొండ ప్రాంతము. వినుకొండకు సమీపమున పసుపులేఱు అను చిన్ననది కలదు. ఇది గుండ్లకమ్మలో బడును. గుండ్లకమ్మకు బ్రహ్మకుండియనుపేరు శాసనములలో గన్పించును. పసుపులేటికే విష్ణుకుండి అనుమరియొక పేరుండియుండును. దానినుండియే వినుకొండకు విష్ణుకుండినపురము అను పేరును, అచ్చట తలమెత్తిన వంశమునకు విష్ణుకుండినులు అను వ్యవహారమును గలిగియుండును. ఈ యన్వయమునందలి రాజులకు 'త్రికూట

1. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఈ వంశమును 'విష్ణుకుండులు' అని వ్యవహరించిరి. ఇదియే సరియైన రూపము కావచ్చును. కాని ఈ రూపము వినుటకంత ఇంపుగా లేదు. బ్రహ్మశ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి గారుకూడ విష్ణుకుండినులు అను రూపమునే ప్రయోగించిరి.

మలయాధిప'అనియు 'భగవత్ శ్రీ పర్వతస్వామి పాదానుధ్యాతస్య' అనియు విశేషణములు శాసనములలో గన్పించుచున్నవి. త్రికూట మనగా కోటప్పకొండ. ఇది నరసారావుపేట తాలూకాలోని యొక శివక్షేత్రము. మలయ మనగా తూర్పు కనుమలు. విష్ణుకుండినులు త్రికూటమలయాధిపతు లనగా ఈ పర్వతములు వారి రాజ్యములో నున్నవన్నమాట. వీరు శ్రీ పర్వతస్వామి పాదముల నారాధించిన వారు. ఇచ్చట శ్రీ పర్వతమనగా శ్రీశైలమహాక్షేత్ర మని గ్రహించ వలెను. బౌద్ధ పుణ్యక్షేత్రమైన నాగార్జున కొండకుగూడ శ్రీ పర్వత సంజ్ఞయుండినట్లు ఇదివరలో చెప్పనైనది. విష్ణుకుండిన రాజులు శ్రీ మల్లికార్జున దేవుని భక్తులు. పై రెండు అంశములనుబట్టి ఈ వంశమువా రాంధ్రదేశమునందే పుట్టి, పెంపొందిరని చెప్పవీలగు చున్నది. కందరపుర రాజులైన ఆనందగోత్రీకులుకూడ త్రికూటాధి పతులమని చెప్పకొనిరి. విష్ణుకుండులకు వీరితో సంబంధముండిన నుండవచ్చును. ఆనందగోత్రీకుడైన అత్తివర్మ తరువాత పాలించిన రాజుల నోడించి, విష్ణుకుండులు వారి రాజ్యము నాక్రమించి యుందురు. తదుపరి వీరు కృష్ణను దాటి, శాలంకాయనులను జయించి వేంగి రాజ్యమును లోబరచుకొనియుందురు.

విష్ణుకుండుల చరిత్ర నిర్మాణమునకు సాధనములైనవి ఐదు రాగిరేకు శాసనములు లభించుచున్నవి. ఈపూరు శాసనములు రెండును, చిక్కుళ్ల, రామతీర్థము, పొలమూరు శాసనములును వీరికి సంబంధించియున్నవి. విష్ణుకుండినుల వంశవృక్షమును నిర్మించుటలో పరిశోధకులు వివిధమార్గముల పోయిరి. మాధవవర్మ నామధేయులీ కుటుంబములో కడు ప్రసిద్ధులు. ఈ పేరు వహించినవారు ఇద్దరని కొందరును, ముగ్గురని కొందరును, నల్గురని వేరొకరును ఇట్లు చారిత్ర కులు భిన్నాభిప్రాయులై యున్నారు.[1] ఇచ్చట మేము మాధవవర్మ నామధేయులు ముగ్గురని గ్రహించుచున్నాము. విష్ణుకుండిన రాజ్యము

1. Early Dynasties of Andhra Desa.

స్థాపింపబడు కాలమున దక్షిణదేశపరిస్థితు లిట్లుండెను. పల్లవులు కదంబులతో పోరాడుచు క్షీణసత్త్వు లగుచుండిరి. కృష్ణకు దక్షిణమున తమ యధికారము విష్ణుకుండినుల వశమగుచున్నను, పల్లవులు ఉపేక్షింపవలసినవారైరి. ఆంధ్రదేశమునకు పశ్చిమముననూ, ఉత్తరముననూ వాకాటక వంశమువారు మహాశక్తిసమన్వితులై యుండిరి. విష్ణుకుండి వంశ స్థాపకుడైన ప్రథమ మాధవవర్మ మహారాజు గొప్ప పరాక్రమశాలియై అనేక శత్రురాజులను జయించెను. ఈతడు బలవంతులైన వాకాటకరాజుల కన్యను పెండ్లియాడి, వారికి బంధువై తన బలమును పెంపొందించుకొనెను. వాకాటకుల ప్రాబల్యమును గుర్తించి, గుప్తచక్రవర్తి రెండవ చంద్రగుప్తుడు తన కుమార్తెయైన ప్రభావతీదేవిని, వాకాటక రెండవరుద్రసేనున కిచ్చి పెండ్లి చేసెను. ఇట్లే కదంబులుకూడ వాకాటకులతో పరిణయసంబంధములను కలుపుకొనిరి కదంబరాజు మొదటి కృష్ణవర్మ కుమార్తె అజిత భట్టారికను వాకాటక నరేంద్రసేనున కిచ్చిరి. ఇట్లు గుప్త—వాకాటక—కదంబ—విష్ణుకుండి వంశములు పెండ్లి పేరంటములచే బీరకాయపీచువలె కలసిపోయెను.

మొదటి మాధవవర్మ అప్రతిమశక్తి సమన్వితుడై పదునొకండశ్వమేధములును, వాజపేయము, సర్వమేధము, యుధ్యాషోడశి, ప్రాధిరాజ్యము, రాజసూయము, పురుషమేధము మొదలగు మహాక్రతువులను పెక్కింటిని చేసి, విష్ణుకుండిన ప్రాభవమును జగమునకు చాటెను. ఈ యుగమున చెల్లుబడిగల రాజులందరును, అశ్వమేధాది యాగముల నాచరించి, తమ వైదికమత నిరతిని ప్రకటించుకొనుచు, సామ్రాజ్యస్థాపనకు అఱ్ఱులు సాచుచుండిరి. వాకాటకు లశ్వమేధయాజులు. వాకాటకుల బంధువులైన భారశివనాగులనువారు, గంగాతీరమున, వారణాసివద్ద దశాశ్వమేధముల చేసిరట. కాశీనగరమందలి దశాశ్వమేధఘట్టమున కాపేరు భారశివనాగుల యజ్ఞాచరణమువలననే కలిగినదని చెప్పుచున్నారు. దిగ్విజయ సూచకముగ అశ్వమేధమును చేయుటతో తృప్తిపడక, మాధవవర్మ రాజసూయము,

పురుషమేధమువంటి, మనుష్య పశు హింసాత్మకము లైన యాగములుచేయుట, గమనింపదగినది. దీనినిబట్టియే ఈకాలము నకు భూతదయాపరమైన బౌద్ధమతము ఆంధ్రదేశములో బొత్తిగా వెనుకబట్టెననియు, దాని స్థానమున కర్మమార్గ ప్రేరితమైన వైదిక మతము, మహాబలముతో ప్రబలుచుండెననియు చెప్పవచ్చును. ప్రజానీకము బహుళ క్రియాకలాపముగల, ఈయాగములను వీక్షించి, అవబృథస్నానమాచరించి, పవిత్రులమైతి మని భావించుచుండిరి. ఇట్లు జనులు బౌద్ధమతముపై విరక్తిగలిగినవారైరి. వైదిక సంస్కృతి ప్రబలి బౌద్ధ సంస్కృతి అంతర్హితమగుచుండెను. బౌద్ధుల పుణ్యక్షేత్రములును, స్తూపసంఘారామాదులును వైదికమతాను యాయులకు నిలయములు కాజొచ్చెను. జగత్ప్రసిద్ధమైన అమరావతీ మహాక్షేత్రము బౌద్ధుల హస్తములనుండి తొలగిపోయి, శైవ స్థానమై అమరేశ్వర క్షేత్రముగా పరిణమించెను. ఈపరిణామము వైదికమతాభిమానులును, మల్లికార్జున శివభక్తులును, అగు విష్ణు కుండిన రాజుల కాలమున జరిగియుండునని విశ్వసింపవచ్చును. ఈ వంశమునందలి రెండవ మాధవవర్మకు అమరపురము రాజధానిగా నుండెను. అమరపురము ధాన్యకటక-అమరావతి యని యూహింప వచ్చును. కావున అమరావతీ స్తూపము దేవాలయముగ మారుట ఈతని పరిపాలనాకాలమున సంభవించియుండును. మొదటి మాధవ వర్మ క్రీ॥ శ॥ 420-55 నడుమ గొప్ప వైభవప్రాభవములతో వేంగి దేశము నేలెను.

మాధవవర్మ కుమారుడు దేవవర్మ మూడేండ్లు పరిపాలన చేసెను. దేవవర్మ కుమారుడు రెండవ మాధవవర్మ (458-488) పరాక్రమ వంతుడైన రాజు.

రెండవమాధవవర్మ తరువాత రాజ్యముచేసినవాడు మొదటి విక్రమేంద్రవర్మ. ఈతడు మొదటి మాధవవర్మకు వాకాటక రాజ కుమార్తెయందు జన్మించిన పుత్రుడు. ఈతని కాలమున వాకాటక రాజైన హరిసేనుడు—(487-510) మహాసమర్థుడును ప్రతాపశాలి

సోమవంశిరాజుల రాజధానికి త్రివరనగర మనుపేరుండెను. దీనిని బట్టియే మూడవ మాధవవర్మకు త్రివరసుందరీ ప్రియుడు అను బిరుదు వేయబడెను. ఈతడు కళింగ దేశములోనికికూడ తన యధికార మును విస్తరింపజేసెను. ఇతని తరువాతి విష్ణుకుండి రాజ్యచరిత్ర తెలియదు. మాధవవర్మకు మంచెణ భట్టారకుడను పుత్రుడొక డుండెననియు, నితని రాజ్యకాలముననే చాళుక్య లెత్తివచ్చి, వేంగీదేశమును జయించి, తమ యధికారమునచట స్థిరముగ స్థాపించి రనియు, కొందరు పరిశోధకు లభిప్రాయ పడుచున్నారు.

ఐదవ శతాబ్ది చరమపాదమునందు చాళుక్య విజయాదిత్యుడు త్రిలోచన పల్లవునితో పోరాడి సంహరింపబడెనని చెప్పితిమి. చాళుక్యులంతటితో నశించలేదు. మొదటి పులకేశి (క్రీ॥ శ॥ 540–566) పరాక్రమ శాలియై, కదంబుల నోడించి వాతాపినగరము రాజధానిగా, చాళుక్య రాజ్యమును స్థాపించెను. పులకేశి కుమా రులు కీర్తివర్మ మంగళేశులు వరుసగా రాజ్యముచేసి చాళుక్య సామ్రాజ్యమును నలుముఖముల విస్తరింపజేసిరి. కీర్తివర్మ తన యుడు రెండవ పులకేశి క్రీ॥ శ॥ 609–10 లో తన పినతండ్రియైన మంగళేశుని ఓడించి, చాళుక్య సింహాసన మధిష్ఠించెను. రెండవ పులకేశి గొప్ప యుద్ధ తంత్రజ్ఞుడు. మహావిజేత. పరాజయమనునది యెరుగనివాడు. కాన్యకుబ్జాధిపతియైన హర్షవర్ధనుని ఓడించి, తరిమి వేసిన దిట్టరి. రెండవ పులకేశి దక్షిణాపథ చక్రవర్తి కావలెనను దీక్షపట్టినవాడై, దిగ్విజయము చేయుచుండెను. విష్ణుకుండినులు తూర్పుదేశమున ప్రబల రాజ్యముగనుండుట,. ఈతని అభిలాషకు నిరోధక మనిపించెను. కావున ఆంధ్రదేశమును జయించుటకు, పుల కేశి సంకల్పించెను. దీనికి తగిన వ్యూహతంత్రమునుకూడ ఆతడు సిద్ధము చేసికొనెను. మహాకోసలమును జయించి, అచ్చటనుండి దక్షిణముగ కళింగముపైకి, పులకేశి సైన్యములు దిగెను. కళిం గము నేలుచుండిన గాంగవంశమువారు అన్యోన్య కలహములలో మునిగియుండి, పులకేశికి సులభకబళమయిరి. కళింగమును జయించి, పులకేశి పిష్ఠపురము అనబడు పిఠాపురమును పట్టు

కొనెను. ఇచ్చటి దుర్గము దుర్భేద్యమైన దనుప్రతీతి యుండెను. పిఠాపుర పతనముతో పులకేశి సైన్యములు విష్ణుకుండినుల గడప మీద నిల్చినట్లయ్యెను. వేంగిపుర సమీపముననున్న కొల్లేటి దుర్గము కడ మహాయుద్ధము రేగి, సరోవర జలము సాంధ్య రక్తిమ నొందినట్లు, పులకేశియొక్క ఐహొలె శాసనము సగర్వముగా ప్రకటించుచున్నది. వేంగిపతనము క్రీ॥ శ॥ 624 ప్రాంతమున జరిగి యుండును. దీనితో విష్ణుకుండినభాను డస్తమించెను. ఆంధ్రదేశము చాళుక్యులకు హస్తగత మయ్యెను.

మూడవ మాధవవర్మ చాల గొప్పవాడు. ఈతనికి జనాశ్రయుడను బిరుదుండెను. అనగా నితడు ప్రజారంజకుడుగా నుండె నన్నమాట. ఈతడు పరమధార్మికుడనియు, గొప్ప న్యాయబుద్ధి కలవాడనియు కీర్తివడసెను. ఈతని న్యాయప్రీతిని గురించి కథలు చెప్పబడుచున్నవి. ఒకప్పుడీతని కుమారుడొకడు రాజ్యమునందలి యొక పేదరాలి కుమారునిపై రథము పోనిచ్చి, వాని మరణమునకు కారకుడయ్యెనట. ముసలి పేదరాలు మాధవవర్మతో ఈ విషయము మొరపెట్టుకొనెను. న్యాయవిచారణ చేయించి, రాజు తన కుమారునకు మరణదండన విధించెను. అమాత్యులందరు ఆశ్చర్యచకితులై. రాజకుమారుడు కనుక ప్రాణదండన విధించవలదని, మాధవవర్మ మహారాజునకు విజ్ఞప్తిచేసిరట. కాని న్యాయైకబుద్ధియు, సమదర్శియు, అగు నారాజు తన కుమారునిపై మరణదండనమును అమలుజరుపుటకే శాసించెను. ఈ మహారాజుయొక్క ధర్మప్రియత్వమునకు సంతోషించి, ఇంద్రకీల పర్వతముపై వేంచేసియున్న భగవంతుడైన మల్లికార్జునస్వామి రాజకుమారుని, పేదరాలి సుతుని కూడ బ్రతికించి బెజవాడలో కనకవర్షము కురిపించెనట. ఈకథయొక్క సత్యాసత్యము లెట్లున్నను మాధవవర్మ న్యాయప్రియుడనుటకు ఇతర నిదర్శనములుకలవు. ఈతనికి 'అనసితవివిధదివ్య' అని వర్ణనము శాసనములలో గాన్పించును. 'దివ్య' అనగా న్యాయ పరిశీలనకై చేయు పరీక్షా విధానము. పూర్వకాలములో నేరస్థులను పరిశీలించుటకై అద్భుత పరీక్షలు చేయుచుండిరి. అగ్నిపరీక్ష,

జలపరీక్ష, విషపరీక్ష మొదలైనవి దివ్యములు. నేరస్థుడు ఈ విషమ పరీక్షలను గడచినచో, నేరము చేయలేదని సిద్ధాంతీకరించెడివారు. మాధవవర్మరాజు తన రాజ్యములో న్యాయాచరణమునకై, చక్కని కట్టుబాట్లు చేసెననియు 'దివ్యము' లను పట్టుదలతో అమలుపరచె ననియు చెప్పవచ్చును.

జనాశ్రయ ఛందోవిచ్ఛితి అను నొక ఛందోగ్రంథము కలదు. జనాశ్రయబిరుదు మూడవ మాధవవర్మ కుండెను. కావున ఛందస్సు నాతడు ప్రోత్సహించుట జరిగియుండును. దీనిని రచించినవాడు గణ స్వామి. దీనిలో సంస్కృతవృత్తములతో పాటు జాతి ఛందస్సులు కూడ పేర్కొనబడుట యొక విశేషము. శీర్షకము లను పేరితో సీస పద్యములు. గీతపద్యము, ద్విపద, మొదలగు తెలుగు ఛందస్సులును ఇందు ప్రశంసింపబడినవి.

విష్ణుకుండిన యుగము ఆంధ్ర దేశచరిత్రలో మహోజ్జ్వలమైన అధ్యాయమని చెప్పదగును. ఈకాలమున మధ్య దేశమునందును, కాన్యకుబ్జ మహాకోసలములందును, ఆంధ్రఖడ్గము తన వాడిమి చూపెను. విష్ణుకుండిన శాసనములు సంస్కృతములో నున్నవి. ఈ కాలమున ప్రాకృతము శాసనములనుండి క్రమముగ తొలగిపోయి, దాని స్థానమును గీర్వాణభాష యలంకరించెను. దేశభాషయగు తెలుగున కింకను ప్రాముఖ్యమురాలేదు. కాని తెలుగు వ్యాప్తిలో నుండెననుట నిశ్చయము. రెండవ విక్రమేంద్రవర్మ చిక్కుళ్ళ శాస నములో 'విజయరాజ్య సంవత్సరం బుళ్' అను ప్రయోగము కలదు. ఇది తెలుగు బహువచన ప్రత్యయమైన 'లు' యొక్క పూర్వరూప మనుట నిర్వివాదము. విష్ణుకుండినులకు వేంగిపురము, దెందులూరు (లెందులూరు అని శాసనములలో దీని రూపము) బెజవాడ అప్ప టప్పట రాజధానులుగా నుండెడివి. వీరు సింహలాంఛనులు; వీరి నాణెములమీదను, వీరు దొలిపించిన గుహాలయములలోను, తోక యెత్తి లంఘింపబోవు ఆకారముతోనున్న సింహము ప్రత్యక్ష మగును. విష్ణుకుండినులకు పూర్వము ఆంధ్ర దేశములో వెలసిన శిల్పమంతయు బౌద్ధ శిల్పము. అప్పటి స్తూపగుహావిహార సంఘా

రామము లన్నియు బౌద్ధసంఘ ప్రయోజనముకొరకు కట్టబడినవి. శాలంకాయనుల కాలములో మొట్టమొదటిమాటు హిందూ దేవాలయముల మాట వినవచ్చుచున్నది. వేంగియందలి చిత్రరథ స్వామి ఆలయము, పాలూరునందలి విష్ణుగ్రహస్వామి దేవాలయము, ఆనాడు ప్రసిద్ధములు. వేంగి, దెందులూరు ప్రాంతములందు ప్రాచీన శివాలయములు శిథిలప్రాయముగ పరిదృశ్యము లగుచున్నవి. విష్ణుకుండినులు కలకాలము నిలువగల, దేవాలయములను నిర్మించి, హిందూమతమున కుపకారము చేసిరి. బౌద్ధుల యుదాహరణమును గైకొని వీరును పర్వతములందు గుహాలయములు దొలిపించిరి. ఇటుక నిర్మాణము లైనచో అవి యెప్పుడో నశించియుండును. ఇట్టి గుహాలయములు బెజవాడవద్ద ఇంద్రకీలాద్రిమీదను, ఉండవల్లి. మొగల్రాజపురములలోను, నెల్లూరిజిల్లాలోని భైరవుని కొండవద్దనుకలవు. ఇవి గుంటుపల్లి వద్దను కోరుకొండవద్దను ఉన్న పూర్వ బౌద్ధాలయముల యొరవడిలో త్రవ్వబడినవి. ఈ గుహాలలో స్తంభములపై నిలిచిన యొక మంటపమును, దానివెనుక విగ్రహస్థానముగ నుండదగిన చిన్నగదియు మాత్రమున్నవి. వీనిలో కొన్ని శివాలయములు. కొన్ని విష్ణ్వాలయములు. ఉండవల్లి గుహాలయములో సర్వాంగసుందరమై, తాళవృక్ష ప్రమాణమైన, అనంతశయన విగ్రహము శేషపర్యంకముమీద పండుకొన్నట్లు చెక్కబడియున్నది. భైరవుని కొండ శివారాధనకు నిలయము. విష్ణుకుండిన గుహాలయములు నిష్ఠుర నిరాడంబరములై, యున్నవి. వీనిలో లలితశిల్పము లేనిమాట వాస్తవము.

ఈ యుగమునందు ఆంధ్రదేశములో గొప్ప మత పరిణామము జరిగెను. క్రీ॥ పూ॥ 300 నుండి క్రీ॥ శ॥ 300 వరకును బౌద్ధమత మీ దేశములో మూడు పూవులు ఆరు కాయలు కాచెను. రాజానుగ్రహము, ప్రజాదరము, శిల్పము, కళలు, వాఙ్మయము అన్నియు బౌద్ధముయొక్క మహత్త్వమునకే తోడ్పడినవి. బౌద్ధమతముయొక్క భూతదయాపరత్వము, బౌద్ధభిక్షుభిక్షుకీగణముల నిరాడంబర జీవితము, నైతికౌన్నత్యము, శీలసంపద, ప్రజాసేవా పరాయణత్వము, దేశ

భాషా ప్రియత్వము మున్నగు అనేక హేతువులు బుద్ధధర్మము సంఘములో నిరాటంకముగ వ్యాపించి వేళ్లు పారుటకు మూలమయ్యెను. కాని కాలక్రమమున బౌద్ధపరిస్థితులు తారుమారయిపోయెను. ఆచార్య నాగార్జునుని మహాయానపంథ భక్తిమార్గమును లేవదీసెను. బుద్ధుడొక పూజనీయుడైన పరదైవతముగా వెలసెను. ఈతని కెందరో పరివార దైవతములును, వారికి భార్యలుగా స్త్రీదైవతములును సృష్టింపబడిరి. బోధిసత్త్వులు హిందువుల పురాణములందలి మహర్షులు, మునులుగా పరివర్తనము నొందిరి. బౌద్ధులు శాక్యమునికిని, బోధిసత్త్వులకును, విగ్రహములు కల్పించి యారాధింప మొదలిడిరి. ఇట్లు హిందూదేవతలకును బౌద్ధ దేవతలకును భేదమేమో ప్రజలకు తెలియరాకుండెను. రెండు మతములును కలిసిపోయి, బౌద్ధముయొక్క ప్రత్యేకత నశించెను. బుద్ధభగవానుడు హిందువుల దశావతారములలో నొక యవతారముగ స్వీకరింపబడెను.

బౌద్ధమతముయొక్క క్షీణదశ ఇంతటితో నాగలేదు. వజ్రయానమను నొక క్రొత్త విధానము బౌద్ధసంఘములో పొడచూపెను. ఇందు తాంత్రికపూజలు, రహస్యక్రియాకలాపము, అంగములుగా నుండెను. మధుమాంస వినియోగము, శక్తిపూజలు మొదలగునవి వీని వెనువెంట బయలుదేరెను. బౌద్ధసంఘమునందు అవినీతి త్వరలోనే వాపించెను. [1]విహారములు, సంఘారామములు, దుర్నీతి కాటపట్టు లగుట గాంచి ప్రజలు బౌద్ధమతమును రోసిరి. బౌద్ధసన్న్యాసుల నైతిక పతనమే మతమునకు గొడ్డలిపెట్టయి, అది త్వరలో నశించెను. ఆంధ్ర జీవితమునకు వెల్గయి ఆంధ్ర సంస్కృతికి చిరకాలము వెన్నెముకయైన పవిత్ర బౌద్ధమతము, తెలుగుదేశములో నామరూపములు లేకుండ పోయెను.

జైనమతముకూడ విష్ణుకుండిన యుగమునందు ఆంధ్రదేశమున తన పట్టు పోగొట్టుకొనెను. కన్నడదేశమునందువలె జైన

1. బౌద్ధాలయములను లంజదిబ్బలని ప్రజలు నిర్దేశించుచుండిరి. బౌద్ధసన్న్యాసులను ఒకప్పుడు స్వామిని యని భూషించెడివారు. స్వామిని యను పదమే పానిగామారి నింద్యార్థములో వాడబడజొచ్చెను.

మతము ఆంధ్రదేశములో విరివిగా వ్యాపించలేదు. తూర్పుగోదావరి జిల్లాలో తాటిపాక, నేదునూరు, గ్రామములందును తెలంగాణములో అనుమకొండవద్దను, జైన విగ్రహము లిప్పటికిని నిల్చియున్నవి. పూర్వము కళింగమును శాసించిన ఖారవేలుడు, జైనమతస్థుడై యా మతమును పోషించెను. జినమతమును ఖండించినవాడు కుమారిల భట్టాచార్యుడు. ఈయాచార్యుడు ఆంధ్రోత్కలదేశముల నడుమ మహానదియొడ్డున జయమంగళ మను గ్రామమునందు జన్మించెను. ఈతని తల్లిదండ్రులు చంద్రగుణా యోగీశ్వర భట్టులను బ్రాహ్మణ దంపతులు. కుమారిలభట్టు ఆంధ్రుడని యంగీకరింపబడినది. క్రీ॥ శ॥ ఏడవ శతాబ్దిలో నీత డుండెననియు, ఆచార్య శంకరునికి కొంచెము పూర్వుడనియు తెలియవచ్చుచున్నది. కుమారిలభట్టు మహామేధా వియై, వేదవేదాంగములు చదివి. ఒక యుక్తిచే జైనుల మత గ్రంథ ములను వారికడనే అభ్యసించి, ఆ మతఖండనమునకు పూనుకొనెను. ఈతడు పూర్వమీమాంసావాది. "యజ్ఞయాగాది కర్మాచరణమువల ననే ముక్తి కలుగును. వేదములు అపౌరుషేయములు, పరమ ప్రమాణములు" అని యీతని సిద్ధాంతము. జైమిని మహర్షి పూర్వము వ్రాసిన పూర్వమీమాంసా సూత్రములపై కుమారిలభట్టు తంత్ర వార్తికభాష్యము అను మహాగ్రంథమును రచించెను. ప్రభాకర భట్టు [1] మొదలైనవా రితని శిష్యులు. వారును వేదప్రతిపాదితమైన కర్మమార్గమునే ప్రచారము చేసిరి. వేదవిద్యకు దేశమునందు గొప్ప పరపతి యేర్పడెను. ఈ కాలపు దానశాసనము లన్నిటను చతుర్వేద పారీణులైన బ్రాహ్మణులే వినవత్తురు.

విష్ణుకుండిన చక్రవర్తులు వైదికమార్గనిరతులై, కర్మాచరణ మును దీక్షతో నడపిరి. వీరు వేదాది విద్యలను విస్తారముగ పోషిం

1. కర్మప్రధానవాదులైన శబరస్వామి ప్రభాకరభట్టులు కుమారిల భట్టా చార్యునికి పూర్వులని యొకమతము, **An advanced History of India-Page 205 by R. C. Majumdar etc.** నవకథామంజరీలో బ్రహ్మశ్రీ పెండ్యాల సుబ్ర హ్మణ్య శాస్త్రిగారి మతమును మేము ప్రమాణముగా గ్రహించినాము.

చిరి. [1] వీరిలో కొందరు వేదాధ్యయనము చేసినట్లుకూడ కొన్ని నిదర్శనములు కలవు. చిక్కుళ్ళ పొలమూరు శాసనములందు ప్రతి గృహీతలైన బ్రాహ్మణులు రాజులకు సబ్రహ్మచారులుగా చెప్ప బడిరి. సబ్రహ్మచారి యనగా సహపాఠి, సహాధ్యాయుడు.

## కళింగ చరిత్ర

గోదావరినుండి మహానదివరకు వ్యాపించిన దేశము కళింగ మని వ్యవహరింతురు. దీనికి పశ్చిమ సరిహద్దులు శబరి తేలి మహా నదులు. తూర్పున బంగాళాఖాతము దీని యెల్ల. కళింగమునకు ఉత్తరమున నున్న దేశము ఉత్కల లేక ఉత్తర కళింగము. ఋషి కుల్యానది ఆంధ్ర దేశపుటుత్తరసరిహద్దుగ చెప్పియున్నాము. కళింగ దేశములో అత్యధిక భాగము ఆంధ్రుల నివాసస్థానముగా నున్నది. కావున ఈ ప్రాంతముయొక్క ప్రాచీన చరిత్ర మన కవశ్యపఠనీయ మగుచున్నది.

శాతవాహనయుగమున ఖారవేలు డను పరాక్రమశాలియైన రాజు కళింగము నేలినట్లు చెప్పబడియున్నది. ఈతడు మొదటి శాత కర్ణికి సమకాలికుడు. ఖారవేలుడు మగధపై పలుమారు దండెత్తి, పుష్యమిత్రుని ఓడించెను. ఖారవేలుడు జైనమతాభిమాని. ఓఢ్ర దేశమునందు ఉదయగిరి, ఖండగిరి, యను కొండలను దొలిపించి శిల్పముతో సుందరమైన గుహాలయములు నిర్మించి, జైన సన్న్యాసు లకు సమర్పించెను. ఈతని హాతిగుంఫశాసనమునుగూర్చి చదివి యున్నాము. ఖారవేలుని యనంతరము కళింగచరిత్ర తెలియరాదు. ఈ దేశము పర్వతారణ్యమయమై ఉండును. ఇచ్చట ఒక స్థిరమైన కేంద్రప్రభుత్వ మేర్పడుటకు పరిస్థితులు అనుకూలముగా లేవు. తఱచు చిన్నచిన్న రాజ్యములు పుట్టుచు, అన్యోన్యయుద్ధములుచేసి, కూలిపోవుచు ఉండుట గమనింతుము. సముద్రగుప్త చక్రవర్తి దక్షిణదేశ దిగ్విజయము చేసినప్పుడు, కళింగము నాలుగు రాజ్య

1. చూడు-వ్యాసము 'ఆంధ్రదేశము—వేదప్రచారము' శ్రీ పెండ్యాల సుబ్ర హ్మణ్య శాస్త్రిగారు. ఆంధ్రపితామహ మాడపాటి హనుమంతరాయ షష్టిపూర్తి సంచిక.

ముల క్రింద నుండెను. గిరికొత్తూరును స్వామిదత్తుడును, హేరండ పల్లిని (ఆముదాలవలస) దమనుడును. దేవరాష్ట్రమును కుబేరుడును, పిష్టపురమును (పిఠాపురము) మహేంద్రుడును పాలించు చుండినట్లు సముద్రగుప్తుని అలహాబాదు శాసనమువలన తెలియ వచ్చుచున్నది. దేవరాష్ట్రమనగా విశాఖపట్టణము జిల్లాలోని ఎలమంచిలి ప్రాంతము. ఇట్టి చిన్నరాజ్యము లన్నియు కళింగ దేశములో నుండెను.

సముద్రగుప్తుని దండయాత్ర తరువాత నొకటి రెండు చిన్న వంశములు తలయెత్తి కళింగదేశమునంతను ఏకపరిపాలన క్రిందికి తెచ్చుటకు యత్నించెను. వీరిలో మాఠరవంశమువారు ప్రథములు. వాసిష్ఠీపుత్ర శక్తివర్మ యనురాజు ఈ వంశములో మొదటివాడు. క్రీ॥ శ॥ 350 ప్రాంతమున నీతడు పిష్టపురము రాజధానిగా కళింగము నంతను ఏలజొచ్చెను. ఈతని మనుమడు రెండవ శక్తివర్మకూడ సమర్థుడైన రాజు. శాలంకాయనుల యొత్తిడిని తప్పించుకొనుటకును, దేశమధ్యమునందుండుటకును, కాబోలు ఇతడు తన రాజధానిని పిఠాపురమునుండి మార్చి, ఇంకను ఉత్తరమున సింహపురము (సింగుపురము)ను ముఖ్యపట్టణముగా చేసికొనెను. ఈ వంశ నృపతులు 'కళింగాధిపతి' యను బిరుదు చెల్లుచుండెను. వీరు తొలుదొల్త శాతవాహనులు, ఇక్ష్వాకులు, మున్నగువారివలె తమ మాతృనామములతో పరగుచుండిరి. వాసిష్ఠీపుత్ర శక్తివర్మయే దీని కుదాహరణము. తరువాత వీరీ యాచారమును త్యజించి, శాలంకాయనులు పల్లవులు మున్నగు వారివలె 'పితృభక్తులు' అని వర్ణించుకొనిరి. మాఠరవంశీయులగూర్చి మరియొక విశేషాంశము కలదు. ఆ కాలపు రాజులు పరమమాహేశ్వరులో, పరమభాగవతులో అయియుండుట సర్వసాధారణము. మాఠరరాజులు అటుగాక తాము 'పరమదైవతులు' అని చెప్పుకొనుచుండిరి. అనగా వీరు సమస్త దేవతలను తుల్యభక్తితో, చూచువారన్నమాట. దీనినిబట్టి వీరి ప్రశంసనీయమైన మతసహనము వ్యక్తమగుచున్నది. మాఠరులుకూడ వేద

మతాభిమానులై, బహుశ్రుతులైన బ్రాహ్మణులకు అగ్రహారములు దానము చేయుచుండిరి. వీరిలో చండవర్మ ఉమావర్మ విశాఖవర్మ యను రాజులు పాలనము చేసినతరువాత క్రీ॥ శ॥ 440 ప్రాంతమున మాఠరవంశ మంతరించెను.

మాఠరవంశమువారి తరువాత, వాసిష్ఠీవంశమువారు కళింగ ములో ఏకాధిపత్యమునకై కృషిచేసిరి. వీరు మాఠరుల బంధువులై యుందురు. ఈ వంశములో గుణవర్మ, ప్రభంజనవర్మ, అనంతవర్మ యను రాజులు శాసనములవలన తెలియవచ్చుచున్నారు. దేవ రాష్ట్రమునందలి దేవపురము వీరి రాజధాని. ఈ దేవపుర మిప్పుడు గుర్తించుటకు వీలులేదు. కళింగదేశముయొక్క ముఖ్యపట్టణములు తరుచు మారుచుండును. మొదట పిఠాపురము వీరి రాజధాని. తరు వాత వంశధారానది మీదనున్న సింహపురము, వర్ధమానపురము, సిరిపురము కొంతకాలము రాజధానులుగ నుండెను. రాజ్యమునందు స్థైర్యము లేకపోవుటచేతను, ఇరుగుపొరుగు రాజుల దాడులకు నిలువ లేకయు, రాజులిట్లు తమ ముఖ్యనగరములను మార్చుకొనుచుండిరి. వాసిష్టీవంశమువారిలో అనంతవర్మయే మిక్కిలి సమర్థుడైన రాజు. ఈతడు పరమమాహేశ్వరుడు, మాతాపితృభక్తుడు, ప్రజాహిత రతుడు అని శాసనములు వర్ణించుచున్నవి. ఈ వంశమువారి పరిపాలన క్రీ॥ శ॥ 485 ప్రాంతమున అంతమొందెను.

## గంగవంశము

కళింగదేశమున, తొమ్మిది శతాబ్దముల పర్యంతము అవిచ్ఛిన్నముగ పాలించిన తూర్పు గంగవంశము మిక్కిలి పొగడ దగినది. ఇంత దీర్ఘ కాల మేవంశమువారును భూపరిపాలనము చేసినట్లు కాన్పించదు. ఈ వంశములో మహా సమర్థులైన రాజులు పలువురు ఉండిరి. తూర్పుగాంగులు తమపేర నొక నూతన శకమును స్థాపించిరి. దీనిని గాంగశకము అందురు. [1]ఇది క్రీ॥ శ॥ 497 సం॥ న

1. Early dynasties of Andhra desa.

ఆరంభించినట్లు చారిత్రకులు తలచుచున్నారు. ఇప్పటినుండి క్రీ॥ శ॥ 1435 లో సూర్యవంశజులైన ఒడ్డె గజపతులు, ఈ ప్రాచీనరాజ కుటుంబమును అంతమొందించువరకును, గంగ వంశమువారు కళింగదేశమును శాసించిరి. మహావైభవదశలో, గంగరాజ్యము ఉత్తరమున గంగానదినుండి దక్షిణమున గోదావరివరకును వ్యాపించి యుండెను. దంతపురము గాంగుల మొదటి రాజధాని. ఇది కడు ప్రాచీనమైన నగరము. బుద్ధభగవానుని పవిత్రదంతము నిచ్చట ప్రతిష్ఠించి, దానిపై స్తూపము కట్టిరనియు, అందుచే దీనికి దంతపుర మను ప్రతిష్ఠ వచ్చెననియు, చెప్పెదురు. ఆముదాలవలసకు, సమీప మున దంతవరపు కోటయను గ్రామమున్నది. ఇచ్చట ప్రాచీన కాలపు శిథిలములెన్నియో కన్పించును. దంతవరపు కోటయే దంత పురమని తలంపబడుచున్నది.

మైసూరులోకూడ మరి యొక గంగ వంశముండెడిది. వీరిని పశ్చిమగాంగులు లేక జాహ్నవేయు లనుచున్నారు. ఈ గంగాజను లందరును, ప్రాచీన కాలమున గంగా తీరమునుండి దక్షిణమునకు వలసపోయిరి. మెగాస్తనీసు వీరిని 'గంగరిడై' అని పేర్కొనెను. తూర్పుగాంగుల పూర్వీకులు మైసూరు రాజ్యములోని, కోలారు నంది దుర్గములలో, పాలన చేయుచున్నట్లు అర్వాచీన గాథలుగలవు. వీరిలో కొందరు సాహసికులు కళింగదేశము ప్రవేశించి, యచ్చట పరాక్రమము నెరపి, రాజ్యనిర్మాణము చేసిరి. వీరు మహేంద్రగిరి పర్వతముమీది, గోకర్ణస్వామి భక్తులు. తూర్పు గంగవంశము వారిలో అధిరాజ ఇంద్రవర్మయను నాతడు మొదట ప్రసిద్ధికివచ్చెను. ఈతడు విష్ణుకుండిన రాజైన ఇంద్రభట్టారకవర్మకు సమకాలికుడును, ఆతని ప్రత్యర్థియునై యుండెను. విష్ణుకుండిన రాజ్యమునకు ద్రోహు లైన సామంతులను చేరదీసి, ఈతడు ఇంద్రభట్టారకవర్మను యుద్ధ ములో చంపెను. క్రొత్తగా స్థాపింపబడిన గంగవంశము వారికిని, ఇరుగుపొరుగు రాజులకును, తరుచు సంగ్రామములు నడచుచుండెను. ముఖ్యముగా విష్ణుకుండినులు తమ యధికారమును కళింగములో

వ్యాపింప దలచినవారు గనుక వారికిని గంగరాజులకును సహజ వైరముండెను. అధిరాజ ఇంద్రవర్మకు 'త్రికళింగాధిపతి' యని బిరుదు. ఈతని రాజధాని దంతపురము. కొంగోడ (కొన్యోధ) రాజులైన శైలోద్భవులును, మహాకోసల పాలకులైన సోమవంశీయులును, కూడ తూర్పు గాంగులకు ప్రక్కలో బల్లెమైయుండిరి. ఇట్లిందరు శత్రువులచే చుట్టుముట్టబడియు, గంగవంశమువారు ఒకప్పుడు పరాజయము నొందుచు, మరియొకప్పుడు విజయము చేపట్టుచు, తమ యస్తిత్వమును కాపాడుకొనుచువచ్చి, అనంతర కాలమున సుప్రసిద్ధి గడించిరి. ఈ వంశములోని హస్తివర్మ (క్రీ॥ శ॥ 570-580) కాలమునుండియు, దంతపురమునువీడి, కళింగనగరమును వీరు తమ రాజధానిగ చేసికొనిరి. వంశధారానదికి ఉత్తరపు టొడ్డున నున్న ముఖలింగక్షేత్రమే కళింగనగరముగా గుర్తింపబడినది. ఇచ్చట మధుకేశ్వరస్వామి ఆలయముకలదు. కళింగనగరము నదీతీరమున నుండుటచే, నిది దంతపురముకన్న ఎక్కువ ఉపయోగకరముగ నుండియుండును. మరియు నీనగరము 'సర్వఋతు సుఖరమణీయము' అని శాసనములలో పొగడబడుటచే దీని శీతోష్ణస్థితులు ఆకర్షణీయముగ నుండియుండును.

క్రీ॥ శ॥ ఏడవశతాబ్ది ప్రారంభమున విష్ణుకుండిన రాజ్యమంతరించెను. శైలోద్భవులు, సోమవంశీయులుకూడ క్రమముగా రంగము నుండి తొలగిరి. క్రీ॥ శ॥ 624 లో పులకేశి కళింగమును జయించెను. ఆతని కళింగ ప్రతిస్పర్ధులెవరో తెలియక పోయినను, పూర్వగాంగవంశజులని యూహింపవచ్చును. వేంగియందు పూర్వచాళుక్యుల పరిపాలన ప్రారంభమైనప్పటినుండియు, వారు కళింగాధిపత్యము విషయమై పూర్వగాంగులకు ప్రతిస్పర్ధులుగా నిలిచిరి.

క్రీ॥ శ॥ వేయి సంవత్సరములకు పూర్వము పాలించిన గంగ వంశమువారిని పూర్వగాంగులనియు, తరువాత పరిపాలన చేసిన వారిని అర్వాచీనగాంగులనియు చారిత్రకులు వ్యవహరింతురు. గంగ రాజులలో మొదటివారు శైవమతాభిమానులు. తరువాతివారు

వైష్ణవులు. వీరు గొప్ప దేవాలయములు నిర్మించిరి. ముఖలింగము శ్రీకూర్మము, పూరీ, జగన్నాథాలయము, కోణార్కములోని సూర్య దేవాలయము, మొదలగునవి వీరి నిర్మాణములు.

కళింగచరిత్రలో మరువరాని ముఖ్యాంశము ఈ దేశ ప్రజల సముద్రయానప్రీతి. కళింగాంధ్రులు ప్రాచీనకాలమునుండియు స్వదేశము వీడి, మహాసముద్రములను తరించి, తూర్పుసముద్రదేశములకును, దీవులకును, వలసపోవుచుండిరి. కళింగదేశము పర్వతమయమగుటచే, అంతగా సారవంతమైనది కాదు. కావున ఇక్కడి ప్రజలు కరువు కాటకముల నెదుర్కొనవలసి వచ్చెడిది. అదియునుగాక నౌకాయానము వీరికి వెన్నతో బెట్టినవిద్య. సముద్రము వీరి యింటి గడపనంటి యుండుటచే, కళింగాంధ్రులు మహాసాహసికులైన నావికులుగా నుండిరి. వీరు వందలాది ఓడలలో బర్మా, సయాం, కంబోడియా, మలయా ద్వీపకల్పము, జావా, సుమిత్రా బలి మొదలైన దేశములకు వర్తకము నిమిత్తము, మతప్రచారముకొరకును ప్రయాణములు చేయుచుండిరి. ఈ దేశములలో బంగారము దొరకునను ప్రతీతి యుండెడిది. సువర్ణ ద్వీపము, సుర్ణవభూమి అను పేర్లతో నివి పరగుచుండెడివి. కళింగరాజకుమారులలో సాహసికులైనవారు, దూరదేశములలో రాజ్యస్థాపన చేయు ఆశతో, తూర్పుదేశములకు పోవుచుండిరి. [1] ఈకళింగవర్తకులు సువర్ణదేశము నుండి, చీనాకుకూడ వ్యాపారార్థమై, పోవుచుండిరి. బంగారము, వెండి, తగరము, అగరు, కర్పూరము, ఇతర సుగంధ ద్రవ్యములను, వీరు స్వదేశమునకు దిగుమతి చేయుచుండిరి.

# ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి



## 14-వ ప్రకరణము

## చాళుక్య చోడయుగము క్రీ॥ శ॥ 625-1077-1118

### తూర్పు చాళుక్యులు

దక్షిణ హిందూదేశ చరిత్రయందు మహత్తరమైన పాత్ర నిర్వహించిన రాజవంశములో చాళుక్యులొకరు. వీరిలో బిజాపూరు జిల్లాయందలి బాదామి (వాతాపి) నగరమును రాజధానిగా చేసికొని, పరిపాలించినవారిది మాతృశాఖ. దీనినుండి యెన్నియో చిన్న చాళుక్యకుటుంబములు ప్రభవించినవి. బాదామిచాళుక్యుల తరువాత ప్రశంసనీయమైన చరిత్ర కలవారు, ఆంధ్రదేశమును నాలుగున్నర శతాబ్దుల కాలము పరిపాలనచేసిన తూర్పుచాళుక్యులు. బాదామి, కల్యాణినగరములనుండి పాలించిన చాళుక్యులను, పశ్చిమ చాళుక్యులనియు, ఆంధ్ర చాళుక్యులను, తూర్పు చాళుక్యులనియు, వేంగీ చాళుక్యులనియు వ్యవహరించుచున్నారు. వీరుకాక ఆంధ్రదేశములో వేములవాడ చాళుక్యులు, ముదిగొండ చాళుక్యులు అను చిన్న కుటుంబములవా రున్నారు. గుజరాతు, రాజపుటానాలందు కూడ చాళుక్య వంశమువారు రాజరికముచేసిరి.

చాళుక్యుల జన్మోదంతమును గురించి ఇదివరలో కొంత చెప్పనైనది. పదునొకండు పండ్రెండవ శతాబ్దములందలి చాళుక్య శాసనములలో వీరి వంశోత్పత్తి కథనము, అద్భుతాంశములతో కూడియున్నది. కళ్యాణి ప్రభువైన ఆరవ విక్రమాదిత్యుని యాస్థానమందుండిన బిల్హణకవి, తన విక్రమాంకదేవచరిత్రలో నొక కథ వర్ణించెను. తూర్పు చాళుక్యరాజు విమలాదిత్యుని శాసనములో ఉల్లేఖింపబడిన యాఖ్యానము వేరు. రాజపుత్రులు (సోలంకులు) కల్పించుకొన్న గాథ వేరొక తీరున ఉన్నది. వీరందరి యుబలాటమును ఒక్కటే. చాళుక్యులు ఉత్తమ క్షత్రియులనియు, అసామాన్య జన్మ

ప్రకారము కలవారనియు, దేవతలు వీరిని ప్రత్యేక కార్యసాధనకై భూమికి పంపిరనియు, చెప్పుకొనుట ఈ గాథలలో కాన్పించును. క్షత్రియ కుటుంబముల వారందరును ఆ కాలమున సూర్యచంద్ర వంశములనుండి ప్రభవించినట్లు వంశావళులు సృష్టించుకొనుచుండెడి వారు. మన చాళుక్యులుకూడ మొదట తాము అయోధ్యాపురీ వాసులమనియు, సూర్యవంశోద్భవులమనియు, ప్రకటించుకొనిరి. కాని ఏకారణముననో కాని, తరువాత వీరు సూర్యవంశ సంభూతిని విడిచి పెట్టి, రైలుబండి ఒక పట్టానుండి మరియొక పట్టాకు ప్రాకినట్లు, తాము చంద్రవంశ్యులమనియు పాండవుల సంతతివారమనియు, ఉద్ఘోషించిరి. ఈ పల్లటీలనుబట్టియే చాళుక్యుల ఆభిజాత్యకథలు కల్పిత వృత్తాంతములని గ్రహింపవచ్చును.[1] చాళుక్యులు ఉత్తరాహులు కూడ కారనియు, వారు దాక్షిణాత్యులే యనియు, వారిది వెల్లాళ (కర్షక) కులమనియు, శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగారు వివరించిరి. చాళుక్యులు రాజన్యకులజులుకాని కర్షకులు కారని కొందరు చారిత్రకుల మతము. ఇక్ష్వాకువంశపు రాజుల కాలమున వీరు హిరణ్యరాష్ట్రమున నివసించుచుండిరి. నాగార్జున కొండశాసనములో "స్కంద చలికి రెమ్మణకుడు" అను ఇక్ష్వాకు సామంతుని పేరు చదివి యుంటిమి. చలికి, చల్కి, సల్కి, చాళుక్యపదములు అభిన్న రూపములు. ఈ విధముగ మొట్టమొదటి చాళుక్యపురుషుడు హిరణ్యా రాష్ట్రములో కన్పట్టుచున్నాడు. ఇచ్చటనుండియే చాళుక్యులు తరువాత విజృంభించిరి. వీరిది వరాహలాంఛనము.

త్రిలోచన పల్లవునకును, చాళుక్య విజయాదిత్యునికిని, అయిన పోరాట మీవరకే వర్ణింపబడినది. మొదట పరాజయ మొందినను, చాళుక్యులు వెనుదీయక, స్వతంత్ర రాజ్యనిర్మాణ యత్నమును సాగించిరి. క్రీ॥ శ॥ 6 వ శతాబ్దము వీరి యభ్యుదయమును గాంచెను. జయసింహుడు, రణరాగుడు, మొదటి పులకేశి వల్లభుడు, కీర్తివర్మ మంగళేశులు ఈ క్రమమున బాదామి చాళుక్య రాజులు, పశ్చిమ

1. చూడుః లక్ష్మణరాయ వ్యాసావళి.

చాళుక్య సామ్రాజ్యమునకు బునాదులు వైచిరి. కీర్తివర్మ కుమారుడును మహా పరాక్రమ శాలియునగు రెండవ పులకేశి, ఈపునాదుల పై సువిశాలసామ్రాజ్య భవనమును నిర్మించెను. సత్యాశ్రయ, పృథ్వీవల్లభ బిరుదాంచితుడైన ఈమహారాజు, క్రీ. శ. 609-610 లో సింహాసన మధిష్ఠించెను. ఈతని యాంధ్ర దేశ విజయము విష్ణుకుండిన చరిత్రలో ప్రస్తావింపబడియున్నది. అప్పుడు రామకాశ్యప గోత్రజుడైన రణదుర్జయుని మనుమడు పృథ్వీమహారాజు పిష్టపురమందు నెలకొని, చాళుక్య దండయాత్రను నిరోధించెను. పులకేశి ఈతనిని ఉన్మూలించి, పిఠాపురమును వశపరచుకొనెను. తరువాత కొల్లేటి మీదజరిగిన యుద్ధములో, శత్రువులనోడించి యాదుర్గమును, వేంగీ రాజ్యమును సమస్తము నాక్రమించుకొనెను. ఇట్లు జయించిన రాజ్యమునకు తనకు ఖడ్గసహాయుడై తోడ్పడిన తమ్ముని కుబ్జవిష్ణువర్ధనుని క్రీ॥ శ॥ 624లో పాలకునిగ నియమించెను. అచిరకాలములో ఈతడు పల్లవులను, క్రీ॥ శ॥ 630 ప్రాంతమున కర్మరాష్ట్రముపై నెత్తిపోయి. కృష్ణాతటము నుండి తరిమివేసి, కర్మరాష్ట్రమును వశపరచుకొనెను. ఇట్లు క్రీ. శ. 630-31 నాటికి ఆంధ్ర దేశమున చాళుక్యుల పరిపాలనము సుప్రతిష్ఠితమయ్యెను. ప్రేమాతిశయమువలన, పులకేశి తన తమ్ముడగు కుబ్జవిష్ణువర్ధనునకు, వేంగీరాజ్యమును వంశపారంపర్యముగ పాలించి యనుభవించుకొన ప్రసాదించెను.

కుబ్జవిష్ణువర్ధనునకు విషమసిద్ధియను బిరుదుకలదు. దుస్సాధములైన స్థల జల గిరి దుర్గములను సాధించి, తన యభిమతమును నెరవేర్చుకొన్నవాడు గనుక ఈతని కీ ప్రతిష్ఠ లభించెనని చెప్పుదురు. ఇతని శాసనములు చీపురుపల్లి, తిమ్మాపురము, మొదలగు చోటులందు దొరికినవి. వీనినిబట్టి, ఇతనిరాజ్యము ఉత్తరమున విశాఖపట్టణమండలమునుండి దక్షిణమున కమ్మనాటివరకుగల తీరదేశముపై చెల్లెనని చెప్పనగును. కుబ్జవిష్ణువర్ధనుడు అగ్రజుని ప్రతినిధిగా వేంగి దేశము పాలింప జొచ్చినను, ప్రారంభమునుండియు, ఈతడు స్వతంత్ర ప్రతిపత్తితో వ్యవహరించెను. భ్రాతృవాత్సల్యముగల

పులకేశి దీనికనుమతించెను. ఇట్లు కుబ్జవిష్ణువర్ధనుడు తూర్పు చాళుక్య వంశస్థాపకుడై కీర్తి గాంచెను. ఈతడు క్రీ. శ. 641 వరకు పరిపాలన చేసెను.

కుబ్జవిష్ణువర్ధనునికాలమును యువాన్ చ్వాంగ్ అను చీనా యాత్రికుడు ఆంధ్రదేశమున పర్యటించి యచ్చటి స్థితిగతులను తనయాత్రా చరిత్రయందు చక్కగ వివరించియున్నాడు. అప్పుడు బౌద్ధమతము క్షీణదశయందుండెననియు, జైన హిందూ ధర్మము లభ్యుదయ మందుచుండెననియు, దెలియవచ్చుచున్నది. మొదటి విష్ణువర్ధనుని కుమారుడు జయసింహవల్లభుడు తండ్రి యనంతరము వేంగీపాలకుడై 641-673 ల నడుమ రాజ్యము చేసెను. ఈతడు పరమ భాగవతుడు. అనేక శాస్త్రార్థతత్త్వజ్ఞుడు. ఇతనికి సర్వసిద్ధి యను బిరుదముకలదు. తండ్రి యప్పగించిన విశాల రాజ్యము నీతడు ప్రజారంజకముగ పాలించెను. విశాఖపట్టణము జిల్లాయందలి సర్వ సిద్ధిగ్రామ మీతనిపేర వెలసెనని చెప్పుదురు. ఈ రాజవర్యుడు పండిత విద్యాప్రియుడై యుండెను. తూర్పు చాళుక్యులు తమ రాజ్య ప్రారంభమునుండియు, వేదవేదాంగవిదులైన బ్రాహ్మణులకు అగ్ర హారములొసంగి విద్యాపోషణగావించి, ఘనతకెక్కిరి. జయసింహ వల్లభుడును తన తండ్రివలెనే పెక్కు అగ్రహారములు పండితుల కిచ్చెను. వానిలో మిక్కిలి యర్థవంతమైనది నిడుమట్టు గ్రామ దానము. "అసనపురస్కంధావారమునుండి కార్తిక పూర్ణిమనాడు సర్వసిద్ధి బిరుదాంచితుడును, పరమ బ్రహ్మణ్యుడును, విష్ణువర్ధన తనూజుడును, పితృపాదరతుడును అగు నీరాజు గండేఱుపాటి విషయము (గుంటూరు, రేపల్లెప్రాంతము) లోని నిడుమట్టు గ్రామ మును తైత్తిరీయ శాఖీయుడును హారీతగోత్రుడును, అగు కాటిశర్మ

అను విప్రునకు దానముచేసెను. ప్రతిగ్రహీత (కాటిశర్మ) రెండు వేదముల నధ్యయనముచేసెను. ఇతిహాసపురాణ ధర్మశాస్త్ర ఆగమ, ఉపనిషత్తులందు నిష్ణాతుడు. ఈతని తాతయైన మందశర్మ, అసిన పురాస్థాన నివాసి, ఘటికా సామాన్యుడు. అధీత వేదద్వయుడు, పద, క్రమ, అనుక్రమ, కల్ప, పురాణేతిహాస, ధర్మశాస్త్ర, ఉపనిషత్పారంగతుడు. కాటిశర్మ తండ్రియైన శివరుద్రశర్మ జనకుని మించిన విద్వాంసుడు. అగ్నిష్టోమాదుల నాచరించినవాడు.'' ఈ శాసనమునుబట్టి చాళుక్యుల కాలమునాటి విద్యాపోషణ విధానమును అన్వయింప వచ్చును. బౌద్ధయుగమునందు ధాన్యవాటివంటి బ్రహ్మాండమైన విశ్వవిద్యాలయములుండెడివి. అక్కడ వందలాది గురుశిష్యు లేకత్ర నివసించి విద్యోపార్జనము చేసెడివారు. ఇట్టి బహుజనాన్వితమైన విద్యాస్థానములు చాళుక్యులనాడు కన్పట్టవు. కాని వాని స్థానమునందు అసంఖ్యాకములైన చిన్నచిన్న విద్యాపీఠములు నెలకొనియుండెను. వీనిని ఘటికాస్థానములని చెప్పుచుండిరి. ఒక్కొక్క ఘటికాస్థానమునందు వేదశాస్త్రములు, తర్కము, వేదాంతము మొదలగు ప్రాచీనవిద్యలు అధ్యాపనము చేయించగల ఆచార్యులుండిరి. వీరందరి పైన పర్యవేక్షకుడుగ కాబోలు, 'ఘటికాసామాన్యు'డను గురుసత్తము డుండెడివాడు. కాటిశర్మతాతయైన మందశర్మ అసనపుర ఘటికాసామాన్యుడని ప్రశంసింపబడినాడు. పాలకులైన రాజులు ఘటికలకు సమష్టిగను, వ్యష్టిగనుకూడ అగ్రహారములును భూములును సమర్పించెడివారు. సదరు సస్యక్షేత్రముల ననుభవించుచు, విద్యార్థులను ఉచితాన్నదాన విద్యాదానములచేత గురువులు భరించెడివారు. చాళుక్యయుగమునాటి ఘటికాస్థానములు గ్రామవిద్యాపీఠములని చెప్పవచ్చును. ఇట్టి ఘటికాస్థానము లాకాలమున ఆంధ్రదేశమునందే కాక, కర్ణాట ద్రవిడదేశములందును, ఉండినట్లు శాసనములవలన

దెలియవచ్చుచున్నది. కదంబవంశము స్థాపించిన మయూరశర్మ, విద్యాసంపాదనమునకై కాంచీపురమునకేగి ఘటికాస్థానమునందు విద్యనభ్యసించెను. ఇంతటి ప్రసిద్ధిగన్న అసనపుర మెచ్చటనుండెనో నేడు గుర్తింపరాకున్నది. అసనపుర ఘటికానివాసియైన, రుద్రశర్మ యను మఱియొక విప్రునకు, జయసింహ వల్లభుడు పొలమూరును అగ్రహారముగా నిచ్చెను. విష్ణుకుండిన వంశీయుడైన మూడవ మాధవవర్మరాజు ఈ పొలమూరునే రుద్రశర్మపూర్వీకులకు దానము చేసెను. విష్ణుకుండిన రాజ్యపతనముతో, ఈ యగ్రహారము ప్రతి గృహీతలకు చెల్లకపోయెను. ఉదారబుద్ధియు, మత్సరరహితుడును అగు జయసింహవల్లభుడు, విష్ణుకుండిన మాధవవర్మదానమును తిరిగి ఉద్ధరించి, తన విద్యాప్రియత్వమును ప్రదర్శించెను. ఈ కాలపు రాజులందరును వేదవిద్యను పోషించిన విధానము ప్రశంసావహము. తూర్పు గాంగరాజులుకూడ ఎన్నియో విద్యాదానములు గావించిరి.

జయసింహవల్లభుని నాటి విప్పఱ్ల గ్రామశాసనము తెలుగు భాషా చరిత్రకు ముఖ్యమైనది. ఇది గుంటూరుజిల్లా నర్సారావుపేట తాలూకాలో దొరకినది. ఇంతవరకు లభించినవానిలో సాగర సీమయం దిదియే. తెలుగుభాషలో వ్రాయబడిన మొట్టమొదటి శాసనము.

నూతనముగా స్థాపింపబడిన తూర్పు చాళుక్య ప్రభువులకు, విద్యాపోషణము చేయగల ప్రశాంత రాజ్యస్థితి, యెట్లు సిద్ధించెనో తెలిసికొనదగును. దక్షిణాపథమునందు, ఈ కాలమున రెండు ప్రబల సామ్రాజ్యములు ఆధిక్యతకై పెనగులాడుచుండెను. చాళుక్యులు, పల్లవులు-ఈ యుభయులే ఆనాడు బలవత్తరులు. వారిలో బాదామి చాళుక్యులు వేంగీశులకు బంధువర్గములోని వారగుటచేత, ఆ వంక నుండి వీరి కలజడి లేకుండెను. పల్లవులు తమ సహజ వైరులగు బాదామి చక్రవర్తులతో తలమునుకగ పోరాడుచుండుటచేత, తమ ఉత్తర సరిహద్దు మీదనైన శాంతినికోరి వేంగిపాలకులతో ఉపేక్షా మైత్రిని పాటించిరి. ఈ కాలమున కాంచి, వాతాపి, సంబంధములు

ద్వేషపూరితమై యుండెను. రెండవ పులకేశి పల్లవ సామ్రాజ్యముపై పలుమారు దండయాత్రలు సేయుచు, దేశసంక్షోభము గల్గించుచుండెను. దీనికి ప్రతీకారముగ పల్లవరాజు మొదటి నరసింహవర్మ, పులకేశిని రణరంగమున మడియించి, వాతాపి నగరమును దగ్ధము చేసెను. వేంగిరాజ్యమున కుత్తరమున నుండిన తూర్పు గాంగులు కూడ, మొత్తముమీద శాంతికాములై యుండిరి.

రాజకీయముగ తూర్పు చాళుక్యయుగమును మూడు ప్రధాన ఘట్టములుగ విభజింపవచ్చును. (1) మొదటి ఘట్టము క్రీ॥ శ॥ 625-753 వరకు. ఈ కాలమున వేంగిరాజ్యము నిమ్మకు నీరువోసినట్లు ప్రశాంతత ననుభవించెనని చెప్పనచ్చును. 753 సంవత్సర ప్రాంతమున వాతాపి చాళుక్య సామ్రాజ్యమును రాష్ట్రకూటులు విధ్వంసమొనర్చి, తమ రాజ్యము స్థాపించిరి. (2) రెండవదశ క్రీ॥ శ॥ 753-973 వరకు. ఇది రాష్ట్రకూట సామ్రాజ్యకాలము. వేంగీ చాళుక్యులకును, రాష్ట్రకూటులకును, బద్ధవైరములు సాగెను. కావున ఆంధ్రదేశము నిరంతర సంగ్రామములచే, వేడి మంగలమువలె వేగుచుండెను. (3) మూడవ మజిలీ క్రీ॥ శ॥ 973-1075 వరకు. 973 లో రాష్ట్రకూట సామ్రాజ్యము పతనమొందెను. చాళుక్యులు తిరిగి యభ్యుదయమునొంది, కళ్యాణి ముఖ్యపట్టణముగ రెండవ చాళుక్య సామ్రాజ్యము స్థాపించిరి. తూర్పు చాళుక్యులును, వీరును ఒక్క కుదురులోని వారేయైనను, పెక్కు తరములును రెండు మూడు శతాబ్దులును గడచిపోవుటచే, ప్రాచీన అనుబంధములు విస్మరింపబడెను. ఇప్పుడు వీరినడుమ సామాన్య రాజకీయ సంబంధములు మాత్రమే యుండెను. వేంగీరాజ్యమును కబళించుటకై, ఈ రెండవ పశ్చిమచాళుక్యరాజ్యము వ్యూహములు పన్నుచుండెను. ఈమూడవ ఘట్టమునందు, వేంగీశులకు కాంచీపుర చోళులతో మైత్రియు, బాంధవ్యమును, పొసగి వీరొకరికొకరు అండగానిల్చిరి. క్రీ॥ శ॥ 1075 తరువాత కాంచీపుర వేంగీరాజ్యములు కలిసిపోయి ఒకేఛత్రము నీడను కొంతకాలము వర్ధిల్లెను.

పైన గ్రహించిన మొదటి దశయందుండిన రాజులలో ముఖ్యులను పేర్కొనుచున్నాము.

రెండవ విష్ణువర్ధనుడు: (క్రీ॥ శ॥ 673-81) ఈతడు జయసింహ వల్లభుని తమ్ముడైన ఇంద్రభట్టారకుని కుమారుడు. ధర్మశాస్త్ర వేత్తయని పొగడ్తగాంచినవాడు. విషమసిద్ధి, సర్వలోకాశ్రయుడు, మొదలైన వీతని బిరుదులు. ఈ రాజు పరమ మాహేశ్వరుడని వర్ణింపబడుటచే, శైవమతాభిమాని యని చెప్పవలెను. అసనపుర ఘటికావాస్తవ్యుడైన ధ్రువశర్మయను వేద విప్రునకు, సూర్య గ్రహణ సమయమున, పల్లివాడను దానముచేసెను. సూర్యచంద్ర గ్రహణములందును, సంక్రాంతి పుణ్యకాలముననను, పౌర్ణమి అమావాస్యవంటి పర్వదినములందును, శుభాశుభ సమయములందును, తమకును, తమ వంశమునకును, పుణ్యహేతువుగ రాజులు అగ్రహారములు సమర్పించుట ఆచారము. అగ్రహారములు వేదాధ్యయన సంపన్నులకును. దేవాలయములకును, రాజభక్తిగలిగి సేవించిన ఉద్యోగులకును ఈయబడెడివి.

మంగియువరాజు: (681-705) రెండవ విష్ణువర్ధనుని కుమారుడైన ఈతడు సమర్థుడైన పాలకుడు. విజయసిద్ధి బిరుదము దాల్చెను. చెందలూరు గ్రామమును కర్మరాష్ట్ర నివాసులును, అధీత వేద వేదాంగులు, షట్కర్మనిరతులు, పంచమహాయజ్ఞము లనుష్ఠించు వారునగు, ఆరుగురు బ్రాహ్మణులకు దానముగా నొసంగెను. మంగియువరాజు కుమారులు రెండవ జయసింహుడు 705-717 వరకును, మూడవ విష్ణువర్ధనుడు 718 నుండి 752 వరకును వేంగి దేశమును పాలించిరి. బెజవాడయందలి 'నడుంబిబసతి' యను జైనుల యాలయమునకు, మూడవ విష్ణువర్ధనుడు ముసినికొండ గ్రామమును దానముచేసెను. ఈ యాలయమును కుబ్జవిష్ణువర్ధనుని రాణి, అయ్యమహాదేవి కట్టించెనట. ఆంధ్ర దేశమునందీ కాలమున జైనమతమున కింకను ఆదరము లభించుచుండెననుట కిది తార్కాణము. ఈ రాజు జైనాలయములకును, బ్రాహ్మణులకును, కూడ

వితరణములు గావించి సమబుద్ధిని ప్రదర్శించెను. ఈతని తరువాత నీతని కుమారుడు మొదటి విజయాదిత్యుడు సింహాసన మధిష్ఠించి క్రీ॥ శ॥ 753-770 వరకును భూపరిపాలనము చేసెను.

మొదటి విజయాదిత్యుని రాజ్యకాలమునుండి, తూర్పు చాళుక్యాన్వయము, పైని వివరించిన రెండవదశలో అడుగుపెట్టినది. క్రీ॥ శ॥ 755 ప్రాంతమున బాదామి చాళుక్య వంశము నంతమొందించి రాష్ట్రకూటులు దంతిదుర్గుడను వీరుని నాయకత్వమున నూతన సామ్రాజ్యమును స్థాపించిరి. వీరి ముఖ్యపట్టణము మాన్ఖేడు నగరము. హైద్రాబాదు రాష్ట్రమునందలి లాతూరుగ్రామము వీరి మొదటి నివాసస్థానము. రాష్ట్రకూట సామ్రాజ్యము బలపడినవెంటనే, వారు పల్లవులతో సంగ్రామములకు తలపడిరి. కాంచీపుర రాజ్యమిప్పుడు మునుపున్నంత ఉచ్చస్థితిలో లేకుండెను. కావున ప్రధానముగ రాష్ట్రకూటులును, వేంగీ ప్రభువులును, విజిగీషతో పెనగులాట ఆరంభించిరి. తూర్పు చాళుక్యులలోకూడ మహాపరాక్రమశాలురు పలువురుండిరి. కావున వేంగీ రాష్ట్రకూట యుద్ధములు నిరంతరాయముగ సాగి, దేశమునందు శాంతికొరవడెను. మొదటి విజయాదిత్యుడు సమరలంపటుడై, 'త్రిభువనాంకుశ' బిరుదము వహించెను. తరువాతి తూర్పు చాళుక్య రాజులీ బిరుదును వంశ పారంపర్యముగ దాల్చిరి.

మొదటి విజయాదిత్యుని కుమారుడు నాలుగవ విష్ణువర్ధనుడు తండ్రి యనంతరము క్రీ॥ శ॥ 771-806 వరకు వేంగిని పరిపాలించెను. రాష్ట్రకూటుల రాజ్యములో సింహాసనమునకై, గృహకలహము సంభవించెను. దంతిదుర్గుని తరువాత అతని పినతండ్రి కృష్ణరాజు రాష్ట్రకూట శాసనుడయ్యెను. ఈతని కుమారులు గోవిందరాజును, ధ్రువరాజనబడు ధారావర్షుడును, రాజ్యాధిపత్యమునకై వివాదపడిరి. విష్ణువర్ధనుడు గోవిందరాజు పక్షము వహించెను. కాని ధ్రువ రాజు వీరందరినోడించి, సింహాసన మధిష్ఠించెను. ఈ కారణమున తూర్పు చాళుక్యులకును, రాష్ట్రకూటులకును, నడుమ వైరానలము ప్రజ్వ

రిల్లెను. నాల్గవ విష్ణువర్ధనుని మరణానంతర మాతని కుమారులు విజయాదిత్యుడును, భీమసల్కి (చాళుక్యభీముడు)యు వేంగిరాజ్యము కొఱకై, కలహించిరి. ఈ సదవకాశమును ఊరకపోనీయక, రాష్ట్రకూటుడగు మూడవ గోవిందరాజు, భీమసల్కిని చేరదీసి, వానిపక్షమున వేంగి వినాశనమునకై, పూనుకొనెను. రాష్ట్రకూటులకు పశ్చిమగాంగులు సహాయకులై నిల్చిరి. చాళుక్య విజయాదిత్యుడు మహేంద్రసమ విక్రముడు. సమరకర్కశుడు, విష్ణువర్ధనుని యగ్రనందనుడగుటచే సింహాసనమున కీతడే నిక్కపు వారసుడు. విజయాదిత్యుడు దన్నెదుర్కొన్న రిపుమండలములతో, ద్వాదశ వర్షములు హోరాహోరిని సంగ్రామ మొనర్చి, వారందరిని చెల్లాచెదరుగ కొట్టి, వేంగీ సింహాసనము నధిష్ఠించెను. ఈతని యకుంఠిత పరాక్రమమునకు మెచ్చి, లోకమీతని 'నరేంద్రమృగరాజు, చాళుక్యార్జునుడు' మున్నగు పెక్కుబిరుదులతో, భూషించినది. నరేంద్రమృగరాజు 108 రణములు చేసి శత్రుసంహార మొనర్చెను. వీనిలో జనహింస జరిగినందున, పాపభీరువైన ఈ మహారాజు 108 శివాలయములు ప్రతిష్ఠించి పుణ్యము సంపాదించెనట. రాష్ట్రకూటు లీతని శౌర్యానలమును శాంతింప జేయుటకై, నరేంద్ర మృగరాజు కుమారుడు విష్ణువర్ధనునకు, శీలమహాదేవి యను తమ బిడ్డనిచ్చి పెండ్లిచేసిరి. వేంగీ చాళుక్య భూపతులలో రెండవ విజయాదిత్యుడు క్రీ॥ శ॥ (806-846) మహోన్నత స్థానమలంకరించ దగినవాడు. ఈతడెన్నియో అగ్రహారములు దానము చేసెను. ఈతడు పరమమాహేశ్వరుడు. హైహయవంశీయుడైన నృపరుద్రుడను నాతడు విజయాదిత్యుని సోదరుడై, ఆతనికి యుద్ధములందు తోడ్పడెను.

నరేంద్రమృగరాజు తరువాత నాతని కుమారుడు ఐదవ విష్ణువర్ధనుడు స్వల్పకాలము రాజ్యముచేసెను. ఈతనికి విజయాదిత్యుడు, విక్రమాదిత్యుడు, యుద్ధమల్లుడు, నృపకాముడు అను నలువురు తనయులుండిరి. వారిలో నగ్రజుడును, కార్తికేయునివంటి పరాక్రమశాలియు, నగు విజయాదిత్యుడు వేంగీసింహాసన మధిష్టించి, క్రీ॥ శ॥ 848-892 వరకు రాజ్యరమనేలెను. ఈతనిని మూడవ విజయాదిత్యు

డనియు, అనేక సద్గుణాలంకృతుడగుటచే గుణాంక, గుణగ విజయా దిత్యుడనియు వ్యవహరింతురు. ఈమహారాజు కాలమున వేంగీ రాజ్యము తన మహోన్నతిదశ ననుభవించెను. రాజ్యము సువిస్తీర్ణ తనుచెందెను. పరాజయము, అపయశము శత్రువుల నావరించెను. ఆంధ్ర ప్రజలు సుఖించిరి. తెలుగుభాషలో నొక ప్రధానఘట్టము విజయాదిత్యుని కాలమున పొడసూపెను. గుణగ విజయాదిత్యుని రాజ్యారంభ కాలమునకే, చాళుక్య రాజ్యపు దక్షిణ సరిహద్దున, అల్లరులు చెలరేగుచుండెను. పల్లవ సామ్రాజ్యమిప్పటికి విచ్ఛిన్నమై పోవుచు, మాండలిక ప్రభుత్వములు తలయెత్తెను. [1] నోలం బులు, వైదుంబులు. బాణులు మొదలగు చిల్లరరాజ్యము లెన్నియో వేంగికి, దక్షిణమునను, నైరృతిని, అలజడి కలిగింపజొచ్చెను. ఈ ప్రాంతమునందు సామంతుల నణచి, శాంతిని స్థాపించుటకై, గుణగ విజయాదిత్యుడు పండరంగ డను తన విశ్వాసపాత్రుడైన సేనాపతిని నియోగించెను. పండరంగడును, ఆతని తండ్రి కడెయరాజును చాళుక్య రాజులకు నమ్మిన భృత్యులై వన్నెకెక్కిరి. పండరంగడు బోయకొట్టములను జయించి, నెల్లూరును పట్టుకొని, ఆ దిక్కున శాంతిని స్థాపించెను. మూడవ విజయాదిత్యుని కాలమున, రాష్ట్ర కూటులతో యుద్ధములు మరల ప్రారంభించెను. ఈతని తల్లి శీల మహాదేవి రాష్ట్రకూటాంగన మైనను, ఏకారణముననో ఈ రెండు రాజవంశములనడుమ సుస్థిరశాంతి నెలకొనదయ్యెను. గుణగుని శత్రువులు, రాష్ట్రకూట కృష్ణరాజును, అతని బావమరది చేదిరా జును, పశ్చిమ గాంగులును పలుపు రేకమైరి. ఉప్పెనవలె వచ్చిపడిన యీ ప్రచండవైరి వాహినులను, గుణగ విజయాదిత్యుడు మహే శ్వర విక్రముడై, యెదిరించి సమూల మోడించెను. రిపుచమువులను వేంగి సరిహద్దులనుండి పారద్రోలుటయేకాక, ఎదురుదాడి సలిపి కిరణపురము, అచలపురము మొదలగు రాష్ట్రకూట నగరములను, విజయాదిత్యుడు దహించి 'త్రిపుర మర్త్యమహేశ్వర' బిరుదమును

1. వివరములకొరకు చూడు: "వేంగి చాళుక్యులు 3, 4" శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు, భారతి సంపు 2 సంచికలు 7, 9.

వహించెను. ఈ మహాసంగ్రామమునందు పండరంగ డీతని కుడి భుజమై పోరాడెను. గుణగవిజయాదిత్యుడు తూర్పు గాంగులనోడించి, త్రికలింగమును స్వాధీనము చేసికొనెను.

మూడవ విజయాదిత్యుని కాలమున ఆంధ్రుల శౌర్యము హిమాలయోత్తుంగ శృంగ సన్నిభమై, దుర్నిరీక్ష్యమై, తేజరిల్లెను. ఈ మహారాజు విద్యాప్రియుడై, ఎన్నియో అగ్రహారములను దానము చేసెను. ఈతని పేరి శాసనములు చాలగలవు. ఆంధ్ర భాషా వికాసమునం దీతని కాల మొక ముఖ్యఘట్టము. ఏలయన మొట్టమొదటి మారు, తెలుగు పద్యరచన మీతని శాసనములందే కాన్పించుచున్నది. ఇతనికి ముందు వెలసిన తూర్పు చాళుక్య శాసనములు, గద్యమయములుగా మాత్రమున్నవి.

గుణగ విజయాదిత్యుని యనంతరము, వేంగీ సింహాసనము నధిష్ఠించినవాడు ఆతని తమ్ముని కుమారుడు, శూరుడునైన మొదటి చాళుక్య భీమరాజు. ఈతడు క్రీ॥ శ॥ 922 వరకు పరిపాలన చేసెను. రాష్ట్రకూటు లీతని రాజ్యారోహణమునకు అవరోధములు కల్పించి, వేంగి నాక్రమించుకొనిరి. భీమరాజు తన పెంపుడుతల్లి కుమారుడైన మహాకాలుడను వానిని, దండనాథునిగా చేసికొని, రాష్ట్రకూటుల నోడించి, పారద్రోలెను. ఈ దారుణ సంగ్రామమునందు, భీముని కుమారుడు పరాక్రమ శాలియు, ఇఱిమర్తిగండ బిరుదాంచితుడైనవాడు, నిడదవోలు, పెరంగూరు యుద్ధములలో రాష్ట్రకూటుల సంహరించి, తానును రణభూమికి బలియయ్యెను. ఇట్టి శూరాగ్రేసరుడైన తనయుని స్మారకముగా, చాళుక్యభీమరాజు [1] వెడతలూరను గ్రామమును, అగ్రహారముచేసి దానమొసగెను. ఈరాజేంద్రుడు చామర్లకోట సమీపమునందు, తనపేర చాళుక్యభీమవరము అను నగరమును నిర్మించి, అచ్చట భీమేశ్వరాలయము కట్టించెను. ఈ

1. చూడు_మొదటి చాళుక్య భీముని మచిలీపట్టణము శాసనము.

యాలయము చాళుక్యులనాటి శిల్పవైభవమును, వాస్తుజ్ఞానమును చక్కగా ప్రదర్శించును. చాళుక్యభీమరాజే, ద్రాక్షారామమున భీమేశ్వర స్వామిని ప్రతిష్ఠించెనని చెప్పుచున్నారు. భీమరాజు కాలమున క్రీ॥ శ॥ 900 ప్రాంతమున, కాంచీపుర పల్లవుల సామ్రాజ్యము చోళులచే జయింపబడెను. చిరకాలము, దక్షిణాపథ రాజకీయములందు ప్రాముఖ్యము వహించియుండిన, పల్లవరాజ్యము ఇంతటితో నస్తమించినది.

మొదటి భీమరాజు ననంతరమాతని కుమారుడు కొల్లభిగండ భాస్కర విజయాదిత్యుడు ఆరుమాసములు మాత్రము రాజ్యముచేసి మరణించెను. ఈతని సైన్యాధిపతి కుంతాదిత్యుడను జైన బ్రాహ్మణుడు. వీరిది పట్టవర్ధనివంశము. కుబ్జవిష్ణువర్ధనుని సేనానాయకుడైన కాలకంపు డనువీరుని వంశములో, కుంతాదిత్యుడు జన్మించెను. కొల్లభిగండని తరువాత మొదటి అమ్మరాజ విష్ణువర్ధనుడు క్రీ॥ శ॥ 922-27 వరకు వేంగిని పరిపాలించెను. ఈతని కాలముననే రాజమహేంద్రవరపురము నిర్మింపబడి, చాళుక్యుల రాజధాని యయ్యెనని కొందరు చెప్పుదురు. వేంగినగరము సమతలమున మైదానములో నుండుటచే, శత్రువుల దాడులకు సులభముగ గురి యగుచుండెను. కావున అమ్మరాజు తన రాజధానిని, గోదావరి కుత్తరతీరమున స్థాపించుకొనెను. దాయాదులైన చాళుక్యులును, రాష్ట్రకూటులును, అమ్మరాజును సిలుగుల పెట్టజూచిరి. కాని పరాక్రమవంతుడైన ఈ రాజన్యుడు వారియాట కట్టించెను. అమ్మరాజునకు రాజమహేంద్రు డనుపేరుడు కలదు.

ఈ రాజు మరణానంతరము పూర్వచాళుక్య సింహాసనమునకై తగవు లారంభమై క్రీ॥ శ॥ 927-934 నడుమ దేశ మశాంతికి లోనయ్యెను. గుణగ విజయాదిత్యుని సోదరులలో విక్రమాదిత్యుడు, యుద్ధమల్లుడు అనువారుండిరని చెప్పియుంటిమి. గుణగుని తరువాత విక్రమాదిత్యుని కుమారుడు, చాళుక్య భీమవిష్ణువర్ధనుడు రాజ్యమేలెను. మొదటి అమ్మరాజువరకును విక్రమాదిత్యుని సంతతివారే

పరంపరగ వేంగి సింహాసనము నధిరోహించిరి. కాని గుణగుని మరి యొక సోదరుడైన యుద్ధమల్లుడును, అతని సంతతివారును, దీనిని సహించక, వారసత్వమును బలవంతముగ లాగుకొనుటకై, తలపో యుచుండిరి. వేంగి రాజ్యమందలి ప్రస్తుత అశాంతికి దాయాదుల స్పర్ధలే కారణము. మొదటి యుద్ధమల్లుని పౌత్రుడైన రెండవ యుద్ధమల్లుడు, 927-934 నడుమ రాజ్యము నాక్రమించుకొనెను. రాష్ట్రకూటులు చాళుక్యులలో నంతఃకలహములు పెంపొందించి, లాభముపొందుదురాశ నింకను విడువలేదు. రాష్ట్రకూట సైన్య ములు, యుద్ధమల్లుని వేంగి రాజ్యమందు నిలువ బెట్టెను. యుద్ధ మల్లుని బెజవాడ శాసన మని ప్రసిద్ధి చెందిన శాసన మీరాజుదని చెప్పుచున్నారు.

మొదటి అమ్మరాజ విష్ణువర్ధనుని సవతి తమ్ముడగు రెండవ చాళుక్య భీమరాజు, రెండవయుద్ధమల్లుని తరుమగొట్టి, రాజ్యము నాక్రమించుకొని క్రీ॥ శ॥ 934-45 వరకు నేలెను. వెనుకటి రాజునకు బాసటగా నుండిన శబరనాయకుల నీతడు పారద్రోలెను. ఈ రాజు కళింగములో, తన రాజ్యమును విస్తరింపజేసెను. భీమరాజు నకు దానార్ణవుడు, అమ్మరాజు నను ఇద్దరు సుతులుండిరి. ఈతని యనంతరము చిన్నవాడగు రెండవ అమ్మరాజు వేంగిపాలకుడై క్రీ॥ శ॥ 945-970 వరకు నుండెను. ఈతని తల్లి పేరు లోకమహాదేవి. ఈతడు సమర్థుడైనరాజు.

ఇతడు రాజ్యమును పాలించిన ఇరువది యేండ్లలోపల నితడు రెండు పర్యాయములు రాజ్యభ్రష్టుడాయెను. పట్టాభిషేకమయిన వెంటనే, మొదటి యుద్ధమల్లుని మనుమలైన బాదప, ద్వితీయ తాళప లితని వెడలగొట్టి, రాజ్యము నాక్రమించుకొని, రాజ్యమును కొంత కాలమేలిరి. వారిని తరిమివేసి అమ్మరాజు రాజ్యమును స్వాధీనపఱ చుకొని క్రీ. శ. 955-56 వరకు ప్రభుత్వముజేసెను. అంతట రాష్ట్ర కూట మూడవ కృష్ణరాజు దండెత్తివచ్చి, యమ్మరాజును కళింగము నకు బాఱద్రోలి, వేంగిని అతని యన్నయైన దానార్ణవునకిచ్చి మరలి

పోయెను. కృష్ణరాజు తరలిపోయిన వెంటనే అమ్మరాజు కళింగము నుండి వేఁగికివచ్చి రాజ్యమును వశపఱచుకొని క్రీ॥ శ॥ 970 దాక ప్రభుత్వముసల్పెను. అంతట దానార్ణవుడు తమ్మునిపై తిరుగుబాటు చేసి యతనిని వధించి రాజ్యము నాక్రమించుకొనెను.

అమ్మరాజు పేరట పెక్కు శాసనములు కన్పట్టుచున్నవి. బెజవాడలో నరేంద్ర మృగరాజుచే కట్టబడిన సమస్త భువనాశ్రయ శైవ దేవాలయమునకు రెండవ అమ్మరాజు దానము చేసెను. కాలాముఖ శాఖకు చెందిన శైవాచార్యులీ దేవాలయమునకు స్థానాపతులు. కాలాముఖ శైవసమయమునకుజెందిన సింహపరిషత్తుయొక్క గురువులు అమరేశ్వరము మొదలగుచోట్ల నివసించుచుండి రని తెలియవచ్చుచున్నది. రెండవ అమ్మరాజు సర్వలోకాశ్రయజిన భవన మను జైనాలయమును నిర్వహించు అర్హనంది యనుజైనాచార్యునకు, కలుచుంబఱ్ఱు గ్రామమును దానముచేసెను. అర్హనంది శిష్యురాలును, పట్టవర్ధన వంశీయురాలును, అమ్మరాజునకు ప్రియురాలును అగు చామెకాంబయను జైనశ్రావకి రాజును ప్రోత్సహించి ఈ దానము చేయించెను. చామెకాంబ నృత్యకళయందు మిన్నయని వర్ణింపబడినది. రెండవ అమ్మరాజు జినవసతులకు పెక్కుదానములు చేయుట చూడఁగా, ఈతనికి రాజ్యాధికార ప్రాప్తియందు జైనులు తోడ్పడిరేమో యని సందేహింపవలసియున్నది.

రెండవ అమ్మరాజు తరువాత అతని యగ్రజుడు దానార్ణవుడు రాజయి క్రీ॥ శ॥ 970–73 నడుమ పరిపాలన సాగించెను. ఈతని తల్లి ఊర్జపాయ అనునామె కళింగ రాజకుమార్తె. [1] ముదిగొండ చాళుక్య వంశీయులైన సామంతులకు, దానార్ణవుడు పొత్తపినాడు విషయములో పొత్తపినాడు మూడువందల గ్రామముల ఏలుబడిని అనుగ్రహించెను. ఈ రాజు తరువాత వేంగీ రాజ్యము 27 సంవత్సరముల పర్యంతము అరాజకమునకు గుఱి యయ్యెనని చాళుక్య శాసనములు వర్ణించుచున్నవి. వాస్తవముగా నప్పుడు అరాజకము ప్రబలలేదు. రెండవ

1. See Kandyam plates of Danarnava. Inscriptions of Andhra Dynasties. Dr. M. Rama Rao.

అమ్మరాజునకు ఆలివంక బంధుగుడైన జటాచోడభీముడను పెడ కంటి దేశ ప్రభువు, వేంగి పైనెత్తివచ్చి, దానార్ణవుని చంపి, యతని పుత్రులైన శక్తివర్మ విమలాదిత్యులను వెడలనడచి, యాంధ్రదేశమునందు విశేషభాగమును, పటుదర్పముతో క్రీ॥ శ॥ 970 మొదలు 999–1000 వఱకును పాలించెను.

క్రీ॥ శ॥ 973 ప్రాంతమున పశ్చిమ చాళుక్యుడైన రెండవ తైలపరాజు రాష్ట్రకూటుల నోడించి, పశ్చిమచాళుక్య సామ్రాజ్యమును పునఃప్రతిష్ఠించెను. వేంగిరాజ్యమునకు దక్షిణమున, చోళులు తమ సామ్రాజ్యమును బలపరచుకొనుచుండిరి. తుంగభద్రానది కుత్తరమున, తమ యాజమాన్యమును స్థాపించుటకై చోళులు, పశ్చిమ చాళుక్యులతో సంగ్రామములు సేయుచుండిరి. వేంగీ ప్రభువులు పశ్చిమ చాళుక్యుల పలుకుబడి గిరిలో పడిపోవకుండ చూచుకొనుట, చోళుల కావశ్యకమనిపించెను. క్రీ॥ శ॥ 985 ప్రాంతమున చోళ సింహాసనము నధిష్ఠించిన, రాజరాజ రాజకేసరివర్మ సుప్రసిద్ధ చక్రవర్తి. ఇతడు దానార్ణవుని పుత్రులను చేరదీసి, వారిలో ద్వితీయుడైన విమలాదిత్యునికి తన కూతును కుందవ్వ నిచ్చి పెండ్లి చేసి, పెద్దవాడైన శక్తివర్మయొక్క పక్షమునవలంబించి క్రీ॥ శ॥ 999 లో బహుళ సైన్యపరివృతుడై వేంగిరాజ్యముపై నడచి, అక్కడి జటాచోడభీముని జంపి, శక్తివర్మను చాళుక్య సింహాసనముపై కూర్చుండబెట్టెను. ఇట్లు నయభయముల రెంటను, వేంగి ప్రభువులు చోళుల కనురక్తులై, పశ్చిమ చాళుక్యులకు దూరదూరమగుట కీ చక్రవర్తి మంచి పథకము వేసెను. ఈ చాళుక్య చోళ సమ్మేళనోదంతము పూర్వ చాళుక్య చరిత్రయందు మూడవ ఘట్టమునకు నాందియైనది.

శక్తివర్మ క్రీ॥ శ॥ 999–1011 వరకు వేంగి రాజ్యము నేలెను. శక్తివర్మ బిరుదులుగల బంగారు నాణెములు కొన్ని అరకాను, సయాము, మొదలగు ప్రదేశములందు కానవచ్చినవి. చాళుక్య నారాయణు డనునది వీని బిరుదు. ఈతని తరువాత విమలాదిత్యుడు సింహాసన మధిష్ఠించి, క్రీ॥ శ॥ 1011–1018 వరకును పరిపాలన

చేసెను. ప్రబలుడైన చోళచక్రవర్తి కితనికి అలివంక బంధువు లగుటచే, ఇతని పదవి సుస్థిరముగా నుండెను. విమలాదిత్యుడు 1011 లో రాజ్యాభిషిక్తుడయ్యెను. ఇతనికి రాజమార్తాండుడనియు, ముమ్మడి భీముడనియు. బిరుదములు. విమలాదిత్యునకు వజ్జయ ప్రెగ్గడయను విశ్వాసపాత్రుడును, మహాశూరుడును, అగు బ్రాహ్మణమంత్రి యుండెను. రాజితనికి గుద్దవాడి విషయములోని రణస్థిపూడి గ్రామమును దానము చేసి శాసనము వ్రాయించెను. చాళుక్య వంశోత్పత్తి ఈ శాసనమునందు సవిస్తరముగ వర్ణింపబడినది. విమలాదిత్యుడు తన చరమవయస్సునందు, జైన మతమును స్వీకరించి, దేశిగణమునకు చెందిన త్రికాలయోగి సిద్ధాంత దేవుడను జైన గురువు శిష్యుడయ్యెనని, ఈ రాజుయొక్క రామతీర్థ శాసనము తెలుపు చున్నది. ఇతడు ఏడేండ్ల కాలము రాజ్యము చేసి క్రీ॥ శ॥ 1018 లో గతించెను.

విమలాదిత్యునికి ఇరువురు భార్యలు గలరు. చోళచక్రవర్తి రాజరాజ పుత్రికయైన కుందవ యొక్కతె. పెదకల్లు తెలుగు చోళులయింటి యాడపడు చైనమేళమ మఱియొక్కతె-వీరి యందు కుందవకు రాజరాజనరేంద్రుడును, మేళమకు విజయాదిత్యుడును పుట్టిరి.

రాజనరేంద్రుడు సింహాసనమునకు రాకపూర్వము కొంత కాలము యువరాజుగా నుండెను. విమలాదిత్యుని పరిపాలనాంత్య సంవత్సరమునకును, రాజరాజ పట్టాభిషేకమునకును, నడుమ నాలుగు సంవత్సరముల వ్యవధి కాన్పించుచున్నది.

ఈ విజయాదిత్యుడు, పశ్చిమ చాళుక్య జయసింహుని సహాయమును సంపాదించి, యన్నను సింహాసనము నెక్కనీయక, యడ్డపెట్టి రాజ్యము నాక్రమించుకొనెను. రాజరాజనరేంద్రుని మేనమామ యైన రాజేంద్రచోళ చక్రవర్తి దండెత్తివచ్చి, విజయాదిత్యుని అతని మిత్రులను, ఓడించి వేంగినుండి తఱుమగొట్టి, క్రీ॥ శ॥ 1022 లో రాజ రాజనరేంద్రుని పట్టాభిషేకము జేసెను. పూర్వ చాళుక్య వంశములో రాజరాజనరేంద్రు డొక్కడే ఆంధ్రమహాజనులకు చిరపరిచితుడు, ప్రేమపాత్రుడును అయియున్నాడు. కాని ఇతడు నరేంద్ర

మృగరాజువంటి ఉద్దండ నాయకుడును కాదు. గుణగ విజయాదిత్యునివంటి రాజ్యవిస్తారకుడును కాదు. రాజరాజునకు రాజ్యము కుసుమాస్తరణము గాకుండెను. రాజ్యాధికారకాంక్షియైన, విజయాదిత్యుడు మరల పశ్చిమ చాళుక్యుల స్కంధావారము చేరి, తన యన్నకు ముప్పు తెచ్చిపెట్టుచుండెను. క్రీ॥ శ॥ 1030 ప్రాంతమున జయసింహ సహాయముతో మరలవచ్చి, విజయాదిత్యుడు అగ్రజుని తరిమివేసి, సింహాసన మాక్రమించుకొన్నట్లు, పాములవాక శాసనము తెల్పుచున్నది. రాజనరేంద్రుడు చోళుల సహాయముతో తిరిగి రాజ్యమును సంపాదించుకొనెను. కాని యతని ప్రభుత్వము శాంతియుతముగ సాగలేదు. క్రీ॥ శ॥ 1044 సం॥ లో పశ్చిమ చాళుక్య ప్రథమ సోమేశ్వరుడు వేంగిని జయించెను. రాజరాజ నరేంద్రుని బావమరిదియైన చోళచక్రవర్తి, మొదటి రాజాధిరాజు సోమేశ్వరుని వేంగి నుండి తఱిమివేయుట కెంతప్రయత్నము చేసినను, లాభము లేకపోయెను; కావున రాజరాజనరేంద్రుడు సోమేశ్వరునితో సంధిచేసికొని, యాతని కరిగా పై క్రీ॥ శ॥ 1061 వఱకు రాజ్యము చేసి మృతినందెను.

రాజరాజనరేంద్రుని మహోదారకీర్తికి మూలము, ఆ మహారాజుయొక్క ఆంధ్రభాషాపోషణము, విద్వత్పాలనము అని చెప్పవలెను. ఈతని సమకాలీనుడైన భోజమహారాజు, సంస్కృత భాషా కవులను పోషించి కీర్తిగాంచినట్లే, రాజనరేంద్రుడును తెలుగు కవుల పోషించి, ఘనత వడసెను. కాని రాజరాజు ఆంధ్రభాషకు చేసిన సేవ, భోజుని సేవకంటె ఎన్నియో మడుగులు అధికమైనది. ఆంధ్రభాష యం దీతని కాలము వరకు గ్రంథరచన జరిగినట్లు నిదర్శనములు లేవు. శబ్దశాసను డనుబిరుదు వహించిన నన్నయ భట్టారకుడు రాజరాజ నరేంద్రుని ఆస్థానకవియై, ఆంధ్రమహాభారతమును విరచించి, తనకు ఆదికవి యనుప్రశస్తిని, తనయేలికకు ప్రథమాంధ్రభాషాపోషకు డనుగౌరవమును, సంపాదించిపెట్టెను. భారతరచనలో నన్నయకు తోడ్పడిన నారాయణభట్టను మహా పండితుడు, భారత ఘోరరణమునందు పాకశాసనికి నారాయణు

నట్లు, తోడ్పడెను. నారాయణభట్టు వాణస వంశజుడైన కర్ణాటక బ్రాహ్మణుడు; సంస్కృత ప్రాకృత కర్ణాటాంధ్రాద్యష్ట భాషలలో కవిత్వము చెప్పగల నేర్పరి. ఇతడు పశ్చిమ చాళుక్య సోమేశ్వరుని ప్రధాన వర్గముచందొక్కడై రాజరాజు, సోమేశ్వరుని కరిగాపైన పిమ్మట, అతని యాస్థానమునకు తన ప్రభువు పక్షమున స్థానపతి పదమున నియుక్తుడై వచ్చియుండెను. అతడు నన్నయభట్టునకు సహాధ్యాయి. కావున వారిరువురి పొందు చక్కగ కుదిరెను. ఇతని సహాయమునకు ప్రతిఫలముగ రాజరాజు నందముపూడి గ్రామమును అగ్రహారముగ నిచ్చెను. చీదమార్యుడను మఱియొక గొప్ప విద్వాంసునకు, రాజరాజు కోరుమిల్లి గ్రామమును ధారవోసెను. మహావీరాచార్యుని గణితసార సంగ్రహమును తెనిగించిన, పావులూరి మల్లన కీ మహారాజు పిఠాపుర సమీపమందలి నవఖండవాడ గ్రామమును అగ్రహారమిచ్చెను.

గంగైకొండ చోళుడను ప్రసిద్ధి వహించిన రాజేంద్ర చోడ చక్రవర్తి, మన రాజరాజునకు మేనమామ. గంగైకొండ చోళుడు తన కుమార్తె అమ్మంగదేవిని మేనల్లుడైన రాజరాజ నరేంద్రున కిచ్చి యుద్వాహము చేసెను. ఈ దంపతుల కుమారుడు రాజేంద్ర చోళు డనెడి కులోత్తుంగ చోడదేవుడు. రాజరాజనరేంద్రుడు తన కుమారునకు మామగారిపేరు పెట్టెను. సాధారణముగ పితామహుని పేరు మనుమనికి పెట్టుట ఆంధ్రుల యాచారము. విమలాదిత్యుడును, రాజనరేంద్రుడును, తమ యత్తవారిపై గల అనూనభక్తి శ్రద్ధలచే గాబోలు తమ కుమారులకు మాతామహుల పేర నామకరణము చేసిరి. రాజరాజనరేంద్రుని కుమారుడు రాజేంద్రచోడుడుకూడ తన మేనమామయైన రెండవ రాజేంద్రదేవుని తనయను మధురాంతక దేవిని పరిణయమాడెను. ఇట్లు మూడుతరముల పూర్వ చాళుక్య రాజులు చోళ మృగీదృశలను కుటుంబినులుగ పరిగ్రహించి, ఉత్తరోత్తరాభివృద్ధిగ చోళాభిమానము గలవారయిరి. రాజరాజ నరేంద్రుని మరణానంతర మతని సవతి తమ్ముడు విజయాదిత్యుడు వేంగి నాక్రమించుకొని, తన కుమారుడు రెండవ శక్తివర్మను రాజుగా

నభిషేకించెను. పూర్వాంధ్రమహీ పతులలో రాజరాజనరేంద్రుడు గౌతమీపుత్ర శాతకర్ణి, శ్రీ కృష్ణదేవరాయలు వంటి మహారాజుల సరసను ఆసీనుడు కాదగినవాడు. ఈతని విజయములు శాంతి విజయములు. సాహిత్యరంగమే ఈతని విజయరంగము. ఉదాత్త సాహిత్యాలోకము లేక అజ్ఞానాంధకారమునందు పడియున్న ఆంధ్రప్రజావళికి, రాజరాజ నన్నయభట్టులు ఆంధ్ర మహాభారత మనుదివ్యజ్యోతిని ప్రసాదించి, వారి నుద్ధరించిరి. ఆనాటినుండియు ఆంధ్రజాతీయ జీవితమునం దొక నూతనయుగము అరుణరేఖలతో స్ఫుటితమై, చెన్నలరారినది. కావున ఈ మహనీయుల నిర్వురను ఆంధ్రజాతి నిర్మాతలలో పరమపూజ్యులుగ పేర్కొని జోహారు లర్పించవలెను.

రాజరాజనరేంద్రుని యనంతరము ఆతని కుమారుడు రాజేంద్రుడు రాజ్యమునకు రావలసియుండెను. కాని పినతండ్రియైన విజయాదిత్యుడు దాని నాక్రమించుకొని యుండుటవలన, అది సాధ్యపడక పోయెను. ఇతని మామయైన రెండవ రాజేంద్ర-చోళ చక్రవర్తి (1052-62) విజయాదిత్యుని వేంగి నుండి పారదోలి, రాజేంద్రుని అతని తండ్రిరాజ్యమునందు ప్రతిష్ఠింప ప్రయత్నము చేసెను. కాని ప్రబలులైన పశ్చిమ చాళుక్యు లతనికి ప్రాపుగ నిలుచుట వలన, నతని కడక నెఱవేరదాయె. రెండవ రాజేంద్ర చోళచక్రవర్తి గతించిన వెనుక, చోళసామ్రాజ్యమున కధిపతియైన వీరరాజేంద్రుడు (1063-70) పలుమారు దండయాత్రలు నడిపి, చిట్టచివర 1067 లో వేంగి కళింగ చక్రకూటములను జయించెను. ఏ కారణము వల్లనో రాజేంద్రుని కతని తండ్రిరాజ్యము నీయక, పినతండ్రియు ప్రత్యర్థియునైన విజయాదిత్యునినే యచట స్థిరపఱచి, చక్రకూట మండలమున నతని గాపుంచెను. తరువాత స్వల్పకాలములోపలనే వీరరాజేంద్రుడు స్వర్గస్థుడుకాగా రాజేంద్రుడు చక్రకూటమునుండి వేంగికి వచ్చి, విజయాదిత్యుని వెడలగొట్టి, క్రీ॥ శ॥ 1070 లో రాజ్యాభిషేకము జేసికొనెను. ఈ యువకుడు మహాశూరుడై విస్తృత సామ్రాజ్యపాలనాభిలాషియై యుండెను. చోళసామ్రాజ్యమునకు తాను వారసుడు

కాపుటచే, చోళుల దౌహిత్రుడగుటచే, చోళ సింహాసనమును తా నధిష్ఠించవలెనని, రాజేంద్రచోడుడు తలచెను. ఇంతలో వీరరాజేంద్రుడైన పశ్చిమ చాళుక్య ఆరవ విక్రమాదిత్యుడు, తన భార్య సోదరుని అధిరాజేంద్రుని చోళసింహాసనముపై కూర్చుండబెట్టెను. రాజేంద్రుడు దక్షిణమున ఈ కల్లోలసమయమున గొప్ప సైన్యముతో, చోళరాజ్యముపై దండెత్తిపోయెను. రాజేంద్రుడిట్లు చోళసామ్రాజ్యము నాక్రమించుటకు పోవుటను చూచి, కళింగాధిపతి పూర్వగాంగ రాజరాజ దేవేంద్రవర్మయు, చేదిరాజు యశఃకర్ణదేవుడును, విజయాదిత్యుని పక్షము వహించి, వేంగిపై దండెత్తివచ్చి, యచ్చట గాపుండిన రాజేంద్రుని సైన్యము నోడించిరి. రాజేంద్రునకు వారితో దీర్ఘముగ యుద్ధము చేయ వలనుగాకపోయెను; కావున నతడు రాజరాజదేవేంద్రవర్మకు తనకూతును రాజసుందరి నిచ్చి వివాహముచేసి. విజయాదిత్యుని కామరణపర్యంతమును వేంగీ రాజ్యాధిపత్యము నిచ్చుటకు ఒడబడి, సంధిచేసికొనెను. ఈ లోపల అధిరాజేంద్రుడు మృతినందెను. అంతనతడు రాజ్యమునాక్రమించుకొని, కులోత్తుంగ చోళదేవుడు అను అభిధానముతో రాజ్యముసేయ గడగెను.

కులోత్తుంగ చోడచక్రవర్తి దక్షిణదేశపు చరిత్రలో గొప్ప పేరుపొందినవాడు. క్రీ॥ శ॥ 1076–77 సంవత్సరమున ఈతని పిన తండ్రి విజయాదిత్యుడు మరణించుటచే, వేంగి రాజ్యము కులోత్తుంగుని శాసనములోనికి వచ్చెను. ఇప్పటినుండి ఆంధ్రదేశము గంగాపురమునుండి పరిపాలింపబడజొచ్చెను. సర్వ స్వతంత్ర వేంగిరాజ్యము నేడులేదు. అది చోళసామ్రాజ్యమునందొక మండలముగా నేర్పడెను. కులోత్తుంగుడు మొదట తన కుమారులను తరువాత తన ప్రతినిధులను వేంగిని పరిపాలించుటకు నియోగించెను. ఈతనికి ఆంధ్రదేశము, ఆంధ్రభాషలపైకంటె చోళదేశము, తమిళభాషలపై, ఆదరము మెండు. తండ్రియైన రాజనరేంద్రు డారంభించిన భారతాంధ్రీకరణ మహోద్యమమున కీతడు దోహదమిచ్చినట్లు కాన్పింపదు. ద్రావిడ కవులను కావ్యములను కులోత్తుంగుడు మిన్నగా పోషించెను. 'కళింగ

త్తుప్పరణి' యను తమిళ కావ్యము, కులోత్తుంగుని కళింగ విజయ గాధను వర్ణించుచు, ప్రసిద్ధి కెక్కియున్నది. కళింగగాంగులను జయించి, కులోత్తుంగుడు తన కుమార్తె రాజసుందరీదేవిని, గాంగ రాజునకు పరిణయము చేసెను. వీరికి జనించిన పుత్రుడు అనంతవర్మ చోడగంగదేవుడు గాంగరాజులలో గొప్ప సమర్థుడు. ఈతడు ఓఢ్ర దేశమును జయించి, కటకనగరమును గాంగుల రాజధానిగ చేసెను. ఈతనికాలమునుండియు, కళింగోత్కల చరిత్రలు కలిసియున్నవి. కాన ఆంధ్ర దేశ చరిత్రకు వానితో నంతగా సంబంధము లేదు.

కులోత్తుంగుడు క్రీ॥ శ॥ 1070-1118 వరకు చోళసామ్రాజ్యమును వైభవముతో పాలించెను. ఈతనికి రాజరాజ చోడగంగు, రాజరాజు, వీరచోడుడు, విక్రమచోడుడు అని నలుగురు పుత్రులుండిరి. వీరిలో రెండవవాడగు రాజరాజు క్రీ॥ శ॥ 1077-78 వరకును, వీరచోడుడు 1078-84 నడుమను, రాజరాజ చోడగంగు 1084-89 మధ్యను వీరచోడుడు తిరిగి 1089-93 వరకును, తండ్రిచే వేంగికిరాజ ప్రతినిధులుగ నియమింపబడి పరిపాలించిరి. 1093 నుండి 1118 వఱకును విక్రమచోడుడు వేంగిని పాలించెనని చెప్పుదురు. దానిని నిరూపించుటకు నిదర్శనములు కానరావు. 1110-1118 మధ్య కులోత్తుంగుని పుత్రులలో నొక్కడైన పరాంతకుడు పాలించుచుండెనని శాసనముల వలన తెలియుచున్నది. కాని 1093 నుండి 1109 వఱకు వేంగి యెవ్వరి పాలనక్రింద నుండెనో నిశ్చయముగ తెలియదు. రాజరాజ చోడగంగు అనువాడే, వేములవాడ భీమకవిచే శపింపబడిన రాజ కళింగగంగు అని కొందరు చెప్పుచున్నారు. ఈ యన్నదమ్ములలో వీరచోడుడు పరాక్రమశాలియు, సమర్థుడునైన పాలకుడుగ ఉండెను. ఈతని శాసనములు టేకి, పిఠాపురము మున్నగు ప్రదేశములందు కాన్పించుచున్నవి. కడపటివాడైన విక్రమచోడుడు కులోత్తుంగచక్రవర్తి మరణానంతరము చోళసింహాసనము నధిరోహించెను. కులోత్తుంగుని కాలముననే వెలనాటిచోడులు చక్రవర్తి యభిమానమునకు పాత్రులై ఆంధ్రదేశమున రాజప్రతినిధులకు సహాయోద్యోగులుగ నుండజొచ్చిరి. విక్రమచోడుడు చోళరాజ్య

మునకు అధిపతియైన పిమ్మట, ఈ వెలనాటి చోడులే వేగి ప్రతి నిధులై చోళచక్రవర్తులకు లోబడి, ఆంధ్ర దేశమును పరిపాలించిరి. కులోత్తుంగుని మరణముచే నేర్పడిన సంధికాలమున, పశ్చిమ చాళుక్య చక్రవర్తియైన ఆరవ విక్రమాదిత్యుడు వేంగిదేశముపై తన సైన్యములను పంపి, దాని నాక్రమించుకొనెను. క్రీ॥ శ॥ 1120-24 నడుమ ఇతని శాసనములు ద్రాక్షారామమునందు గాన్పించు చున్నవి. క్రీ॥ శ॥ 1135 నాటికి విక్రమచోడుడు పశ్చిమ చాళుక్యులను ఆంధ్రదేశము నుండి వెడలగొట్టెను. విక్రమచోడుడు క్రీ॥ శ॥ 1118-1143 వరకును, ఇతని కొడుకు రెండవ కులోత్తుంగుడు 1143-1158 వరకును వాని సుతుడు రెండవ రాజరాజు పండ్రెండవ శతాబ్ది యంతము వరకును పరిపాలించిరి.

చాళుక్యయుగము-సింహావలోకనము:-క్రీ॥ శ॥ 625 మొదలు కొని, రమారమి పండ్రెండవ శతాబ్దాంతమువరకును పూర్వ చాళుక్యులును, చోళులును, వేగిదేశమును శాసించిరి. తూర్పు చాళుక్యుల రాజ్యము ఉత్తరమున విశాఖపట్టణమండలములో చీపురుపల్లి మొదలుకొని దక్షిణమున నెల్లూరు వరకును, పశ్చిమమున కర్నూలు మండలములోని మార్కాపురము, తెలంగాణములో కుక్కనూరు వరకును, తూర్పున సముద్రమునంటియు వ్యాపించి యుండెను. సమగ్రాంధ్ర దేశము పూర్వ చాళుక్యుల యధీనమునందుండినట్లు కాన్పించదు. తెలంగాణా ప్రాంతములో విశేషభాగమును, చిత్తూరు కడపలు తప్ప తక్కిన రాయలసీమ యంతయును పశ్చిమ చాళుక్యులకును రాష్ట్రకూటులకును స్వాధీనమై యుండెడిది. నతవాటిసీమ (మధిర ప్రాంతము) కొలనివిమండలము (మానుకోట తాలూకా) వేంగి చాళుక్యులకు సామంతులైన ముదిగొండ చాళుక్యుల పాలనకు లోబడియుండెను. సబ్బిమండలము (కరీంనగరము జిల్లా) రాష్ట్రకూటుల కాశ్రితులైన లేములవాడ (వేములవాడ) చాళుక్యులచే పాలింపబడుచుండెడిది.

[1] వేములవాడ చాళుక్యులు రాష్ట్రకూటుల సామంతులు. వీరి రాజధాని ఇప్పటి కరీంనగరము మండలమందలి వేములవాడ గ్రామము. నిజామాబాదు జిల్లాలోని పోదన నగరము (ఇప్పటి బోధను) వీరి మొదటి రాజధానిగా నుండినట్లు కాన్పించును. వీరి యధికార మీ రెండు మండలములలోను చెల్లియుండును. వేములవాడ చాళుక్యులు తాము సూర్యవంశీయుల మని చెప్పుకొనిరి. వినయాదిత్య యుద్ధమల్లుడు ఈ వంశస్థాపకుడు. ఈతడు రాష్ట్రకూట రాజ్యమును స్థాపించిన దంతిదుర్గుని యనుచర వర్గములోనివాడు. యుద్ధమల్లుడు, మొదటి అరికేసరి, సోలద గండబద్దెగడు, ఇమ్మడి యరికేసరి, ముమ్మడియరికేసరి మొదలైనవారీ యన్వయములో ప్రాముఖ్యము వహించినవారు. రాష్ట్రకూటులకు వేంగిచాళుక్యులతో జరిగిన యుద్ధములందు, వీరు తమ యధిపతులైన రాష్ట్రకూట చక్రవర్తుల పక్షమున బోరాడుచుండెడివారు. మొదటి యరికేసరి పూర్వచాళుక్య నాల్గవ విష్ణువర్ధనునితోను, బద్దెగడు గుణగవిజయాదిత్య ప్రథమచాళుక్య భీములతోను, యుద్ధములు చేసిరి. ఇమ్మడి అరికేసరి రెండవ చాళుక్య భీమునకు రాష్ట్రకూటులతోనైన సంగ్రామములలో పరోక్షముగ తోడ్పడెను. ఆంధ్రభాషకు రాజరాజనరేంద్రు డెట్టివాడో, ఈ యరికేసరి కన్నడభాష కట్టివాడు. విఖ్యాత కన్నడకవియైన పంపమహాకవి ఈతని యాశ్రితుడై తన విక్రమార్జున విజయ కావ్యమును ఈతని కంకిత మిచ్చెను. ముమ్మడి యరికేసరి తరువాత ఈ వంశము అంతరించెను. వేములవాడ చాళుక్యులు తెలుగుదేశమునకు పాలకులైనను, వీరు కన్నడకవులను పోషించి, ఖ్యాతి గడించుట, ముదావహము. పంపకవీంద్రుడు జైనుడైన ఆంధ్రబ్రాహ్మణుడు. ఈతని నివాసము కమ్మనాటిలోని వేంగిపట్టు గ్రామము. ఈ కవి ఆదిపురాణమునుగూడ రచించెను. మరియొక

1. విశేషాంశములకొఱకు చూడుడు వ్యాసములు : 'వేములవాడ చాళుక్యులు' డాక్టరు యన్. వెంకటరమణయ్యగారు. భారతి. సంపు. 25 సంచికలు 7, 8, 10, 11, 12.

కన్నడమహాకవికికూడ ఆంధ్రదేశ మాశ్రయ మిచ్చుట గమనింప దగినది. శాంతి పురాణము, భువనైక రామాభ్యుదయమువంటి గొప్ప కావ్యములను రచించిన పొన్నకవి గ్రామణి, యాంధ్రదేశము నందు వర్ధిల్లెను. కమ్మనాటిలోని పుంగనూరు గ్రామమున నాగ మయ్యాయను జైన బ్రాహ్మణుని కుమారులైన మల్లప పున్నమ య్యల ప్రోత్సాహముచే, పొన్నడు శాంతిపురాణమును రచించెను. మల్లపయ్య కుమార్తెయగు అత్తిమబ్బకూడ, కన్నడభాషాభిమా నముగల శేముషీధురీణురాలు. గదాయుద్ధము, అజితనాథ పురా ణము, మొదలగు కావ్యములు వ్రాసిన రన్న మహాకవికి అత్తిమబ్బ పోషకురాలు. ఇట్లు కన్నడభాషలో రత్నత్రయ మని ప్రశస్తిగడించిన మహాకవులు ముగ్గురును, ఆంధ్రదేశపు గౌరవాదర పోషణముల నందుట ఆంధ్రులకు కిరీటములేని రాజ్యాధికార మబ్బుట యని చెప్ప వచ్చును. తమ దేశభాషాభ్యుదయములతోపాటు, ఆంధ్రులు అన్య దేశభాషాభ్యుదయములను గాంక్షించువారనుటకు దీనికన్న వేరు నిదర్శన మక్కఱలేదు.

ఆంధ్రదేశమునందు వెలసిన చిన్న చాళుక్య కుటుంబములలో, ముదిగొండ చాళుక్యులొకరు. వీరు రణమర్దకసీమను పాలించుచుండిరి. మంచికొండ దీనిలో నొక భాగము. తెలంగాణములోని నతవాటి కొఱవిసీమలకే రణమర్దకసీమ యని మరియొక పేరుండెను. ఈ వంశములోని మొదటి కుసుమాయుధుడు ప్రథమ చాళుక్య భీముని కాలములో నుండెను. రాష్ట్రకూటులు చాళుక్యభీముని రాజ్యము లోని రణమర్దకసీమ నాక్రమించుకొనగా ముదికొండ చాళుక్య ప్రభువు రాష్ట్రకూటుల నోడించి తరిమివేసి, కొఱవి ప్రాంతమును తూర్పుచాళుక్యుల కర్పించెను. కొఱవి శిలాశాసనమువలన మంచి కొండ (ముదికొండ) చాళుక్యుల చరిత్ర తెలియవచ్చుచున్నది. దానార్ణవుడు వీరికి పొత్తపినాటిలో మూడునందల గ్రామముల యాధిపత్యమిచ్చెను.

తెలంగాణములోని నల్లగొండ మహబూబు నగరము జిల్లాలు మొదట బాదామి చాళుక్యులకును, పల్లవులకును, తరువాత కళ్యాణి

చాళుక్యులకును, చోళులకును, గడిమండలములుగా నుండెడివి. కావున నివి తఱచు యుద్ధరంగములుగ నుండెను. ముఖ్యముగ నల్లగొండయందలి కొల్లిపాక (కొలనుపాక) ఆహవభూమిగా నుండెను. బాదామిచాళుక్యుల యధికారము తెలంగాణముపై—చెల్లెను. ఆలంపూరు దేవాలయములలో వీరి శాసనములు గలవు. ఇక్కడి శాల బ్రహ్మేశ్వరము మొదలగు గొప్పదేవాలయములు పశ్చిమ చాళుక్య నిర్మాణములయి యుండును. గుణగవిజయాదిత్యుని అనంతరము రణమర్దకసీమతప్ప, మిగిలిన తెలంగాణము రాష్ట్ర కూటుల యాధిపత్యమున నుండెను.

## పూర్వ చాళుక్య సంస్కృతి

పూర్వ చాళుక్య యుగము వర్తమానాంధ్ర సంస్కృతికి మొట్టమొదటిమారు బీజావాపము జరిగిన కాలమని చెప్పవచ్చును. దీని ముఖ్యలక్షణములు రెండు పేర్కొనదగును. (1) వైదిక మత వ్యాప్తి (2) ఆంధ్రభాషాసముద్గమము. వీనిలో మొదటిదైన వైదిక మతవ్యాప్తికి పల్లవ శాలంకాయన యుగమునందే పునాదులు వేయ బడినవి. చాళుక్యులు దీనిని లెస్సగా దృఢపరచి, అశేషజనామోదము నొందించిరి. రెండవదగు ఆంధ్రభాషావికాసమునకు పూర్వ చాళుక్య రాజన్యులే జనకులు, కావున వీరు చిరస్మరణీయులు.

విద్యాపోషణము :—వైదికమతవ్యాప్తికి వేంగీప్రభువు లవలంబించిన విధానము సార్థకమైనది. పల్లవ శాలంకాయన విష్ణుకుండిన రాజులవలె వీరెవ్వరును, అశ్వమేధాది క్రతువుల నాడం బరముగా చేసినట్లు కనబడదు. ఈ యుగమున రాజులలో అశ్వమేధ యాజులే వినరారు. కాని వేదవిద్యలను వీరు పోషించినంతిగా, తత్పూర్వయుగపురాజులు పోషించిరేమో తెలియదు. ఘటికాస్థాన ములను గ్రామవిద్యాపీఠములను నెలకొల్పి, పూర్వ చాళుక్యులు వేదవిద్యలను, పఠన పాఠన వ్యవహారములలోనికి దెచ్చి, అవి

జనులయందు వేళ్లుదన్ని సుస్థిరముగా నిలబడునట్లు వ్యవస్థ చేసిరి. అసనపుర ఘటికాస్థానమునుగురించి ఇదివరలో చెప్పనైనది.

మతసామరస్యము:—చాళుక్యరాజులనుండి అగ్రహారములు స్వీకరించినవారిలో, వైదికమతమునకు మూలస్తంభము లైన బ్రాహ్మణులే ఎక్కువగా నుండిరి. వీరిలో విశేష సంఖ్యాకులు తైత్తిరీయశాఖకు చెందినవారు. వాజసనేయశాఖకు చెందినవారికి రెండుదానములును, సామవేద, అథర్వవేదుల కొక్కొక్కటియు, దానములు ఈయబడుట చూడ, ఆంధ్రబ్రాహ్మణులలో వీరిసంఖ్య తక్కువ యని చెప్పనగును. అయినను ఇతర మతములవారికిని గౌరవ సన్మానములు జరుగకపోలేదు. ఆకాలముననే కాలాముఖశైవ సంప్రదాయమువారు రాజాదరణ పొందియుండిరి. లకులేశ్వరునుండి కాలాముఖశాఖ యారంభించెను. వీరి సింహాపరిషత్తుకు (ప్రధాన పరిషత్తు కావచ్చును) చెందిన మఠమొకటి బెజవాడలో నుండెను. అమరావతి మున్నగు ప్రాచీన దేవాలయములలో, శైవాచార్యులు నివసించుచుండిరి. బెజవాడలోని భువనాశ్రయ శివాలయమునకు రెండవ అమ్మరాజు తాడికొండ గ్రామము దానము చేసెను. శివాలయముపక్షమున ఈ దానమును స్వీకరించినవాడు ప్రభూత రాశి యను శైవాచార్యుడు. గుణగ విజయాదిత్యుడు బిక్కవోలు లోని బెజయేశ్వరమహాదేవునకు చేసిన దానమును ఆలయపక్షమున పద్మశివుడను భిక్షావృత్తి స్వీకరించెనని చెప్పబడినది. వేములవాడ చాళుక్యులుకూడ శివాచార్యులకు దానములిచ్చిరి. వీరిలో మొదటి అరికేసరి ఏలేశ్వరమందు నివసించుచుండిన సద్యో శివాచార్యునకు బెల్మొగ మనుగ్రామమును విద్యాదానముగ నిచ్చెను.

అవైదికమయిన జైనమతముకూడ ఈ యుగమున నింకను రాజాదరణమును విస్తారముగనే పొందుచుండెను. బౌద్ధమతముమాత్ర మిట్టిభాగ్యమునకు నోచుకొనలేదు. ఆంధ్రదేశమున బౌద్ధము పూర్తిగా

వెనుకబడెనని చెప్పవచ్చును. [1] మూడవ విష్ణువర్ధనుడు బెజవాడ లోని నడుంబి జైన వసతికి దానముచేసెను. ఈ వసతిలోని జైనాచార్యులు కావురూరిగణములోనివారు. రెండవ అమ్మరాజు జినాలయమునకు పెక్కు దానములు చేసెను. [2] జైనులలో వలహారిగణము, కోటి ముడువగణము, అడ్డకలిగచ్ఛ, నందిగచ్ఛ మొదలగు శాఖ లుండెడివి. గుణగవిజయాదిత్యుని సేనానియైన పండరంగుని వంశము వారు జైనులు. వీరు వంశపరంపరగా, కటకరాజులుగా నుండిరి. పండరంగని మునిమనుమడైన దుగ్గరాజు కటకాభరణ జనాలయము కట్టించెను. దీనికే అమ్మరాజు మలియపూండి గ్రామమును దానము చేసెను. దుగ్గరాజు కర్మరాష్ట్రమునకు రాజవిషయాధ్యక్షుడుగా నుండెను.

పై యంశములనుబట్టి పూర్వ చాళుక్యయుగము మతసహనము ప్రశంసనీయముగ చూపినకాలమని చెప్పదగును.

సాంఘికస్థితి :— వైదికబ్రాహ్మణ మతము ప్రాధాన్యము నొందిన కొలదిని, వర్ణవ్యవస్థ స్థిరరూపము దాల్చెను. జైనులుకూడ చాతుర్వర్ణ వ్యవస్థను, తమ సంఘములో పాటించుచుండినట్లు కాన్పించును. కన్నడకవియైన పొన్నడు జైన బ్రాహ్మణుడు. దీనిచే ఒక మతమునుండి మరియొక మతమునకు, వర్ణభ్రంశత నొందకుండ మారుట సుకరమయ్యెను. ఈ పరివర్తనమువలననే జైనమతము ఆంధ్రదేశములో మరికొంత కాలము నిలువగల్గెను. వర్ణాశ్రమ పద్ధతిని స్వీకరింపని, బౌద్ధము త్వరలో అదృశ్యమయ్యెను. బ్రాహ్మణు లీ కాలమున వేదాధ్యయనపరులేకాక, క్షాత్రవృత్తి నవలంబించి యుద్ధములలో రాజులకు ఖడ్గసహాయము, మంత్రసహాయము చేయుచుండిరి. గుణగ విజయాదిత్యునకు మంగిరాజుతో నైనరణమునందు, శత్రువును సంహరించు కీలకమును దెల్పినవాడు, వినయడిశర్మ యనుబ్రాహ్మణుడు. గుణగు డీతనికి ట్రండపల్లు గ్రామమును బహూకరించెను. విమలాదిత్యుని మంత్రియైన నజ్జయ

1. మూడవ విష్ణువర్ధనుని మునినికుండ తామ్రపట్టికలు.
2. రెండవ అమ్మరాజు కలుచంబఱ్ఱు, మలియపూడి శాసనములు.

ప్రెగ్గడ నెబజోదు. రాజరాజ నరేంద్రునిపక్షమున కర్ణాటులతో పోరిన, రాజరాజ బ్రహ్మమహారాజు, వీరచోడుని సేనాపతియైన మేడమార్యుడు, మున్నగు బ్రాహ్మణవీరు లెందరో, ఈ కాలమున శౌర్యమునకు పేరువడసిరి. బ్రహ్మచర్యవ్రతము ఈ యుగమున కొందరు బ్రాహ్మణులచే, దీక్షతో పాటింపబడుచుండెను. యావజ్జీవ బ్రహ్మచర్యము నడుపు వ్రతమును 'కార్పటీ' వ్రతమనుచుండిరి. దొమ్మన యను బ్రాహ్మణోత్తముడు కార్పటీ వ్రతమును పూనినట్లు, రెండవ అమ్మరాజు మాగల్లు శాసనమువలన దెలియవచ్చుచున్నది. సత్యము, శౌచము, వితరణము, సహనము, దయ, శాశ్వత బ్రహ్మ చర్యదీక్ష – ఇవి కార్పటీ వ్రతలక్షణములు. కాకర్త్యగుండన ప్రార్థనముపై, అమ్మరాజీ బ్రాహ్మణునకు మాగల్లు గ్రామమును బహూకరించెను. కార్పటికుడైన పాండియ అను మరియొక విప్రుడు, రెండవ అమ్మరాజు పడకలూరు శాసనములో వినవచ్చును.

చాళుక్య యుగమునందు కన్నడులును, అరవవారును, అనేక కుటుంబములవారు తెనుగు దేశమునకు వచ్చి, తెనుగు వారిలో కలిసిపోయిరి. పూర్వ చాళుక్యులు మొదట కన్నడ దేశము నుండి వచ్చినవారు గనుక వీరితో సైనికులును, రాజకీయోద్యో గులును, కవి పండితులును, వర్తకము మొదలైన వ్యాపారముల కొరకును కన్నడ దేశీయులు పలువురు ఆంధ్ర దేశమునకు వచ్చి ఇచ్చట స్థిరపడిపోయిరి. తెనుగుభాషా వాఙ్మయములపై, ఆంధ్ర కర్ణాట ప్రజల సమ్మేళనముయొక్క ప్రభావము మున్ముందు చూడ గలము. కుబ్జవిష్ణువర్ధనునకు ఆంధ్ర దేశ విజయములో తోడ్పడిన సాహసిక వీరులకు, చిన్నచిన్న మండలములపై నధికారము లభిం చెను. గుంటూరు మండలములో కొండపడుమటి సీమకు ఏలికలైన దుర్జయవంశీయులును, నతవాడి, వెలనాడు, కోనకంద్రవాడి పాలక కుటుంబములును ఇట్టివారు. బాదామిచాళుక్యరాజ్య మున్నంత కాలము. ఈ కర్ణాట ప్రవాహము తెలుగుదేశమువంక సాగెను. రాష్ట్రకూటులకును, తూర్పుచాళుక్యులకును, బద్ధవైరమయినందున ఆంధ్రకర్ణాటక సంబంధములు చెడెను. పూర్వచాళుక్యులకును, చోళు

లకును రక్తసంబంధ మేర్పడినపిదప, ద్రావిడకుటుంబము లిట్లే ఆంధ్ర దేశమునందు ప్రతిష్ఠింపబడెను. కులోత్తుంగుని నాటినుండి, అరవ వారికి తెలుగు దేశములో పలుకుబడియు, ప్రమేయమును మిక్కిలి హెచ్చెను. వీరచోడుడు వేంగీదేశాధికారిగా నున్నప్పుడు, చోళ దేశమునుండి 536 గురు బ్రాహ్మణుల రప్పించి, పిఠాపురము సమీపమున 'వీరచోడ చతుర్వేది మంగళ' మనుపేర నొక యగ్రహారము చేసి వారి కొసగెను. చాళుక్యుల రాణులైన చోళ కన్యకలతో వారి అనుయాయివర్గము, ఆశ్రితులైన బ్రాహ్మణ కుటుంబములు పెక్కును, తెలుగు దేశమునకు వచ్చియుండును. వీరి సంతతివారే ఇప్పు డాంధ్ర బ్రాహ్మణులలో కనబడు ద్రావిడులు. వీరిలో గొప్పపండితులును మేధావులును నేటికిని గలరు.

విశ్వకర్మకుల మనబడు కంసాలివారికి సంఘమునందు విశేష గౌరవముండెను. రాజశాసనములను రాగిరేకులపై చెక్కుట వీరి ప్రత్యేకవిద్య. శాసన లేఖకులుగా విశ్వకర్మకులజులు పేర్కొనబడు చుందురు. వీరు శైవులైనను, వృత్తి గౌరవమునుబట్టియు శిల్పులగుట చేతను, ఆచార్యశబ్దము వీరిపేర్లకు చేర్చబడుచుండెను. విక్కొక్క రాజుకాలమున నొక్కొక్క విశ్వకర్మ రాజశాసనలేఖక పదవియం దుండినట్లు తోచును. రెండవ విజయాదిత్యుని శాసనముల వ్రాయస కాడు అక్షర లలితాచార్యుడు. రాజరాజనరేంద్రుని శాసనలేఖకుడు గండాచార్యుడు. శాసన శిల్పమునందు నిపుణులైన విశ్వకర్మలు తరుచు విజయవాడ వాస్తవ్యులు.

చాళుక్యరాజులు వేదమువంటి పవిత్రవిద్యలతోపాటు, లౌకిక విద్యలనుకూడ నాదరించి ప్రోత్సహించుచుండిరి. గుణగ విజయా దిత్యుడు గాంధర్వ విద్యా ప్రవీణురాలును, సౌందర్య పరాజిత దేవాంగనయు, నగు చల్లవ్వ యను నామెకు అత్తిలి గ్రామములో కొంత భూదానముచేయుట దీనికి తార్కాణము.

భాషావికాసము:—ఇంతవరకును అరణ్యవృక్షమువలె, అజ్ఞాత స్థితియై పడియుండిన, ఆంధ్రభాషాకల్పతరువు చాళుక్యుల కాలము

నుండి పల్లవ పత్రపుష్ప ఫలశోభితమై నయనానంద మొనగూర్ప మొదలిడెను. చాళుక్యయుగమునకు పూర్వము తెలుగుభాష యుని కినే కొందరు సందేహించిరి కాని యీ మతము గణ్యము కాదు. శాతవాహనులు, ఇక్ష్వాకులు, మున్నగువారి కాలమున ప్రాకృతము రాజభాషగా నుండెను. విష్ణుకుండుల కాలమునుండియు, ప్రాకృత మును త్రోసిరాజని సంస్కృతము రాజభాషగా పీఠ మలంకరించెను. కావున దేశభాషయైన తెలుగు జనవ్యవహారమునందు మాత్రమే నిల్చిపోయెను. మొట్టమొదటిమారు తెలుగునకు రాజభాషా గౌరవ మును ప్రసాదించినది పూర్వచాళుక్యులని తెలిసికొని, ఆంధ్రలోకము వారికి కృతజ్ఞతాబద్ధమై యుండవలెను. వీరి శాసనములలో అధిక సంఖ్యాకములు సంస్కృతములో నున్నను, తెలుగులోకూడ వీరు పెక్కు శాసనములు ప్రకటించిరి. కర్ణాట దేశమునందు, బాదామి చాళుక్యులు కన్నడభాషలో శాసనములు ప్రకటించుట కారంభించిరి. తెనుగున రాజశాసనములను వ్రాయించు నాచారమును, ప్రథమ మున ప్రవేశపెట్టినవారు రేనాటిని పాలించుచుండిన తెనుగు చోళ ప్రభువులు. పూర్వచాళుక్యులు వారి మార్గము ననుసరించిరి. మొదటి జయసింహవల్లభుని విప్పర్లశాసనము పూర్వచాళుక్యుల ప్రథమాంధ్రభాషాశాసనమని చెప్పబడుచున్నది. రేనాటిచోడులు, అనంతపురమండలములోని పశ్చిమచాళుక్యులు, వారి సామంతులైన బాణరాజులుకూడ, మొట్టమొదటి పర్యాయము తెనుగును శాసన భాషగా వాడినవారిలో గణ్యులు. ఇట్లు క్రీ. శ. ఏడవ శతాబ్ది ద్వితీయపాదమునుండియు తెలుగుశాసనములు లభించుచున్నవి. ఈ శాసనభాషయందలి కొన్ని ముఖ్యలక్షణములను పేర్కొన వచ్చును. మొదటి దశలోని శాసనము లన్నియు వచనములో వ్రాయబడుచుండెను. ఈనాటి భాషలో ప్రాకృత పదములు విస్తారముగ తెనుగున కలసిపోయి, కన్పించును. తెనుగుపదము లైనను మన కిప్పు డపరిచితమైన రూపములో నున్నవి. కావున, ఈ శాసనముల భాష మనకు సులభముగా అర్థముకాదు. రెడ్డి

శబ్దమునకు ఆకాలమున రట్టగుడి, రట్టడి, రట్టోడి యనురూపములును బహువచనమున రట్టడ్లు, రట్టళ్లు అనియు ప్రయోగింపబడుచుం డెను. పురుగులు అనుటకు ప్రువ్వులు అనియు, నాశనము చేయు వాడు అనుటకు అచ్చువాన్డు అనియు, మన కపరిచితమైన స్వరూప ములతో శబ్దములు కాన్పించును. ఇప్పుడు మనము బహువచన ప్రత్యయముగా 'లు' వాడుచున్నాము. ప్రాచీన కాలమున దీని రూపము 'ళ్, ళు, లు' అని వివిధముగా నుండెడిది. గుడులు, మడులు, అనుటకు గుడ్లు, మడ్లు అనియు, ఆళ్లు (ధాన్యము) అనుటకు ఆడ్లు అనియు ప్రయోగించెడి వారు. అప్పటిభాషలో శకటరేఫము విరివిగా వాడబడుచుండెను. 'ఱ' యను అక్కరము శబ్దములలో, తరుచు ప్రత్యక్ష మగును. పడుమట అనుటకు 'పఱుమట' అనియు చోళ, చోడ అనుటకు 'చోఱ' యనియు, ఆనాటి రూప ములు. ప్రాచీన శాసనములందలి వర్ణక్రమముకూడ మనకు క్రొత్తగా దోచును. అరసున్న ఆనాడు లిఖించెడివారుకారు. దానిస్థానములో పూర్ణబిందువే యుండెడిది. కాని యది తేల్చి పలికెడివారు కావ చ్చును. ఎక్కడ నిండుసున్న పూర్తిగ ఉచ్చరింపవలెనో, అచ్చట, పూర్ణానుస్వారము తరువాతవచ్చు హల్లును, ద్విత్వము చేసి వ్రాసెడి వారు. విరించి (బ్రహ్మ) అని వ్రాయవలసి వచ్చినచోట విరించ్చి అనియు, గండడు అనుటకు గండ్డండు అనియు వ్రాసెడివారు. ద్విత్వ పరకముగాని నిండుసున్న యున్నచో అచ్చట అర్థానుస్వారస్థాన మని తెలియవలెను.

మిక్కిలి ప్రాచీన శాసనములలోని వాక్య రచనాపద్ధతిలో కొంత విశేషము గలదు. ఇప్పటి మన వాక్యములో విశేషణము లతో కూడినకర్తముందుగను, తరువాత కర్మ మొదలగు ఇతర పదములును చిట్టచివరకు క్రియాపదమును వచ్చును. [1] మొదటి జయసింహ వల్లభుని మాచెర్ల శాసనములోను, రేనాటి చోళుల

1. చూడు. వ్యాసము. శ్రీమల్లంపల్లి సోమశేఖర శర్మగారు. భారతి, సంపు. 23 సంచిక 8.

'పొట్లదుర్తి - మాలెపాడు' శాసనములోను దీనికి భిన్నమైన వాక్యరచనా విధానము కన్పించును. వీనిలో కర్తృపదము తరువాత క్రియాపదమును తరువాత కర్మ మున్నగునవియు నుండు నట్లు వ్రాయబడినది. ఆంగ్లభాషలో మన మిట్టిక్రమమునే చూతుము.

ఇట్లు ప్రాచీన శాసన భాషలోను లిపిలోను ఎన్నియో విశేషములు చూడనగును.

తెలుగు శాసనరచనలో రెండవ దశయందు, గద్యములే కాక పద్యములుకూడ శాసన కావ్యములో గూర్చుచుండిరి. నన్నయభట్టు ఆదికవి యనియు, అతనికి పూర్వము తెలుగుభాషలో కవిత్వమే లేకుండెడిదనియు, ఒక అపోహ లోకములో నుండెను. కాని పద్యములలో రచింపబడిన శాసనములు దొరకినప్పటినుండియు, ఈ యభిప్రాయము పొరపాటని తేలినది. శాసనములలో తెలుగు పద్యరచన, మొదటిమారు గుణగ విజయాదిత్యుని కాలమునుండియు కన్పించుచున్నది. అనగా నన్నయభట్టుకు నూటయేబది సంవత్సరములకు పూర్వమే తెలుగులో పద్యరచన యుండెడిదని విశదమగుచున్నది. ఆ కాలమున గొప్ప కవు లెవరేని యుండిరో లేదో, వారేవైన కావ్యములు రచించిరో లేదో, యనునది మాత్రము తెలియరాని యంశము. నన్నయభట్టుకు పూర్వము అట్టి కవులుగాని, కావ్యములుగాని, యుండినట్లు నిదర్శనములు మాత్రము ఈ నాడు లభించుటలేదు. గుణగ విజయాదిత్యుని నాటి పద్యశాసనములలో, పండరంగని అద్దంకి శాసనము, మొదటిచాళుక్యభీముని ధర్మవర శాసనము గణింపదగినవి. సీసపద్యము, ఆటవెలది, తేటగీతి, తరువోజ, అక్కఱ మొదలగు దేశీయ ఛందస్సులనే, ఆ కాలపు కవులు వాడుచుండిరి. సంస్కృత వృత్తములైన ఉత్పలమాల, చంపకమాల, శార్దూలము, మత్తేభమువంటి అక్షరగణ ఛందస్సులు నన్నయభట్టారకుని కాలమునందు వాడుకలోనికి వచ్చినవి. రెండవ యుద్ధమల్లుని (క్రీ. శ. 927-934) బెజవాడ శాసనము మధ్యాక్కఱలలో వ్రాయబడినది. సీసపద్యములందు ప్రాసయతియు, సామాన్య

యతియుకూడ కవులు వినియోగించుచుండిరి. ఈ విధముగ ఆంధ్ర భాషలో గద్యపద్యాత్మకమైన రచన జరుగుటకు, చాళుక్యరాజులు అవకాశము కల్పించిరి.

పూర్వచాళుక్య మహారాజుల ఆంధ్రభాషాపోషణ ప్రశస్తి ఇంతటితో చాలదు. రాజకీయ వ్యవహారములలో భాషకు సంకుచితమైన ప్రయోజనము మాత్రమే లభించును. ఆ భాషయొక్క పైపై రూపమును మాత్రమే, ఇట్టి లౌకిక రచనలయందు చూడగలము. భాషయొక్క నిజసౌందర్యమును, దానియాత్మ విలసనమును, చూడవలెనన్నచో, కావ్యజగత్తునందు మాత్రమే సందర్శింపగలము. ఆంధ్రభాషను సాహిత్య మనువినువీధిలో, పదునారుకళలతో వెలుగునిండు చంద్రునివలె, ప్రతిష్ఠించిన ఘనతకూడ చాళుక్య వంశమువారికే దక్కినది. వీరి యాంధ్రసాహిత్యపోషణమును, నన్నెచోడ మహాకవి యిట్లు ప్రశంసించినాడు.

'మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁబుట్టించి తెనుం
గును నిలిపి రంధ్రవిషయం
బునఁజనఁజాళుక్యరాజు మొదలుగఁ బలువుర్'

అంతకుముందు తెనుగుదేశమున సంస్కృత కవితారీతులు ప్రచారములో నుండగా, చాళుక్యరాజు మొదలైన పలువురు లోకములో వెలయునట్లు దేశికవితను బుట్టించి, తెనుంగును ఆంధ్ర విషయమున నిలిపిరని నన్నెచోడుని యభిప్రాయము. ఈ చాళుక్యరాజు విమలాదిత్య తనూజుడైన రాజరాజ నరేంద్రుడని కొందరు చెప్పుదురు. ఇదిసరికాదు. క్రీ॥ శ॥ 848 – 92 ల మధ్య వేంగిని పాలించిన గుణగవిజయాదిత్యుని కాలముననే తెనుగున కవితపుట్టినది. కాని రాజరాజ నరేంద్రునికాలము వరకును కావ్యరచన ప్రారంభముకాలేదు. తాను తెలుగురాజై యుండగా, తెలుగువారు తమ భాషాకావ్యమని చెప్పుకొని గర్వింపదగిన యుద్గ్రంథమేదియు లేకుండుట, గొప్పకొఱత యని రాజరాజ నరేంద్రుడు తలపోసియుండును.

ఇదే చింత నన్నయ భట్టారకునకు జనించియుండును. జైనుడైన పంపమహాకవి పంచమ వేదమని ప్రసిద్ధిజెందిన మహాభారతమును, తనకు తోచిన మార్పులతో విక్రమార్జున విజయ మనుపేర వ్రాసి పెట్టగా, వైదిక మతాభిమాను లా గ్రంథమును, వ్యాసమునీంద్రుని యుద్దేశములకు భంగముచేకుండ, ప్రజానీకమునకు తెలియు దేశ భాషలో వ్రాయుటకై పూనుట లోపమని, నన్నయకు స్ఫురించెను. ఇట్లు ఏలికయొక్కయు, ఆశ్రితుడైన కవిపుంగవుని యొక్కయు, తలంపు లొకే మార్గమున నడచెను. బండియు ఓడ్లును ఏకమైనచో కొండ లెక్కుటకు కొదువ యేమి? వేదోక్తమైన పరమధర్మములను, ఆంధ్రులు సులభముగా చదివి తెలిసికొన గల్గుట యొక లక్ష్యము. ఉదాత్తసాహిత్య నిర్మాణముచే, ప్రజల చిత్తవృత్తులను సంస్కరించి, వారిని విజ్ఞానవంతులుగా చేయుట, మరొక లక్ష్యము. ఈ రెండు ధ్యేయములును మహాభారతాంధ్రీకరణముచే నెరవేరునని రాజరాజు నన్నయభట్టులు గుర్తించి, మహాసముద్రమువంటి యా గ్రంథమును మథించుటకు నిశ్చయించిరి.

లక్ష్యము మహత్తరమైనదే కాని దానిని చేరుమార్గము సుగమముగ లేదు. అదివరకు తెలుగులో ఉత్తమ గ్రంథములు వెలువడలేదు. చిల్లర రచన లుండి యుండవచ్చును. ప్రజాగీతములు, ఏలలు, జోలలు, కథలు, బహుశః ప్రాకృతనాటకములు కూడ నుండి యుండవచ్చును. కాని, భారతమువంటి యుద్గ్రంథము కడముట్టవ్రాయుట కీచిన్న ఛందస్సులు గాని, పరిమిత శబ్దజాలము గల భాష కాని, తూగజాలవు. దీనికి దారి యేమని చింతాలోలుడై యున్న నన్నయ భట్టారకునకు, అర్జునునకు భారత యుద్ధములో శ్రీ కృష్ణునివలె, నారాయణభట్టను మహాపండితుడు సాయపడెను. నారాయణభట్టు నన్నయకు సహాధ్యాయి. అష్టభాషా విశారదుడు. ముఖ్యముగ కన్నడభాషయందు నిధియైనవాడు. కన్నడమునం దప్పటికే గొప్ప గొప్ప పద్య గ్రంథములు వెలువడినవి. వాని యనుభవజ్ఞానము గల నారాయణభట్టు తోడుపడ, నన్నయ ఆంధ్ర

మహాభారత రచనకు గడగెను. కన్నడభాషా సంప్రదాయములను- అనగా చంపూకావ్యపద్ధతి, సంస్కృతవృత్త ప్రయోగము, సంస్కృత పదములను ఇంచుగాగవ విధానముచే తెలుగు చేసి యాంధ్రశబ్దజాలమును విపులీకరించుకొనుట - వీనిని నన్నయభట్టు ఉపయోగించుకొని యుండును. ఇష్ట దేవతా స్తుతివంటి మరికొన్ని చిల్లర సంప్రదాయములనుకూడ, అతడు ఎరువుతెచ్చుకొని యుండును. ప్రధానముగ తన యుపజ్ఞయు, లోకానుభవమును, శబ్దశుద్ధియు, సంస్కృతాంధ్రభాషా పారంగతత్వమును, ఆధారములుగ గొని, నన్నయభట్టు మహాభారతాంధ్రీకరణమునకు గడగెను. ఆది సభాపర్వములను అరణ్యపర్వములో నాల్గవ యాశ్వాసమునందలి కొంతభాగమువరకును నన్నయభట్టు రచించెను. ఏ కారణముననో అతని రచన యింతటితో నిల్చిపోయెను. ఈతని కవిత్వము ద్రాక్షాపాకమై సర్వజనాహ్లాదము కూర్చుచుండును. నన్నయ రచన యందు తత్సమశబ్దము లెక్కువగా నుండును. కేవల దేశ్యపదములు తక్కువగా నుండును. అయినను ఈతడు వాడిన సంస్కృత శబ్దములు సుప్రసిద్ధములై, రసానుకూలమైనవి. మారుమూల సంస్కృత పదముల నెచ్చటను, పాండిత్య ప్రకటనముకొఱకై ఈ మహాకవి వాడలేదు. నన్నయభట్టునకు శబ్దానుశాసను డను బిరుదుగలదు. ఆంధ్రశబ్దచింతామణి యనువ్యాకరణము వ్రాయుటచే నీ బిరు దీతనికి గలిగెనని పూర్వపుపండితులు తలచుచుండిరి. ఆంధ్రశబ్ద చింతామణి నన్నయకృత మని ఇప్పటి పరిశోధకు లంగీకరింపరు. అయినను, తనకుముందు నియతమైన మార్గము లేక అవ్యవస్థితముగానున్న తెనుగుభాషకు ఒక మహోన్నత స్థాయియు. స్థిరరూపమును, ప్రసాదించుటచేతనే శబ్దశాసన బిరుదము నన్నయ యెడ సార్థకమగుచున్నది.

పూర్వచాళుక్య యుగమునాటి మరికొన్ని విశేషములను పేర్కొని వీరి యశోగీతిని ముగించవచ్చును. ఈ మహారాజులు దైవ భక్తి ప్రేరితులై పెక్కు శివాలయములను కట్టించిరి. రాజమహేంద్ర

వరము, ద్రాక్షారామము, భీమవరము, సామర్లకోట మున్నగు ప్రదేశ ములలో వీరు నిర్మించిన దేవాలయములు గలవు. కొంత మహాబలి పుర శిల్పములోని శక్తియు, కొంత లాలిత్యము. సమ్మిళితము చేసి చాళుక్యశిల్పము వెలసినది. ఈ యుగమునందు పంచాయతి సభ లును, స్థానిక స్వపరిపాలనమును, ఉండినట్లు నిదర్శనము కలదు. రెండవ చాళుక్య భీమమహారాజు మచిలీపట్టణ శాసనములో విద్ద మయ్య అను బ్రాహ్మణుని ప్రశంసగలదు. విద్దమయ్య వేదవేదాంగ విదుడు. ఈతని కుమారులును, మనుమలును 'వారగోష్ఠులలో' నేర్పరులైన వక్తలుగా, పేరు గడించినట్లు చెప్పబడినది. వారగోష్ఠులనగా మహాజనసభలు. మరియు 'పంచవార సభల'లో వీరు సభ్యులుగా నియమింపబడుచుండిరి. ఇవి పంచాయతీ సభలు కావచ్చును. విద్ద మయ్య కుమారులను, మహాజనసభవారు గౌరవముతో చూచు చుండిరట. [1]ధాన్యము మొదలైనవి కొల్చుటకు రాజముద్రిక గల కొలపాత్ర లుండెడివి. ఇవి మనకాలపు సీలు కుంచములవంటివని తోచును. ఇట్లే భూమికొలతకు [2]'ముమ్మడి భీమకోల' యనబడు దీర్ఘమగుకొలతమాన ముండెను. ముమ్మడి భీము డనునది విమలా దిత్యుని బిరుదాభిధానము. ఈతని కాలమునుండియే ఈ పద్ధతి వాడుకలోనికి వచ్చియుండును. చోళులును, కళింగగాంగులునుకూడ భూమికొలతకై తగు ఏర్పాట్లు కావించియుండిరి.

సముద్రవ్యాపారము:—పూర్వచాళుక్యుల కాలమున దేశాం తరములతో సముద్రముమీద వ్యాపారము సాగుచుండెననుటకు శక్తివర్మ బంగారు నాణెములు అరకాను, సయాము మున్నగు ప్రదేశములలో దొరకుటయే తార్కాణము. కళింగదేశములో

---

1. రెండవ అమ్మరాజు నమ్బూరు (నంబూరు) శాసనము.

2. రాజ రాజ నరేంద్రుని మండపేట శాసనము.

దిమిలవిషయ మను ప్రాంత ముండినట్లు కుబ్జ విష్ణువర్ధనుని చీపురుపల్లి శాసనమువలన దెలియవచ్చుచున్నది. ఇది దివ్వెలవిషయమని, అనగా సముద్రముమీది జాడల గుర్తుకొఱకై తీరమునందు దీపములు వెలిగించి యుంచు ప్రదేశమని, యూహింపబడినది. "[1]దిమిల యలమంచిలికి మూడుమైళ్లున్నది. ఇప్పుడొక కుగ్రామమైనను, పూర్వము దిమిల చాల ప్రసిద్ధమైనది. ఆంధ్రుల నౌకాధికారమున కిది యొక ప్రబల నిదర్శనము. ఇచట గొప్ప దీపస్తంభములుండెడివి. తూర్పు తీరమున రాకపోకలు గావించుచుండిన యోడల కీ స్తంభములు మార్గదర్శకములై యుండెడివి. దిమిల ప్రక్కనే తెరువుపల్లె యను గ్రామమున్నది. అందు రత్నాకరస్వామి యాలయము నేటికిని గలదు. ఈ దేవాలయ సమీపమున ప్రాచీనకాలమునాటి యిటుకలు వేనవేలున్నవి. రత్నాకరమనగా సముద్రము. సముద్రదేవుని గౌరవార్థముగా ఆలయము కట్టబడినది. సముద్రముమీది యోడలకు తెరువు చూపించుటకు అనగా దారి యిదియని చెప్పుటకు దీపములు లేక దివ్వెలు ప్రతిష్ఠింపబడిన చోటు కాలక్రమమున దిమిల యైనది."

1. కళింగ దేశ చరిత్ర—పుట 289.



# ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి

## 15-వ ప్రకరణము

## వెలనాటిచోడులు — తెలుగుచోడ వంశములు

### వెలనాటిచోడులు క్రీ॥ శ॥ 1108-1206

క్రీ॥ శ॥ 12 వ శతాబ్దము ప్రాగాంధ్రమున వెలనాటిచోడ రాజుల యభ్యుదయ పతనములును. పశ్చిమాంధ్రమున కాకతీయుల యభ్యుదయమును తిలకించిన కాలము. కృష్ణానదికి దక్షిణమున నున్న మండలమునకు వెలనాడు సంజ్ఞ పూర్వము చెల్లుచుండెను. ఇది ఇప్పటి గుంటూరుజిల్లాకు సరిపడును. దీని ముఖ్యపట్టణము రేపల్లె తాలూకాలోని చందవోలు లేక ధనదపురము. వెలనాడుకు దక్షిణమున గుండ్లకమ్మ పెన్నానదుల మధ్యదేశము పాకనాడన బరగెను. దీనిలో నెల్లూరుజిల్లాయును, కడప మండలములోని తూర్పు భాగమును, చేరియుండెను. తెలుగు దేశములో పరిపాలన చేసిన చిన్న చిన్న చోడకుటుంబములు చాల గలవు. చోడులు తాము సూర్యవంశ క్షత్రియులమనియు, కరికాల చోడుని యన్వయము వారమనియు, చెప్పుకొనుచుండిరి. క్రీ॥ శ॥ 12 వ శతాబ్దమునందు ఆంధ్ర దేశము నేలిన వెలనాటిచోడు లీ క్షత్రియకుటుంబములవారు కారు. వెలనాటి చోడులు దుర్జయవంశ్యులు, చతుర్థకులజులు. వీరు కాంచీపుర చాళుక్యచోడ చక్రవర్తులకు సామంతులును, మిత్రులును, అయి ఆంధ్ర దేశాధికారమునందు నియుక్తులయిరి. ప్రభుభక్తి సూచకముగ వెలనాటిచోడులు తమ యేలికల నామధేయములను తమ కుమారులకు పెట్టుచుండిరి. కావున వీరిలోకూడ కులోత్తుంగచోడ, రాజేంద్రచోడ, మున్నగు అభిధానములు కానవచ్చుచుండును.)

ఈ వంశమునకు మూలపురుషుడైన మల్లవర్మ, త్రిలోచన పల్లవ చక్రవర్తిని సేవించి, షట్సహస్రదేశాధిపత్యమును బడసెను. ఆరు వేలనాడు అనబడు నీ ప్రాంతము వెలనాటిలోని యొక భాగము.

ఆంధ్ర బ్రాహ్మణులలో నొక శాఖవారైన ఆర్వేలనియోగులు, పూర్వము షట్సహస్రదేశమునం దుండినవారు. కనుకనే వీరికి ఆరువేలనాటి నియోగులు. ఆరువేల నియోగులు, ఆర్వేలవారు అను పేళ్లు కల్గెను. వెలనాటిచోడులలో మొదట గణుతి కెక్కినవాడు, క్రీ॥ శ॥ 1076 - 1108 నడుమ ఉండిన మొదటి గొంకరాజు. ఇతడు ప్రథమ కులోత్తుంగచోడ చక్రవర్తివద్ద సేనాపతియై, యాతని విశ్వాసమును చూరగొని, వెలనాటిపై అధికారమును సంపాదించెను. ఆ చక్రవర్తి కుమారులు, వేగిరాజు ప్రతినిధులుగా నుండిన కాలమున, వెలనాటివారు విశ్వాసపాత్రులైన భృత్యులై, పరిపాలనమునందు వారికి తోడ్పడుచుండిరి. కులోత్తుంగుని మరణానంతర మాతని సంతతివారు వేగిదేశమును తాము ప్రత్యక్షముగ నేలుట మాను కొని, తమ కిష్టభృత్యులైన వెలనాటివారిచే, ఆంధ్రదేశపాలకులుగ నియమించిరి. మొదటి గొంకరాజుకొడుకు మొదటి వెలనాటి చోడుడు (క్రీ॥ శ॥ 1108 - 1132). ఇతనికి కులోత్తుంగ చోడుడని నామాంతరము. ఈతడు చాళుక్యచోడ చక్రవర్తియొక్క ప్రత్యేకాభిమానమునకు పాత్రుడై, కులోత్తుంగచోడుని దత్తపుత్రు డను ఖ్యాతిని గడించెను. వెలనాటిచోడుని కాలముననే ఈ వంశము వారు ఆంధ్రమండలాధిపతులైరి. క్రీ॥ శ॥ 1118 ప్రాంతమున కాంచీపుర కులోత్తుంగుడు మరణించుటయు, విక్రమచోడుడు సింహాసనాధిష్ఠితు డగుటయు జరిగెను.

ఈ యవకాశము గనిపెట్టి, కళ్యాణిచాళుక్య ప్రభువైన ఆరవ విక్రమాదిత్య చక్రవర్తి వేంగిదేశముపై దండునడిపి, దానిని స్వాధీనము చేసికొనెను. ఈతనిశాసనములు ద్రాక్షారామమున గాన్పించుచున్నవి. ఇప్పటినుండి క్రీ॥ శ॥ 1135 వరకు కాంచీపురము వరకు గల దేశము పశ్చిమ చాళుక్యుల యధీనమునందుండినట్లు [1]చారిత్రకులు తలచుచున్నారు. అట్లు స్వాధీనమైన దేశమును,

1. చూడు. వ్యాసములు. "కాకతిగణపతి దేవుడు - కులోత్తుంగరాజేంద్ర చోళుడు" డాక్టరు యన్. వెంకటరమణయ్యగారు, భారతి సంపు. 22 సంచికలు 2, 6, 7.

విక్రమాదిత్యుడు తన సామంతులకును దండనాయకులకును, పంచి యిచ్చెను. నెల్లూరు చోళులలో ప్రసిద్ధుడైన బిజ్జన సంతతివారి కీ కాలముననే పాకనాటిపై ప్రభుత్వము లభించెను. వీరు మొదట పశ్చిమ చాళుక్యులకు సామంతులుగ నుండిరి. కాంచీపుర చోళులును, వెలనాటివారును, పశ్చిమ చాళుక్యులను తరిమివేయుటకు తీవ్రకృషి సల్పుచు. కొంతవరకు కృతకృత్యులైరి. వెలనాటిచోడుని కుమారుడు రెండవ గొంకరాజు మహాపరాక్రమశాలి. ఈతడు క్రీ॥ శ॥ 1132-63 వరకు తెలుగుదేశము నేలెను. గోదావరీ తీరమున క్రీ॥ శ॥ 1135 ప్రాంతమున జరిగిన మహాయుద్ధములో, గొంకరాజు మున్నగువారు పశ్చిమ చాళుక్యులను పూర్తిగ నోడించి, దేశమునుండి వెడల నడచిరి. [1]రెండవ గొంకరాజు కాలమున వెలనాటిరాజుల పాలనము ఉత్తరమున మహేంద్రగిరినుండి దక్షిణమున పాకనాటివరకును సాగెను. మంచనకవి రచించిన 'కేయూరబాహుచరిత్ర'ను కృతిబొందిన నందూరి గుండయమంత్రి పూర్వీకులైన గోవిందనమంత్రియు, అతని కుమారుడు కొమ్మనమంత్రియు, వెలనాటి రెండవ గొంకరాజువద్దను, అతని కుమారుడు రెండవ వెలనాటిచోడ రాజువద్దను, మంత్రి దండనాథ, సంధి విగ్రహిపదముల నలంకరించి యుండిరి. ఈ మంత్రిశిఖామణు లిద్దరును, అతుల పరాక్రమాన్వితులై, తమ యేలికలకు తోడ్పడుటయే కాక, తటాకారామ ప్రతిష్ఠాపనాది ప్రజాహిత కార్యము లెన్నియో చేసినట్లు, కేయూర శాహుచరిత్ర కీర్తించుచున్నది. [2]వీరిలో కొమ్మనమంత్రి, వెలనాటి ప్రభువుల పక్షమున నెల్లూరు తెలుగు చోళులనుంచి, పాకనాటిని జయించి, దానికి ప్రతినిధి పాలకుడుగ నియమింపబడెను.

రెండవ గొంకరాజు కుమారుడైన రెండవ వెలనాటి చోడరాజు క్రీ॥ శ॥ 1163-80 ల నడుమ ఆంధ్రవిషయాధిపతిగా నుండెను.

---

1. ఆంధ్రదేశచరిత్ర సంగ్రహము—శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు.
2. శ్రీ యన్. వి. రమణయ్యగారి పైవ్యాసము.

నందూరి కొమ్మనమంత్రి ఈతని వద్దకూడ దండనాయకుడుగా నుండెను. క్రీ॥ శ॥ 1170 ప్రాంతమున కర్ణాటకులు పాకనాటిపై దండెత్తిరాగా, కొమ్మనమంత్రి వారిని క్రొత్తచర్ల యుద్ధమున ఓడించి, పారదోలెను. ఈకాలమున కాలచుర్య బిజ్జలుడు కళ్యాణి చాళుక్యరాజ్యము నాక్రమించుకొని, యేలుచుండెను. రెండవ వెలనాటిచోడుని కాలముననే, సుప్రసిద్ధ శైవాచార్యుడు మల్లికార్జున పండితారాధ్యుడు చందవోలునకు వచ్చి, యచ్చట జైన బౌద్ధులను వాదములో గెల్చెను. పండితునకు వెలనాటిచోడునిపై ఆగ్రహము జనించి శపించెనని చెప్పుదురు.

రెండవ వెలనాటి చోడుని తరువాత వెలనాటి రాజ్యమునందు అల్లకల్లోలము జనించెను. ఈతని కుమారుడు మూడవ గొంకరాజు (క్రీ॥ శ॥ 1180–86) సమర్థుడు గాకుండెను. సామంతులు తిరుగుబాటు చేయజొచ్చిరి. తూర్పు చాళుక్యరాజులలో బేతవిజయాదిత్యుడను నాతడుండెను. ఈతని వంశములోనివాడైన విష్ణువర్ధన మల్లపరాజు ఈకాలమున నుండెను. మల్లపరాజు వెలనాటివారినుండి పిఠాపుర ప్రాంతమును ఆక్రమించుకొనెను. కాకతి రుద్రదేవ మహారాజు ఈ సమయముననే వెలనాటిని జయించుట కుద్యుక్తుడై, దండెత్తి వచ్చెను. ద్రాక్షారామమునందు క్రీ॥ శ॥ 1185–6 నాటిది రుద్ర దేవుని శాసనము కలదు. రుద్రదేవుడు వెలనాటివారి ప్రత్యర్థియైన చాళుక్యవిష్ణువర్ధన మల్లపదేవుని మిత్రునిగ గుర్తించి, యాతని పరిపాలనా వత్సరములను తన శాసనములో జేర్చెను. వెలనాటిలో జరిగిన కల్లోలమునందు, కాలచుర్యులుకూడ రుద్రదేవాదులకు తోడ్పడినట్లు తోచును. ఇట్లు క్రీ॥ శ॥ 1180–86 ల నడుమ వెలనాటి రాజ్యము విప్లవములకు గురియైనను, తరువాత తేరుకొని మరి రెండు దశకములు పరిమిత దేశమున చెల్లెను.

క్రీ॥ శ॥ 1186 తరువాత వెలనాటి చోడులు చందవోలు గుంటూరు ప్రాంతమును పోగొట్టుకొనిరి. ఈవంశములో కడపటి వాడును, మూడవ గొంగరాజు కుమారుడును అయిన పృథ్వీశ్వర

రాజు గోదావరి కుత్తరమున పిఠాపురమునుండి పాలించెను. విష్ణు వర్ధన మల్లపదేవుని, పిఠాపుర ప్రాంతమునుండి, కొంతకాలమువరకు వెలనాటివారు తరిమివేసి యుందురు. పృథ్వీశ్వరరాజు తల్లియైన జయాంబిక పిఠాపుర సమీపమందలి నవఖండవాడను దానము చేసెను. ఈ ప్రాంతమునకు ప్రోలునాడను పేరుండెను. [1]పృథ్వీశ్వరుని మంత్రియు, దండనాథుడును, అగు కొలని కెన్నయామాత్యుడు కళింగదేశములో కొంతభాగమును, తన యేలిక కొఱకై జయించెను. వెలనాటి పృథ్వీశ్వర రాజు నష్టమైన వెలనాటి రాజ్యభాగములను, తిరిగి సంపాదించుటకై కృషిచేయుచు ఆ యత్నము నందు క్రీ॥ శ॥ 1206 తరువాత నెల్లూరు చోడతిక్క రాజుచే, దురమునందు సంహ రింపబడెను. ఇంతటితో వెలనాటి చోడరాజుల స్వాతంత్ర పరిపాలన మంతమొందెను. క్రీ॥ శ॥ 1225 నాటికి ప్రాగాంధ్రము కాకతీయుల వశమయ్యెను. వెలనాటి వంశీయులు కొందరు కాకతి గణపతి దేవునికి సామంతులై, మఱికొంతకాలము నిల్చియుండినట్లు తెలియ వచ్చుచున్నది.

[2]వెలనాటి చోడుల ప్రభుత్వము దుర్బలమై, పట్టు తప్పిన కాలములో, ఆంధ్రదేశమునం దెన్నియో సామంతకుటుంబములు తలయెత్తినవి. వీరిలో గుడిమెట్ట, విజయవాడ రాజధానులుగా చాగివారును; ధాన్యకటకము అను ధరణికోట రాజధానిగా కోట వంశమువారును; కోనదేశము (తూర్పు గోదావరిజిల్లా అమలాపురం రాజవోలు తాలూకాలు) నందు హైహయులును; కొణిదెన, నెల్లూరు, పొత్తపి రాజధానులుగా తెలుగు చోడరాజులును; కొండపడుమటి దేశమున కమ్మనాయకులు; పల్నాటి సీమను హైహయ వంశము వారును (నలగామ రాజాదులు) పరిపాలన చేయుచుండిరి. ఈ మాండలికరాజు లందరును తమలోతాము కలహించుచు దేశమునం

1. ఆంధ్రకవితరంగిణి. మూడవ సంపుటము. పుట. 189. మ. రా. శ్రీ చాగంటి శేషయ్యగారు.

2. 'ఆంధ్రదేశ చరిత్ర సంగ్రహము'—శ్రీమల్లంపల్లి సోమశేఖర శర్మగారు.

దశాంతిని ప్రబలజేయుచుండిరి. ఈ కుటుంబవైరము లన్నియు పల్నాటి వీరయుద్ధములో పర్యవసించెను.

వెలనాటి చోడరాజులు రమారమి యొక శతాబ్ది కాలము మాత్రమే పూర్వాంధ్రదేశమును పాలించినను. మనదేశ చరిత్రలో వీరికి సముచితస్థానము కలదు. చాళుక్య-చోడసామ్రాజ్య స్థాపన కారణముగ ఆంధ్రదేశ మొక సామంతమండలమయి, దాక్షిణాత్యుల పలుకుబడి ప్రభావములు హెచ్చుచున్న కాలమున, వీరు చంద వోలులో తెలుగు ఆస్థానమును స్థాపించి, రాజరికమును నిర్వహించి, ఆంధ్ర ప్రతిష్ఠను నిలబెట్టిరి. వీరు చోడచక్రవర్తులకు నామమాత్ర ముగ ప్రతినిధులైనను, చాలవరకు సర్వస్వతంత్రులై యుండిరి. వెలనాటి చోడులు పరిపాలనము చేయుకాలమున దేశమునం దెన్నియో మార్పులు వచ్చెను. అందు ముఖ్యమైనది మత విప్లవము. శైవవైష్ణవములు రెండును మహాశక్తితో ఈనాడు విజృంభించెను. ఇట్టికల్లోలపరిస్థితులందు రాజ్యము చేసిన వారగుటచే కాబోలు, వెలనాటి చోడులు ఆంధ్రభాషను ప్రసిద్ధకవులను, విశేషముగా పోషించలేదు. వారి కాలము నిరంతర యుద్ధములలో గడచియుం డెను. అయినను మంచన మహాకవి రచించిన కేయూరబాహు చరిత్రవలన, వెలనాటిరాజుల కాలమున తెలుగుదేశము సుఖపడి నట్లె తోచును. వీరి భాండాగారమునందు తొమ్మిదికోట్ల నాణెము లుండెననియు, వీరికి గొప్పసైన్య ముండెడి దనియు, వీరికి పశువుల మందలు విస్తారముగా నుండెననియు, ప్రతిదినము డెబ్బదియైదుపుట్ల నేయి, వీరి మంద లిచ్చుచుండెననియు, మంచనకవి వర్ణించెను. వీరి రాజధానియైన ధనదపురము మహావైభవాన్వితమై యుండె నట. అక్కడ ఎన్నియో దేవాలయములును, వెండికొండలనంటి మేడలును, సర్వ వస్తు సమృద్ధములైన పణ్యవీథికలును, గొప్ప తటాకములు, ఉపవనములు, సరస్సులు, చెఱకుతోటలు, ప్రాసంగు చేలును, ఉండి యానగరము కుబేరుని పట్టణమువలె నుండెను. ధనదపురములోని ప్రజలు మట్టికడవలు, నులకమంచములు,

పూరిండ్లు, నూలు చీరలు, మణిస్థగితముకాని బంగారు నగలను ఎరుగ కుండిరని కవి పొగడెను. ఇందు కొంత యతిశయోక్తి యనుకొన్నను, వెల నాటి చోడుల పాలనము ప్రజలకు సుఖావహముగ నుండెనని చెప్పదగును. ఈ మంచనకవి క్రీ॥ శ॥ 1300 ప్రాంతమున నుండియుం డును. కేయూరబాహు చరిత్రము నీతి ప్రధానములును, రసవంత ములు నైన కథలుగల చక్కని గ్రంథము. ఈ కవి శైలి ద్రాక్షా పాకముగా నుండును. "బాలరసాలసాల నవ పల్లవ కోమల కావ్య కన్యకన్" అనురసవత్తరమైన పద్యమును బమ్మెర పోతనా మాత్యుడు చెప్పెనందురు. కాని ఇట్టి పద్యమే మంచన కేయూర బాహుచరిత్రలో మొదట కన్పడుచున్నది.

క్రీ॥ శ॥ పండ్రెండవ శతాబ్దియందు, దక్షిణాపథము నట్టుడికిన ట్లుడికించిన మత విప్లవ స్వరూపమును, సంగ్రహముగ తెలిసికొన దగును. పూర్వ చాళుక్యయుగమునుండియు, వైదిక మత విజృంభ ణము తీవ్రముగా జరిగెనని చెప్పబడినది. దీనితో పాటు శైవము కూడ వర్ధిల్లెను. శైవులలో కాలాముఖులు, పాశుపతులు, మొదలగు శాఖలుండెడివి. క్రమముగ శైవము బలపడి, కర్మప్రధాన మైన వైదిక మతమును వెనుకకు నెట్టెను. శైవము భక్తి ప్రధానమైన మతము. ప్రజలు దీనిని సులభముగా అర్థము చేసికొని, యవలం బింప గలుగుచుండిరి. శివుడే పరదైవము, శివభక్తులే మహనీయులు, అన్యదైవతములు ప్రమాణము కాదను తీవ్రవాదము, ఆంధ్రశైవు లలో తల యెత్తెను. శివమహత్త్వవాదులలో, పండితత్రయమను వారు ఆంధ్రదేశమున గొప్పపేరు పొందిరి. శ్రీపతి పండితుడు, శివలెంకమంచన పండితుడు, మల్లికార్జున పండితారాధ్యుడు అను వారిని పండిత త్రయమందురు. వీరు వేదవేదాంగవిదులైన బ్రాహ్మ ణులు. శైవమతమే వేద ప్రతిపాదితమైన శుద్ధమత మని, వేద ప్రమాణములతో, వీరు సమర్థించుచుండిరి. దివ్యప్రభావమును, శక్తు లను, ప్రదర్శించు అద్భుత చర్యలను గావించుచు, వీరు ప్రజల భయ విశ్వాసములను, భక్తిని చూరగొనుచుండిరి. శివుడే పరదైవమని చాటుటకై శ్రీపతి పండితుడు నిప్పులను వస్త్రాంచలమున మూట

కట్టెనట. పండితత్రయమువారు శివభక్తాగ్రేసరులైనను, వీరు వర్ణ ధర్మమును వీడలేదు. "భక్తిమీది వలపు, బ్రాహ్మ్యంబుతోపొత్తు, పాయలేను నేను బసవలింగ" అని మల్లికార్జున పండితుడు చెప్పె నందురు. వీరు సన్న్యాసమును, శంకరుని యద్వైతమును నిరసించిరి.

పండితత్రయములో మిక్కిలి ప్రశస్తిగడించినవాడు గురు మల్లికార్జున పండితారాధ్యుడు. ఈతడు ద్రాక్షారామమునందలి యొక బ్రాహ్మణ కుటుంబమున జన్మించి, శివపూజా ధురంధరుడై యద్భుత భక్త్యావేశమును, చూపుచుండెను. ఈతని చుట్టును శివ భక్తులును, భక్తురాండ్రును, సమావేశమగుచుండిరి. ఈకాలము నందే శ్రీబసవేశ్వరుడు కర్ణాటకమునందు వీరశైవమతస్థాపన చేయు చుండెను. మల్లికార్జున పండితుడాతనిని సందర్శించుటకై, శిష్యగణము తో బయలువెడలెను. మార్గమునందు వెలనాటి చోడుల యాస్థాన మును చూచి, యక్కడ వాదమునందు బౌద్ధ జైనుల నోడించెను. ఈతడు శ్రీశైల సమీపమునకు చేరుసరికే, శ్రీబసవేశ్వరుడు లింగై క్యము నొందెను. ఇది క్రీ॥ శ॥ 1167 లో జరిగెనని చెప్పుచున్నారు. వృద్ధుడైన మల్లికార్జున పండితుడుగూడ మరికొంత కాలమునకు క్రీ॥ శ॥ 1170 ప్రాంతమున శివసాయుజ్యము చేరెను. పాల్కురికి సోమనాథుడను శివకవి, ఈపండితుని చరిత్రను తన 'పండితారాధ్య చరిత్ర' యను గొప్ప ద్విపదకావ్యములో సమకూర్చెను. మల్లికా ర్జున పండితుడు స్వయముగ కవియై యుండెను. ఈతడు 'శివతత్త్వ సారము' అను పుస్తకమును రచించెను. ఇది శతకము కాకపోయి నను, ఆంధ్ర శతక వాఙ్మయమునకు ఓంకారమువంటిదని చెప్ప వచ్చును. ఇందులో శివుని లీలలను, శివభక్తుల యద్భుత మాహాత్మ్యములను, పండితారాధ్యుడు కొనియాడెను. దీని శైలి పటుత్వము కలిగి సులభమై యొప్పారినది.

పండితత్రయమును మించి శైవమతమున కొక నూత్న రూపమును, అపూర్వోత్తేజమును గలిగించినవాడు శ్రీ బసవేశ్వరుడు. శ్రీశైలమునకు పశ్చిమమున కర్ణాట దేశమందు, మంగళవేడరాజు,

ఆతని సాధ్వి మాదాంబయును విప్రదంపతుల తపఃఫలమై, శ్రీబస వేశ్వరుడు నందికేశ్వరుని యవతారమున జన్మించెను. ఈ మహా నీయుడు బాల్యమునుండియు శివభక్తి భరితుడై, యుండెను. కర్మ మార్గమును రోసి, అచంచల శివభక్తియే ముక్తికి దెరువని, విశ్వ సించెను. తండ్రి యీ బాలున కుపనయనము చేయబోగా, బసవే శ్వరుడు వలదని వాదించి, సోదరియైన నాగాంబతో గూడి ఇలు వెడలిపోయి, కూడలి సంగమేశ్వర దేవునిగూర్చి తీవ్రతప మొన ర్చెను. ఆ దేవుని దివ్య సందేశమును గైకొని, నిష్ఠతో జీవించు చుండగా, ఈతని మేనమామయు, కాలచురి బిజ్జలరాజు సేనాపతి యును నగు బలదేవ దండనాథుడు, బసవేశ్వరునకు తనకుమార్తె నిచ్చి పెండ్లికావించెను. బలదేవ దండనాథుని మరణానంతరము బిజ్జలుడు బసవేశ్వరుని తనకు బండారిగను, మంత్రిగను, నియమిం చెను. బిజ్జలుడు (క్రీ॥ శ॥ 1162-66) కల్యాణి నగరమునుండి పాలించు చుండిన పశ్చిమ చాళుక్యుల దళవాయిగా నుండి యావంశమువారిని తొలగించి తానే రాజ్యము నేల జొచ్చెను. ఈతడు జైనమతమునం దాదరము గలవాడు. శ్రీ బసవేశ్వరుడు శివభక్తులలో వర్ణభేదము లుండరాదని యుద్ఘోషించిన ధీరుడు. ఈతని భక్తులలో సర్వ వర్ణములవారును ఉండిరి. బసవేశ్వరుడు వర్ణ సాంకర్యము గావించు చున్నాడని ఇతర మంత్రులు బిజ్జలునితో నివేదించుకొనిరి. బిజ్జలు నకు బసవేశ్వరునకును విభేదములు తీవ్రరూపము దాల్చెను. అంత బసవేశ్వరుడు కల్యాణ నగరమును శపించి వెడలిపోయి, కూడలి సంగమేశ్వరునిలో లింగైక్యము చెందెను. వీరశైవులు బిజ్జలుని సంహరించిరి. అంతట జైనులకును, వీరశైవులకును, కల్యాణి నగరమునందు ద్వేషములు చెలరేగి, అన్యోన్య సంహారరూపముగ సంగ్రామము జరిగి, ఆయూరు శ్మశానమయి పోయెను. బసవేశ్వరుని మతమును వీరశైవ మందురు. శివభక్తియే దీని మొదటి సూత్రము. వేదప్రమాణము నీమత సంస్కర్త యంగీకరింప లేదు. వర్ణవిభేదము లను నిరసించి, బసవేశ్వరుడు గొప్పసాంఘిక విప్లవమునకు బీజములు

నాటెను. ఈకారణముచే ప్రజానీకమునందు వీరశైవము గొప్ప వ్యాప్తిని గాంచెను. వీరశైవము కర్ణాటమునం దుద్భవించినను, దీః ప్రభావము పశ్చిమాంధ్రదేశముపై నెక్కువగా పడెను. పాల్కురికి సోమనాథుడు తన బసవపురాణములో బసవేశ్వరుని జీవితమును వర్ణించెను.

వీరశైవమువలెనే అన్య ప్రాంతములయందు రూపొంది, ఆంధ్రదేశములో వ్యాపించినది వైష్ణవమతము. ఈమతము ద్రావిడదేశమునందు విశేషాదరమును పొందెను. భక్తిప్రధానమైన వైష్ణవమును, శఠగోపుడు, నాథముని, యామునాచార్యుడు మొదలగు భాగవతోత్తములు బోధించిరి. అరవ దేశమునందు ఆళ్వారులు అనబడు వైష్ణవ భక్తులు గొప్ప మత ప్రచారము గావించిరి. ఇట్లుండ పదునొకండవ శతాబ్దమున వైష్ణవ మతస్థాపకుడును, మహా సంస్కర్తయు నగు, రామానుజాచార్యులు క్రీ॥ శ॥ 1018 ప్రాంతమున ద్రావిడదేశమున శ్రీపెరుంబూదూరను గ్రామమున బ్రాహ్మణ కుటుంబమున జన్మించెను. ఆసూరి కేశవసోమయాజి, కాంతిమతి యనువారితని తల్లిదండ్రులు. రామానుజుడు కాంచీపురమున వేదాంత విద్యారహస్యముల నభ్యసించెను. ఈయన శంకరాచార్యుని యద్వైతమతమును ఖండించి, విశిష్టాద్వైతము అను నూతన వైష్ణవ సిద్ధాంతమును నెలకొల్పెను. రామానుజుడు కూడ వర్ణభేదములను నిరసించి, భక్తియే ప్రధానమని బోధించెను. కేవలజ్ఞానము ముక్తిదాయకము కాదని ఈతని మతసారాంశము. ఈ కాలమున కాంచీపురము నేలుచుండిన కులోత్తుంగ చోడదేవుడు (రాజరాజ నరేంద్రుని కుమారుడు) శైవమతాభిమానముగలవాడు. రామానుజుని నూతన సందేశము నీత డాదరింపలేదు. రాజదండనమునకు వెఱచి, రామానుజాచార్యుడు చోడసామ్రాజ్యమును వీడి హొయసల రాజ్యమునకు (కర్ణాటకమునకు) పారిపోయెను. అచ్చట తన మతప్రచారము చేసి, కులోత్తుంగుని మరణానంతరము విక్రమచోడునిచే ఆహ్వానింపబడి, రామానుజాచార్యుడు స్వదేశమునకు

మరలివచ్చెను. ఈయాచార్యుడుగూడ శంకరాచార్యునివలెనే వ్యాస విరచిత బ్రహ్మసూత్రములకును, ఉపనిషత్తులకును, భగవద్గీతకును, వైష్ణవమత పరముగ భాష్యములను రచించెను. ఈతని భాష్యమును, శ్రీభాష్య మందురు. రామానుజుడు దేశసంచారము గావించి, పెక్కు జైన శైవ క్షేత్రములను వైష్ణవ పుణ్యక్షేత్రములుగా మార్చెను. రామానుజాచార్యుని వైష్ణవమత ప్రభావము దక్షిణాంధ్ర దేశముపై మిక్కుటముగాపడెను. పల్నాటిలో బ్రహ్మనాయకుడు వైష్ణవ భక్తాగ్రేసరుడని ఖ్యాతిగాంచెను. ఈతనిని పల్నాటి విష్ణువందురు. బ్రహ్మనాయకునకును, నాయకురాలికిని, వైరము పొసగుటకు ముఖ్యకారణము వీరు భిన్నమతాభిమానులగుటయని తోచును. బ్రహ్మనాయుడు సర్వవర్ణములవారితో కలసి 'చాపకూడు' భుజించి సంఘ సంస్కారమును గావించెను.

వెలనాటి చోడులకాలమున అమరావతి-ధాన్యవాటి పరిసరములందు, బౌద్ధమత మింకను కొనయూపిరితో నుండెను. కోటవంశపురాజులు బుద్ధభగవానుని యాలయమునకు దీపదానములు చేసిరి. శైనవైష్ణవమతములు రెండును విజృంభించి, జైన ధర్మమును రూపుమాపెను. ఈనూతన మతముల ప్రభావము శిల్పములందును, వాఙ్మయమునందును, ప్రస్ఫుటముగ గాన్పించును. దేవాలయ నిర్మాణ మీయుగమున చురుకుగా సాగెను. శివకేశవులకు బ్రహ్మాండమైన దేవాలయములను నిర్మించుట పుణ్యహేతువుగ భావించి, రాజులును, ధనాఢ్యులును, అనేక మండపములు, గోపురములు, విమానములు గల దేవాలయములను కట్టించుచుండిరి. వీటిమీద శిల్పులు చక్కని బొమ్మలను మలచుచుండిరి. దేవాలయములు భక్తుల సమావేశములకు మాత్రమేకాక, విద్యావ్యాసంగములకును ఉపయోగపడజొచ్చెను. దేవాలయ మొక విద్యాసంస్థయయ్యెను. ఇక్కడ వేదాది విద్యలను, గురువులు శిష్యులకు బోధించుచుండిరి. ఇవి చాళుక్యయుగములోని ఘటికాస్థానముల వంటివి. కళలకును, కళాపోషణకును గూడ దేవాలయము కేంద్ర

మయ్యెను. భగవంతుని యారాధనమునకై నృత్య సంగీతములను వినియోగించుట ఇప్పుడాచారముగ జరుగుచుండెను. ఇందుకొరకై నృత్య విద్యాకౌశల్యముగల నటులును, దేవదాసీలును, సంగీత పారంగతులును, దేవాలయము నాశ్రయించి యుండిరి. శివుని లీలలను, విష్ణుని యవతారవృత్తాంతములను, నాటకములుగ వ్రాసి దేవాలయావరణములో ప్రదర్శించుచుండిరి. ఈ కాలపు దానము లన్నియు దేవుని అంగరంగ భోగములకొఱకు, చేయబడుచుండుట గమనింపదగినది. అంగరంగ భోగమనగా దేవుని నిత్యారాధనము, నాటక, నృత్య సంగీతాది ప్రదర్శనములు, ఉత్సవములు మొదలైనవి. దేవాలయములలో అఖండజ్యోతి వెల్గించు టొక పుణ్యకార్యముగ అప్పటి ప్రజలు భావించుచుండిరి. దేవుని నిత్యదీపమునకై నేయి పోయించుట; అట్టి నేతిని సమకూర్చుటకై గొఱ్ఱెలను పశువులను దేవునికి కైంకర్యముగ గొల్లవారికడ ఇచ్చుట – ఆనాటి దాన శాసనములలో చూడనగును.

వీరశైవ మతప్రభావము వాఙ్మయమునందుకూడ చూడవచ్చును. వేదములమీదను, పురాణములమీదను, భక్తి శ్రద్ధలు సన్నగిల్లెను. కావున నన్నయభట్టారకు డారంభించిన మహాభారతాంధ్రీకరణ కార్యమును ఈ యుగమున నెవరును చేపట్టలేదు. శైవమతవ్యాప్తికై, గ్రంథరచనము చేసినవారిని శివకవులందురు. శివకవులు సంస్కృత పురాణముల నాంధ్రీకరించుట మానివేసిరి. దేశీయులైన శివభక్తుల చరితములనే వీరు కావ్యవస్తువుగా చేకొనుచుండిరి. ఆంధ్ర కర్ణాట ద్రావిడ దేశములందలి శివభక్తుల జీవితములనే వీరు చిత్రించుచుండిరి. మల్లికార్జున పండితారాధ్యుని శివతత్త్వసారములోను, పాల్కురికి సోమనాథుని బసవపురాణమునందును, అసంఖ్యాక శివభక్తుల, భక్తురాండ్ర పవిత్ర నామములు వినవచ్చును. కవిత్వ వస్తువునందే కాక, కావ్యశైలియందును, శివకవులు నూతనమార్గము త్రొక్కిరి. వీరు ప్రజాభ్యుదయవాదులు. జనసామాన్యమునకు సులభముగా అర్థమగు భాషయందును, వారి

మరలివచ్చెను. ఈయాచార్యుడుగూడ శంకరాచార్యునివలెనే వ్యాస విరచిత బ్రహ్మసూత్రములకును, ఉపనిషత్తులకును, భగవద్గీతకును, వైష్ణవమత పరముగ భాష్యములను రచించెను. ఈతని భాష్యమును, శ్రీభాష్య మందురు. రామానుజుడు దేశసంచారము గావించి, పెక్కు జైన శైవ క్షేత్రములను వైష్ణవ పుణ్యక్షేత్రములుగా మార్చెను. రామానుజాచార్యుని వైష్ణవమత ప్రభావము దక్షిణాంధ్ర దేశముపై మిక్కుటముగాపడెను. పల్నాటిలో బ్రహ్మనాయకుడు వైష్ణవ భక్తాగ్రేసరుడని ఖ్యాతిగాంచెను. ఈతనిని పల్నాటి విష్ణువందురు. బ్రహ్మ నాయకునకును, నాయకురాలికిని, వైరము పొసగుటకు ముఖ్యకారణము వీరు భిన్నమతాభిమానులగుటయని తోచును. బ్రహ్మనాయుడు సర్వవర్ణములవారితో కలసి 'చాపకూడు' భుజించి సంఘ సంస్కారమును గావించెను.

వెలనాటి చోడులకాలమున అమరావతి-ధాన్యవాటి పరిసరములందు, బౌద్ధమత మింకను కొనయూపిరితో నుండెను. కోట వంశపురాజులు బుద్ధభగవానుని యాలయమునకు దీపదానములు చేసిరి. శైనవైష్ణవమతములు రెండును విజృంభించి, జైన ధర్మమును రూపుమాపెను. ఈనూతన మతముల ప్రభావము శిల్పములందును, వాఙ్మయమునందును, ప్రస్ఫుటముగ గాన్పించును. దేవాలయ నిర్మాణ మీయుగమున చురుకుగా సాగెను. శివకేశవులకు బ్రహ్మాండమైన దేవాలయములను నిర్మించుట పుణ్యహేతువుగ భావించి, రాజులును, ధనాఢ్యులును, అనేక మండపములు, గోపురములు, విమానములు గల దేవాలయములను కట్టించుచుండిరి. వీటిమీద శిల్పులు చక్కని బొమ్మలను మలచుచుండిరి. దేవాలయములు భక్తుల సమావేశములకు మాత్రమేకాక, విద్యావ్యాసంగములకును ఉపయోగపడజొచ్చెను. దేవాలయ మొక విద్యాసంస్థయయ్యెను. ఇక్కడ వేదాది విద్యలను, గురువులు శిష్యులకు బోధించుచుండిరి. ఇవి చాళుక్యయుగములోని ఘటికాస్థానముల వంటివి. కళలకును, కళాపోషణకును గూడ దేవాలయము కేంద్ర

తెలుగు భాషలో మొట్టమొదట శాసనములు ప్రకటించిన కీర్తి రేనాటి చోడులకు చెందుచున్నది. కాలక్రమమున ఈ చోడులు పాకనాటిలోనికి కూడ వ్యాపించి, చిన్న చిన్న కుటుంబములుగ చీలి, ఆయా ప్రాంతముల నధికారము వహించిరి. వీరిలో రేనాడు, పొత్తపినాడు, కొణిదెన, నెల్లూరు ప్రదేశములనేలిన చోడకుటుంబములు పేర్కొనదగినవి.

రేనాటి చోడులు కడపమండలములో పాలనము చేసిరి. వీరి శాసనములు క్రీ॥ శ॥ ఆఱునేడు శతాబ్దులనాటివి జమ్మలమడక ప్రొద్దుటూరు తాలూకాలలో దొరికినవి. పొట్లదుర్తి - మాలెపాడు శాసనము ఈ కాలమునకు చెందినది. వీరి తరువాత ఈ మండలము నేలినవారు పొత్తపి చోళులు. వీరికి మధురాంతక పొత్తపి చోళులని బిరుదు నామము. దాక్షిణాత్య చోళ ప్రభువైన పరాంతకుని సామంతులలో నొకడు మధురాంతకు డుండెననియు, అతడు కడప మండలములో పొత్తపి రాజధానిగా ఏలెననియు చారిత్రకులు తలచుచున్నారు. పదునొకండవ శతాబ్దమునుండియు పొత్తపి చోళుల శాసనములు కడప మండలములో గాన్పించుచున్నవి. ఈ జిల్లాయందలి పొత్తపి వీరిముఖ్యపట్టణము. కొణిదెన చోడులనబడు వారు గుంటూరు మండలములోని నరసారావుపేట సమీపముననున్న కొణిదెన తమకు రాజధానిగా, కమ్మనాటిలోని కొంత భాగమును కమ్మనాటిని పరిపాలించుచు వచ్చిరి. కొణిదెనకే పూర్వము కొట్యదొన యని పేరు. వీరిని ఓపిలిసిద్ధి యనురాజు కాకతీయ గణపతి దేవుని యాజ్ఞమీద జయించెను. క్రీ॥ శ॥ 1224 నాటి ఓపిలి సిద్ధి శాసనము గలదు. నన్నూరు చోడులను నొక నూతన వంశము వారి ప్రశంస శాసనములలో కానవచ్చును. క్రీ॥ శ॥ 1088 వ సంవత్సరమున వ్రాయింపబడిన యొక శాసనము నన్నూరు హుంకార దేవి యాలయములో లభించినది. దీనిలో నన్నూరుచోడులు పేర్కొనబడిరి. కుమారసంభవ మహాప్రబంధమును వ్రాసిన నన్నె

చోడకవి ఈ నన్నూరుచోడశాఖకు చెందినవాడని పరిశోధకులు గుర్తించుచున్నారు.

నన్నెచోడు డొక ప్రసిద్ధాంధ్ర పూర్వ మహాకవి. ఈతని కుమారసంభవమునకు ఆంధ్రసాహిత్య చరిత్రలో, ప్రముఖస్థానము గలదు. నన్నెచోడుని తండ్రి, పాకనాటి ప్రభువైన చోడబలిరాజు. తల్లి హైహయ వంశజమైన శ్రీ సతి. నన్నెచోడునకు కవిరాజశిఖామణి టెంకణాదిత్యుడను బిరుదులు గలవు. ఈ కవి కాలమును గూర్చి పండితలోకమున తీవ్ర వివాదము గలదు. ఈ నన్నెచోడుడు నన్నయభట్టుకు పూర్వ మొక శతాబ్దము ముందుండెనని కొందరు విశ్వసించుచున్నారు. ఈతడు నన్నయ తిక్కనల నడిమికాలమున క్రీ॥ శ॥ 1120 ప్రాంతమున నుండియుండునని పలువురు తలపోయుచున్నారు. ప్రథమాంధ్ర కవియైనను గాకున్నను, నన్నెచోడుడు రచించిన గ్రంథము ఆంధ్రసాహిత్యములో ప్రబంధ శాఖకు, తొలి యుదాహరణమై, పురాణ కవిత్వమున, ఆంధ్ర భారతమునకు గల గౌరవ ప్రతిపత్తులను పొందుచున్నది. కుమారసంభవములో కుమారస్వామి జన్మకథ ప్రధానమైనది. దక్షాధ్వర ధ్వంసము మొదలగు శైవ గాథలును దీనిలో గలవు. నన్నెచోడు డీ కావ్యమును, తన గురువైన జంగమ మల్లికార్జున యోగికి కృతి సమర్పించెను. ఈ కావ్యారంభమున నీతడు ఇష్టదేవతా స్తుతి, సుకవి స్తుతి కుకవి నిరసనము, షష్ఠ్యంతములు, మొదలైన కావ్య సంప్రదాయముల నెన్నిటినో ప్రథమ పర్యాయము ప్రవేశపెట్టెను. తరువాత వచ్చిన ఆంధ్రకవులందరును, కవి బ్రహ్మ తిక్కనామాత్యుడుగూడ, ఈ సాంప్రదాయముల పాటించుచువచ్చిరి. ఈ కవిపై కన్నడ భాషా సాహిత్యముల ప్రభావము స్ఫుటముగా ప్రతిభాసించినది. నన్నెచోడుడు తన కవనములో కొన్ని కన్నడ పదములను వాడెను. శివకవుల 'జాను తెనుగు' ఆదర్శమును, ప్రప్రథమమున లోకమునకు ప్రకటించినవా డీ మహాకవియే. జాను తెనుగువాదియైనను, నన్నెచోడుడు సంస్కృత వృత్తములను వాడి, ప్రౌఢరచనమును గూడ చేసెను. ఈతని కవిత్వములో ప్రాచీన శబ్దములును, పూర్వ

వ్యాకరణ రూపములును, వింత ప్రయోగములును, విశేషముగా నుండుటచే, ఆంధ్రమహాభారత మంత సులభముగా నిది యర్థము కాదు. సంస్కృతమునందు కాళిదాస మహాకవి కుమార సంభవ కావ్యమును వ్రాసెను. నన్నెచోడుని కృతి దాని కనుకరణము కాదు. నన్నెచోడునకు వర్ణనాత్మకమైన కవిత్వమందు ప్రీతిమెండు. ప్రకృతి పరిశీలనమునందును, వర్ణనమునందును, ఈ కవికి నేర్పు అధికము. చక్కని జాతీయములను, నామెతలను, వాడుటలోకూడ నన్నెచోడు డద్వితీయుడు.

నెల్లూరు చోడవంశము:—నెల్లూరునకు విక్రమ సింహపుర మని నామాంతరము. కావున ఈ చోడశాఖను విక్రమ సింహపుర చోడశాఖయని కూడ అందురు. వీరు మధురాంతక పొత్తపిచోడ శాఖకు చెందినవారు. కవిబ్రహ్మ తిక్కనామాత్యు డీ వంశము వాడైన మనుమసిద్ధిరాజు నాస్థానము నలంకరించుటచే ఈ శాఖా చరిత్ర మనకు అవశ్యపఠనీయ మగు చున్నది. తిక్కనామాత్యుని 'నిర్వచనోత్తర రామాయణము' మనుమసిద్ధి కంకిత మీయబడినది. ఈ గ్రంథముయొక్క అవతారిక యందు, మనుమసిద్ధి పూర్వుల ఘనతను తిక్కన ప్రశంసించి యున్నాడు. కరికాలచోడుని యన్వ యమునందు బుట్టినచోళ బిజ్జన ఈ వంశములో మొదటి ప్రసిద్ధ పురుషుడు. ఈ [1] చోళబిజ్జన కళ్యాణి చాళుక్య చక్రవర్తియగు మొదటి సోమేశ్వరుని సామంతుడుగానుండెను. క్రీ. శ. 1048 ప్రాంతమున గద్వాలు సంస్థానములోని పూండూరు సమీపమున జరిగిన చాళుక్యచోళ యుద్ధములో, బిజ్జన పాల్గొనెను. ఈతని రాజ్యము గుల్బర్గమండలమున నుండెను. తరువాత చెప్పదగినవాడు మనుమసిద్ధి తండ్రియైన తిక్కభూపతి. తిరుకాళశబ్దభవము తిక్కడు అను పదము. ఈతడు కడుశూరుడై, పలుయుద్ధములు గావించి, తన చిన్నరాజ్యమును విస్తరింపగల్గెను. కడప, చిత్తూరు, చెంగ ల్పట్టు మండలములను జయించి, కాంచీపురమువరకు నితడు పాలిం

1. చూడు_వ్యాసము _ డాక్టరు యస్. వి. రమణయ్య భారతి 22 సం॥ 2 సంచిక.

చెను. పిన్నవయస్సునందే నెల్లూరు తిక్క భూపాలుడు వెలనాటి
పృథ్వీశ్వరుని యుద్ధములో సంహరించెను. నెల్లూరిచోడులు చోడ
చక్రవర్తులకు పెనుసకు సామంతులుగ నుండిరి. కర్ణాట సోమేశ్వ
రుడు, కాంచీపురచోడ చక్రవర్తియైన మూడవ రాజేంద్రచోళుని
ఓడించి, సింహాసన మాక్రమించుకొనెను. అప్పుడు తిక్కరాజు తన
సార్వభౌముని పక్షము బూని కర్ణాటకుల నోడించి తరిమి, చోళసిం
హాసనముపై రాజేంద్రచోళుని ఆసీనుని జేసెను. దీనికై తిక్కరాజు
నకు 'చోళస్థాపనాచార్య' బిరుదము లభించెను. ఈతడు మరియు
కొందరు శత్రువుల జయించి, తన సింహాసనము రిపుదుర్నిరీక్ష్యముగా
చేసికొనెను. ఈ తిక్కరాజు క్రీ. శ. 1248 వరకు జీవించియున్నట్లు
శాసనములవలన తెలియవచ్చుచున్నది.

తిక్కభూపాలుని కుమారుడు మనుమసిద్ధిరాజు. ఇతడే నిర్వ
చనోత్తర రామాయణ కృతిపతి. ఈతడును పరాక్రమశాలియైనట్లు
తిక్కనామాత్యుడు వర్ణించెను. కాని తండ్రినివలె జయలక్ష్మి ఈతని
వరించలేదు. రాజ్యారంభకాలముననే అక్కన బయ్యన లను
దాయాదులు, మనుమసిద్ధి రాజ్యము నాక్రమించుకొనిరి. అంతట
కవి తిక్కన తన ప్రభువు పక్షము వహించి, ఓరుగల్లునకు, పయన
మయి, కాకతిగణపతి చక్రవర్తిని సందర్శించెను. పాండిత్య ప్రభా
వముచే గణపతి దేవుని మెప్పించి, మనుమసిద్ధి రాజ్యము నాతనికి
సంపాదించి పెట్టుటకై సాయము నభ్యర్థించెను. గణపతి దేవుడు
తిక్కనామాత్యుని వైదుష్యమునకును, వేదమతస్థాపనము - జైన
మతఖండనమునకు మెచ్చియు, (నెల్లూరు ప్రాంతమున తన యధి
కారము విస్తరింపజేసి కొనదలచియు) తిక్కన ప్రార్థన నంగీకరించి,
సైన్యముల బంపి నెల్లూరును దహించి, అక్కనబయ్యనలను పార
ద్రోలి, మనుమసిద్ధి రాజ్యములో కొంత భాగము తా నుంచుకొని,
మరికొంత భాగ మాతని కిచ్చివేసెను. ఈ కథ కాసెసర్వప్ప వ్రాసిన
సిద్ధేశ్వర చరిత్రము నందును, దీని ననుసరించి కూచిమంచి జగ్గకవి

(క్రీ. శ. 1720) రచించిన సోమ దేవరాజీయమునందును వర్ణిత మైనది.

ఆధునిక చరిత్రకారులు కొందఱు, కాటమరాజు కథను ఆధారపఱచుకొని మనుమసిద్ధికి కాటమరాజను గొల్లదొరతో యుద్ధము జరిగినట్లు చెప్పుదురు. కనిగిరిసీమలోని ఎఱ్ఱగడ్డపాడును పాలించు కాటమరాజునకును, మనుమసిద్ధికిని పశువుల మేపుకొను బీళ్ళవిషయమై వివాదమేర్పడి, అదియొక భయంకర రణమునకు దారితీసెను. గుంటూరుజిల్లాలో జరిగిన పల్నాటి వీరయుద్ధము వలెనే, నెల్లూరులో జరిగిన ఈ సంగ్రామముకూడ వీర రసాత్మకమై అద్భుతశౌర్య ప్రదర్శనమునకు రంగస్థలమైనది. తిక్కనామాత్యుని పెదతండ్రి కుమారుడును ఖడ్గతిక్కన బిరుదాంచితుడునగు, మహా వీరుడు మనుమసిద్ధి సేనానియై యుండెను. కాటమరాజునకు సహాయ ముగా నెందఱో శూరశిఖామణులు కత్తులు దూసిరి. వీరి నాయకుడు బ్రహ్మరుద్రయ యను ఆరాధ్య బ్రాహ్మణుడు. ఈ యుభయ సైన్య ములును, భయంకరముగా పోరి వీరులెందఱో రణరంగమునకు బలి యయిరి. ఈ వృత్తాంతమునే కాటమరాజు కథ అందురు. ఈ వీర యజ్ఞము పాలేటియొడ్డున పంచలింగాలకడ నడచెను. కాటమరాజు కథ చరిత్ర గ్రంథము కాదు; చరిత్రాత్మకమైన పాట–అందు కాటమరాజునకు ప్రతిస్పర్థి పల్లవంశజుడైన నల్లసిద్ధియని చెప్పబడి యున్నది. మఱియు నందు అసంగతమైన విషయములు పెక్కుగలవు–కావున కాటమరాజు కథను నమ్మి, మనుమసిద్ధి కా గొల్లదొరతో పోరుపొసగె నని కాని, యందాతనికి అపజయము కలిగెనని కాని, నిశ్చయించి చెప్పుటకు వీలులేదు. మనుమసిద్ధిరాజు పాండ్యులతో క్రీ. శ. 1263 ప్రాంతమున ముత్తుకూరి యుద్ధరంగమున పోరి లోకాంతరగతు డాయెను.

తిక్కనామాత్యుని వంశమునకును నెల్లూరి చోడకుటుంబము నకును సన్నిహిత సంబంధము కలదు. తిక్కన పెదతండ్రియైన సిద్ధ నామాత్యుడు, మనుమసిద్ధి తండ్రియైన తిక్కభూపతికి మంత్రియై

యుండెను. సిద్ధన కుమారుడు ఖడ్గతిక్కన మంత్రి దండనాథపదవులు వహించెను. తన తాత, మంత్రి భాస్కరుడు 'గుంటూరు విభు' డని తిక్కనామాత్యుడు పేర్కొనెను. తిక్కనతండ్రి కొమ్మనామాత్యుడు. ఈతడుకూడ ఉన్నత రాజకీయపదవి నధిరోహించి యుండెను. తిక్కన తల్లి అన్నమాంబ. వీరియింటిపేరు కొట్టరువువారు. వీరు నియోగి బ్రాహ్మణులు. తిక్కనామాత్యుడు మనుమసిద్ధి రాజుకడ మంత్రి పదవి నలంకరించెను. ఈరాజు తిక్కనను 'మామ' యని చనవుతో పిల్చుచు, మిక్కిలి గౌరవాదరములతో సంభావించెడివాడు.

తిక్కన వంశీయులు ఉన్నత రాజకీయ పదవులం దుండుటయే కాక విద్యామహనీయులై యుండిరి. మంత్రి భాస్కరుడు సార కవితాభిరాముడు అని వర్ణించి యాతడు గొప్ప కవియైనట్లు తిక్కన సూచించెను. కాని అతడు వ్రాసిన గొప్ప గ్రంథము లేవియో పేర్కొనలేదు. తాను 'ఉభయ కావ్యప్రౌఢి చాటించు శిల్పమునం బారగుడు' అనగా సంస్కృతాంధ్ర కవిత్వముల నొక్కరీతిగా నడుప గల విజ్ఞుడ నని తిక్కనామాత్యుడు తెల్పుకొనెను. ఈతనికి ఉభయ కవిమిత్రు డను బిరుదున్నట్లు ఆంధ్రమహాభారత గద్యవలన విశద మగుచున్నది. తిక్కనామాత్యుని మొదటి గ్రంథము 'నిర్వచనోత్తర రామాయణము'. దీనియందు ఆశ్వాసాంత గద్యములు తప్ప వచన మును కవి మెచ్చుటను వాడలేదు. శ్రీరామచంద్రుడు వనవాసము నుండి మరలివచ్చి, అయోధ్యలో పరిపాలన చేయు నాటి వృత్తాంతము దీనిలోని కథాభాగము. సీతావనవాసము, రాము డశ్వమేధ యాగము సేయుట మొదలైన కథలను తిక్కనామాత్యుడు రసవంత ముగ వ్రాసెను. ఈ కావ్యారంభమునం దీతడు సుకవిస్తుతితోపాటు కుకవినిందను గావించియు, తన ప్రజ్ఞా విశేషములను వివరముగ దెల్పుకొనియు, ఆత్మ విశ్వాసమును ప్రకటించుకొనెను. ఈ కావ్య శైలి సంస్కృత సమాసములతో గూడి, కొంత ప్రౌఢముగా నున్నది. కాలోచిత వర్ణనములందు తనకుగల నేర్పును తిక్కనామాత్యు డిందు ప్రదర్శించెను.

తిక్కనామాత్యుని కవితావిహంగము నిర్నిరోధ సంచారము గలదనియు, గగనపథముల నవలీలగా విహరింపగలదనియు, అతనిచే రచింపబడిన 'ఆంధ్రమహాభారతము' సాక్ష్యమియ్యగలదు. తిక్కనామాత్యుని సర్వతోముఖప్రజ్ఞల కిది యద్దమువంటిది. మహాభారత రచనయం దీతడు చూపిన శేముషీవైభవమునకు వెఱగుపడి, ఆంధ్రకవు లీతనిని 'కవిబ్రహ్మ' యను మహత్తర బిరుదముచే నారాధించిరి. నన్నయ భట్టారకుడు ఆంధ్రమహాభారత రచనకు బూనుకొని, కొంచెము తక్కువగా మూడు పర్వములను మాత్రము ముగించగల్గెనని చదివి యుంటిమి. నన్నయ విడచిన అరణ్యపర్వ శేషమును, తిక్కన యెత్తుకొనలేదు. కాని విరాట పర్వమునుండి స్వర్గారోహణ పర్వము వరకు గల పదునేను పర్వముల మహాగ్రంథము నొక్క లేఖినితో నిర్వహించి, కవితా మహార్ణవమునందు తిక్కనామాత్యుడు గజయీతగాడని నిరూపించు కొనెను. తిక్కన భారత ప్రశస్తి దాని విస్తృతితో ముగియదు. గ్రంథరచనోద్దేశము కవిత్వాదర్శములు, రచనా శిల్పము, శైలి, మానవ జీవితసర్వస్వ పరిచితి మొదలగు మేలి గుణము లెన్నియో ప్రశంసార్హములై తిక్కనను ప్రపంచ మహాకవుల శ్రేణిలోనికి గొనివచ్చుచున్నవి.

తిక్కనామాత్యుడు మంత్రియై, రాజకార్య వ్యాపృతుడై నను, పరమ వైదిక సంపత్తి గలవాడయి, నిత్యనైమిత్తిక కర్మలను, వేదోక్త కర్మలను కడునిష్ఠతో నిర్వహించుచు, పవిత్ర జీవితము గడపెను. మహాభారతాంధ్రీకరణమునకు ముందు తిక్కన యజ్ఞ మొనర్చి తిక్కనసోమయాజి యనబరగెను. సోమయాజి కర్మిష్ఠి యైనను శుష్కకర్మాచరణరతుడు గాడు. ఈ మహాకవి పరమాద్వైతి, వేదాంతజ్ఞానతత్త్వపారగుడు. మహాభారత రచనయం దీతని ప్రధాన లక్ష్యము అద్వైతమత గాంభీర్యమును, లోకమునకు చాటుటయే. ఆతని కాలమునను, అంతకు పూర్వమును, శైవ వైష్ణవ మతములు నూతనమతావేశముతో వ్యాపించుచు, ప్రజల మనస్సుల

నేదో యొకవంకకు, బలవంతముగ ఆకర్షించుచుండెను. సమదర్శనము లేని ప్రజలు మతము పేరిట పక్షపాతముగూడ గావించుచుండిరి. ఇట్టి యావేశపూరిత వాతావరణమునందు, తిక్కన సోమయాజి శాంతి మాత్రునవలె అవతరించి, శివకేశవులకు భేదము లేదని యుద్ఘోషించు టకై, తన మహాభారతమును హరిహరనాథ దేవున కంకితముగ సమ ర్పించెను. కవిత్వకళ పరమపూజ్యమైన దనియు, దానిని భగవదా రాధన కుపయోగింపవలె ననియు, అది మోక్షసిద్ధికిని బ్రహ్మానంద ప్రాప్తికిని స్వర్ణసూత్ర మనియు సోమయాజి లోకోత్తర సందేశ మును భారతముఖమున నొసగెను. ఈ కవీంద్రుడు మహాభారత రచనాలోచనయందు నిమగ్నుడై యుండ, నిద్రవచ్చి కలలో హరి హరనాథ దేవుడు ప్రత్యక్షమయి, భారతమును తనకు కృతి యిమ్మని అనుగ్రహించెనట. తిక్కన సోమయాజి కాలమునుండియు, కావ్యా రంభములందు స్వప్న వృత్తాంత కథనము, ఆంధ్రకవులలో సంప్ర దాయమయ్యెను. నన్నయ భట్టారకునియందు రచనా శిల్పమువలె, సోమయాజియెడ అర్థ గౌరవము, భావౌన్నత్యము ప్రధానకవితా లక్షణములు. మాటల కుదింపు, విపులార్థ సంగ్రహీకరణము, తిక్క నామాత్యుని కవితకు పెట్టని సొమ్ములు. నన్నయభట్టువలెగాక ఈ మహాకవి జాతీయములైన చిన్నచిన్న తెలుగు పదములతోనే మహా భారతమును రచించెను. ఈతని కవితలో సంస్కృతపుపాలు తక్కువ. కథను నాటకమువలె సంభాషణాముఖమున నడుపుటయు, పాత్రల చిత్తవృత్తుల విశ్లేషించి చూపుటయు, సోమయాజియందే మనము చక్కగా చూతుము. 'ఆంధ్రావళి మోదముం బొరయ' తాను మహాభారత నిర్మాణమునకై దీక్షితుడైనట్లు తిక్కన సోమయాజి ప్రకటించి, తన యపూర్వ జాతీయాభిమానమును సార్థక పరచు కొనెను. ఈ మహాకవి క్రీ. శ. 13 వ శతాబ్దము నడుమ జీవించి యుండెను.

అనంతర కాలముననే కాక సమకాలిక కవులలోగూడ కవి బ్రహ్మ తిక్కన సోమయాజికి ఉన్నత స్థానము లభించెను. 'మూల

ఘుటిక కేతన యనుకవి 'దశకుమారచరిత్ర' యను తన కావ్యమును తిక్కన సోమయాజి కంకిత మొనర్చెను. ఆంధ్ర భాషాభూషణము, విజ్ఞానేశ్వరీయము అను పద్యగ్రంథములను గూడ కేతనకవి రచించెను. సంస్కృతమునందు దండిమహాకవి గద్యములో రచించిన దశకుమారచరిత్రను కేతనకవి తెలుగులో పద్యకావ్యముగ మార్చెను. దీనిచే ఈతనికి అభినవదండి యనుబిరుదు గల్గెను. కేతన కవిత్వము రసవంతమై మృదుపద ఘటితమై యొప్పారినది. ఆంధ్రభాషాభూషణము తెలుగునకు పద్యములలో వ్రాయబడిన చిన్న వ్యాకరణము. యాజ్ఞవల్క్యస్మృతికి విజ్ఞానేశ్వరుడు మితాక్షరి యను వ్యాఖ్యానము వ్రాసెను. దీనిని కేతన విజ్ఞానేశ్వర మనుపేర పద్యకృతిగా తెనిగించెను. ధర్మశాస్త్రగ్రంథముల నాంధ్రీకరించుటలో ఇతడు మొదటివాడు. తిక్కనామాత్యుని శిష్యుడును, 'మార్కండేయ పురాణము'ను ఆంధ్రీకరించినవాడును, అగు మారన ఈ కాలపు కవులలో నెన్నదగినవాడు. మార్కండేయ పురాణమునందు ఎన్నియో చక్కని ఉపాఖ్యానములు గలవు. అవి యనంతర కాల ప్రబంధములకు మూలకథలైనవి. మనుచరిత్రకు మూలమైన వరూధినీ ప్రవరులకథ, కువలయాశ్వుని వృత్తాంతము, హరిశ్చంద్ర కథ, మున్నగునవన్నియు మార్కండేయ పురాణములోనుండి గ్రహింపబడినవియే. మారన తిక్కన సోమయాజి యంత గొప్ప వాడు కాకపోయినను, మృదువై, రసవంతమైన రచన చేయగల వాడు. మార్కండేయపురాణము కాకతి రెండవ ప్రతాపరుద్ర చక్రవర్తి యనుచరుడైన నాగయ్యగన్న సేనానికి, అంకిత మీయబడినది. తిక్కన సోమయాజికి కొంచెము పూర్వుడుగా గన్పించు అథర్వణాచార్యుడను మహాకవినికూడ ఇక్కడ స్మరింపవలెను. ఈతడు క్రీ. శ. 1250 ప్రాంతమున నుండియుండును. అథర్వణుడు జైనకవి. ఈతడు భారతములో విరాట, ఉద్యోగ, భీష్మపర్వములను తెనుగు చేసినట్లు కాన్పించును. ఈతని భారతములోనివని చెప్పబడు పద్యములు లక్షణగ్రంథములందు ఉదాహృతములైనవి

కాని మూలగ్రంథము నశించినది. అధర్వణాచార్యుని కవిత్వము ప్రౌఢమై, సంస్కృత సమాస భూయిష్ఠముగా నుండినట్లే పద్యముల వలన దోచును. తిక్కన రచన సులభమై, జనాకర్షకముగా నుండి నందున, ప్రౌఢమగు అధర్వణకృతి నిరాదరణకు పాలయి, అదృశ్యమై యుండును. ఈ యాచార్యుడు త్రిలింగ శబ్దానుశాసనము. వికృతి వివేకము (అధర్వణ కారికావళి) అనబడు వ్యాకరణములను రచించె నని చెప్పబడుచున్నది. ఇవి తెలుగునకు సంస్కృతములో వ్రాయ బడిన వ్యాకరణములు. ఆంధ్రశబ్దచింతామణి విషయమునవలెనే, ఈ వ్యాకరణముల కర్తృత్వముకూడ వివాదాస్పదముగా నున్నది. అనంతరకాలపు పండితు లీ వ్యాకరణములను రచించి, గ్రంథ గౌరవమును పెంచుటకై, వీనిని నన్నయాధర్వణుల నామముల ప్రచారము చేసియుందురని పరిశోధకులు చెప్పుచున్నారు.

---

# ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి

## 16–వ ప్రకరణము

### [1] కాకతీయ సామ్రాజ్యము

మున్నూరు సంవత్సరములకు పైబడి ఆంధ్రదేశమున ప్రభుత్వమును నెరపి, ప్రజోపయోగకార్యముల ననేకము కావించి, కవి పండితులను పోషించి, లలితకళలను ప్రోత్సాహించి, ఆంధ్రదేశమునకును, ఆంధ్రసంస్కృతికిని మహోపకారము కావించిన కాకతీయ ప్రభువుల చరిత్ర, ఆంధ్రుల ఇతిహాసమునం దొక మహోజ్జ్వల ఘట్టము. కాని దురదృష్టవశమున నీ వంశము వారికిని, వారు కావించిన మహత్తర సేవకును తగిన గౌరవ ప్రఖ్యాతులు, భారతీయ ప్రపంచమున లభింపలేదు. కాకతీయుల ప్రాశస్త్యము ఆంధ్ర ప్రజలకును, చారిత్రిక పరిశోధకులును, విద్వాంసులును నగు నితర ప్రాంతీయులకును, మాత్రము తెలియును. భారతజాతీయేతిహాస రచనము నందు కొన్ని సందర్భములలో కాకతీయుల పేరుకూడ విస్మరింపబడు చున్నది. ఇది మిక్కిలి శోచనీయము. ఇందులకు కారణము చరిత్ర రచనా ఫణితులయందలి లోపమే కాని వేరొక్కటి కాదు.

కాకతీయ యుగచరిత్రమును రచించుటకు సాధనసామగ్రి కొరవడి యుండలేదు. కాకతీయ రాజ్యమునకు నేటి తెలంగాణము గుండెకాయ వంటిది. ఈనాటివరకును కూడ ఇచ్చటి సామాన్య ప్రజలు కాకతీయ రాజ్యములచేతను, వారి యుద్యోగులచేతను నిర్మింపబడిన బ్రహ్మాండమైన తటాకముల నీరు ద్రావుచు, ఆ జలములచే తమ క్షేత్రములలో వివిధ సస్యముల పండించి సుఖజీవనము

---

1. ఇచ్చటనుండి 19–వ ప్రకరణాంతమువరకు శ్రీ ఖండవల్లి బాలేందుశేఖరము గారి రచన.

గడపుచు. ఆ మహత్తర జలాశయముల నిర్మించిన మహనీయులకు, నిండారుభక్తితో కేలు మోడ్చుచుందురు. కాకతీయ రాజ్యముల ఘనకార్యములను, నిరక్షరాస్యులగు కృషీవలులే యెరుంగ గల్గిన ప్పుడు, చరిత్ర నిర్మాణదీక్షా పరతంత్రులగు విజ్ఞానులకు సాధన విశేష ములు లేకుండుట యెట్లు సంభవించును? కాకతీయ ప్రభువులును, వారి సామంతులును, గొప్ప రాజోద్యోగులును, ఆయా సందర్భ ములలో అనేక శాసనముల వేయించుచుండెడివారు. ఆ శాసన ముల పరిశోధించిన పక్షమున, మన కానాటి చారిత్రకాంశములును, ఆయా రాజుల కాలనిర్ణయమునకు సాధనములు మాత్రమే కాక, ప్రజల సామాజిక, ఆర్థిక పరిస్థితులుకూడ కొంతవరకు తెలియనగును. కాకతీయ రాజన్యుల కాలమందు గీర్వాణాంధ్రములయం దనేక గ్రంథములు రచింపబడెను. కాకతీయుల పతనానంతరము రచింప బడిన కొన్నికృతులవలనకూడ, కాకతీయులనాటి విశేషములు మనకు తెలియవచ్చును. ఆ కాలమునాటి మత సాంప్రదాయములు, కాకతీయ రాజ్యపు స్థితిగతులు, ప్రజల యాచార వ్యవహారములు, మున్నగు నంశముల తెలిసికొనుటకీ గ్రంథసంచయ మమూల్యమగు సాధనముగ నున్నది. ఉత్తమ సాహిత్యశ్రేణికి చెందిన గ్రంథములే కాక, మరికొన్ని సామాన్యపు కబ్బములవలన కూడ చారిత్రకునకు చక్కని సహాయ మలవడుచున్నది. ప్రతాపరుద్రచరిత్రము, ఏకశిలా నగర వృత్తాంతము, తెలుగురాజల చరిత్రము[1] అనునవి కొంతవరకు సత్యమగు చరిత్రాంశములతోడను, కొంతవరకు కాల్పనిక గాథల తోడను నిండిన ఇతిహాసములు. వీనిని ప్రజాసాహిత్యశ్రేణిలో చేర్పదగును. ఇవి కాక పద్మనాయకులు, వెలుగోటి సురభివంశముల వారు మున్నగు ఉన్నత కుటుంబములవారి చరిత్రములును, స్థానిక

1. చూడు: ఆంగ్ల వ్యాసము.

The Kakatiyas of warangal Dr. M. Rama Rao-Journa of Deccan History and Culture Vol. I, No. 1

కైఫియత్తులును, కూడ నేటికిని మనకు విరివిగ లభించుచున్నవి. వీనిని శ్రద్ధతో పఠించి, చారిత్రికక్షీరమును, కేవల కాల్పనిక కథా నీరమునుండి వేరుపరచిన పక్షమున, సత్యాంశము లెన్నియో తెలియవచ్చును. కాకతీయ యుగమునందు నిర్మింపబడినవియు, అతఃపూర్వము వెలసినవియు, సుప్రసిద్ధ దేవాలయములు పెక్కులు తెలంగాణమున నేటికిని కలవు. అవి ముఖ్యముగ శైవ జైన మందిరములు. ఈ ప్రాచీన నిర్మాణ పరిశోధనమువలన, ఆనాటి శిల్పకళా ప్రాశస్త్యమే కాక, ప్రజాజీవన విధానవైఖరులుకూడ తెలియవచ్చు ననుటకు సందియము లేదు. మహమ్మదీయ చారిత్రికులగు బర్నీ, అమీర్ ఖుస్రూ అను వారి వ్రాతలవలనను, మార్కోపోలో అను వెనీస్ యాత్రికుని కథనమువలనను, కూడ కాకతీయ యుగమునాటి విశేషములను మనము తెలిసికొనజాలుదుము. మహమ్మదీయ చారిత్రికులు, తమ మతస్థు లోరుగల్లుపై జరిపిన దాడులను గూర్చియు, మార్కోపోలో యాత్రికు డానాటి ఆర్థిక పారిశ్రామికాభివృద్ధిని గూర్చియు. అనేకాంశముల తెల్పియున్నారు.

ఆంధ్రదేశ చరిత్రయందు ప్రశస్తిగాంచిన యీ కాకతీయ రాజవంశమువారి పుట్టుపూర్వోత్తరములగూర్చి పండితులలో భిన్నాభిప్రాయములు గలవు. ఈ విషయమును గురించి కొన్ని గాథలు వ్యాప్తిలో నున్నవి. ఒక వాదముప్రకారము కాకతీయులు కాకతి యను దైవమును తమ కులదేవతగ మన్నించి, పూజించు చుండినందున, వారు కాకతీయులని వ్యవహరింపబడిరి. ప్రతాపరుద్ర యశోభూషణకారు డగువిద్యానాథుడును, తద్గ్రంథవ్యాఖ్యాత యగు కుమారస్వామి సోమయాజియును కూడ, కాకతీయులు కాకతియను నామాంతరము గల దుర్గను కులదైవతముగ నమ్మి భజించెడివారు కావున వారు కాకతీయు లనబరిగి రని తెల్పియున్నారు. కాని యీ వాదము కొంత లోపభూయిష్ఠముగ నున్నది. కాకతీయులు కాకతి దైవతమును పూజించిన విషయము సత్యదూరము కాదు. కాని

వీరు స్వయంభూదేవునికూడ కులదైవముగ పూజించుచుండెడువారు. స్వయంభూదేవ పాదకమలపూజకులుగ కూడ వీరు వర్ణింపబడి యున్నారు. కావున పైన తెలుపబడిన కాకతీయ శబ్దవ్యుత్పత్తికి వ్యాఘాత మేర్పడుచున్నది. క్రీ. శ. పదునేనవ శతాబ్దమునాటి అని తల్లి కలువచేరు శాసనమునందు, కాకతీయుల కీ నామము గల్గుటకు మరియొక కారణము చూపబడినది. కాకతియను శక్తి యనుగ్రహము మున గుమ్మడితీగె కొక పుత్రుడు జన్మించెననియు, ఆతని వంశము వా రాశక్తి గౌరవార్థము, తమ్ము తాము కాకతీయులని తెల్పుకొన నాగిరనియు ఈ గాథ తెల్పుచున్నది. కాని యిట్టి అలౌకిక విషయములను విశ్వసించువా రీనాడు పలువురుండజాలరు. కాకతి గణపతి దేవునిచే వేయింపబడిన గరవపాడు శాసనమం దీ వంశమునుగూర్చి, కొన్ని అపూర్వమగు నంశములు తెలుపబడినవి. కాకతీయులు కరి కాలచోడుని వంశము వారనియు, ఈ వంశమునందు దుర్జయుడను నొక ప్రసిద్ధవ్యక్తి జన్మించెననియు, ఈతని కాలమునుండి ఈ వంశము వారు కాకతీయులను పేరును పొందినట్లును, ఇందు తెలుపబడినది. కాని కరికాలచోళునితో కాకతీయులను ముడిపెట్టుటకు చారిత్రకా ధారము లేవియును లేవు. దుర్జయుడను పురుషుడు మిక్కిలి ప్రసిద్ధి చెందినవాడు. అనేక రాజవంశములవారు తామే దుర్జయుని వంశస్థుల మని తెల్పుకొనినారు. కొందరు విద్వాంసులీ దుర్జయుడు పాండవ ప్రతిపక్షియైన దుర్యోధనుని కుమారుడని అభిప్రాయపడుచున్నారు.[1] ఈ విషయము నిజమేయని మన మంగీకరించినను, కాకతీయులకు సుమా రైదువేల సంవత్సరములకు పూర్వము జీవించిన దుర్జయునితో, సంబంధ మేర్పరుపబూనుట, ఆకాశమునకును, భూమికిని కలిపి తాళమువేయుట వంటిది. వీరిరువురకును నడుమగల ఏబది శతాబ్దుల అగాధమును దాటుటకై ఎట్టి మార్గమును లేదు. కావున నీ యంశమును చారిత్రిక సత్యముగా నంగీకరించుటకు వలనుపడదు. కాని గరవపాడు శాసనమునందలి యొక అంశము గమనింప దగి

1. మహాభారత చరిత్రము - పెండ్యాల వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

యున్నది. కరికాలచోళుని వంశీయులుగా వర్ణింపబడిన యీ కాకతీయులకు, కాకతి యను స్థలముతో సంబంధము చూపబడినది. ఈ రాజవంశమునకు స్థాపకుడగు మొదటి బేతరాజును కాజీపేట శాసనము కాకతిపుర ప్రభువుగ తెల్పుచున్నది. త్రిపురాంతకమునందలి శాసనమువలన నీ బేతరాజు "కులపురము" కాకతియను ప్రదేశమని తెలియనగుచున్నది. కాకతియను పేరును, దానికి మిక్కిలి సమీపమున నున్న నామాంతరములును గల ప్రదేశము లాంధ్రదేశమున గంజాం, విశాఖపట్టణము, తూర్పు గోదావరి, కృష్ణా, గుంటూరు, చిత్తూరు, అనంతపురము జిల్లాలయందు నేటికిని కలవు. కావున కాకతి పదమును మనము స్థలనామముగ, తన్మూలకముగ వంశనామముగనుకూడ, పరిగణించుట తప్పు కానేరదు. బహుశః ఆ కాలమున కాకతిశక్తిని పూజించుట ఆంధ్రదేశమున సర్వసామాన్యముగ నుండి యుండవచ్చును. ఆ దేవి గౌరవార్థము పలుప్రదేశముల కా నామ మొసంగబడుటయు, కొందరు భక్తులా నామమునే, తమ వంశనామముగ ధరించుటయు అసంభవమగు నంశము కాదు. కాకతీయ వంశమునకు మూలపురుషుడైన మొదటి బేతరాజునకు ముఖ్యపట్టణముగ వర్ణింపబడిన, కాకతిపుర మెచ్చట నుండెడిదో తెల్పుట కష్టసాధ్యము. అయ్యది నేటి ఓరుగల్లుపట్టణము కాదని విద్వాంసులు తలంచుచున్నారు. మొదటి బేతరాజు నేటి వరంగలు జిల్లాయందలి మధిర తాలూకా ప్రాంతము (ఆ కాలమున దీనిని నతవాటి సీమయని పిలుచుచుండిరి) ను, ఆపైన మానుకోట తాలూకా ప్రాంతమును, (కొరవిసీమ) పాలించెను. కావున నాతనికి ముఖ్యపట్టణమగు కాకతిపుర మీ ప్రాంతములందుండెనని యూహింపవచ్చును. కాజీపేటయందు లభించిన మరియొక శాసనమున, మొదటి బేతరాజు ఒక నామంతి రాజవంశమునకు చెందినవాడుగ వర్ణింపబడియున్నాడు. బేతరాజునకు కొంచెము పూర్వము వాడును, వేంగీచాళుక్యరాజగు రెండవ అమ్మరాజునకు సమకాలీనుడును, అగు కాకర్త్యగుండ్యన అనునాతడు నతవాటిసీమను పాలించినట్లు తెలియవచ్చుచున్నది. ఈ గుండ్యనయొక్క పితృపితామహులు సామాన్యపు గ్రామోద్యో

గులుగ నుండిరి. వారికి రాష్ట్రకూటు లనునామ మొసంగబడు చుండెను. దీనికి గ్రామాధికారి యని అర్థము. కాకర్త్యగుండ్యన తన తండ్రితాతలు పూనిన రాష్ట్రకూట శబ్దమును విడనాడి, కాకర్త్య శబ్దమును తన నామమునకు పూర్వము నిలుపుకొనెను. గుండ్యన తన తండ్రులవలె కేవలము గ్రామాధికారిగ మాత్ర ముండక, యొక మండలమునకే పరిపాలకత్వమును సంపాదించిన కారణమున, నాతడు న్యూనతను స్ఫురింపజేయు రాష్ట్రకూట నామమును విడ నాడి, తన వంశనామమునే సగౌరవముగ ధరించి యుండునని, పండితు లభిప్రాయపడుచున్నారు. కాకర్త్య గుండ్యన క్రీ. శ. 945 నుండి 973 వరకు పాలనము చేసిన రెండవ అమ్మరాజునకు సమ కాలీనుడు. గుండ్యన పాలించినది నతవాటి సీమ. కాకతీయులలో మొదటి ప్రభువైన బేతరాజు (మొదటివాడు) క్రీ. శ. 1000 సంవ త్సరమున రాజ్యపాలనము ప్రారంభించినట్లు మనము చూడగలము. ఈతడుకూడ నతవాటిసీమను పాలించెను. కాకర్త్య కాకతి శబ్దము లకు సన్నిహిత సంబంధము కలదు. కావున కాకతి బేతరాజు కాకర్త్యగుండ్యన వంశమువాడై యుండవచ్చుననియు, కాకర్త్య శబ్దము సాధుత్వమును వహించి కాకతిగ మారియుండవచ్చు ననియు, ఇయ్యది ఆ వంశమువారి యింటిపేరై యుండవచ్చుననియు, చారిత్రికు లూహించుచున్నారు.

కాకతీయ ప్రభువుల కుల నిర్ణయమును గూర్చి చారిత్రికు డెక్కువగ చికాకు పడవలసిన అవసరము లేదు. ఈ వంశమున గొప్ప ప్రసిద్ధిచెందిన గణపతిదేవ చక్రవర్తి కాలమునాటి మోటు పల్లి, పాఖాల, కాంచీపర శాసనములందు కాకతీయులు క్షత్రి యులుగ వర్ణింపబడియున్నారు. వీరిది సూర్యవంశమని యిందు తెలుపబడినది. ప్రతాపరుద్రీయ కావ్యమును రచించిన విద్యానాథుడు తన ప్రభువులైన కాకతీయులను, 'అత్యర్కేందు కుల ప్రసూతు' లుగ వర్ణించియున్నాడు. అనగా వీరి వంశము సూర్య చంద్ర వంశముల కన్నను మిన్న యైనదట. దుర్నిరీక్ష్య ప్రతాపశాలు లగు కాకతీయ రాజన్యులయెడ నీ

వర్ణన మాలంకారికముగ సత్యమేయని చెప్పవచ్చును. కాని కాకతీయులకు సన్నిహిత బంధువులగు వారందరునుకూడ, చతుర్థాన్వయ సంజాతులు. కాకతి గణపతిదేవుని సోదరి మేలాంబికను, దుర్జయ వంశీయుడును, నతవాటి బుద్ధ రాజకుమారుడునునగు రుద్రునికిచ్చి, వివాహముచేసిరి. గణపతిదేవుని కుమార్తె గణపాంబ దుర్జయాన్వయుడగు కోట బేతరాజునకు ధర్మపత్ని. కాకతీయులు గావించిన సంబంధము లిట్టివే పెక్కులు కలవు. కాకతీయులు స్వయముగా దుర్జయ వంశమువారను ప్రతీతికలదు. దుర్జయాన్వయులు కొందఱు క్షత్రియులును, మఱి కొందఱు చతుర్థ వంశజులును కలరు. సమకాలిక శాసనములలో కొన్నిటియందు కాకతీయులు క్షత్రియులనియు, మఱికొన్నిటి యందు శూద్రులనియు, చెప్పబడియున్నది కావున కాకతీయ ప్రభువులు వీరియందే వర్ణమునకు చెందినవారో నిశ్చయించి చెప్పుట సులభముకాదు.

కాకతీయ రాజ్యస్థాపనము కొంతవరకు వివాదాస్పదముగ నున్నది. ఇటీవలివరకును చారిత్రిక విద్వాంసులలో పలువురు, కాకతీయ రాజులు పశ్చిమచాళుక్యులకు సామంతులుగ నుండి, వారి బలము క్షీణించిన వెనుక స్వాతంత్ర్యమును వహించిరని, తలంచుచుండిరి. కాకతీయరాజులు ప్రథమదశయందు చాళుక్య చోళ రాజగు కులోత్తుంగ చక్రవర్తికి సామంతులనియు, కుళోత్తుంగుని కుమారులు వేంగీ దేశమును రాజ ప్రతినిధులుగ పరిపాలించుచున్న కాలమున, పశ్చిమ చాళుక్యులు వేంగీరాజ్యముపై దండెత్తిన సందర్భమున, వీరు (కాకతీయులు) తమ స్వాతంత్ర్యమును ప్రకటించిరనియు మరికొందరు చారిత్రికు లభిప్రాయపడిరి. కాని యిటీవల నిజాము రాష్ట్రమునందు లభించిన కొన్ని శాసనముల యాధారమువలన, కాకతీయ రాజ్యస్థాపనము పైన తెలుపబడిన కాలమునకు చాల ముందే జరిగినట్లును, అందులకు కారణములుకూడ వేరుగ నుండినట్లును తెలియవచ్చుచున్నది. మొదటి బేతరాజు క్రీ॥ శ॥ 1000 సంవత్సరమున కాకతీయ రాజ్యమును స్థాపించినట్లు, నేడు చారిత్రికు లంగీకరించుచున్నారు. ఆ కాలమునాడు, పశ్చిమ చాళు

క్యులు వేంగీ రాజ్యముపై దండెత్తుట సంభవింపలేదు. పశ్చిమ చాళుక్యులు క్రీ॥ శ॥ 1120-1124 సంవత్సరములలో, వేంగీ రాజ్యమును తాత్కాలికముగ నాక్రమించిరి. అప్పటికి కాకతీయ రాజ్యము బలపడి, రెండవ ప్రోలరాజుచే పాలింపబడు చుండెను. కావున నయ్యది కాకతీయ రాజ్యస్థాపన కాలము కాజాలదు. కాకతీయులు ప్రథమదశయందు వేంగీ రాజ్యమునకే సామంతులుగ నుండి యుండవలయును. కాకర్త్యగుండ్యనకు సమకాలీనుడైన రెండవ అమ్మరాజు (వేంగీదేశ పాలకుడు) నకు పూర్వము, కొంత కాలము వేంగీరాజ్యములో అంతర్యుద్ధమును, అల్లకల్లోలమును, చెలరేగెను. ఈవంశమునకు చెందిన యుద్ధమల్లుడును (927-934) చాళుక్య భీముడును (934-945) రాజ్యాధికారమునకై పెనగులాడిరి. ఈ అంతఃకలహములో ప్రథమమున యుద్ధమల్లునికి విజయము లభించినను, దేశమున శాంతి నెలకొనదయ్యెను. తూర్పు చాళుక్యరాజుల శాసనములవలన, నీ కాలమునందు వారిసామంతులలో పలువురు తిరుగుబాటు చేసి, స్వతంత్రులైరని, తెలియవచ్చుచున్నది. ఈయదనునందే కాకర్త్యగుండ్యన నతవాటి సీమయందు, స్వతంత్ర రాజ్యమును స్థాపించియుండుట అసంగతము కానేరదు. యుద్ధమల్లుని యనంతరము వేంగీ రాజ్యమున ప్రభుత్వము నెరపిన చాళుక్యభీముని కాలమున, దేశమున శాంతిస్థాపింపబడినను, ఆతడు కాకర్త్యగుండ్యన రాజ్యమును గుర్తించి యుండవచ్చును. కాకతీయులు గుండ్యనతో సన్నిహిత సంబంధము కలవారని యీవరకే తెలుపబడినది. కావున కాకతీయ రాజ్యారంభ మీ సందర్భముననే జరిగెనని యూహించుట నిరాధారము కానేరదు.

కాకతీయులు తూర్పు చాళుక్యులవలె వరాహలాంఛను లగుట వలనను, వారి శిల్పమునందుకూడ చాళుక్యశిల్పచ్ఛాయలు పెక్కులుండినకారణముననను, వీరు తూర్పుచాళుక్యులతోడనే మొట్ట మొదట సంబంధము కల్గియుండిరని తెల్పుటకవకాశము కల్గుచున్నది. కాని కాకతీయులు పశ్చిమ చాళుక్యులకు సామంతులని

తెల్పు శాసనములుకూడ కలవు. మొదట ప్రోలరాజును, రెండవ బేతరాజును, రెండవప్రోలరాజును, పశ్చిమ చాళుక్య ప్రభువులగు మొదటి సోమేశ్వరునకును, ఆరవ విక్రమాదిత్యునకును, సామంతు లుగ నుండిరి. మొదటి ప్రోలరాజు సోమేశ్వరునుండి అనుమకొండ విషయము (సీమ) ను పొందినట్లు కాజీపేటయందలి శాసనము తెల్పు చున్నది. కాకతీయులు తమ శాసనములు కొన్నిటిలో చాళుక్య విక్రమ శకము నంగీకరించి, కాల నిర్ణయమునకై వాడిరి వాడుట యును, రెండవ బేతరాజు పశ్చిమచాళుక్యబిరుద మగు త్రిభువన మల్ల నామమును ధరించుటయును, వీరు పశ్చిమచాళుక్యులకే సామంతులను భావము కలుగచేయుచున్నవి. కాని మనము పైన తెల్పిన విషయముల సమన్వయముచేయుట కవకాశము లేకపోలేదు. కాకతీయులు మొట్టమొదట పూర్వచాళుక్యులకును సామంతులుగ నుండి యుండవచ్చును. కాని కాలక్రమమున పశ్చిమమున తమ రాజ్యమును విస్తరింపజేసినప్పుడు, వారికి పశ్చిమ చాళుక్య రాజ్య ముతో సామీప్య మేర్పడుటవలనను, తూర్పు చాళుక్య రాజ్యము బలహీనమై పశ్చిమ చాళుక్యులు బలవంతు లగుచుండుటవలనను, కాకతీయులు మొదటి ప్రోలరాజు కాలమునుండియు పశ్చిమ చాళు క్యుల యాధిక్యత నంగీకరించి వారికి సామంతు లగుట సంభవించి యుండవచ్చును.

శాసనముల పరిశీలించు సందర్భమున, కాకతీయ వంశస్థు లలో మొట్టమొదటివా రెవ్వరను నంశమును గురించి, విద్వాంసు లకు కొంత సందిగ్ధత యేర్పడెను. రుద్రదేవునిచే వేయింపబడిన అనుమకొండ శాసనమునం దాతని తండ్రియగు ప్రోలరాజును, తాత యగు త్రిభువనమల్ల బేతరాజును మాత్రమే పేర్కొనబడిరి. కాని మోటుపల్లి శాసనమునందు ప్రోలరాజును, అతని కుమారుడు బేత రాజును, ఆతనికుమారుడు మరియొక ప్రోలరాజును, ఈ ప్రోలరాజు కుమారుడు రుద్రదేవుడును ప్రశంసింపబడియున్నారు. కావున కాక తీయ వంశమునకు ప్రథమ పురుషుడు మొదటి ప్రోలరాజేయని తలంపబడుచుండెను. కాని ఇటీవల వెలువడిన కాజీపేట శాసనము

వలన, మొదటి ప్రోలరాజునకు పూర్వము మొదటి బేతరా జను నాతడు రాజ్యపరిపాలనము చేసినట్లు తెలియవచ్చినది. దీనినిబట్టి కాకతీయవంశము మొదటి బేతరాజుతో ప్రారంభ మగుచున్నదని నిర్ణయింపనగును.

మొదటి బేతరాజు:—ఈతని పరిపాలనా కాలము క్రీ॥ శ॥ 1000 నుండి 1030 వరకును వ్యాపించినట్లు నేటి చారిత్రికులు సిద్ధాంతము చేసినారు. ఈ రాజును గూర్చిన విశేషములు మన కెక్కుడుగ తెలియవచ్చుట లేదు. ఈ బేతప్రభువు నూతన రాజ్యమును స్థాపించినవా డగుటచే. నీతనికి తన ప్రతిస్పర్థులతో పోరాడుటయందే కాలము గడచిపోయెను. ఈతడు మొదట నతవాటిసీమను, ఆపైన కొరవిసీమను, తన యధీనములోనికి గైకొనినట్లు ఇంతకు పూర్వమే తెలిపియున్నాము. రాజ్యమును బలపరచుకొనుటయం దీతనికి విరియాల వంశీయులగు వీరలవలన చాల సహాయము చేకూరినట్లు [1]గూడూరు శాసనమువలన తెలియుచున్నది. విరియాల యెఱ్ఱ భూపతియు. అతని భార్యయగు కామసానమ్మయు, ఈతనిని (బేత రాజును) కొరవిసీమయందు ప్రతిష్ఠించినట్లును, అటుపిమ్మట కాకతి రాజుగ కూడ చేసినట్లును. పై శాసనము తెల్పుచున్నది.

మొదటి ప్రోలరాజు:—మొదటి బేతరాజు మరణించిన వెనుక మొదటి ప్రోలరాజు కాకతీయ సింహాసనము నధిష్ఠించెను. ఈతని రాజ్యకాలము క్రీ॥ శ॥ 1030 నుండి 1075 వరకును గల నలుబది యైదు సంవత్సరములు. ఈతని కాలమున జరిగిన రెండు సంఘటనలు ముఖ్యముగ పేర్కొనదగియున్నవి. ఇందు మొదటిది ప్రోలరాజు, పశ్చిమ చాళుక్య చక్రవర్తియగు త్రైలోక్య మల్ల బిరుదాంకితుడగు మొదటి సోమేశ్వరునివలన, అనుమకొండ విషయమును లిఖిత పూర్వకముగా బడయుట. మొదటి బేతరాజు కాలమందే బహుశః కాకతీయు లీ ప్రాంతమును వశపరచుకొని యుండవచ్చును. కాని ఆ భూభాగము పశ్చిమ చాళుక్య సామ్రాజ్యములోని దగుట

1. చూడు. తెలంగాణా శాసనములు—లక్ష్మణరాయ పరిశోధక మండలి.

వలనను, పశ్చిమ చాళుక్యులు మిక్కిలి బలవంతులగు రాజులగుట చేతను, బలవద్విరోధము తగదని తలంచి, సామోపాయముచేతనే ప్రోలరాజు అనుమకొండ సీమపై తాను నెరపుచున్న అధికారమును, సక్రమమైనదిగా, సోమేశ్వరునిచే అంగీకరింపజేసి యుండవచ్చును. ప్రోలరాజు, తాను పశ్చిమచాళుక్యులకు సామంతుడ నని కూడ యంగీకరించి యుండవచ్చును. ఈమొదటి ప్రోలరాజు సేనాని యొకడు కాంచీనగరముపై దాడివెడలి, చోళరాజును పరాభవించి, ఆతని నగర కవాటమును హరించి, తన యేలిక యగుకాకతి వల్లభునకు విజయలక్ష్మిని చేకూర్చెనని పాలంపేట, పిల్లలమఱ్ఱి శాసనములవలన దెలియుచున్నది. అతడే సందర్భమున కాంచీపురమును ముట్టడించి కవాటమును హరించెనో, నిశ్చయముగ చెప్పుటకు వలనుపడదు.

రెండవ బేతరాజు :—మొదటి ప్రోలరాజు ననంతరము రాజ్య భారము వూనినవాడు రెండవ బేతరాజు (1075-1110). ఈతనినే త్రిభువనమల్ల బేతరాజనికూడ వ్యవహరించుచున్నారు. ఈ రాజు త్రిభువనమల్ల బిరుదాంకితుడును, సుప్రసిద్ధుడును నగు పశ్చిమ చాళుక్య చక్రవర్తియగు, ఆరవ విక్రమాదిత్యునకు సామంతుడుగ నుండెను. కాజీపేట శాసనమునం దీతడు గొప్ప వీరుడుగ వర్ణింపబడి యున్నాడు. ఈతడు చోళ మాళవరాజు లను మత్తగజములకు సింహమువంటి వాడట. కావుననే విక్రమచక్రి, త్రిభువనమల్ల బిరుదములను వహించెను. ఈ బేతరాజునకు వైజన యను దండనాథు డుండెడివాడు. ఈ దండనాథుడు తన ప్రభువునకు పశ్చిమచాళుక్య ప్రభు వగు ఆరవ విక్రమాదిత్యునిచే, సహస్రగ్రామపరిమిత మగు సబ్బిమండలము (నేటి కరీంనగరము జిల్లాప్రాంతము) నిప్పించెను. ఈ విషయము అనుమకొండ శాసనమునందు పేర్కొనబడినది. ఆ కాలమునందు పశ్చిమచాళుక్యులు బలవంతులై, వేంగిరాజ్యమును కబళింప జూచుచుండిరి. పశ్చిమ చాళుక్యులకును, వేంగిరాజ్యము నకును, నడుమ కాకతీయ రాజ్య మడ్డుగ నుండెను. కావున వారిని వశపరచుకొనుటకై, ఆరవ విక్రమాదిత్యుడు సబ్బిమండలమును

కాకతీయుల కిచ్చియుండెను. వైజన దండనాథు డీ సంధానమును కావించి, కీర్తిచెందెను. రెండవ బేతరాజు పరమమాహేశ్వరు డని అనుమకొండ కన్నడ శాసనములో కలదు.

రెండవ ప్రోలరాజు:—(1110-1158) ఈతడు త్రిభువనమల్ల బేతరాజు కుమారుడు. ఈతని కాలమున కాకతీయరాజ్యము సంపూర్ణముగ బలపడి, స్వతంత్ర మయ్యెను. రెండవ ప్రోలరాజుకూడ కొంత కాలమునవఱకును పశ్చిమ చాళుక్యులకు సామంతుడుగ నుండెను. కాని కాలక్రమమున వారి బలము క్షీణదశ నొందుట చూచి, ప్రోలరాజు విజృంభించి వారి యధికారమును త్రోసిపుచ్చెను. ఈతడు గొప్ప వీరుడును, యుద్ధప్రియుడు నని తెలుపవలసియున్నది. అనుమకొండయందలి రుద్రేశ్వరాలయములో, ప్రోలరాజు సాధించిన విజయ పరంపరల వర్ణించు శాసన మొకటి కలదు. ఈతనిచే నోడింపబడిన వారు తైలపదేవుడు, గోవిందరాజు, గుండరాజు, జగద్దేవుడు నను వారలు. తైలపుడు పశ్చిమ చాళుక్యయువరాజు. గోవిందరాజు బెజవాడ సమీపమునందలి నేలకొండపల్లి ప్రాంతమునకు ప్రభువు. గుండరాజు మంత్రకూటమున కేలిక. మంత్రకూట మనగా నేటి కరీంనగరము జిల్లాలోని మంథెన గ్రామము. జగద్దేవుడుకూడ నేటి కరీంనగరములో నెలకొనియున్న వేములవాడ ప్రాంతమును పాలించినవాడు. ఈ విధముగ ప్రోలరాజు ఈనాటి మహబూబునగరము, వరంగలు, కరీంనగరము జిల్లాలయందలి చాలా ప్రాంతములను తనవశము కావించుకొనెను. పశ్చిమ చాళుక్యరాజగు ఆరవ విక్రమాదిత్యుని యనంతరము రాజ్య సింహాసన మధిష్ఠించిన మూడవ సోమేశ్వరుని ప్రోలరాజు జయించెనని తెలుపుట కాధారములు కలవు. ఆ మీదటనే ప్రోలరాజు స్వతంత్రుడై, మహామండలేశ్వర బిరుదమును పూని యుండవచ్చును. పశ్చిమచాళుక్యరాజగు మూడవ తైలపుని మంత్రియు, దండనాథుడును నగు బిజ్జలకాలచుర్యుడు తన ప్రభువును పదభ్రష్టుని చేయుటయం దాతనికి కాకతి ప్రోలరాజువలన

చాల సహాయము లభించెను. ఈ విధమున కాకతీయరాజ్యమును పోషించిన రెండవ ప్రోలరాజు 1158 యందు మరణించెను. ఈతడు ప్రమాదవశమున తన కుమారుడగు రుద్రదేవునిచే చంపబడినట్లు ఐతిహ్యముకలదు. కాని దాని కితరాధారములు లేవు. ఈతడు తూర్పు తీరమున తన రాజ్యము విస్తరింపజేయుటకై యుద్ధముచేయుచు, వెలనాటి ప్రభువుచే నిహతుడయ్యెను. ద్రాక్షారామమందలి యొక శాసన మీ యంశమును సూచించుచున్నది.[1]

రుద్రదేవుడు :— (1158–1195) ఇతడు తండ్రిని మించిన వీరుడు. రుద్రదేవు డనేక యుద్ధముల కావించి, తన రాజ్యమును విస్తరించెను. రుద్రదేవునిచే జయింప బడినవారిలో ముఖ్యులు దొమ్మరాజు, మేడరాజు, మైలగిదేవుడు, భీముడు, చోడోదయుడు నను వారని అనుమకొండశాసనము తెల్పుచున్నది. దొమ్మరాజు నేటి హైదరాబాదు రాష్ట్రములోని ధర్మపురినుండి భద్రాచలము వరకును గల భూభాగము నేలినవాడట. మేడరాజు నేటి వరంగలు మండలములోని యొక స్థానికప్రభువు. మైలగిదేవుడు నేటి కరీంనగర మండలములోని జగ్త్యాల తాలూకాయందు పరిపాలనము చేసిన వాడు. కాకతి రుద్రు డీతని జయించుటచే, పొలవాస దేశ మతని స్వాధీన మయ్యెనని పేర్కొనబడినది. పై ప్రాంతమునకు నేటికిని పొల్వాసా యను నామాంతరము వాడబడుచుండుట గమనింపదగినది. భీము డనురాజు ఓరుగల్లునకు 50 మైళ్ళ దూరమున నెలకొని, నేడు వడ్డమట్టి యని పిలువబడుచున్న వర్ధమాన పురమునకు రాజు. ఈతడు చోళవంశమువాడు. ఈ భీముడు మిక్కిలి ధూర్తుడు. అవినీతిపరుడు. రుద్రరా జీతనిపై తనసేనల నడిపి, వర్ధమానపురము నాక్రమించి, చోళవంశమును నాశన మొనర్చెను. చోడోదయునితో రుద్రదేవుడు సామము నవలంబించి, అతని కుమార్తె యగుపద్మా

1. ఈ శాసనమందు వెలనాటి వంశీయు డగు రెండవ చోడరాజునకు "కాకతి ప్రోలనిర్దహన" అను బిరుదము వాడబడినది

వతిని వివాహము చేసికొనెను. ఈ విజయములవలన నేటి హైదరాబాదు రాష్ట్రములోని తెనుగు జిల్లా లన్నియు, రుద్రదేవుని యధీనమయ్యెను. ఆపైన రుద్రదేవుడు వెలనాటిని జయించుటకై వెడలెను. తన తండ్రియగు రెండవ ప్రోలరాజుతో మొదటి పర్యాయమును, క్రీ. శ. 1162–వ సంవత్సరమున రెండవ పర్యాయమును, రుద్రుడీ రాజ్యముపై దాడులు కావించెను. ఈ రెండవ దండయాత్రకు ఫలితముగ శ్రీశైల త్రిపురాంతక ప్రాంతములు, రుద్రదేవుని యధీనములోనికి వచ్చెను. 1186–వ ప్రాంతమున రుద్రదేవుడు వెలనాటి మూడవ గొంకరాజుతో యుద్ధము చేసి, ఆతని సంహరించి యుండుననియు, అందువలన నాతని కుమారుడగు పృథ్వీశ్వరుడు, పిఠాపురమునకు పారిపోయె ననియు, కాకతి రుద్రుని ద్రాక్షారామ శాసనమువలన స్ఫురించుచున్నది. ఈ విజయముల వలన, రుద్రరాజు పితృవధకు ప్రతీకారము చేయుటయే కాక, తన రాజ్యమును నేటి గోదావరీ కృష్ణా మండలములందుకూడ వ్యాపింప చేసెను. ఈ విధముగ రుద్రదేవుని రాజ్య ముత్తరమున గోదావరి వరకును, దక్షిణమున శ్రీశైలమువరకును, పశ్చిమమున కళ్యాణివరకును, తూర్పున తూర్పుకనుమల వరకును వ్యాపించెను. దినదిన ప్రవర్ధమాన మగుచున్న రుద్రుని బలమున కసూయపడి, దేవగిరి యాదవరాజగు జైతుగి అను నాతడు, రుద్రదేవునితో యుద్ధమునకు తలపడెను. రుద్ర దేవుడు రణభూమిని వీరస్వర్గ మలంకరించెను.

మహాదేవరాజు :—(1195–1198) రుద్రదేవుడు మరణించిన వెనుక అతని సోదరుడు మహాదేవుడు రాజయ్యెను. తన యన్నను చంపిన దేవగిరి యాదవులపై పగ తీర్చుకొను నుద్దేశముతో, నీతడు యాదవరాజ్యముపై దండెత్తెను. కాని యాదవరాజగు జైతుగి ఈతనిని యుద్ధమున సంహరించి, ఈతని కుమారుడును అల్పవయస్కుడును నగు గణపతి దేవుని చెరపట్టెను.

గణపతిదేవుడు:—(1198–1262) కాకతీయ ప్రభువులలో నీతడగ్రగణ్యుడు. క్షీణదశలో నున్న కాకతి రాజ్యమును మరల నుద్ధ

రించుటయే కాక, గణపతిదేవు డీ రాజ్యమును మిగుల విస్తరించి, ఒక సామ్రాజ్యముగ రూపొందించెను. ఈతడు క్రీ॥ శ॥ 1199 నుండి పదసంవత్సరముల కాలము యాదవరాజులకడ బందిగ నుండి, జైతుగిచే కనికరమున విడువబడె నని, యాదవరామచంద్రదేవుని పైఠాన్ శాసనమువలన తెలియుచున్నది. కావున గణపతిదేవుని రాజ్యపాలనము నిజముగ 1208 వ సంవత్సరమునుండి ఆరంభ మగుచున్నట్లు, తెలుపవచ్చును. గణపతిదేవుడు యాదవులకడ బందిగ నున్నకాలమున, కాకతీయ ప్రభువుల సామంతులు విజృంభించి, స్వతంత్రు లగుటయే కాక, ఈ రాజ్యమును నాశనము చేయవలె నని సంకల్పించిరి. ఇట్టివారిలో నొంటూరినాగదేవు డొకడు. బొప్పదేవుడను కాకతీయసేనాని ఈతని నోడించి సంహరించెను. ఇతర శత్రువులను, కాకతీయ చమూపతులలో ముఖ్యుడగు రుద్రసేనాని పరాభవించి పారద్రోలెను. రాజ్యమున పునః ప్రతిష్ఠితుడైన వెనుక, గణపతిదేవు డత్యుత్సాహముతో శత్రుసంహారమునకై నడుము కట్టెను. ఈ కాలమున వేంగీదేశమునను, కృష్ణా ముఖద్వారమునను, వివిధపాలకులు స్వతంత్రులై పాలింపసాగిరి. క్రీ॥ శ॥ 1212 నందు గణపతిదేవుడు పూర్వదేశ విజయమునకై బయలుదేరెను. ఈతడు మహామేధావంతుడు కావున కేవల యుద్ధవిజయములవలననే కాక, స్నేహబాంధవ్యముల కల్పించుకొనికూడ తన లక్ష్యమును సాధించెను. నేటి పశ్చిమ గోదావరీ మండలములోని నిడదవోలు (ఆనాటి నిరవద్యప్రోలు) పాలకుడగు చాళుక్య వీరభద్రునికి, గణపతిదేవుడు తన కుమార్తె రుద్రాంబ నిచ్చి, వివాహముచేసి, ఆతనిని వశపరచుకొనెను. ఆ కాలమున ప్రబలుడగ నున్నప్రభువులలో కోటవంశీయు లొకరు, తన రెండవ కుమార్తె యగుగణపాంబను, కాకతి చక్రవర్తి కోట బేతరాజున కిచ్చి యుద్వాహ మొనర్చెను. నతవాటి బుద్ధరాజు కుమారుడు రుద్రుడు గణపతిదేవుని సోదరి మేలాంబికను పరిణయ మయ్యెను. ఈ విధముగ వీరందరును కాకతిప్రభుని ఆప్తవర్గములో చేరిరి. ఆ వెనుక గణపతిరాజు అయ్యవంశీయుడును, కొయ్యూరుపాలకుడును, మహావీరుడును నగు జాయప

నాయకు నోడించియు, ఆతని సోదరీమణులు నారమ్మ పేరమ్మల నుద్వాహమాడియు, జాయపుని తన మిత్రకోటిలో చేర్చుకొనెను. జాయపనాయకుడు గణపతిదేవుని గజసైన్యముల కధిపతియై, గజసాహిణి జాయపనాయకు డని ప్రఖ్యాతి వహించెను. గణపతిదేవుని సేనానియగు ఇందులూరి సోమయ, కొలనిరాజ్యాధిపతి యగు కేశవనాయకు నోడించి, ఆతని రాజ్యభాగమును (కొల్లేరు ప్రాంతము) కాకతీయ రాజ్యములో చేర్చెను. ఈ విధముగ 1225 నాటికి వెలనాటి విజయము పూర్తియయ్యెను. ఆ పైన గణపతి దేవుడు కళింగ దేశమును ప్రవేశించి, నేటి గంజాము మండలము లోని ఆస్కావరకు గల ప్రాంతమునంతను జయించి, స్వాధీనపరచుకొనెను. ఆ వెనుక నెల్లూరి ప్రాంతమందలి తెలుగుచోడులను గణపతిరాజు జయించెను. నెల్లూరి సీమను పాలించిన మనుమసిద్ధి రాజు, గణపతిదేవుని సహాయము నర్థించి, కోల్పోయిన తన రాజ్యమును మరల సంపాదించుకొనెను. ఈ సందర్భమున కవిబ్రహ్మయైన తిక్కన, తన ప్రభువగు మనుమసిద్ధి పక్షమున, కాకతి గణపతీంద్రుని సందర్శించినట్లు గాథ కలదు. కోణిదేన, పొత్తపి, అద్దంకి పాలకులు కాకతీయునికి వశమైరి. కాయస్థకులజుడును, వీరుడును నగు గంగయసాహిణికూడ, గణపతి దేవునికి సామంతుడై, యతనిచే పానుగల్లు మొదలు కైవారము పర్యంతము వ్యాప్తమైన రాష్ట్రముపై, ప్రభుత్వమును బడసెను. ఈ విధమున నేటి దత్త మండలప్రాంతమంతయు కాకతీయ రాజ్యాంతర్గతము కాగా, గణపతిదేవు డా భూభాగమునకు గంగయసాహిణినే పాలకునిగ నియమించెను. ఇట్లు గణపతి దేవరాజు ఆంధ్ర దేశము నంతను జయించెను. అతని రాజ్య ముత్తరమున నేటి గంజాం మండలములోనికిని, దక్షిణమున కాంచీపురమువరకును, వ్యాపించెను. గణపతి దేవు డోరుగల్లు పట్టణమును వృద్ధిపరచి, దానిని తన రాజధానిగ చేసికొనెను. ఈనాటివరకును కాకతీయుల కనుమకొండ రాజధానిగ నుండెను. తండ్రియనంతర మాతని కుమార్తె రుద్రాంబ ఓరుగల్లు కోటను బాగుగా దృఢపరచి శత్రుదుర్భేద్యముగ కావించెను.

రుద్రాంబ :—(1262-1296) గణపతి దేవునకు పురుష సంతానము లేనందున, ఆతని పుత్రికయగు రుద్రాంబ ఆతని యనంతరము రాజ్ఞి యయ్యెను. రుద్రాంబను చాళుక్యవీరభద్రుని కిచ్చి వివాహముచేసిరి. ఈమె కిరువురు కుమార్తెలు. రుద్రాంబ యౌవనముననే భర్తను గోల్పోయెను. కావున తన యనంతరము రాజ్యభారమును వహింపవలసినది తన కుమార్తెయే యని యెరింగి, గణపతి రాజామెకు రాజ్యపరిపాలనాక్రమమందు చక్కని శిక్షణ నొసంగి, రాజ్ఞీపదమునకు సమర్థురాలుగా చేసెను. రుద్రాంబ స్త్రీయయ్యు పురుష వేషమును ధరించి, పురుషులకు మించిన ధైర్యసాహసములతో, రాజ్యకార్యనిర్వహణమున ప్రవృత్తురాలయ్యెను. స్త్రీపరిపాలన మసమర్థముగ నుండునని భ్రమపడి, పలువురు సామంతులీమెపై తిరుగుబాటు చేసిరి. కాని రుద్రాంబ సేనానులు వీరి నందరిని అణచివైచిరి. చోళపాండ్యరాజులు, కాకతీయ సామ్రాజ్యపు దక్షిణ ప్రాంతముపై దాడులు సాగించిరి. కాని వీరినికూడ రుద్రాంబ పరాభవించి, వెనుకకు తరిమివైచెను. యాదవరాజగు మహాదేవుడుత్తరమునుండి కాకతీయ రాజ్యముపై దండెత్తి రాగా, రుద్రాంబ సేనలాతని నోడించి, గోదావరి యావలకు తరిమివైచెను. ఈ విధముగ శత్రుసంహారము కావించి, ఆ వెనుక రుద్రమ్మ శాంతియుతముగ రాజ్యపాలనము చేసెను. ఆమె ప్రజాక్షేమమునకై మిగులపాటుపడి, ప్రజానురాగమును జూరగొనినట్లు నిష్పాక్షికుడగు మార్కోపోలోయను విదేశయాత్రికుడు ప్రశంసించి యున్నాడు.

ప్రతాపరుద్రుడు:—(1296-1323) ప్రతాపరుద్రుడు రుద్రాంబ దౌహిత్రుడు. ఈమె యాతనిని కుమారునిగ స్వీకరించెను. ప్రతాపరుద్రుడు వీరుడును, విద్వత్కవిపోషకుడును, విజ్ఞానియు నగుప్రభువు. ఈతని కాలముననే కాకతీయ సామ్రాజ్యము విచ్ఛిన్న మగుట విధి వైపరీత్యము. క్రీ. శ. 1303 వ సంవత్సరమున మొదటిపర్యాయము

మహమ్మదీయు లీరాజ్యముపై దండెత్తిరి. అల్లావుద్దీన్ ఖిల్జీ అను ఢిల్లీశ్వరుడు కావించిన యీ ప్రయత్నము నిష్ఫలమయ్యెను. ప్రతాపరుద్రునకు విజయము లభించెను. 1309 వ సంవత్సరమున అల్లావుద్దీన్ సేనాని మాలిక్ కాఫర్ అనునాత డోరుగల్లుపై దండెత్తగా, ప్రతాపరుద్రు డాతనితో సమానముగ పోరజాలక, విశేష ధనము నాతని కొసంగి, సంధి కావించుకొనెను. మహమ్మదీయులు మరి రెండుపర్యాయములు కాకతీయ రాజ్యముపై దండెత్తి వచ్చిరి. మొదటి పర్యాయము ముందరివలెనే పరాజయమునంది సంధిచేసి కొనినను, ప్రతాపరుద్రుడు రెండవమారు వారినోడించి పారదోలెను. తుట్టతుదకు 1322 వ సంవత్సరమున ఢిల్లీశ్వరుడగు తుగ్లకురాజు ఓరుగల్లుపై అపారమగు సేనను పంపెను. ప్రతాపరుద్రు డైదునెలల పాటు యుద్ధముచేసి, తుద కోడిపోయెను. మహమ్మదీయులు ప్రతాపరుద్రుని బందీగ గొని, ఢిల్లీకి పంపివైచిరి. కాని మధ్యేమార్గమున నాతడు మరణించెను. ఈతనితో కాకతీయరాజ్య మంతరించెను.

కాకతీయరాజ్యము తురుష్కుల హస్తగత మగుటకు ముఖ్యముగ రెండు కారణములు కలవు. కాలానుగుణ్యాముగ తమ సైన్యముల సంస్కరించి, నూతన యుద్ధపరికరములను చేకూర్చుకొని, నూత్న యుద్ధతంత్రము నవలంబింపక పోవుట, వీరి మొదటిలోపము. ప్రజాసౌఖ్యము నభివృద్ధిపరచుటకును, విద్యను, కళలను, పోషించుటకును, పాటుపడినంతగ కాకతీయులు తమ యుద్ధశక్తి నభివృద్ధి పరచుటకై, యత్నింపలేదు. దూరదృష్టి లేకుండుటయే దీనికి మూలము. ప్రాచీన కాలమునుండియు హైందవసేనలు, చతురంగబలసమేతములై యుండెను. కాకతీయులనాడు రథములు లేకపోలేదు కాని వానిని యుద్ధరంగమున నుపయోగించినట్లు నిదర్శనములు లేవు. క్రీ. శ. ఏడవ శతాబ్దినుండియే యుద్ధభూమిని రథము లుపయోగించుట వెనుకపడెను. కాకతీయులవద్ద గజసేన యుండెను. జాయప నాయకుని గణపతిదేవుడు తనగజసైన్యమున కధికారిగ చేసెను

గదా! కాకతీయ సేనయందు నామమాత్రమున కాశ్వికసైన్యముండెను. కాని హైందవుల గుఱ్ఱములు తురుష్కుల ఉత్తమాశ్వములకు సరియైనవి కావు. నిజమునకు తురుష్కుల బలమంతయు, వారి యాశ్విక సేనయందే కేంద్రీకృతమై యుండెను. వారు రణరంగమున తీవ్రవేగమున, నొకభాగమునుండి వేరొక భాగమునకు పోవుచు, శత్రువులను చీకాకుపరచెడివారు. దురదృష్టవశమున నపజయము సంభవించినయెడల, కాలికి బుద్ధిచెప్పి, వాయువేగమున పారిపోయి, సర్వనాశనమును తప్పించుకొనుచుండిరి. హైందవసేనలలో శీఘ్రగమనము సంపూర్ణముగ కొరవడియుండెను. కాకతీయులనాటి సేనల కాయువుపట్టు వీరి కాల్బలము. పాదచారులగు వీరు బల్లెములు ఖడ్గములు, త్రిశూలములు, గండ్రగొడ్డళ్ళు మున్నగు నాయుధములతో పోరాడెడివారు. కాల్బలములో చాలమంది ధనుర్బాణములనే ఆయుధములుగ నుంచుకొనుచుండిరి. కాకతీయ ప్రభువులు తాము నవలక్షధనుర్ధరుల మని తెల్పుకొని యున్నారు. కావున వీరి సేనాబలము ముఖ్యముగ ధానుష్కులయందుండెడిది. ఇరుపక్షములవారును నిలువద్రొక్కుకొని యుద్ధముచేసిన పక్షమున, ధానుష్కులు శత్రుసంహారమును చేసియుండియుందురు. కాని యవను లశ్వారూఢులై, త్రుటికాలములో, నొకచోటినుండి వేరొక చోటికి పరుగెత్తుచున్నప్పుడు, పాపము పాదచారులగు ధానుష్కు లేమి చేయజాలుదురు? కాకతీయులు నిర్మించిన దుర్గములు మిక్కిలి బలిష్ఠములై ఇంచుమించు శత్రుదుర్భేద్యములుగ నుండె ననుటలో సందేహములేదు. దుర్గములలో సురక్షితముగనుండి, వీరు నెలల తరబడి యుద్ధము చేసెడివారు. కాని దుర్గమములగు నీదుర్గములే, వీరి పరాజయమునకు కొంతవరకు కారణమయ్యెనేమో యని తలంపవలసి వచ్చుచున్నది. అపారమగు సేనను కల్గియుండియు, వీరు చాలదినములవరకు పరిమిత ప్రదేశములగు కోటలలో దాగుకొని

మహమ్మదీయు లీరాజ్యముపై దండెత్తిరి. అల్లావుద్దీన్ ఖిల్జీ అను ఢిల్లీశ్వరుడు కావించిన యీ ప్రయత్నము నిష్ఫలమయ్యెను. ప్రతాపరుద్రునకు విజయము లభించెను. 1309 వ సంవత్సరమున అల్లావుద్దీన్ సేనాని మాలిక్ కాఫర్ అనునాత డోరుగల్లుపై దండె త్తగా, ప్రతాపరుద్రు డాతనితో సమానముగ పోరజాలక, విశేష ధనము నాతని కొసంగి, సంధి కావించుకొనెను. మహమ్మదీయులు మరి రెండుపర్యాయములు కాకతీయ రాజ్యముపై దండెత్తి వచ్చిరి. మొదటి పర్యాయము ముందరివలెనే పరాజయమునంది సంధిచేసి కొనిరి, ప్రతాపరుద్రుడు రెండవమారు వారినోడించి పారదోలెను. తుట్టతుదకు 1322 వ సంవత్సరమున ఢిల్లీశ్వరుడగు తుగ్లకురాజు ఓరుగల్లుపై అపారమగు సేనను పంపెను. ప్రతాపరుద్రు డైదు నెలల పాటు యుద్ధముచేసి, తుద కోడిపోయెను. మహమ్మదీయులు ప్రతాప రుద్రుని బందీగ గొని, ఢిల్లీకి పంపివైచిరి. కాని మధ్యమార్గమున నాతడు మరణించెను. ఈతనితో కాకతీయరాజ్య మంతరించెను.

కాకతీయరాజ్యము తురుష్కుల హస్తగత మగుటకు ముఖ్య ముగ రెండు కారణములు కలవు. కాలానుగుణ్యముగ తమ సైన్య ముల సంస్కరించి, నూతన యుద్ధపరికరములను చేకూర్చుకొని, నూత్న యుద్ధతంత్రము నవలంబింపకపోవుట, వీరి మొదటిలోపము. ప్రజాసౌఖ్యము నభివృద్ధిపరచుటకును, విద్యను, కళలను, పోషించు టకును, పాటుపడినంతగ కాకతీయులు తమ యుద్ధశక్తి నభివృద్ధి పరచుటకై, యత్నింపలేదు. దూరదృష్టి లేకుండుటయే దీనికి మూలము. ప్రాచీన కాలమునుండియు హైందవసేనలు, చతురంగ బలసమేతములై యుండెను. కాకతీయులనాడు రథములు లేకపోలేదు కాని వానిని యుద్ధరంగమున నుపయోగించినట్లు నిదర్శనములు లేవు. క్రీ. శ. ఏడవ శతాబ్దినుండియే యుద్ధభూమిని రథము లుపయో గించుట వెనుకపడెను. కాకతీయులవద్ద గజసేన యుండెను. జాయప నాయకుని గణపతిదేవుడు తనగజసైన్యమున కధికారిగ చేసెను

గదా! కాకతీయ సేనయందు నామమాత్రమున నాశ్వికసైన్య మూండెను. కాని హైందవుల గుఱ్ఱములు తురుష్కుల ఉత్తమాశ్వములకు సరియైనవి కావు. నిజమునకు తురుష్కుల బలమంతయు, వారి యాశ్విక సేనయందే కేంద్రీకృతమై యుండెను. వారు రణరంగమున తీవ్రవేగమున, నొకభాగమునుండి వేరొక భాగమునకు పోవుచు, శత్రువులను చీకాకుపరచెడివారు. దురదృష్టవశమున నపజయము సంభవించినయెడల, కాలికి బుద్ధిచెప్పి, వాయువేగమున పారిపోయి, సర్వనాశనమును తప్పించుకొనుచుండిరి. హైందవసేనలలో నీ ద్రుతగమనము సంపూర్ణముగ కొరవడియుండెను. కాకతీయులనాటి సేనల కాయువుపట్టు వీరి కాల్బలము. పాదచారులగు వీరు బల్లెములు ఖడ్గములు, త్రిశూలములు, గండ్రగొడ్డళ్ళు మున్నగు నాయుధములతో పోరాడెడివారు. కాల్బలములో చాలమంది ధనుర్బాణములనే ప్రయుధములుగ నుంచుకొనుచుండిరి. కాకతీయ ప్రభువులు తాము ధనుర్ధరుల మని తెల్పుకొని యున్నారు. కావున వీరి సేనాబలము ముఖ్యముగ ధానుష్కులయందుండెడిది. ఇరుపక్షములవారును నిలువద్రొక్కుకొని యుద్ధముచేసిన పక్షమున, ధానుష్కులు శత్రుసంహారమును చేసియుండియుందురు. కాని యవను లశ్వారూఢులై, త్రుటికాలములో, నొకచోటినుండి వేరొక చోటికి పరుగెత్తుచున్నప్పుడు, పాపము పాదచారులగు ధానుష్కులేమి చేయజాలుదురు? కాకతీయులు నిర్మించిన దుర్గములు మిక్కిలి బలిష్ఠములై ఇంచుమించు శత్రుదుర్భేద్యములుగ నుండె ననుటలో సందేహము లేదు. దుర్గములలో సురక్షితముగనుండి, వీరు నెలల తరబడి యుద్ధము చేసెడివారు. కాని దుర్గములగు నీదుర్గములే, వీరి పరాజయమునకు కొంతవరకు కారణమయ్యెనేమో యని తలంపవలసి వచ్చుచున్నది. అపారమగు సేనను కల్గియుండియు, వీరు చాలదినములవరకు పరిమిత ప్రదేశములగు కోటలలో దాగుకొని

యుండుటవలన, నీసేనలకు తమ ధైర్యస్థైర్యముల చూపుటకు తగి నంత యవకాశము లభింపకుండెనిడి. యుద్ధావసానమున, కాకతీయ వీరులు బోనులోని సింగములవలె దుర్గములు వెలువడి, శత్రువులతో తలపడినను, వారికి మొదటి యుత్సాహము తగ్గిపోవుట సహజము. అంతేకాక పురాణకాలమునాటి నుండియు, అవలంబించిన ధర్మ యుద్ధ నియమములనే, కాకతీయు లవలంబించుచుండిరి. ఆధునికనీతి చతురు లగు యవనులతో పోరునప్పుడీ కృతయుగధర్మములు, నిరుప యోగములని వారు గుర్తింపకుండుట వారి వినాశనమునకు హేతు వయ్యెను. కాకతీయసేనానులలో గల యంతఃకలహములును, అసూయలును వారి పతనమునకు రెండవ హేతువు. వీరికడ కొలు వున్నవారిలో రెడ్డివీరులును, పద్మనాయక యోధులును, ముఖ్యులు. గణపతి దేవుని కాలమునుండియు, పాలకులు తమ్ము చిన్నచూపు చూచుచుండి రనియు, పద్మనాయకుల యెడలనే యెక్కువ అభిమా నమును ప్రదర్శించుచుండిరనియు, రెడ్డివీరుల కనుమానముండెను. అందువలన వారు యుద్ధకాలమున, తమ ప్రభువులకు తగినంత సహాయము చేయకపోవుటయే కాక, కొన్ని సందర్భములలో స్వామి ద్రోహమునకుకూడ బూనిరి. కాని తుట్టతుదకు తాము కావించిన తప్పును గుర్తెరింగి, పశ్చాత్తాపపడి, ప్రతాపరుద్రుడు తురుష్క సేనతో కావించిన యుద్ధమున, నంత్యదశయందు రెడ్డివీరులు హోరాహోరీని పోరిరి. కాని వారి పరాక్రమము బూడిదలో పోసిన పన్నీర య్యెను.

కాకతిరాజన్యులకు సమర్థులైన దండనాథులును, మంత్రి సత్తములును, పెక్కురు రాజ్యకార్య నిర్వహణమునందు తోడ్పడిరి. దండనాథులలో ముఖ్యులు రేచెర్ల గృహనామముగల రెడ్డివీరు లును, అదే గోత్రనామముగల పద్మనాయక యోధులును కూడ నుండిరి. రేచెర్ల రెడ్డివంశమువారి ప్రశంస పిల్లలమర్రి, పాలంపేట మున్నగు ప్రాంతముల యందలి శాసనములవలన, తెలియనగు

చున్నది. ఈ వంశమునందు మొదటి ప్రోలరాజునకు సహాయపడిన బమ్మసేనానియు, రెండవ ప్రోలరాజును సేవించిన కాటచమూపతియు, కాకతి రుద్రునికి యుద్ధరంగమున చేదోడు వాదోడుగ నుండిన బేతిరెడ్డియు, ప్రశంసార్హులు. వీరందరిని మించి, కాకతీయ రాజ్యమునకు సేవచేసినవాడు రుద్రసేనాని. గణపతిదేవుడు శత్రువుల కడ బందీగ నున్నకాలమున, రేచెర్ల రుద్రుడే కాకతీయ రాజ్యము రక్షించి, తన యేలిక కొసంగెను. గణపతి దేవుని యనంతరము కాకతీయ రాజ్యమునకు ముఖ్యముగా సేవచేసినవారు, రేచెర్ల గోత్రీకులగు పద్మనాయకులు. కాకతి రుద్రాంబ కాలమున, నీవంశమునకు చెందిన ప్రసాదిత్యనాయకుడు, తన యేలికకు చాల సహాయపడెను. ఈతనికి కాకతిరాజ్య ప్రతిష్ఠాపనాచార్య యను బిరుదమున్నట్లు తెలియుచున్నది. ప్రతాపరుద్రుని కాలమున ఎఱ్ఱదాచానాయకుడు, నల్లదాచానాయకుడు ననువారలు రాచకొండ ప్రాంతమునకు రాజప్రతినిధులుగ నుండి, తమ ప్రభువునకనేక విజయముల సాధించిరి. వీరుకాక బ్రాహ్మణులగు ఇందులూరివారు కూడ, కాకతి ప్రభువులకు గొప్ప యండగ నుండిరి. కాకతి రుద్రాంబ, తన రెండవ కుమార్తెయగు రుయ్యమ్మను, ఈ వంశీయుడగు అన్నయామాత్యుని కిచ్చి వివాహము చేసెను. దీనివలన రాజవంశమున కీత డెంతటి ముఖ్యుడో యూహింపదగును. వీరేకాక మల్యాల వంశమువారు, కాయస్థవంశమువారు, తదితరులును కాకతీయ రాజ్యమునకు పెట్టనికోటలవలెనుండెడివారు. గోనగన్నారెడ్డి, నాగయగన్నమంత్రి, ముప్పిడి నాయకుడు, బెండపూడి అన్నయ్య అనువారలాయా కాలములందు కాకతీయరాజ్య సౌధమునకు స్తంభములవలె నుండిరి. శివదేవయ్యయను బ్రాహ్మణోత్తముడొకడు, కాకతీయ రాజవంశమునకు మంత్రిగను, గురువుగనుకూడ వర్తించి, వారిచే మన్నింపబడెను.

కాకతీయయుగ చరిత్రమును వర్ణించునెడ, సుప్రసిద్ధమగు పల్నాటి యుద్ధప్రశంస కావింపక తప్పదు. ఇయ్యది వీరరసాత్మకమగు జాతీయగాథ. ఆంధ్రదేశ చరిత్రమునందు పల్నాటియుద్ధము మిక్కిలి చరిత్రాత్మకమైనది. ఈనాటివరకునుకూడ ఆంధ్రులు పల్నాటి వీరులను, వీరరసావతారములుగ భావించుచు, మన్నించుచున్నారు. గుంటూరు మండలమందలి పల్నాటి సీమయందు, పల్నాటి వీరులను నేటికినికూడ దేవతలవలె పూజించుచున్నారు. పల్నాటి వీరులు పాల్గొన్న సుప్రసిద్ధమగు పల్నాటి సంగ్రామము క్రీ॥ శ॥ 1176-1182 సంవత్సరములనడుమ జరిగెను. దీని నొక విధముగ భారతయుద్ధముతో పోల్చవచ్చును. దాయాదులకు నడుమనుండు సహజమగు అసూయయు, ద్వేషమును, దీనికి కారణములు. పండ్రెండవ శతాబ్ది మధ్యభాగమున, హైహయవంశీయుడగు నలగామ రాజనునాతడు, గురజాల పట్టణమును రాజధానిగ చేసికొని, పల్నాటిసీమను పాలించెను. నలగామరాజునకు వీరుడును, మహామహిమాన్వితుడునగు, బ్రహ్మనాయుడు మంత్రిగ నుండెను. నలగామరాజునకు కొందరు సవతి తమ్ములుండిరి. సర్వజ్ఞుడును, నిష్పక్షపాతియునగు బ్రహ్మనాయుడు, తన సవతితమ్ములయెడ వాత్సల్యము చూపవలెనని, ఏలికయగు నలగామునికి హితబోధ చేయుచుండెడివాడు. కాని దురదృష్టవశమున నలగామరాజు నాయకురాలను పేరుగల యొక అసామాన్య శేముషీధురంధరయగు నారీమణి ప్రోత్సాహమున, హితైషియగు బ్రహ్మనాయని బోధనల పెడచెవినిపెట్టెను. అందువలన నాయకురాలికిని, బ్రహ్మనాయనికిని, మనస్పర్థలు హెచ్చెను. మాయోపాయకుశలురాలగు నాయకురాలు, బ్రహ్మనాయని కోడిపందెములందోడించి, ఆతనిని, అతని పోషణలోనున్న నలగామరాజు సవతి తమ్ములను, ఏడేండ్లు వనవాసమున కంపెను. వనవాసానంతరముకూడ నాయకురాలు బ్రహ్మనాయనితో సంధిచేసికొనుట కంగీకరిం

పక, నలగామునిసోదరుల కర్ధరాజ్య మిచ్చుటకు నిరాకరించి యుద్ధ సన్నద్ధయయ్యెను. కార్యమపూడివద్ద నిరుపక్షములవారికి ఘోరమగు యుద్ధము నడచెను. ఇందు పల్నాటివీరు లద్భుత శౌర్యమును జూపి, రణరంగమునకు బలియైరి. భారతయుద్ధమున నభిమన్యు కుమారుని వలె, నీ సంగ్రామమున బ్రహ్మనాయని పుత్రుడు బాలనాయ డజరామరమగు కీర్తిని సంపాదించి, నిహతు డయ్యెను. బ్రహ్మనాయడు జయమును సంపాదించియు, సాటివీరుల మరణమునకు దుఃఖితుడై, నలగామునే మరల రాజ్యమున నిల్పెను. ఈ వీరగాథను శ్రీనాథ మహాకవి తన పలనాటి వీర చరిత్రమునందు వర్ణించియున్నాడు[1] పల్నాటి యుద్ధమునందు మహావీరు లనేకులు మడియుటవలన, కాకతీయ రాజ్యవిస్తరణమునకు పరోక్షముగ దోహదము కల్గెను.

కాకతీయ యుగమునందు ఆంధ్రదేశమున ప్రాచీనములగు జైన బౌద్ధమతములు సంపూర్ణముగ క్షీణించుటయు, శైవవైష్ణవ మతములు ప్రబలుటయు సంభవించెను. బౌద్ధమతస్థాపకుడగు గౌతమ బుద్ధుని శ్రీమహావిష్ణుని దశావతారములలో నొక యవతారముగ నంగీకరించి, పూజించుట, ప్రారంభించుటవలనను, క్రమక్రమముగ బౌద్ధులు ప్రాచీనమగు హీనయాన బౌద్ధమును విస్మరించి, మూర్తి పూజాదికములగు నాచారములతో నిండిన మహాయానము నవలంబించుటచేతను, బుద్ధధర్మము క్రమముగ హిందూధర్మములో లీనమయ్యెను. కాని జైనమత మట్లుకాక కాకతీయరాజ్యారంభమునాటికి బలవత్తరముగ నుండెను. కాకతీయ ప్రభువులు, మొదట జైనమతమునే యాదరించిరి. వారి కులదైవమగు కాకతికూడ జైనదేవతయే అయియుండవచ్చును. కాని శైవమత మాంధ్రదేశమున వ్యాపించి నప్పుడు, కాకతీయులు తన్మతావలంబకులైరి.

1. పల్నాటి వీరచరిత్రయందు బాలచంద్రుని యుద్ధముమాత్రమే శ్రీనాథుని రచనయని కొందరు విమర్శకులు తలంచుచున్నారు.

కాకతీయప్రభువులలో శైవమతము నవలంబించిన ప్రథమ రాజన్యుడు రెండవ బేతరాజు. ఈతడు పరమమాహేశ్వరుడని వర్ణింపబడెను. ఆతనితరువాత రుద్రదేవుడును, గణపతి దేవరాజు మున్నగువారుకూడ, శైవమతము నవలంబించిరి. గణపతిదేవునకు విశ్వేశ్వర శివాచార్యుడను గొప్పశైవుడు గురువుగ నుండి, ఉపదేశముచేసి, దీక్షనొసంగినట్లు, తెలియుచున్నది. గణపతిదేవుని కాలమున ప్రథమపర్యాయ మాంధ్రదేశమున మందర గ్రామమందు గోళకీమఠ మనునొక సంస్థ స్థాపింపబడెను. [1]ఇయ్యది శైవమత ప్రచారము కొరకును, శైవ గ్రంథబోధనముకును ఏర్పడిన, యొక మతకేంద్రము. గణపతిదేవుడును, అతని కుమార్తె రుద్రాంబయునుకూడ, ఈ మఠమునకై గ్రామముల దానము చేసిరి. కాకతీయు లీవిధముగ శైవమతమునం దభిమానమును చూపినను, పరమతముల ద్వేషించినట్లుకాని, తన్మతానుయాయుల బాధించినట్లుకాని, కానరాదు. త్రిభువనమల్ల బేతరాజువద్ద మంత్రిగనున్న వైజదండనాథుడును, రెండవ ప్రోలరాజును సేవించిన ఆతని కుమారుడు బేతనయు, జైనమతాభిమానులు. బేతన భార్య మైలమ యనునామె, అనుమకొండవద్ద గుట్టపై కడలాలయ వసతిని కల్పించెను. కాని రాజులు చూపిన విశాలదృష్టిని, పరమత సహనమును, సామాన్యప్రజలు చూపినట్లు తెల్పుటకు వలనుపడదు. తమ మతసంఘము బలపడినకొలదియు, శైవులు విజృంభించి, జైనుల హింసించి, బలాత్కారముగ తమ మతములో చేర్చుకొనుటయు, జైన గ్రంథముల నగ్ని కర్పించుటయు, జైన దేవాలయముల మార్చి శివాలయములుగ చేయుటయు సాగించిరి. ఇందులకు తెలంగాణమందలి

1. నేటి పాలమూరుజిల్లా గంగాపురమందు ప్రాచీనములును, శిథిలములునైన రెండు గుళ్ళు కలవనియు, "గొల్లకగుడు" లని ప్రాకృత జనులచే పిలువబడుచున్న యీశిథిలము లొకకాలమున గోళకీ మఠములై యుండవచ్చుననియు శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు "ఆంధ్రుల సాంఘిక చరిత్ర" యందు తెల్పియున్నారు.

వేములవాడ, జోగిపేట, కొలనుపాక, మున్నగు ప్రదేశములలోని జైన మందిరములు శివాలయములుగ మారుటయే తార్కాణము. వీరశైవముతో పాటు, వైష్ణవమతముకూడ, తెలుగు దేశమున వ్యాపించి శైవమతముతో పోటీపడెను. పల్నాటివీరుడగు బ్రహ్మనాయుడు పరమ వైష్ణవుడు. ఈ రెండు మతములవారు సర్వోత్కర్షము దూషించికొనినను, వీరి మతప్రభావమువలన, చాతుర్వర్ణ్యవ్యవస్థ యందలి కాఠిన్యము కొంచెము సడలి, అన్ని కులములవారును ఒండొరులతో భోజన భాజనాదుల జరుపుట సాగించిరి. ఈ యుగమందు సామాన్యజనులు ఏకవీర, ఓరుగంటి ఎల్లమ్మ, మైలారు దేవుడు, భైరవుడు, మూసానమ్మ స్వయంభూదేవుడు, మాచెర్ల చెన్నడు, గురజాల గంగమ్మ, అను దైవతముల పూజించుచుండి నట్లు నిదర్శనములు కలవు.

కాకతీయ యుగమందు ఆంధ్రగీర్వాణ భాషలకు రెంటికిని రాజాశ్రయము లభించి, ఆ భాషలయం దుత్తమ గ్రంథములు వెలయుట కవకాశమేర్పడెను. కాకతి రుద్రరాజు పండితుడును, రసికుడునై అనేకులు విద్వాంసుల నాదరించుటయే కాక, స్వయముగా గ్రంథ రచనము కావించెను. ఈతనికి "విద్యాభూషణుడు" అను బిరుద నామమున్నటుల, ద్రాక్షారామ శాసనములలో నొకదానివలన వ్యక్తమగుచున్నది. రుద్రదేవుడు నీతిసారమను గ్రంథమును, సంస్కృతమున రచించెను. బద్దెనకవి నీతిశాస్త్ర ముక్తావళియందు దీని ప్రశంస గలదు. గణపతిదేవుడును, రుద్రాంబయుకూడ, పండితులను, విద్యాధికులను పోషించిరి. ఈ వంశమునందలి తుట్టతుది రాజగు ప్రతాపరుద్రుడు గొప్ప విద్వాంసుడును, సరసుడును, కవి పండితబృంద సంరక్షకుడునని తెలుపవచ్చును. ఈ కాలమున రాజులుమాత్రమే కాక, రాజోద్యోగులును, ఇతర ప్రభువులును, కూడ విద్యాపోషణ కావించిరి.

కాకతీయయుగమున వీరశైవమత మాంధ్రదేశమున కూడ వ్యాప్తి చెందెనని తెలిసికొనియున్నాము. ఈ మతప్రచారమువలన సంఘమునందలి యాచారములు మార్పు చెందుటయే కాక, దేశభాష లకు మిక్కిలి ప్రోత్సాహము లభించెను. సామాన్యజనులకు తాము బోధించు సంశములు సులభముగ తెలియవలయు నను నుద్దేశ్య ముతో, శైవులు, దేశీయభాషలలో, గ్రంథరచనమునకు బూనిరి. వీరిలో మహాప్రజ్ఞాన్వితుడును, శైవధర్మావలంబియునగు గురుమల్లి కార్జున పండితారాధ్యు డొకడు. ఈతడు రెండవ ప్రోలరాజునకును, రుద్రదేవునకును సమకాలీనుడు. మల్లికార్జున పండితుడు శివుని లీలలు, శివభక్తుల గాథలు, మున్నగు సంశములతో కూడిన శివతత్త్వసార మను గ్రంథమును, రచించెను. ఇయ్యది తెలుగు శతక కవిత్వము నకు శ్రీకారమువంటిది. మల్లికార్జును డితరలఘుకృతులను కూడ రచించెను. శైవకవులలో పేర్కొనవలసినవాడు పాల్కురికి సోమ నాథు డొకడు. ఈతడు కాకతి రుద్రాంబ దౌహిత్రుడగు ప్రతాప రుద్రునికి సమకాలీనుడు. సోమనాథుడు బసవపురాణమును, పండితా రాధ్య చరిత్రమును చక్కని జాతీయమైన తెలుగునందు ద్విపద కావ్యముగ రచించెను. అవి ఆంధ్రభాషయందలి అపూర్వ కావ్యములు. పాల్కురికి సోమనకవి మాత్రమే కాడు; ఈతడు మహాపండితు డనియు, సర్వజ్ఞ నామధేయమున కర్హు డనియు కొందరు పండితుల యభిప్రాయము. ఈ కాలపు కవులలో మారన యనునాత డొకడు. ఈ మారన తాను కవిబ్రహ్మయైన తిక్కన సోమయాజికి శిష్యుడ నని తెల్పుకొనియున్నాడు. ఈ కవి మార్కండేయ పురాణము నాంధ్రమున రచించి ప్రతాపరుద్రుని సేనానియగు నాగయగన్న మంత్రి కంకిత మొనర్చెను. ప్రతాప రుద్ర చక్రవర్తికడ నుద్యోగిగనున్న సాహిణిమారుడు అనునాతడు, భాస్కర రామాయణమను గ్రంథమును కృతిపొందెను. ఈగ్రం

వేములవాడ, జోగిపేట, కొలనుపాక, మున్నగు ప్రదేశములలోని జైన మందిరములు శివాలయములుగ మారుటయే తార్కాణము. వీరశైవముతోపాటు, వైష్ణవమతముకూడ, తెలుగుదేశమున వ్యాపించి శైవమతముతో పోటీపడెను. పల్నాటివీరుడగు బ్రహ్మనాయకు పరమ వైష్ణవుడు. ఈ రెండు మతములవారు సనాతనత్వము దూషించికొనినను, వీరి మతప్రభావమువలన, చాతుర్వర్ణ్యవ్యవస్థయందలి కాఠిన్యము కొంచెము సడలి, అన్ని కులములవారును ఒండొరులతో భోజన భాజనాదుల జరుపుట సాగించిరి. ఈ యుగమందు సామాన్యజనులు ఏకవీర, ఓరుగంటి ఎల్లమ్మ, మైలారుదేవుడు, భైరవుడు, మూసానమ్మ స్వయంభూదేవుడు, మాచెర్ల చెన్నడు, గురజాల గంగమ్మ, అను దైవతముల పూజించుచుండినట్లు నిదర్శనములు కలవు.

కాకతీయ యుగమందు ఆంధ్రగీర్వాణ భాషలకు రెంటికిని రాజాశ్రయము లభించి, ఆ భాషలయందుత్తమ గ్రంథములు వెలయుటకవకాశమేర్పడెను. కాకతి రుద్రరాజు పండితుడును, రసికుడునై అనేకులు విద్వాంసుల నాదరించుటయే కాక, స్వయముగా గ్రంథరచనము కావించెను. ఈతనికి "విద్యాభూషణుడు" అను బిరుదనామమున్నట్టుల, ద్రాక్షారామ శాసనములలో నొకదానివలన వ్యక్తమగుచున్నది. రుద్రదేవుడు నీతిసారమను గ్రంథమును, సంస్కృతమున రచించెను. బద్దెనకవి నీతిశాస్త్ర ముక్తావళియందు దీని ప్రశంస గలదు. గణపతిదేవుడును, రుద్రాంబయుకూడ, పండితులను, విద్యాధికులను పోషించిరి. ఈ వంశమునందలి తుట్టతుది రాజగు ప్రతాపరుద్రుడు గొప్ప విద్వాంసుడును, సరసుడును, కవి పండితబృంద సంరక్షకుడునని తెలుపవచ్చును. ఈ కాలమున రాజులుమాత్రమే కాక, రాజోద్యోగులును, ఇతర ప్రభువులును, కూడ విద్యాపోషణ కావించిరి.

నులలో ముఖ్యుడగు జాయపుడు అను నాతడు 'నృత్తరత్నావళి' అనుపేర, నాట్యశాస్త్రమునుగూర్చి యొక గ్రంథమును వ్రాసెనని తెలియుచున్నది. పాలంపేటయందు నేటికిని నిలిచియున్న రామప్ప దేవాలయమునందు చూపబడిన నృత్యసుందరుల విగ్రహము లీ గ్రంథాంశముల ననుసరించియే మలచబడినట్లు పండితులు తెల్పుదురు.

కాకతీయుల కాలమున ననేక శైవమందిరములు నిర్మింపబడెను. కాలపురుషుని తీవ్రాఘాతములకును, మత్సరగ్రస్తులగు నన్యమతస్థుల విధ్వంసక చర్యలకును, గురియయ్యు, ఈ మందిరములలో కొన్ని నేటికిని నిలిచి, ఆనాటి శిల్పకారుల అద్భుతశక్తికిని, కళాసృష్టికిని, సౌందర్యోపాసనమునకును తార్కాణముగ నిలిచియున్నవి. వానిని వర్ణించుటకు పూర్వము కాకతీయ నిర్మాణములలో నతి ప్రాచీనమైన పద్మాక్షిదేవి ఆలయమునుగూర్చి తెలుపవలెను. ఇది అనుమకొండ పురమునకు సమీపమున, నొక కొండపై, నిర్మింపబడి యున్నది. దీని నిర్మాణము రెండవ ప్రోలరాజు కాలమున జరిగెను. ఇయ్యది మొట్టమొదట జైనమందిరముగ నుండెను. వైజన దండనాథుని కుమారుడు బేతన మంత్రి ధర్మపత్ని మైలమ, ఈ కొండపై కడలాలయ వసతిని నిర్మింపించినట్లు తెలిపియున్నాము. దేవాలయమునకు వెలుపలనున్న ఉన్నతమగు శిలపై, బేతన యొక్కయు ఆతని భార్యయొక్కయు, విగ్రహములు చెక్కబడినవి. ఇచ్చటనే యొక దిగంబర జైనవిగ్రహముకూడ, రాతియందు దొలుపబడినవి. భిక్షుకులకొరకై రెండు గుహలుకూడ దేవాలయము వెలుపల రాతియందే నిర్మింపబడినది. దేవాలయాంతర్భాగమున కూడ జైనతీర్థంకరుని విగ్రహమును, యక్షిణీ విగ్రహములును, కానవగును. ఈ దేవాలయమునందు శిల్పకళాప్రాశస్త్య మేదియు కానరాదు. దేవతా విగ్రహములును, మందిరమునుకూడ మిక్కిలి సరళముగ నిర్మితములై యున్నవి. ఈ జైనమందిరము కాలక్రమ



కాకతీయులనాటి కళాశిల్పమును చాటు

ఓరుగల్లు కోటద్వారము

పేజీ 268

ముగ పద్మాక్షీ దేవాలయముగ మారెను. కొండదిగువ పద్మాక్షి కొలను కలదు. పద్మాక్షీ దేవాలయమున కనతిదూరమున సిద్ధేశ్వరుని యాలయమును, గుండమును కలవు. కాకతీయులు శైవమతావలంబకులైన కాలమున, నీమందిరము నిర్మింపబడియుండును. కాకతీయ శిల్పమున కత్యద్భుతమగు నిదర్శనము అనుమకొండయందలి సహస్ర స్తంభ దేవాలయము. ఇది కాకతిరుద్రుని కాలమున నిర్మింపబడెను. రేచెర్ల రుద్రసేనానిచే నిర్మింపబడిన పాలంపేటయందలి రామప్పగుడి, కాకతీయ శిల్పమునకు తలమానికమని చెప్పవచ్చును. ఇవి కాక ఓరుగల్లు కోటలోని స్వయంభూదేవుని ఆలయమును. పానగల్లునందలి సూర్యనారాయణుని ఆలయమును. పిల్లలమర్రియందలి ఆలయమును, మరెన్నియో కాకతీయులకాలమున నావిర్భవించెను. కాకతీయ శిల్పమునందు అసామాన్యప్రతిభయు. సూక్ష్మపరిశీలనయు. సౌందర్య పిపాసయు కానవచ్చును. ఆనాటి శిల్పులు చూపిన విజ్ఞానము, వారికే తగును. బ్రహ్మాండమగు శిలలను వారు బెండువలె అవలీలగ నెత్తివైచి, స్తంభములుగను, ద్వారములుగను, ఉపయోగించెడివారు. వారు సామాన్యముగ వాడినవి ఉక్కుతో పోల్పదగిన నల్లశిలలు. అచ్చటచ్చట ఎఱ్ఱని రాళ్లుకూడ వాడబడినవి. వజ్రకఠినములగు నీ శిలలపై కాకతీయ శిల్పులు వివిధములగు నగిషీపనులు, పండ్లు, పూవులు, జంతువుల రూపములు, మనుష్యుల యాకారములు, దేవతా విగ్రహములు, వివిధములగు దుస్తులతో, ఆయుధములతో, భంగిమములలో, అద్భుతమగు నేర్పుతోడను, నిర్దుష్టమగు సూక్ష్మములతోడను మలచిరి. లోహాతి కఠినమగు నీ శిలలు శిల్పులచేతియందు, వెన్నవలె మెత్తబడినవాయని చూపరులు భ్రమపడుట కవకాశము కలదు. కాకతీయ శిల్పులచే సిద్ధము చేయబడిన నందీశ్వర విగ్రహములు, ముద్దులు మూటగట్టుచు, జీవకళతో నుట్టిపడుచున్నవి. కాకతీయులనాటి మందిరము లెన్నియో శిథిలములై, భూగర్భమునందు దాగియున్నవి. ప్రభుత్వ పురాతత్త్వ శాఖవారు, ఓరుగల్లు కోటలో, స్వయంభూ

దేవాలయ సమీపమున, భూమిని త్రవ్వించుటచే, అనేక జీర్ణ శిల్పములు వెలువడెనవి. వానిని సందర్శించినవారికి, కాకతీయ శిల్ప ప్రాశస్త్యము తెలియవచ్చును. కాకతీయుల కాలమందు స్థలదుర్గములును, గిరిదుర్గములును పెక్కులు నిర్మింపబడెను. స్థలదుర్గముల కోరుగల్లు కోట అత్యుత్తమ నిదర్శనము. ఇది ఫిరంగులకుకూడ లొంగని మట్టికోటతోడను, దానిలోపల రాతి ప్రాకారముతోడను, ఆలోపల నింకొక గోడలతోడను, కూడిన యొక బ్రహ్మాండమగు కట్టడము. దీనికి చుట్టును విశాలమగు కందకమును, మట్టికోటయందు శత్రుదుర్భేద్యమగు ద్వారములును, కోటగోడపై అసంఖ్యాకములగు బురుజులును కలవు. ఇవి కాక కంభంమెట్టు, భువనగిరి, మెతుకు ఇందూరు మున్నగు ప్రదేశములలో ననేక గిరిదుర్గములుకూడ కలవు.

ఓరుగంటి రాజులును, వారి సామంతులునుకూడ ప్రజాసౌఖ్యమునకై మిక్కిలి కష్టించి, అనేక సదుపాయములను కల్పించిరి. ఈ రాజులు ప్రజలకు సంస్కృతమును, వేదవేదాంగములను బోధించుటకై కళాశాలల స్థాపించెడివారు. ఈ కళాశాలలకై భూవసతులేర్పాటు చేయబడెను. ఈ ప్రభువులు మఠములను, సత్రములను కూడ నెలకొల్పి, వానికై భూదానములు చేసి, శాసనములు వేయించెడివారు. [1]ప్రజల ఆరోగ్యరక్షణమునకై, ఆరోగ్యశాలలను, ప్రసూతి శాలలను, ప్రభుత్వమేర్పాటు చేయించుచుండెను. ప్రతి గ్రామమునందును గ్రామరక్షణకొరకై వీరభద్రులను రక్షకభటులు నియమితు లగుచుండిరి. నేరస్థులకు శిక్షాస్మృతి ననుసరించి, కొరడా దెబ్బలను కొట్టుటయో, లేక హస్తఖండనము, పాదఖండనము, శిరచ్ఛేదమును విధించుటయో, జరగుచుండెను. వ్యవసాయాభివృద్ధికిని, ప్రజోపయోగమునకును జలాశయములు చాలా ముఖ్యమను విషయము నానాటి రాజన్యులు గుర్తించి, అనేక తటాకముల నిర్మింపించిరి. దీనియందు లక్నవరము చెరువు, రామప్ప చెరువు,

1. ఆంధ్రులసాంఘిక చరిత్ర—సు. ప్రతాపరెడ్డి.

పాకాల చెరువు, అనుమకొండ భద్రకాళి చెరువు, అనునవి మిక్కిలి ప్రసిద్ధములు. ఇవి కాక కాటసముద్రము. చౌడసముద్రము, గౌడ సముద్రము, చింతల సముద్రము. విశ్వనాథ సముద్రము అను జలాశయములుకూడ కాకతీయ యుగమునాటివే. ఈ చెరువులక్రింద కృషీవలు లన్ని సస్యములను. చెరుకుతోటలను, అరటితోటలను పెంచుచుండిరి. దీనివలన ప్రజల కాహారసమృద్ధి కల్గుటయే కాక, రాజులకు పన్నులుకూడ లభించుచుండెను.

కాకతీయ యుగమున చేతిపనులు అభివృద్ధిదశయందుండెను. ప్రాచీనకాలమునుండియు ఆంధ్రదేశము బట్టలనేతకు మిక్కిలి ప్రసిద్ధి చెందియుండెను. సమకాలికములగు కృతుల పరీక్షించినయెడల, కాకతీయులనాడు అనేకవిధములగు వస్త్రములు వాడబడుచుండినట్లు మనకు తెల్లమగును. [1]మణిపట్టు, భూతిలకము, శ్రీవన్నియ, మహాచీని, ధ్వజతిలకము మొదలగునవి ఈ వస్త్రములలో కొన్నిటికి పేర్లు. ఓరుగల్లుపట్టణము కాకతీయుల నాటినుండి నేటివరకునుకూడ తివాసీల నేతకు ప్రసిద్ధిచెందియున్నది. ఒకనాడు హైందవుల చేతిలో నుండిన ఈ పరిశ్రమ నేడు ముఖ్యముగ మహమ్మదీయులచే నడుపబడుచున్నది. వెండిబంగారునగలు, ఇనుము, ఇత్తడి రాగి మొదలగు లోహములతోడను, వానిని మేళవించియు ఆనాటి లోహకారులు వివిధవస్తువులు చేయుచుండిరి. దంతపుపని, లక్కబొమ్మలపని కూడ ఆనాటివారెరింగియుండిరి. నిర్మలాపురమున ఉత్తమజాతి ఖడ్గములు, బాకులు, సిద్ధపరుపబడుచుండెను.

కాకతీయ యుగమునందు వ్యాపారము ముమ్మరముగ సాగుచుండెను. తూర్పు దీవులనుండియు, పశ్చిమ ప్రాంతములనుండియు. వస్తువులు దేశములోనికి దిగుమతి యగుచుండెను. ఏయే దినుసులపై యెంత సుంకమును చెల్లింపవలయునో, ప్రభుత్వమువారు శాసనముల ద్వారా వణిజులకు తెల్పుచుండిరి. ఈ కాలమున తూర్పు తీరమందలి మోటుపల్లి యనునది ప్రసిద్ధమగు రేవుపట్టణము. ఇచ్చట అధికసంఖ్యాకులుగ చేరు నావికుల కెట్టి యాపదలు కలుగకుండ గణపతి దేవ

1. చూడు: ఆంధ్రుల సాంఘిక చరిత్ర—సు. ప్రతాపరెడ్డి.

రాజు కట్టుదిట్టము చేసెను. తాను కావించిన వ్యాపారనియమముల పాలించుటకై సిద్ధయదేవుడను సేనానిని. మోటుపల్లికి పాలకుడుగ నీరాజు నియమించెను. వ్యాపారపు సుంకములగూర్చిన వివరములు ఓరుగల్లునకు సమీపమున లభించిన యొక శాసనమువలన తెలియ వచ్చుచున్నవి. విదేశములనుండి దిగుమతియగు వస్తువులలో శ్రీగంధము, పచ్చకర్పూరము, ముత్యములు, పవడములు, దంతము మున్నగునవి ముఖ్యములు.

పైన తెలుపబడిన యంశములవలన కాకతీయ యుగమునాడు దేశము సుభిక్షముగ నుండినట్లును. ప్రజలు శాంతిసౌఖ్యముల ననుభవించునట్లును నిర్ణయింపనగును.

వినుకొండ వల్లభరాయనిచే వ్రాయబడిన క్రీడాభిరామము వలన, కాకతీయులనాటి ఓరుగల్లు పట్టణమునుగూర్చి అనేక విశేషములు తెలిసికొనవచ్చును. ఈ కవి పదునేనవ శతాబ్ది యారంభమున నివసించినవాడు కాని కాకతీయులకు సమకాలీనుడు కాడు. అయినను రావిపాటి త్రిపురాంతక విరచితమగు ప్రేమాభిరామ కృతివలనను, ఆనాటికి సజీవులై యున్న వృద్ధులవలన విన్న విషయముల నుండియు, వల్లభరాయడు సత్యవిషయములను గ్రహించియుండుట కవకాశము కలదు. కావున క్రీడాభిరామమున వర్ణితములగు నంశములు సత్యములని మన మంగీకరింపనగును. ఏకశిలానగరమును చూచుటకై టిట్టిభ శెట్టి, మంచనశర్మ, యను మిత్రులిరువురు ఒకనాటి ఉదయమున బయలుదేరిరి. వారికి మొదట కనబడినది మేదరవాడ. ఇచ్చటనే ఒక ప్రక్క పంచములు నివసించువాడ కూడ నుండెను. ఇయ్యవి నగరప్రాకారమునకును, పరిఖకును, వెలుపల కలవు. ఇచ్చటి వారు అగడ్తనీటినే స్నానపానాదుల కుపయోగించుచుండిరి. మన మిత్రు లిరువురును హట్టమార్గము (పెద్దబాట) ననుసరించి, పురము లోని కేగిరి. ఆ మార్గముననే మైలసంత సాగును. మైలసంతలో మత్స్య మాంసాదు లమ్మబడును. పురములోని మడిసంతయందు కూరగాయలు మాత్రము విక్రయింపబడును. త్రోవయందు వీరికొక

వేశ్యయు, సంపంగి తైలము నమ్ము నొక స్త్రీయు, కానవచ్చిరి. ఆ కాలమున నన్ని కులములందును, వేశ్యలు వేర్వేరుగ నుండిరి. ఈ వాడయందే కుట్టుపువాడు [దర్జీ] అంగీకలు కుట్టుచు, వారికి కాన్పించెను. దీనిని మోహరివాడ యని కూడ యందురు. ఇందు యుద్ధభటులు నివసించుచుండిరి. ఆపైన వీరు పురమునందు ప్రవేశించిరి. అచ్చటి వారికి లోతైన పరిఖ, ఆకాశమంటు ప్రాకారము, స్వర్ణవికారము లయిన తలుపులు గల పెద్దగవని, జనసంకులమైన వంకదారియు కానవచ్చెను. పురమున ప్రవేశించుసరికి, మన మిత్రులకు రథ, ఘోటక, శకట, కరటి యాదసంకులమగు మార్గము కానవచ్చెను. అచ్చట ధూళి విస్తారముగ రేగుచుండినందున, వారు క్రంతమార్గములగుండా లోనికి పోవుటకు నిశ్చయించిరి. త్రోవయందు వీరికి పల్నాటి వీరుల ఆలయము కాన్పించెను. పల్నాటి వీరగాథయందలి కొన్ని విశేషాంశము లాదేవాలయకుడ్యములపై చిత్రింపబడియుండుట, వీరుగాంచిరి. ఆపైన వీరి కేకవీరాదేవి ఆలయము కానవచ్చెను. ఏకవీరాదేవిని కాకతమ్మకు సైదోడుగ నాకాలమువారు పూజించుచుండిరి.

మరికొంతదూరము పోవుసరికి మన మిత్రద్వయమునకు కామవల్లి దేవి పాటను పాడుచు నొక జక్కుల స్త్రీ కానవచ్చెను. కామవల్లి మహాలక్ష్మి యనునది కామేశ్వరీదేవికి నామాంతరము. ఈ దైవతమును కొన్ని కుటుంబములవారు. నేటికిని కులదేవతగ పూజించుచున్నారు. వివాహాది శుభకార్యములలో నీదేవిని తప్పక కొల్చెదరు. మరికొంతదూరము పోవుసరికి, వీరికి మైలారుభటులు కాన్పించిరి. మైలారుదేవుడు భైరవునికి తోటిదేవుడు. మైలారు భటు లీ దేవుని భక్తులు. మరికొంతదూరము సాగిపోయినమీదట భైరవునిగుడి, చాముండేశ్వరీ దేవాలయము, వీరభద్రేశ్వరాగారము బౌద్ధవిహారము, మూసానమ్మవసతి, కొమరసామిగుడి, పాండవుల గుడి, తురకమసీదు—వీనియన్నిటికి నావల ఉత్తుంగ శిఖరములతో, కేశవ స్వయంభూ దేవాలయములును, కానవచ్చెను. అప్పటికి మధ్యా

హ్నమయ్యెను. రాచనగరి మోసాలమీది గడియారమున పదునారు గడియలు కొట్టిరి. భోజనసమయ మైనదని తలంచి మిత్రులిద్దరును పూటకూటి యింటికి పోయిరి. ఒక్క రూక యిచ్చిన పక్షమున ఆనాడు పూటకూటి యింటియందు దివ్యమగు భోజనము లభించెడి నట. భోజనానంతరము మిత్రద్వయము మరల పురపరిభ్రమణమునకు పూనిరి. త్రోవయందు వారికి మాచల్దేవి భవనము కానవచ్చెను. ఆయమ ప్రతాపరుద్ర దేవుని యుంపుడుకత్తె. ఆమె మహైశ్వర్య సంపన్నురాలు. త్రోవయందు వీరొక వేశ్యయింట ఇంచుక సేద తీర్చుకొనిరి. ప్రసంగ వశమున వారు వైశాఖశుద్ధ పూర్ణిమనాడు జరుగు శ్రీకాకుళాంధ్ర స్వామి జాతరనుగూర్చి అనేక విషయములు ప్రశంసించిరి. ఈ వాడ యందే మన మిత్రులు మిగిలిన దినమును గడపిరి. ఆ యవకాశమందు వారు పాములవాని పాటను వినిరి. అదికాక కుక్కుట యుద్ధము, మేషయుద్ధము, గారడీవాని పనులు, మున్నగు ప్రదర్శనముల జూచి సంతోషించిరి. సూర్యుడస్తమించెను.

పైయంశములవలన కాకతీయులనాటి ఓరుగల్లు పట్టణపు చిత్రము మన కండ్లయెదుట ప్రత్యక్షమగుచున్నది.

కాకతీయ యుగమునం దాంధ్రదేశమున మహారాష్ట్రులు కొందరు శాశ్వతనివాసము నేర్పరచుకొని, కాలక్రమమున తెనుగు వారిలో కలిసిపోయిరి. కాకతీయ ప్రభువులకును, దేవగిరి యాదవ రాజులకును, తరచు యుద్ధములు సాగుచుండెను. ఆసందర్భమున మహారాష్ట్రులు కొందరు తెలుగునాట ప్రవేశించి యుండవచ్చును. నెల్లూరిసీమలోని అద్దంకిని రాజధానిగా చేసికొని, యొక మహారాష్ట్ర వంశము పాలించెను. వీరు శాలంకాయన గోత్రులు. ఈ వంశములోని మాధవదేవుడు, కాకతి గణపతి దేవునికి సామంతుడుగ నున్నట్లు, ఒక శాసనము తెల్పుచున్నది. ఈ అద్దంకి పాలకులకును నెల్లూరి తెనుగు చోడరాజులకును తరచు యుద్ధములు సంభవించుచుండెను. మనుమసిద్ధి నృపాలుడు మహారాష్ట్ర సారంగుని జయించినట్లు

తిక్కనకవి నిర్వచనోత్తర రామాయణమునందు వర్ణించియున్నాడు. ఈ మహారాష్ట్ర సారంగుడు అద్దంకి పాలకుడగు సారంగపాణి దేవుడు కావచ్చును. కాకతీయ రాజ్యమును జయించిన వెనుక, మహమ్మదీయ తురుష్కులు ఇచ్చట భూమ్యాదాయశాఖాధికారులుగ మహారాష్ట్రులను నియమించినట్లు, చరిత్రలు తెల్పుచున్నవి. ఈ విధముగ ఆంధ్రప్రజలలో మహారాష్ట్ర జనులు కొందరు. లీనమై పోయిరని యూహింపవచ్చును.

కాకతీయ యుగమునం దాంధ్ర దేశమున జాతీయభావ వికాసము కల్గుచున్నది. కాకతి గణపతిదేవుడు ఆంధ్ర దేశమునంతను జయించి, దాని నేకచ్ఛత్రాధిపత్యములోనికి గొనివచ్చుట వలనను, ఆంధ్రభాష ప్రత్యేకతను వహించి, అనేక మహాగ్రంథములచే నలంకృతమగుచుండుటను, ఈ మహాచైతన్యము కల్గియుండవచ్చును. ఆంధ్రమునం దాదికవియగు నన్నయభట్టుకూడ ఆంధ్రదేశమును పేర్కొనలేదు. తెలుగు వేంగి మండలమును మాత్రమే పేర్కొనెను. కాని తిక్కనకవి తన భారతము 'నాంధ్రావళి మోదముం బొరయ' వ్రాసెదనని చెప్పియున్నాడు. ప్రతాపరుద్ర యశోభూషణము రచించిన విద్యానాథ కవికూడ త్రిలింగ దేశమును ప్రత్యేకముగ పేర్కొని, దాని యెల్లలను వర్ణించెను. ఈవిధముగ జాగృతమైన జాతీయ భావమే, కాకతీయుల యనంతర మాంధ్రదేశము మహమ్మదీయుల యాక్రమణమునుండి విడివడి, పునఃస్వాతంత్ర్యమును బొందుటకు మూలమయ్యెను. అఖిలాంధ్రభావన ఈ యుగమున నేర్పడెను.

# ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి



## 17-వ ప్రకరణము

## రెడ్డి - పద్మనాయక రాజ్యములు

కాకతీయ సామ్రాజ్యము నశించిన వెనుక, సుమారొక శతాబ్ది కాలము రెడ్డి ప్రభువులును, పద్మనాయక వీరులును తెనుగుదేశమందు చాలభాగమును పాలించిరి. 15 వ శతాబ్ది మధ్యభాగమున వీరు పరిపాలించిన భూభాగములు, కళింగాధీశులగు గజపతులకును, విజయనగర ప్రభువులగు నరపతులకును, బహామనీసుల్తానులకును వశమయ్యెను. రెడ్డి ప్రభువులు స్థాపించిన రాజ్యములలో అద్దంకి రాజ్య మతిముఖ్య మైనది. ఈ పాలకులు కొంతకాలము గడచిన వెనుక, అద్దంకిని వీడి, నేటి గుంటూరుజిల్లాయందలి కొండవీటిని తమ రాజధానిగ చేసికొనిరి. ఈ రాజ్యము క్రీ. శ. 1324 నుండి 1424 వరకు వర్ధిల్లెను. వీరుగాక కోరుకొండ, రాజమహేంద్రవరము, కందుకూరు, అను ప్రదేశములలో పరిపాలనము చేసిన రెడ్డిప్రభువులు కూడ కలరు. పద్మనాయక వంశీయులగు వీరులు రాచకొండ, దేవరకొండ, అను పట్టణములు కేంద్రములుగ చేసికొని క్రీ. శ. 1330 ప్రాంతమునుండి 1430 వరకు రాజ్యముచేసిరి. ఈ రెండు రాజ్యములవారును [రెడ్డిపద్మనాయక] కూడ కాకతీయ ప్రభువుల కాలమున, వారికి సామంతులుగను, దండనాథులుగను ఉండి, తమ ప్రభువులకును, దేశమునకును అపారమగు సేవచేసిరి. కాకతీయ సామ్రాజ్యభాను డస్తమించిన యనంతరము వీరు స్వాతంత్ర్యమును వహించియు, తమ ప్రభువులు లక్ష్యమం దిడుకొనిన ఆదర్శముల మాత్రము మరువక, గోబ్రాహ్మణులను రక్షించుచు, ప్రాచీన హైందవ మత సంస్కృతులను చక్కగ కాపాడిరి. దక్షిణాపథమందు హైందవమతసభ్యత యవనకాలానలమున భస్మముకాకుండ నేడు నిలచియుండుటకు చాలవరకు బాధ్యులు రెడ్డి పద్మనాయక వీరులేయని తెలుపవలసియున్నది. ఇంతేకాక ఈ రాజులు స్వాయముగ

గొప్ప విద్వాంసులై గీర్వాణ తెలింగ వాఙ్మయములను, లలితకళలను చక్కగ పోషించిరి. కావున వీరి తాబ్దమాంధ్రదేశ చరిత్రమునందొక ప్రకాశవంతమగు నధ్యాయమని చెప్పవలయును.

రెడ్డి పద్మనాయక ప్రభువుల యశోగానము కావించుటకు పూర్వము. వీరందరికిని కొంతకాలము నాయకుడుగను మార్గదర్శకుడుగను ఉండి, కాకతీయరాజ్య వినాశనమువలన నిరుత్సాహులై, హతాశులై యున్న ఆంధ్రప్రజానీకమునందు నూతనోత్సాహము కల్పించి, వారిచే యవనుల పరాభవింప జేసిన, యొక మహానాయకుని గూర్చి తెలుపవలసియున్నది. ఆతడు కాపయనాయకుడు. కాపయ నాయకుడు ఆంధ్రదేశమునకును, హైందవధర్మమునకును, కావించిన యుపకారము నేటి చారిత్రకులచే గుర్తింపబడినది. [1]కాకతీయ రాజ్యమును కూలద్రోసిన. తురక మహమ్మదీయులు విపరీతమైన పరమత ద్వేషముతోడను, మిక్కిలి నిర్దయతోడను, హైందవమతమును, హైందవ ప్రజలను అణచివేయుటకై యత్నించిరి. ఇందునుగూర్చిన వివరములు, గంగాదేవియను స్త్రీచే వ్రాయబడిన మధురావిజయమను సంస్కృతకావ్యము వలనను, ఇబిన్ బతూతాయను మహమ్మదీయ యాత్రికుని వ్రాతలవలనను, అనితల్లి కలువచేరు శాసనములవలనను, తదితర సమకాలికరచనల వలనను, తెలియవచ్చును. యవనవిధ్వంసనమువలన దేశమునందు విస్తారముగ నశాంతి ప్రబలెను. ప్రజలబాధలు దుర్భరములై, హాహాకారములు చెలరేగెను. మహమ్మదీయ ప్రభుత్వమునెడ ద్వేషమును, దానినెట్లైన నంతమొందింప వలెనను తీవ్రమగు కోర్కెయు, ప్రజలలో నాటుకొనిపోయెను. ఆంధ్రప్రజానీకమునం దేర్పడిన యీ దృఢనిశ్చయము ముసునూరి నాయకులయందు రూపొందెను.

కాపయనాయకుడు ముసునూరి వంశమునకు చెందిన తెనుగు వీరుడు. ఈతడు ముఖ్యముగ తెలంగాణమును తురుష్కుల యధి

1. A Forgotten chapter of Andhra History. మ. సోమశేఖరశర్మ. Early Muslim expansion in the South. డా. ఎన్. వెంకటరమణయ్య.

కారాగారమునుండి విడిపించెను. ఈతనికి పూర్వ మితనికి జ్ఞాతియు, నాయకుడు నగు ప్రోలయనాయకుడే ఈ జాతీయోద్యమమును విజయవంతముగా నడపిన ధీరుడు. మహమ్మదీయుల నోడించి, ఆంధ్రప్రాంతమునుండి తరిమివేయవలెనను ప్రయత్నము తూర్పు తీరమున ప్రారంభమయ్యెను. కాకతి ప్రతాపరుద్రుని సేనానులగు కొలని ప్రతాపరుద్రుడు, అన్నమంత్రియు, ఈ యుద్యమమునకు తోడ్పడిరి. ఇతర సామంతు లనేకులీ పవిత్రకార్యమునకు ముందంజవేసిరి. ఈవిధముగ నొక దేశభక్తకూటమి యేర్పడెను. వీరందరును మునుసూరి ప్రోలయ నాయకుని తమ రక్షకునిగ నెన్నుకొనిరి. నేటి భద్రాచలము తాలూకా రేకపల్లెయందు తన సేనను సమకూర్చుకొని, ప్రోలయ నాయకుడు క్రీ. శ. 1325 నందు తురుష్కుల యధికారమును ధిక్కరించి, స్వాతంత్ర్యము స్థాపించెను. ఆతడు హిందూధర్మమును పునరుద్ధరించి, మహమ్మదీయులచే బలాత్కారముగ లాగికొనబడిన అగ్రహారములను బ్రాహ్మణులకు తిరిగి ఇచ్చెను. ప్రాచీన శాస్త్రసమ్మతముగ నితడు ప్రజాపరిపాలన చేయసాగెను. ప్రోలయనాయకుని వీర కృత్యములవలన నుత్సాహము చెంది, నేటిదత్తమండలమందు, ఆరవీటి సోమరాజను నాయకుడు మహమ్మదీయులపై తిరుగుబాటు చేయుటయే కాక, మొసలిమడుగు, సాతానికోట, కందనోలు, కలవకొలను, రాయచూరు మున్నగు దుర్గముల నాక్రమించెను. ఈ సోమరాజు మహమ్మదీయుల ననేక ప్రదేశములందు నోడించి, పశ్చిమాంధ్రమును తురుష్కుల బారినుండి తప్పించెను. ఈ విజయములు క్రీ. శ. 1328-29 నాటికి సాధింపబడెను. ఈ లోపున ప్రోలయ నాయకుడు మరణించినట్లు కానవచ్చుచున్నది. ప్రోలయమరణానంతరము యాతని పినతండ్రి కుమారుడు కాపయ యను వీరుడు నాయకత్వమును బూనెను. కాపయనాయకుడు తెలంగాణమునుండి తురుష్కులను తరిమివేయుటకై ప్రయత్నము లారంభించెను. ఈతడు ఓరుగల్లు ప్రాంతమందలి హైందవప్రజలతోడను, ద్వారసముద్రపు రాజగు మూడవ వీరబల్లాళునితోడను, రహస్యముగ రాయబార

ములు సలిపి, తన పథకమును పూర్తిచేసికొనెను. కాపయపేరుని నాయకత్వమున ఓరుగల్లు హైందవప్రజలు క్రీ. శ. 1337 నందు తురుష్కులపై తిరుగుబాటు చేసిరి. యుద్ధరంగమున మహమ్మదీయ సేనల నోడించి, కాపయనాయకు డోరుగల్లును వశపరచుకొనెను. యవనులు దేవగిరికి పారిపోయిరి. కాపయనాయకు డోరుగల్లునకు ప్రభువయ్యెను. ఒకానొక కాలమున కాకతీయ ప్రభువుల సేవించిన డెబ్బదిమైమగురు ఆంధ్రనాయకులు. కాపయనాయకుని యాజమాన్యము నంగీకరించి రని అనితల్లి కలువచేరు శాసనమువలన తెలియుచున్నది. కాపయ ఆంధ్ర దేశాధీశ్వర, ఆంధ్ర సురత్రాణ [సుల్తాను] అను బిరుదముల వహించెను. ఆంధ్రప్రాంతమునం దేక ప్రభుత్వము నెలకొనుసూచనలు కానవచ్చెను.

కాని ఆంధ్ర దేశపు దురదృష్టమువలన నట్టి సదారంభము ఫలవంతము కాలేదు. యుద్ధవిజయములవలన. ఆంధ్రనాయకులలో అహంభావమును. అంతఃకలహములును పొడచూపెను. కాపయ నాయకు డాంధ్ర దేశాధీశ్వరు డను బిరుదు వహించుట. ఆతని సోదర ప్రభువుల కసూయాజనక మయ్యెను. కావున వారాతనియెడ ద్వేషము వహించిరి. ఓరుగల్లు విజయమువలన. తెలంగాణమంతయు కాపయనాయకుని వశమయ్యెను. కాని యేనాడు మరల ఢిల్లీశ్వరుడు తనపై సేనలను పంపునోయని కాపయనాయకుడు భయపడుచునే యుండెను. ఈ ప్రమాదమునుండి తప్పించుకొను నుద్దేశ్యముతో, కాపయనాయకుడు, ఆకాలమున ఢిల్లీ చక్రవర్తిపై తిరుగుబాటు చేసి. దక్షిణభారతమున స్వాతంత్రత వహించుటకై పోరాడుచున్న జఫర్ ఖాన్ ప్రభృతులగు మహమ్మదీయ సర్దారులతో స్నేహము వహించి. ఢిల్లీ రాజుతో పోరాడెను. ఇందులకు ఫలితముగ క్రీ. శ. 1347 వ సంవత్సరమున జాఫర్ ఖాన్ అలావుద్దీన్ హసన్ గంగూ బహమన్ షా అను పేరితో బహమనీ రాజ్యమును స్థాపించెను. కాని ఈ రాజు తాను స్వాతంత్రతవహించిన నాటినుండియు, కాపయతో వైరము వహించి, ఆతని రాజ్యమును కబళించుటకై

యత్నించెను. కాపయనాయకునికిని, బహమనీ సుల్తానులకును తరచు యుద్ధములు సంభవించెను. ఇందు కాపయ నాయకుడు పరాజితుడై, గోలకొండవరకును గల భూభాగమును బహమనీ రాజులకు వదలి వేసి, ఆ దుర్గమునే తన రాజ్యమునకు పశ్చిమపు పొల్లగా సంగీకరించెను. ఈ పరాజయములవలన కాపయనాయకుని ప్రతిష్ఠ చాల క్షీణించెను. చాలకాలమునుండియు, ఆంధ్రనాయకులలో పలువురు కాపయయెడ ద్వేషము వహించిరని తెలిపియున్నాము. వారిలో రేచర్ల సింగమనాయకుని కుమారుడగు అనపోతానాయకుడును, అతని సోదరులును, తెలంగాణమును స్వాధీనపరచుకొను నుద్దేశ్యముతో కాపయనాయకునిపై దాడిసల్పిరి. క్రీ. శ. 1368 వ సంవత్సరమున ఓరుగల్లు నగరమునకు సమీపమున భీమవరమను చోట పద్మనాయకులకును, కాపయ పేరునికిని యుద్ధముజరిగెను. యుద్ధమున కాపయనాయకుడసువుల గోల్పోయెను. ఈవిధమున యవన విజేతయగు కాపయనాయకుని అతని సహచరులే తుముట్టించిరి. ముసునూరి నాయకులపే రంతటితో నశించెను.

## కొండవీటి రెడ్డివంశము

రెడ్లు చిరకాలమునుండియు భూదేవిని నమ్మి, వ్యవసాయమును జీవనాధారముగ చేసికొనినవారు. నేడుకూడ కృషీవలులలో రెడ్డికులమువారు హెచ్చుగాగలరు. అవసరమునుబట్టియు, అవకాశముల పురస్కరించుకొనియు రెడ్లలో కొందరు ఖడ్గమును చేతబూని యుద్ధమును కావించుటయు, లేక రాజ్యపాలనము చేయుటయుకూడ సంభవించినది. కాకతీయులకు ముఖ్యసేనానులలో రెడ్డివంశీయు లొక్కరు. రెడ్లలో కొన్ని తెగలుకలవు. వానిలో పంటరెడ్డి విభాగమొకటి. పంట రెడ్లలో మరల కొన్ని అంతర్విభాగములు కలవు. పాకనాటిరెడ్లు, వెలనాటిరెడ్లు, మోటాటిరెడ్లు మొదలగునవి వీని పేర్లు. ఈనామముల పరిశీలించిన పక్షమున, ఇవి ఆయాదేశ ప్రాంతములకు అనగా వెలనాడు, మొట్టనాడు, పాకనాడు మొదలగు భూభాగములకు చెందిన వంశములని తెలియవచ్చును. బ్రాహ్మణు

లలో వేగినాటివారు, వెలనాటివారు, పాకనాటివారు, మున్నగు కుటుంబము లున్నట్లే, రెడ్లలోకూడ నిట్టి విభేదము లేర్పడియుండు నని పండితులు తలచుచున్నారు. కొండవీటి నేలిన రాజులకు దేసటి రాజులనికూడ పేరుగలదు. ఈ దేసటి శబ్దము "దేశరాట్టోడి" యను ప్రాచీనపు సంకేతమునుండి లభించినది. వేంగి చాళుక్యుడగు రెండవ అమ్మరాజుచే వేయించబడిన యొక శాసనమందీ దేశరాట్టోడి యను పేరు కానవచ్చును. రాట్టోడినుండి రెడ్డి శబ్దమును, దేసటి శబ్దమును కూడ కాలక్రమమున ఏర్పడియుండ వచ్చును. దేసటరెడ్లు అనగా స్థానికులగు రెడ్లు అను అర్థమును చెప్పవచ్చును. ఇంతేకాక దేసట్ల యొక పట్టణము పేరైయుండవచ్చును. ప్రతాపరుద్రుని సేవించిన డెబ్బదియిద్దరు నాయకులలో నొకరు దేసట్లపురమున కధీశ్వరులని తెలుపబడినది. కావున దేసటిరెడ్లు మొట్టమొదట దేసట్ల ప్రాంతమున నుండెడివారని యూహింపవచ్చును. కాకతీయరాజ్యము క్షీణించుచున్న సందర్భమున, నెల్లూరుజిల్లాయందు నివసించెడి పంట వంశపు దేసటిరెడ్లు స్వతంత్రరాజ్యస్థాపనము కావించిరి. కొండవీడును పాలించిన యీ రెడ్డివంశమువారిలో "వేమ" నామమును, 'కోమటి' యను పేరును గమనింపదగియున్నవి. కోమటి యను జైనదేవతను వీరు కొల్చెడివారనియు, ఆ దేవత గౌరవార్థము వీరు కోమటి అను ఉపపదమును ధరించిరనియు. కొందరు తెల్పుదురు. ఈ కొండవీటి రెడ్ల పూర్వీకుడు అల్లాడ రెడ్డి అనునాతడు వేమయ యను కోమటి యధీనములో నున్న పరుసవేదిని మాయోపాయముచే సంగ్రహించి, దానివలన అపారమగు ధనమును సంపాదించెననియు. పరుస వేదిని కోల్పోయిన కోమటి ఆత్మహత్య కావించుకొనెననియు, మరి కొంతకాలమునకు కోమటివేమయ అల్లాడరెడ్డి కలలో కన్పించి, ఆతని వంశమువారు వేమయ యను తన పేరును, కోమటియను తన కులనామమును గ్రహింపవలెననియు, లేనిపక్షమున వారికి సర్వనాశనము తప్పదని బెదరించెననియు, ఆనాటినుండి అల్లాడ రెడ్డివంశీకు లట్లే చేయజొచ్చిరనియు గాధ కలదు. ఇది నిజమైనను కాకపోయినను, కొండవీటి రాజులకు పై నామము లుండుట మాత్రము సత్యము.

కొండవీటి రెడ్డివంశమును స్థాపించినయాతడు ప్రోలయ వేమారెడ్డి (క్రీ.శ. 1324-1353). ప్రోలయ వేమారెడ్డి పూర్వీకులను గూర్చి ఎక్కువ విషయములును తెలియరాలేదు. ఈతని తండ్రి ప్రోలయరెడ్డి. తాత వేమారెడ్డి. తాతయైన వేమారెడ్డి కాలమున నీవంశమువారు వ్యవసాయవృత్తిని విడచి, ఖడ్గమును చేబూనిరి. ఈ వేమారెడ్డి కాకతీయ వంశజుడైన అంబయదేవునికడ నొక సేనానాయకుడుగ నుండెను. వేమారెడ్డి కుమారుడు ప్రోలయరెడ్డి సామంత పదవిని వహించెను. బహుశః ప్రతాపరుద్ర కాకతీయుని సేవించిన వారిలో నీతడుకూడ ఉండియుండవచ్చును. ఈప్రోలయ రెడ్డి పదునాల్గవశతాబ్ది ప్రాంతమున త్రిపురాంతక ప్రాంతమున నొక రాజోద్యోగి కావచ్చును. ప్రోలయ వేమారెడ్డి స్వతంత్రముగ రాజ్యమునుస్థాపించుటకు గల కారణములు తెలియరాదు. కాని యాతడు కాకతీయుల పతనానంతరము. తురుష్కుల నాంధ్ర దేశమునుండి తరిమివేయుటకై యత్నించిన ముసునూరి ప్రోలయ, కాపయనాయకులతో సంపూర్ణముగ సహకరించెను. ప్రోలయ వేముని కనిష్ఠ సోదరుడగు మల్లారెడ్డి సేనాధ్యక్ష పదవిని వహించి, తన యన్నకు చాలసహాయపడెను. బహమనీ సుల్తానగు అల్లావుద్దీన్ తమ రాజ్యముపై దండెత్తగా, మల్లారెడ్డి యవన సేనల నోడించి పారద్రోలెనట. ఈ దండయాత్ర 1348 ప్రాంతమున జరిగియుండును. శత్రురాజుల ననేకుల నోడించి. మల్లారెడ్డి మోటుపల్లి రేవును రెడ్డిరాజ్యములో చేర్చినట్లు హరివంశమువలన తెలియచ్చుచున్నది. ప్రోలయ వేమారెడ్డి గుండ్లకమ్మనది యొడ్డునగల అద్దంకిని ముఖ్య పట్టణముగా చేసికొని. శ్రీశైలమునుండి సముద్ర ప్రాంతము వరకును గల దేశమును పాలించెను. ఉత్తరమున నీతని రాజ్యము కృష్ణానదివరకును దక్షిణమున నెల్లూవరకును వ్యాపించెను. ఈతడు మిగుల దూరదృష్టికలవాడు. ప్రోలయ వేమారెడ్డి ఎనుబదినాల్గు దుర్గములను కట్టించెనని తెల్పుదురు. వానిలో ముఖ్యమైనవి ధరణికోట, చందవోలు, వినుకొండ, కొండవీడు, కొండపల్లి, బెల్లంకొండ యను దుర్గ

ములు. ఈతడు వీనియందు సేనల నెలకొల్పి స్వరాష్ట్ర రక్షణము నకై కట్టుబాట్లు చేసెను.

ప్రోలయ వేమారెడ్డి హిందూమతమునందు మిక్కిలి అభిమానము కలవాడు. ఈతడు గోబ్రాహ్మణులను, సామాన్య ప్రజలను కూడ, ఎట్టికష్టములపాలు గాకుండ కాపాడెను. ఈ రాజు బ్రాహ్మణులకు నలుబదినాల్గు అగ్రహారములను దానము చేసెనట. ఈతని కాలమున వైదిక కర్మానుష్ఠానము ప్రవర్ధింపబడుటచే. ఈతనికి ధర్మప్రతిష్ఠాగురు అను బిరుదము లభించెను. ప్రోలయ వేమారెడ్డి అనేక ఆరామముల ప్రతిష్ఠించినట్లు గ్రంథములు తెల్పుచున్నవి. ఆరామప్రతిష్ఠ సప్తసంతానములలో నొకటిగ ప్రాచీనులు తలంచిరి. ఈతడు శ్రీశైలపర్వతమునకును, అహోబల క్షేత్రమునకును, మెట్లుకట్టించి యాత్రికులకు మిక్కిలి సౌకర్యము కల్పించెను. హరివంశమును రచించిన ఎఱ్ఱాప్రగడకవి, తన కృతియందు వేమారెడ్డి మహావీరుడే కాక అనేక సత్కార్యముల నొనరించిన పుణ్యశాలి యని విశేషము కీర్తించియున్నాడు.

అనపోతారెడ్డి:—[1353-1364] ప్రోలయ వేమారెడ్డి యనంతర మాతని కుమారుడు అనపోతారెడ్డి రాజ్యసింహాసనము నధిష్ఠించెను. ఈనాటికి రాజమహేంద్రవర రాజ్యమును పాలించిన తొయ్యేటి అనపోతానాయకుడు మరణించెను. ఈ అనపోతానాయకుడు కాపయనాయకునికి సమీపబంధుడు. ఓరుగల్లు రాజ్యమునకు తా నధిపతియైన వెనుక కాపయనాయకు డీతనిని రాజమహేంద్రవరమున తన ప్రతినిధిగ నిల్పెను. ఈ అనపోతానాయకుడు మరణింపగా రాజ్యమును మంచి కొండవంశీయుడగు ముమ్మడినాయకుడు స్వాధీనపరచుకొనెను. తెలుగు దేశమున పరిస్థితులు ప్రశాంతముగ లేవని గ్రహించి, కళింగాధిపుడగు నరసింహదేవుడు గోదావరిని దాటి, కృష్ణాతీరమునందలి శ్రీకాకుళము వరకునుగల దేశమును జయించెను. కాని ఆతడు మరలిపోయిన వెనుక అనపోతారెడ్డి కృష్ణను దాటి, కృష్ణాగోదావరుల నడుమగల పలువురు చిన్నసామం

తులను జయించుటయే కాక. కళింగదేశముపై కూడ దాడిచేసెను. బహమనీ సుల్తాను రెడ్డిరాజ్యముపై దాడి సల్పగా. అనపోతారెడ్డి మంత్రియగు మల్లయవేముడు అతని నోడించి, పారద్రోలెను. అనపోతారెడ్డి ప్రతిసంవత్సరమును తన శత్రువులతో పోరాడుచునే యుండెను. అందితని కనేక పర్యాయములు ఓటమి సంభవించెను. భక్తిరాజను గోండనాయకు డనపోతారెడ్డిని. నేటి పశ్చిమగోదావరి జిల్లాయందలి కొండపల్లి మను ప్రదేశమున నోడించెను. దీనివలన కృష్ణా డెల్టాయందు తాను జయించిన ప్రాంతము ననపోతారెడ్డి కోల్పోయెను. ఇతనికి రాచకొండ పద్మనాయకులతో కూడ యుద్ధము సంభవించెను. వారు ధరణికోట దుర్గమును జయించవలెనని యత్నించి ,విఫలమనోరథులైరి. అనపోతారెడ్డికే జయము సంభవించెను. ఈ యదనును చూచుకొని విజయనగరాధీశ్వరుడగు మొదటి బుక్కరాయలు. రెడ్డిరాజ్యమును కబళింపవలెనని ప్రయత్నము చేసెను. తన రాజధానియగు అద్దంకియందు క్షేమము లేదని యెరింగి, అనపోతారెడ్డి కొండవీటి దుర్గమును బలపరచి, అచ్చటికి తన రాజధానిని మార్చెను. అయినను విజయనగరరాజులు వీనికి పక్కలో బల్లెము వలె నుండిరి. పంధ్రెండు సంవత్సరములు మాత్రము రాజ్యముచేసి అనపోతారెడ్డి మరణించెను.

అనపోతారెడ్డికూడ తండ్రివలెనే వైదికమతమునందు మిక్కిలి అభిమానమును చూపెను. ఈతడు బ్రాహ్మణుల కనేకాగ్రహారములు నొసంగుటయే కాక. హేమాద్రిచే విధింపబడిన అన్ని దానములను చేసెనట. తన రాజ్యములోనున్న మోటుపల్లి రేవు నుండి వ్యాపారము ధారాళముగా జరుగకుండుటకు కారణముల నన్వేషించి, ఈ రాజు క్రీ.శ. 1358 వ సంవత్సరమున నొక శాసనము వేయించెను. మోటుపల్లి రేవునుండి వ్యాపారము చేయువారి కెల్ల తా నన్ని సదుపాయములు కల్పించి, రక్షించెదనని. యాతడీ శాసనమున వాగ్దానము చేసెను. వర్తకులపైగల అన్యాయమగు పన్నులను రద్దుచేసి, న్యాయ సమ్మతమగు సుంకములను మాత్రమే విధించెను.

అనవేమారెడ్డి (1364–1386):—అనపోతారెడ్డికి కుమారగిరి యను పుత్రుడు కలడు. కుమారగిరి సోదరియగు మల్లాంబను కాటయ వేమారెడ్డియను గొప్పవీరుడు వివాహమాడెను. ఈతడు సహజముగ తన స్యాలకుని పక్షముననే యుండెను. కాని కుమారగిరిరెడ్డి అల్ప వయస్కుడగుటవలనను, రాజ్యమెల్లెడల శత్రుపరివృతమై అపాయ మునకు లోనై యున్నందునను, రెడ్డివీరులు గొప్ప యోధుడును సంప్రాప్తవయస్కుడు, నగు అనవేమారెడ్డిని రాజుగ నెన్నుకొనిరి. అనవేము డనపోతారెడ్డికి తమ్ముడు. అన్న రాజ్యకాలమున నాతడు స్వామిభక్తి పరాయణుడై వర్తించి, అనపోతారెడ్డికి కుడిభుజమువలె పనిచేసెను. కావున కుమారగిరి రెడ్డియందు పక్షపాతము కలవారు కూడ, అనవేమారెడ్డి రాజగుట కెట్టి యభ్యంతరములను కల్పింప జాలకపోయిరి. అనవేమారెడ్డి తన యన్నవలెనే గొప్ప వీరుడు. అదృష్టదేవత వరించినందున, నీతడు రెడ్డిరాజ్యమును పరులపాలు కాకుండ రక్షించుటయే కాక, దానిని మిగుల విస్తరించెను. ఈతని పూర్వదేశ దిగ్విజయ మీతని కెక్కుడు కీర్తిని కల్గించెను. అనవేమా రెడ్డి కృష్ణానదిని దాటి. దివిదుర్గమును సాధించెను. ఆపైన నాతడు వేంగీదేశమును ప్రవేశించి అచ్చటి సామంతుల నోడించి, నిరవద్య ప్రోలు (నిడదవోలు) దుర్గమును జయించెను. ఆ వెనుక రాజమహేంద్ర వర దుర్గమును వశపరచుకొని, అనవేముడు మంచి కొండరెడ్డి వంశ మును తనకు సామంతులుగ చేసికొనెను. కోనమండలమునుకూడ నీతడు జయించినట్లు శాసనములు తెల్పుచున్నవి. అటుపై గోదావరి కుత్తరముననున్న మన్నెరాజులను జయించి, కొప్పులవంశపు ప్రభు వుల గెల్చి. ఎలమంచిలి, వడ్డాది రాజ్యములను సాధించి, అనవేమా రెడ్డి సింహాచలమువరకు తన సేనల విజయవంతముగ నడపెను. ప్రోలయవేమారెడ్డి కాలమున, శ్రీశైల మీ రెడ్డి రాజ్యమునకు పశ్చిమపుటెల్లగ నుండెను. కాని అనపోతారెడ్డి కాలమున విజయ నగరరాజులు శ్రీశైలము నాక్రమించుకొనుటయే కాక, రెడ్డిరాజ్యము లోనికి చొరుచుకొని రాసాగిరి. అనవేమారెడ్డి తన పరాక్రమముచే

విజయనగరము వారిని వెనుకకు నెట్టి, తనరాజ్యమును శ్రీశైలము
వరకు వ్యాపింపజేసెను. ఈరాజు పద్మనాయక రాజులతో పోరాడి,
విజయము గాంచెను. అనవేమారెడ్డి రాజ్యము తూర్పుసముద్రము
వరకును, పశ్చిమమున శ్రీశైలము, ఉత్తరమున సింహాచలము,
దక్షిణమున కందుకూరువరకును వ్యాపించెను.

రెడ్డిరాజులలో నితడు ప్రసిద్ధుడు. ఈతడుకూడ వైదికధర్మ
మును సంరక్షించి పోషించెను. అనవేమారెడ్డి మిక్కిలి దానశీలు
డని చాటుగాథలును, చాటుపద్యములును పెక్కులు కలవు. ఈతని
కాలమున రెడ్డిరాజ్య మత్యున్నతస్థితిని పొందెను.

కుమారగిరిరెడ్డి (1386-1402):– అనవేమారెడ్డి సంతానము
లేక మరణించెను. కావున ఆతని యన్న యనపోతారెడ్డి కుమారుడు
రాజ్యమున కధిపతి యయ్యెను. కాని యీతని పట్టాభిషేకమునకు
కొన్ని ఆటంకములు కల్గియుండవచ్చునని చారిత్రికు లూహించు
చున్నారు. శ్రీకృష్ణుడు యుధిష్ఠిరుని రాజ్యసింహాసనము నధిష్ఠింప చేసి
నట్లే. కాటయ వేమారెడ్డి కుమారగిరికి సహాయపడెనని గోపవరము
శాసనమువలన తెల్పబడినది. ప్రోలయ వేమారెడ్డి సోదరులగు
మాచారెడ్డి పౌత్రులగు పెదకోమటి వేమారెడ్డి ప్రభృతులు కుమార
గిరి నడ్డగించిరి. ప్రోలయవేముని కాలముననే, ఆతని సోదరుడు
మల్లారెడ్డి కందుకూరు పాలకుడుగను. మరియొక సోదరుడు మాచా
రెడ్డి చందవోలు ప్రాంతమున కధిపతిగను నియమింపబడిరి.
అనవేమారెడ్డివంటి ప్రతిభావంతుడు రాజుగా నున్నప్పుడు. వీ
రాతనికి వశ్యులై యుండిరి. కుమారగిరి కాలమున వారు రాజ్యమున
కొంత అలజడి కావించినట్లు తోచుచున్నది. కాని వీరుడును, రాజ్య
తంత్రజ్ఞుడును, కుమారగిరికి బావయు నగు కాటయవేముడు వీరి
నందరిని శాంతపరచి, కుమారగిరిరెడ్డి యనంతరము పెదకోమటి
వేమారెడ్డి కొండవీటి రాజ్యమును పాలించున ట్లేర్పాటు చేసెను.
ఇంతటితో రాజ్యమందలి అశాంతి చల్లారెను. కుమారగిరిరెడ్డి
తండ్రితాతలవలె ప్రజ్ఞావంతుడు కాడు. ఈతడు భోగప్రియుడు.
కావున మహాసమర్థుడగు తన బావ కాటయవేముని

మంత్రిగ నియమించి, సుఖముగా కాలము గడపనారంభించెను. క్రీ. శ. 1386-90 నడుమ కాటయవేముడు రెడ్డిరాజ్యముపై దండెత్తి వచ్చిన విజయనగరరాజు రెండవ హరిహరరాయుని సేనల నోడించెను. అంతట నారాజు రెడ్డిరాజ్యముయొక్క బలిమిని గుర్తించి, కాటయవేమునికి తనకుమార్తె హరిహరాంబ నిచ్చి వివాహము చేసెను. పద్మనాయకులతో సంభవించిన యుద్ధమునందుకూడ, కాటయవేమునకే విజయము కల్గెను. ఆపైన కాటయ వేమారెడ్డి తన ప్రభువు ననుమతితో పూర్వదేశ విజయమునకై బయలుదేరెను ఈ దండయాత్రయందు దాతనికి రాజమహేంద్రవర పాలకులగు వేమారెడ్డి వోడ్డారెడ్డి అనువారు చాలసహాయపడిరి. కాటయ వేముడు సింహాచలము వరకుగల దేశమును శాశ్వతముగ జయించుటయేకాక, కటకమువరకు పోయి ఆపట్టణమును కొల్లగొట్టెను. కాటయవేముడు సాధించిన విజయములకు మిగుల సంతసించి కుమారగిరిరెడ్డి అతనికి రాజమహేంద్రవరమునుండి సింహాచలము వరకును గల రాజ్యమును శాశ్వతముగ నిచ్చివైచెను. ఈయేర్పాటు పలువురు రెడ్డివీరులకు అనిష్టముగ నుండెను. కుమారగిరి విలాసప్రియుడై వసంతోత్సవముల జరుపుచు, కవి పండితగోష్ఠిలో కాలము గడుపుచుండెడివాడు. ఇది యిట్లుండ 1396 సంవత్సరమున రెడ్డిరాజ్యములో గొప్ప కరవు సంభవించెను. ప్రజలు తిండికిలేక మల మల మాడనారిరి. ప్రజలలో నశాంతి చెలరేగెను. దీని నణచివేయుటకు కుమారరెడ్డి కఠినమార్గముల నవలంబింప, ప్రజ లాతనికి విముఖులైరి. ఈయదను చూచుకొని పెదకోమటి వేమారెడ్డి కుమారగిరిని తొలగించి, రాజ్యమును తానే వశపరచుకొనెను. కుమారగిరిరెడ్డి రాజమహేంద్రవరమునకు వెడలిపోయి, కొంతకాలమున కచ్చట మరణించెను.

పెదకోమటి వేమారెడ్డి:—(1402-1420) కుమారగిరిరెడ్డిని రాజ్యమునుండి తొలగించి, కోమటి వేమారెడ్డి కొండవీటి రాజ్యమున కధిపతి యయ్యెను. కాని కుమారగిరి మిత్రులగు కాటయ వేమారెడ్డి ప్రభృతు లీమార్పును ప్రతిఘటింపకపోలేదు. కాటయ వేముని

కిని, కోమటివేమునికిని గుండుగొలను, కోనూరు. అన్యప్రదేశములలో యుద్ధములు సంభవించెను. కాని కాటయవేమునకు పరాజయము కల్గెను. ఈయుద్ధములందు వెలుగోటి వంశీయుడగు కాయపనాయకుడును, గజరావు తిప్పానాయకుడును, పెదకోమటి రెడ్డికి సహాయపడిరి. కాటయ వేమారెడ్డికి తోడ్పడవలయునను నుద్దేశ్యముతో విజయనగ రాధీశ్వరుడు రెండవ హరిహరరాయుడు కొండవీటి రాజ్యముపై సేనలను పంపెను. ఆ సేనలు కొండవీటి దుర్గమువరకును సాగి వచ్చెను. కాని గజరాజు తిప్పానాయకుడా సేనల నోడించి తరిమివైచెను. ఇదేసమయమున కోమటివేముడు కృష్ణానది కుత్తరమున నున్న కొండపల్లి సీమనుజయించి, అచ్చటగల దుర్గమును దృఢపరచి, తన సోదరుడగు మాచారెడ్డి నీప్రాంతమునకు పాలకునిగ నియమించెను. 1404 వ సంవత్సరమున హరిహరరాయలు చని పోయినపిదప, విజయనగరమున నంతః కలహములు చెలరేగెను. ఆ యదనుచూచి కోమటి వేమారెడ్డి కుమారగిరి కాలమున విజయనగరాధీశులు వశపరచుకొనిన శ్రీశైల ప్రాంతమును మరల ఆక్రమించెను. కందుకూరు రెడ్లను జయించి, ఈతడు తూర్పుతీర ప్రాంతముల తన రాజ్యములో కలుపుకొనెను. కాటయవేముడును, కోమటి వేమారెడ్డియు, చాలకాలము ద్వేషభావముతో పోరాడిరి. గజరావు తిప్పానాయకుడీ యుద్ధములలో ప్రముఖపాత్ర వహించెను. తుదకు క్రీ. శ. 1414 ప్రాంతమున కాటయవేమారెడ్డి యుద్ధమున మడసెను. కాని ఇంతటితో కోమటి వేమారెడ్డి అదృష్టపు రోజులు గడచిపోయెను. విజయనగరాధీశ్వరుడగు దేవరాయలు రెడ్డిరాజ్యముపై దండెత్తి ప్రసిద్ధ నౌకాస్థానమగు మోటుపల్లిని వశపరచుకొనెను. రాజమహేంద్రవరమునుండి అల్లాడరెడ్డి కొండవీటి రాజ్యముపై పగ సాధింపజొచ్చెను. ఈ యిరువురు ప్రబల శత్రువులతో పోరాడుట దుస్సాధ్యమని యెరింగి, కోమటి వేముడు బహమనీ రాజైన ఫిరోజుషాతో సంధిచేసికొనెను. అయినను అల్లాడరెడ్డి వలన కోమటి వేమునకు పరాభవము తప్పలేదు. మొదటినుండియు రెడ్డివీరులతో వైరముపూనియున్న రేచెర్ల పద్మనాయకులు కోమటి

వేమారెడ్డిపై యుద్ధము ప్రకటించి, ఆతని నోడించి, ఆతని సుప్రసిద్ధమగు "నందికంట పోతరాజుకటారి" అను ఖడ్గమును కొనిపోయిరి. ఈ విజయముల సాధించిన లింగమనీడు, కోమటివేముని యుద్ధమున సంహరించినట్లు వెలుగోటి వంశచరిత్ర తెల్పుచున్నది. కోమటి వేమారెడ్డి 1420 యందు మరణించెను.

ఈ రాజు స్వయముగ విద్వాంసుడు, కవులను, విద్వాంసులను పోషించెను. పెదకోమటి వేమారెడ్డి మిక్కిలి ఈవిగలవాడనియు, అనేక దానముల కావించెననియు తెల్పుటకు నిదర్శనములు కలవు.

రాచవేమారెడ్డి [1420-1424] కోమటివేమారెడ్డికుమారుడు రాచవేమారెడ్డి తండ్రియనంతరము రాజ్యభారము పూనెను. కాని యీతెడు క్రూరుడు. అసమర్థుడు. ఈతెడు ప్రజలపై అన్యాయమగు పన్నుల విధించి బాధించెను. కావున అతిశీఘ్రముగ నీతనిపై ప్రజల కసహ్యాత యేర్పడెను. ఉత్తరమునుండి గజపతులును, దక్షిణమునుండి విజయనగర రాజులును ఈతని రాజ్యముపై దండెత్తి యాక్రమించుకొనిరి. ఈవిధమున కాకతీయరాజ్య పతనానంతరము 1324 సంవత్సరమున ప్రోలయ వేమారెడ్డిచే స్థాపింపబడిన కొండవీటిరాజ్య మొక శతాబ్దివరకు విలసిల్లి 1424 నందు శత్రురాజులచే కబళింపబడెను.

## కోరుకొండ రాజ్యము

పల్లవరాజైన ముక్కంటి యనునాతడు గంగాతీరమునుండి మంచి, కొండ, యను నిరువురు సర్దారుల నాంధ్రదేశమునకు తీసికొనివచ్చెనట! వారు మంచికొండయను పట్టణమును స్థాపింపగా, నదియే ఆ వంశమువారి కింటిపేరుగ మారెను. ఈ వంశములోని కేశవనాయకు డాంధ్రదేశమున నొక సామంతుడుగ నుండెను. కేశవనాయకుని కుమారుడు గణపతినాయకుడు. కూనయనాయకుడు కేశవనాయకుని పుత్రుడు. ఈతడే కోరుకొండ దుర్గమును కట్టించినట్లు చెప్పుదురు. కేశవనాయకుడును, గణపతినాయకుడును, కాకతీయ ప్రభువులకడ సామంతులుగ నుండియుందురు. కూనయనాయకుడు ముసునూరి ప్రోలయనాయకునికిని, కాపయనాయకునికిని, సమకాలీనుడు. కూనయ కుమారుడగు ముమ్మడి నాయకుడు కాపయనాయ

కుని మేనకోడలిని వివాహమాడెను. దీనివలన వీరి కీర్తి ప్రతిష్ఠలు హెచ్చెను. మంచికొండ వంశముకూడ ఆంధ్రదేశమందలి వీర సామంత వంశములలో నొకటిగా పరిగణింపబడసాగెను. నేటి భద్రాచలము తాలూకాయందలి కూనవరమ మా కూనయనాయకుని పేరనే, నెలకొల్పబడియుండవచ్చును. క్రీ. శ. 1353 వ సంవత్సరమున కాపయనాయకుని సోదరుడును, రాజమహేంద్రవరపాలకుడు నగు తొయ్యేటి అనపోతానాయకుడు చనిపోయెను. రాజ్యమున నరాచకము ప్రబలకుండుటకై, కూనయనాయకుడు తన కుమారుడగు ముమ్మడినాయకుని రాజ్యభారము పూనవలసినదని ఆదేశించెను. తండ్రియాజ్ఞననుసరించి, ముమ్మడినాయకుడు ప్రభుత్వభారమును పూనెను. ఇదియే కోరుకొండ రాజ్యస్థాపనము. గోదావరి కుత్తరముననున్న ఆటవికజాతులవారు గోదావరీ మైదానములోనికి వచ్చి, ప్రజలను బాధింపకుండునట్లు, ముమ్మడినాయకుడు కట్టుబాట్లు చేసెను. ఈతడు నేటి కోనసీమను, పశ్చిమగోదావరీ మండలములోని భీమవరము తణుకు తాలూకాలను, నేటి కాకినాడ ప్రాంతమును జయించెను. కోనసీమ ఆకాలమునకూడ కొబ్బరి, పనస, మామిడి, పోక మున్నగు వృక్షములతో నిండి, నందనవనమువలె నుండెడిదట. ముమ్మడినాయకుడు తన సోదరులగు సింగయ, గన్నయనాయకులను, కోటిఫలి, తాటిపాకలయందు తన ప్రతినిధులుగా నియమించెను. ముమ్మడినాయకుడు క్రీ. శ. 1388 ప్రాంతమున చనిపోయెను. ముమ్మడినాయకుని వంశస్థులు మరి నలుబదిసంవత్సరములు స్వతంత్రముగా నుండినట్లు కోరుకొండ కైఫియత్తువలన తెలియనగుచున్నది. తుద కీరాజ్యమును కొండవీటి రెడ్డిరాజులపక్షమున కాటయవేముడు జయించెను.

## రాజమహేంద్రవరరాజ్యము

రాజమహేంద్రవరమునందు స్వతంత్ర రాజ్యమును స్థాపించినవాడు కాటయ వేమారెడ్డి. ప్రోలయ వేమారెడ్డి కాలముననే నెల్లూరినుండి రెడ్డివంశమువా రనేకులు రాజమహేంద్రవరమునకు వచ్చి, స్థిరనివాస మేర్పరచుకొనిరి. అట్టి వంశములలో దువ్వూరి వంశ

మొకటి. ఈ వంశములోని అల్లాడ రెడ్డి కాటయ వేమునకు బంధుడును, ఆప్తుడును కూడ అయియుండెను. అల్లాడ రెడ్డి రెండవ కుమారుడగు వీరభద్రా రెడ్డి కాటయ వేముని కుమార్తె అనితల్లిని వివాహమాడెను. ఇంతేకాక అల్లాడ రెడ్డి కొండవీటి రెడ్డివంశమునకుకూడ బంధువు. క్రీ. శ. 1402 వ సంవత్సరమున పెదకోమటి వేమారెడ్డి కొండవీటి రాజ్యము నాక్రమించి నప్పుడు రాజమహేంద్రవరమున కాటయ వేము డాతని యధికారము నంగీకరింపక, స్వతంత్రుడయ్యెను. కాటయ వేము నెట్లైన లొంగదీసి, తనకు సామంతుని జేసికొనవలె నని కోమటి వేమారెడ్డి మిక్కిలి ప్రయత్నించెను. కాని అది సాధ్యము కాలేదు. వీరిరువురికిని నిరంతర యుద్ధములు సాగెను. తుదకు క్రీ. శ. 1414 ప్రాంతమున కాటయవేము డీ యుద్ధములలో మరణించెను. కాటయ వేమునికి కుమారగిరి యను పుత్రుడు కలడు. తండ్రి చనిపోవునప్పటి కీతడు మిక్కిలి పిన్నవాడు. రాజ్య మల్లకల్లోలముగా నుండెను. కావున అల్లాడ రెడ్డి రాజ్యభారమును పూనవలసి వచ్చెను. అల్లాడ రెడ్డి గొప్పవీరుడు. కోమటి వేమారెడ్డియు, బహమనీ సుల్తానును ఏకమై, తన రాజ్యముపై దండెత్తిరాగా, ఈతడా సేనలను రామేశ్వరమను ప్రదేశమున సంపూర్ణముగ పరాభవించి, పారద్రోలెను. అల్లాడ రెడ్డి జీవితకాలమందే కాటయ వేముని కుమారుడు కుమారగిరి మరణించెను. మరికొంత కాలమునకు అనగా క్రీ. శ. 1420 సంవత్సరమున అల్లాడ రెడ్డి కీర్తిశేషుడయ్యెను. ఈతని మరణానంతర మీతని యన్నమనుమడు మూడుసంవత్సరములు మాత్రము రాజమహేంద్రవర రాజ్యము నేలెను. క్రీ. శ. 1423 నందు అల్లాడ రెడ్డి పెద్దకుమారుడు వేమారెడ్డి తనజ్ఞాతులను పారద్రోలి, రాజమహేంద్రవర రాజ్యమును మరల సంపాదించెను. కాని వేమారెడ్డి మిక్కిలి నిస్స్వార్థతతోడను, దూరదృష్టితోడను, భ్రాతృవాత్సల్యముతోడను, వర్తించి, తన తమ్ముడగు వీరభద్రారెడ్డిని రాజమహేంద్రవర రాజ్యమునకు పట్టాభిషిక్తుని చేసెను. రాజ్యము కాటయ వేమునిచే స్థాపింపబడిన కారణమునను, వీరభద్రారెడ్డి కాటయవేముని కుమార్తె అనితల్లిని వివాహమాడి నందునను,

ఆతనికే రాజ్యమును పాలించుట కెక్కుడు అధికారము కలదని నిశ్చయించి వేమారెడ్డి ఇట్లు చేసెను. కాని అన్నివిధములుగను తన తమ్మునికి తోడ్పడుచు, వేమారెడ్డి రాజ్యకార్య నిర్వాహణము సాగించెను. క్రీ. శ. 1424 వ సంవత్సరమున కొండవీటి రాజ్యము నశించిన తర్వాత, విజయనగర రాజుల పక్షమున రేచెర్ల పద్మ నాయకులు తూర్పుతీరమును జయించిరి. ఇందులకు ఫలితముగ రాజ మహేంద్రవర రాజ్యము విజయనగరాధీశులకు సామంత భూమండ లముగ నేర్పడెను. కాని ఇది నామమాత్రము. క్రీ. శ. 1432 ప్రాంత మున వేమారెడ్డి దక్షిణకళింగమును జయించి, సింహాచలమువరకు తన రాజ్యమును విస్తరించెను. ఈ విజయము కళింగాధీశ్వరులకు తీరని యవమానముగ నుండెను. క్రీ. శ. 1434 సంవత్సరమున తూర్పు గాంగవంశము నంతమొందించి, కళింగరాజ్యము నాక్ర మించిన కపిలేశ్వర గజపతి, రాజమహేంద్రవర రెడ్డిరాజ్యము నెడ పగబూనెను. 1447 ప్రాంతమున నీ గజపతి రాజమహేంద్రవర రాజ్యముపై దండెత్తి వచ్చెను. వేమారెడ్డియు, వీరభద్రారెడ్డియు, మహాధైర్యముతో పోరాడి యుద్ధరంగమునను బలిసిరి. రాజ మహేంద్రవర రాజ్యము మాయమై కళింగభూమండలములో కలిసి పోయెను.

కాటయవేమ ప్రభృతులు మిక్కిలి స్వాంధ్ర మతాభిమానము చూపిరి. వారు కావించిన దానములును, విద్యాపోషణయు సుప్ర సిద్ధములు. వీరు కావించిన భాషాసేవనుగూర్చి ముందు తెలిసికొన గలము.

## కందుకూరు రాజ్యము

ఈ రాజ్యమును ప్రోలయ వేమారెడ్డి తమ్ముడగు మల్లారెడ్డి వంశమువారు పాలించిరి. మల్లారెడ్డి మిక్కిలి సమర్థుడగు సేనా నాయకుడు. తమ్ముని సామర్థ్యమును గుర్తించి ప్రోలయ వేమారెడ్డి యీతనిని కందుకూరు రాష్ట్రమునకు పరిపాలకునిగ నియమించెను. మల్లారెడ్డివంశమువా రిచ్చట కొండవీటి రాజ్యమునకు సామంతు లుగ రాజ్యపాలనము చేసిరి. మల్లారెడ్డి మనుమడైన శ్రీగిరిరెడ్డి

కొండవీటి రాజ్యమును ధిక్కరించి స్వతంత్రుడయ్యెను. కుమారగిరి రెడ్డికిని, పెద కోమటి వేమారెడ్డికిని, వైరములు ప్రబలిన సందర్భమున నీతడు కొండవీటి రాజ్యమునుండి విడివడెను. ఈతడు సమర్థుడగు సేనాని. ఈ రాజు బహమనీ సుల్తానుల నోడించుటయే కాక, విజయనగర రాజ్యముపై దండెత్తి, ఉదయగిరిసీమ నాక్రమించెను. శ్రీగిరిరెడ్డి 1406 ప్రాంతమున మరణించెను. ఈతని యనంతరము కందుకూరు రాజ్యము బలహీనమయ్యెను. పెదకోమటి వేమారెడ్డి కందుకూరు రాజులు జయించిన సముద్రతీర ప్రాంతమును వశపరచుకొనెను. విజయనగరరాజగు దేవరాయలు కందుకూరుపై తన సేనలను పంపి, క్రీ. శ. 1427 ప్రాంతమున నీ రాజ్యమును జయించెను. ఆపైన కందుకూరు రెడ్లు విజయనగరనామంతులుగ మాత్రము నిలచిపోయిరి.

## రాచకొండ దేవరకొండ రాజ్యములు

ఈరాజ్యములను పాలించి ప్రసిద్ధిచెందినవారు పద్మనాయకులు. వీరు రేచెర్ల వంశమువారు. వీరు కాకతీయ రాజన్యులకడ సేనాధీశులుగ నుండి, ప్రఖ్యాతి వహించిరి. కాకతీయరాజ్యము నశించిన వెనుక వీరు స్వతంత్రరాజ్యమును స్థాపించిరి. రాచకొండ రాజ్యమును స్థాపించినవాడు మొదటి సింగమనాయకుడు. ఈతడు రాచకొండ ప్రాంతమును జయించెను. సింగమనాయకుని కుమారుడగు అనపోతనాయకుడు తండ్రి నాటిన రాజ్యవృక్షమును పెంపొందించి, బలవత్తరము కావించెను. అనపోతానాయకుడు రాచకొండ దుర్గమును శత్రుదుర్భేద్యముగ నిర్మించి, కోటగోడలను బురుజులను నిర్మింపించెను. ఈతడు క్రీ. శ. 1361 నుండి 1384 వరకును రాజ్యపాలన చేసెను. ముసునూరి కాపయనాయకునితో క్రీ. శ. 1368 వ సంవత్సరమున ఓరుగల్లు సమీపమున భీమవరమువద్ద యుద్ధముచేసి, అతనిని సంహరించిన దీ అనపోతానాయకుడే. రాజ్యాకాంక్షయు, అసహనమును తప్ప ఇందులకు వేరుకారణములు కానరావు. కాపయనాయకుని మరణమువలన పద్మనాయకులు తెలంగాణమున కధిపతులైరి. ఓరుగల్లు, భువనగిరి, రాచకొండ, పానగల్లు, మెతుకు, దుర్గము లనపోతా

నాయనికి స్వాధీనమయ్యెను. ఈతడు ఆంధ్ర దేశాధీశ్వరు డను బిరుదమును వహించెను.

అనపోతానాయకుడు తన సోదరుడగు మాధవనాయకుని దేవర కొండ రాజ్యమునకు పాలకునిగ నియమించెను. మాధవనాయకుడు దేవరకొండకు చుట్టుపట్లుగల రాజ్యభాగమును పరిపాలించెను. ఈ రెండు రాజ్యములును అంతరంగిక విషయములలో స్వాతంత్ర్యముగ వ్యవహరించినను, మిక్కిలి సఖ్యతతో మెలగెను. పరరాజులతో నీ రెండు రాజ్యములవారును ఒకేకట్టె సవలంబించి, ఒండొరులకు చేదోడు వాదోడుగ నుండిరి. దీనివలన వీరిబల మినుమడించెను.

ప్రథమదశయందు రాచకొండ రాజ్యమునకును, బహామనీ సుల్తానులకును నడుమ యుద్ధములు సాగెను. కాని కొంతకాలము గడచినవెనుక రాచకొండ పద్మనాయకులు గోలకొండ దుర్గమును బహామనీ రాజులకు శాశ్వతముగ నొసంగి, దానినే తమ రాజ్యములకు సరిహద్దుగ నంగీకరించిరి. ఈ సంధివలన రాచకొండ బహామనీ రాజ్యములు తమ పాతివైరమును విస్మరించి, స్నేహభావముతో వర్తింప సాగెను. పద్మనాయకులు బహామనీ సుల్తానులకు సహాయపడి, సోదరులగు హిందూరాజులతో కూడ యుద్ధమునకు దిగుచుండిరి. అట్లే బహామనీ సుల్తానులుకూడ రాచకొండ ప్రభువులకు సహాయపడుటకు వెనుదీయలేదు. కాని మొట్టమొదటినుండియు కొండవీటిరెడ్డి రాజ్యము నెడలను, విజయనగరరాజ్యము నెడలను, రాచకొండ వెలమ ప్రభువులు శత్రుభావమునే వహించిరి. కృష్ణానదియే రాచకొండ రాజ్యమును, రెడ్డి విజయనగరరాజ్యములను వేరుపరచెను.

అనపోతానాయని కుమారుడు రెండవ సింగమనాయడు తండ్రి యనంతరము రాచకొండ నేలెను. [1384–1399] దేవరకొండ యందు మాధవనాయని పుత్రుడు పెదవేదగిరి యీతని సమకాలీనుడు. రెండవ సింగమనాయడు గొప్ప విద్వాంసుడును, విద్వత్కవి పోషకుడునని కీర్తిగాంచెను. ఈతనికి సర్వజ్ఞుడను బిరుదనామ ముండెను. తెలుగుచోడ వంశీయుడగు అన్నెదేవచోడుడు

కొండవీటి రెడ్డిరాజులచే పదభ్రష్టతనొంది, పెదవేదగిరి నాయని శరణు జొచ్చెను. ఈ కారణమువలనకూడ రెడ్డి పద్మనాయక రాజ్యములకు నడుమగల వైరభావము వృద్ధిచెందెను. రెండవ సింగమనాయని కుమారుడు రెండవ అనపోతానాయకుడును, పెదవేదగిరి నాయని కుమారుడు కుమారమాధవ నాయకుడును, తమ తండ్రుల యనంతరము రాజ్యపాలనము కావించిరి. వీరు తమ తండ్రి తాతలు బహమనీ సుల్తానులతో నెరపిన స్నేహధర్మమును విడనాడి, విజయనగరాజులు నేటి నల్లగొండ జిల్లాయందలి పానగల్లు దుర్గమును ముట్టడించినప్పుడు విజయనగర పక్షము నవలంబించిరి. రెండవ అనపోతానాయకుని కుమారుడు మూడవ సింగమనాయకుడు [1425-1475]. ఈతనికికూడ సర్వజ్ఞుడను బిరుదనామ ముండెను. ఈ కాలమున దేవరకొండ రాజ్యమును పాలించినవాడు కుమారమాధవ నాయకుని కుమారుడు లింగమనాయడు. లింగమనాయుడు మహావీరుడని ప్రశస్తిగాంచెను. ఈతడు కొండవీడు, రాజమహేంద్రవర రెడ్డిరాజ్యములపై, అనేక పర్యాయములు దండయాత్రలు సాగించి, వాని వినాశమునకు కొంతవరకు కారణభూతు డయ్యెను. సింగమనాయడును, లింగమనాయడును, విజయనగరరాజులతోడను, కళింగరాజగు కపిలేశ్వరగజపతితోడను స్నేహభావము వహించిరి. లింగమనాయుడు గజపతి సహాయముతో తెలంగాణమును జయించి ఓరుగల్లును వశపరచుకొనెను [1461]. కాని యీతని కెక్కుడులాభము కలుగలేదు. బహమనీ సుల్తానులకు మారుగ నీతడు కపిలేశ్వర గజపతికి సామంతుడు కావలసివచ్చెను. లింగమనాయని మరణముతో దేవరకొండ రాజ్యపు ప్రతిభ నశించెను. ఆతని వంశీయులు పూర్వపు గౌరవము కోల్పోయి, స్థానికులగు జమీందారులుగ పరిణమించిరి. రాచకొండ రాజ్యము మాత్రము మూడవ సింగమనాయకుని యధికారములో మరికొంతకాలము వర్ధిల్లెను. కాని బహమనీసుల్తాను అహమ్మదుషా సేనానులు, తెలంగాణమును జయించి, రాచకొండ దుర్గమునుకూడ వశపరచుకొని, సింగమనాయని పారద్రోలిరి. సింగమనాయడు బెల్లంకొండ దుర్గమునకు పారి

పోయి అచ్చటనే మరణించెను. ఇంతటితో ప్రసిద్ధమైన ఈ పద్మ నాయక వంశము చారిత్రకరంగమునుండి అస్తమించుచున్నది. రేచెర్ల వంశములోని యొకశాఖవా రిటుపైన ఆంధ్ర దేశమును వీడి, కర్ణాటక మున నివసించు విజయనగర రాజులవద్ద నుద్యోగములు చేయసాగిరి.

కాకతీయరాజుల కాలమున నాంధ్ర దేశమున శైవమతము వ్యాప్తిగాంచిన విషయ మీవరకే తెలుపబడినది. రెడ్డిరాజుల యుగమున నీ మతము రాజులచే గౌరవింపబడెను. యథారాజా తథాప్రజా యనునటుల ప్రజలుకూడ శైవము నవలంబించిరి. రెడ్డి రాజులు వైదికధర్మమునెడ మిక్కిలి అభిమానము కలవారు కావున ఆంధ్ర దేశమున వ్యాపించిన శైవమతము వేదమార్గ ప్రతిపాదితమగు శివపూజనమే కాని, కర్ణాటక ప్రాంతమున ప్రచారమునందిన, వీర శైవముకాదు. శైవులు యోగమార్గమును, తాంత్రిక పద్ధతిని విశేషముగ నవలంబించిరి. తాంత్రికపద్ధతిని గూర్చిన గ్రంథములు ప్రచారములోనికి వచ్చెను. ఈ మార్గముల నవలంబించిన యెడల, గొప్పశక్తులు సిద్ధించునని ప్రజలలో నమ్మకముండెను. శైవపూజ కనుబంధముగ శక్తిపూజ కూడ ఆనాడు ప్రబలియుండెను. వింధ్య పర్వతమందలి చండికాయతనమున, ఆదిభైరవీశక్తిని, పెదకోమటి వేమభూపాలు డొక దండయాత్రసందర్భమున, పూజించినట్లు వామనభట్టబాణుని వేమభూపాల చరిత్రమందు పేర్కొనబడినది. శైవమతాచార్యుల కానాడు రాజాస్థానమునందును, ప్రజలయందును, చాల గౌరవము లభించుచుండెను. ఈ మతాచార్యులలో ఘోడె రాయవంశమువారు ప్రసిద్ధులు. ఘోడెరాయ గంగయదేవుడను శైవాచార్యుడు ప్రోలయ వేమారెడ్డికి గురువు. ఈ గురుని యను గ్రహమువలననే, ప్రోలయ వేమునకు రాజ్యలాభము కల్గెనని చెప్పుదురు. రాజమహేంద్రవరపు రెడ్లకుకూడ ఈ వంశమువారు గురుత్వము వహించిరి. వీరుకాక ఇతర శైవాచార్యులును, పండి తులును, ఆకాలమున నివసించియుండిరి. శైవమతముతోపాటు వైష్ణవమతమునకు కూడ రెడ్డిరాజ్యమున ఆదరణ యొసంగబడెను. వేదాంత దేశికుడు మున్నగు నాచార్యులు వైష్ణవ సంప్రదాయమును

వేదచోదిత మార్గముననే నడపించి, ప్రజలలో దాని ప్రచారమునకై పాటుపడిరి. వైష్ణవమతము రెడ్డియుగమునకు పూర్వమే, ఆంధ్ర ప్రాంతమున ప్రవేశించుటవలన, శ్రీకూర్మము, సింహాచలము, సర్పవరము మొదలైన గొప్పక్షేత్రము లిచ్చట వెలసెను. కాని రెడ్డియుగమం దీమతమునకు చక్కని ప్రచారము లభించెను. సుప్రసిద్ధులగు వైష్ణవాచార్యు లీప్రచారమునకై పూనుకొనుటయే దీనికి కారణము. శ్రీరంగక్షేత్రమందలి భట్టరుల వంశమునకు చెందిన పరాశరభట్టను వైష్ణవపండితు డీకాలమున ఆంధ్రదేశమున పర్యటనము కావించి, మతప్రచారము కావించెను. కోరుకొండ రాజ్యమును పాలించిన ముమ్మడినాయకు డీ వైష్ణవాచార్యుని శిష్యత్వము నంగీకరించి, ఆతనికి కొట్టాలపల్లు అను గ్రామమును, గురుదక్షిణగా నొసంగెను. పరాశరభట్టు కోరుకొండయందే నివాస మేర్పరుచుకొని, అచ్చటనే తుదకు మరణించెను. పరాశరుని అనంతరము ముమ్మడి నాయకుడు కందాడై వంశమువారి శిష్యుడయ్యెను. తిరుమల వంశీయులగు వైష్ణవపండితులుకూడ రెడ్డియుగమున ఆంధ్రదేశమునకేతెంచి, ఇచ్చట స్థిరనివాస మేర్పరచుకొనిరి. తిరుమల నల్లాండి చక్రవర్తి అను పండితుడు వీరిలో ప్రథముడు. ఈ పండితులందరును దేశమంతయు పర్యటించుచు, రాజసభలకుపోయి ఇతర మతస్థులతో వాదోపవాదములు జరిపి, తమ మతప్రాశస్త్యమును స్థాపించుచుండిరి. రాచకొండ దేవరకొండలయందలి పద్మనాయకులు, మొదట శైవ మతాభిమానము కల్గియుండిరి. మొదటి సింగమనాయని కుమారుడగు అనపోతనాయడు శైవమతాభిమానియై అనేకప్రదేశములందు భైరవ ప్రతిష్ఠల కావింపించెను. కాని మరికొంతకాలమున కీరాజులు వైష్ణవమతాభిమానులైనట్లు కానవచ్చుచున్నది. వేదాంత దేశికుని కుమారుడగు వరదాచార్యు డనుపండితుడు, సర్వజ్ఞసింగమ నాయని యాస్థానమున కేతెంచి, అచ్చటి ఆస్థానపండితుడగు శాకల్యమల్లుభట్టు నోడించి, వైష్ణవమత స్థాపనము కావించి, రాజువలన మిక్కిలి గౌరవము పొందినట్లు వైష్ణవ గ్రంథములు తెల్పుచున్నవి. ప్రోలయ వేమారెడ్డి, అనపోతారెడ్డి, అనవేమా

రెడ్డియును, శైవమతాభిమానులు. కాని కుమారగిరిరెడ్డియును కాటయవేముడును వైష్ణవమతమును స్వీకరించి, ఆ మతాచార్యుల నెక్కుడు గౌరవించిరి. ఈకాలపు ప్రజలు శివకేశవుల ననేక నామములతో పూజించుచుండిరి. వైశ్యులకు కులదైవమగు కన్యకాపరమేశ్వరినికూడ ఆకాలమువారు పూజించిరి. రాజులు తామేమతము నవలంబించినను, తదితర మతముల నెన్నడును బాధింపలేదు. వారు దేవాలయములకును, మఠములకును, భూదానములు చేయుచు పోషించుచుండిరి. కాకతీయయుగమున విశ్వేశ్వర శివాచార్యునిచే స్థాపింపబడిన గోళకీ మఠమునకు శాఖలైన త్రిపురాంతక, పుష్పగిరి మఠము లీరెడ్డియుగమున నిలచియుండెను. సామాన్యప్రజలు దేవతలనేకాక ఆయా సందర్భములలో జాతీయవీరులనుకూడ పూజించు చుండిరి.

రెడ్డిరాజులును, పద్మనాయక ప్రభువులును హిందూధర్మము నందు చాల అభిమానముకల్గి, ఆమతమును ప్రోత్సహించుటయేకాక హిందూధర్మమునకు గుండెకాయవంటి సంస్కృతభాషను, తదితర శాస్త్రములను మిక్కిలి పోషించిరి. ఈ యుగమునందు ఆంధ్రభాషాపోషణము చక్కగా జరిగి, ఈభాషయందు మహత్తరమగు కావ్యములనేకములు రచింపబడెను. రాజులును, ధనాధికులును, విద్వాంసులను, కవులను, పోషించుట అన్నికాలములయందును కానవచ్చుచున్నది. కాని రెడ్డియుగమునందొక విశిష్టత మనము చూడవచ్చును. ఈకాలమున రాజులు స్వయముగ గొప్పవిద్వాంసులై, అనేక గ్రంథముల రచించుట గమనింపదగియున్నది. రెడ్డిరాజులలో నించుమించు అందరును విద్వాంసులే. వీరిలో కుమారగిరి రెడ్డిపేరు మొదట సంస్మరింపవలసి యున్నది. ఈతడు వసంతరాజీయమను గొప్ప నాట్యశాస్త్ర గ్రంథమును, సంస్కృతభాషయందు రచించెను. ఈతడు సంగీత నృత్యములందు ప్రత్యేకాభిమానము కలవాడు. కుమారగిరిరెడ్డి బావయగు కాటయవేముడు గీర్వాణభాషయందు గొప్ప పండితుడు. ఈ విద్వాంసుడు కుమారగిరి రాజీయమను పేరున, కాళిదాస మహాకవి విరచితమగు నాటకములకు సంస్కృతవ్యాఖ్య రచించెను. ఇయ్యది

ఉత్తమతరగతికి చెందిన వ్యాఖ్యానమని పండితులు తలంచుచున్నారు. పెదకోమటి వేమారెడ్డి మరియొక విద్వాంసుడు. ఈతనికి సర్వజ్ఞ చక్రవర్తియను బిరుద ముండెను. ఈతడు సాహిత్యచింతామణి యను పేర నొక అలంకార గ్రంథమును, సంగీతచింతామణి యను పేర నొక సంగీతశాస్త్రగ్రంథమును, రచించెను. ఇవికాక సంస్కృతభాష యందలి అమరుకమున కీతడు వ్యాఖ్యానము రచించెను. ప్రోలయ వేమారెడ్డి, ఆతని కుమారులగు అనపోతారెడ్డి, అనవేమారెడ్డి రాజులును, రాజమహేంద్రవరరాజగు వీరభద్రారెడ్డియు, కూడ గొప్ప పండితులు. స్వయముగ విద్వాంసులగు రాజన్యులు పండిత ప్రకాండలను గౌరవించి పోషించుట సహజము. అనపోత, అన వేమారెడ్ల కాలమున, బాలసరస్వతి, త్రిలోచనాచార్యుడు, కోలా చల పెద్దిభట్టు అను పండితులు రాజసన్మానము నందిరి. పెదకోమటి వేమభూపాలుడు వామన భట్టబాణుడను గొప్ప సంస్కృత విద్వాం సుని పోషించెను. ఈ వామనభట్ట పండితుడు సంస్కృతభాషయందు కొన్ని నాటకములను, వీరనారాయణ చరిత్ర మనుపేరుతో వేమ భూపాలుని చరిత్రమును, సంస్కృతమున గద్యకావ్యముగ రచిం చెను. రాజమహేంద్రవరపు రాజులుకూడ గొప్ప విద్యాపోషకులుగ కీర్తిని గడించిరి. వారు వేదవిదులగు బ్రాహ్మణుల మిక్కిలి గౌర వించిరి. వీరి ప్రోత్సాహమున రచింపబడిన శాస్త్రగ్రంథము లనేక ములు. వ్యాకరణము, జ్యోతిషము, గణితము, మీమాంసమున్నగు శాస్త్రములలో నీకాలమున ననేక గ్రంథములు వెలసెను. జ్యోతి శ్శాస్త్రమందు నిధులనదగిన పండితులు పలువురు రెడ్డిరాజులచే సన్మానము లందిరి. రెడ్డిరాజులాయుర్వేదమును మిక్కిలి పోషించిరి. ఈకాలమున నాత్రేయగోత్రీకులగు పరహితవంశమువా రాయుర్వేద మున నిధులుగ గణింపబడిరి. కోరుకొండ రాజైన సింగయనాయుడు క్రీ. శ. 1368 వ సంవత్సరమున పరహిత వంశమునందలి యొక బ్రాహ్మణునికి, అక్కలపూడి యనుగ్రామమును దానమిచ్చెను. వీరభద్రారెడ్డి భార్యయైన అనితల్లి 1423 వ సంవత్సరమున పరహిత వంశములో మరి యొక్కరికి కలువచేరు అను గ్రామమును దాన

మిచ్చెను. ఈ దానములను స్వీకరించిన బ్రాహ్మణు లాయుర్వేదము నందే కాక, ఆగమ రహస్య విజ్ఞానమునందు కూడ నిధులు. కొండ వీటి రాజులుకూడ ఆయుర్వేదమును పోషించిరి. ఆయుర్వేదమున నిధులైన కొందరిని. రెడ్డిప్రభువులు రాజవైద్యులుగ నియమించు చుండిరి. రాచకొండ రాజ్యము నేలిన పద్మనాయకులుకూడ భాషా పోషణము కావించిన విద్వత్ప్రభువులు. అనపోతానాయకుని కుమారు డగు సింగభూపాలునికి సర్వజ్ఞుడను బిరుదనామ ముండెను. ఈతడు గీర్వాణభాషయందు గొప్ప విద్వాంసుడు. ఈ రాజు రసార్ణవ సుధాకరమను పేర నొక అలంకార గ్రంథమును రచించెను. ఈతని యాస్థానమున విశ్వేశ్వరుడు, అప్పయార్యుడు అను విద్వాంసులు నివసించిరి. ఈ వంశమునందలి రావు మాధవనాయకుడు కూడ గొప్ప విద్వాంసుడు. ఈతడు రామాయణముపై వ్యాఖ్యానము రచించెను. రేచెర్ల నాయకులచే పోషింపబడిన సంస్కృత విద్వాం సులు మరి యెందరో కలరు.

ఇంతవరకును మన రెడ్డియుగమందలి సంస్కృత విద్వాంసు లను, పండితులను, వారిచే రచింపబడిన గ్రంథసంచయమును ప్రశం సించి యున్నాము. ఆంధ్రభాషయందు మహత్తరమగు కృతుల రచించి, సత్కీర్తిని బడసిన మహాకవులనుగూర్చి యిప్పుడు కొంత తెలిసికొందము. చాళుక్యకులాభరణుడగు రాజరాజ నరేంద్రుని ప్రోత్సాహమున, పంచమవేదమగు భారతము తెలుగుభాషలో నవత రించుట మనవైజ్ఞానిక జీవనమునందొక ముఖ్యమగు ఘట్టము. ఇంత వరకును సంస్కృతభాషయందు పొందుపరుపబడిన విజ్ఞానామృత మీనాడు ఆంధ్రభాషా కలశమున నింపబడినది. ఆదికవియైన నన్నయభట్టారకుని యడుగుజాడలలో నడచిన తరువాతికవులు, పురాణములను, ఇతిహాసములను, సంస్కృతమునుండి తెనుగుభాష లోనికి పరివర్తనము కావించిరి. కాని యివి కేవలము భాషాంతరీ కరణములు కాక రసప్రధానములై కవి సామర్థ్యమును ప్రకటించు నుత్తమ కృతులని తెలుపవలసియున్నది. రెడ్డియుగమునాటి తెనుగు కవు లనేకులు కలరు. ప్రబంధపరమేశ్వరు డను కీర్తినామముగల

ఎఱ్ఱాప్రగడ వీరిలో ప్రథముడు. ఈతడు నన్నయభట్టారకునిచే అసంపూర్ణముగ విడువబడిన భారతారణ్యపర్వమును పూర్తిచేయుటయే కాక, లక్ష్మీనృసింహపురాణము, రామాయణము, హరివంశము అను గొప్ప గ్రంథముల రచించెను. ఈతని రామాయణమిప్పుడు లభ్యముకాదు. మహనీయులైన నన్నయ తిక్కన కవీంద్రులకు సమానుడై, కవిత్రయమందు గణింపబడిన ఈ కవిశ్రేష్ఠుని రచనా విధానమునుగూర్చి వేరుగ ప్రశంసించుట యనావశ్యకము. ఎఱ్ఱాప్రగడ ప్రోలయ వేమభూపాలునిచే ఆదరింపబడెను. ఈ యుగమునకు శాశ్వతకీర్తిని సంపాదించినవాడును, కవిశ్రేష్ఠుడును, విశిష్టగుణ సంపన్నుడునగు, మహనీయుడు బమ్మెరపోతన. ఈతడు కవిమాత్రుడు కాడు. మహాభక్తుడు. నిరంతర దారిద్ర్యముచే పీడింపబడుచుండియు, ఈ కవితల్లజుడు తాను రచించిన భాగవత కావ్యమును నరుల కంకిత మీయక, శ్రీరామునికే సమర్పించెను. ఈ కవి భోగినీదండకము అను కృతినికూడ రచించెను. పోతరాజు కవిత్వము సంస్కృతపద భూయిష్ఠమై, మిక్కిలి కర్ణపేయముగ నుండును. ఈతడు రచించిన భాగవతము తెనుగుభాషలో అద్వితీయమైన గ్రంథము. ఈ కవీంద్రుడు నేటి ఓరుగల్లు పట్టణమునకు సమీపమునకున్న బమ్మెర యను గ్రామమున నివసించెను. తన పాండిత్య ప్రకర్షచేతను, రచనా సామర్థ్యముచేతను, రెడ్డియుగపు ఆంధ్రుల నుత్తుంగ లూగించిన కవిసార్వభౌముడు శ్రీనాథుడు. ఈతడు వేదాది విద్యలలో మహాప్రవీణుడు. సంస్కృతభాషయందు నిధి. సుప్రసిద్ధుడైన గౌడ డిండిమభట్టును వాదమున నోడించిన తార్కికుడు. విజయనగరాధీశులచే స్వర్ణాభిషేకమును పొందిన ధీశాలి. ఈతడు కొంతకాలము కొండవీటిరెడ్ల యాస్థానమును, ఆపైన రాజమహేంద్రవరరాజుల ఓలగమును, అలంకరించెను. శ్రీనాథుడు హరవిలాసము, భీమఖండము, కాశీఖండము, నైషధము మున్నగు గొప్ప గ్రంథములను రచించెను. నైషధము పెదకోమటి వేమారెడ్డి కడ మంత్రిగనున్న మామిడి సింగనమంత్రి కంకితము కావింపబడినది. హరవిలాసము

అవచి దేవయ తిప్పయ అను వణిక్ఛ్రేష్ఠున కంకితమీయబడినది. భీమఖండము వీరభద్రా రెడ్డికడ మంత్రియైన బెండపూడి అన్నయ మంత్రికిని. కాశీఖండము వీరభద్రా రెడ్డికిని అంకిత మొసంగబడినవి. శ్రీనాధకవి ఇంకను అనేక కృతుల రచించెను.

ఈ కవీంద్రుని రచన రసవంతమును, ప్రౌఢమునై పండిత లోకమున కానందమును గూర్చుచున్నది. ఈ కవిరాజు పాండిత్య మును గుర్తించి, పెదకోమటి వేమారెడ్డి ఈతనిని, తన విద్యాధి కారిగా నియమించుకొనెను. వీరుకాక వెన్నెలకంటి సూరన, అనంతామాత్యుడు, విన్నకోట పెద్దన, నిశ్శంక కొమ్మన, రావి పాటి త్రిపురాంతకుడు, వినుకొండ వల్లభరాయడు, మడికి సింగన, మున్నగు కవీంద్రు లనేకు లీయుగమున జీవించి, మహాగ్రంధరచన కావించిరి. ఈ కవులను రెడ్డిరాజులును, వారి సామంత ప్రభువులును ఆదరించి, గౌరవించిరి. హరిశ్చంద్రోపాఖ్యానము. నవనాధ చరిత్ర అను ద్విపద కావ్యములను రచించిన గౌరన మహాకవి, సర్వనాయ కులకడ నుండెను. గ్రంథము నంకిత మొందుట సప్తసంతానములలో నొక్కటి యని ప్రాచీనులు తలంచిరి. దీనివలన నా పురుషుని పేరు లోకముచే విస్మరింపబడక, శాశ్వతముగ నుండునని భావము. ఈ దృష్టితో కూడ రెడ్డియుగమందు పలువురు గ్రంథముల నంకిత మొందిరి. ఈ కాలమున నష్టావధానము శతావధానము మున్నగు పాండితీ ప్రకటనా విధానములు వాడుకలో నుండెను. సమర్థులగు పండితులను రాజులు తగువిధముగ గౌరవించుచుండిరి. పాండిత్యము కాని, కవితాసామర్థ్యముకాని, లేక కేవల ముదరపోషణమునకై గ్రంథరచన కావించెడి ప్రజ్ఞాదరిద్రు లా యుగమున కొండవీటి పురమున కానవచ్చుచున్నట్లు శ్రీనాథుని చాటువులవలన దెలియ వచ్చుచున్నది.

రెడ్డియుగమందు దేశమున వివిధ పరిశ్రమలు నెలకొని అభి వృద్ధినిగాంచెను. ఆనాటి పరిశ్రమలన్నియును గృహాపరిశ్రమలేయని మనముజ్ఞప్తియందుంచుకొనవలయును. భారతదేశమునందితర రాష్ట్ర ములలో వలెనే, ఆంధ్రప్రాంతమునకూడ గ్రామములు స్వయంపోషక

ములుగను, స్వయంసమృద్ధములుగను ఉండెడివి. ప్రతిగ్రామమందును, కంసాలులు, కమ్మరులు, వ్రడంగులు, తాపీపనివాండ్రు, కంచరి పని వాండ్రు, కుమ్మరులు, సాలెలు. అద్దకపు పనివారు ఉండెడివారు. వీరిలో మొదటి అయిదుతరగతుల పనివారికి సాముదాయకముగ పంచాణమువారని పేరుండెడిది. తాము విశ్వకర్మ సంతతివారమని వీరు తలంచుచుండిరి. ఈ విశ్వకర్మలు ''ఆచార్'' ''ఒజ్జ''అను గౌరవ వాచకశబ్దముల తమ నామములతోపాటు వాడుట, ఈనాటికి మనము చూడవచ్చును. కావున వీరికి సంఘమున గౌరవస్థానము లభించి యుండెడిదని యూహింపనగును. ఈ యుగమందలి చేతిపనులలో ముఖ్యమైనవి బంగారునగలుచేయుట, వానియందు వివిధరత్నములు తాపటముచేయుట. మున్నగునవి. ఆనాటి విశ్వకర్మల నైపుణ్యమును, పనివిన్నాణమును, మహమ్మదీయ చారిత్రికుడగు ఫెరిస్తా మిక్కిలి కొనియాడియున్నాడు. రాజులును, ధనాఢ్యులును, దేవతా విగ్రహ ములయందు విలువగల రాళ్ళను తాపటము చేయించుటయు, దేవ స్థానములకు రత్నఖచితములగు పాత్రములు దానము చేయుటయు, ఆనాడు వాడుకగ నుండెను. రాగి, కంచు, ఇత్తడి, ఇనుము మున్నగు లోహములతో ఆనాటి పనివారు వివిధవస్తువులు సిద్ధపరచెడివారు. కంచుతో గంటలు, దీపపుస్తంభములు. దేవతా విగ్రహములును తయారుచేయుచుండిరి. వీనిని ప్రభువులు దేవస్థానములకు సమర్పించు చుండినట్లు వివిధ ప్రదేశములలో ప్రశంసింపబడినది. అల్లాడరెడ్డి కుమారుడగు వేమారెడ్డి, రాజమహేంద్రవరమందలి మార్కండేయ స్వామి ఆలయమునకు మిక్కిలి బరువైన యొక గంటను సమర్పించె నట. కఱ్ఱపై చక్కని పనితనమును చూపు వ్రడంగులు ఆకాలమున పెక్కురుండిరి. వారు పలు తెరగుల మంచములు, ఊయలలు, పెట్టెలు, దేవస్థానములకై రథములు, మున్నగువానిని చేయుచుండిరి. దంతపు పనియందుకూడ ఆనాటి తెనుగు పనివారు ప్రసిద్ధిచెందియుండిరి. బట్టలనేతకు ప్రాచీనకాలమునుండియు ఆంధ్రదేశము ప్రసిద్ధిచెంది యుండెను. ఏకులు వడకుట, దారముతీయుట, అనునవి ప్రతిగృహ మందును సాగుచుండెను. భోగియైన శ్రీనాథకవి పల్నాటిసీమయందు

విరివిగ కానవచ్చిన యీ పరిశ్రమను, తన చాటుపద్యములలో నపహాస్యము చేసెను. అద్దకము పనినికూడ ఈనాటి పారిశ్రామికులు విరివిగ చేయుచుండిరి. వారు కరక్కాయ, మంజిష్ఠ, లక్క, పసుపు మున్నగు పదార్థములతో రంగులు తయారుచేయుచుండిరి. నీలిరంగు చేయుట అనాదినుండియు మన భారతీయుల సొమ్ము. ఆనాడు వాడుకలోనున్న రంగులలో చెంగావి, నీలి, ఆకుపచ్చలు ముఖ్యములు. రెడ్డియుగమునాటి పారిశ్రామికులు కట్టెపలకలపై, అనేక మనోహరాకృతుల చెక్కించి, వానిని వస్త్రములపై అద్దుచుండిరి. మనదేశమందు సిద్ధమైన వస్త్రములు విదేశములకు విరివిగ ఎగుమతి యగుచుండెను.

ఈకాలమునందు వ్యాపారమునుగూర్చిన కొన్ని యంశములు మనకు తెలియవచ్చుచున్నవి. ఆప్రాచీనయుగమున రాజమార్గములు కొలదిగమాత్ర ముండెను. దక్షిణమున కాంచీపురమునుండి నెల్లూరు, ఓరుగల్లు పట్టణముల మీదుగా, ఉత్తరదేశమందలి అయోధ్యాపురికి పోవు గొప్ప రాజమార్గ మొకటి ఆకాలముననుండినట్లు, కేతన ఆంధ్ర భాషాభూషణమువలన తెలియుచున్నది. కాకతీయయుగమున నోరుగల్లు గొప్ప కేంద్రముగ నుండెను. దేశమందలి వివిధ నగరములనుండి యిచ్చటికి బాట లుండినట్లు తెలుపనచ్చును. అట్లే కందుకూరు, అద్దంకి, కొండవీడు, రాజమహేంద్రవరములను కలుపు బాటలుకూడ, ఈకాలమున నుండియుండును. వ్యాపారస్థులు తాము విక్రయింపదలచిన వస్తువులను సంచులలో నింపి, బండ్లపైనను, ఎద్దులపైనను వేసి, వివిధ ప్రాంతములకు కొనిపోవుచుండిరి. గోదావరి, కృష్ణ మున్నగు గొప్ప నదులను దాటుటకు పుట్టియనబడు పెద్దబుట్టలు వాడుకలో నుండెను. ఆకాలమున నదులపై వంతెనలు మున్నగునవి విశేషము లేనందున, వేసవికాలమందే వణిజులు తమ వ్యాపారమును సాగించుచుండిరి. దేశమున ననేకప్రాంతములు అరణ్యమయములై యుండినందునను, చోరబాధ విస్తారముగ నుండిన కారణముననును, వర్తకులు పలువు రేకమై, గుంపులు గుంపులుగా ప్రయాణము చేయుచుండెడివారు.

ఈవిధముగ నేర్పడిన స్నేహభావమే వర్తక సంఘముల స్థాపించుట యందు వారిని ప్రేరేపించెడిది. వివిధవ్యాపారములనడపు వర్తకులు, బలిజలు, తెలికి కులస్థులు మున్నగువారికి వేర్వేరు సంఘము లుండి నట్లు శాసనములు తెల్పుచున్నవి. ఈ సంఘము లీ యుగమందు మిక్కిలి పలుకుబడి కల్గియుండెను.

మిక్కిలి ప్రాచీనకాలమునుండియు, ఆంధ్రదేశపు వర్తకులు విదేశములతో నౌకావ్యాపారము చేయుచుండిరి. కాకతీయ యుగ మందు గణపతిదేవచక్రవర్తి యీ వాణిజ్యము నెట్లు పోషించినదియు తెలిసికొనియున్నాము. మహమ్మదీయులు కాకతీయ రాజ్యమును నాశనము చేసినందువలన, దేశమున నార్థికవ్యవస్థ చెడిపోయి, నౌకావ్యాపారము పూర్తిగా క్షీణించెను. కాని రెడ్డిరాజులు మరల దీని నుద్ధరించిరి. ప్రోలయవేముని సోదరుడు మల్లారెడ్డి ఆంధ్రదేశమున విఖ్యాతి గాంచిన మోటుపల్లి రేవును స్వాధీనపరచుకొనెను. ఆనాటి నుండియు, రెడ్డిరాజులు నౌకావ్యాపారమును మరల అభివృద్ధి నందించుటకై మిక్కిలి కృషిసల్పిరి. ప్రోలయ వేముని కుమారుడు అనపోతారెడ్డి యాజ్ఞచే, అతని ఉద్యోగియగు సోమయమంత్రి క్రీ. శ. 1358 వ సంవత్సరమున మోటుపల్లియందలి వీరభద్రేశ్వర స్వామి ఆలయమున నొకశాసనము వేయించెను. అరాచక పరిస్థితు లలో, మోటుపల్లిని విడిచి పారిపోయిన వర్తకులందరును తిరిగి రావలసినదనియు, వారి సౌకర్యమునకై ప్రభుత్వమువారన్ని యేర్పాటులను చేయుదురనియు అందు ప్రకటింపబడెను. విదేశవర్త కులను తా మేవిధముగను బాధింపమనికూడ ఆ శాసనమున రాజు వాగ్దానము చేసెను. ఈ శాసనము తెలుగుభాషలోను, తమిళభాష లోనుకూడ వ్రాయబడియుండుట, ముఖ్యముగా గమనింపదగినది. మోటుపల్లియందు తెనుగు వర్తకులును, ద్రవిడవర్తకులును కూడ ఆకాలమున నివసించియుండినట్లు దీనివలన వ్యక్తమగుచున్నది. రెడ్డిరాజులు కావించిన ప్రోత్సాహమువలన ఆంధ్రదేశమందలి నౌకావాణిజ్యము మరల అభివృద్ధిచెందెను. సముద్రయానముచేయు పడవల కానాడు వివిధనామములు వాడబడుచుండెను. అలికప్పలి,

# కొండవీటి సామ్రాజ్యము



కటకం
మహానది
గంజాం
ఉదయగిరి
జయపురం
పార్వతీపురం
రామగిరి
శ్రీకాకుళం
పాటూరు
సింహాచలం
యలమంచిలి
రాజమండ్రి
పిఠాపురం
ద్రాక్షారామం
పాలకొల్లు
మచిలీపట్టణం
మోటుపల్లి
కొండవీడు
కొండపల్లి
అమరావతి
బెల్లంకొండ
వినుకొండ
చందవోలు
అద్దంకి
శ్రీశైలం
త్రిపురాంతకం
కర్నూలు
ఆదోని
గుత్తి
కందుకూరు
ఉదయగిరి
అనంతపురం
కడప
పొత్తపినెల్లూరు
పెనుకొండ
చంద్రగిరి
తిరుపతి
చిత్తూరు
గోల్కొండ
నలగొండ
రాచకొండ
దేవరకొండ
వాడపల్లి
భద్రాచలం
ఓరుగల్లు
మెదకు
బీదరు
విజయనగరం
రాయచూరు
ముదుగల్లు
గద్వాల
అలంపురం
తుంగభద్రానది
కృష్ణానది
ఇంద్రావతినది
స్కేలు
0 32 64
మైళ్లు

జొంగు, వల్లి, వలిక, సమ్మ్రణ అనునవి. ఈ పేర్లు ఓడల పరిమాణము, అవి ప్రయాణముచేయు సముద్రములు, మున్నగువానినిబట్టి లభించు చుండెను. కాంచీపురమును కేంద్రముగా నిడికొని, వివిధప్రాంతములతో వ్యాపారసంబంధములు కల్గియున్న, యొక గొప్ప నౌకావర్తక కుటుంబమునుగూర్చి, రెడ్డియుగమునాటి గ్రంథములు తెల్పుచున్నవి. అది ప్రసిద్ధమైన అవచికుటుంబము. ఈ వంశములోని తిప్పయ్యశెట్టి కుమారగిరిరెడ్డికి సమకాలీనుడు, మిత్రుడు. ఈ వణిక్ఛ్రేష్ఠుడు మహాధనికుడే కాక గొప్పరసజ్ఞుడు. శ్రీనాథమహాకవి యీ తిప్పయశెట్టికి తన హరవిలాసము నంకిత మిచ్చెనని యీవరకే తెల్పియున్నాము. ఈ గ్రంథమునందు శ్రీనాథు డవచిదేవయ తిప్పన కావించెడి వ్యాపారమునుగూర్చి, అనేక వివరము లొసంగియున్నాడు. తిప్పయశెట్టి చీనా. సింహళము, సుమిత్రాద్వీపము, పారసీకము మున్నగు దూరప్రాంతములతో వ్యాపారముచేసి,బంగారము, ముత్యములు, కర్పూరము, ఇతర సుగంధద్రవ్యములు దేశములోనికి దిగుమతి చేయుచుండెడివాడట.

దేశమునకు ప్రాణాధారము వ్యవసాయము కావున దానిని ప్రోత్సహించుటకై, రెడ్డిరాజులు చాల కృషిచేసిరి. వారు దేశమున వివిధభాగములందు చెరువులను, బావులను త్రవ్వించిరి. కాలువలు నిర్మింపించిరి. పెదకోమటి వేమారెడ్డిభార్యయగు సూరాంబిక, సంతానసాగరమను చెరువును త్రవ్వించినట్లు ఫిరంగిపురము శాసనము తెల్పుచున్నది. ఈకాలమున నిర్మాణము కావింపబడిన చెరువుకట్టలు నేటికిని, గుంటూరు జిల్లాలోని సత్తెనపల్లి, వినుకొండ తాలూకాలలో కానవచ్చును. రెడ్డికాలమునాటి బావులు, కొన్ని యిప్పటికిని తూర్పుగోదావరి జిల్లాయందలి అమలాపురము, రాజోలు తాలూకాలలో చూడవచ్చును. వీనివలన ఈనాడుకూడ పోకతోటలును, కొబ్బరితోటలును పెంచబడుచున్నవి. పల్నాటితాలూకాలో ప్రవహించు నాగులేరునకు గామాలపాడు, శంకరపురము, దాచేపల్లి అను ప్రదేశములలో గొప్ప రాతికట్టలు కట్టి, నీటిని కాలువలద్వారా, ప్రజల [illegible]ంపచేయుచుండిరి. పెదకోమటి వేమారెడ్డి కుమారుడు

రాచవేముడు జగనొబ్బగండ కాలువ అను కాలువను త్రవ్వించెను. నిర్మింపబడిన తటాకములు చెడిపోకుండ కాపాడుచుండుటకై, ప్రభుత్వమువారు కొందరు రైతుల కుచితముగ భూమి నిచ్చి, వారిని తటాకాది సంరక్షణమునకు బాధ్యులుగ చేయుచుండిరి. వాపీకూప తటాక నిర్మాణములు సప్తసంతానములలో నొకటిగ ప్రాచీనులు భావించిన కారణమున, రెడ్డియుగమునాటి అధికారులును, ధని కులును, జమీందారులును. తమ స్వంతధనముతోకూడ ప్రజలకై నీటివసతులను కల్పించుచుండిరి.

ప్రజలకానందమును గూర్చుటకై, ఆకాలమున ననేకమార్గము లుండెను. ప్రభువులు, రాజకుటుంబమువారును, అధికారులును వేటకు పోవుచుండెడివారు. ఈ సందర్భమున వారు కుక్కలను, డేగలను వెంటబెట్టుకొని పోవుచుండిరి. కోడిపందెములు, పొట్టేళ్లయుద్ధములు, దొమ్మరి ఆటలు, మున్నగునవి ప్రజల యుబుసుపోకకై ప్రదర్శింప బడుచుండెను. పురాణశ్రవణ మా కాలమున బాగుగా వాడుకలో నుండెను. రెడ్డియుగమున వసంతోత్సవములు, మిక్కిలి వ్యాప్తి చెందెను. బహుశః ఈ యుత్సవములు శిశిరఋతువునందు జరుపు చుండిరి. ఆ సందర్భమున వెన్నెలరాత్రులలో, ప్రజలు పాటలు పాడుకొనుచు, ఊరంతయు తిరుగుటయే కాక, వినోదార్థ మొండొ రులపై గంధపునీరు, కర్పూరపరాగము, వసంతము చల్లుకొనుచు, విహరించుచుండెడివారు. కుమారగిరిరెడ్డి ఈ వసంతోత్సవముల వ్యాప్తిలోనికి తెచ్చి, వసంతరాయుడనియు, కర్పూర వసంతరాయు డనియు బిరుదనామముల వహించెను. ఈకాలమున యక్షగానము లను దేశీయ నాటకములు వ్యాప్తిలోనికి వచ్చెను. వీనిని "జక్కులు" అనువారు ప్రదర్శించుచుండిరి. జక్కులు ముఖ్యముగ శివమాహా త్మ్యమును బోధించు నాటకముల ప్రదర్శించెడివారు. మరికొంత కాలమునకు వైష్ణవమతము ప్రబలము కాగా, తన్మతప్రచారమునకై రాజులును, వైష్ణవాచార్యులును, భాగవతకథలను నాటకరూప ముగా వ్రాయించి, ప్రదర్శింపించుచుండిరి. ఇట్టి నాటక ప్రదర్శన

ముల కావించువారు భాగవతులైరి. వీరుకాక దేశీయవీరగాథ లగు పల్నాటి వీరచరిత్రము, కాటమరాజుకథ, ఎల్లమ్మకథ మున్నగు వానిని కొందరు ప్రత్యేక కుటుంబములవారు పాడుచుండిరి. కోలాట మును వేయుచును, బతకమ్మపాట, బొడ్డెమ్మపాట మున్నగువానిని పాడుచును, స్త్రీలు నాట్యము సల్పుట యానాటినుండి నేటివరకును కూడ సాగుచున్నది. విద్యాధికులు భరతముని ప్రసాదితమగు నాట్యము నభ్యసింపగా, సామాన్యప్రజలు దేశీయ నృత్య విధాన రీతుల కల్పించి, మానవ హృదయమందు నెలకొనిన సౌందర్యో పాసనాసక్తిని నెల్లడించుచుండెడివారు.



# ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి

## 18 వ ప్రకరణము

## విజయనగరయుగము

వర్ష ఋతువునందు కట్టలు త్రెంచుకొని, మహా ప్రవాహము తోడను, ప్రచండవేగముతోను జనావాసములపై పరతెంచునదీ జలము పోలిక, మహోత్సాహముతోడను, అకుంఠిత దీక్షతోడను, అద్భుత ధైర్యసాహసములతోడను, ధైర్యసాహసములకు తీసిపోవని శేముషీ ప్రాగల్భ్యముతోడను, దక్షిణాపథముపై వెల్లువవలె సాగి వచ్చిన యవన వాహినీ తరంగములకు, చెలియలికట్టయై నిలిచి సుమారు మూడు శతాబ్దముల కాలము. హైందవ మతమునకు పెట్టనికోటవలె, నిలువబడినది విజయనగరసామ్రాజ్యము. దక్షిణ మున సేతువునుండి ఉత్తరమున కటకమువరకును, ఆంధ్రపరాక్రమ మును చాటి విజయస్తంభముల ప్రతిష్ఠించినది విజయనగర సామ్రా జ్యము. ఆంధ్రభాషను, ఆంధ్రశిల్పమును చక్కగపోషించి, నూత్న పథముల త్రొక్కించినది విజయనగర సామ్రాజ్యము. ఈ యుగ మందు పరిశ్రమలు, వాణిజ్యము మున్నగునవి మిక్కిలి అభివృద్ధి చెందినందున ప్రజానీకమునకు కేవల సుఖజీవనమేకాదు భాగ్య భోగములుకూడ లభించెను. ఇట్టిస్వర్ణయుగమును తలంచుకొని, ప్రతి ఆంధ్రుడును గర్వింపదగును. విజయనగర యుగమందలి యొక విశిష్ట తను మనము మరువరాదు. ఈ విశాల సామ్రాజ్యమును పాలించిన రాజవంశములగూర్చి, పండితులలో అభిప్రాయభేదము కలదు. ఈ రాజన్యులలో సంగమవంశీయులు కర్ణాటకులో ఆంధ్రులో వివాదా స్పదమగు నంశము. కాని ఈ విశాలసామ్రాజ్యమున ఆంధ్ర కర్ణాటక ద్రావిడప్రజలు నివసించిరి. ప్రజలకు ప్రాధాన్యము నొసం గిన పక్షమున, నీ సామ్రాజ్యము నొక సమిష్టి అంతర్జాతీయ సామ్రాజ్యమని తెలుపవలసియున్నది. హారములోని నాయకమణి వలె వీరిని పాలించిన రాజులు వీరందరికంటె విశిష్టులై సమస్త పక్ష

ముల యెడలను సమబుద్ధితో వర్తించి, జాతీయాభ్యున్నతికై కృషిసల్పిరి. ఆధునిక యుగమువారు విజయనగర యుగము నుండి నేర్వవలసిన గుణపాఠములు పెక్కులు కలవు.

క్రీ. శ. పదునాల్గవ శతాబ్దియందలి ప్రథమపాదము దక్షిణాపథమందలి హైందవరాజ్యములపాలిటి ధూమకేతువు. క్రీ.శ. 1307వ సంవత్సరమున మహమ్మదీయులు దేవగిరి యాదవరాజును చెరపట్టిరి. 1310 వ సంవత్సరమున ద్వారసముద్రమందలి హొయసలరాజులను తురుష్కు లోడించి కప్పముగొనిరి. 1323 నందు కాకతీయ సామ్రాజ్య పాదపము యవన జైత్రయాత్రా కుఠారాఘాతములకు తట్టుకొన లేక కూలిపోయెను. ఈ విధముగ బలవత్తరమైన మూడు హిందూరాజ్యములు రెండు దశాబ్దముల కాలములో కూలిపోవుసరికి, హిందూ ప్రజలందరికిని గుండెలలో రాయి పడినట్లయ్యెను. వారు చుక్కాని లేనిపడవవలె కాలప్రవాహమున కొట్టుకొనిపోవలసినస్థితి యేర్పడెను. రాజు నిష్పక్షపాతియై, ప్రజారంజకముగ రాజ్యము చేసిన పక్షమున, హైందవప్రజలాతని కులగోత్రములనుకాని, మతసాంప్రదాయముల కాని యెక్కుడుగ. లక్ష్యము చేయరు. శాసన బద్ధవర్తనమునకును, రాజభక్తికిని హైందవ ప్రజలు పెట్టినదిపేరు. కాని యవనరాజులు మేకలవంటి హైందవులుకూడ బెబ్బులులుగ మారునట్లు వర్తించిరి. వీరు హైందవ ధర్మమును నశింప జేయుటకై కావించిన యత్నములను గూర్చియు, హైందవ ప్రజలను బాధించిన రీతులను గూర్చియు, మనము సూక్ష్మముగ వెనుకటిఅధ్యాయమున తెలిసికొనియున్నాము. మధురా విజయ కవయిత్రియగు గంగాదేవి యవనుల దురాగతముల వివరముగ వర్ణించి తుదకిట్లు పల్కెను. "ఏకవాక్యములో తెలుపవలసినయెడల మహమ్మదీయ విజృంభణ ఫలితముగ శ్రుతులకు అస్తమయము, నీతికి ప్రలీనత, ధర్మమునకు స్వస్తి, చరిత్రకుచ్యుతి, సత్కార్యములకు నిరతి, కులీనతకు నాశనము సంభవించినవి. కలి యొక్కటియే వీరి రాకవలన ధన్యత నొందినది." హైందవులకు వారి ధర్మము ప్రాణముకంటెను విలువగలది. కావున కంఠమున ప్రాణమున్నంత వరకును పోరాడి ధర్మమును రక్షించుకొన

వలయు నసుదృఢసంకల్పము, హైందవహృదయమున పాదు కొనెను. తూర్పుతీరమునను తెలంగాణము నందును, ప్రోలయ కాపయనాయకులు, డెబ్బదియిద్దరు ఆంధ్రనాయకుల తోడ్పాటుతో యవనసేనల నోడించి పారద్రోలిరి. రాయలసీమయందు, ఆర్వీటి సోమదేవరాజు తురుష్కులను పరాభవించి తరిమివైచెను. హైందవ ధర్మరక్షణమునే లక్ష్యముగా నిడికొని, రెడ్డివీరులును, పద్మనాయక ప్రభువులును రాజ్యములు నెలకొల్పిరి. పదునాల్గవ శతాబ్దియందలి హైందవరాజ్యములకు తలమానికమైన విజయనగరరాజ్యమును క్రీ. శ. 1336 వ సంవత్సరమున హరిహరుడు బుక్కరాయడు అను ఇర్వురు సోదరులు స్థాపించిరి.

విద్యానగర రాజ్యమును స్థాపించిన దాంధ్రులా కర్ణాటకులా లేక యితరులా యను విషయమునందు పండితుల కేకాభిప్రాయము కుదురలేదు. వీరిలో కొందరు విద్యానగరము హొయసల భల్లాళ రాజులచే తమ రాజ్యమున కుత్తరమున నిర్మింపబడిన గడిదుర్గ మనియు, దానిని నెలకొల్పిన హరిహరరాయలు, బుక్కరాయలును, బల్లాళుని ఉద్యోగులనియు తలంచుచున్నారు. కాని నేడీ వాదము నంగీకరించువారు తక్కువ. ఇప్పుడు సర్వసాధారణముగ నంగీకరింప బడుచున్న విజయనగర స్థాపన వృత్తాంత మీక్రిందివిధముగ నున్నది: బళ్ళారిజిల్లాయందు తుంగభద్రానది కుత్తరతీరమున ఆనగొంది యను పట్టణము కలదు. ఇచ్చట క్రీ. శ. 1320 ప్రాంతమున కంపిలి రాయలను నతడు రాజ్యము జేయుచుండెను. ఈ కాలమున ఢిల్లీ సామ్రాజ్యమును పాలించిన మహమ్మద్ తుఘ్లక్ అను నాతడు మహాక్రూరుడు. ఆతని మేనత్తకొడుకైన బహాఉద్దిన్ అను నాతడు ఢిల్లీశ్వరుని ఆగ్రహమునకు పాత్రుడై, పారివచ్చి, కంపిలిరాయని శరణుజొచ్చెను. తన మేనత్తకొడుకును తనవద్దకు పంపివేయ వలసినదని, ఢిల్లీశ్వరుడు పంపిన సందేశమును ఆర్తత్రాణపరాయణు డగు కంపిలిరాయడు లక్ష్యము చేయలేదు. అందులకు

కోపగించి తుఘ్లక్ చక్రవర్తి అపారమైన సేనను పంపి, కంపిలిరాయల నోడించెను. కంపిలిరాయలు రణరంగమునకు బలికాగా, ఢిల్లీశ్వరుడు ఆతని యనుచరులలో ఆర్గురిని చెరపట్టి, ఢిల్లీకి తీసికొనిపోయెను. వీరిలో కంపిలిరాయని మంత్రి హరిహరరాయలును, కోశాధ్యక్షుడు బుక్కరాయలును కలరు. ఢిల్లీశ్వరుని పక్షమున మలిక్ నాయబ్ అను నాతడు కొంతకాల మానగొందిని పాలించెను. కాని ఉత్సాహవంతులును, పరాక్రమశాలురు నగు ఆనగొంది ప్రజలు తురుష్కుల పాలన నంగీకరింపక, తిరుగుబాటు చేసిరి. మార్గాంతరము లేక ఢిల్లీశ్వరుడు హరిహరుని బుక్కరాయని విడుదలచేసి "మీరు నాకు సామంతులుగ ఆనగొందిని పాలింపు"డని వారిని పంపివేసెను. ఈ సోదరులు దక్షిణమునకు వచ్చి, ఆనగొందిలో కొంతకాలము పాలించి ఆపైన స్వతంత్రులైరి. హరిహర బుక్కసోదరులు వీరస్వర్గ మలంకరించిన కంపిలిరాయనికి బంధుకోటిలోనివారు. వీరి తండ్రి సంగముడు. కంపిలిరాయని కొలువులో చేరుటకు పూర్వము హరిహరుడును, ఆతని సోదరుడును కాకతీయరాజన్యుడగు, ప్రతాపరుద్రునికడ కోశాధ్యక్ష పదవియం దుండిరి. కాకతీయరాజ్యము నశించిన వెనుక వారు ఆనగొందికి వచ్చి అచ్చట కొలువు చేయసాగిరి. విజయనగరసామ్రాజ్య స్థాపనమును గూర్చిన ఆంధ్రకర్ణాటక వాదములకీపై యంశములు సమన్వయము వంటివని తెలుపనగును.

హరిహరరాయ డానగొందిలో రాజ్యము చేయుచున్న కాలముననే, విద్యానగర పట్టణము స్థాపింపబడెను. దానిని గూర్చిన గాథ మిక్కిలి ప్రసిద్ధమైనది. ఒకనాడు హరిహరుడును, ఆతని సోదరుడును తుంగభద్రానదిని దాటి, నదికి దక్షిణమున నున్న యడవిలో వేటాడుచుండిరి. ఆసందర్భమున వారు కుందేళ్లు వేటకుక్కలను తరుముచున్న యొక విచిత్ర దృశ్యమును గాంచిరి. అంతట వారు తమ పట్టణమునకు వెడలిపోయి, తమ గురువగు మాధవ విద్యారణ్యులకీ

విషయము నివేదింపగా విద్యారణ్యుడు తీవ్రముగా నాలోచించి, ఆ ప్రదేశము మిక్కిలి జయప్రదమైనదనియు, అచ్చట నొక నగరమును స్థాపించుట యుచితమనియు, హరిహరరాయనికి బోధించెను. గురుని ఆజ్ఞ ననుసరించి శా. శ. 1258 [క్రీ. శ. 1336] నందు హరిహర రాయడు తుంగభద్రానదికి దక్షిణతీరమున విద్యానగర ప్రతిష్ఠాపనము కావించెను. దీనికి విజయనగర మనునామాంతరము కలదు.

హరిహరరాయలకు గురువును, మంత్రియును హితబోధకుడు నైన మాధవ విద్యారణ్యునిగురించిన కొన్ని యంశము లీ సందర్భమున తెలుపుట అప్రస్తుతము కానేరదు. మాధవ విద్యారణ్యునకు గృహస్థాశ్రమమందు మాధవుడని పేరు. ఈయన ద్రావిడ బ్రాహ్మణుడు. వేదవేదాంగములను, శాస్త్రములను చదివిన మహా పండితుడు. అంతేకాక దేశభక్తియు, స్వజనానురక్తియు, రాజనీతి చతురతయు, నీ మహనీయుని పాండితీవిభవమునకు వన్నె పెట్టెను. ఈ మాధవుడు కొంతకాలమునకు నిస్సంగుడై, తురీయాశ్రమమును స్వీకరించి, శృంగేరీపీఠము నధిష్ఠించెను. ఈతడు లోకవ్యవహారముల యెడ వైరాగ్యము వహించియు, యవన విజృంభణము వలన శ్రౌత స్మార్తాది కర్మలు నశించుచుండుటయు, వేదమతమునకు గ్లాని సంభవించుటయు, చూచి సహింపజాలక, తన శిష్యులగు హరిహర బుక్కరాయల నొక హిందూ సామ్రాజ్యమును స్థాపింపవలసినదిగా ప్రోత్సహించినట్లు తెల్పుదురు. మాధవాచార్యునకు సాయణుడను సోదరు డుండెను. ఈ సోదరు లిర్వురును కూడి, శతాధిక గ్రంథముల రచించిరి. అందు శ్రౌతము, స్మార్తము, వేదాంతము, ధర్మశాస్త్రము, మీమాంస, జ్యోతిశ్శాస్త్రము, వైద్యము, వ్యాకరణము, చరిత్ర మొదలగు అన్ని విషయములపైనను వీరు గొప్ప గ్రంథములను రచించిరి. మాధవ సాయణులు కావించిన మహత్కార్యములలో వేదభాష్యమును వ్రాయుట మిక్కిలి ఘనమైనది. ఈ భాష్యమునకు సాయణభాష్య మని పేరు. ఈ మహదారంభమున వీరి కితర పండి

తులు సహాయపడినట్లు తెల్పుదురు. ఈ యతిశ్రేష్ఠుడు శతాధిక వర్ష ములు జీవించి క్రీ. శ. 1386 లో పరమపదమును పొందెను.

మాధవ విద్యారణ్యుని ప్రోత్సాహమున స్థాపింపబడిన విజయ నగర పట్టణ మా మునీంద్రుని బుద్ధికుశలత కొక గొప్ప తార్కాణము. ఈ ప్రదేశమున మతంగపర్వతము, అంజనపర్వతము, మాల్యవంతము, ఋష్యమూకము అను ప్రాచీన నామములు గల పర్వత పంక్తుల నంటి, తుంగభద్రానది ప్రవహించుచున్నది. విజయనగర పట్టణమునకు పూర్వ పశ్చిమములందు కృష్ణశిలా పర్వతపంక్తులును, దక్షిణమున రామదుర్గమను గుట్టలును, ఉత్తరమున కొన్ని పర్వతములు మాత్రమే కాక, నిరంతరవాహిని యగు తుంగభద్రానదియు ఉన్నందున, ఆ పట్టణ మొక నైసర్గిక దుర్గముగానుండెను. గుట్టలకు నడుమనున్న ప్రదేశములను విద్యానగర రాజులు రాళ్లతో పూడ్పించి, ఆ పర్వత పంక్తులను తమ కొక ప్రాకారమువలె కావించుకొనిరి. ఈ పట్టణమునకు చుట్టును ఏడు ప్రాకారము లుండెను. శత్రు దుర్భేద్యమగు నీ మహానగర మత్యున్నత స్థితియందు నాల్గుమైళ్ళ పొడవును, పదిమైళ్లు వెడల్పును కల్గి మహావైభవముతో వెలిగెను.

విజయనగర రాజ్యస్థాపకు డగు హరిహరరాయలు క్రీ. శ. 1336 నుండి 1355 వరకును రాజ్యపాలనము చేసెను. ఈతడు శత్రు రాజుల జయించి, రాజ్యమును విస్తరించెను. ఇతడు నేటి మైసూరు రాష్ట్రము, ఇతర కర్ణాటక మండలములు మున్నగువానిని వశపరచుకొని, అచ్చట రాజ్యము చేయుచున్న జైనప్రభువులను తనకు సామంతులుగ చేసికొనెను. బాదామి కోటను స్వాధీనపరచుకొని, దానిని బలపరచెను. కాని ఈ రాజు కాలమందే గుల్బర్గాపట్టణమున అలావుద్దిన్ హసన్ గంగూ బహమన్ షా అను నాతడు క్రీ. శ. 1347 వ సంవత్సరమున బహమనీ రాజ్యమును స్థాపించెను. విజయనగర బహమనీ రాజ్యములకు నిరంతర వైరములు సాగుచుండెను.

ఆధునిక చారిత్రక పరిశోధక ప్రముఖులలో నొకరైన డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు విజయనగర రాజ్య సంస్థాపనమును గూర్చి, ఇంచుమించు ఇవే యంశములు, కొన్ని ఇతర వివరములతో తెల్పుచున్నారు. క్రీ. శ. 1326 వ సంవత్సరమున మహమ్మద్ తుఘ్లక్ చక్రవర్తి ఆనగొంది రాజ్యమును జయించి, అచ్చటి రాజును సంహరించి, అతని పరివారములో కొందరిని చెరపట్టి, తీసికొనిపోయెను. అందు హరిహర బుక్కరాయ లనునుద్యోగు లుండిరి. ఆనగొందిలో ఢిల్లీశ్వరుని ప్రతినిధి రాజ్యము చేయసాగెను. బందీలుగ కొనిపోబడిన హరిహరుడును, బుక్కరాయలును ఢిల్లీయందు బలవంతమువలన మహమ్మదీయ మతమును స్వీకరింపవలసినవారైరి. కాని వీరి మహమ్మదీయ నామములు మనకు తెలియరావు. ఆనగొంది ప్రజ లనతి కాలములో, తమ మహమ్మదీయ పాలకునిపై తిరుగుబాటు చేసిరి. పన్నుల నిచ్చుటకు నిరాకరించిరి. ఇదే సందర్భమున పశ్చిమాంధ్ర దేశమున, యవనవినాశనమునకై పోరాడుచున్న ఆర్వీటి సోమదేవ రాజు, ఆనగొందెను పాలించుచున్న మహమ్మదీయ రాజప్రతినిధి నోడించి ''చెరపట్టి అతడు శరణాగతుడై యారువేల గుఱ్ఱములను కానుకలిచ్చి వేడుకొనగా నతనిని విడిచిపెట్టెను.'' పశ్చిమాంధ్ర ప్రజల సంపూర్ణసహకారము లభించినందున, సోమదేవరాజు యవన విజయము సంపూర్ణముగ చేయగల్గెను. దక్షిణాపథమందు తాను జయించిన భూభాగములు చేయిజారిపోవుచుండుట చూచి, ఢిల్లీశ్వరుడగు తుఘ్లక్ మరియొక పథకము పన్నెను. ఆంధ్రదేశ ప్రజలు మిక్కిలి స్వాతంత్ర్యప్రియులు. ఆత్మాభిమానము కలవారు. కావున వారిని పాలించుట కితర ప్రాంతములయందలి మహమ్మదీయులను పంపినయెడల, కార్యము చెడును. కావున ఆ దేశస్థులును, మహమ్మదీయ మతమును స్వీకరించినవారు నగు ఉద్యోగుల నచ్చటికి పంపిన పక్షమున, బహుశః ఆంధ్రప్రజల కెట్టి అభ్యంతరమును ఉండకపోవచ్చును. ఈవిధముగ చింతించి, తుగ్లక్ రాజు నూతనముగ నిస్లాము

మతప్రవిష్టులైన హరిహర బుక్కరాయల నానగొందికి రాజప్రతినిధులుగ నియమించి దక్షిణమునకు పంపెను.

హరిహరుడును బుక్కరాయలును ఆనగొందికి వచ్చి చేరిరి. కాని మహమ్మదీయ వినాశనమునకై దక్షిణాపథమున కాపయనాయకుడు, మూడవ భల్లాళరాజు, మున్నగువారి యాజమాన్యమున నేర్పడిన జాతీయసమితి, మిక్కిలి బలవత్తరముగనుండెను. జాతీయ సమితితో సంభవించిన మొదటి యుద్ధములలో హరిహర బుక్కరాయలకు పరాజయము సంభవించెను. వారికి పలాయనమే శరణ్యమయ్యెను. వారు అడవులబట్టి తిరుగుచు, పంపాక్షేత్రమున తపస్సు చేయుచున్న విద్యారణ్యమహామునీశ్వరుని సందర్శింపగా, ఆ మునిశ్రేష్ఠు డీ సోదరులపై యనుగ్రహము పూని, ధర్మోపదేశము చేసి, వారిని మరల హైందవమతములోనికి స్వీకరించెను. సేతువునకును కృష్ణానదికిని నడుమగల భూభాగమంతయు విరూపాక్ష దేవునికి చెందిన దనియు, ఆ దేశమును హరిహర సోదరులు స్వామికి ప్రతినిధులుగ పాలింపవలసిన దనియు, ఆదేశించి విద్యారణ్యుడు వారికి శ్రీ భండారమునుండి కావలసిన ధనము నిచ్చి, ఆశీర్వదించి, పంపివేసెను. ఈ పర్యాయము హరిహర బుక్కరాయ లానగొందిని స్వాధీనపరచుకొనిరి. విజయసూచకముగ వారు 1336 వ సంవత్సరమున విరూపాక్షదేవుని ఆలయమునకు సమీపమున విద్యానగరమును ప్రతిష్ఠించిరి.

క్రీ. శ. 1342 వ సంవత్సరమున మహమ్మదీయులు మూడవ భల్లాళరాజును మాయోపాయముచే జయించి, సంహరించిరి. మూడవ భల్లాళుని కుమారుడు నాల్గవ భల్లాళు డసమర్థుడు. సైన్యమును సిద్ధపరచుటకుకూడ ఆతనికడ ధనములేదు. ఈ యదనుచూచి హరిహరరాయడు భల్లాళరాజ్యము నంతను జయించెను. చిరకాలమునుండియు ఆనగొందె భల్లాళరాజ్యమునకు గల వైరమును, హరిహరుని రాజ్యకాంక్షయు ఇందులకు కారణములు. 1346 వ సంవత్సరమునాటికి విజయనగరరాజ్యము కృష్ణానదినుండి తొండమండలమువరకును,

పూర్వ సముద్రమునుండి పశ్చిమసముద్రమువరకును వ్యాపించెను. భల్లాళరాజ్యముతోపాటు విజయనగర రాజులకు వారి (భల్లాళుల) రాజకీయ బాధ్యతలుకూడ సంక్రమించెను. వానిలో ముఖ్యమైనది హిందూధర్మ సంరక్షణము, రెండవది మధుర నేలుచున్న మహమ్మదీయ రాజులతో యుద్ధము.

బుక్కరాయలు (1350-1377):—క్రీ. శ. 1350 వ సంవత్సరమున హరిహరరాయలు మరణించెను. ఆతనికి సంతానము లేనందున నాతని సోదరుడు బుక్కరాయడు రాజ్యమునకువారసుడయ్యెను. తనయన్న కాలమున నీతడు యువరాజుగ నుండెను. మంత్రిపదమును కూడ ఈతడే అలంకరించెనని చెప్పవచ్చును. బుక్కరాజు కాక కంపభూపతి, మారప్ప, ముద్దప్ప అను సోదరులు హరిహరరాయలకు చేదోడు వాదోడుగ నుండి రాజ్యనిర్మాణమునందు మిక్కిలి తోడ్పడిరి. బుక్కరాయలు రాజ్యాధికారమును బూనిన వెనుక, ఆతని సహోదరుడు కంపరాయని కుమారుడగు సంగముడు, నెల్లూరి మండలమును పాలించినట్లు శాసనమువలన తెలియవచ్చుచున్నది. బల్లాళ రాజ్యమును జయించిన తరువాత, విజయనగరరాజులకు మధుర సుల్తానులతో వైరము సంభవించెను. విజయనగరమునకు దక్షిణమున నెలకొనియున్న మహమ్మదీయరాజ్య మిది యొక్కటియే. మహమ్మదీయులను దక్షిణాపథమునుండి తరిమివేయవలెనని హిందూరాజులు కావించుకొనిన నిశ్చయము చాలవరకు కొనసాగెను. కాని పక్కలో బల్లెమువలె నీ మధురరాజ్య మింకను నిల్చియుండెను. మహమ్మదుబిన్ తుఘ్లకు క్రీ. శ. 1323లో మధుర పాండ్యరాజ్యమును జయించి, యచ్చట తన యనుచరు నొక్కని పాలకునిగ నియమించెను. క్రీ. శ. 1335 లో ఆతడు స్వతంత్రుడాయెను–ద్రవిడదేశమంతయు నితని యేలుబడిక్రింద నుండెను. మధుర రాజ్యమున యవనులు హైందవప్రజలపై జరిపిన దౌర్జన్యములు వర్ణనాతీతములు. వీనిని మధురావిజయమును వ్రాసిన కనయిత్రి వర్ణించెను. 1336 తరువాత విజయనగర రాజులు దాక్షిణాత్య హిందువులకు

రక్షకులుగ పరిగణింపబడసాగిరి. కావున మధుర సుల్తానుల దౌర్జన్యము నడగించి, హైందవ ప్రజలను కాపాడవలసిన బాధ్యత విజయనగర రాజులపై నుండెను. తత్ఫలితముగ 1351 వ సంవత్సరమున విజయనగర ప్రభువులకును మధుర సుల్తానులకును యుద్ధము ప్రారంభ మయ్యెను. మధురసుల్తానుతో యుద్ధము కావించి, ఆతని నోడించి మధురరాజ్యమును నాశనము చేసినవాడు బుక్కరాయల కుమారుడు కుమారకంపభూపతి, మధురావిజయకవయిత్రి కుమారకంపనుని భార్య. మధుర సుల్తానులతో ఇరువది సంవత్సరములపాటు యుద్ధము సాగినమీదట క్రీ. శ. 1371 నందు విజయనగర రాజులకు సంపూర్ణ విజయము లభించెను. మధురారాజ్య విజయమందు కుమారకంపనునికి సాళువమంగు అను సేనాని మిక్కిలి సహాయపడినట్లు జైమినిభారతమువలన తెలియవచ్చుచున్నది. కుమార కంపనుడు తురుష్కులనే కాక ఇతర హైందవరాజులనుకూడ జయించి విజయనగరరాజ్యమును మిగుల విస్తరించెను. తండ్రి జీవితకాలమున నీతడు రాజగంభీర మండలమునకు రాజప్రతినిధిగ పాలించెను. కుమారకంపనుడు బుక్కరాయనికి పూర్వమే క్రీ. శ. 1375 న మరణించినట్లు తెలియుచున్నది. ఈకాలమున సాధింపబడిన విజయమువలన విజయనగరరాజ్యము త్తరమున కృష్ణానదినుండి దక్షిణమున సేతువువరకును, తూర్పు పశ్చిమములయందు సముద్రమువరకును, వ్యాపించెను. ఈ విశాలరాజ్యమును బుక్కరాయని కుమారులు వివిధప్రాంతములలో నెలకొని రాజప్రతినిధులుగ పాలించుచుండిరి.

బుక్కరాజు తనరాజ్యమును విస్తరించుటయేకాక కోశాగారమును ధనప్రపూర్ణము కావించెను. ఈతని కాలమున విజయనగర పట్టణ మింకను అభివృద్ధి చెంది, అనేక దివ్యసౌధములతో విరాజిల్లెను. గోవా యను రేవుపట్టణ మీ కాలమున విజయనగర రాజుల యధీనమం దుండెను. ఆ కారణమున నీ రాజ్యములోని కితర దేశములనుండి వర్తకులు, తరచు వచ్చుచు పోవుచుండెడి వారు. బుక్కరాజు విఖ్యాతినివిని,సింహళము మున్నగు ద్వీపముల కధిపతులు

ప్రతి సంవత్సరమును, ఈతనికి వెలగల కానుకల బంపుచుండెడివారు. ఈ రాజు వైదికమతము నభిమానించి, తన గురువులగు మాధవసాయణులచే వేదభాష్యమును వ్రాయించెను. కాని యీతనికి పరమతముల యెడ ద్వేషము లేదు. ఈతని రాజ్యకాలమున నొక సందర్భమున శ్రావణ బెల్గోలాయందు జైనులకును, రామానుజ మతస్థులకును, తీవ్రమగు కలహములు సంభవించి, వైష్ణవులు జైనమందిరమగు గోమటేశ్వరాలయమును నష్టపరచిరట. అప్పుడు బుక్కరాయలు వీరిరువురను సమావేశపరచి, వైష్ణవులు జైనదేవాలయమును పునః నిర్మించునట్లు తీర్పుచెప్పి, వారికి సఖ్యత కల్గించెను. ప్రజ లీ రాజు నెడ మిక్కిలి అనురక్తులై యుండిరి.

రెండవ హరిహరరాయలు [1377-1404] ఈ రాజు బుక్కరాయని కుమారుడు. ఈతడు తన తండ్రులు వహించిన మహామండలేశ్వర బిరుదమును విడనాడి, మహారాజాధిరాజ, రాజపరమేశ్వర అను బిరుదావళిని గ్రహించుటచే, నీతని కనేక సామంతులుండిన ట్లూహింపవచ్చును. ఈ కాలమున మహమ్మదీయు లాదవాని దుర్గముపై దాడిచేసిరి. కాని వీరిని రాయలతమ్మునిపుత్రుడగు చెన్నప్ప ఒడయరు ఓడించి పారద్రోలెను. ఈతని కాలమున కొండవీడునందు కుమారగిరిరెడ్డియు, రాజమహేంద్రవరమున కాటయవేమారెడ్డియు, పాలనము చేసిరి. రెడ్డిరాజులు రెండవ హరిహరరాయనికి సామంతులుగ నుండలేదు. రాయలు రెడ్డిప్రభువుల బలిమిని గుర్తించి, తన కుమార్తెయగు హరిహరాంబను, కాటయ వేమారెడ్డికిచ్చి వివాహము చేసెను.

రెండవ హరిహరరాయనికడ మిక్కిలి సమర్థులగు మంత్రిపుంగవు లుండిరి. వీరిలో మాధవాచార్యుని సోదరుడగు సాయణాచార్యు డొకడు. రెండవమంత్రి గౌడబ్రాహ్మణుడగు మాధవమంత్రి. ఈ మాధవమంత్రి బుక్కరాయని కాలమున కూడ రాజసేవయందుండెను; ఈతడు గోవాపట్టణమును జయించెను. ఈ కాలమున ప్రసిద్ధిగాంచిన మూడవ మంత్రి ముద్దప్ప. ఈ మంత్రిపుంగవునిగూర్చి, శాసనములు మిక్కిలి కీర్తించుచున్నవి. ముద్దప్ప మిక్కిలి సమర్థు

డైన సేనానియనియు, అత డనేక రాజుల జయించెననియు, శ్రీరామ చంద్రుడు తన తండ్రియగు దశరథునుండి సుమంత్రుని పొందినట్లు, హరిహరరాయడు ముద్దప్ప మంత్రిని పొందినట్లు శాసనములు తెల్పు చున్నవి. రాయ లీతనిపై రాజ్యభారము నిడి, తాను నిశ్చింతగ కాలము గడపెనట. ముద్దప్ప ప్రజాక్షేమమునకై మిక్కిలి పాటుపడి నందున, ప్రజ లాతనియెడల మిగుల ననురక్తులై, రాజ్యకార్య నిర్వహణార్థము పన్నుల నొసంగెద మని తమంత తామే అంగీక రించిరట. ముద్దప్ప సేనానిని గూర్చిన శాసనములలో నొకటి క్రీ. శ. 1379 యందును, రెండవది 1382 నందును, వేయింపబడెను. హరిహరరాయల కడ ఇరుగప్పయను జైనమంత్రికూడ కొలువుండెను.

హరిహరరాయలు తన పూర్వులవలెనే వైదికమతమం దభి మానము చూపుచుండియు, పరమతములయెడ ద్వేషము వహింప లేదు. ఈతని రాజ్యకాలమున విజయనగరము మిక్కిలి అభివృద్ధిదశ యందుండెను. ప్రజ లీ రాజు ఆయురారోగ్యములకొరకై దానములు చేసి, శాసనములు వేయించుట చూడగా నీతడు మిక్కిలి ప్రజారంజక ముగ పాలనము చేసెనని తోచుచున్నది.

మొదటి దేవరాయలు (1404-1422) రెండవ హరిహరరాయనికి విరూపాక్ష, ఇమ్మడి బుక్క, దేవరాయ, నామధేయములు గల పుత్రులు ముగ్గురు కలరు. అతని యనంతరము వీరుముగ్గురును ఒకరి వెనుక నొకరు రాజ్యభారము వహించిరి; దేవరాయలు క్రీ. శ. 1404 వ సం॥ న పట్టాభిషిక్తుండాయెను. ఈతని కాలమున బహమనీ రాజ్యమునకును, విజయనగరము వారికిని, యుద్ధములు సంభవించెను. మొదటి యుద్ధము 1406 నందు సంభవించెను. ఈ యుద్ధములో దేవరాయ లోడిపోయి, తన కుమార్తెను బహమనీ సుల్తానునకిచ్చి, వివాహము చేసెనని ఫెరిస్తా యను మహమ్మదీయ చారిత్రికుడు వ్రాసిన వ్రాతలు విశ్వసనీయములు కావని యితరులు త్రోసిపుచ్చి నారు. రెండవ యుద్ధము 1416 నుండి 1419 వరకు సాగెను. ఈ యుద్ధములో బహమనీసుల్తాను ఫిరోజ్‌షా పానగల్లు (నేటి నల్లగొండ జిల్లాలోనిది) దుర్గమును ముట్టడింపగా, విజయనగరము

వారితో ఈతనికి వైరము సంభవించెను. ఇందు బహామనీ సుల్తాను సంపూర్ణముగ పరాభవింపబడెను. 1422 వ సంవత్సరమున సంభవించిన మూడవయుద్ధములో, ఏ పక్షమువారికినికూడ విశేషనష్టము సంభవించినట్లు కానరాదు.

ఈ రాయని రాజ్యకాలమున [1420 ప్రాంతమున] నికోలో కొంటియను ఇటలీదేశస్థుడు విజయనగరమును సందర్శించి, విజయనగరపట్టణమునుగూర్చియు, ఆనాటి ప్రజాజీవితమునుగూర్చియు అనేకవిషయముల వ్రాసియున్నాడు. దేవరాయలు ప్రజాహితమునకై మిక్కిలి పాటుపడెను. ఇతడు సంస్కృత, ఆంధ్ర కర్ణాటకభాషలను పోషించి కీర్తిని గాంచెను. మొదటి దేవరాయని పుత్రుడు విజయ బుక్కరాయలు. మొదటి దేవరాయల తరువాత అతని కుమారుడు విజయ బుక్కరాయ లొక సంవత్సరము మాత్రము రాజ్యపాలనము చేసెను. అతని కిరువురు పుత్రులును, హరిహరమ్మయను నొక కుమార్తెయు నుండిరి. హరిహరమ్మను సాళువ తిప్పరాజునకిచ్చి వివాహము చేసిరి. కుమారులలో జ్యేష్ఠుడు తండ్రి యనంతరము రెండవ దేవరాయ లనుపేరితో రాజ్యాధికారమును గైకొనెను.

రెండవ దేవరాయలు [1423-1446] విజయ బుక్కరాయల పుత్రుడైన ఈతడు, సంగమవంశరాజు లందరిలో శ్రేష్ఠుడని తెలుప వలసియున్నది. ఈతనికి ప్రౌఢదేవరాయలను నామాంతరమును, గజబేంట దేవరాయలను బిరుదనామమునుకూడ ఉండెను. ఈతని కేనుగువేటయనిన మిక్కిలి ఇష్టము. ఈ రాజు తన సైన్యవ్యవస్థను, సంస్కరించి సేనను బలపరచెను. ఆశ్వికసేనను, ధానుష్కులను, ఈతడు వృద్ధికావించెను. 1443 వ సంవత్సరమున విజయనగరము వారికిని, బహామనీ సుల్తానులకును, యుద్ధము సంభవించెను. ఈ యుద్ధమున ప్రౌఢదేవరాయ లోడి, మహమ్మదీయ రాజ్యమునకు కప్పము కట్టుట కంగీకరించెనని ఫెరిస్తా వ్రాసియున్నాడు. కాని అదేకాలమున విజయనగరమును సందర్శించిన, అబ్దుల్ రజాక్ అను తురుష్కయాత్రికుడు, గుల్బర్గానగరమును హైందవులు దాడివెడలి, కొందరు మహమ్మదీయులను చెరపట్టి తెచ్చినట్లు వ్రాసియున్నాడు

ఈ వ్రాతలను చూడగా పై యుద్ధమువలన నెట్టి నిశ్చితఫలితమును సంభవింపలేదని నిర్ణయింపవచ్చును. ప్రౌఢదేవరాయని కాలమున విజయనగరరాజ్యము విజృంభించి, కొండవీటి రెడ్డిరాజ్యమును జయించి స్వాధీనపరచుకొనెను. రాజమహేంద్రవరపు రెడ్లుకూడ వీరికి సామంతులుగ నుండుట కంగీకరించిరి. పై రాజ్యముల జయించుటయం దీతనికి తెలుగురాయడు, పంట మైలారరెడ్డి అను వారు చాల సహాయము కావించిరి. ప్రౌఢదేవరాయలు యుద్ధనిమగ్నుడయ్యు, ఎనుబదియైదుకోట్ల వరహాలధనమును తన కోశాగారమున జేర్చెనట. సిలోన్, పెగు, చైనాసెరిం మున్నగు దూరప్రాంతములందలి రాజులు, ప్రౌఢదేవరాయని స్నేహమును కోరి, ఆతనికి తరచు కానుకలను పంపెడివారు. పైన తెలుపబడిన ధనమేకాక, ఈ రాజు అసంఖ్యాకము లగు రత్నములనుకూడ సేకరించెను. ఈ రాజుకీర్తి దూరదేశములకు వ్యాపించెను. పారసీకచక్రవర్తియగు షారుఖ్ అను నాతడు [1443 నందు] అబ్దుల్ రజాక్ అను నాతనిని రెండవ దేవరాయనివద్దకు రాయబారిగా పంపెను. ఈ రాయబారి విజయనగర పట్టణము ఘనతనుగూర్చియు, రాయలయైశ్వర్యమునుగూర్చియు, విశేషముగ పొగడుచు, వ్రాతలు వ్రాసియున్నాడు. ఈతడు విదేశీయుడు కావున విజయనగర సామ్రాజ్యమునుగూర్చి యీతడు తెల్పిన యంశములు సంపూర్ణముగ విశ్వసనీయము లని మనము తలంపవచ్చును. ప్రౌఢదేవరాయలకాలమున జరిగిన యొక ముఖ్యాంశము నిచ్చట తెలుపవలసి యున్నది. ఈతనికాలమున కవిసార్వభౌముడైన శ్రీనాథుడు విజయనగర రాజ్యమును సందర్శించెను. ఈ మహాకవి తరచు దేశపర్యటనము చేయుచుండెడివాడు. ప్రౌఢదేవరాయని యాస్థానమున డిండిమ భట్టను గౌడపండితు డుండెను. ఈతడు మహావిద్వాంసుడు. తన యాధిక్యమును సూచించుటకై డిండిముడు కంచుఢక్కను మ్రోయింపించుచు సంచరించెడివాడు. శ్రీనాథున కీ డిండిమభట్టుతో శాస్త్రవాదము సంభవించెను. ఈ సందర్భమున రాయల గురువగు చంద్రభూష క్రియాశక్తి యను నాత డగ్రాసనాధిపత్యమును, మధ్యవర్తిత్వమును వహించెను.

ఈ తార్కిక యుద్ధమున డిండిమభట్టుపరాజితుడయ్యెను, ఆతని గర్వాపహరణమును గావించు నుద్దేశ్యముతో, శ్రీనాథుడు డిండిముని కంచుఢక్కను పగులగొట్టించుటయేకాక, ఇంతవరకును ఆతడు వహించిన కవిసార్వభౌమ బిరుదమును, తాను వహించెను. ప్రౌఢదేవరాయలు శ్రీనాథునెడ మిక్కిలిప్రీతుడై, ఆతనికి తన ముత్యాలశాలయందు దీనారములను బంగారు నాణెములతో, స్వర్ణాభిషేకము చేయించి గౌరవించెను. శ్రీనాథుడు ప్రౌఢదేవ రాయని దక్షిణాధీశ్వరుడని పేర్కొనెను.[1]

మల్లికార్జునరాయలు—విరూపాక్షరాయలు [1446–1465] [1465–1478] ప్రౌఢ దేవరాయని యనంతర మాతని కుమారుడు, మల్లికార్జునరాయ లిరువది సంవత్సములపాటు రాజ్యముచేసెను. ఈతని కాలమున దేశమున శాంతి నెలకొనెను. మల్లికార్జునుడు దానశీలు డని పేరుగాంచెను. ఇతని కాలమున ఉత్కళ సూర్యవంశ గజపతియైన కపిలేశ్వరుడు ప్రబలుడై, విజయనగర సామ్రాజ్య ముపై దండెత్తివచ్చి, కొండవీడు ఉదయగిరి రాజ్యములను జయించి, స్వాధీనము చేసికొనుటయేకాక, కావేరీపర్యంతము విజయవంతముగ జైత్రయాత్ర సాగించి, రాయసామ్రాజ్యమున గొప్పసంక్షోభమును గల్గించెను. మల్లికా ను డసమర్థుఁ డగుటవలన, దండయాత్రలను ప్రతిఘటింప జాలఁడాయెను; గజపతి దండయాత్ర తరువాత, ఇతడు స్వల్పకాలమురాజ్యము పాలించి,మృతినొందెను. ఈతనికి రాజశేఖరుఁ డను కుమారుడొక డుండెను. కాని ఈతని యనంతర మా పుత్రుడు రాజు కాలేదు, ఇతని పినతండ్రి కుమారుఁడైన విరూపాక్షుడురాజ్యము నాక్రమించెను. ఈ రాజు దుష్టుడును, విషయలంపటుడును, సురా పానమత్తుడు నై, రాజ్యకార్యములయెడ నశ్రద్ధవహించెను. గోవా పట్టణములోని తురుష్కవర్తకులు, ఉత్తమములగు అరబ్బీ పారసీక

1. శ్రీనాథుని గౌరవించినది మొదటి దేవరాయలని డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారు తలంచుచున్నారు. చూడు. వ్యాసము చంద్రభూష కియాశక్తి—భారతి, అక్టోబరు—1945.

గుఱ్ఱములను, తన కీయక బహామనీ సుల్తానుల కొసంగుచున్నట్లు తెలిసికొని, విరూపాక్షు డుగ్రుడై, వారి నందరను చంపించెనట. అంతట బహామనీరాజుల మంత్రి ఖ్వాజామహామూద్ గావాన్ అను నాతడు, గోవాపై దండెత్తివచ్చి, ఆ పట్టణమును స్వాధీన పరచుకొనెను. విరూపాక్షు నాతనిసోదరుడగు రాజశేఖరరాయలు చంపించి, కొన్ని నెలలు మాత్రము రాజ్యముచేసెను. ప్రజలితనియెడ మిక్కిలి అసంతుష్టులైరి. ఈయదనున ప్రజారంజకుడగు నీతని సేనాని, సాళువ నరసింహరాజు రాజశేఖరుని వెడల నడచి, తానే రాజయ్యెను. ఇంతటితో సంగమ వంశము నశించెను.

సాళువవంశము:—ప్రౌఢరాయలను సింహాసనమునుండి తొలగించి, రాజ్యాధికారమును పూనిన నరసింగరాజు సాళువవంశమునకు చెందినవాడు. కుమార కంపనునికి మధురావిజయమున తోడ్పడిన యోతి డి సాళువవంశమునకు చెందిన మంగిరాజు. సాళువమంగు మనుమడు గుండరాజు. గుండరాజు సోదరుడగు తిప్పరాజు మొదటి దేవ రాయల మనుమరాలగు హరిహరమ్మను వివాహమాడెను. ఈ విధమున సాళువవంశమువారికి, సంగమవంశీయులతో బంధుత్వమేర్పడెను. సాళువ గుండరాజు కుమారుడు నరసింగరాజు. సాళువ నరసింగరాజు మల్లికార్జునరాయలకాలమునుండియు, దక్షిణదేశమున రాజప్రతినిధిగ నుండెను. ఈతని ముఖ్యస్థానము చంద్రగిరి. ఉత్కళ దండయాత్రవలన, విజయనగరరాజ్యము మిక్కిలి క్షీణదశ నందెను. కాని సాళువ నరసింగరాజు తాను స్వయముగ రాజ్యాధికారము పూనిన వెనుక, సామ్రాజ్యమును పునరుద్ధరించెను.

సాళువ నరసింగరాజు [1485–1491] ఈతడు మల్లికార్జున రాయలకాలమున విజయనగరమువారు కోల్పోయిన ప్రాంతములు మరల గెల్చెను. నరసింగరాజు కటకాధీశ్వరుడగు గజపతిని, దక్షిణదేశపురాజులను జయించెననియు, పెనుగొండ దుర్గమును సాధించెననియు, మహమ్మదీయుల పరాజితుల గావించెననియు సాళ్వాభ్యుదయ కావ్యమువలన తెలియుచున్నది. కాని ఉదయగిరి, కొండవీడు

రాయచూరు, అను దుర్గములను మాత్రమీతడు వశపరచుకొనజాల డయ్యెను. సాళువనరసింగరాజు తన సైన్యమును మిక్కిలి బలపర చెను. నరసింగరాజుకడ నాదెండ్లచిట్టి గంగనామాత్యుడను, ఆంధ్ర నియోగి బ్రాహ్మణుడు మంత్రిగా నుండెను. సాళువ నరసింగరాజు తన కవసానకాలము సమీపించు తరుణమున, తన సేనానాయకుడగు తుళువ నరసనాయకుని రావించి, అల్పవయస్కులగు తన కుమారుల నాతని కప్పగించి, వారిని జాగ్రత్తగా కాపాడవలయునని కోరెను. నరసింగరాజు మరణించిన వెనుక, నామమాత్రమున కాతనిపుత్రులు పదిసంవత్సరములపాటు రాజ్యము చేసిరి. కాని యీకాలమున నిజ ముగ రాజ్యాధికారము నెరపినవాడు, తుళువనరసనాయకుడు. సాళువ నరసింహుని జ్యేష్ఠపుత్రుడు కొంతకాలము రాజుగ నుండెను. ఆతని నెవ్వరో చంపివేయగా, నరసనాయకుడు సాళువనరసింహుని రెండవ కుమారుని గద్దెనెక్కించి, మరికొంతకాలమున కాతని తొలగించి, తానే రాజ్యభారమును పూనెను.

తుళువ వంశము :—ఈ తుళువవంశమువారు తుళుప్రాం తమునుండి వలసవచ్చి, ఆంధ్రదేశమున స్థిరనివాసము నేర్పరచు కొనినవారు. తాము చంద్రవంశపు క్షత్రియులమని వీరు చాటుకొనిరి. ఈ వంశమున నీశ్వరనాయకుడను నాతడు ప్రసిద్ధినిగాంచెను. ఈతడు సాళువ నరసింగరాయలకడ సేనానాయకుడుగ నుండి పెక్కు దుర్గ ములను జయించినట్లు వరాహపురాణము తెల్పుచున్నది. ఈశ్వర నాయకునికుమారుడు నరసనాయకుడు తండ్రివలెనే గొప్ప వీరుడు. సాళువనరసింహరాజున కీతడు దండనాథుడుగను, మంత్రిగను ఉండెను. నరసనాయకునికి ముగ్వురు భార్యలు. వారిలో తిప్పాంబికకు వీరనరసింహరాయడు జన్మించెను. ఈతడు తనతండ్రి మరణించిన వెనుక [1503] రాజ్యసింహాసన మాక్రమించి, యైదాఱు సంవత్సర ములు మాత్రము పరిపాలించెను. ఈతనికడ ననన్యసామాన్య శేముషీ ధురంధరుడగు, సాళువతిమ్మయ్య అను మంత్రిసత్తము డుండెను. ఈ తిమ్మయయే మంత్రి తిమ్మరుసు పేరితో గొప్ప ఖ్యాతి గాంచెను. వీరనరసింహరాయలు క్రీ. శ. 1509 వ సంవత్సరమున

మరణింపగా, తుళువ నరసరాజు రెండవభార్య నాగలాంబిక కుమారుడగు కృష్ణదేవరాయడు, రాజ్యమున కధికారియయ్యెను. కృష్ణరాయనికి అచ్యుతరాయడును, రంగరాజు ననుఇర్వురు సవతితమ్ములుండిరి. వీరు నరసనాయకుని మూడవ భార్య ఓబాంబిక పుత్రులు.

కృష్ణదేవరాయలు [1509-1530] కృష్ణదేవరాయలు విజయనగరరాజ్యమును పాలించిన ప్రభువులలో నుత్తమోత్తముడు. ఇంతే కాదు, భారతదేశమును పాలించిన గొప్ప రాజులలో నీతడొక్కడు. ఈ రాజు మహాశూరుడై, అపజయమనునదియెఱుంగక, శత్రువినాశనము కావించెను. కృష్ణరాయలు స్వయముగ గొప్ప విద్వాంసుడు. రాజనీతిజ్ఞుడు. ఈ రాజువ్రాసిన ఆముక్తమాల్యద యీతని పాండిత్యమునకును, లోకజ్ఞతకును, గొప్ప నిదర్శనము. ఈత డనేక విద్వాంసులను పోషించెను. వారిచే గొప్ప కావ్యముల రచింపజేసెను. ఇతర లలితకళలను కూడ ఈతడు పోషించెను. ఏ విధముగ చూచినను, కృష్ణదేవరాయలు భారతదేశచరిత్రయందత్యున్నతస్థానమును పొందదగియున్నాడు.

కృష్ణదేవరాయలు రాజ్యమున కధిపతియగుసరి కింకను పిన్న వయస్సువాడు. ఈతని సవతి యన్నయగు వీరనరసింహరాయ లీతని చంపించుటకై ప్రయత్నింపగా, తిమ్మరుసుమంత్రి యీ రాజును రక్షించెనని తెల్పుగాథలు కొన్ని కలవు. కృష్ణదేవరాయలు నరస నాయకుని కొక భోగకాంతయందు జన్మించినవాడని, కొందరివాదము. కాని యిందులకు ఆధారము లేమియు లేవు. అంతేకాక తిప్పాంబ, నాగలాంబలను నరసనాయకుని పత్నులకు, కౌసల్యా, సుమిత్రలకు రామలక్ష్మణు లుదయించినట్లు వీరనరసింహరాయడును, కృష్ణదేవ రాయడును జన్మించినట్లు వీరనరసింహరాయనిచే వేయింపబడిన యొక శాసనమే తెల్పుచున్నది. కృష్ణదేవరాయలు తుళువవంశీయుడగుట సత్యమేకాని, ఈతని తండ్రి తాతలు చిరకాలము తెనుగు దేశమునందే నివసించుచుండుటచే, వీ రాంధ్రమునే మాతృభాషగ స్వీకరించి యుందురని చారిత్రికులు తలంచుచున్నారు.



కటకమునుంచి కన్యాకుమారి అగ్రమువరకు ఏకచ్ఛత్రాధిపతిగా
ఏలిన శ్రీ కృష్ణదేవరాయలు.

కృష్ణరాయలు సింహాసన మధిష్ఠించునాటికి, రాజ్యపు పరిస్థితు లేమంత సంతృప్తికరముగ లేకుండెను. విజయనగర రాజ్యమున కుత్తరమున గజపతులు బలవంతులై, ఇందలి కొన్ని ప్రాంతముల స్వాధీనపరచుకొనిరి. దక్షిణమున ఉమ్మత్తూరు నాయకులు రాయని యధికారమును ధిక్కరించి, స్వతంత్రులై యుండిరి. రాజ్యమునకు వచ్చిన రెండు సంవత్సరములవరకును, కృష్ణదేవరాయలు యుద్ధము మాట తలపెట్టక, తన సైన్యమును మాత్రము బలవత్తరము కావించుకొనసాగెను. ఇందీతనికి మహామంత్రియైన తిమ్మరుసు మిక్కిలి సహాయపడెను. ఈ విధమున యుద్ధప్రయత్నములు చేసి, క్రీ. శ. 1512 నందు కృష్ణరాయలు దక్షిణదేశ విజయమునకై బయలుదేరెను. రాయలు మొదట ఉమ్మత్తూరు రాజుపై తన సేనను నడపెను. ఈ దుర్గ ముమ్మత్తూరు రాజ్యమునకు రాజధాని. కృష్ణ రాయ డీ దుర్గమును స్వాధీనపరచుకొని, కోటగోడలను నేలమట్టము చేసెనట. ఆపైన నీ రాజు శివసముద్రము కోటపై తన సేనల బంపెను. ఇది కావేరీనదియొక్క రెండు పాయలకు నడుమ నెలకొని, పర్వతావృతమైన యొక దుర్భేద్యస్థానము. ఉమ్మత్తూరు రాజగు గంగరాజిందు దాగుకొని, యొక సంవత్సరము వరకు, రాయల ప్రతిఘటించి తుద కోడిపోయెను. పారిపోవుటకై యత్నించి, ఈ గంగరాజు గంగశుచియను మడువులోపడి మరణించెను. ఈ రెండు దుర్గములు పట్టుపడుటతో, కర్ణాటక ప్రాంతమంతయు రాయల వశమయ్యెను. అయినను కొందరు పాళెగాండ్రింకను రాయల ధిక్క రించి, స్వతంత్రులై యుండుటచే, కృష్ణరాయడు శ్రీరంగపట్టణము కోటపై, తన సేనల నడిపి, దానినికూడ వశపరచుకొనెను. ఇంత టితో దక్షిణదేశమున రాయల యధికారము స్థిరపడెను. ఈసందర్భ మున కృష్ణదేవరాయలు శ్రీరంగపట్టణమును, కర్ణాట రాజ్యమునకు కేంద్రముగ కావించెను. తాను జయించిన కర్ణాటక ప్రాంతమున నతడు కెంపగౌడడు, వీరప్పగౌడడు, అను పాళెగాండ్రను తనకు సామంతులుగ నియమించుటయే కాక, ఆయా ప్రదేశములందు చిన్న పాళెగాండ్రను, స్థానిక పరిపాలకులుగ నేర్పాటు చేసెను.

తరువాత కృష్ణరాయలు తన సేనల నుత్తరదిశకు నడపెను. ఇచ్చట కటకాధీశులగు గజపతులు బలవంతులై, ఉదయగిరి, కొండవీడు, కొండపల్లి మున్నగు దుర్గముల స్వాధీన పరచుకొని యుండిరి. ఇది విజయనగరము వారికి చిరకాలమునుండి గొప్ప యవమానముగ నుండెను. క్రీ. శ. 1513 వ సంవత్సరమున కృష్ణ రాయలు పూర్వదేశవిజయమునకై, మహాసన్నాహముతో, బయలుదేరెను. ఈతడు మొదట సాధించినది ఉదయగిరి దుర్గము. ఇందు తిరుమలరాహుత్తరాయడు పాలకుడుగ నుండెను. రాయలాతని నోడించి పాఱదోలి, యా దుర్గము నాక్రమించుకొనెను. [1514]. ఆపైన రాయలు శత్రుదుర్భేద్యమైన కొండవీటి దుర్గమునకు ముట్టడివేసెను. రాయులదండయాత్రను గూర్చి విని, కటకాధీశ్వరుండగు గజపతి గొప్ప సైన్యసన్నాహముతో వచ్చి, కృష్ణానదియొడ్డున విడిసెను. రాయ లాతనిపై తన సేనల నడపి ఘోరయుద్ధము చేసి, గజపతి నోడించి పారద్రోలెను. ఆపైన బలిష్ఠమగు కొండవీటిదుర్గము రాయల స్వాధీనమయ్యెను (1515). ఇదే సందర్భమున రాయలు బెల్లముకొండ, నాగార్జునకొండ, అద్దంకి మున్నగు దుర్గముల సాధించెను. ఈ దండయాత్రయందు కృష్ణరాయలు అమరావతీపట్టణమందలి అమరేశ్వరుని, విజయవాడను, దర్శించి అచ్చట దేవాలయములకు దానములు చేసి, శాసనములు వేయించెను. విజయవాడ సమీపమున నున్న శ్రీకాకుళ క్షేత్రమునందలి, ఆంధ్ర విష్ణుదేవుని సందర్శించిన సందర్భమునందే రాయలకు 'ఆముక్తమాల్యద'ను వ్రాయుటకై భగవదాదేశమయ్యెను. బెజవాడనుండి ముందునకు సాగి, రాయలు కొండపల్లి దుర్గమును ముట్టడించి, ఉత్తరాభిముఖుడై పోయి తెలంగాణమును ప్రవేశించి, యందు గజపతుల పాలనక్రింద నుండిన దుర్గములను, రాష్ట్రమును స్వాధీనపఱచుకొనెను. ఈ సందర్భముననే రాయలకు గజపతుల సామంతుడును, మహావీరుడునైన షితాబుఖాను అనబడిన సీతాపతితో యుద్ధము సంభవింపగా, రాయ లాతని నోడించెను. తరువాత తీరాంధ్రప్రదేశము నంతను స్వాధీనపరచుకొని, రాయలు విశాఖపట్టణము జిల్లాలోని, పొట్నూరి

వద్ద జయస్తంభమును నాటి, సింహాచలమును చేరి, అచ్చుట స్వామిని సేవించి, కటకమువరకును పోయి ఆ పట్టణమును నష్టపరచి 1515 నందు విజయలక్ష్మీసమేతుడై విజయనగరమునకు మరలెను. అనతి కాలమున గజపతికిని, రాయలకును సంధి జరిగెను. రాయలు గజపతి కుమార్తెను వివాహమాడి, ఆతనికి కృష్ణానది కుత్తరమున నున్న దేశము నంతను మరల ఇచ్చివేసెను.

కృష్ణదేవరాయలు సాధించిన మరియొక విజయము యవన రాజులకడనుండి రాయచూరు దుర్గమును వశపరచుకొనుట. ఈ దుర్గమును జయింపవలెనని రాయలకు చిరకాలమునుండి కోరిక యుండెను. ఇది కృష్ణా, తుంగభద్రానదులకు నడుమ నెలకొనియున్న బలిష్ఠ మగుకోట. ఈ కాలమున దానిని బిజాపురసుల్తాను పాలించు చుండెను. క్రీ. శ. 1520 వ సంవత్సరమున రాయలు గొప్ప సేనా సన్నాహముతో, రాయచూరును ముట్టడించి, ఆదిల్ షాతో ఘోర యుద్ధముచేసి, కోటను స్వాధీనపరచుకొనెను. యవనులు పారిపోయిరి. ఈ సందర్భమున రాయలు బిజాపురమువరకును పోయి ఆపట్టణమును ధ్వంసము చేసెను. మహావీరుడైన ఈ రాజు ఇరువది సంవత్సరములు మాత్రము రాజ్యముచేసి 1530 యందు కీర్తిశేషుడయ్యెను. రాయల కాలమున విజయనగరసామ్రాజ్యము మిక్కిలిఉన్నతదశ నందగలైను. ఇందులకు రాయల మహామంత్రియైన తిమ్మరుసు చాలవరకు కార ణము. కృష్ణరాయల విద్యాపోషణము, ఆతడు కావించిన నిర్మాణ ములు మున్నగు నంశములగూర్చి మనము స్థలాంతరమున తెలిసికొన గలము.

కృష్ణదేవరాయలు విజయనగరమున రాజ్యపాలనము సేయు చున్న కాలమందు దక్షిణాపథమందలి యేకైక మహమ్మదీయప్రభుత్వ మగు బహమనీ రాజ్యములో చీలికలు పుట్టెను. క్రీ. శ. 1482 నుండి 1518 వరకు సుల్తానుగానున్న మహమూదుషా యనంతరము బహ

మనీరాజ్య మైదు చిన్న రాజ్యములుగ చీలిపోయెను. ఇందు బిజాపుర మును రాజధానిగ చేసికొని, ఆదిల్ షాహీలును, అహమ్మదు నగరమును కేంద్రముగ కావించుకొని, నిజామ్‌షాహీలును, గోల్కొండ ముఖ్య పట్టణముగా కుతుబ్ షాహీలును, బీదరు రాజధానిగ బరీదుషాహీలును రాజ్యపాలనము కావించిరి. బిరారునందు మరియొక రాజవంశము ఇమాద్ షాహీ లను పేరితో నేర్పడెను. బహమనీ రాజ్యమవిభక్త ముగనున్నప్పుడే, అయ్యది విజయనగర సామ్రాజ్యముతో తులతూగ జాలకుండినప్పుడు, ఈవిధముగ చీలిపోయిన చిన్న రాజ్యములు విజయ నగరముతో సాటిరాకుండెనని వేరుగ తెలుపనక్కర లేదు. అందులకు తోడు, ఈ చిన్న సంస్థానపాలకులు తమలో తాము తరచు కలహించు కొనుచు, ఒండొరుల రాజ్యముల నాక్రమింపవలెనని యత్నించుచు, అప్పుడప్పుడు విజయనగర రాజుల సహాయమును కోరుచుండిరి. కాని సమయము వచ్చినప్పుడు. వీరు తమ అంతఃకలహములను మరచి, ఏకముకాగల మారదృష్టి కల్గియుండినట్లు మనము ముందు చూడ గలము.

కృష్ణదేవరాయల యనంతర మాతని సవతితమ్ముడగు అచ్యుత రాయలు రాజయ్యెను (1530-1542). ఈతని కాలమున దేశము మొత్తమువిూద శాంతి ననుభవించెనని తెలుపవచ్చును. ఒకానొక సందర్భమున విజయనగర రాజులకును, కేరళదేవాధీశ్వరునికిని యుద్ధము సంభవించెననియు, అందు అచ్యుతరాయని సేనలు చంద్రగిరి, తిరుపతి, కాళహస్తి, కంచి, తిరువణ్ణామలై మున్నగు పట్టణముల జయించి, దక్షిణమున తిరువడ్డివరకుగల దేశమును స్వాధీనపరచుకొనినట్లును, అచ్యుతరాయాభ్యుదయ కావ్యము తెల్పుచున్నది. ఈతనికాలమున బిజాపూరు ఆదిల్ షారాజు రాయచూరు ముదగల్లులను స్వాధీనపరచు కొన్నట్లు ఫెరిస్తా వ్రాసియున్నాడు. కాని మరికొందరీయంశము నంగీక రింపక, ఆదిల్‌షా ఈ దుర్గములను ముట్టడించి యుండవచ్చుననియు, కాని ఆతని కందు విజయము లభింపలేదనియు తలంచుచున్నారు. అచ్యుతరాయని పరిపాలనాకాలమున నాతని స్యాలకుడు సలకము తిమ్మయ మంత్రిగ నుండి రాజ్యకార్యముల నిర్వహింపగా, రాయలు

సుఖముగా కాలము పుచ్చుచుండెడివాడు. ఈ రాజు కృష్ణదేవరాయలచే సంపాదింపబడిన విశాలసామ్రాజ్యమును పాలించి వైభవముగ జీవించిన అదృష్టశాలి.

సదాశివరాయలు : [1542-1570]. అచ్యుతరాయడు మరణింపగా అల్పవయస్కుడగు నాతని కుమారుడు వేంకటరాయడు రాజ్యాభిషిక్తుడయ్యెను. కాని అధికారమంతయు అతని మేనమామ యగు సలకము తిమ్మయయే వశపరచుకొనెను. మరికొంతకాలమునకు మేనల్లుని చంపించి, తిమ్మయ్యయే రాజయ్యెను. తనకు తోడుగనుండునని యీతడు బీజపూరు నవాబు సహాయ మర్థించెను. సలకము తిమ్మయ్య అధికారమును, ఆతని పన్నాగములును, రాజ్యమందలి మరియొక కక్షవారికి రుచింప వయ్యెను. ఈ పక్షమున కార్వీటి రామరాజు నాయకుడు. ఈతడు సుప్రసిద్ధుడగు కృష్ణదేవరాయని కల్లుడు. సలకము తిమ్మయ్య పక్షమునకును, రామరాజు పక్షమునకును, ఏర్పడిన పోటీలో రామరాజే తుదకు తిమ్మయ్యను, తుంగభద్ర తటమున యుద్ధమున వధించి, విజయమును గాంచెను. అంతట రామరాజు అచ్యుతరాయల అన్న కుమారుడగు సదాశివరాయలను నామమాత్రమునకు రాజును కావించి, ఆతని పేరున మిక్కిలి వైభవముతో ఇరువదిమూడు సంవత్సరములు రాజ్యచక్రమును త్రిప్పి, తుదకు వీరమరణము నందెను. రామరాయలు రాజ్యాధికారమును పూనినప్పటి నుండియు, తుళువ వంశము వెనుకబడి, ఆర్వీటివంశము విజయనగర రాజ్యాధిపత్యమును గ్రహించినట్లు తెలుపవచ్చును.

ఆర్వీటివంశము : ఈ వంశమువారు తాము చంద్రవంశపు క్షత్రియులమని తెల్పుకొనుచుండిరి. వీరు ఆర్వీటిని ముఖ్యపట్టణముగా గల సామంతులు కావున, వీరికి కార్వీటివారను పేరు కల్గెను. ఈ వంశములోని బుక్కరాజు గొప్ప శూరుడని ఖ్యాతిగాంచెను. బుక్కరాజు సాళువనరసింహరాజు కాలమున సేనానాయకుడుగ నుండి, ఆతనికి చాల తోడ్పడెను. ఈ బుక్కరాజునకు "సాళువనరసింహరాయ రాజ్యప్రతిష్ఠాపనాచార్య" యని బిరుదముండెను. ఈ వంశ

సేనతో, విజయనగరమునకు పోయి రామరాయల నోదార్చి, తన్నా తని కుమారునిగ భావింపవలసినదని కోరెనట. అప్పటినుండియు రామరాయలును, ఆదిల్‌షాయును తండ్రి కొడుకుల వరుసతో, నొండొరులతో వ్యవహరించిరి. కాని ఈ ఆదిల్‌షాయే రామరాయ లను తాళికోటలో మోసగించి, చంపించెను. రామరాజు సహాయము చూచుకొని, ఆదిల్‌షా రెండుపర్యాయములు అహమద్‌నగర రాజ్యముపై దండెత్తెను. రామరాయలు తన దత్తపుత్రుని సహాయ మునకై, సేనను పంపెను. తుదకు కళ్యాణి దుర్గమును. బిజాపురము వారు నిజామ్‌షానుండి గైకొనిరి. ఈ యుద్ధ సందర్భములో రామ రాజు సైనికులు మహమ్మదీయులపై కసి తీర్చుకొను నుద్దేశ్యములో, వారి మసీదులను కూలద్రోసియు, ఖురాను గ్రంథమును చించియు, స్త్రీల నవమానపరచియు. విచ్చలవిడిగ వ్యవహరించిరి. దీనివలన మహమ్మదీయ రాజులకు చాల ఆగ్రహము కల్గెను. సుల్తానులు తరచు తన సహాయము కోరుచున్నందువలన వా రసమర్థులనియు, వారిని తా నేమియు లెక్కసేయ నావశ్యకము లేదనియు, రామ రాజు గర్వించెను. వారు పంపిన రాయబారుల నాత డగౌరవము చేయసాగెను. దీనివలన సుల్తానులు కండ్లు తెరచి, తమలో నెలకొని యున్న వైరములే తమ పతనమునకు కారణమని గుర్తెరింగిరి. గోల్కొండ నవాబు మధ్యవర్తిగ నుండి నిజామ్‌షాకును, ఆదిల్‌షా కును, స్నేహబాంధవ్యముల కలిగించెను. ఈవిధముగ మహమ్మ దీయ సుల్తానులందరు నేకమై, సేనల కూర్చుకొని, రామరాయలపై యుద్ధము ప్రకటించిరి. 1565-వ సంవత్సరమున కృష్ణామలాపహారీ నదుల సంగమ సమీపమున, రాక్షసతంగడివద్ద, విజయనగర సేనల కును, మహమ్మదీయ సైన్యములకును భయంకరమగు యుద్ధము జరిగెను. హైందవులు మిక్కిలి పరాక్రమముతో పోరియు, తుదకు మహమ్మదీయులచే సంపూర్ణముగ పరాభవింపబడిరి. రామరాజు యుద్ధమున శత్రువులచే జిక్కి చంపబడెను. ఆతనిసోదరులు తిరుమల వేంకటాద్రులు యుద్ధరంగమునుండి, విజయనగరమునకు, అచ్చటి నుండి పెనుగొండకును, పారిపోయిరి. విజేతలగు మహమ్మదీయులు

మరి మూడు నాల్గు దినముల తరువాత విజయనగర పట్టణముపై బడి, ఆరు నెలల వరకును దానిని దోచుకొని, ప్రజలను చంపి, అచ్చటి సుందర భవనములను కూల్చి, భూలోక స్వర్గమువలె వెలింగిన యా నగరరాజమును, సంపూర్ణముగ నాశనము చేసిరి.

రక్షసతంగడి యుద్ధమున హిందువులకు సంభవించిన పరాజయము వారి కొక మహావిపత్తని తెల్పుట కెట్టి సంశయమును లేదు. హైందవ మత సభ్యతలకు రెండు శతాబ్దులు పై బడి, అండగా నిల్చిన యీ సామ్రాజ్యము దుర్బలమైనందున, హైందవులస్థితికూడ మిక్కిలి చెడిపోయెను. ఈ పరాజయమునకు ముఖ్యకారణము విధివైపరీత్యమే యని తెలుపవలసియున్నది. తాళికోట రంగమున మహమ్మదీయ సుల్తానులతో పోరిన హైందవసేన, అసమర్థమైన దని తెల్పుటకు వీలు లేదు. రామరాజు కాలమునందే, వీ రనేక పర్యాయములు మహమ్మదీయుల నోడించి, పరాభవించి యుండిరి. విజయనగర సేనయం దాశ్వికులు కాని, శతఘ్నిసేన కాని, సమర్థులగు సేనానులు కాని కొరవడి యుండలేదు. క్రమశిక్షణయందు, మహమ్మదీయసేనయు హైందవ సేనయు, ఇంచుమించు సమానముగనే ఉండెను. కాని దురదృష్టవశమున రామరాజు శత్రువుల చేజిక్కుటచే, హైందవుల యదృష్ట చక్రము తిరిగిపోయెను. రాజునో, సేనానాయకునో, లేక మరే ప్రముఖవ్యక్తినో, నమ్మి యుద్ధరంగమున దిగుట హైందవ సేనలలో గల గొప్ప లోపము, ఆవ్యక్తి కేదైన నపాయము సంభవించిన పక్షమున, విజయవంతముగ పోరుచున్న వీరులుకూడ హతాశులై పారిపోవుట, భారతజాతీయేతిహాసము నం దనేక పర్యాయములు సంభవించెను. తాళికోట యుద్ధము సంభవించుటకు అళియ రామ రాయలే ముఖ్యముగ బాధ్యుడు. తుట్టతుది దినములలో, నాతనినావహించిన గర్వభావమును, యుద్ధములం దాతని సేనలు కావించిన యత్యాచారములును, మహమ్మదీయుల యేకీభావమునకు కారణములు. రాజ్యతంత్రమునం దారితేరిన వాడయ్యును, రామరాజు తన శత్రువులను నమ్మెను. ఆలీ ఆదిల్ షాను పుత్రసమానునిగ భావిం

పగా, నాపుత్రుడు తండ్రిని తుదకు మోసగించెను. విజయనగర సేనలోని కొందరు మహమ్మదీయులు, రణభూమియందు స్వపక్షమును నీడి, శత్రువులలో జేరిరనియు, అందువలన విజయనగర పక్షమునకు పరాజయము వాటిల్లె ననియు కొందరు చారిత్రికులు తెల్పుచున్నారు.

రాక్షసతంగడి(తాళికోట)పరాజయము విజయనగర రాజ్యమునకు వజ్రాఘాతమువంటిది. అయినను ఇంతటితో సామ్రాజ్యము కూలిపోలేదు. సుమారుమరియొక శతాబ్దమువరకును, ఆర్వీటివంశము వారు తమరాజ్యమును నిలువబెట్టుకొనుటకై, పెనగులాడిరి. తాళికోట యుద్ధమున రామరాయలపై కత్తిదూసి, నిలిచిన అహమ్మద్ నగర్, బిజాపూరు గోల్కొండ సుల్తానులలో, విజయలాభము కల్గిన వెనుక నేకలక్ష్యము లేకపోయెను. అహమద్ నగర్ రాజునకు, విజయనగరమునెడ గల పగ రామరాజుతో నశించెను. ఆపైన ఆరాజు విజయనగర రాజ్యాంగములం దెక్కడు జోక్యము కల్పించుకొనలేదు. బిజాపూరు గోల్కొండ నవాబులు మాత్రము, విజయనగర రాజ్యమునందలి అనేక భాగములను, క్రమక్రమముగ జయింపగల్గిరి. పదునేడవ శతాబ్ది ప్రారంభమునుండి, మొగలు సామ్రాట్టులు వారి రాజ్యములపై దాడులు సాగించుట ప్రారంభించినందున, వీరువిజయనగర రాజుల నెక్కడు వేధించుట కవకాశము లేకపోయెను.

రాక్షసతంగడి (తాళికోట) యుద్ధమున విజయనగర సేనలకు పరాభవము సంభవింపగనే, తిరుమలరాయడు విజయనగరమునకు పోయి అచ్చటనుండి రాజైన సదాశివరాయలను, అపరిమిత ధనరాసులను తీసికొని, పెనుగొండకు పారిపోయెను. మహమ్మదీయ సుల్తానులు విజయనగర పట్టణమును కొల్లగొట్టి, వెడలిపోయిన వెనుక తిరుమలరాయలు పట్టణమును బాగు చేయించి, దానిని మరల తన రాజధానిగ చేసికొనవలెనని ప్రయత్నించెను. కాని ఆయుద్యమము విఫలమైనందునను, విజయనగరము శత్రురాజులకు మిక్కిలి సమీపమున నుండిన కారణమునను, 1568 లో పెనుగొండకే తిరిగిపోయి దానిని తన రాజధానిగ చేసి

కొనెను. ఈ సంవత్సరముననే ఆలీఆదిల్‌షా ఆనెగొంది దుర్గమును స్వాధీనపరచుకొనెను. గోల్కొండ నవాబులు తూర్పుతీరమును జయించి, రాజమహేంద్రవర దుర్గమును, ఉత్కల దేశమున కొంత భాగమును ఆక్రమించిరి. ఈవిధమున కృష్ణదేవరాయల కాలమున సాధింపబడిన రాజ్యభాగమంతయు శత్రువుల వశమయ్యెను. ఉత్తర మందలి సామంతులు విజయనగరరాజులపై తిరుగుబాటుచేసిరి. కాని దక్షిణ దేశము మాత్రము వీరికి స్వాధీనమై యుండెను. క్రీ. శ. 1570 ప్రాంతమున తిరుమలరాయలు సింహాసన మధిష్ఠించెను. అప్పటి కీతని వయస్సు తొంబది సంవత్సరములు. పరిపాలనా సౌకర్యమునకై తిరుమలరాయలు తన రాజ్యమును మూడుభాగములుగ విభజించి తన మూవురు పుత్రులను వానికి పాలకులుగ నియమించెను. శ్రీరంగ రాయడు పెనుగొండను రాజధానిగ చేసికొని, తెనుంగుప్రాంతమును, రామరాయలు శ్రీరంగపట్టణమును కేంద్రముగ చేసికొని కన్నడ ప్రాంతమును, మూడవ కుమారుడు వెంకటపతిరాయుడు చంద్రగిరి నుండి ద్రావిడ ప్రాంతమును పాలించిరి. తిరుమలరాయ డుత్తరము నుండి మహమ్మదీయులు దాడివెడలి, తన రాజ్యము నాక్రమించు కొనకుండునటుల కాపాడుచుండెను. ఈతని కాలమున బిజాపూరు నవాబు, కర్ణాటక దేశాంతర్గతమగు తురగల్లు, ధార్వాడ్ మున్నగు విజయనగర దుర్గములను, బంకాపూరును ఆక్రమించెను. తిరుమల రాయలు 1572 లో మరణించెను. ఆతని యనంతరము మొదటి శ్రీరంగరాయలు రాజ్యభారము పూనెను. ఈతని రాజ్యముకాలమున పశ్చిమతీరముననుదక్షిణమందునుగలసామంతులు తిరుగుబాటుచేసిరి. కాని వారి నందరను శ్రీరంగరాయ లోడించెను. బిజాపూరు నవాబు శ్రీరంగరాయని రాజ్యముపై దండెత్తి, (నేటి షిమోగా కడూరు జిల్లాల) నాక్రమించెను. 1577 వ సంవత్సరమున బిజాపూరు సుల్తాను పెనుగొండ పట్టణమును ముట్టడించెను. కాని శ్రీరంగరాయ లీతని నోడించి పారద్రోలెను. గోల్కొండ నవాబు కొండవీడు, ఉదయగిరి, బెల్లంకొండ దుర్గములను, విజయనగరరాజుల కడనుండి జయించెను.

ఇది యిట్లుండగా కన్నడప్రాంతమును, రాజప్రతినిధిగా పాలించుచున్న రామరాయల అసమర్థతవలన, ఆతడు పాలించుచున్న శ్రీరంగ పట్టణమును, పరిసర దేశమును అతని సామంతు లాక్రమించిరి. రాజఒడయ డనునాతడు వీరిలో ప్రముఖుడు. ఈతడు క్రమముగా తన రాజ్యమును విస్తరించి స్వతంత్రత వహించెను. ఇదియే నేటి మైసూరు రాజ్యమునకు ప్రాతిపదిక. క్రీ. శ. 1585 నందు శ్రీరంగ రాయలు కాలధర్మము నందగా, ఆతని సోదరుడు వెంకటపతి రాయలు రాజ్యభారమును పూనెను. పెనుగొండపై దండెత్తి వచ్చిన, గోల్కొండ నవాబు నోడించి పారద్రోలుటయే కాక, ఈతడు కృష్ణానదివరకును తన రాజ్యమును విస్తరించెను. ఈ నదియే గోలకొండ విజయనగర రాజ్యములకు సరిహద్దుగ అంగీకరింపబడెను. విజయనగర రాజ్యమును పాలించిన తుట్ట తుది గొప్పరాజీతడే. ఈ రాజు తన రాజ్యవైభవమును పునరుద్ధరించుటకై, మిక్కిలి పాటుపడి, కొంతవరకు కృతకృత్యు డయ్యెను. వెంకటపతిరాయలు చంద్రగిరిని తన రాజధానిగ చేసి కొనెను. ఈ రాజన్యుడు 1614 లో మరణించెను. చారిత్రికు లీ రాజును రెండవ వెంకటపతి రాయ లని వ్యవహరించు చున్నారు.

వెంకటపతిరాయల యనంతరము విజయనగర రాజ్యమున నంతఃకలహములు చెలరేగెను. వెంకటపతిరాయలు తన అన్న కుమారుడగు శ్రీరంగరాయని తన యనంతరము రాజుగ నిర్ణయించెను. ఈతడు రెండవ శ్రీరంగరాయ లనుపేరితో రాజ్యమునకు వచ్చెను. కాని గొబ్బూరి జగ్గరాయడను రాజ బంధువున కీయేర్పాటు రుచింప లేదు. వెంకటపతిరాయల భార్యయు, తన సోదరియునగు ఒక రాణి కొక కుమారు డున్నట్లు ప్రకటించి, ఆ మేనల్లుని పక్షమున నీతడు రాజుపై తిరుగు బాటు చేసెను. ఇంతేకాక జగ్గరాయలు శ్రీరంగరాయని సకుటుం

బముగ చంపించెను. కాని స్వామిభక్తి పరాయణుడగు యాచమ నాయకు డనుసామంతుడు, శ్రీరంగరాయని కుమారులలో నొకనిని రక్షించి, తనకడ బెంపసాగెను. ఈ సంఘటనలు రాజ్యమందంతర్యుద్ధమునకు త్రోవదీసెను. రాజ్యములోని సామంతులందరును జగ్గయ రాయనిపక్ష మవలంబించిరి. కాని తిరుచినాపల్లికి సమీపమందలి తోపూరునందు, జగ్గయరాయనికిని యాచమనాయకునికిని సంభవించిన యుద్ధములో, జగ్గరాయ డోడెను. ఈ యుద్ధమున తంజాపూరు పాలకుడైన రఘునాథరాయలు, యాచమనాయకుడు మున్నగు స్వామిభక్తులపక్ష మవలంబించెను. అందులకు కోపించి, విజయనగర సామంతు లందరును చంద్రగిరి రాజును తమ యేలికగ నంగీకరించుటకు నిరాకరించిరి. తోపూరు యుద్ధమున యాచమ నాయకునికి గల్గిన విజయమే, తాళికోట పరాజయముకంటె, విజయ నగర రాజ్య వినాశమునకు బలవత్తరమగు కారణమయ్యెనని చారిత్రికులు తలంచుచున్నారు.

విజయనగరరాజ్యపు తుట్టతుదిరాజు మూడవ శ్రీరంగ రాయలు. సామ్రాజ్యము ఛిన్నాభిన్నమై పోవుచున్నదని యాతడు గ్రహించెను. తంజావూరు, మధుర, జింజీమున్నగు ప్రాంతములలోని సామంతులను, తన వశమం దుంచుకొనినగాని, రాజ్యము నిలువ జాలదని యాతడు తెలిసికొనెను. కాని ఆతనివద్ద సామర్థ్యము లేదు. ఈ దుఃస్థితిలో నాతడు ఢిల్లీశ్వరుడైన షాహజహాన్ చక్రవర్తికడ కొకవిన్నపము నంపెను. తన సామంతులను లోబరచుకొనుటయందు చక్రవర్తి తనకు సహాయపడిన పక్షమున, తాను మహమ్మదీయ మతమును స్వీకరించుటకుకూడ సిద్ధముగా నున్నానని, ఆతడు తెల్పెను. కాని షాహజహాన్ చక్రవర్తి యీతని కెట్టి మద్దత్తును ఈయలేదు. బిజాపూరు గోల్కొండనవాబులు, శ్రీరంగరాయని రాజ్యము నాక్రమించి, ఆకాలమున రాజధానిగనున్న వేలూరు కోటను 1646 సంవత్సరమున ముట్టడివేసిరి. శ్రీరంగరాయలు పారి పోయి మైసూరురాజు, శరణుజొచ్చెను. ఆపైన నీ రాజును గూర్చిన యెట్టి విషయములు తెలియరాకున్నవి. విజయనగర సామ్రాజ్యము

1675 నాటికి పూర్తిగా నశించెను. శ్రీరంగరాయని భార్య తన కుటుంబ రక్షణమునకై ఏదైన సహాయము చేయవలసినదని, మహారాష్ట్ర ప్రభువగు శివాజీని కోరినట్లొక శాసనమున తెలియుచున్నది. కాని యీ శాసన మెంతవరకు విశ్వాసార్హమో తెలుపజాలము.

సుమారు మూడునూర్ల సంవత్సరములు దక్షిణాపథమున తేజోవంతముగా రాజ్యపాలనము చేసిన విజయనగర రాజ్యము, తన సామంతుల ద్రోహమువలన తుదకు నశించెను.

విజయనగర సామ్రాజ్యమునకు ముఖ్యపట్టణమైన విజయనగరము సామ్రాజ్యస్థాపన కాలము మొదలుకొని, తాళికోట యుద్ధము వరకును అనగా రెండు శతాబ్దులకు మించి, మహావైభవముతో విలసిల్లెను. సంగమవంశమువారి కాలమున నికోలోకొంటి అను ఇటలీ దేశస్థుడును (1420) ఇదేకాలమున అబ్దుల్ రజాక్ అను పారసీక దేశపు రాయబారియు [1443] విజయనగర పట్టణమును సందర్శించిరి. 1520వ సంవత్సరమున పోర్చుగీసు రాయబారితో, విజయనగరమునకు పెయిస్ అనునాతడు వచ్చెను. వీరందరునువిదేశీయులయ్యును, వివిధ కాలములలో నీ పట్టణమును చూచినవారయ్యును, ఏకకంఠముతో, నీనగర రాజముయొక్క వైభవమును వర్ణించిరి. కావున వీరి వ్రాతలలో నెట్టి యతిశయోక్తులు నుండవని మనము విశ్వసింపవచ్చును. నికోలోకొంటి యిట్లు వ్రాసెను: "విజయనగర మనుమహానగరము కొండలనడుమ నిర్మింపబడియున్నది. ఈ నగరము చుట్టుకొలత ఇరువది మైళ్లు. కొండల మధ్యముననున్న పల్లపు ప్రదేశములలో జనులు నివసించు గృహములును, మిద్దెలును, మేడలును, నగరులు, ఉద్యానవనములు, ఫలవృక్షములు, పంటకాలువలు మొదలగునవి పెక్కులు కలవు. అచ్చటచ్చట ప్రసిద్ధములగు దేవళములును, గోపురములును గన్నులకు పండువు సేయుచుండును."

అబ్దుల్ రజాక్ ఇట్లు వ్రాసెను: "విజయనగరమువంటి మహానగరము నెన్నడును మేము కన్నులతో చూచియుండలేదు. ఆ నగరముతో పోలిన నగరము ప్రపంచమున నెచ్చటనైన ఉన్నట్లు విని

యుండ లేదు. సప్తప్రాకారములచే చుట్టబడిన యేడు దుర్గములచే రక్షితమై, యీ నగర మొప్పుచున్నది. మొదటి దుర్గము మొదలు కొని మూడవ దుర్గము వరకునుగల ప్రదేశమంతయు సాగుబడిచేయ బడిన పొలములతోను, గృహములతోను, ఉద్యానవనములతోను ఫలవృక్షములతోను నిండియుండెను. మూడవదుర్గము మొదలు ఏడవ దుర్గమువరకునుగల ప్రదేశమంతయు, అసంఖ్యాకములగు జనసంఘ ములచేతనిండి, బజారులతో నొప్పుచుండును. ప్రతి బజారునకు పైని సొగసైన తాళ్వారముతో కూడిన ఉన్నతములైన, కమానులు నిర్మింపబడినవి. బజారులు పొడవుగను, విశాలముగను, రమణీయ ముగను ఉండును. గులాబిపూవు లంతట నమ్మబడుచున్నవి. ఆ ప్రజలు గులాబిపువ్వుల నాహారముకంటె నావశ్యకము లయినవి గా భావించుచుండిరి. ముత్యములు, కెంపులు, నీలములు, వజ్రములు మొదలగునవి బహిరంగముగా బజారులలో విక్రయింపబడుచున్నవి. ఈ ప్రదేశములందును, రాజాంతఃపురములందును నున్నగా పాల గచ్చు చేయబడిన రాతి గొట్టములగుండా కాలువలు పెక్కులు జల ప్రపూర్ణములై ప్రవహించుచున్నవి.'' రాయలయొక్క సభాభవన ములను వర్ణించుచు అవి మిక్కిలి సుందరముగను, చాల విలువగల అలంకరణములతో గూడినవిగను ఉన్నవని అబ్దుల్‌రజాక్ తెల్పి యున్నాడు.

పోర్చుగీస్ యాత్రికుడగు పెయిస్ ఇట్లు వ్రాసియున్నాడు: ''ఈ రాజ్యమునకు రాజధాని విజయనగరము. రాజెప్పుడును ఇచ్చట నివసించియుండును. డెబ్బదిరెండు మైళ్ల పొడవుగల కొండల వరుస ఈ మహానగరమును చుట్టియున్నది. ఆ యావరణలోపల వరి, మొదలగు ధాన్యములు పండునట్టి బయళ్లును, నిమ్మలు, నారిం జలు, పనసలు మొదలగు ఫలవృక్షములతో నిండిన తోటలును, సారవంతములైన భూములును గలవు. ఈ కొండల వరుసలకు మధ్య మున జలాశయములు పెక్కులు కలవు. వాని యాధారమువలననే పైనుదహరించిన భూములు సాగుబడి యగుచున్నవి. రాజభవనము నకు పోవుమార్గమున, సేనానులయొక్కయు, ప్రభువులయొక్కయు

మందిరములు కలవు. ఇచ్చట చూచుటకు వినోదకరములగు విగ్రహములతో నలంకరింపబడిన యిండ్లవరుసలు, మనోజ్ఞములై యొప్పుచున్నవి. వర్తకులు నివసించు వీధిలో పెక్కు రకముల కెంపులు, వజ్రములు, నీలములు, పచ్చలు, ముత్యములు మున్నగునవియు, ఇంకను ప్రపంచములో దొరకు ప్రతివస్తువును, అమ్మబడుచుండును. ఈ పట్టణమం దన్నిరకముల ధాన్యములును, వివిధ ఫల జాతులును విక్రయింపబడును. ఈ నగరవిస్తీర్ణతను గురించి నేను వ్రాయను. ఏలనన అది ఒక ప్రదేశమునుండి చూచుటకు కానరాదు. నే నొక కొండనెక్కి పట్టణములో చాలభాగమును చూడగల్గితిని. నాకు కనుపట్టిన భాగము రోమునగర మంత పెద్దదిగా నుండి చూపునకు మిక్కిలి సుందరముగా కాన్పించినది.''[1]

విజయనగరయుగమందు గీర్వాణభాషయు దేశీయ భాషలగు తెలుగు, కన్నడము, తమిళమునుకూడ రాజులచేతను ప్రభువులచేతను పోషింపబడి చక్కగా వర్ధిల్లెను. విజయనగరమును పాలించిన మొదటి వంశము సంగమవంశము. ఈ వంశీయులు కర్ణాటకులని కొందరు తలంచుచున్నారు. ఇందలి నిజానిజము లెట్లున్నను ప్రథమహరిహర బుక్కభూపాలుర కాలమునుండియు, ఆంధ్రభాషకు విజయనగరము పట్టుగొమ్మయాయెను. సాళువ, తుళువ, ఆర్వీటీవంశముల పాలనలో తెనుగుభాషకు మఱియు మిక్కుటమైన రాజాశ్రయము లభించెను. అంతేకాక విజయనగర రాజ్యము స్థాపింపబడిన తరువాత, సుమారొక శతాబ్దివరకును తెనుగు దేశములోని కొంత భాగమును రెడ్డి వెలమరాజ కుటుంబములు పాలించెను. వీరు స్వయముగ గొప్ప విద్వాంసులై విద్వాంసులను, కవులను మిక్కిలి గౌరవించిన యంశ మీవరకే తెలుపబడినది. కావున నాంధ్రకవులను పోషించు

1. ఈవాక్యములు కొ. లక్ష్మణరావుగారు రచించిన మహమ్మదీయ మహాయుగమునుండి గైకొనబడినవి.

గౌరవము విద్యానగర ప్రభువుల కప్పుడప్పుడు మాత్రము లభించెను.

విజయనగరరాజులలో రెండవవాడైన బుక్కరాయలు నాచనసోము డనుప్రసిద్ధ ఆంధ్రకవికిని, మరికొందరు పండితులగు బ్రాహ్మణులకును, కలిపి కడప మండలములోని పెంచుకలదిన్నె యను అగ్రహారమును దానము చేసెను. నాచన సోమకవి పదు నాల్గవ శతాబ్ది మధ్యభాగమువాడు. ఈతడు కవిత్వ ప్రాగల్భ్యమున కవిత్రయమువారితో పోల్పదగినవాడు. నాచనసోమునికిగల సర్వజ్ఞ బిరుద మాతని యసాధారణ వైదుష్యమునకు తార్కాణము. ఈత డుత్తరహరివంశ మను గొప్ప గ్రంథమును రచించెను. మొదటి దేవరాయలకాలమున [1404–1422] విక్రమార్కచరిత్రమును వ్రాసిన జక్కయయను కవి జీవించెను. ఈ కవి గ్రంథమును కృతి పొందిన సిద్ధనమంత్రి దేవరాయని సచివుడు. దేవరాయలు సంస్కృత భాషను, కర్ణాటభాషనుకూడ పోషించెను. సాళువ నరసింహరాజు నకు పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి, తన జైమినిభారతము నంకిత మిచ్చెను. ఈతనికవిత్వ మించుక కఠినముగ నున్నను, మిక్కిలి రమ్యమైనదని పండితులు ప్రశంసించియున్నారు. సంకీర్తనాచార్యు లలో మొదటివాడైన తాళ్ళపాక అన్నమాచార్యులు సాళువ నరసింహరాయల కాలముననే, తిరుపతిక్షేత్రమున నివసించి తన కృతులను రచించెను. తుళువ నరసనాయకుని యాస్థానమున నంది మల్లయ, ఘంటసింగయ యను జంటకవులు నివసించిరి. ఇరువురు కవులు కలిసి, కావ్యరచనము కావించుటకు తెనుగుభాషలో నిదియే ప్రథమోదాహరణము. వీరు వరాహపురాణమును రచించి, నరస నాయకునికికృతి యిచ్చిరి. వీరు రచించిన ప్రబోధచంద్రోదయకావ్య మును అనంతామాత్యుని గంగయమంత్రి అంకితమందెను. వీరు సంస్కృతపద భూయిష్ఠముగను, చక్కని తెనుఁగులోనుకూడ హృద్యమగు కవిత్వమును వ్రాయగల నేర్పరులు.

పదునారవశతాబ్దిలో ఆంధ్ర కవిత్వమునకు స్వర్ణయుగ మన దగిన కాలము ప్రారంభమగుచున్నది. ఇంతవరకు నాంధ్రకవు లంద రునుకూడి, సంస్కృత భాష యందలి పురాణములను తెనుగులోనికి పరివర్తనము చేయుచుంసిరి. భగవల్లీలలే వారి కృతులయందలి కథాంశములు. శైవ కవులు తమతమ మతప్రచారమునకై వివిధ గ్రంథములను విరచించుచుండిరి. కాని పదునారవ శతాబ్దియందు, కావ్యప్రపంచమున నొక నూతనోద్యమము ప్రబలెను. అది ప్రబంధ రచన. ప్రబంధము కొంతవరకు స్వతంత్రకావ్యము. ఇది శృంగార రస ప్రధానము. ఇం దష్టాదశవర్ణనము లుండవలయును. కథా వస్తువునుబట్టి ప్రబంధములు మూడువిధములుగ నుండును. ప్రఖ్యా తము, ఉత్పాద్యము, మిశ్రమము అనునవి ప్రబంధశాఖలు. పురాణ ములయందలి ప్రసిద్ధపురుషుల జీవితాంశములనుగాని, స్వకపోలకల్పి తములగు కథలును, లేక ఈ రెంటిని మేళవించి కాని ప్రబంధ కవులు కావ్యరచనమునకు బూనిరి. ఇందు కవి యూహాశక్తికిని, పాండిత్య ప్రకటనమునకును, భాషావైచిత్ర్య ప్రదర్శనమునకును కూడ మంచి యవకాశము లభించుచుండెడిది. విజయనగర రాజుల కాలమందు - అందు ముఖ్యముగా కృష్ణరాయల యుగమునుండి రాక్షసతంగడి సంగ్రామమువరకును ఈ సామ్రాజ్య మఖండైశ్వ ర్యము ననుభవించెను. తత్ఫలితముగ ప్రజలలో భోగపరాయ ణత్వము హెచ్చెను. కావుననే రాజులును, వారి సామంతులు మున్నగువారును, శృంగారరసప్రధానమైన యీ ప్రబంధరచన మును ప్రోత్సహించుట సంభవించెను. కృష్ణరాయలు స్వయముగా గొప్ప విద్వాంసుడు. రసజ్ఞుడు. ఆంధ్రభోజుడని ఈతని కొసంగ బడిన బిరుదమే యీతని కవి పండిత పక్షపాతమునకు తార్కా ణము. రాయలు తనకు లభించెడి విరామకాలమును, చాలవరకు కవిపండిత గోష్ఠియందు గడపుచుండెను. దండయాత్రలకు పోవు నప్పుడును, రాజ్యపర్యటనము కావించునప్పుడును కూడ ఈతడు పండితులను కవులను తనతో తీసికొనిపోవుచుండెడివాడు. ఈతడు వారి కగ్రహారముల నిచ్చియు, తదితర విధములుగను గౌరవించు

చుండెను. కృష్ణరాయలు సంస్కృత కవులను, ఇతర దేశభాషలలో కవిత్వము చెప్పువారిని పోషించినను, ఈతనికి తెనుగుభాష అభిమాన భాష. రాయల ఆస్థానమున నష్టదిగ్గజములని పేరుమోసిన ఆంధ్రకవి శిఖామణు లుండినట్లు ప్రతీతి. కాని వారిలో కొందరు రాయలకు సమ కాలీనులు కారు. సమకాలీన కవులలో అల్లసాని పెద్దన, నంది తిమ్మన, మాదయ్యగారి మల్లన, ధూర్జటి మున్నగు కవీంద్రులను పేర్కొనవలసియున్నది. ప్రబంధ రచనా పరమేష్ఠి యనదగిన అల్ల సాని పెద్దన వీరిలో అగ్రగణ్యుడు. రాయలీతని నాంధ్రకవితా పితా మహుడని పిలిచి మిక్కిలి గౌరవించుచుండెను. పెద్దన విరచితమైన మనుచరిత్రమునకు కృష్ణరాయలే కృతిభర్త. మనుచరిత్ర మొక అపూర్వ శృంగార ప్రబంధము. ఇందలి కవిత్వము మృదుమధుర మైనది. దీనిని నేటికిని పండితపామరులు చదివి ఆనందించుచున్నారు. పెద్దన మనుచరిత్రమే తరువాత వ్రాయబడిన ప్రబంధములకు వరవడి పెట్టినది. నంది తిమ్మనకవి, పారిజాతాపహరణ మను లలిత శృంగార ప్రబంధమును రచించి, రాయల కంకిత మిచ్చెను. కృష్ణదేవరాయలు స్వయముగ గొప్పకవి. ఆతడు ఆముక్తమాల్యదయను మహద్గ్రంథ మును రచించెను. దీనికి విష్ణుచిత్తీయ మను నామాంతరము కలదు. ఈ గ్రంథరచనమునందు, రాయలకు అల్లసాని పెద్దన సహాయము లభించినదని కొందరితలంపు. ఆముక్తమాల్యద భక్తిరసప్రధానమగు గ్రంథమైనను, ఇందు రాయల సర్వంకషప్రజ్ఞ ద్యోతకమగుచున్నది. సమకాలిక జీవితమును, కృష్ణరాయలు పరిశీలించినంత సూక్ష్మముగ, బహుశః మరి యే తెనుగుకవియు, ఏకాలమందునుకూడ చేయలేదని తెల్పుట అతిశయోక్తికాదు. రాయల కవిత ప్రౌఢమై, పండితైక వేద్యముగ నుండును. రాయల యనంతర కాలమున కీర్తిగాంచిన ఆంధ్రకవులలో పింగళిసూరన, భట్టుమూర్తి యను నామాంతరము కల రామరాజభూషణుడును ప్రముఖులు. పింగళి సూరన కవి ప్రభా వతీ ప్రద్యుమ్నము, రాఘవ పాండవీయ మనుద్వ్యర్థి కావ్యము, కళాపూర్ణోదయము అను గొప్ప కృతులను రచించెను. ఇందు కళా

పూర్ణోదయ ముత్తమమైనది. సూరన కవి దీనిని నంద్యాల కృష్ణ రాజున కంకిత మిచ్చెను. నంద్యాలవారు విజయనగర రాజులకు సామంతులు. కళాపూర్ణోదయ మాంధ్రభాషయం దద్వితీయమగు కావ్యము. ఇందు సూరనకవి ప్రదర్శించిన కథాకల్పనా చమత్కృతి ఇంకే ప్రబంధమందును కానరాదు. ఈతని కవిత్వము మృదుమధు రము. రామరాజభూషణుడు వ్రాసిన గొప్ప కావ్యము వసుచరిత్ర. ఇది ఆర్వీటి తిరుమల రాయని కంకిత మొసంగబడినది. భాషాచమ త్కృతియందును, పాండితీ ప్రకటనమందును, ఈ కావ్యమున కిదియే సాటి. ఇందలి కవిత్వము కఠినముగను, పండితైకవేద్యముగను నుండి నను, మిక్కిలి కర్ణరసాయనముగ నుండును. ఈ కవి హరిశ్చంద్ర నలోపాఖ్యానమను, ద్వ్యర్థి కావ్యమును కూడ వ్రాసెను. పైన తెలుపబడినవారేకాక విజయనగర యుగమునకు కీర్తి తెచ్చిన ఆంధ్ర కవులు పెక్కురు కలరు. వీరిలో తెనాలిరామకృష్ణకవి, సంకుసాల నృసింహకవి, తాళ్లపాక తిరుమలాచార్యుడు మున్నగు వారు ప్రముఖులు.

విజయనగర ప్రభువులు సంస్కృతమునుకూడ చక్కగా పోషించిరి. కృష్ణదేవరాయలు స్వయముగా సంస్కృతభాషయందు విద్వాంసుడు. ఈతడు మదాలస చరిత్రము, సత్యావధూపరిణయము మున్నగు కావ్యముల వ్రాసినట్లు తెల్పుదురు. ఈ రాయని యాస్థాన మందు లొల్ల లక్ష్మీధర పండితుడను బ్రాహ్మణవిద్వాంసుడు నివసిం చెను. ఈతడు మొట్టమొదట కటకపురాధీశులగు గజపతులకడనుండి, ఆపైన విజయనగర రాజ్యమునకు వచ్చినట్లు తెలియుచున్నది. ఈతడు శివానందలహరి మున్నగు గ్రంథములకు వ్యాఖ్యానమును, దైవజ్ఞానవిలాస మను అపూర్వ గ్రంథమును వ్రాసెను. దైవజ్ఞాన విలాస మొక విజ్ఞాన సర్వస్వమని పండితుల యభిప్రాయము. రాయల విఖ్యాతమంత్రి తిమ్మరుసు గొప్ప సంస్కృత విద్వాంసుడు. ఆత డగస్త్య భారతమునకు వ్యాఖ్యానము వ్రాసెను. ఆతని మేనల్లుడు నాదెండ్ల గోపన ప్రబోధ చంద్రోదయముపై టీక

వ్రాసెను. విజయనగరాస్థానమునకు పలువురు మతబోధకులు వచ్చి, శాస్త్రచర్చలు సల్పుచుండుట ఆచారముగ నుండెను. ప్రఖ్యాత మత సంస్కర్తలగు చైతన్యుడును, వల్లభాచార్యుడును విజయనగరాస్థానమును సందర్శించిరట. మాధ్వగురువులగు వ్యాసతీర్థులును, విజయేంద్రులును, రామానుజ మతస్థులగు దొడ్డయాచార్య, తాతాచార్య ప్రభృతులును విజయనగర ప్రభువులచే ఆదరింపబడిరి. వీరిలో వ్యాసతీర్థుడు వేదాంతము, తర్కము మున్నగు నంశములపై అనేక గ్రంథముల రచించెను. ఈ కాలమునాటి స్త్రీరచయితలలో వరదాంబికా పరిణయము వ్రాసిన తిరుమలాంబయు, మధురావిజయమును వ్రాసిన గంగాదేవియు, ప్రశంసార్హులు. వరదాంబికా పరిణయము చారిత్రికాంశములకు నిధి. మధురావిజయము చక్కని కావ్యము. సాహిత్యముతోపాటు సంగీతమునుకూడ విజయనగర ప్రభుత్వము పోషించెను. హరిహర బుక్కరాయల గురువును, మహామంత్రియునైన, విద్యారణ్యస్వామి సంగీతసారమను ఒకశాస్త్రగ్రంథమును వ్రాసెనట. అందాతడు 267 రాగములను సూచించినట్లు తెలియుచున్నది. శ్రీనాథమహాకవిని స్వర్ణాభిషేకముచే గౌరవించిన ప్రౌఢదేవరాయలు, శారంగదేవుని సంగీత రత్నాకరమునకు వ్యాఖ్యవ్రాసిన మల్లినాథుడను పండితుని పోషించెను. సాళువ నరసింహరాయల కాలమున చెన్నశౌరి అనునాతడు మొట్టమొదటి యక్షగానమును రచించినట్లు హరిభట్టు నరసింహపురాణము తెల్పుచున్నది. సమకాలిక వాఙ్మయమును చూచిన పక్షమున, పై కాలమందు స్త్రీలు సంగీతమును నృత్యమును, అభ్యసించినట్లు తెలియగలదు. తుళువవంశమువారు విజయనగరమును పాలించుచున్న కాలమునందు, సంగీతశాస్త్రమునకు మిక్కిలి ప్రోత్సాహము కల్గెను. ఈనాడు కర్ణాటక సంగీతమను పేరుతో విఖ్యాతిచెందియున్న ప్రత్యేకశాఖ, పై కాలమునందే ఒక విశిష్ట రూపమును తాల్చియుండవచ్చును. కృష్ణదేవరాయలు యువకుడుగా నున్న కాలమున, వీణావాదనము నభ్యసించెను. ప్రసిద్ధ మాధ్వగురువగు రాఘవేంద్రతీర్థుని పూర్వీకులలో నొకడగు కృష్ణుడు

రాయలకు సంగీతగురువు. రాయల రాజ్యకాలమున లక్ష్మీనారాయణ పండితుడను గొప్ప సంగీత విద్వాంసుడు కటకమునుండి కృష్ణరాయలా యాస్థానమునకు వచ్చెను. ఈ పండితుడు సంగీత సూర్యోదయమను గ్రంథమును వ్రాసెను. కృష్ణరాయలు లక్ష్మీనారాయణ పండితుని తన అంతఃపురమున సంగీతాధ్యాపకునిగ నియమించెను. అళియరామ రాజు, తన మామయగు కృష్ణరాయని వలెనే సంగీత విద్యాప్రియుడు. ఈతడు రామయామాత్యుడను గొప్ప సంస్కృత విద్వాంసుని పోషించెను. రామయామాత్యుడు స్వరమేళకళానిధి యనునొక సంగీత శాస్త్రగ్రంథమును రచించెను. రామరాయ లీ సంగీత విద్వాంసుని తన కుమార్తెలకు సంగీతము నేర్పుటకై ఆదేశించెను. రామయామాత్య విరచితమగు స్వరమేళ కళానిధి యందలి విషయములు, గాయక ప్రపంచమున గొప్పవిచారములకు కారణమయ్యెను, ఈనాటి కర్ణాట సంగీతమునకు ప్రాతిపదికగా నిలచినవి. విజయనగర యుగమున సంగీతమున కెక్కుడు గౌరవమును, ప్రజాదరమును కల్గెను. ఆనాడు సంగీత సాధనములు పెక్కు లుండెను. వానిలో వీణ శ్రేష్ఠమైనది. ప్రబంధనాయికలందరును వీణావాదన నిపుణలే! సంగీతమును నేర్చియుండుట, ఆ యుగమున విజ్ఞాన లక్షణములలో నొకటిగ పరిగణింపబడెను.

విజయనగర రాజ్యయుగమున నపూర్వమైన దేవాలయములును, రాజప్రాసాదములును నిర్మింపబడెను. ఇందలి శిల్పకళ అద్భుతమైనది. శిల్పముతోపాటు చిత్రలేఖనముకూడ, ఈ యుగమందు అభివృద్ధిదశయందుండెను. 1336 వ సంవత్సరమున తుంగభద్రాతీరమున విజయనగరము స్థాపింపబడిన నాటినుండియు, ఈ పట్టణము గొప్ప దేవాలయములతోడను, రాజమందిరములతోడను, విరాజిల్లెను. ఇందులకు సమకాలీనుల వ్రాతలే నిదర్శనము. సంగమవంశ యుగమునాటి నిర్మాణములనుగురించి, మన కెట్టి వివరములును తెలియరాకున్నవి. కాని రాజప్రాసాదమునకు సమీపముననున్న హజా

రరామస్వామి యాలయమును, విఠలస్వామి యాలయము మఱికొన్ని దేవళములును సంగమ వంశజులనాటి వాస్తునిర్మాణములని దృఢముగ జెప్పవచ్చును. వీనిలో హరిహరరామస్వామి దేవాలయము మిక్కిలి సుందరమైన నిర్మాణము. ఇందలి చెక్కడపుపని విద్యానగర శిల్పమున కత్యుత్తమమగు నిదర్శనము. ఈ ఆలయములోని స్తంభములును, పైకప్పునుకూడ మిక్కిలి రమ్యమగు శిల్పరచనా విన్యాసముతో నొప్పియున్నవి. ఇయ్యది రాజకుటుంబమునకై ప్రత్యేకింపఁబడిన దేవళము కావచ్చును. ఈనాడు హంపీక్షేత్రమున కానవచ్చుచున్న అనేక దేవాలయ శిథిలములును, మందిరావశేషములును, తుళువవంశమునాటివే యని చారిత్రికులు నిర్ణయించి యున్నారు. విజయనగర రాజన్యులలో శ్రేష్ఠుడయిన కృష్ణరాయలే వీనిలో పెక్కింటిని నిర్మింపించెను. 1508—1542 సంవత్సరములకు నడుమ, విద్యానగరమందలి అద్భుతనిర్మాణము లన్నియు రూపొందినట్లు విఖ్యాత శిల్పకళావేది యగు ఫెర్గూసన్ పండితుని అభిప్రాయము. తాను రాజ్యాధికారమును పూనిన కొలదికాలమునకే, కృష్ణరాయలు విరూపాక్షదేవుని ఆలయ గోపురములలో నొకదానిని పునర్నిర్మాణము కావింపించెను. గజపతులతో యుద్ధము సేయుచున్న కాలమందు, రాయలు నూతన దేవాలయమునొకదానిని నిర్మించెను. అదికృష్ణస్వామి ఆలయము. ఈతడు చిదంబరము నందలి దేవాలయమున కొక గోపురమును, తిరువణ్ణామలైయం దొక సహస్రస్తంభ మంటపమును నిర్మింపించెను. 1520 వ సంవత్సరమున నాగలాపురమునకు సమీపమున కృష్ణరాయలు కొన్ని చక్కని దేవాలయములను నిర్మాణము కావించెను. 1528 వ సంవత్సరమున రాయలొక యుగ్ర నరసింహమూర్తిని చెక్కించెను. ఆ విగ్రహము మిక్కిలి పెద్దది. భయంకరముగా నుండును. ఇయ్యది మహమ్మదీయులచే నెంతయో పాడుచేయబడియు, నేటికిని దర్శనీయముగ నున్నది. రాయల యుదాహరణము నాతని సామంతులలో పలువురనుసరించిరి. గండికోటయందు పెమ్మసానివారు, రఘునాథస్వామికై

గొప్ప ఆలయమును కట్టించిరి. ఉత్తర పినాకినీ తీరమందు తాడిపత్రిలో, వీరు నిర్మించిన దేవాలయము లద్భుత శిల్పసౌందర్యమును ప్రకటించుచు విజయనగర శిల్పుల ప్రతిభను నేటికిని చాటుచున్నవి. కృష్ణరాయని సోదరుడగు అచ్యుతరాయలు విఠ్ఠలస్వామి దేవాలయమును సంపూర్ణము కావించుటయే కాక, అచ్యుతరామస్వామి ఆలయమును, పట్టాభిరామస్వామి దేవళమును నిర్మింపించెను. పట్టాభిరాముని మందిరము సువిశాలమగు మండపములతోడను, పుష్కరిణులతోడను ఒప్పి, చూపరులకు విస్మయము కల్గించుచున్నది. అచ్యుతరాయలు తిరుపతిక్షేత్రమును, చాల పర్యాయములు సందర్శించి, అచ్చట భక్తుల కొరకై మండపముల కట్టించెను. ఈతని ఉద్యోగులలో నొకడైన పెనుగొండ విరూపన్న యను నాతడు, లేపాక్షియను ప్రదేశమున, అత్యంత సుందరమైన యొక శివాలయమును నిర్మింపించెను. ఈ దేవమందిరమును గూర్చి మనము మరికొన్ని విశేషములు ముందు తెలిసికొనగలము.

విజయనగర రాజులు దేవాలయములనేకాక మిక్కిలి సుందరములగు ప్రాసాదములకూడ నిర్మాణము కావించిరి. కళింగ విజయానంతరము కృష్ణరాయలు భువనవిజయమను పేరిట నొక గొప్ప సభాభవనమును నిర్మించెను. ఈ మంటపము గజాకారముగల స్తంభములపై నిలచియుండును. 1520-వ సంవత్సరమున నీ రాజు తన తల్లి పేరిట రాజధానికి సమీపమున నాగలాపురమను నొక పేటను కట్టించెను. ఈ రాజు పెనుగొండ యందును, చంద్రగిరియందును కూడ రాజభవనముల నిర్మించెను. పెనుగొండ ప్రాసాదమునకు గగన మహలు అని పేరు. ఇయ్యది పూర్తిగా నశించినది కాని తరువాత కాలమున మధుర తంజావూరు నాయకులీ మందిరము ఫక్కినే తమ తమ ప్రాసాదముల నిర్మించుకొనుచుండినట్లు తెలియుచున్నది. అచ్యుతరాయలు వెంకట విలాసమంటప మనునొక మందిరమును, సదాశివరాయలు రత్నకూట మను నొక హర్మ్యమును నిర్మించిరి. ఇందు

రత్నకూట మొక ఆరామ మధ్యముననుండి, అపూర్వమగు విగ్రహములతోడను, రమణీయమగు పుష్కరిణులతోడను, విలసిల్లి దేవేంద్రుని వైజయంతములవలె, నుండెడిదట. విజయనగర శిల్పము అత్యంత రమణీయ మనియు, ఆనాటి శిల్పుల కళాప్రాశస్త్యమపూర్వ మనియు, భారతీయులును, విదేశీయులును కూడ అంగీకరించి యున్నారు. హంపి, తాడిపత్రి మున్నగు ప్రదేశముల సందర్శించి, అచ్చటి శిథిలముల కనులార చూచిన వారికీ యంశము తెల్లమగును.

విజయనగర యుగమందు చిత్రలేఖనముకూడ చక్కగ పెంపొందెను. భారత రామాయణముల యందలి ప్రసిద్ధ గాథలను దేవాలయములందును, గృహకుడ్యములపైనను, చిత్రింపించుట ప్రాచీనమగు నాచారము. ఈ పద్ధతియే విజయనగర యుగమున ననుసరింపబడినట్లు తెలుపవచ్చును. ఈ యుగమునాటి చిత్రలేఖన ప్రాశస్త్యమును హంపి, సోమపాలెము, లేపాక్షి యను ప్రదేశములలోని దేవాలయములయందు, నేటికిని మనము కాంచవచ్చును. లేపాక్షి యను ప్రదేశము నేటి అనంతపురము జిల్లాలోని హిందూపురమునకు తొమ్మిదిమైళ్లి దూరముననున్నది. ఇచ్చట విజయనగర యుగమునాటి వీరభద్రేశ్వరాలయము కలదు. దీనినే నేడు లేపాక్షి దేవాలయ మని పిలుచుచున్నారు. దీనిని కట్టించిన విరూపన్న యను నాతడు కృష్ణదేవరాయలకడను, అచ్యుతరాయల కడను, ఉద్యోగిగనుండెను. ఈతనికొకనాడు దైవికముగా నొక వీరభద్రవిగ్రహాము దొరకెనట. తత్ప్రాంతమున చిన్నచిన్న గుళ్లును, పాపనాశేశ్వరుని ఆలయమునుండెను. విరూపన్న ఈపాపనాశేశ్వరుని సన్నిధినే వీరభద్రుని ఆలయమునుకూడగట్టించెను. ఈదేవాలయము మంటపము, మహామంటపము, కళ్యాణమంటపము మొదలయిన సర్వ లక్షణములతో శోభిల్లుచున్నది. ఇందలి మహామంటప మరువదియారు స్తంభములపై నిలచియున్న విశాల నిర్మాణము. స్తంభములపై గాయకుల యొక్కయు గాయకురాండ్ర యొక్కయు చిత్రములు మనోహరముగా చెక్కబడినవి. ఈ మంటపము కప్పునకు లోపలి

భాగమున పురాణేతిహాసములలోని కథలు మిక్కిలి రమ్యముగ చిత్రింపబడినవి. "చక్కని ఎరుపు, నీలము, పసుపుపచ్చ, ఆకుపచ్చ నలుపు, తెలుపు లుపయోగించి ఈఅద్భుత చిత్రములు గీయబడినవి. పరిస్ఫుట రేఖల తీర్పునకు భారతదేశము పేరుగాంచినది. లేపాక్షి చిత్రము లాప్రతిష్ఠను నిల్పినవి. పెంచిన వన్నె నుతప్పలేదు. శివ, వీర భద్ర విష్ణ్వాలయములు, మూటికిని సమానమైన ముఖమండపము, పైకప్పు, లోపలిభాగమున మహాభారత రామాయణాది పౌరాణిక గాథల నెక్కుడుగ వ్రాసినను, వీరభద్ర దేవాలయపు గోడలమీదను, శివాలయపు అర్ధ మండపమునను శివ, కథలు అచ్చెరువు గొల్పు నట్లు చిత్రింపబడియున్నవి. పార్వతీ పరిణయము, పార్వతీ పరమేశ్వ రుల పరస్పరానురాగ క్రీడలు, త్రిపుర సంహారము, శివతాండవము లోని ఆఖ్యాయికలును ఈచిత్రములకు వస్తువులయినవి. గౌరీప్రసాద శివుడను చిత్రమున పద్మములు, మీనములతో జటాజూటమునుండి ప్రవహించు గంగను మరుగుపరుప జూచుట, శివుడు పార్వతి చుబు కముపై చేయిడి బుజ్జగించుట, ఖండితానన పార్వతి ప్రణయకోపమున మోముద్రిప్పుట, ఆ దంపతుల కండ్లతీరు, ముఖముల సౌరు, చూప రులను ముగ్ధుల కావించును. పరిణయమునకుముందు పార్వతి యలం కారము, పార్వతీ పరమేశ్వరులు చదరంగమాడుట, స్వభావప్రతిబింబ ములై యొప్పుచున్నవి. శివుడు అంధకాసుర సంహార మొనర్చుచోట ముఖమున శాంతి, కరమున శూలము పెట్టి, రుద్రుని నిర్లిప్తధర్మపర తను చాటించినారు. కృష్ణుని వేణుగానము గోపికలను సమ్మోహిత లను కావించినట్లు, శివుని భిక్షాటనము, ఋషిపత్నులను సమ్మోహిత లను కావించుట చక్కగా చూపినారు. వృషభారూఢ శివుడు, నటే శుని ఆనంద తాండవము, శివానుగ్రహము, దక్షిణామూర్తి మున్నగు నితర చిత్రములు కూడ చిత్రకారుల కళావైదగ్ధ్యమును వేనోళ్ళ చాటుచున్నవి;"[1] విజయనగర యుగమునాటి ఇతర చిత్రలేఖనముల

1. చూడు-వ్యాసము లేపాక్షిలోని రాయలనాటి చిత్రశాల, భారతి అక్టోబరు 1945.

పరీక్షించిన పక్షమున నందలి ప్రాశస్త్య మింతోధికముగ మనకు తెలియగలదు.

విజయనగర రాజులు మతవిషయములందు మిక్కిలి నిష్పక్షపాతబుద్ధితో వర్తించుచుండినట్లు ఇంతకు పూర్వమే సూచింపబడినది. రాజులకు విరూపాక్షుడు కులదైవము. సంగమవంశీయు లందరును శైవధర్మము నవలంబించిరి. సాళువ, తుళువ, ఆర్వీటి వంశముల వారికి వైష్ణవమతమం దభిమానము మెండు. కాని యివి రాజులవ్యక్తిగతాభిమానములు. ప్రజాపరిపాలనయందు వా రొక మతము నెడ ప్రత్యేకాభిమానమును కాని, మఱియొక మతమునెడ ద్వేషము కాని చూప లేదు. బహుశః దీనికి ముఖ్యకారణము సంగమ వంశీయుల కాలమున రాజ గురువుగను, మంత్రిగను ఉండిన మాధవ విద్యారణ్యుల వారి బోధయే కావచ్చును. విద్యారణ్యుడు శృంగేరీ పీఠాధిపతి. అద్వైతవాది, పరమేశ్వరుని నిజస్వరూపమును తెలిసినజ్ఞాని. కావున నా మహనీయుడు సర్వమతములయెడ సమభావములను చూపవలసినదని రాజులకు హితబోధ చేసియుండవచ్చును. బుక్కరాయలు జైన వైష్ణవులకు, శ్రావణ బెల్గోలాయందు వివాదము లేర్పడిన సందర్భమున, మిక్కిలి న్యాయబుద్ధితో వర్తించి, వారికి సంధిచేసిన ట్లీవరకే తెల్పియున్నాము. ఆ సందర్భమునసే ఆతడు ఒక రాజాజ్ఞను ప్రకటించి, ఆ యాజ్ఞను ప్రజల కందరికిని తెలియునట్లు శిలలపై చెక్కించెను. ఆ ప్రకటనమందు బుక్కరాయడు తన రాజ్యములో వైష్ణవులు జైనుల బాధించుట మున్నగు నకృత్యముల సహింపననియు, నిజమునకు జైన వైష్ణవ దర్శనములం దెట్టి భేదములును లేవనియు వ్రాయించెను. మహమ్మదీయుల యెడల కూడ విజయనగర రాజులును, సామంతులును నిష్పక్షపాతబుద్ధితో వర్తించిరి. మొదటి దేవరాయలు తన సేనయందలి మహమ్మదీయ సైనికుల ఉపయోగముకొరకై విజయనగరమున నొక మసీదు కట్టించెను. కృష్ణదేవరాయని కాలమున శాంత లింగప్ప అను నొక వీర శైవ సామంతుడు మతావేశపరవశుడై, అనేకులు శ్వేతాంబరజైనులను

చంపగా, రాయలీ దౌర్జన్యమును సహింపక, వెలుగోటి వంశీయుడైన తిమ్మానాయడను ఉద్యోగిని పంపి, శాంత లింగప్పను కఠినముగా శిక్షించినట్లు చరిత్రలు తెల్పుచున్నవి. కృష్ణరాయలు విష్ణు దేవాలయములను, శైవ దేవళములనుకూడ నిర్మింపించెను. రాయలు తిరుపతి, కంచి, సింహాచలము, అహోబిలము మున్నగు వైష్ణవ క్షేత్రములకే కాక తిరువణ్ణామలై, చిదంబరము, కాళహస్తి, శ్రీశైలము, అమరావతి మొదలగు శైవ దేవాలయములకు కూడ సమానముగ దానము లొసంగెను. ఈ రాజు అన్నిమతములవారిని తన కడ ఉద్యోగులుగ నియమించుకొనెను. రాయల రాజ్యమందు క్రైస్తవులు, మహమ్మదీయులు, యూదులు సర్వమతములవారును కూడ యథేచ్ఛముగ శాంతజీవనము గడుపవచ్చుననియు, వారికెట్టి కష్టములును కలుగవనియు, బార్బోసా యను విదేశీయుడు తెల్పి యున్నాడు. కృష్ణరాయల యల్లుడైన అళియ రామరాయలు మతవిషయములందు అపూర్వమైన సహనమును చూపినట్లు నిదర్శన పూర్వకముగ తెలుపవచ్చును.

పండ్రెండు, పదమూడు శతాబ్దులలో ఆంధ్ర దేశమున ప్రబలిన మతవిషయికమగు అసహనము విజయనగర కాలమునాటికి చల్లారినట్లు తెలుపనగును. ఈ యుగమున అద్వైత మతమును, వైష్ణవ మాధ్వ సాంప్రదాయములును, జైన ధర్మమును కూడ ప్రజ లవలంబించిరి. అద్వైతమత వ్యాప్తికి విద్యారణ్యుని కృషియే మూలము. వైష్ణవ మత వ్యాప్తికై, ఈ కాలమందు కందాడై, పరవస్తు కుటుంబములవారు మిక్కిలి పాటుపడిరి. కృష్ణరాయలకు తాతాచార్యుడను గురువుండినట్లు అనేక ఐతిహ్యములు కలవు. శఠగోపయతి యను నొక మహనీయు డీ కాలమునాటి వైష్ణవాచార్యులలో నొకడు. అల్లసాని పెద్దన కవీంద్రు డీ యతిశ్రేష్ఠుని శిష్యకోటిలోనివాడు. ద్వైతమత ప్రచారమునకై వ్యాస తీర్థుడను స్వామి ఈ కాలమున మిక్కిలి కృషిచేసెను. కాని యీ సాంప్రదాయమునకు ప్రజాదరము విశేషముగ లభింపలేదు. జైన మతస్థులును, వీరశైవులును కూడ

పలువురు విజయనగర రాజ్యమం దుండిరి. అన్ని మత సాంప్రదాయ ములవారికిని వేర్వేరు మఠము లుండెడివి. ఈ మఠాధిపతులు ప్రజలకు మతధర్మమునే కాక, లౌకిక విద్యలుకూడ బోధించు చుండిరి. మఠములకును, దేవాలయములకును, రాజపోషణయు, ప్రజా సహకారమును లభించుచుండెడివి.

విజయనగర యుగము భోగప్రధానమైన యుగమని తెల్పుట తప్పుకాదు. ఈకాలమందు ఆంధ్రుల ఐశ్వర్యమును, భోగ భాగ్య ములును మిక్కిలి ఉచ్ఛదశను పొందెను. ఆకాలమునాటి రాజులును, ధనాధిపులును ప్రాచీనులు వర్ణించిన అష్టభోగముల ననుభవించుచు, సుఖజీవనము గడపుచుండిరి. ప్రభువులును, ధనాధిపులును, ఉదయ మున ప్రొద్దుపోయి లేచి, పువ్వులతోడను, ఇతర సుగంధ ద్రవ్యముల తోడను, చేయబడిన మైపిండితో నొడలు రుద్దుకొని, స్నానము చేసెడి వారు. కొందరికి నిత్యమును అభ్యంగన స్నానముచేయుట వాడుకగా నుండెను. స్నానోదకమునందు పన్నీటిని కూడ విరివిగ వాడుచుండిరి. వారు స్నానానంతరము ధౌత వస్త్రములను, పూలదండలను, ధరిం చెడివారు. వీరి భోజనము సన్నని వరియన్నము, అప్పుడు కాచిన వెన్న నేయి, అడవి పక్షులు మృగముల మాంసము, వివిధ ఫలములు మున్నగు వానితో, కూడియుండెను. భోజనానంతర మనేక సుగంధ ద్రవ్య సంపన్నమగు తాంబూలమును వారు సేవించుచుండిరి. ఎవరైన అతిథులు వచ్చిన యెడల, వారిని తాంబూల మిచ్చి సత్కరించు నాచారము, నాడును నేడును కూడ తెనుగు దేశమున కానవగును. రాజువలన తాంబూలము పొందుట ఒక ప్రత్యేక గౌరవముగా ఆనాటివారు తలంచుచుండిరి. రాయ లెవ్వరికైన యొక ఘనకార్య నిర్వహణ బాధ్యత నొసంగిన యెడల, దానిని సూచించుటకై ప్రభు వాయుద్యోగికి కాని, సామంతునికి కాని, తాంబూలము నిచ్చుట వాడుకగ నుండెను. ధనాఢ్యులును, విలాసపురుషులు నగు వారు ఇల్లు విడచి బయటికిపోవునప్పుడు, వారితోకూడ తాంబూల కరండ మును చేబూని, పరిచారికలును, అంగరక్షకులుగ నితరపరివారమును,

పోవుచుండిరి. ఉన్నత వంశములవారు జరీ దుస్తులను, పట్టువస్త్రములను, పొడవైన అంగీలను, ఎత్తైన టోపీలను వాడుచుండిరి. ధనిక వర్గమునకు చెందిన స్త్రీలు, పావడ, బిగువైన కంచుకము, విలువగల పైట, కాళ్ళకు మెత్తని తోలుతో చేసినపాదరక్షలను, ధరించెడివారు. ధనాఢ్యులు వెండి బంగారు నగలను, రవ్వలయుంగరములను, ముత్యముల హారములను, అలంకారములుగ వాడుచుండిరి. విజయనగర యుగమున నొక కాలికి కడియమును ధరించుట వాడుకలో నుండెను. ఆ కడియమునకు గండపెండేర మని పేరు. దానిని ధరించుట గౌరవ చిహ్నముగ ఆనాటి ప్రజలు తలంచెడివారు. ధనికులగు వారు మేలైన ఆహారముల భుజించి, సుగంధధూమపరీవృత మగు మేడలందు, సుందరీమణుల సాంగత్యమున, నృత్య సంగీతములందో, చదరంగపుటాటయందో లేక జూదమునందో దినమును గడపుచుండిరి. ఉత్సాహవంతులును, వనవిహారాసక్తులు నగు వారు వేటకు పోవుచుండెడివారు. చిరుతపులులను, వేటకుక్కలను పెంచుట ఆనాడు వాడుకలో నుండెను. సామంతులును, మండలాధీశ్వరులును, చక్రవర్తి ప్రాసాదమునకు సమీపముననే తమ గృహములను నిర్మించుకొనుచుండిరి. ఇవి విశాలముగను, సుందరముగను, ఉండెడివి. ధనాఢ్యుల ఇండ్లు రాతితో నిర్మింపబడుచుండెను. సాధారణముగ అన్ని యిండ్లయందును గోడలపై పౌరాణిక చిత్రములుకాని, శృంగార చిత్రములు కాని వ్రాయించుట ఆనాడు ఆచారముగ నుండెను. రాజుల యిండ్లయందు అనేక కక్ష్యాంతరము లుండెడివి. మొదటి కక్ష్యపై గడియారముతో కూడిన ఒక గోపురము తరచుగ ఆనాటి నిర్మాణములలో కానవచ్చుచుండెను. ఈ మొగసాలనుండి లోనికి పోయిన తరువాత రాజు తన మంత్రులు, దండనాథులు మున్నగు వారితో మంతనములు సల్పు భవన ముండెడిది. అంతఃపురమున చిత్రశాల, నాట్యశాల, మజ్జన గృహము, భోజనశాల, చంద్రశాల, పానశాల, జలయంత్రధామము మున్నగు వివిధాగారము లుండెడివి. సామంతులు తమ శక్తికొలదియు తమ మందిరములలో కూడ

ఇట్టి ఏర్పాట్లనే చేయుచుండిరని మన మూహింపవచ్చును. మద్య పానము చేయుట రసికత కొక లక్షణముగా ఆనాడు భావింప బడెను. రాజభవనములందును, ధనాఢ్యుల మేడలందును ప్రత్యేక ముగ పానశాలలుండెడివి. వేసవియందు చంద్రశాలలలో మధు సేవనమునకై ఏర్పాట్లు చేయుచుండెడివారు. విలాస ప్రియులగు స్త్రీ పురుషులు, రాత్రులందు వీనిలో సమావేశమై, పుష్పాసవము, తాళమధువు, మదిరారసము, ద్రాక్షాసవము మున్నగు మద్యవిశేష ముల సేవించెడివారు. ఈ కథాకాలమునాటికి విజయనగరపట్టణ మున వేశ్యాగృహములు విరివిగ నుండెను. ప్రభువులును, ధనాఢ్యు లును వేశ్యలను పోషించుచు, బహిరంగముగనే సానివాడలకు విజయము చేయుచుండెడివారు.

వర్ణింపబడుచున్న ఈ యుగమునందు స్థానిక స్వపరిపాలనము వ్యాప్తిలో నుండెను. గ్రామపరిపాలనము పంచాయతీ సభల మూల ముగ జరుగుచుండెను. గ్రామస్థు లందరు నేకమై, ఈ సభలను సంవత్సరమున కొక పర్యాయ మెన్నుకొనుచుండిరి. ఈ విధముగ నియమింపబడిన పెద్దలు పన్నుల వసూళ్లు, నేరముల విచారణ, సంఘుపుకట్టుబాట్లు, కులవివాద పరిష్కారము మున్నగు విషయము లనుగూర్చి శ్రద్ధవహించుచుండిరి. తలారులు రాత్రియంతయు గ్రామ ములో గస్తీతిరుగుచు, చోరబాధనుండి గ్రామీణుల రక్షించుటయే కాక, అనుమానాస్పదులుగ నున్నవారినెల్ల నిర్బంధించి, ఠాణాలో బందీలుగనుంచి నిరపరాధులగువారిని తెల్లవారినమీాదట విడచి పుచ్చుచుండిరి. వెండి బంగారములు దొంగిలింపబడిన పక్షమున, రక్షకభటులు కంసాలులను పట్టుకొని, ఆ సొమ్ములను రాబట్టుట కాని, లేనియెడల దొంగసొత్తును తెచ్చినవారిని తమ కప్పగింపుడని వారి నొప్పించుటకాని చేయుచుండిరి. తాము పట్టుకొనిన దొంగలు, మున్నగువారిని రక్షకభటులును, అధికారులును విచారణకొరకై పంచాయతీ సభకు తీసికొనిపోయెడివారు. విచారణ సభలు దేవా లయములందుకాని, లేక గ్రామమధ్యమున రచ్చకట్టునందు కాని సమావేశమగుచుండెను. ఆకాలమున నేటివలె ప్రతిపట్టణమందును

న్యాయస్థానములు లేవు. ప్రజలయందు సంభవించిన వివాదములను, నేరములను పంచాయతీసభలు పరిష్కరించుచుండెను. ఈ సభల యందు వేదములును, శాస్త్రములును చదివిన బ్రాహ్మణులు న్యాయాధికారులుగ నుండెడివారు. వీరు విజ్ఞానేశ్వరీయమునే ముఖ్య ప్రామాణిక గ్రంథముగ స్వీకరించి, ఎట్టి ప్రతిఫలాపేక్షయును లేక, కేవల న్యాయైకబుద్ధితో తగవులను, నేరములను పరిష్కరించు చుండెడివారు. ఈ పంచాయతీసభలలో సివిల్, క్రిమినల్ అభి యోగములు రెండునుకూడ విచారింపబడుచుండెను. న్యాయ మూర్తులును, సాక్షులునుకూడ దైవముఖము చూచి సత్యమును పల్కుచుండిన కారణమున నీ పంచాయతీసభలలో జనులకు తరచు న్యాయము లభించుచుండెను. కూటసాక్ష్యము లిచ్చినను, అన్యా యములగు తీర్పు లిచ్చినను, వంశనాశనమగునని ఆ కాలమువారు భయపడుచుండిరి. ఈ పాపభీతియే వారి నధర్మమునుండి రక్షించు చుండెను. లంచగొండితన మానాడు లేకపోలేదు. కాని లంచ గొండులు మిక్కిలి స్వల్పముగ నుండిరి. పంచాయతీదారులు కావిం చిన నిర్ణయమునే ఇరుపక్షములవారును అంగీకరించుచుండిరి. కొన్ని సందర్భములలో, నభియోగమును పునర్విమర్శకై రాజువద్దకు పంపుచుండిరి. రాజు రెండుపక్షములవాదమును విని, సాక్షులను విచారించి, తన సభలయందలి విద్వాంసుల యభిప్రాయమును గైకొని వివాదముల పరిష్కరించుచుండెను. నేరస్థులకు బొండ వేయుట మొదలుకొని, మరణదండనమువరకును శిక్షలు విధింపబడు చుండెను. కాని యెంతటి గొప్ప నేరము చేసినను బ్రాహ్మణులకు ప్రాణదండనము మాత్రము విధింపబడెడిదికాదు. తలగొరుగుట, దేశమునుండి వెడలనడచుట, మున్నగు శిక్షలుమాత్రమే బ్రాహ్మ ణులకు విధింపబడుచుండెను.

విజయనగరయుగమందు రాజులును, ఇతర ధనాఢ్యులును కూడ ప్రజాహితకార్యముల చేయుటయందు మిక్కిలి శ్రద్ధ పూను చుండిరి. బుక్కరాయ హరిహరరాయల కాలములో చిక్కఉడయుడు అను ఒక మంత్రియుండినట్లు 1380 నాటి ఒక శాసనమువలన

తెలియుచున్నది. ఈతడు బుక్కరాయ సముద్రము, కీర్తిసముద్రము, నాగవ్వచెఱువు, బచ్చప్ప చెఱువు, చౌడప్ప కాలువ మొదలగు వానిని నిర్మించి రాజ్యములో కఱవులు లేకుండ చేసెనట. మొదటి దేవరాయలకు పూర్వము విజయనగరమున నీటికొరత యుండెనట. కావున దేవరాయలు పట్టణమునకు పండ్రెండుమైళ్ల దూరమున, తుంగభద్రానది కానకట్టకట్టించి, ఒక కాలువను పట్టణములోనికి తెచ్చెను. ఈవిధముగ పట్టణమున జలసమృద్ధి యేర్పడి, ఎచ్చట చూచినను ఉద్యానములును, పూలతోటలును, పండ్లతోటలును అభివృద్ధిచెందెను. దీనివలన విజయనగర పట్టణపు శోభ యెంతయో హెచ్చెను. ఈ యానకట్టను, కాలువను నిర్మించుటకు రాయల బొక్కసములోని ధనమంతయు వ్యయమైనట్లు తెల్పుదురు. "సస్య సమృద్ధికొరకు కృష్ణరాయలు 1521 వ సంవత్సరమున కొట్టుగల్లు నొద్ద గొప్ప ఆనకట్ట కట్టించి, అందుండి కాలువలను త్రవ్వించెను. ఈ రాజు తన రాజధానిలో పెద్ద చెరువొకటి త్రవ్వించెను. దాని కొరకై పోర్చుగీస్ ఇంజనీయరొకడు గోవానుండి రప్పింపబడెను. ఈ చెఱువు త్రవ్వుట కిరువదివేల జనులు పనిచేసిరి. ఈ చెఱువు నీరు సస్యసమృద్ధికై ఉపయోగించుచుండిరి. మొదటి తొమ్మిది సంవత్సరములవరకును చెఱువుక్రిందిభూములు రైతులకు శిస్తులేకుండ ఈయబడెను." రాజసామంతులును, ఇతర ధనికులునుకూడ చెఱువులు త్రవ్వించియు, సత్రములు వేయించియు, చలిపందిళ్ళ నేర్పాటు చేసియు మరి అనేకవిధములుగ ప్రజాక్షేమమునకై కృషిసల్పు చుండిరి.

యామునాచార్యుడను భాగవతోత్తముడు తాత్కాలికముగ తా ననుభవించిన రాజరికమును విడచి, నివృత్తిమార్గమున ప్రవేశింప బోవుచు, తన కుమారునికి పట్టాభిషేకముచేసి, రాజధర్మముల గూర్చియు, రాజనీతినిగూర్చియు అతనికి హితబోధ కావించు ఘట్టము కృష్ణరాయవిరచితమగు ఆముక్తమాల్యదయందు కలదు. రాయలు విశాలరాజ్యమును పాలించిన చక్రవర్తి. రాజనీతి కుశలుడు. ప్రాచీన

గ్రంథపఠనమువలననే కాక, స్వానుభవమువలనకూడ రాజనీతి రహస్యములను తెలిసికొనిన ప్రజ్ఞావంతుడు. కావున యామునాచార్యుని నీతి కృష్ణదేవరాయల రాజనీతియే యని మనము నిర్ణయింపవచ్చును. తాను తెల్పిన విషయముల నారాజు స్వయముగా అనుష్ఠించెననికూడ మనము తలంపనగును. రాయలు తెల్పిన రాజనీతి దిగువ వర్ణింపబడినది. "రాజు సమర్థులును, పండితులును, తనకు హితచింతకులు నగు బ్రాహ్మణులను మంత్రులుగ నియమించుకొనవలెను. దుర్గపాలకులుగకూడ బ్రాహ్మణులనే నియమింపవలెను. తన వివేచనాశక్తి నుపయోగించి, ఇతరులు తనకు హితులో కాదో రాజు తెలిసికొనవలయును. దుష్టమంత్రులను మాత్రము రాజెన్నడును సలహాదారులుగ పెట్టుకొనరాదు. అట్టివారు ప్రభువును నాశనము చేయుదురు. దుష్టమంత్రుల నియమించుకొనుటకంటె, రాజు తనకుతానే మంత్రియై రాజ్యపాలనము చేయుట మంచిది. వ్యవసాయదారుడు మొదట పొలమును స్వాధీనము చేసికొని, దాని చుట్టును ఎల్లగా ముండ్లకంచెను పాతి, అనంతరము భూమి సేద్యమున కనుకూలముగా నుండునట్లు, అందలి చెట్లవేళ్ళను, మంటి గడ్డలను తీసిపారవేయును. ఇదేవిధముగ రాజు దేశమును స్వాధీనముచేసికొని, ఎల్లలను కాపాడుకొని, బయటి శత్రువులు తన రాజ్యముపై దండెత్తకుండ చూచుకొనుచు, తన రాష్ట్రములోని క్షుద్రశత్రువులను నిర్మూలింపవలయును. బహిశ్శత్రువులకంటె అంతశ్శత్రువులు ఎక్కువ నష్టమును కల్గింతురు. కావున రాజు ముఖ్యముగ అంతశ్శత్రువులు లేకుండ చూచుకొనవలయును. సమర్థులగు చారులను నియమించి, తన రాజ్యమందలి యధికారుల గూర్చియు, ఇతర రాజ్యములగూర్చియు విశేషములు తెలిసికొనుచుండవలెను. ఇట్టి చారులు విశేషధన మిచ్చినగాని లభ్యపడరు. దేశమధ్యమున దుర్గమారణ్యముల నుంచరాదు. ఏలయన అవి చోరులకును, ఇతర దుర్మార్గులకును ఆలవాలముగ నుండును. రాజ్యపుటెల్లలందరణ్యము లుండుట మంచిది. దుర్గమారణ్యములలో నివసించుచు, రాష్ట్రపీడ చేయుకిరాతులకు సమీపమునందలి గ్రామ

ములను నిర్ధనులైన శూరులకు జీవనార్థ మీయవలెను. ఆ కిరాతులును, ఈ శూరులు నన్యోన్యము గలహించుచుందురు. దానివలన రాజునకును, రాజ్యమునకును, ఎట్టినష్టమును లేదు సరికదా దానివలన మంచియే కల్గును. అడవిజాతులవా రకారణముగ నే కోపించు స్వభావము కలవారు. ఇట్టివారితో న్యాయముగ వర్తించిన పక్షమున, వారు నీయెడ అనురక్తులగుటయే కాక, నీకువశ్యులగుటకూడతథ్యము. వీరి స్నేహము రాజున కవసరము. పరరాజులపై దండయాత్రకు పోయినప్పు డీ యాటవికుల ప్రోత్సహించి, రాజు తన శత్రుని దేశమును కొల్లగొట్టించవచ్చును. దేశము సుభిక్షముగ నుండుట కొరకును, దేశప్రజలు సుఖించుట కొరకును, రాజు చెరువులు త్రవ్వించియు, ఇతర విధములుగను పాటుపడవలెను. పరదేశములనుండి తన దేశములోనికి గుఱ్ఱములు, ఏనుగులు, రత్నచందన మౌక్తికాదులును వచ్చునట్లు వర్తకమును పెంచి, రేవులందు దిగుమతి సౌకర్యములు కలుగజేయవలెను. అనావృష్టివలనను, రోగములవలనను, ఉపద్రవముల వలనను, బయటి దేశముల జనులు తన దేశమునకు వచ్చినచో, వారిని వారిజాతికి తగినట్లు రక్షింపవలెను. శత్రురాజులు సామంతులు తమ యేలికపై నసంతుష్టులై యున్నట్లు తెలిసిన పక్షమున, బహుమతు లంపియు, అభయహస్తమిచ్చియు, వారిని రాజు స్వాధీనపరచుకొనవలెను. శత్రురాజుపై యుద్ధమునకుపోవునప్పుడు, రాజు తనసేనల నన్నిటిని చక్కగ కూర్చుకొని, క్రమక్రమముగా ముందునకు సాగి పోవలెను. అపాయకరములగు ప్రదేశములకు రాజు తాను స్వయముగ పోరాదు. సేనల పంపవలెను. రాజునకు తొందర పనికిరాదు. అతడు కార్యవాదిగ నుండవలయును. రాజు శత్రువులను జయింపవచ్చును. దుర్గములను పట్టుకొనవచ్చును. కానిశత్రుస్త్రీలను పుట్టింటి ఆడపడచులవలె మిక్కిలి మర్యాదతో చూడవలెను. పరరాజుల దూతలను మిక్కిలి గౌరవముతో చూడవలెను. వారియెడ అనాదరముకాని, వాక్పారుష్యముకాని పనికిరాదు. సైన్యము రాజునకు చాల ముఖ్యమైనది. కావున దానిపై నధికారము నాతడు సంపూ

ర్ణముగ తన ఉద్యోగులపై విడువరాదు. ప్రభువు సమస్త సుఖము లను అనుభవించుచుండియు, అప్రమత్తుడై ఒక కంటితో రాజ్యాంగ విషయముల నెల్లప్పుడు కనిపెట్టుచుండవలెను. రాజు తన దేహా రోగ్యమునుగూర్చి చాల శ్రద్ధ వహింపవలెను. సమర్థులగు వైద్యుల సలహా ప్రకారము వర్తించుచు, వ్యాయామాదులచే దేహమును దృఢతరము కావించుకొనవలయును. రాజు ధర్మమునకు భిన్నముగ ఎన్నడును వర్తింపరాదు. రాజ్యపాలనము పాపహేతువని భయపడి రాజు స్వధర్మమును విడువరాదు. ధర్మబద్ధముగ నడచినయెడల ఆతని కెట్టి పాపమును రాదు. తెలియక చేసిన పాపములను దానాదులచే పోగొట్టుకొనవచ్చును.'' కృష్ణదేవరాయలు వర్ణించిన రాజనీతిని విజయనగర రాజులలో పలువు రవలంబించియుందురని మన మూహింపనగును.

విజయనగర సామ్రాజ్యము హైందవ ధర్మమునకును, దాక్షి ణాత్య సంస్కృతికిని నిక్షేపమునంటిది. ఈ రాజ్యము ఆంధ్ర, ద్రవిడ, కర్ణాటక జాతుల నేకీభవింపజేసెను. మహమ్మదీయుల దండయాత్ర లచే యాదవ, కాకతీయ, మధుర, కంపిలి రాజ్యములు కూలిపోయి హిందూ సభ్యతయు, హిందూధర్మమును నశింపనున్నతరి యీ సామ్రాజ్యము వెలసెను. ఈ రాజులు ధర్మసంరక్షణము కొరకును, రాజకీయ స్వాతంత్ర్యము కొరకును, తమ సామ్రాజ్యపు సర్వశక్తు లను ధారపోసిరి. దక్షిణాపథ రాజ్యములను నాశనముచేసిన ముస ల్మానులు, హైందవుల రాజకీయ స్వాతంత్ర్యమును నాశనము చేయు టయేకాక, పాలితప్రజలను బలవంతముగ తమ మతములోనికి చేర్చు కొనుటకును, హిందూసభ్యతను రూపుమాపుటకును, పూనుకొనినం దున, హైందవప్రజ లెల్లరు నేకమై ఈసామ్రాజ్యమును స్థాపించిరి. ఈసామ్రాజ్యమునకు ముఖ్యమైన ఆదర్శము ధర్మరక్షణము. ధర్మ మనుపదమును విజయనగరరాజులు మిక్కిలివిశాలభావముతో నుపల క్షించిరి. వారు రక్షించినధర్మము వైష్ణవధర్మముకాని, శైవధర్మము కాని, జైనధర్మముకాని కాదు. అయ్యది కేవల హిందూధర్మము

కూడ కాదు. వారిచే రక్షింపబడిన ధర్మము విశాలమైన విశ్వజనీన ధర్మము. విజయనగర రాజులు సర్వమతముల వారియెడలను-అనగా మహమ్మదీయులు, యూదులు, క్రైస్తవులుతుదకు నిరీశ్వరవాదుల యెడల కూడ నిష్పక్షపాత బుద్ధితో వర్తించిరి. ప్రాచీనకాలము నుండియు ప్రజ లవలంబించు ఆచారములను, కట్టుబాట్లను, నియమములను వీరు రక్షించిరి. వర్ణాశ్రమ ధర్మములను వీరు గౌరవించిరి. సంఘ నియమములందు వీరెన్నడును జోక్యము కల్పించుకొనలేదు. ఏదైన సాంఘికాచారము ప్రజాక్షేమమునకు భిన్నముగా నున్నట్లు తోచిన పక్షమున, వీరు సంఘనియమముల మార్చెడివారు. క్రీ. శ. 1425 వ సంవత్సరమున పడైవీడు రాజ్యము [నేటి ఉత్తరదక్షిణ ఆర్కాడు జిల్లాలు] లోని ఆంధ్ర, ద్రావిడ కర్ణాటక బ్రాహ్మణులు అర్కపుష్కరిణియందలి గోపీనాథస్వామి సమక్షమున, సమావేశమై వివాహాదులయందు కన్యాదానపద్ధతిమాత్రమే అనుసరణీయమనియు, వరశుల్కమును తీసికొనరాదనియు, నిర్ణయించి, ఇందులకుభిన్నముగా వర్తించు బ్రాహ్మణులు సంఘముచేతను, రాజుచేతను శిక్షింపబడవలెనని నిర్ణయించిరి. రాజు దీని కంగీకరించెను. ఇట్టి అసామాన్య పరిస్థితులలో తక్క మరెప్పుడును రాజు ప్రాచీనాచారములను, సంఘ నియమములను త్రోసిపుచ్చెడివాడు కాడు. రాజులు సమస్త దేవస్థానములకును, మతములకును ధనసహాయము చేయుచుండిరి. మిక్కిలి పురాతనమైన పంచాయతీ సభలవలన గ్రామపరిపాలనము మిక్కిలి సరళముగను, శాంతముగను జరిగిపోయెడిది. ఈవిధముగ రాజు మత ధర్మములను, సాంఘిక ధర్మములనుకూడ చక్కగ పోషించి, ప్రజాభిమానమును చూరగొనుచుండెను. దేశమందు శాంతిభద్రతలు నెలకొనెను. ప్రజలకు శత్రురాజుల భయమును, చోరభయమును తప్పెను. వ్యవసాయము, పరిశ్రమలు అభివృద్ధి గాంచెను. విదేశ వ్యాపారము ముమ్మరముగా సాగెను. దేశమున సౌఖ్యము నెలకొనెను. భోగ భాగ్యములు పెంపొందెను. విజయనగరరాజులు శిల్పకళ, సంగీతము, నృత్యము, చిత్రలేఖనము మున్నగు లలితకళలను పోషించిరి. విద్వాం

సులను కవులను సన్మానించిరి. సంస్కృతము, ఆంధ్రము, తమిళము, కర్ణాటభాష వీని నన్నింటిని విజయనగర ప్రభువులు పోషించిరి. ఈ భాషలలో అనేక గ్రంథరాజము లా కాలమున వెలసెను. ఈ విధముగ విజయనగర సామ్రాజ్యము ధర్మసంరక్షణము కావించి, హైందవ సభ్యతను పోషించెను. హిందువులు స్థాపించిన గొప్పసామ్రాజ్యము లలో నిదియే తుట్టతుది సామ్రాజ్యము.



# ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి

## 19 వ ప్రకరణము

### నాయక రాజులు—గోల్కొండ—బ్రిటీషురాజ్యస్థాపనము

విజయనగర రాజ్య మత్యున్నతస్థితియం దున్నకాలమునందే దక్షిణమున రెండు సామంతరాజ్యములు స్థాపింపబడెను. అందొకటి తంజావూరు రాజ్యము. రెండవది మధురరాజ్యము. తంజావూరు రాజ్యము ప్రాచీనమైన చోళరాజ్యమునకును, మధుర రాజ్యము పూర్వకాలమునాటి పాండ్యమండలమునకును ఇంచుమించు సరి పోవును. భాషాదృష్టిచే చూచినపక్షమున నీ రెండును తమిళ రాష్ట్ర ములు. కాని ఈ రాష్ట్రములు విజయనగర రాజ్యాంతర్గతములుగ నుండిన కారణమున, వీనిని పాలించుటకు ఆంధ్రనాయకులు నియ మింపబడిరి. కావున వీని నాంధ్రసామంతరాజ్యములుగ పరిగణింప వచ్చును. ఈ నాయకరాజ్య సంస్థాపనమునకు ఫలితముగ, ఆంధ్రు లనేకులు, అన్నికులములవారును కూడ, దక్షిణాపథమునకు పోయి, అచ్చట శాశ్వత నివాస మేర్పరచుకొనిరి. వీరి వంశీకులనే మనము నేడు రాష్ట్రేతరాంధ్రు లని వ్యవహరించుచున్నాము. ఇట్లు వలస పోయినవారిలో, కొందరు నేటికిని తమ తల్లిభాషయగు తెనుగును మరువక, అధమపక్షము ఇంటిలోనైన దానిని మాట్లాడుచున్నారు.

మరికొందరు తమ వ్యక్తిత్వమును నిలుపుకొనజాలక, ద్రావిడజన సముద్రమున మునిగిపోయి, తమ తొంటి జాతినుండి విడివడినారు. ఈ వలసకు ముఖ్యకారణమగు రాజకీయ పరిస్థితులను సూక్ష్మముగ మనము తెలిసికొనుట అనావశ్యకము కాదు. తంజావూరు నాయకులును, మధురనాయకులును కూడ ఆంధ్రకవులను పోషించిరి. వీరి యుగమందు తెనుఁగుభాషలో కొన్ని నూతనములైన పోకడలు కాన్పించును. ఈ నాయకరాజులు సంగీతము మున్నగు లలిత కళలను పోషించిరి. ఈ కారణములచే తంజావూరు, మధురనాయకుల రాజ్య పరిపాలనమును గూర్చి మనము తెలిసికొనవలసిన ఆవశ్యకత యేర్పడినది.

తంజావూరు రాజ్యము ప్రాచీన చోళమండలమునకు ప్రతినిధి యని తెలిపియున్నాము. శ్రీకృష్ణదేవరాయల మరణానంతర మీ చోళరాజ్యమునం దరాజక పరిస్థితు లేర్పడెను. రాజ్య వ్యవస్థను చక్కబరచి, చోళమండలమున శాంతిని నెలకొల్పుటకై సమర్థుడగు నొక నాయకుడు కావలసివచ్చెను. ఈ కాలమున విజయనగర చక్రవర్తి అచ్యుతరాయలు. అచ్యుతరాయని దేవేరులలో నొక్కతె తిరుమలాంబ. రాయ లీమెయెడల మిగుల ననురక్తుడు. తిరుమలాంబ చెల్లెలగు మూర్తిమ్మను చెవ్వప్ప నాయకుడను సామాన్య దండనాయకుడు వివాహమాడి యుండెను. ఈ వంశమువా రింతకుపూర్వ మెచ్చటను రాజ్యపరిపాలనము చేయకపోయినను, వీరు వంశగౌరవమునందు విజయనగర ప్రభువులకు తీసిపోవువారు కారు. తన చెల్లెలి పెనిమిటి యైన చెవ్వప్పనాయకుని కేదైన గొప్ప పదవి నిప్పింపవలెనని కోరుచున్న తిరుమలాంబకు చోళరాజ్యమందలి అరాజక పరిస్థితులు మిక్కిలి అనుకూలించెను. తన భర్తయగు అచ్యుతరాయనితో చెప్పి, ఆమె చెవ్వప్పనాయకుని చోళమండలమునకు ప్రభువుగ పంపించెను. ఇదియే తంజావూరురాజ్య ప్రారంభము. ఈ రాజ్యస్థాపనమును గూర్చి స్థల పురాణాదులలో కొన్ని అపూర్వ గాధలు కలవు, కాని వానిని చారిత్రికు డంగీకరింపజాలడు.

చెవ్వప్పనాయకుడు క్రీ. శ. 1535 వ సంవత్సరమున తంజావూరు పాలకుడుగ నియమింపబడెను. ఈతడు ఇరువదియారుసంవత్సరములు రాజ్యభారమును పూని, ఆపైన బుద్ధిపూర్వకముగ వానప్రస్థమును స్వీకరించి, భగవచ్చింతనయందు కాలము గడపెను. ఈ రాజు మిక్కిలి సమర్థుడు, నీతికుశలుడు నని తోచుచున్నది. చోళమండలమున చిరకాలమునుండియు చోరబాధ విశేషముగా నుండెను. అందువలన ప్రజలకు శాంతజీవనము గడపుట కవకాశ ముండెడిది కాదు. ఈ చోరుల నణచుటకై చెవ్వప్పనాయకు డొక చక్కని యుపాయము నాలోచించెను. చోరులలో నాయకులుగ నున్న సర్దారుల కీత డధికార మొసగి, శాంతిరక్షణ బాధ్యతను వారిపైననే ఉంచెను. ఈ చోరనాయకులు దొంగలను సంపూర్ణముగ నణచివైచి, క్రమక్రమముగ ప్రభుత్వాధికారమునకు బద్ధులైన జమీందారులుగ, పరిణమించిరి. తంజావూరు జిల్లాయందు నేటికిని ఈ జమీందారులలో కొందరు కలరు. పుదుక్కోట సరిహద్దుననున్న గంధర్వకోటయను జమీందారీ ఈవిధముగ నేర్పడిన దే. చెవ్వప్ప నాయకుని తంజావూరు పాలకునిగ నియమించినది అచ్యుతరాయలే యైనను, అళియరామరాయలుకూడ ఈ నియామకము నంగీకరించి, దృఢపరచెను. ఈ నాయకుడు సామ్రాజ్యము నెడల మిక్కిలి విశ్వాసముతో వర్తించెను. సమకాలీనులగు మధుర జింజీ నాయకులతోకూడ నీ రాజు స్నేహభావమును నెరపెను. ఈతని కాలమున దేశము సుభిక్షముగ నుండి, శాంతి సౌఖ్యముల ననుభవించెను. ఈ నాయకుడు ప్రజారంజకముగ పాలనము చేసెను. బీద వారియెడల నీతడు మిక్కిలి కరుణపూని, వారిపై పన్నుల భారమును వేసెడివాడు కాడు. చెవ్వప్ప బ్రాహ్మణుల కనేకాగ్రహారముల నొసంగెను. దేవాలయములను గోపురములను కట్టించెను. అరుణాచల, వృద్ధాచలములలో గోపుర ప్రాకారమంటపాదులు నిర్మించెను. తటాకముల త్రవ్వించెను. తన పేరిట నీ రాజు తంజావూరు పట్టణము వెలుపల నొక చెరువును త్రవ్వించెను. దీనిని నేటికిని ప్రజలు చెవ్వప్ప

నాయనికుంట యని వ్యవహరించుచున్నారు. ఈరాజు శివగంగకోటను బలపరచెను. ఈతడు వైష్ణవ మతాభిమాని అయినను ఇతర మతములయెడ వైషమ్యము పూనక, వానినికూడ సమానముగ పోషించెను. ఈ కాలమునాటికి విజయనగరములోనికి పోర్చుగీసువారు విశేషముగ వచ్చియుండిరి. వారిలో కొందరు పాదిరీలు మత ప్రచారమునకై యెంతయో ప్రయత్నించుచుండిరి. చెవ్వప్ప వీరి కెట్టి నిరోధమును కల్పింపలేదు. అంతేకాక 1560 వ సంవత్సరమున నీరాజు తంజావూరు పట్టణమున చర్చిని, గృహములను నిర్మించుకొనుటకు క్రైస్తవ పాదిరీల కవకాశము కల్పించెను. ఈ రాజుకాలమున గోవిందదీక్షితు డను మహావిద్వాంసుడు తంజావూరురాజులకు మంత్రిగనియమింపబడెను. గోవిందదీక్షితుడు కర్ణాటకబ్రాహ్మణుడు, స్మార్తమతస్థుడు. తంజావూరు నాయకులు మన్నారుగోత్రమువారని రంగాజమ్మ తన మన్నారు దాసవిలాసమున తెల్పినది. తంజావూరు వచ్చిన వెనుక ఈ వంశమువారు, మన్నారుకోయిల యందలి రాజగోపాలస్వామిని తమ కులదైవముగ చేసికొనిరి.

వృద్ధుడైన చెవ్వప్పనాయకుడు క్రీ. శ. 1561 వ సంవత్సరమున రాజ్యకార్య నిర్వహణమునుండి విరమించుకొనగా, ఆతని కుమారు డచ్యుతనాయకుడు పరిపాలనాధికారమును పూనెను. తన ప్రభువైన అచ్యుతరాయలయందలి గౌరవముచే, చెవ్వప్పనాయకుడు తన కుమారున కచ్యుతనాయకుడను పేరు పెట్టెను. అచ్యుతనాయకుని కాలమున గోవిందదీక్షితుడు మంత్రిత్వమును నెరపుచు, మిక్కిలి సమరతతో రాజ్యాంగము నడపుచున్నందున, దేశమున శాంతి నెలకొని ప్రజలు సుఖపడిరి. అచ్యుతనాయకుడు తన ప్రభువులగు విజయనగర చక్రవర్తులయెడల భక్తిని. స్నేహభావమును చూపెను. విజయనగర ప్రభువుల కేటేట కప్పముకట్టుచు, ఆంతరంగిక విషయములలో మాత్ర మీతడు స్వతంత్రముగ నుండెడివాడు. మధుర జింజీనాయకులు మాత్రము, మొదటినుండియు విజయనగర చక్ర

వర్తులయెడల వైరభావము పూని, వారి యధికారము నెన్నడు ధిక్కరింతుమా యని సమయమునకై వేచియుండిరి. శ్రీరంగరాయల యనంతరము విజయనగర చక్రవర్తియైన రెండవ వెంకటపతి రాయల కాలమున, మధురరాజ్యము కేంద్రప్రభుత్వముపై బహిరంగముగ తిరుగుబాటు చేసెను. ఈ కారణమున వెంకటపతి రాయలు మధుర రాజ్యముపై దాడివెడలెను. స్వామిభక్తిపరుడైన అచ్యుతనాయకుడు వెంకటపతిరాయలకు తోడ్పడెను. జింజీనాయకుడు మధుర ముద్దువీరప్పనాయకునకు సహాయ మొసంగెను. వళ్లం కోటవద్ద విజయనగర చక్రవర్తికిని, మధురనాయకునికిని, జరిగిన యుద్ధములో ముద్దువీరప్పనాయకుడు సంపూర్ణముగ పరాభవము నొంది, సామ్రాజ్యమునకు కప్పము కట్టుట కంగీకరించెను. యుద్ధమున జింజీనాయకుడు వెంకటపతిరాయలచే బందీగా గైకొనబడినట్లు తెలియుచున్నది. ఈ వళ్ళంకోట పరాజయమువలన, మధుర జింజీ నాయకులకు సామ్రాజ్యమునెడ వైరమును, తంజావూరు రాజుల యెడల ద్వేషమును హెచ్చెను. ఈ యుద్ధమునందు తంజావూరు రాజు పక్షమున ఆతని కుమారుడు రఘునాథ నాయకుడు, వెంకట పతి రాయలకు సహాయముగ నేగెను. అచ్యుతరాయల కాలమందు పోర్చుగీసువారు, తంజావూరు రాజ్యమునకు విరుద్ధముగ కుట్రలు సల్పి, స్థానిక ప్రజలు కొందరిచే ప్రభుత్వముపై తిరుగుబాటు చేయించిరి. కాని యువరాజైన రఘునాథ నాయకుడీ పన్నాగముల తెలిసికొని, పోర్చుగీసువారిని వారి కేంద్రస్థానమగు నాగపట్టణమునుండి తరిమివేసెను. ఈ కాలమునందే గోలకొండ నవాబు విజయనగర రాజ్యముపై దండెత్తగా, చక్రవర్తి వెంకటపతిరాయలు తంజావూరు నాయకుని సహాయ మంపవలసినదిగా కోరెను. తండ్రి యనుమతిపై రఘునాథనాయకుడు ససైన్యుడై వెడలి, వెంకటపతిరాయలకు సహాయ మొనర్చి, పెనుగొండవద్ద మహమ్మదీయ సేనలను సంపూర్ణముగ పరాభవించి, తరిమివేసెను. ఇందులకు సంతసించి, వెంకటపతిరాయలు తంజావూరు నాయకున కెన్నియో బహుమానములను, బిరుదములను ఇచ్చి గౌరవించెను.

అచ్యుతనాయకుని రాజ్యావసానకాలమున దేశ మశాంతికి గురి యయ్యెను. తంజావూరు రాజ్యమునెడ పగబూనియున్న పోర్చుగీసువారు, చోళగుడను చోరనాయకుని ప్రోత్సహించి, రాజ్యమునందు దొంగతనములు, బందిపోటులు వృద్ధి కావించిరి. ఈ చోళగుడు పోర్చుగీసువారి సహాయముతో, కావేరీ సాగర సంగమము వద్ద, దేవికోటయను చిన్నద్వీపమును కేంద్రముగ చేసికొని, దుండగములు చేయసాగెను. బుడతకీచులు సింహళ ద్వీపమునందలి జాఫ్నారాజును, పదభ్రష్టుని చేయగా, ఆతడు వచ్చి తంజావూరు నాయకుని శరణుజొచ్చెను. రెండవ వెంకటపతి రాయల యనంతరము విజయనగర చక్రవర్తియైన శ్రీ రంగరాయలను, రాజబంధువులలో నొక్కడైన గొబ్బూరి జగ్గరాయలు సకుటుంబముగ చంపించెను. క్రమక్రమముగా తానే చక్రవర్తి కావలె నని జగ్గరాయని కోరిక. కాని హత్య కావింపబడిన శ్రీరంగరాయల పుత్రులలో రామదేవరాయలను నాతనిని, ప్రభుభక్తి పరాయణుడగు యాచమ నాయకుడను సేనాని రక్షించి, తంజావూరునకు తీసికొనిపోయెను. తంజావూరు రాజ్యము మొదటినుండియు ప్రభుభక్తికి పెట్టినది పేరు. కావున ప్రభు హంతకుడైన గొబ్బూరి జగ్గరాయని శిక్షించి, రామదేవరాయని చక్రవర్తిగ ప్రతిష్ఠించు బాధ్యత, తంజావూరు రాజ్యముపై బడెను. మధుర జింజీనాయకులును, ఇతర సామంతులును, పోర్చుగీసువారును కూడ, జగ్గరాయని పక్ష మవలంబించిరి. తంజావూరు మాత్రము యాచమనాయకుని కండగ నిల్చి ప్రభుభక్తి ప్రకటించుటకై నిశ్చయించెను. ఇట్టి క్లిష్ట పరిస్థితులలో వృద్ధుడైన తా నేమియు చేయజాలనని నిశ్చయించి, గోవిందదీక్షిత మంత్రి సలహాపై అచ్యుతనాయకుడు సంప్రాప్త వయస్కుడును, సమర్థుడు నగు తన కుమారుడు రఘునాథ నాయకునికి పట్టాభిషేకము చేసి, పరిపాలనా రంగమునుండి 1614 సంవత్సరమున తప్పుకొనెను.

అచ్యుతనాయకుడు కూడ తండ్రివలెనే అనేక దేవస్థానములకు దానములిచ్చి, గోపుర ప్రాకారాదుల నిర్మించి, హరిహర భేదము లేక

వర్తించెను. ఈతడు ప్రజోపయోగముకొరకై, చోళరాజులచే నిర్మింపబడిన కావేరీనది ఆనకట్టను, బాగుచేయించెను. మహా పండితుడగు అప్పయ్యదీక్షితుడను బ్రాహ్మణోత్తము డీ రాజుచే సన్మానము లందెను.

రఘునాథ నాయకుడు (1614-1633) తంజావూరు నాయకులలో శ్రేష్ఠుడు. ఈతనిని ఆంధ్రభోజ బిరుదాంకితుడగు కృష్ణదేవ రాయనితో పోల్చుట అసమంజసము కాదు. కృష్ణరాయలవలెనే రఘునాథ నాయకుడుకూడ గొప్పవీరుడుగను, కవి పండిత పోషకుడుగను, కీర్తిగాంచెను. రఘునాథుని రాజ్యారంభకాలమున నాతని నెదుర్కొనిన గురుతర బాధ్యతలను మన మింతకు పూర్వమే తెలిసికొని యున్నాము. సింహాసన మధిష్ఠించిన కొలదికాలమునకే, ఈ రాజు ససైన్యుడై వెడలి దేవికోటను ముట్టడించి, చోళగుని పరాభవించెను. పోర్చుగీసువారి సహాయము చోళగుని సకాలములో రక్షింపజాలక పోయెను. మార్గాంతరము లేక చోళగుడు పలాయనము చిత్తగించెను. ఆపైన రఘునాథ నాయకుడు జాఫ్నాయందలి పోర్చుగీసు కేంద్రముపై దండెత్తి, ఆ బుడతకీచులను పూర్తిగ నోడించెను. పోర్చుగీసు లతి కష్టముపై తప్పించుకొని, పడవలలో పారిపోయిరి. రఘునాథుడు విజయాట్టహాసముతో జాఫ్నాయందు ప్రవేశించి అచ్చటి రాజును పునఃప్రతిష్ఠ కావించెను. 1616-వ సంవత్సరమున రఘునాథ నాయకునికి, విజయనగర ప్రభుహంతయగు జగ్గరాయనికిని, తోపూరను ప్రదేశమున భయంకరమగు యుద్ధము సంభవించెను. పోర్చుగీసులు జగ్గరాజునకు తోడ్పడిరి. కాని విజయలక్ష్మి రఘునాథునే వరించెను. యుద్ధమునందు జగ్గరాజు ప్రాణములు కోల్పోయెను. రఘునాథ నాయకుడు రణభూమియందే బాలుడగు రామరాయలను విజయనగర రాజ్యమునకు పట్టాభిషిక్తుని చేసి, తన ప్రభుభక్తిని వెల్లడించెను. రఘునాథ నాయకుడు తన సైనికులకు డచ్చి అధికారులచే సైనికశిక్షణ నిప్పించుచుండినట్లు చరిత్రలు తెల్పుచున్నవి. రఘునాథ నాయకుడు సాధించిన విజయపరంపరలచే

నాతని కీర్తి నలుదిక్కుల వ్యాపించెను. పరరాజు లీతని కడకు తమ రాయబారుల పంపజొచ్చిరి. బిజాపుర నవాబు హానుమోజి పంతు అను రాయబారిచే స్నేహవార్త పంపెను.

రఘునాథ నాయకుడు మహా పరాక్రమవంతుడే కాదు. ఈత డారితేరిన విద్వాంసుడు. సాహిత్యప్రియుడు. తంజావూరు రాజ్యము వారికి చిరకాలమునుండి మంత్రిగను, హితచింతకుడుగను, ఉండిన గోవిందదీక్షితుడు సంగీతసుధయను గ్రంథమును వ్రాసినట్లు తెల్పు దురు. ఈ గ్రంథమును రఘునాధుడే స్వయముగ వ్రాసె ననువాదము కూడ కలదు. గోవిందదీక్షితుని కుమారుడైన యజ్ఞ నారాయణ దీక్షితుడు, రఘునాథ నాయకుని శిష్యుడై యుండెను. యజ్ఞనారాయ ణుడు సాహిత్య రత్నాకరము, అలంకార రత్నాకరము, రఘునాథ భూపాలీయము అను సంస్కృత గ్రంథములకు కర్త. ఇట్టివాని గురు వనిపించుకొనిన రఘునాథ భూపాలుని వైదుష్యమును, వేరుగ పొగడ నక్కరలేదు. ఈ రాజు నాస్థానములో పెక్కురు సంస్కృతాంధ్ర కవులు నివసించిరి. గోవిందదీక్షితుని రెండవ కుమారుడగు వెంకట మఖి ఈ కాలమువాడే. ఈతడు చతుర్దండి ప్రకాశికయను సంగీత శాస్త్ర గ్రంథమును రచించెను. రుక్మిణీ పరిణయము, ఆనందరాఘ వము, కావ్య దర్పణము మున్నగు సంస్కృత గ్రంథముల రచించిన రాజచూడామణి కవియు, పారిజాతాపహరణ నాటకమును వ్రాసిన కుమార తాతాచార్యుడును, రఘునాథుని యాస్థానమున నుండిరి. ఈ రాజు విద్వత్సభయందు కవయిత్రులుకూడ నుండిరి. రామభద్రాంబ యను నామె రఘునాథుని చరిత్రను వర్ణించుచు 'రఘునాథాభ్యుద యము' అను సంస్కృత కావ్యమును వ్రాసెను. మధురవాణియను మరియొక కవయిత్రి రఘునాథునిచే ఆంధ్రమున వ్రాయబడిన రామా యణమును, సంస్కృతీకరించి కీర్తిని గాంచెను. రఘునాథుని యాస్థాన మున ప్రసిద్ధుడగు చేమకూర వెంకటరాజు నివసించెను. ఈ వెంకట కవి విజయవిలాసము, సారంగధరచరిత్రము: అను ఆంధ్ర గ్రంథముల రచించి, రాజున కంకిత మిచ్చెను. విజయవిలాసము తెనుగు భాషలోని

సుందరతమ కావ్యములలో నొకటి యని పేరు గాంచినది. కృష్ణాధ్వరి యను కవి 'నైషధ పారిజాతీయము' అను శ్లేష ప్రబంధమును రచించి, రఘునాథ నాయకుని కంకిత మిచ్చెను. రఘునాథ నాయకుడు స్వయముగ తెనుగునందు పారిజాతాపహరణము, గజేంద్రమోక్షము, రుక్మిణీ కృష్ణ వివాహ యక్షగానము, జానకీపరిణయము, అచ్యుతాభ్యుదయము, వాల్మీకి చరిత్రము, సావిత్రి, నలచరిత్రము, రఘునాథ రామాయణము అను గ్రంథముల రచించినట్లు తెల్పుదురు. ఈ రాజు, పారిజాతాపహరణమును యామద్వయములో నాశువుగ చెప్పి, తండ్రిచే కనకాభిషేక గౌరవము పొందెనట. రఘునాథ నాయకుడు గొప్ప కళావేత్తయని కూడ తెలుపవలసియున్నది. సంగీతమతని కభిమానవిద్య. ఈతడు సంగీతమున గొప్ప ప్రవీణతను సంపాదించి, స్వయముగ నూత్న గతులను కల్పించెను. 'రఘునాథ మేళ' అను సంగీత సంపుటి నీరాజు కల్పించినట్లు తెల్పుదురు. ఈ రాజు నృత్యకళనుకూడ మిక్కిలి పోషించెను.

రఘునాథనాయకుడుకూడ తండ్రి తాతలవలెనే బ్రాహ్మణుల యెడ భక్తిగల్గి, వారి కనేక దానములుచేసెను. ఈత డన్ని మతముల వారిని సమభావముతో చూచి, గౌరవించెను. మహావీరుడును, విద్వాంసుడును, రసికుడు నైన యీ రాజశ్రేష్ఠుడు 1633 లో కీర్తిశేషు డయ్యెను.

రఘునాథనాయకుని యనంతరము విజయరాఘవ నాయకుడు రాజ్యాధికారము వహించెను (1633-1673). ఈతడు తన సోదరుని చంపి, రాజ్యము గ్రహించినట్లు చారిత్రికులు తెల్పుచున్నారు. విజయరాఘవు డసమర్థుడు. భీరుడు. రాజనీతి కుశలత యీతనికడ నెంత మాత్రమును లేకుండెను. తన వంశీకు లందరును విజయనగర సామ్రాట్టులయెడ భక్తిగలవారై, వారికి కష్టకాలమున తోడ్పడుచుండిరి. విజయరాఘవు డీ పద్ధతిని విడనాడి, 1642 వ సంవత్సరమున విజయనగర సింహాసన మధిష్ఠించిన మూడవ శ్రీరంగరాయలకు సహాయము

చేయుటకు నిరాకరించుటయే కాక, ఆతని శత్రువగు మధురతిరుమల నాయకునికి తోడ్పడెదనని వాగ్దానముచేసెను. కాని మాట నిలువ బెట్టుకొనలేదు. అందువలన మధురనాయకుని కీతనిపై మిక్కిలి ఆగ్రహము కల్గెను. విజయరాఘవుని యసమర్థతను గుర్తించిన గోలకొండ బిజాపురములందలి మహమ్మదీయు లీతని రాజ్యముపై దండెత్తివచ్చి కొల్లగొట్టిరి. వారి కపారమగు ధనమునిచ్చి, విజయ రాఘవుడు తాత్కాలికముగ తన్ను తాను రక్షించుకొనెను. కాని మహమ్మదీయులకు లంచమిచ్చుటకై ప్రజల పీడించి పన్నులు రాబట్టెను. ఇది యిట్లుండగా 1662 ప్రాంతమున, తంజావూరునందు కాటకము చెలరేగి. ప్రజల కమిత బాధలు కల్పించెను. మొదటి నుండియు విజయరాఘవుడు వీరవైష్ణవుడై, ఇతర మతములవారిని బాధించెను. కావున ప్రజ లీతనియెడల మిక్కిలి అసంతుష్టులై యుండిరి. మధురనాయకులకు తంజావూరు రాజులయెడ చిరకాలము నుండి ద్వేషమున్నట్లు మనము తెలిసికొని యున్నాము. క్రీ. శ. 1673 లో మధురనాయకుడు చొక్కనాథుడు, తంజావూరుపై గొప్ప సేనను పంపి, దానిని స్వాధీనము చేసికొనెను. విజయరాఘ వుడును, ఆతని కుమారుడును యుద్ధమున మడసిరి. ఇంతటితో తంజావూరు రాజ్య మంతరించెను. 1675 ప్రాంతమున విజయరాఘ వుని మనుమడగు చెంగమలదాసు, తంజావూరు రాజ్యముపై అధి కారము నెరపెను. కాని ఆ ప్రభుత్వము స్వల్పకాలము మాత్రము సాగెను. సుప్రసిద్ధ మహారాష్ట్ర ప్రభువగు శివాజీ సోదరుడు, వెంకోజీ యీ తంజావూరు రాజ్యము నాక్రమించి, ఆంధ్రప్రభుత్వము నంత మొందించెను.

విజయరాఘవ నాయకుని కాలమునందుకూడ భాషాపోషణము జరిగెను. ఈ రాజు స్వయముగ రఘునాథాభ్యుదయమను నాటకమును రచించెను. అది గద్యపద్యాత్మకము. విజయరాఘవుని యాస్థాన కవయిత్రియగు రంగాజమ్మ అనునామె మన్నారు దాసవిలాసము, ఉషాపరిణయము అను గ్రంథముల రచించెను. ఈ రాజు తెనుగు,

కన్నడము, అరవభాషలను సమానముగ పోషించెను. విజయరాఘవుని యాజ్ఞచే, తమిళభాషాగ్రంథము లనేకములు రచింపబడెను. గోవిందమఖి పంచనదమాహాత్మ్యము నరవభాషలో వ్రాయించెను. తంజావూరురాజ్య మాంధ్రభాషావికాసమునకు రంగస్థలముగ నుండెనని చెప్పుట సత్యదూరము కాదు. నాయకరాజ్యము నశించిన వెనుక, తంజావూరు రాజ్యమును మహారాష్ట్ర ప్రభువులు పాలించిరి. వారుకూడ తెనుగుభాషను పోషించిరని తెలియుచున్నది.

తంజావూరురాజ్య ప్రశంస చేయునప్పు డిరువురు మహనీయుల నామములు స్మరింపక తప్పదు. వారు సంగీత శాస్త్రమునందు నిధు లనదగిన క్షేత్రయ్య, త్యాగరాజులు. క్షేత్రయ్య విజయరాఘవుని సందర్శించి, యతనిపై పదములను రచియించి యతనిచే సత్కృతుఁ డాయెను. ఈయన ఉత్కృష్టములగు మువ్వగోపాల' పదములను రచించెను. భాషామాధుర్యము, రాగకల్పన మున్నగువానిలో ఈయనకృతు లత్యద్భుతములైనవి. మహనీయుడైన త్యాగరాజు క్షేత్రయ్యకు శిష్యుడని కొందరు తెల్పుదురు. ఈయనకూడ తంజావూరు రాష్ట్రమునందే నివసించెను కాని అప్పటికి ఆంధ్రనాయకుల యుగ మంతరించి, మహారాష్ట్ర ప్రభువుల యుగము ప్రారంభ మయ్యెను. త్యాగరాజు మహాభక్తుడు. సంగీత మాయన సొమ్ము. త్యాగరాజు కృతులందలి సొంపు, మార్దవమును ఆంధ్రదేశముననే కాక దక్షిణభారతమునం దంతటను కూడ ప్రసిద్ధి గాంచినవి.

మధురనాయకరాజ్యము:—ప్రాచీనకాలమున మధుర రాజ్యమునకు పాండ్యదేశమని పేరు. దీనిని పాండ్యరాజులు పాలించిరి. ఈ రాజ్యము చోళరాజ్యమునకు దక్షిణమున సేతువువరకు వ్యాపించి యుండెను. మొదటి బుక్కరాయల కుమారుడగు కుమార కంప రాయలు, మధుర సుల్తానుల నోడించి, మహమ్మదీయ రాజ్యమును విజయనగర సామ్రాజ్యములో చేర్చెను. అప్పటినుండియు ఈ భూభాగము విజయనగర రాజ్యములో నొక ప్రాంతముగ నుండెను. మధుర

మండలమును క్రీ. శ. 1529 నుండి 1736 వరకును ఒక ఆంధ్రనాయక వంశమువారు పాలించిరి. వీరిలో మొదటిరాజు విశ్వనాథనాయకుడు. తుట్టతుది పాలకురాలు మీనాక్షి. ఈమె కాలమున మధురనాయక రాజ్యమంతరించెను. మధురనాయకులు చొక్కపు ఆంధ్రులు. కాని ఈ విషయము సర్వసాధారణముగ నందరికిని తెలియదు. ఈ మధుర నాయక రాజుల చరిత్రను ఆంధ్రు లెవ్వరును పరిశీలింపకపోవుటయే, దీనికి కారణము. మధురనాయక రాజుల చరిత్రను ప్రపంచమున కందజేసినవారు తమిళ చారిత్రికులు. వీరు ప్రమాదవశముననో, బుద్ధి పూర్వకముగనో, మధురనాయక రాజుల పేర్లకు తమిళరూపమును కల్పించిరి. మధుర రాజులు ఆంధ్రభాషకు కావించిన సేవనుకాని, ఆంధ్ర కవులను పోషించినట్లుకాని, వీరు తెల్పరైరి. అందులకు తోడు మధురప్రాంతము సంపూర్ణముగ తమిళ దేశాంతర్గతము. ఈ కారణములచే, మధురనాయకులు తమిళులను నపోహాము చాల మందిలో వ్యాపించెను. మధురనాయక రాజ్యమునకు మూలపురుషు డైన విశ్వనాథ నాయకుడు కాశ్యపగోత్రుడైన ఆంధ్రుడు. ఆయన పేరు మహారాజ మాన్యరాజశ్రీ విశ్వనాథనాయని అయ్యలుగారు అనిన్నీ, ఆయన కుమారుడైన కుమారకృష్ణప్ప లేక కృష్ణమ్మ నాయకుని పేరు మహారాజమాన్యరాజ శ్రీకృష్ణమ్మనాయని అయ్యలు గారు అనిన్నీ, కేవలము జాతీయమైన తెనుగుపద్ధతితోనే మధుర దేవాలయములోని సువర్ణపద్మసరోవరము దక్షిణపు ప్రక్క గోడ మీద వ్రాయబడినది. [1] ఇదేవిధముగ మధురనాయకుల నామముల శ్రద్ధగా చూచిన పక్షమున వారు తెనుగువారను విషయము విస్పష్టము కాగలదు.

మధుర రాజ్యమును స్థాపించిన యాతడు విశ్వనాథనాయకుడని తెల్పియున్నాము. ఈ రాజ్యస్థాపన మెట్టిపరిస్థితులలో జరిగినదో ఇంచుక తెలిసికొనవలసియున్నది. విశ్వనాథనాయకుడు మధురరాజ్య

1. చూడు వ్యాసము—మధుర నేలిన తెనుగు నాయక రాజులు, దిగవల్లి వెంకటశివరావు. భారతి సంపుటము మార్చి 1945.

మునకు పాలకుడుగ నియమింపబడుటనుగూర్చి యొక గాథ చిరకాలము నుండియు వ్యాప్తిలో నున్నది. కృష్ణదేవరాయల కాలమున చోళ పాండ్యరాజులకు వివాదములు సంభవింపగా, చోళరాజు పాండ్యుని ఓడించి తరిమివైచెను. అంతట పాండ్యరాజు కృష్ణరాయల కొలువుకూటమునకు పోయి, తన రాజ్యము తన కిప్పింపుమని రాయలను ప్రార్థించెను. అంతట రాయలు తన ఉద్యోగులలో నొకడును, దక్షిణదేశ రాజప్రతినిధియునగు నాగమనాయకుని పిలిపించి, పాండ్య రాజున కాతని రాజ్యము నిప్పింపవలెనని యాజ్ఞాపించెను. నాగమ నాయకుడు దక్షిణాపథమునకు పోయి, చోళరాజు నోడించి, పాండ్య రాజును పునఃప్రతిష్ఠ చేయుటకుమారు, తానే ఆ రాజ్యము నాక్రమించెను. ఈ విషయము తెలిసిన కృష్ణదేవరాయలకు మితిమీరిన ఆగ్రహము కల్గెను. నాగమనాయకుని శిక్షించుటకై ఎవ్వరిని పంపవలయునని, రాయ లాలోచింపుచుండగా, నాగమనాయకుని కుమారుడు విశ్వనాథుడు ముందుకువచ్చి, రాజాజ్ఞను పాలించుటకు తాను సంసిద్ధుడనని పల్కెను. రాయలు సంతసించి, నాగమనాయకుని శిక్షింపవలసినదని విశ్వనాథున కాజ్ఞయొసగెను.[1] తన ప్రతిజ్ఞ ననుసరించి విశ్వనాథనాయకుడు తండ్రియగు నాగమ నోడించి, బందీగగొని రాయల కర్పించెను. రాయలు విశ్వనాథుని రాజభక్తికి సంతసించి, నాగమనాయకుని క్షమించెను. విశ్వనాథుడు మహాశూరుడై, రాయల కనేక యుద్ధములలో గొప్ప సేవజేసెను. ఇందులకు సంతసించి కృష్ణదేవరాయ లీతనిని మధురరాజ్యమునకు పాలకునిగ నియమించెను. ఇదియే మధుర రాజ్యస్థాపన వృత్తాంతముగ చారిత్రికులు తలంచుచుండిరి.

కాని ఇటీవల జరిగిన చారిత్రిక పరిశోధనలవలన పై గాథ విశ్వసనీయముకాదని తెలుచున్నది. విశ్వనాథనాయకుని మధురలో నిల్పినవాడు అచ్యుతరాయలని పాండ్యరాజ చరిత్ర అను గ్రంథము వలన తెలియుచున్నది. అచ్యుతరాయల శాసనములవల్ల, విశ్వనాథ నాయకుడు విజయనగరపు రాజులకు ''ఊడిగపు సేవకు''డని వ్యక్తమగుచున్నది. ఇట్టి రాజభృత్యులలో మండలేశ్వరులు, సామంతులు,

గొప్ప సరదారులు మున్నగువా రుండుట వాడుకయైన విషయము. మొట్టమొదట విశ్వనాథనాయకుడిట్టి సరదారుగ నుండియుండవచ్చును. ఆర్వీటి రామరాయల కాలమునకూడ విశ్వనాథనాయకుని మధుర రాజుగ, నే శాసనములును పేర్కొన లేదు. అతడు చోళరాజ్యములోని గొప్ప అధికారిగాను, రామరాజు కార్యకర్తగను, తిరువాది దేశమునకు అధికారియైన అమరనాయకుడుగను, పేర్కొనబడియున్నాడు. అమరనాయకు డనగా కొంత దేశమునకును, సైన్యమునకును అధికారియైన సామంతుడని యర్థము. కావున రామరాజు కాలమున విశ్వనాథ నాయకుడు, మధుర రాజ్యమును స్వతంత్ర ప్రభువుగ పాలింపలేదని తేలుచున్నది క్రీ. శ. 1560 సంవత్సరముతో విశ్వనాథ నాయకుని పరిపాలనా కాలము ముగిసినట్లు తోచుచున్నది. ఆపైన ఈతని కుమారుడు కృష్ణప్పనాయకుడు తన తండ్రివలెనే అమరనాయకునిగ, తిరునల్వేలి జిల్లాలో పాలనము చేసెను. 1564 వ సంవత్సరమున కృష్ణప్పనాయకుడు పట్టాభిషిక్తుడయ్యెను. తాళికోట యుద్ధమున విజయనగర రాజులు పరాభవమంది, క్షీణతేజులై యున్న సందర్భమున, కృష్ణప్పనాయకుడు స్వతంత్ర ప్రభువు నని ప్రకటించుకొని యుండుట సంభవము. ఆర్వీటి తిరుమలరాయలు చేయునది లేక, కృష్ణప్పనాయకుని తన కనుకూలుడుగ నుంచుకొను నుద్దేశ్యముతో, ఆతని స్వాతంత్ర్యము నంగీకరించి యుండవచ్చును. సామ్రాజ్యముపై తిరుగుబాటు చేసి, తాను సంపాదించిన స్వాతంత్ర్యమును శాసనబద్ధముగ కావించుకొనుటకై, విశ్వనాధనాయకుడు అచ్యుతరాయలచే మధుర రాజ్యమున స్థాపింపబడె నను గాథ తరువాత కాలమున సృష్టింపబడి యుండవచ్చును.

విశ్వనాధనాయకుడును, ఆతని వంశమువారును, మధుర రాజ్యమును రెండు శతాబ్దులకు మించి పాలించిరి. ఈ వంశమునం దనేక ప్రభువులు కలరు. వారి రాజ్యపాలనమును గూర్చిన యంశములు చాల కలవు కాని స్థలసంకోచముచే వివరములను తెలుపక, ఈ వంశమును గూర్చిన ముఖ్యాంశములను మాత్రమే ఈదిగువ పొందుపరచుచున్నాము.

విశ్వనాథనాయకుడు (1529-1564) ఈతడు సమర్థుడైన రాజు. ఈ రాజు తన రాజ్యమును డెబ్బదిరెండు విభాగములుచేసి, ఒక్కొక్క విభాగమున, కొక్క పాళెగానిని నియమించెను. ఈ పాళెగాండ్రు తమ స్వాధీనములోనున్న భూభాగమును పాలించుచు, రాజసేవకై కొంత సైన్యమును పంపవలసియుండిరి. విశ్వనాథనాయకుడు మధురకోటను పునర్నిర్మాణము కావించెను. మధురయందలి మీనాక్షీ సోమసుందరేశ్వరుల దేవాలయ మీతడే కట్టించెనని తెల్పుదురు. నిజమున కీ దేవాలయము ప్రాచీనమైనది. పాండ్య రాజుల కాలము నాటికే ఈ దేవస్థానము వెలసియుండెను. కాని కాలక్రమమున నయ్యది శిధిలము కాగా విశ్వనాథనాయకుడు దాని నుద్ధరించి యుండవచ్చును.

మొదటి కృష్ణప్పనాయకుడు (1564-1572) ఈ రాజు విశ్వనాథుని కుమారుడు. ఈతడు తాళికోట యుద్ధసందర్భమున తన ప్రభువగు అళియ రామరాయల సహాయమునకై కొంత సేనను పంపెను. కాని ఆ యుద్ధమున రామరాయ లోడిపోయినమీదట, కృష్ణప్పనాయకుడు స్వాతంత్ర్యము వహించెను. ఈ రాజు సింహళద్వీపముపై దండెత్తి, ఆ దేశము రాజు నోడించి, సంహరించి, రాజధానియగు ఖండి నగరము నాక్రమించి, తన బావమరదియగు విజయగోపాల నాయకు నచ్చట రాజుగ ప్రతిష్ఠించెను. తనపై తిరుగుబాటు చేసిన పాళెగాండ్ర నీతడు పరాభవించి వశపరచుకొనెను.

వీరప్పనాయకుడు (1572-1595) ఈతడు కృష్ణప్పనాయకుని కుమారుడు. ఈతనివద్ద ఆర్యనాథ మొదలియారను సమర్థుడగు దళవాయి యుండెను. వీరప్పనాయకుడు తన సామ్రాట్టులైన విజయనగర రాజులయెడల భక్తి తాత్పర్యములతో మెలగెను.

రెండవ కృష్ణప్పనాయకుడు (1595-1601) ఈతడు వీరప్ప నాయకుని కుమారుడు. ఈ రాజునకు కుమార కృష్ణప్పయనియు వీరకృష్ణప్పయనియు, నామాంతరములు కలవు. రెండవ కృష్ణప్ప

నాయకుడు విజయనగర రాజులయెడ సద్భావముతో మెలగెను. ఈతని రాజ్యకాలమున [1600] మహామంత్రియైన ఆర్యనాథ మొదలియారు చనిపోయెను. ఈ రాజు తిరువాన్కూరు రాజ్యము నాక్రమించెను.

ముద్దుకృష్ణప్పనాయకుడు [1601–1609] రెండవ కృష్ణప్ప నాయకుడు మరణించినమీదట, ఆతని మూడవకుమారుడు కస్తూరి రంగప్ప రాజ్యమునకువచ్చి, స్వల్పకాలము పరిపాలించెను. ఆతనిని అతని పినతండ్రి విశ్వప్పకుమారుడు, ముద్దుకృష్ణప్ప చంపించి, రాజ్యము నాక్రమించెను. ఈ రాజు మరవదేశమను తీరప్రాంతముల పరిపాలనకై కట్టుదిట్టము చేసి, వానిని పాలించుటకై, సేతుపతులను అధికారులను నియమించెను. ఇంతకుపూర్వము నాయక రాజులు తీరప్రాంతముల విషయమై శ్రద్ధ వహింపని కారణమున, నచ్చట పోర్చుగీసువారు బలపడి, ప్రజలను క్రైస్తవ మతములో చేర్చుకొని, వారిని పోర్చుగలు రాజు నధికారము నంగీకరింపవలసి నదిగా ప్రోత్సహించిరి. ఈ పద్ధతులవలన, తన రాజ్యమునకు గల ఆపదను గుర్తించి, ముద్దుకృష్ణప్ప నాయకుడు మరవదేశమున నూతన వ్యవస్థను కావించెను. ఈ ఏర్పాట్లవలన రామేశ్వర క్షేత్రమునకు పోవు యాత్రికులకు చక్కని సౌకర్యము లేర్పడెను.

మొదటి ముద్దువీరప్పనాయకుడు (1609–1623) ఈతడు ముద్దుకృష్ణనాయకుని ప్రథమపుత్రుడు. విజయనగర సామ్రాజ్యము వారి యధికారమునుండి విడివడి, స్వాతంత్ర్యము స్థాపింపవలె నని యీతడు ప్రయత్నించెను. ఆకారణమున చక్రవర్తులకు పన్ను కట్టుటకుకూడ నిరాకరించెను. కాని వళ్ళంకోటవద్ద విజయనగర చక్రవర్తియగు రెండవ వెంకటపతిరాయ లీతనిని సంపూర్ణముగ నోడించి, కప్పము కట్టునట్లు నిర్బంధించెను. ఈ నాయకుని కాలమందే గొబ్బూరి జగ్గరాయలకును, యాచమనాయకునికిని తోపూరు వద్ద యుద్ధము జరగెను. రఘునాథనాయకుడు స్వామిభక్తిపరుడై, రామదేవరాయలకును, యాచమనాయకునికి సహాయపడెను. ముద్దు వీరప్పనాయకుడు ద్రోహియగు జగ్గరాయలపక్ష మవలంబించి,

యుద్ధమున నోడి, పారిపోయెను. ఈనాటినుండి మధుర నాయకులు విజయనగర చక్రవర్తుల యెడలను, తంజావూరు నాయకుల యెడలను పగ సాధింప జొచ్చిరి. తంజావూరు నాయకుల రాజ్యమునకు సమీపముననుండి, వారితో యుద్ధములు సల్పుచుండుటకుగాను, ముద్దువీరప్ప నాయకుడు తన రాజధానిని మధురనుండి తిరుచునాపల్లికి మార్చెను. ఈతని కాలమున జెసూటు పాదిరీలు తమ మత ప్రచారమునకై చాల ప్రచారము చేయసాగిరి. వీరిలో రాబర్టు డినోబిలీ అను నాతడు "జగద్గురు తత్త్వబోధకస్వామి" అను పేరుతో దేశమంతటియు సంచరించుచు, అరవము, తెనుగును నేర్చి మత ప్రచారము సాగించెను.

తిరుమలనాయకుడు (1622-1659) ఈ రాజు ముద్దువీరప్ప నాయకుని సోదరుడు. ఈతడు మధుర నాయకరాజులలో సర్వశ్రేష్ఠుడని తెలుపవచ్చును. కాని తిరుమలనాయకుడు సంకుచితదృష్టితోడను, స్వార్థపరత్వముతోడను వర్తించి, తన ప్రభువులగు విజయనగర సామ్రాట్టులకు తీరని అపకారము చేసెను. సామ్రాజ్య వినాశమునకు తిరుమలుని నీతియే చాలవరకు కారణము. తిరుమలనాయకుడు తన రాజధానిని మరల మధురకు మార్చెను. ఈతడు తన సైన్యవ్యవస్థయందు మార్పు కావించి, సేనను బలపరచెను. తిరుమలనాయకుడు 1625 వ సంవత్సరమున మైసూరు రాజ్యముతోడను, 1634 వ సంవత్సరమున తిరువాన్కూరు రాజ్యముతోను, యుద్ధముచేసి, జయము సాధించెను. ఈ దండయాత్రలలో రామప్పయ్య అను నీతని తెనుగుమంత్రి, గొప్ప పరాక్రమమును, సామర్థ్యమును ప్రకటించి, రాజునకు తోడ్పడెను. 1642 వ సంవత్సరమున, మూడవ శ్రీరంగరాయలు విజయనగరసింహాసన మధిష్ఠించెను. తిరుమల నాయకుడీ చక్రవర్తికి కప్పము కట్టుటకు నిరాకరించెను. శ్రీరంగరాయలు తిరుమలునిపై యుద్ధప్రకటన కావించెను. ఈ సందర్భమున తిరుమల నాయకుడు మిక్కిలి సంకుచిత దృష్టితో వర్తించి, గోల్కొండ నవాబు సహాయమునుకోరి, విజయనగరము వారి కానాడు ముఖ్య పట్టణముగా నున్న

వెల్లూరును ముట్టడించునట్లు, ప్రోత్సహించెను. శ్రీరంగరాయలు ప్రథమ ప్రయత్నమున గోల్కొండ నవాబు నోడించెను. శ్రీరంగ రాయలు తంజావూరు, జింజి, మధురనాయకులను కూడగట్టుకొని, సామ్రాజ్యమును పునరుద్ధరించుటకై కావించినయత్నములలో, తిరుమలనాయకు డాతనితో సహకరింప లేదు. 1646 వ సంవత్సరమున గోల్కొండ బిజాపుర రాజ్యములవా రేకమై, విజయనగరమునకు ముఖ్యపట్టణ మగు వెల్లూరుకోటను, స్వాధీనపరచుకొనినప్పుడు తిరుమలనాయకుడు చూచుచు నూరకుండెను. వెల్లూరుకోటను మహమ్మదీయు లాక్రమించిన వెనుక, హతభాగ్యుడైన మూడవ శ్రీరంగ రాయలు మైసూరు పాలకుని శరణు జొచ్చెను. శ్రీరంగరాయలు మైసూరురాజు సహాయముతో తన రాజ్యమును పునరుద్ధరించుటకై కావించిన యత్నములను, తిరుమల నాయకుడు బిజాపూరుసుల్తాను సహాయముతో, విఫలపరచెను. ఈవిధముగ విజయనగర రాజ్యము క్షీణించిన వెనుక. మహమ్మదీయులు జింజి రాజ్యమును జయించి, దక్షిణాపథమునందు బలపడిరి. దీనికి దోహద మొసగినవాడు తిరుమల నాయకుడు.

ఈ రాజు అనేక దేవాలయములను, గోపురములను కట్టించెను. శిల్పకళను పోషించెను. ఈతడు తన బొక్కసములోని ధనము నంతను వెచ్చించి, ప్రజాహితకార్యముల కావించెను. తిరుమలనాయకుని కాలమున, కూలి నాలి చేయువారికి చేతినిండ పని దొరకుచుండెను. ఈతడు కట్టించిన గొప్ప రాజభవనము నేటికిని మధురయందు నిలచియుండి, ఆనాటి శిల్పకళాప్రాశస్త్యమునకు తార్కాణముగ నున్నది. ఈతని కట్టడముల జూచి, విదేశీయు లాశ్చర్యపడెడివారు.

రెండవ ముద్దువీరప్ప నాయకుడు (1659):—ఈతడు తిరుమల నాయకుని కుమారుడు. ఈతడు తన సేనలను బలపరచి, తిరుచునాపల్లి కోటను బాగుచేయించెను. బిజాపురము నవాబు ఈ రాజు సేనా సన్నాహమును జూచి భయపడి, ఈతని రాజ్యముపై దండెత్తుట

మాని, తంజావూరు రాజ్యముపై సేనల నడపెను. వీరప్పనాయకుడు నాల్గునెలలు పరిపాలించి కాలధర్మము నొందెను.

చొక్కనాథ నాయకుడు(1659-1682):-ఈతడు రెండవ ముద్దు వీరప్పనాయకుని కుమారుడు. ఈతడు రాజ్యాధికారమును పూనిన కొలది కాలముననే, ఈతని దళవాయియు, రాయసమును, రాజుపై తిరుగుబాటు చేసిరి. తంజావూరు నాయకుడు ద్రోహులకు సాయ పడెను. కాని చొక్కనాథుడు ద్రోహుల నోడించి, తన యధికార మును బలపరచుకొనెను. ఈతడు 1673 వ సంవత్సరమున తంజా వూరు రాజైన విజయరాఘవు నోడించి, ఆ రాజ్యము నాక్రమించి, తన సోదరుడగు ముద్దు అళగిరిని, అచ్చట రాజప్రతినిధిగా నియ మించెను. కాని అనతికాలమున తంజావూరు రాజ్యము మధుర నాయకుల చేజారిపోయెను. చొక్కనాథుడు ప్రజారంజకముగ పాల నము చేయలేదు. ఈతడు మైసూరురాజుతో పోరాడి, కొంత రాజ్య మును కోల్పోయెను.

మూడవ ముద్దువీరప్పనాయకుడు (1682-1689):—ఈతడు చొక్కనాథుని కుమారుడు. ఈ రాజు పూర్తిపేరు రంగకృష్ణముద్దు వీరప్పనాయకుడు. ఈతడు సమర్థుడగు రాజు. తండ్రి కోల్పోయిన రాజ్యము నీతడు తిరిగి సంపాదించెను. ఈ రాజు మిక్కిలి యోగ్యు డని తెలియుచున్నది.

రాణి మంగమ్మ (1689-1706):—ఈమె రంగకృష్ణుని తల్లి. మూడవ ముద్దువీరప్ప కుమారుడు విజయరంగ చొక్కనాథుడు మిక్కిలి పసివాడైనందున, పితామహియగుమంగమ్మ రాజ్యభారము పూనవలసివచ్చెను. ఈ రాణి స్వయముగా మిక్కిలి సమర్థురాలు. దూరదృష్టి కలది. ఈమె కడ నరసప్పయ్య అను తెనుగు నియోగి బ్రాహ్మణుడు మంత్రిగ నుండి, చక్కగ రాజ్యాంగమును దిద్దుచుం డెను. ఈ కాలమునాటికి దక్షిణమందలి బిజాపూరు గోల్కొండ రాజ్యములు, ఔరంగజేబు చక్రవర్తిచే నాశనము చేయబడెను.

శివాజీ కుమారుడగు శంభాజీ మొగలు చక్రవర్తిచే చంపింపబడెను. తన బలహీనతను గుర్తించి, రాణి మంగమ్మ ఔరంగజీబు చక్రవర్తి యధికారము నంగీకరించి, కప్పము కట్టుట కొప్పుకొనెను. ఈమె మిక్కిలి నేర్పుతో రాజ్యమును పాలించెను. ఈమె అనేక దాన ధర్మములు చేసి కీర్తిగాంచెను.

విజయరంగ చొక్కనాథుడు (1706–1732):—ఈతడు రంగ కృష్ణ ముద్దు వీరప్ప నాయకుని కుమారుడు. ఈ రాజు తీర్థయాత్రల యందును, పండితగోష్ఠి యందును, కాలము పుచ్చుచు, రాజకార్యముల యెడ నశ్రద్ధ వహించెను. ఆ కారణమున నీతని ప్రధాని వెంకట కృష్ణయ్య, దళవాయి కస్తూరి రంగయ్య, అను వారు ప్రబలురై ప్రజలను మిక్కిలి బాధించిరి. ఈరాజు కాలమున మధుర రాజ్యము క్షీణించెను.

మీనాక్షి (1732–1739):—ఈబిడ్డ విజయరంగ చొక్కనాథుని భార్య. ఈమె అసమర్థురాలు. మీనాక్షి తన వంశమునకు చెందిన బంగారు తిరుమలుని కుమారుడు విజయకుమారుని పెంచు కొనెను. కాని బంగారు తిరుమలుడును, మీనాక్షి దళవాయి వెంకటాచార్యుడును ఈమెపై కుట్రలు చేసి, ఈమెను పదభ్రష్టురాలిని కావించుటకై యత్నించిరి. 1734–వ సంవత్సరమున ఆర్కాటు నవాబు మధుర రాజ్యముపై సేనను పంపి, తనకు కప్పము కట్టవల సినదని నిర్బంధించెను. నిస్సహాయురాలై యున్న మీనాక్షి ఆర్కాటునవాబు అల్లుడగు చందా సాహేబుకు రాజ్యాధికారము నప్పగించి, శత్రువగు బంగారు తిరుమలుని దౌర్జన్యమునుండి కాపాడుమనికోరెను. చందాసాహే బందుల కంగీకరించి, స్వల్పకాలములో ద్రోహము చేసి, మీనాక్షి నామె రాజభవనమందు బందీగ చేసెను. మీనాక్షి ఈయవమానమును భరింపజాలక, విషముతిని, మరణించెను. ఇంతటితో మధురనాయక రాజ్య మంతరించెను. ఈ మండలమును మహమ్మదీయు లాక్రమించిరి.

తంజావూరు నాయకరాజుల పోషణమున ఆంధ్రభాష యభివృద్ధి పొందినట్లే, మధుర ఆస్థానమున కూడ ఉన్నతిని గాంచెను. ఇచ్చటి రచయితలు సాంప్రదాయానుసారము పద్యకావ్యములను మాత్రమే కాక, గద్యకృతులను కూడ వ్రాసి, ఆంధ్రభాషకును, జాతికిని, విశిష్టమైన సేవచేసిరి. మధుర నాయక రాజ్యము, తిరుమల నాయకుని కాలమున, మిక్కిలి ఉచ్ఛదశను పొందెను. ఈ రాజు సభయందు సంస్కృత ఆంధ్ర తమిళ కవులు పోషింపబడిరి. లింగన మఖి శ్రీకామేశ్వరకవి తిరుమల నాయకునిచే సన్మానింపబడెను. ఈ కవి సత్యభామా సాంత్వనము అను ప్రబంధమును రచించి తిరుమలనాయకుని తమ్ముని కుమారులలో నొక్కడగు ముద్దు అళగిరికి అంకిత మిచ్చెను. ఈతని కవిత్వము సరసముగను, శృంగారరస ప్రధానముగను, ఉండును. ఈ కవి ధేనుకామాహాత్మ్య మను వచనకావ్యమును కూడ రచించెను. ఈ వచన గ్రంథము చొక్కనాథ నాయకున కంకిత మీయబడినది. చొక్కనాథుని కాలమున మధుర రాజాస్థానమందు వెలిదిండ్ల వెంకటపతియను కవి నివసించెను. ఈతడు శృంగార రాధామాధవ మను కావ్యమును రచించెను. విజయరంగ చొక్కనాథుని కాలమున సాహిత్యమును, సంగీతమును, మిక్కిలి అభివృద్ధిచెందెను. ఈ రాజు సభయందు కవులును గాయకులును పెక్కురుండిరి. విజయరంగ చొక్కనాథుడు స్వయముగ కొన్ని గ్రంథముల రచించెను. ఆతని సామంతులలో కొందరు తెనుగుభాషయందు కృతుల రచించిరి. సముఖము వెంకట కృష్ణప్ప నాయకుడను ప్రభువు అహల్యాసంక్రందనము, రాధికాసాంత్వనము అను రెండు ప్రబంధములను రచించెను. శేషము వెంకటపతి యను కవి తారాశశాంక విజయమను ప్రబంధమును రచించి, చొక్కనాథుని మంత్రులలో నొకడైన వెంగళ సీనయ్య కంకితమిచ్చెను. ఈ విధముగ పద్యకావ్యముల రచించి కీర్తిగాంచిన కవివతంసులు, మధుర రాజ్యమం దనేకు లుండిరి. మధురయందే కాక మైసూరు రాజ్యము, పుదుక్కోట, తిరుచినాపల్లి, సేలము మండలములలో

కూడ, ఈ కాలమందు అనేక కవులు నివసించి గ్రంథరచనము కావించిరి.[1]

మధుర రాజ్యపు పండితులు తెనుగుభాషకు కావించిన విశిష్ట సేవ గద్య గ్రంథ రచనము. పద్యకావ్యములను ఉన్నత తరగతుల వారును, విద్యాధికులును మాత్రమే తెలిసికొని ఆనందింపగలరు. కాని సామాన్య జనుల కింతటి శక్తి యుండదు. వారి కేవైన యంశముల తెలుపవలసినయెడల దానిని వచనరూపముననే తెలుపవలయును. అంతేకాక ఆంధ్ర దేశమునుండి దక్షిణప్రాంతమునకు వలస పోయిన తెనుగువారెల్లప్పుడును తమిళమునే వినుచుండుటయు, మాట్లాడుచుండుటయు సంభవించును. కావున వారు తమ మాతృభాషయగు ఆంధ్రమును మరచిపోవుట కవకాశములు చాల కలవు. అట్టిఅనర్థము సంభవింపకుండ ఆంధ్రప్రజలు తెలుగుభాషతో సంపర్కముంచుకొనవలయు ననిన వారికి తెనుగు గ్రంథము లందుబాటులో నుండవలయును. ఈ యవసరముల గుర్తించియే కాబోలు మధుర రాజ్యమందలి కవులు పెక్కురు వచనరచనమునకు పూనిరి. విజయ రంగ చొక్కనాథుడు స్వయముగ శ్రీరంగమాహాత్మ్యము, మాఘ మాహాత్మ్యము అను గ్రంథములను వచనమున రచించెను. అతని సామంతుడైన సముఖము వెంకటకృష్ణప్పనాయకుడు జైమినీ భారతమును, సారంగధర చరిత్రమును వచనకావ్యములుగా వ్రాసెను. శ్యామరాయకవి రామాయణ వచనమును, శ్రీపతి రామభద్రకవి హాలాస్య మాహాత్మ్యమును, కుందుర్తి వెంకటాచలకవి భాగవత రామాయణములను గద్యాత్మకముగా రచించిరి.

మధురరాజులకడ భరతనాట్య మభివృద్ధి చెందెను. గానము ప్రోత్సహింపబడెను. నృత్యగానములు వారవనితలసొమ్ముగానుండెను. వీరికి రాజాస్థానమందు పండితులతో సమానముగ గౌరవము లభించుచుండెను. వీరు విదుషీమణులై కావ్యరచనము చేసెడివారు.

---

1. చూడు వ్యాసము—మధుర సేలిన తెనుగు నాయకరాజులు, దిగవల్లి వెంకటశివరావు. భారతి సంపుటము ఏప్రిల్ 1945.

విజయరంగ చొక్కనాథుని కాలమున తిరువెంగళార్యుడను సంగీత కళానిధి యుండెను. ఈతడు గొప్ప వైణికుడని ప్రసిద్ధి. వెంగళార్యుడు వ్యాసతాత్పర్య నిర్ణయమను గ్రంథమును రచించెను.

గోలకొండరాజ్యము:—క్రీ. శ. 1482 నుండి 1518 వరకును బహమనీ రాజ్యమును పాలించిన మహమూద్‌షా కాలమున నా రాజ్యము విచ్ఛిన్నమై, ఐదు చిన్నరాజ్యములుగ చీలిపోయినట్లు స్థలాంతరమున తెలుపబడినది. వీనిలో కుతుబ్‌షాహి రాజులచే పాలింపబడిన గోలుకొండ రాజ్యమొకటి. ఈ గోల్కొండనవాబులు పాలించినది ముఖ్యముగా ఆంధ్రప్రాంతము. వారిచే పాలింపబడిన ప్రజలు తెనుగువారు. కావున గోలకొండ నవాబుల నాంధ్ర సుల్తాను లని చెల్పవచ్చును. అంతే కాదు. ఈ నవాబులు భాషాంతరమును మాట్లాడుచుండియు, స్థానిక భాషయగు తెనుగును స్వాయత్తముగ నేర్చుటయే కాక, అందు ప్రావీణ్యతను సంపాదించి, ప్రజల కష్టసుఖముల నరయుచుండిరి. ఈ మహమ్మదీయరాజులు తెనుగు కవులను పోషించి, వారిచే కావ్యముల రచింపించిరి. ఈ నవాబులకడ ఆంధ్రులు గొప్ప ఉద్యోగములచేసి పేరుప్రతిష్ఠలను సంపాదించిరి. కావున నీ గోల్కొండ రాజుల యుగమును ఆంధ్ర చరిత్రాంతర్గతముగ భావింపవలెను.

గోలకొండరాజ్యము క్రీ. శ. 1512 నందు స్థాపింపబడి 1687 వరకును వైభవముగా వర్ధిల్లెను. ఈ వంశమునందు కులీకుతుబ్‌షా (1512–1543) జంషీద్ కుతుబ్‌షా (1543–1550) ఇబ్రహీంకుతుబ్‌షా (1550–1580) మహమ్మద్ కులీకుతుబ్‌షా (1580–1611) అబ్దుల్లా హుసేన్‌కుతుబ్‌షా (1611–1659) అబుల్‌హసన్‌కుతుబ్‌షా (1658–1687) అను ఆరుగురు రాజులు రాజ్యపాలనము చేసిరి. బహమనిరాజ్యమునందు గోలకొండప్రాంతమొక సూబాలేక రాజధానిగ నుండెను. దీనికి తెలంగాణమనికూడ పేరుండెను. ఈ సూబాకు కులీ కుతుబ్ ఉల్‌ముల్కు అనునాతని బహమనీ రాజుల మంత్రియైన ఖ్వాజామహమ్మద్ గవాన్ పాలకునిగ నియమించెను. ఈ కుతుబ్ ఉల్‌ముల్కు పర్షియా దేశస్థుడు. ఈతడు బహమనీ రాజుల కొలు

వులో చేరి, క్రమక్రమముగా ఉచ్చదశకు వచ్చెను. 1512వ సంవత్సర మున నీతడు స్వతంత్రత ప్రకటించెను. అప్పటికి తెలంగాణములోని కొలది ప్రాంతము మాత్రమే, బహమనీ రాజుల అధికారములో నుండెను. తెలంగాణమందలి మిగిలిన భాగమును, పూర్వాంధ్ర దేశమును, ఒరిస్సా రాజైన ప్రతాపరుద్ర గజపతి అధికారమం దుండెను. విజయనగర రాజైన కృష్ణదేవరాయలు, గజపతుల నోడించుటకు కళింగరాజ్యముపై దాడివెడలి, తెలంగాణమునుండి గజపతులను తరిమివైచి, రాచకొండ, దేవరకొండ మున్నగు దుర్గ ములను సాధించెను. కృష్ణరాయల కాలములో ఆతనికిని కులీకుతుబ్ షాకును తెలంగాణములో యుద్ధము సంభవించెను. కొండవీటిని సాధింప నుద్యమించి ఈతడు రాయలచే పరాభవము నందెను; కాని యతడటు తరువాత తెలంగాణములోని కొన్ని దుర్గములను జయించి స్వాధీనము జేసికొనెనని మహమ్మదీయచరిత్రలలో కలదు. రాయల మరణానంతర మీతడు గజపతుల సామంతుడైన సీతాపతి రాజుతో పోరాడి, ఓరుగల్లు, కంభముమెట్టు, బెల్లంకొండ మొదలగు దుర్గము లను, ఆపైన కొండపల్లి, కొండవీడులను జయించెను. ఈ రాజు మెతుకు, పానగల్లు కోయిలకొండ, దుర్గములనుకూడ సాధించెను. అద్దంకి గంగాధరకవి విరచితమగు తపతీ సంవరణో పాఖ్యానమున నీ విషయములు సూచింపబడినవి. కులీకుతుబ్ షా మరణించుసరి కాతని రాజ్యము ఇప్పటి తెలంగాణమునందు మాత్రము వ్యాపించెను.

కులీకుతుబ్ షా సీతాపతిరాజు నోడించి కంభముమెట్టు దుర్గ మును సాధించినట్లు తెలిపియున్నాము. సీతాపతి రాజునకు షితాబు ఖాను అను నామాంతరముకలదు. ఈ పేరును చూచి, ఈతడు హైందవుడా మహమ్మదీయుడా యని పలువురు సందేహమునకు లోనైరి. కాని ఇటీవల జరిగిన పరిశోధనలవలన, నీతడు హైందవు డను నంశము స్థిరపడినది. సీతాపతిరాజు భోగివంశమున జన్మించెను. ఈతని తండ్రి మానయ. మహావీరుడు. దీనబంధుడు. నిర్ఘాత వీరభట నివహుడు. సీతాపతిరాజు తల్లి గౌరాంబ. మహమ్మదీయ చరిత్ర కారులు కూడ ఈతడు మహావీరుడనియు, నిర్భీతచేతస్కుడనియు,

ప్రశంసించియున్నారు. సీతాపతిరాజు మొట్టమొదట కంభముమెట్టు దుర్గమునకు మాత్రము రాజు. ఆపైన నాతడు బెల్లంకొండ, వరంగలు మున్నగు కోటలను స్వాధీనపరచుకొనెను. ఈతనివద్ద పంద్రెండు వేల కాల్బల ముండెను. ఈ సైనికులందరును చక్కని లక్ష్యశుద్ధి గల ధనుర్ధరులు. ఈ సీతాపతి ఓరుగల్లు కోటను స్వాధీనపరచుకొని, మహమ్మదీయులచే విధ్వంస మొనర్పబడిన ఏకశిలానగర దేవాలయముల, పునరుద్ధరించెను. ఓరుగల్లులోని పాంచాలీశ్వర దేవాలయమును, స్వయంభూదేవి గుడిని, ఈ సీతాపతిరాజు బాగుచేయించెను. పాకాలచెరువు నీతడు మరమ్మత్తుచేయించెను. ఈతని మంత్రియైన ఎనుములపల్లి పెద్దనామాత్యునికి చరిగొండ ధర్మన్నకవి తన చిత్రభారతమను గ్రంథము నంకితమిచ్చెను. సీతాపతిరాజు బలము దృఢపడుచుండుట చూచి, కులీకుతుబ్‌షా ఆతనిపై దండెత్తి, బెల్లంకొండ దుర్గమును స్వాధీనపరచుకొనెను. అదివిని సీతాపతి నవాబుతో యుద్ధమునకు ఢీకొనెను కాని ఈతనికి పరాభవము సంభవించెను. అచ్చటనుండి సీతాపతి కంభంమెట్టుకు పారిపోయి కొండపల్లి, ఇంద్రకొండ, ఎద్దిరు ప్రాంతముల రాజుల సహాయముతో, సేనను పోగుచేసి, మరల మహమ్మదీయులను తాకెను. కాని ఈ యుద్ధములో కూడ మహమ్మదీయులే విజయమును సాధించిరి. అంతటితో నాగక కులీకుతుబ్‌షా కొండపల్లి, ఇంద్రకొండ, ఎద్దిరులను వశపరచుకొని, కంభముమెట్టు దుర్గముపై దాడిచేసి చాల సైన్యనష్టముతో కోటను సాధించెను. ఈవిధముగ అపజయములు సంభవించినను పట్టుదల వీడక, సీతాపతిరాజు కొండపల్లిని పాలించుచున్న రామచంద్ర గజపతివద్దకు పోయి, ఆతనిని మహమ్మదీయులపై పురికొల్పెను. రామచంద్ర గజపతి గొప్ప సేనాసన్నాహముతో యుద్ధమునకు సిద్ధపడెను. అయినను కులీకుతుబ్‌షాకే విజయము లభించెను. ఈ పరాజయము తరువాత సీతాపతిగతి యేమయ్యెనో తెలియదు. సీతాపతిరాజు తన జాతియందును, మతమునందును, మిక్కిలి అభిమానముగల శూరుడని చెప్పుటలో ఎట్టి సంశయమును లేదు.

గోలకొండనవాబులలో మూడవవాడైన ఇబ్రాహీం కుతుబ్ షా ఆంధ్రప్రపంచమునకు సుపరిచితుడు. ఈతడు తనఅన్న జంషీద్ కుతుబ్ షా రాజ్యము చేయుచున్నప్పుడు, ప్రాణభయము చేవిజయనగరమునకు పారిపోయి, అళియరామరాయల శరణుజొచ్చెను. రామరాయలీతనిని సగౌరవముగ తనకడ నుంచుకొనెను. ఈ కాలమున ఇబ్రాహీం కుతుబ్ షా భట్టుమూర్తి మొదలగు ఆంధ్రకవులతో పరిచయము చేసికొని, ఆంధ్రమునందు పాండిత్యమును సంపాదించెను. గోల్కొండ రాజ్యమునకు నవాబయిన తరువాత నీత డాంధ్రకవులను పోషించెను.



మల్కిభరాం

కవు లీతనిని మల్కిభరాం అను పేరితో ప్రశంసించుచుండిరి. ఈ ఇబ్రాహీం కుతుబ్ షా కష్టకాలమున తన్ను రక్షించిన అళియ రామరాయలపై కత్తిదూసి, 1565 వ సంవత్సరమందు తాళికోట యుద్ధమున రామరాయల వినాశమునకు కారణమయ్యెను. ఈ ద్రోహమీ నవాబునకు గొప్ప కళంకము. కాని తక్కిన అన్ని విషయములలో నీతడు సంస్తవనీయుడు. ఈతని యోగ్యతను గురించి మహమ్మదీయ మహాయుగమునందు శ్రీ కొ. వెం. లక్ష్మణరావుగారిట్లు గొప్పగ ప్రశంసించినారు.

“ఈ నవాబు విద్వాంసుడు. జయశాలి, ప్రజాహితైక తత్పరుడు. ఈతడు వెడలిన ఏ దండయాత్రలోను ఈతనికి అపయశస్సు రాలేదు. యుద్ధమునకు పోవునప్పుడుకూడ విద్వాంసులతో సంభాషించి, ప్రజలకు మేలయిన చట్టముల నేర్పరుచును. రాజ్యవ్యవస్థ ఉత్కృష్టముగా నుండెను. దొంగతనమే వృత్తిగాగల ఎఱుకు ఏనాది జాతులవారిని శిక్షలో పెట్టి, బాటసారులకు భయము లేకుండ జేసెను. ఈతని రాజ్యములో గ్రుడ్డిముదుసలియైనను, బంగారపుముద్ద నెత్తిపై నుంచుకొని, నిర్భయముగ ప్రయాణము చేయగలడను ఖ్యాతివహించెను. కొండవీడు, రాజమహేంద్రవరము, కాసింకొండయీతని రాజ్యములో ముఖ్యమైన ఠాణాలని చెప్పిన, ఈతని రాజ్యవిస్తార మెక్కుడుగ నుండెనని వేఱుగ చెప్పవలెనా? ఇతడు సుందరములైన మసీదులును, ప్రాసాదములును, అనేకములు కట్టించెను. పెక్కు తోటలు వేయించెను. విస్తీర్ణ తటాకముల త్రవ్వించెను. గోలకొండ దుర్గ ప్రాకారము, ఇబ్రాహీంబాగ్ అనుతోట, ఫూల్ బాగ్ (పుష్పోద్యానము) లంగరులు (శిశుగృహములు) ఇబ్రాహీం పట్టణ తటాకము, హైదరాబాద్ లోని హుస్సేన్ సాగర్, బడవల్ వద్ద ఆనకట్ట మొదలైనవన్నియు ఈతని ప్రభుత్వకాలములోనే నిర్మింపబడెను.

అందుచే నీ రాజ్యము రెండవ ఈజిప్టని ఖ్యాతి వహించెను. అరబ్‌స్తాన్, తుర్కిస్తాన్, ఈరాన్ మొదలైన దేశములనుండి అనేక వర్తకులు వచ్చుచుండిరి. అందుచే దేశములోని వర్తకము విశేషముగా నభివృద్ధియై, గోలకొండలో దొరకని వస్తువు లేదనిన ఖ్యాతిగాంచెను. ప్రజల కష్టసుఖముల నీనవాబెంత శ్రద్ధతో కనుగొనెనో అంత శ్రద్ధతో ఏ తురుష్క రాజును కనుగొనలేదని ఒక గ్రంథకారుడు వ్రాసియున్నాడు.

కుతుబ్‌షాహీ వంశములోని నాల్గవరాజు మహమ్మద్ కులీ కుతుబ్‌షా. ఈతని కాలముననే నేటి హైదరాబాదు పట్టణము స్థాపింపబడెను. రాజు తన కుమారునిపేర నీ పట్టణమునకు హైద్రాబాదని నామ మొసంగెను. ఇందలి ప్రజలకు నీటికొరత లేకుండుటకై మహమ్మద్ కులీరాజు గోలకొండ కెగువ మూసీనది కానకట్ట కట్టించి, గొట్టములద్వారా నీటిని పట్టణములోనికి తెప్పించెను. ఈతని కాలమున హైద్రాబాదు పట్టణమందలి మక్కామసీదు, చార్‌మినార్ మొదలగు గొప్ప కట్టడములు నిర్మింపబడెను. ఈ రాజు తన రాజధాని చుట్టును తోటలు వేయించెను. వ్యవసాయము నభివృద్ధి చేసెను. మరి అనేకవిధములుగ ప్రజాక్షేమమునకై పాటు పడెను. అయిదవరాజు అబుల్‌హసన్ కుతుబ్‌షా. ఈతని కాలము నాటికి ఆంధ్రదేశమంతయు గోల్కొండ సుల్తానుల వశమయ్యెను. వీరి రాజ్యముత్తరమున గంజాంవరకు వ్యాపించెను. ఈ కాలమున గోలకొండ రాజ్యమునందు మీర్‌జుమ్లా అను మహాసమర్థుడగు మంత్రి యుండెను. కాని ఈ మంత్రి కుటిలుడు స్వామిద్రోహి. మొగలు చక్రవర్తియగు ఔరంగజేబు (అప్పటి కింకను ఔరంగజేబు రాజు కాలేదు) తో కుట్రలు సల్పి, తన యజమానియగు గోల్కొండ నవాబుపై మొగలులకు ద్వేషము కల్గించెను. ఈ వంశములోని

తుట్టతుది రాజగు అబుల్ హసన్ కుతుబ్‌షాకు తానాషాయను బిరుదనామము కలదు. తానాషాయనగా మంచిరాజు అని అర్థము. ఈ రాజు సమర్థుడు కాడు. భోగి. అలసుడు. అయినను రాజ ధర్మమును చక్కగా గుర్తించి, హిందువులను, మహమ్మ దీయులను, సమానబుద్ధితో చూచెను. బ్రాహ్మణులగు అక్కన్న మాదన్నగార్లను తనకు మంత్రులుగ చేసికొనెను. తానాషా మహమ్మదీయ మతమండలి షియాపంథకు చెందినవాడు. కావున పర మత ద్వేషియైన ఔరంగజేబు చక్రవర్తి 1686 వ సంవత్సరమున విజా పుర రాజ్యమును రూపుమాపి, గోల్కొండను కూలద్రోయుటకై, సాగివచ్చెను. భోగపరాయణుడైన అబుల్ హసన్ కుతుబ్ షా మొగ లులతో సంధిచేసికొనుటకై యత్నించెను. కాని గోల్కొండను సర్వ నాశనము చేయవలయునని నిశ్చయించుకొనియున్న ఔరంగజేబు,సంధి కంగీకరింపలేదు. అది తెలిసి, అబుల్ హసన్ రాజు తన అలసతను విడనాడి, మహాధైర్యముతో ఏడునెలలపాటు మొగలులతో పోరా డెను. గోలకొండ శత్రురాజునకు వశము కాలేదు. అంతట మాయో పాయ కుశలుడగు ఔరంగజేబు చక్రవర్తి, గోల్కొండ నవాబు సేనా నులకు లంచములిచ్చి, తుదకు మోసముచే ఈ కోటను స్వాధీనపరచు కొని, అబుల్ హసన్ తానాషాను చెరబట్టి, బందీగా దేవగిరి దుర్గము నకు పంపివేసెను తానాషా అచ్చటనే మరణించెను. గోలకొండ ముట్టడి సందర్భమున మొగలు చక్రవర్తి చూపిన ధనాశకు లొంగక, అకుంఠిత పరాక్రమముతోడను, అద్వితీయ రాజభక్తితోడను, తన స్వామియగు గోల్కొండ నవాబు పక్షమున యుద్ధము చేసిన, మహా వీరుడును, రాజభక్తి పరాయణుడునైన అబ్దుల్ రజాక్ లారీ అను మహమ్మదీయ సర్దారు నీ సందర్భమున పేర్కొనక తప్పదు. ఈతనికి యుద్ధమునందు సుమారు నూరుగాయములు తగిలెను. వైద్యచికిత్స వలన నీతడు తరువాత కోల్కొనియు, తన ప్రభువునకు బద్ధశత్రువైన

ఔరంగజీబు చక్రవర్తిని సేవించుటకును, ఆత డిచ్చిన బహుమాన ముల నంగీకరించుటకును నిరాకరించెను. గోల్కొండ రాజ్యమును



అక్కన్న

అక్కన్న మాదన్న గార్లును అవినాభావ సంబంధము కలవారు. ఈ సోదరులు అబుల్ హసన్ కుతుబ్ షావద్ద దండనాథుడుగను మంత్రి గను పనిచేసి, మిక్కిలి ఖ్యాతిని సంపాదించిరి. అక్కన్న మాదన్న గార్ల వంశీయులగు పింగళివారు నేటికిని ఓరుగల్లు పట్టణములో కలరు. వీరు నియోగి బ్రాహ్మణులు. కావున వీరాంధ్రులని తెల్పుటలో ఎట్టి



మాదన్న (ఆంధ్ర మంత్రులు)

సంశయమును లేదు. వీరిలో అన్నయైన అక్కన్నను తానాషా 1682వ సంవత్సరమున దండనాథునిగ నియమించెను. మాదన్న ఈ రాజునకు మంత్రిగ నుండెను. ఈ సోదరు లిరువురును కలసి రాజకార్యముల సమర్థతతో నిర్వహించుచు, తమ ఏలికయగు తానాషా దయకు పాత్రులైరి. రాజు వీరియందు సంపూర్ణ విశ్వాసము కల్గియుండెను. ఈ సోదరులు శివపూజాధురంధరులు. విద్వాంసులగు బ్రాహ్మణులను వీరు సత్కరించుచుండిరి. కాని వీరు పక్షపాతబుద్ధి లేక హిందూ మహమ్మదీయులను సమానముగ చూచుచుండిరి. ఈ కాలమున సామాన్యవర్తకులుగ నుండిన ఆంగ్లేయులు, తమ వ్యాపార సంబంధ

మైన కొన్ని అనుకూలతలను సంపాదించుటకై, అక్కన్న మాదన్న లను ఆశ్రయించుచు, వారికి విలువగల బహుమానముల నిచ్చుచుం డిరి. మొగలు చక్రవర్తియగు ఔరంగజీబు గోల్కొండ రాజ్యముపై ద్వేషము వహించియున్నట్లు అక్కన్న మాదన్నలు తెలిసికొని యుండిరి. కావున తమ పక్షమును బలపరచుకొనుటకై, వీరు మహా రాష్ట్రవీరుడైన శివాజీమహారాజునకును, అబుల్ హసన్ కుతుబ్ షా కును స్నేహమును కల్గించిరి. ఈ రాజు లిర్వురు నేకమై మొగలుల ప్రతిఘటించుటకై, నిశ్చయించిరి. ఈ విషయము తెలిసి ఔరంగజీబు చక్రవర్తి, గోల్కొండరాజ్యముపై ఇంకను పగబట్టెను. ఇది యిట్లుం డగా గోల్కొండలో కొందరు మహమ్మదీయులు అక్కన్న మాదన్నల యెడ ద్వేషమువహించి, వారి నెట్లైన అంత మొందింపవలెనని చూచు చుండిరి. హిందువులగువారు నవాబుకడ గొప్ప ఉద్యోగములలో నుండుటయు, ఆతని దయకు పాత్రులగుటయు, మహమ్మదీయుల కని ష్టముగ నుండెను. ఇంతలో ఢిల్లీశ్వరుడైన ఔరంగజీబు చక్రవర్తి గోల్కొండపై దండెత్తెను. కాని అక్కన్న మాదన్నలు జీవించి యున్నంతకాలము, తనకు గోల్కొండ వశపడదని తెలిసికొని, వారి మరణమునకై యెదురుచూచుచుండెను. ఒకనాడీ సోదరులు దివా ణమునుండి యింటికి పోవుచుండ, కొందరు దుర్మార్గులు వీరిపై బడి చంపివైచిరి. ఇంతటితో అబుల్ హసన్ రాజునకుగల ముఖ్యమైన బలము నశించెను. అక్కన్న మాదన్నలు మరణించిన స్వల్పకాల మునకే, గోల్కొండ దుర్గము శత్రువులచే జయింపబడెను. అక్కన్న మాదన్నల పేర్లు నేటికిని ఆంధ్రదేశమున సగౌరవముగ స్మరింపబడు చున్నవి. అదృష్ట జాతకమునకును, సోదర ప్రేమకును అక్కన్న మాదన్నలు తెనుగువారికి లక్ష్యముగా నున్నారు.

కంచర్లగోపన్న అక్కన్న మాదన్నగార్లకు మేనల్లుడు, ఈత నిని భద్రాచలమునకు తహసీల్దారుగ నియమింపగా, నీతడు ప్రభుత్వ

కారణముల వలననే గోల్కొండ రాజ్యము నశించినప్పు డచ్చటి ప్రజలందరును మిక్కిలి తల్లడిల్లిరి.

క్రీ. శ. 1687—వ సంవత్సరమున ఔరంగజీబు చక్రవర్తి గోల్కొండ రాజ్యమును జయించుటవలన ఆంధ్రదేశము మొగలు సామ్రాజ్యములో నొక భాగముగ పరిణమించెను. ఈ విజయము తరువాత ఔరంగజీబు ఇరువది సంవత్సరములు జీవించెను. గోల్కొండను సాధించుటలో నాతడు సులభముగనే కృతకృత్యు డయ్యెను. కాని ఆ పరగణాయందు శాంతిని నెలకొల్పుట ఆతనివంటి సమర్థునికికూడ కష్టమే అయ్యెను. గోల్కొండ రాజ్యములోని చిన్ని జమీందారులు, సామంతులును, ప్రభుత్వముపై తిరుగుబాటు చేసిరి. దేశమునం దల్లరులు చెలరేగెను. అతి కష్టముమీద ఇచ్చట శాంతిని స్థాపించి, ఔరంగజీబు చక్రవర్తి తన కుమారులలో నొకనిని గోల్కొండకు రాజప్రతినిధిగా నియమించెను. ఔరంగజీబు క్రీ. శ. 1707 సంవత్సరములో మరణించెను. ఆతనిని తరువాత ఢిల్లీసామ్రాజ్యమును పాలించిన చక్రవర్తులలో సమర్థు లెవ్వరును లేరు. ఔరంగజీబు మరణింపగనే, అతని కుమారులు రాజ్యాధికారము నకై ఒండొరులతో కలహించిరి. వారిలో మొఅజ్జం అను నాతడు బహదూరుషా అను పేరితో చక్రవర్తి అయ్యెను. తన అధికారమున కెట్టి భంగమును లేకుండ, ఆతడు తన సోదరుల చంపించెను. ఈ మొగలు చక్రవర్తుల అధికారము నామమాత్రముగనే ఉండెను. వారి సామంతులు పలువురు వివిధ ప్రాంతములలో స్వతంత్రత వహించిరి. దక్షిణదేశమునకు సుబేదారుగ నియమింపబడిన నిజామ్ ఉల్ ముల్కు ఆసఫ్‌జా అను నాతడు 1724 స్వాతంత్ర్యము ప్రకటించి, నేటి హైద్రాబాదు రాష్ట్రమునకు స్థాపకు డయ్యెను. ఈ హైద్రాబాదు రాజ్యము పూర్వపు గోల్కొండ రాజ్యమునకు ప్రతిబింబ మని తెలుపవచ్చును. ఆంధ్రదేశమునందు చాలభాగము హైద్రాబాదు రాష్ట్రములోనే ఉండెను. ఆ నాడు దేశమం దరాజకత్వము ప్రబలియుండెను. దారిదోపిడి దొంగలు ప్రబలురై, దేశమునంతను అల్లకల్లోలము కావి[illegible] ఆసఫ్ రాజు దొంగల

నణచివైచి దేశమునందు కొంతవరకుశాంతిస్థాపన కావించెను. ఆతడు భూమిపన్నులను వసూలుచేయుటకై దేశముఖులు, దేశపాండ్యాలు, మున్నగు స్థానికాధికారుల నియమించెను. వీరు భూమి పన్నును వసూలు చేసి, అందులో కొంతభాగము ప్రభుత్వమువారికొసంగి, మిగిలినది తామే అనుభవించుచుండిరి. ఈ విధముగనే మనదేశమందలి ప్రస్తుత జమీందారులు బయలుదేరిరి.

చిరకాలమునుండియు భారతదేశముతో వ్యాపారము సల్పుచు, లాభములు పొందుచు వచ్చిన పాశ్చాత్యులు, పదునెనిమిదవ శతాబ్ది యందు ప్రబలురై, హిందూదేశమున రాజ్యము సంపాదించుటకై పెనగులాడజొచ్చిరి. 1639-వ సంవత్సరమునం దాంగ్లేయులు మద్రాసులో కోటకట్టుకొనుటకై, చంద్రగిరి రాజులవద్ద అనుమతిని పొందిరి. బుద్ధికుశలతచేతను, సామర్థ్యముచేతను ఆంగ్లేయులు తమ స్థితిగతుల నభివృద్ధి కావించుకొని, బాగుపడిరి. వీరు గోలకొండ రాజ్యమువారి యనుగ్రహమును సంపాదించి, తమవ్యాపారమును సంరక్షించుకొనుచుండిరి. మరికొంతకాలమునకు ఫ్రాన్సు దేశమువారు కూడ, భరతఖండముతో వర్తకము చేసి, ధనము సంపాదించుటకై ఒక కంపెనీని స్థాపించిరి. దేశ మరాజకస్థితిలో నున్న కారణమున, ఆత్మరక్షణమునకై వీరు తమవద్ద కొంత సేననుకూడ సిద్ధపరచి, యుంచెడివారు. ఈ కాలమున దక్షిణమున ఆంగ్లేయులకు మద్రాసును, ఫ్రెంచివారికి పుదుచ్చేరియును, కేంద్రములు. బంగాళీరాష్ట్రమందు ఇంగ్లీషువారికి కలకత్తాయును, ఫ్రెంచివారికి చంద్రనగరమును కేంద్రములు. భారతదేశమున బలమగు కేంద్రప్రభుత్వము లేకుండుటయు, దేశము చిన్న చిన్న రాజ్యములుగ చీలిపోయి యుండుటయు, గుర్తించి, ఆంగ్లేయులును ఫ్రెంచివారును, తమంతటతామే ఈ దేశమును జయించి, పరిపాలింపవలె నను కోరిక కలిగియుండిరి. నిజమునకు ఫ్రెంచి వర్తకసంఘముకంటె ఆంగ్లేయ వ్యాపారసంఘమే ఎక్కువ ధనవంతమైనది. బలముకలది. అయినను గడసరులైన ఆంగ్లేయులు, తమ ఆంతరంగికోద్దేశ్యములను బయల్పరుపక, బకధ్యానముచేయుచు, సమయమునకై

వేచియుండిరి. ఈ రెండు కంపెనీలవారును కూడ, హిందూదేశపు శిపాయీలకు క్రమశిక్షణ యిచ్చి, తమ సేనలో చేర్చుకొనిరి. ఈ సిపాయీలు సమర్థులైన సేనానాయకుల యాజమాన్యమున నద్భుతముగ పోరాడగలరని వారు గుర్తించిరి. ఇయ్యది వారి సామ్రాజ్య నిర్మాణమునకు ప్రథమ సోపానము. దేశీయరాజుల అన్యోన్య కలహములలో జోక్యము కలుగజేసికొని, ఆ విధముగ పలుకుబడిని అధికారమును సంపాదించుట రెండవ దశ. ఈ రెండవ దశయందు ఫ్రెంచివారు ముందంజ వేసిరి.

1748-వ సంవత్సరమున నిజామ్ ఉల్ముల్కు ఆసఫ్జా మరణించినప్పుడు, హైద్రాబాదురాజ్యమున సంభవించిన అంతఃకలహాములలో ఫ్రెంచి గవర్నరగు డూప్లే, జోక్యము కల్పించుకొని, తన కిష్టుడగు ముజఫర్ జంగు (ఆసఫ్జా నిజాముల్ముల్కు మనుమడు) ను, ఆతని మరణానంతరము సలాబత్ జంగు (ఆసఫ్జాకుమారుడు)ను నిజాముగ కావించెను. ఈ వ్యవహారములలో ఫ్రెంచి సేనానాయకుడగు బుస్సీ ముఖ్య పాత్ర ధరించెను. ఈ కాలమునాటికే ఫ్రెంచివారు మచిలీపట్టణములో కోట కట్టుకొని స్థిరపడియుండిరి. ఫ్రెంచివారు తమకు కావించిన సహాయమునకై సంతోషించి, ముజఫర్ సలాబత్ జంగులు వీరికి ఉత్తర సర్కారులైదింటిలోను-నాల్గింటిని ముస్తాఫానగర్, (కొండపల్లి) ఏలూరు, రాజమహేంద్రవరము, శ్రీకాకుళము సర్కారులను, సైన్యవ్యయములకు భరణముగ నిచ్చిరి. కాని ఈ సర్కారులను స్వాధీనపరచుకొనుట ఫ్రెంచివారికి కష్టమయ్యెను. కాని ఆ కాలమున విజయనగరమునందు రాజుగ నున్న విజయరామరాజు సహాయమున, వారీ పనిని సాధించిరి. ఇందులకు ప్రతిఫలముగ కాబోలు ఫ్రెంచి సేనానియగు బుస్సీ విజయరామగజపతికి తోడ్పడగా, వీరిరువురు నేకమై, గజపతికి శత్రువులైన బొబ్బిలి వెలమవారిని తాకిరి. 1757-వ సంవత్సరమున ఆంధ్రదేశ చరిత్రయందు ప్రసిద్ధిచెందిన, బొబ్బిలియుద్ధము జరిగెను. బొబ్బిలికోట నాశనమయ్యెను. రాజైన రంగారావు సకుటుంబముగ మరణిం

చెను. కాని మరికొంతకాలమునకు ఫ్రెంచివారికి మిత్రుడైన విజయ రామ గజపతిని, బొబ్బిలివారి బంధువులలో నొక్కడైన తాండ్రపాపా రాయుడు చంపివైచెను. ఈతని యనంతరము విజయనగరమును పాలించిన ఆనంద గజపతి పరాసువారియెడ విముఖుడై యుండెను.

ఫ్రెంచివారి అధికారము ప్రబలమగుచుండుట ఇంగ్లీషువారికి కన్నెఱ్ఱగ నుండెను. వారు పరాసువారి నెట్లైన పడగొట్టవలెనని పథకము వేయుచుండిరి. 1756-వ సంవత్సరమున యూరోపుఖండమునందు సప్త సంవత్సర యుద్ధము ప్రారంభమైనప్పు, డాంగ్లేయులకు పరాసువారిని పరాభవించుటకు, మంచి అవకాశము లభించెను. పరాసువారియెడ నసంతుష్టి చెందియున్న ఆనందగజపతి,రహస్యముగ బంగాళాదేశమున ఇంగ్లీషు సైన్యమునకు నాయకుడుగ నున్న రాబర్టు క్లైవున కుత్తరములువ్రాసి, ఆంగ్లేయులుత్తర సర్కారులను జయింప దలచిన యెడల, తాను వారికి సహాయపడగలనని వాగ్దానము చేసెను. ఈ సహాయము చూచుకొని ప్లాసీ విజయానంతరము (1757) క్లైవు కల్నల్ ఫోర్డు అను సైన్యాధికారిని 500 యూరోపియనులు, 2000 వేల సిపాయీలును గల సేనతో, దక్షిణాపథమునకు పంపెను. ఆనంద గజపతి సహాయముతో, ఫోర్డు, పరాసు సైన్యములను, రాజమహేంద్రవరమునకు సమీపమున కొండూరువద్ద నోడించెను. అచ్చటినుండి దక్షిణమునకు సాగిపోయి, ఫోర్డు మిక్కిలి కష్టముపై మచిలీపట్టణము కోటను, ఫ్రెంచివారివద్దనుండి జయించెను. ఇంతవరకును ఫ్రెంచివారి పక్షము నవలంబించియున్న సలాబతుజంగు, ఆంగ్లేయుల విజయముల కాశ్చర్యపడియు, వారి శక్తి సామర్థ్యములకు జంకియు, 1759-వ సంవత్సరమున వారితో సంధి చేసికొనెను. 1763-వ సంవత్సరము నాటికి దక్షిణ భారతదేశమున ఫ్రెంచివారి బలము సంపూర్ణముగ నశించెను. ఇంతకు పూర్వము ఫ్రెంచివారి యధీనములో నున్న ఉత్తర సర్కారు లాంగ్లేయుల హస్తగతమయ్యెను. 1761-వ సంవత్సరమున సలాబత్ జంగును పదభ్రష్టుని చేసి, హైద్రాబాదు రాష్ట్రమునకు రాజైన నిజామలీఖాను గుంటూరు సర్కారునుకూడ ఆంగ్లేయులకు దఖలుపఱచెను.

1799–వ సంవత్సరమున వెల్లస్లీ ప్రభువు సైన్య సహాయ విధానము (Subsidiary System) నేర్పాటు చేసి, దేశీయ ప్రభువుల నెల్లరనీవిధాన మంగీకరింపవలసినదని ప్రోత్సహించెను. ఈకాలమున నిజాము రాజ్యముపై మహారాష్ట్రులు తరచు దాడి వెడలుచు, అతనికి చాల చిక్కులు కల్గించుచుండిరి. మహారాష్ట్రుల బాధపడలేక, నిజాము సైన్యసహాయపద్ధతి నంగీకరించి, తన రాజ్యమున నుండు బ్రిటిషు సేనలకగు ఖర్చులకుగాను కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురము జిల్లాలను బ్రిటీషువారి కిచ్చివేసెను. వీనిని దత్తమండలములని నేడు మనము వ్యవహరించుచున్నాము. 1788–వ సంవత్సరమున వెల్లస్లీ ప్రభువు కర్ణాటక నవాబును తొలగించి, ఈతని రాజ్యమును బ్రిటీషువారి పరిపాలనలోనికి గొనివచ్చెను. ఆ సందర్భమున మరికొన్ని ఆంధ్ర ప్రాంతము లాంగ్లేయులకు వశమయ్యెను. 1799–వ సంవత్సరమున టిప్పుసుల్తాను మరణించిన వెనుక, తొల్లింటి ఒడయరు వంశస్థులలో నొకరిని వెల్లస్లీ ప్రభువు మైసూరు రాజుగ నియమించెను. టిప్పుసుల్తాను పాలించిన రాజ్యములో, సగము భాగము మాత్రము, ఈ నూతన రాజ్యములో నుండెను. అందు కొన్ని తెలుగు జిల్లాలు కలవు. ఈ విధముగ నాంధ్రదేశము మూడుభాగములుగ విడిపోయి, కొంత భాగము బ్రిటీషు పాలనమందును, మరికొన్ని ప్రాంతములు నైజాము మైసూరు రాష్ట్రములలోను చేరుట తటస్థించెను.

పదునెనిమిదవ శతాబ్దమున భారతదేశమందలి యితర ప్రాంతములందు వలెనే, ఆంధ్రదేశమునకూడ క్షీణదశ ప్రారంభించెను. దేశమున బలవత్తరమగు కేంద్ర ప్రభుత్వము లేక, చిన్నచిన్న సామంతరాజ్యములు తలయెత్తెను. ప్రజలకు చోరభయమును, అశాంతియు హెచ్చెను. పాశ్చాత్య జాతుల ప్రాబల్యమువలన, ఇచ్చటి చేతిపనులు క్రమక్రమముగా క్షీణించెను. వ్యాపారము నాంగ్లేయులు వశపరచుకొనిరి. దేశమల్లకల్లోలములకు లోనైన కారణమున కళలు పెంపొందుట కవకాశము లేదయ్యెను. ఈ కాలమున ఆంధ్రదేశమందలి వివిధ ప్రాంతములలో పెద్ద సంస్థానము లేర్పడసాగెను.

ఉత్తరాంధ్రమున బొబ్బిలి, విజయనగరము, పెద్దాపురము, పిఠాపురము మున్నగు సంస్థానములును, తెలంగాణమున గద్వాల, దోమకొండ, వనపర్తిసంస్థానములును, నెల్లూరుజిల్లాయందు వెంకటగిరి మున్నగు సంస్థానములును ఏర్పడెను. ఈ సంస్థాన పాలకులు తమశక్తి ననుసరించి, కవులను పండితులను పోషించి ఆంధ్ర సంస్కృతిని కాపాడిరి. దేశము పరజాతులచే నాక్రమింపబడుచున్న ఈ అంధకారయుగమందుకూడ తెనుఁగుజాతిలో గొప్ప కవు లుద్భవింపకపోలేదు. వీరిలో ఓరుగల్లు వాసియైన పరశురామపంతుల లింగమూర్తికవియు, రాయలసీమయందలి వేమన యోగియు, నెల్లూరి మండలములోని దిట్టకవి నారాయణకవియు గోదావరీ మండలములోని కూచిమంచి తిమ్మకవి, ఏనుగు లక్ష్మణకవి ప్రభృతులును ప్రసిద్ధులు. వీరి రచనలు నేటికిని తెలుగుదేశమున సగౌరవముగ పఠింపబడుచున్నవి.

# ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి

## 20 వ ప్రకరణము

## ఆధునికయుగము క్రీ. శ. 1800—1956

క్రీ. శ. 18 వ శతాబ్దము ఆంధ్ర దేశచరిత్రయందే కాక యావద్భారత దేశ చరిత్రయందుకూడ క్షీణయుగముగా పరిగణింప బడుచున్నదని కడచిన ప్రకరణమున తెలిసికొనియుంటిమి. ఆంధ్ర దేశము యవనాంధకారముచే పూర్తిగా నావరింపబడి, పారతంత్ర్య కూపమునందు కూలెను. [1]ధంసావంటి ముష్కర తురుష్క నాయ కులకు వెఱచి, భద్రాద్రి కోదండరామస్వామియే కాలికి బుద్ధిచెప్పి, పోలవరమునకు తరలిపోయెను. [2]సింహాద్రి నారసింహదేవుడు యవ నుల యాగడములకు నిలువలేక, కందిరీగల తుట్టలను ఆత్మ సహా యార్థమై సృష్టించుకొనవలసినవాడయ్యెను. ఇంక నిరపరాధులును, నిస్సహాయులును అగు ప్రజల కడగండ్లు వడగండ్లుగా కురిసె ననుట కన్న విస్తరించి వ్రాయనక్కరలేదు. పెద్ద రాజ్యములు పోయి జమీం దారీలవంటి చిన్న చిన్న పరిపాలనములు మాత్రము నిల్చిపోయెను. వీరైనను ప్రజలను సంరక్షించుట యటుంచి, బొబ్బిలి విజయనగర ములవలె, తమ ప్రతాపాగ్నికి తామే యింధనములగుచుండిరి. వాఙ్మ యము వెనుకపట్టెను. కళలు కళవళమందెను. రాజులందును ప్రజా నీకమునందును, స్వార్థముతప్ప వేరు ఆర్థిక వ్యవస్థ లేకుండెను. ఈ మహావిపద్దశయందు గొప్ప రాజ్యవిప్లవము, జనులు గుర్తింపలేనంత వేగముతో సంభవించెను. విదేశీయులైన బ్రిటీషువారి పరిపాలనము చాపక్రింద నీళ్ళవలె, తెలియబడకుండగనే దేశమునందు స్థాపింప బడెను.

(కుంపిణీవారి పరిపాలనారంభ కాలమునందు, ఆంధ్ర దేశము యొక్క ఆర్థికవ్యవస్థ మిక్కిలి దెబ్బతినెను. ఉత్తరమున వంగరాష్ట్ర)

---

1. భద్రగిరిశతకము. భల్లా పేరయ్యకవి.
2. సింహాద్రి నారసింహశతకము. గోగులపాటి కూర్మనాథుఁడు.

మును, దక్షిణమున ఆంధ్ర దేశము—ఈ రెండే, బ్రిటిషువారికి ప్రప్రథమమున వశపడిన యదృష్టమునకో, దురదృష్టమునకో, నోచుకొన్న మండలములు. తెలుగు దేశమునందు 'భూమి—రైతు' సమస్యను పరిష్కరించుటలో ఆంగ్లేయు లెన్నియో ప్రమాదకరములైన నిర్ణయములను గావించిరి. దేశీయమైన రెవిన్యూవిధానము పాలకులకు తెలియకుండుటయు, దేశభాషలతో పరిచయము లేకుండుటయు, దీనికి హేతువులు, మొగలాయి ప్రభుత్వకాలమునందును, అంతకు ముందు హిందూరాజన్యుల కాలముననుు, 'భూమి దున్ను రైతుదే' యను ఉత్తమ వ్యవస్థ అమలులోనుండెను. ప్రభుత్వమునకు పన్నులు వసూలు చేయుటలోను, స్థానిక పరిపాలనము నిర్వహించుటలోను తోడ్పడు ఒక తెగ యుద్యోగులు వంశానుక్రమముగ వచ్చుచుండిరి. వీరు పలుకుబడిగల భూస్వాములు, సంపన్నులు మొదలైనవారు. ప్రభుత్వమునకీ కార్యములలో తోడ్పడినందులకు, వసూలయిన పన్నులలో నొకభాగము వారికి ముట్టుచుండెను. కాని రైతు దున్ను భూమిమీద వారి కెట్టి హక్కులు లేకుండెను. కుంపిణీ యుద్యోగులు ఈ విధానమును అర్థము చేసికొనలేరైరి. ఆంగ్లదేశమునందున్న జమీందారీ విధానము వంటిదే (Feudal System) ఈ దేశమునందును వర్తించునని వారు భ్రమపడిరి. ఇదివరలో వసూలు చేయు ఉద్యోగులుగా మాత్రముండిన వారిని, జమీందారులుగ గుర్తించి, భూస్వాములుగా మార్చివైచిరి. చెమటోడ్చి, క్షేత్రమును దున్ని, పంట పండించు రైతునకు భూమిపై స్వత్వము లేకుండపోయెను. ఈవిధముగ స్వతంత్రరైతాంగము నశించి, కృషీవలులు భూమి దున్నుకొను కూలీలు మాత్రమయిరి. నిరంకుశులును, ప్రజాపీడనపరులును, అగు జమీందారుల తరగతి వృద్ధిపొందెను.

ఆంగ్లేయులలో బుద్ధిమంతులైనవారికే కొందరకో అన్యథా వినియోగ పరచిన ఈ నూతన విధానము అన్యాయమని తెలిసివచ్చెను. ప్రభుత్వమునకును, రైతునకును నడుమ 'మధ్యజనులు'

ఉండుట అరిష్టదాయకమని గుర్తించి సర్ థామస్ మన్రో అను నాతడు 'రైతువారీ' భూమ్యాదాయపద్ధతిని, అమలులోనికి తెచ్చెను. రాయలసీమలో నీతడీ విధానమును ప్రవేశపెట్టెను. ఆనాటి రాయలసీమ ఆర్థిక రాజకీయ దురవస్థను ఈ దేశచరిత్రలో గాని, ప్రపంచ చరిత్రలోగాని సాటిలేనిదని చరిత్రకారులు నుడివిరి. రైతువారీ విధానము ననుసరించి, భూములను 'సర్వే' చేయుటయు, భూసారమును, పండు పంటలను బట్టియు పన్నులను నిర్ణయించుటయు, జరిగెను: కాని బెంగాలులో ప్రవేశపెట్టపడిన శాశ్వత భూమ్యాదాయపద్ధతి (Permanent Settlement) తెలుగు దేశములో లేకుండెను. అవసరమును, అవకాశమును బట్టి, భూమి పన్ను హెచ్చించగల యధికారము ప్రభుత్వమున కుండెను. గ్రుడ్డిలో మెల్లయయిన రైతువారీ విధానముయొక్క సత్ఫలితములు కనబడుటకు పూర్వమే, రాయలసీమయందు క్రీ. శ. 1801—1802 లలో వర్షాభావముచే మహాక్షామ మేర్పడెను. పంటలు నశించెను.

దేశము దుర్భిక్షముతో వేగిపోయెను. ప్రజలు ఈగలవలె మరణించిరి. ఆహారపదార్థముల ధరలు మూడువందలు నాలుగువందలు రెట్లు పెరిగిపోయెను. ప్రజలు గుంపులు గుంపుగా హైదరాబాదు, మైసూరు సంస్థానములకు వలసపోయిరి. సర్ థామసుమన్రో ప్రజలనీ మహోపద్రవమునుండి రక్షించుటకు, యధాశక్తిగ ప్రయత్నించెను. దక్షిణదేశములోని ధాన్యము తుంగభద్ర దాటిపోకుండ ఆజ్ఞాపించెను. రాయలసీమలోనికి వచ్చు బియ్యము మొదలగు తిండిసరకులపై, సుంకములు రద్దుచేయించెను. ఆంధ్రదేశములో నాంగ్లేయుల పరిపాలన మిట్టి దుఃఖోదంతములతో నారంభించెను.

ప్రస్తుతము మనము వర్ణించు ఈ యుగపరిస్థితుల నన్వయించుటలో, యావద్భారత దృష్టి నలవరచుకొనవలయును. కీడునకో, మేలునకో, భారతదేశమంతయు ఏకచ్ఛత్రపాలనక్రిందికి వచ్చెను. భారతదేశ సుదీర్ఘ చరిత్రపుటలందీ సన్నివేశము అపురూపము. మౌర్యుల కాలమునను, మొగలుల కాలమునను, యావద్భారతము,

నొక్క రాజదండము క్రిందికి గొనివచ్చు ప్రయత్నములు జరిగెను. అట్లు స్థాపింపబడిన ఏకైక ప్రభుత్వము లచిరకాలముననే అదృశ్యము లయ్యెను. దైవనియోగముచేత క్రీ. శ. పందొమ్మిదవ శతాబ్దము నుండియు, సమగ్రభారతదేశము విదేశీయులైన ఆంగ్లేయుల రాజనీతికి వశమయి, ఏకపరిపాలనము ననుభవింప మొదలిడెను. ఆయా రాష్ట్రముల నడుమ రాకపోకలును, ఇచ్చిపుచ్చుకొనుటలును, నిత్యవ్యవహారము లయ్యెను. వివిధ ప్రాంతముల సంస్కృతి ఉద్యమములు అన్యోన్య ప్రభావమునకు గురియయి పుష్టినొందెను.

భారతదేశమును జయించినవి ఆంగ్లేయుల తుపాకులైనను, భారతదేశమును వారి చేతులలో ఒకటిన్నర శతాబ్దమువరకైనను, నిల్పుకొనుటకు సాధనభూతమైనవి వారి భాషాసంస్కృతులని మనము గ్రహింపవలెను. ఈ యంశమునుబట్టియే, సంస్కృతికి మానవ హృదయముపై నెట్టి మహత్తర విజయశక్తి గలదో విశదమగును. ఆంగ్లసంస్కృతి యన్నప్పుడు పాశ్చాత్యసభ్యత నంతను విషయముగా తీసికొనవలెను. ప్రాక్పశ్చిమముల కీనాడు భారతదేశములో భేటీ కల్గెను. ప్రతీచీ సంస్కృతి మిరిమిట్లుగొల్పు గొప్ప వెలుగుతో, ప్రాచ్యసంస్కృతిని దాకెను. ప్రాచ్యనాగరకత మొదటి తాకునకు వెరగుపడి డీలుపడెను.

ఈ సభ్యత దుర్బలము, నిస్సారము అను భయము పూర్వదేశీయుల నావరించెను. అది యింక ఎక్కువకాలము జీవింపజాలదని పాశ్చాత్యులు నిశ్చయించి మురిసిరి. కాని ప్రాచ్య సంస్కృతికి వజ్ర సన్నిభమైన యాత్మ గలదని, పందొమ్మిదవ శతాబ్దము సాగిన కొలదిని వ్యక్తమాయెను. ఈ శతాబ్దాంతమునకు భారతీయ సంస్కృతి పాశ్చాత్య నాగరతకు ఆచార్యస్థాన మలంకరించి, తన వేదాంత మహత్త్వసందేశమును, పశ్చిమ ఖండములందు విన్పింప సాగెను.

పాశ్చాత్యనాగరకతా ప్రభావము మొట్టమొదట వంగదేశములో కాన్పించెను. ఆంగ్లేయ పరిపాలనతోపాటు క్రైస్తవ మతముకూడ

దేశమునందు వ్యాపింపజొచ్చెను. తన్మత ప్రచారకులైన మిషనరీలు అభినివేశముతోను, అసూయతోను, హిందూమతమును భంజింప దొరకొనిరి. హిందువులలో సర్వసామాన్యమైన బహుదేవతాభక్తి, విగ్రహారాధనము, వర్ణవ్యవస్థ మొదలగు మూలసూత్రము లన్నియు మిషనరీల యాక్షేపణకును, విమర్శనకును గురిచేయబడెను. దేశీయులకు స్వీయమతధర్మములపై అవిశ్వాసము జనించెను. విద్యాధికులైనవారు హిందూధర్మమును త్యజించి, క్రైస్తవము నవలంబింప జొచ్చిరి. ఏకేశ్వరోపాసనము, ప్రార్థనా మందిరములు, గోష్ఠులు—వీనిపై మమత హెచ్చెను. పూర్వాచార ప్రియులైన భారతీయులను హేళనచేయుటయు, వారి మతవిశ్వాసముల ధిక్కరించుటయు, వీర కార్యముగ పరిగణింపబడెను. మధుమాంస సేవనము ప్రయోజకత్వ సూచకముగ భాసించెను. నూతన క్రైస్తవమత ప్రవిష్టులే, స్వదేశీయుల సంస్కృతిని తృణీకరించుటలో, ముందు నడచిరి. పూర్వ సంస్కృతినేకాక, పూర్వవాఙ్మయమునుకూడ వీరపహాస్య మొనర్చుచుండిరి. మైకేలు మధుసూదనదత్తు, ప్రతిభాశాలియైన వంగకవి. ఈతడు ఆంగ్లకవి మిల్టనుయొక్క 'స్వర్గభ్రంశము' (Paradise Lost) వంటి కష్టాంతపురాణమును వ్రాయదలచి, 'మేఘనాథ విజయము'ను రచించెను. వాల్మీకి రామాయణముపై ఈతడు చేసిన వ్యాఖ్య అప్పటి బెంగాలీ విద్యాధికుల దృష్టిపథమును చక్కగా ప్రదర్శించును. మైకేలు మధుసూదనదత్తు ఇట్లు నుడివెనట : "శ్రీరాముడు, అతని కోతిమూక యన్న నాకు ఏవగింపు జనించును.. రావణుడు ప్రేమింపదగిన వ్యక్తి."

స్వసంఘముయొక్కయు, మతముయొక్కయు, విషాదకరపరిస్థితిని చూచి దుఃఖించి, వాటిని సంస్కరించుటకు దీక్ష వహించినవాడు రాజారామమోహనరాయలు. వేదములు, ఉపనిషత్తులు మొదలగు ప్రాచీన హైందవ మతగ్రంథములను సాకల్యముగ అధ్యయనము చేసి, ఈ దేశభక్తుడు, స్వజనులకు పునరుద్ధరణోపాయములను సూచించెను. ఏకేశ్వరోపాసనము క్రైస్తవ మతముయొక్క విశిష్టత మాత్రమే

కాదనియు, 'ఏకం సద్విప్రా బహుధా వదంతి' మున్నగు వేదవాక్యము లందు ప్రాచీన మహర్షులే ప్రతిపాదించిరనియు, రామమోహన రాయలు వ్యక్తీకరించెను. క్రైస్తవుల సామాజిక ప్రార్థనలవంటి వానిని తాను స్థాపించిన బ్రహ్మసమాజమునందు నెలకొల్పెను. తాను తెలిసికొనిన ఈ విశుద్ధ హైందవ మతమున కాతడు బ్రహ్మ మతము అని నామకరణము చేసెను. హైందవులలో సాంఘిక దురా చారములు పెక్కు గలవని ఈ మహనీయుడు గుర్తించి, వాటిని మొగమోడక ఖండించుచు వచ్చెను. 'సతి' లేక సహగమనము అను దురాచారమును నిరోధించుటకై రాయలు గట్టి కృషిచేసి, విలియం బెంటింగు ప్రభువు కాలమున తన్నిషేధక శాసనమును పుట్టించెను. స్త్రీలకు సంఘములో గౌరవస్థానము లభించుటకును, వారు కేవలము వంటయింటి బానిసలుగా ఉండకుండుటకును, రామమోహనుడు ప్రచారము సాగించెను. వితంతువుల దుఃస్థితిని, దైన్యమును తొల గించుటకు పునర్వివాహ సూత్రము నాతడు ప్రతిపాదించెను. విద్యా విధానమునందుకూడ రాజారామ మోహనరాయల భావములు సమ కాలమునకు ముందు పరువిడెను. ప్రాచీన పద్ధతిని సంస్కృతము, అరబ్బీ, పర్షియను భాషా గ్రంథములు పఠించుచుండుటవలన, మూఢ విశ్వాసములు ఘనీభవించుట తప్ప వేరు ప్రయోజనము లేదనియు, ఆంగ్లభాషా పఠనమును, పాశ్చాత్య విద్యావిధానమును, దేశములో ప్రవేశపెట్టవలెననియు ఈయన వాదించెను. రాజావారి మరణానం తరము మెకాలే నిరంతర ప్రోత్సాహమున 1835 లో బెంటింకు ప్రభువు ఆంగ్ల విద్యావిధానమును దేశములో ప్రవేశపెట్టించెను. రామమోహనరాయ లారంభించిన సంఘ సంస్కారోద్యమమును ఈశ్వర చంద్ర విద్యాసాగరుల వంటివారు బలపరచిరి.

ఒకవంక దేశాభిమాన ప్రేరితుడై రామమోహనుడు పాశ్చాత్య విద్యను ప్రశంసించుచుండ, భారతీయ సంస్కృతి ప్రియు లైన కొందరు ఆంగ్లేయ విద్యాధికులు, సంస్కృతభాషా ప్రాశస్త్య మును లోకమునకు చాటజొచ్చిరి. భారతదేశపు మొదటి గవర్నరు జనరలు వారన్ హేస్టింగ్సు అంతవాడు భగవద్గీతను లోకోత్తర

వేదాంత గ్రంథముగ గుర్తించెను. సర్ విలియంజోన్సు పండితుడు (1789) కాళిదాస కృత శాకుంతల నాటకమును ఆంగ్లములోని కను వదించి, భారతీయ వాఙ్మయ సౌరభమును, యూరపు ఖండ విద్యా పరిషత్తులందు వాసింపజేసెను. షోపెన్‌హోరు అను జర్మను పండితుడు ఉపనిషన్మధువును పాశ్చాత్య తత్త్వజ్ఞులకు రుచి చూపించెను. సంస్కృత భాషా పరిచయము 'భాషాశాస్త్రము' (Philology) అను నూతన శాస్త్రనిర్మాణమునకు దారితీసెను.

వంగదేశము నవచైతన్యముతో పల్లవించుచున్న యీ కాలమున, ఆంధ్రదేశ మింకను నిద్రాముద్రితమై యుండెను. క్రైస్తవ మిషనరీలు దక్షిణదేశమునకూడ తమ కార్యజాతమును సాగించుచునే యుండిరి. ఆంగ్లవిద్యా ప్రచారమునకై, పాఠశాలలు నెలకొల్పిన వారిలో వీరు ప్రప్రథములు. అప్పటి మద్రాసు ప్రభుత్వము వీరియత్నములను ప్రోత్సహించెను. ఆంగ్లేయోద్యోగులకు దేశభాషలు బోధించుటకును, ఆచార వ్యవహారములను గూర్చి తెల్పుటకును, మద్రాసు ఫోర్టుసెంట్ జార్జికోటలో నొక కళాశాల క్రీ. శ. 1812 లో స్థాపింపబడెను. మొదటినుండియు మిషనరీలు దేశభాషల ప్రాముఖ్యమును గుర్తించి, వీని ద్వారా తమమత ప్రచారము చేయుటకు బూనుకొనిరి. పాఠశాలా విద్యార్థులకు దేశభాషలందు పాఠ్యగ్రంథము లవసరమయ్యెను. సులభ వచన శైలిలో చరిత్ర, భూగోళము, ప్రకృతిశాస్త్రములు మున్నగు విషయములపై గ్రంథములు వ్రాయించి, ప్రకటించు నావశ్యకత మిషనరీలకు గల్గెను. దీనిని మించి వారి మహత్తర లక్ష్యము బైబిలు గ్రంథమును దేశభాషలలోని కనువదించి, ప్రజానీకమునందు ప్రచారముచేయుట. ఈ యుద్దేశ సాధనకై ఆంధ్రాంగ్ల నిఘంటువులు సమకూర్చుట మొదటి సోపాన మనిపించెను.

తెలుగు నిఘంటు నిర్మాణ యత్నముతో, ఆంధ్రభాషా చరిత్రమునందు నూతనాధ్యాయము ప్రారంభ మగుచున్నది. ఈ సందర్భమున చార్లెసు ఫిలిప్ బ్రౌనుగారిని స్మరించవలెను. ఈయన

తెలుగు – ఇంగ్లీషు; ఇంగ్లీషు – తెలుగు నిఘంటువులు కూర్చి గొప్ప ఖ్యాతిని బడసెను. ఆంధ్రమున కొక వ్యాకరణము వ్రాసెను. ప్రాచీనాంధ్ర ప్రబంధము లానాటికి అచ్చుపడలేదు. అవి తాటాకులలో చివుకుచు, అపపాఠములతో నిండి మూలల నొదిగియుండెను. నిక్కమైన ఆంధ్రభాషాభిమానముగల బ్రౌన్ దొరకు, ఈ యుద్గ్రంథములను పరిష్కరించి, సాధు పాఠ నిర్ణయము గావించి, ప్రకటించవలెనను ఫలదాయకమైన యూహ జనించెను. వఠ్యం వాసుదేవ పరబ్రహ్మశాస్త్రి, జూలూరు అప్పయ్య పంతులు మున్నగు దిగ్గంతులవంటి సంస్కృతాంధ్ర పండితులను చేరదీసి, బ్రౌన్ గారు వారిచే పెక్కు కఠిన ప్రబంధములకు, సులభశైలిలో వ్యాఖ్యానములు వ్రాయించెను. తాను స్వయముగ వేమనయోగీంద్రుని పద్యముల నాంగ్లభాషలోని కనువదించి ప్రకటించెను. జంగమ కవుల రచనలపై ఈతనికి ప్రీతి మెండు. బ్రౌన్ చుట్టును సమావేశమైన పండిత బృందమునకు 'బ్రౌన్ కళాశాల' అను సార్థకనామ మేర్పడెను.

ఆంధ్రభాషకు బ్రౌనుచేసిన మేలునే ఆంధ్రచరిత్రకుగావించిన మరియొక యాంగ్లేయుడు కర్నలు కాలిన్ మెకంజీ. ఈయనకూడ బ్రౌనువలెనే తూర్పు ఇండియాకంపెనీవారి యుద్యోగి. మెకంజీ క్రీ. శ. 1816–21 ల నడుమ ఇండియా ప్రభుత్వమునకు ముఖ్య సర్వేఅధికారి (Surveyor General of India) గా నుండెను. చారిత్రక ప్రసిద్ధిగలవి యని తోచినప్రదేశము లన్నిటికిని మెకంజీ తన మనుష్యులను పంపించి, ఆయా స్థలముల చరిత్రమును స్థానికులగు గ్రామ వృద్ధులకు తెలిసినంతవరకు వ్రాయించి తెప్పించెను. గ్రామకైఫియతులు, కవిలెలు, శిలా తామ్ర శాసనములు, తాళపత్ర గ్రంథములు మొదలగు వానిని వ్రాయించి సేకరించెను. వీటినే మెకంజీ లిఖిత పుస్తకములు (Mackenzee Manuscripts) అందురు. ఇవి ఆంధ్రదేశ చరిత్రకును, దక్షిణదేశ చరిత్రకును అమూల్యసాధనములైనవి. ఈ కథనము లన్నియు సత్య చరిత్రలు కావు. కాని చరిత్ర రచనకు కావలసిన ముడిసరకును అపారముగ నివి చేకూర్చుచున్నవి.

మెకంజీతో పనిచేయు ఉద్యోగులలో కావలి వెంకటబొర్రయ్యగారను ఆంధ్రబ్రాహ్మణు డుండెను. ఈతడు శాసనలిపి మర్మమును తెలిసికొనుటయందును, సశాస్త్రీయమైన పద్ధతులమీద చరిత్ర వ్రాయుటయందును విస్తారముగ కృషిచేసెను. మరికొంత కాలమునకు బుక్కపట్నము రాఘవాచార్యు లనునాయన, అప్పటికి లభించిన సాధనములతో మొట్టమొదటి ఆంధ్ర దేశ చరిత్రను వ్రాసెను. ఇందు రెడ్డిరాజులను గూర్చియు, గజపతులను గూర్చియు నాతడు ప్రసంగించెను.

పై విధమున ఆంధ్రభాషావీధులందు క్రొత్త సందడి బయలుదేరెను. పూర్వపద్ధతులలో పాండిత్య ప్రకర్ష సూచకములగు పద్య ప్రబంధములను వ్రాయుట యొక్కటే భాషా సేవ కా దనుభావము దేశీయులకు స్ఫురించెను. అచ్చు కూటములు నెలకొల్పబడి గ్రంథ ముద్రణము చురుకుగా సాగజొచ్చెను. మునుపటికన్న చదువనేర్చిన వారి సంఖ్య హెచ్చెను. సామాన్యజనుల కందుబాటులో నుండుటకై సులభశైలి వచన రచనలే ఎక్కువగా కావలసి వచ్చెను. ఈ కాలముననే ఏనుగుల వీరాస్వామయ్యగారి 'కాశీయాత్ర చరిత్ర' యను చక్కని గద్యకృతి వెలువడెను. విదేశీయులైన బ్రౌన్ గారి కృషి, దేశీయపండితులయం దొక నూతన జాగృతిని కలిగించెను. పరవస్తు చిన్నయసూరి యను గొప్ప పండితుడు ప్రెసిడెన్సీ కళాశాలలో ఆంధ్రాధ్యాపకు డయ్యెను. ఈయన 'నీతిచంద్రిక'యను ప్రామాణిక వచనశైలిగల గ్రంథమును రచించెను. ఆంధ్రశబ్ద చింతామణి మున్నగు ప్రాచీన వ్యాకరణముల నాధారముగా గొని, చిన్నయసూరి (క్రీ. శ. 1855 లో) 'బాలవ్యాకరణము'ను వ్రాసెను. అంతకుముందు వ్యవహారభాషలో వచన రచన జరుగుచున్నను, చిన్నయసూరి నాటినుండి పద్యమునువలెనే గద్యమునుకూడ సలక్షణభాషలో వ్రాయవలె నను నియమ మేర్పడెను. అనంతర భాషావికాసముపై బాలవ్యాకరణముయొక్క ప్రభావము అపారముగా పడెను. చిన్నయ సూరి శిష్యవర్గములోనివారైన బహుజనపల్లి సీతారామాచార్యుల

వారు 'శబ్దరత్నాకరము' అను ప్రామాణిక నిఘంటువును, గొప్ప శ్రమతో సమకూర్చిరి. ఈ కోశమునందు శబ్దార్థములను సమర్థించుటకై మహాకవుల ప్రయోగములును ప్రదర్శించుట ఒక విశిష్టత.

కందుకూరి వీరేశలింగము పంతులు (1848—1919) ఆంధ్ర దేశరంగమున నవతరించుటతో, నవజీవన వికాసమునకు శుభ నాంది యయ్యెను. ఈ నూతన చైతన్యమునకు మూలము ఆంగ్ల విద్యా వ్యాప్తియని చెప్పవచ్చును. సిపాయి సంగ్రామము తరువాత రాజధానీ నగరములందు విశ్వవిద్యాలయములు స్థాపింపబడెను. మిషనరీలు స్థాపించిన కళాశాలలు బందరు, గుంటూరు మున్నగు ప్రదేశములలో పని చేయుచుండెను. దేశమునందు ప్రబుద్ధమైన నవజీవితము యొక్క ముఖ్యలక్షణముల నిట్లు పేర్కొన దగును. దేశముయొక్క ప్రాచీన సంస్కృతిని, చరిత్రను సవిమర్శ నయనములతో వీక్షించుట; భవిష్యత్తు ఉజ్జ్వలముగా నుండగలదను ఆకాంక్ష; హేతువాదము, గుణాగుణ వివేచనము, అంధ విశ్వాసముయొక్క స్థానము నాక్రమించుట; మూఢనమ్మకములను విడనాడి, శాస్త్రజన్య దృష్టి నలవరచుకొనుట; వెనుకబడియున్న స్థితినుండి మేల్కొని పురోగమనము చేయుట; సంఘ దురాచారములను సంస్కరించవలె ననుదీక్ష; ధర్మశాస్త్ర గ్రంథములను నూత్న చక్షువులతో పరిశీలించి, నీతి, మతవిషయములలో ఉన్నతాదర్శములను సాధించు నభిలాష – ఇవి నవచైతన్య చిహ్నములు. ఒక్కమాటలో చెప్పదలచినచో వీరేశలింగము పంతులు 'నవజీవనభానుడు' అని నుడువదగును. రాజా రామమోహనరాయల లక్ష్యమే వీరేశలింగము పంతులుగారికి ఒరవడి యయ్యెను. ఏకేశ్వరోపాసనాప్రీతి, విగ్రహారాధనఖండన, బ్రహ్మమత ప్రచారము, స్త్రీజనోద్ధరణపరాకాష్ఠ. ఇది యది యననేల—ఆంధ్ర దేశపు రామమోహనుడు వీరేశలింగము. పిఠాపురము, కాకినాడ, రాజమహేంద్రవరము నగరములు సంఘసంస్కారమునకు గొప్ప కేంద్రము లయ్యెను. తన నూతన సందేశమును దేశవ్యాప్త మొనర్చుటకై, వీరేశలింగము పంతులు సారస్వతము నూతగా

గొనెను. మొదట మొదట పూర్వ ప్రబంధమార్గములలో మెలగిన వాడైనను, పంతులుగారు వచనవాఙ్మయప్రయోజనమును చక్కగా గుర్తించి, తన లేఖినిని ఈ త్రోవకు మరల్చెను. నాటినుండియు ఆయన చేసిన యసంఖ్యాకరచనల మూలమున, 'గద్యతిక్కన' యను కీర్తి వీరేశలింగముగారికి కలిగెను. పంతులుగారు ఆంగ్లభాషా పరిజ్ఞానము కలవారయి, ఆ వాఙ్మయమునందలి సాహిత్యప్రక్రియల నెన్నిటినో, ఆంధ్రమునందు ప్రవేశపెట్టిరి. నాటకములు, నవలలు, ప్రహసనములు, అధిక్షేప కావ్యములు, జీవితచరిత్ర, స్వీయచరిత్ర మున్నగు శీర్షికలక్రింద వచ్చు రచనలను, పంతులుగారు కావించిరి. మాసపత్రికలను నడిపిరి. నష్టప్రాయమైన పూర్వ ప్రబంధములను వెలికిదీసి, సంస్కరించి, ప్రకటించిరి. రాజశేఖరచరిత్ర, సత్యరాజా పూర్వదేశయాత్రలు, ప్రహ్లాద హరిశ్చంద్రనాటకములు, విషయ మహాత్త్వముగల పెక్కు ఉపన్యాసములు—ఇవి పంతులుగారి రచనలలో కొన్నిమాత్రము. ఇవి యన్నియు నొక యెత్తు. ఆంధ్రకవుల చరిత్ర యొక యెత్తు. అగాధ పరిశోధనాఫలితమైన ఈ యుద్గ్రంథము ఆంధ్రభాషలో నద్వితీయమైనది. ఇట్లు బహుముఖమైన పంతులుగారి కృషి, ఆంధ్రులలో నుదయించిన నవచైతన్యమునకు రేఖలు తీర్చిదిద్దినది.

వీరేశలింగముగారు ఆరంభించిన మత సంస్కారము తెలుగు దేశములో సుప్రతిష్ఠితము కాలేదు. సనాతన మతవాదులైన కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి మున్నగువారును, గోదావరి హిందూ సమాజమువారును, ప్రాచీన హైందవమత సభ్యతల ప్రాశస్త్యమును, జనులకు తెలియ జెప్పుచుండిరి. కావున బ్రహ్మసమాజము నగర జీవితమును దాటిపోలేదు. హిందూమతమునందు నవచైతన్యము కల్గించుటకై, నూతనోద్యమము లెన్నియో బయలుదేరెను. స్వామి దయానంద సరస్వతి స్థాపించిన ఆర్యసమాజము, వీనిలోకెల్ల ప్రజాహృదయము నెక్కువగా వశీకరించుకొనెను. వంగదేశమునుండి రామకృష్ణ పరమహంస, వివేకానందస్వామి మున్నగు మహనీయుల దివ్య

సందేశము ఆంధ్రుల దృష్టిని, ఉపనిషద్వీధుల వంకకు మరల్చెను. బ్లావట్స్కీ సతీమణి, అనిబిసెంటమ్మ మొదలైనవారు బోధించు దివ్యజ్ఞాన సూత్రములుకూడ, తెలుగువారి చెవిని బడెను. కాని నూతన మతము లేవియు ఆంధ్రులను సనాతన ధర్మ ఆలానమునుండి తాత్కాలికముగ నైనను దూరము కొనిపోజాలక పోయెను. పందొమ్మిదవ శతాబ్దపు చతుర్థ పాదమునుండి, జాతీయ భావము వేయి తలలతో విజృంభించుటయే దీనికి ముఖ్యకారణమని చెప్పవలెను.

క్రీ. శ. 1857 నాటి ప్రథమ భారత జాతీయ సంగ్రామము వరకు దేశములో రాజకీయ చైతన్యము పొడసూపలేదు. పాశ్చాత్య సభ్యతవలనను, ఆంగ్ల వాఙ్మయ పరిమళము వలనను, భారత దేశపు విద్యావంతులు మంత్రముగ్ధులైనట్లు కట్టువడిరి. అయో మార్గములు, తంత్రీవార్తా విధానము, మొదలగు అపూర్వ విషయములను గనిపెట్టిన యాంగ్లేయులు, మానవాతీత శక్తివంతులు కావచ్చునని పామరు లాశ్చర్యపడుచుండిరి. కాని సిపాయీల తిరుగుబాటు నణచుటలో ఆంగ్లేయులు చూపిన దారుణ క్రౌర్యము, దేశీయుల కండ్లను తెరచెను. ఆంగ్ల విద్యా ప్రభావమువలన, బ్రిటిషువారి స్వపరిపాలనా సంస్థలవంటివి తమ దేశములో నేలయుండ రాదని, దేశీయులు ప్రశ్నించు కొనజొచ్చిరి. విజయోన్మత్తులైన యాంగ్లేయులు భారతీయుల ఈ నూత్నాశయములను సంశయ దృష్టితో, చూచిరి. ఉన్నతోద్యోగము లన్నియు విదేశీయు లాక్రమించుకొనగా, భారతీయులలో ప్రతిభావంతులైన వారుకూడ, వారికడ తాబేదారులుగ నుండవలసినవారైరి. ఇట్టి యసంతృప్తి ఫలితముగ 'భారత జాతీయ మహాసభ' 1885-వ సంవత్సరమున దేశమునం దవతరించెను. దీనితో భారత దేశ స్వాతంత్ర్యపు పోరాటము మొదలిడెను.

జాతీయోద్యమపు ఆరంభ దశలయందు బ్రిటిషువారి హృదయమును కరగించుటకై, సామవిధానము నవలంబించుటయు, మహజర్లను పంపుటయు, కార్యసాధక మని తలపోయబడెను. ఈ దశ

యందే 1891 సంవత్సరమున ఆంధ్రులైన పనప్పాకం ఆనందా చార్యులవారు జాతీయ మహాసభాధ్యక్ష పీఠ మలంకరించిరి. శాసన సభావేదికనుండి దేశీయుల యుచితమైన కోర్కెలను, ప్రభుత్వము వారిచే నొప్పించు యత్నముకూడ విఫలమయ్యెను. ఇంతలో మహాత్మ గాంధిగారు జాతీయ సమర నాయకత్వము వహించెను. మహాత్ముని చతుస్సూత్ర ప్రణాళికలోని విదేశ వస్తు బహిష్కారము, ఖద్దరు ప్రచారము, హరిజనోద్ధరణ కార్యక్రమము ఆంధ్ర దేశము నతిశయముగ ఆకర్షించెను. అప్పటికిని ఇప్పటికిని ఖద్దరు వస్త్రముల నేతయందు ఆంధ్రుల విన్నాణము యావద్భారత ప్రశస్తివడసినది. మహాత్ముని త్యాగ జీవితము నలవరచు కొనుటకై, ఆంధ్ర దేశము నందు డాక్టరు బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యంగారి సీతానగరపు ఆశ్రమము, సర్దారు గొల్లపూడి సీతారామ శాస్త్రిలవారి వినయా శ్రమము, మొదలగు ఆశ్రమములు స్థాపింపబడెను. గాంధిగారి సహాయ నిరాకరణోద్యమము, పాఠశాలా బహిష్కరణోద్యమము, ఆంధ్రుల నుజ్జూత లూగించి వారియం దపూర్వ చైతన్యమును కలి గించెను. కవులు ఈ నూత్నాలోకమున అమరగీతికలు పాడజొచ్చిరి. అఖిల భారత జాతీయ కాంగ్రెసు 1923 లో ఆంధ్ర దేశమున, కాకి నాడయందు సమావేశమై యాంధ్రుల ఆతిథ్యమును స్వీకరించెను. సైమను కమిషను బహిష్కరణమునందు, మహర్షి బులుసు సాంబ మూర్తి యకుంఠిత దీక్షను ప్రదర్శించెను. వింధ్యకు దక్షిణమున జాతీయ సమరమునం దాంధ్రులు అగ్రేసరులుగ నుండిరనుట, ఆత్మ శ్లాఘనము కాకపోవచ్చును. మద్రాసులో నీలు సత్యాగ్రహమును నిర్వహించినవా రాంధ్రులు. మహాత్ము డారంభించిన ఉప్పు సత్యా గ్రహ సమరమందు, ఆంధ్రు లెవ్వరికిని వెనుకబడ లేదు. మహేంద్ర గిరికి దక్షిణమున ప్రాక్సముద్ర తీరము పొడవునను, ఆంధ్రనాయ కులు దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్య పంతులు, 'రామదండు' వ్యవస్థాపకుడైన ఆంధ్ర రత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు, ఆంధ్ర కేసరి టంగుటూరి

ప్రకాశం పంతులు, దేశబాంధవి దూవ్వూరి సుబ్బమ్మ మున్నగు వారి యశోగీతికలే యాలపింపబడుచుండెను. ఆంధ్రులు సత్యసంగర ప్రియులై, మహాత్ముని యడుగుజాడలబడి 'యశోవా మృత్యుర్వా' అను నిష్కైతవ నీతి నవలంబించినవా రగుటచేతనే, ఒరిస్సా సింధు రాష్ట్రములు నిర్మించిననాడు, ఆంధ్రరాష్ట్రమును బ్రిటిషువారి ప్రసాద లేశముగ బడయజాలకపోయిరి. గాంధిమహాత్ముని తుదిరణమునందు, స్వాతంత్ర్య జ్వాలలు మొట్టమొదటిమారు, ఆంధ్రదేశ వేదికయందే ప్రజ్వరిల్లి మిన్ను ముట్టెను. మద్రాసు మహానగరమునందు స్వాతంత్ర్యపు బావుటా నెత్తుట యొక్క ఆంధ్ర వీరాంగన-శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మ పాలబడెను. ఆంధ్రులు క్షాత్రధర్మముతోగూడ బ్రిటిషువారి నెదరించి రనుటకు శ్రీ అల్లూరి సీతారామరాజుగారి అసమయుద్ధము తార్కాణము కాగలదు.

సారస్వతరంగమునకు మరలి, వీరేశలింగము పంతులుగారితో ఇంచుమించు సమకాలికులగు గొప్ప రచయితలను స్మరింతము. మహామహోపాధ్యాయ బిరుదాంచితులై కొక్కొండ వెంకటరత్నము పంతులు పంచతంత్రము, బిల్వేశ్వరశతకము మొదలగు పెక్కుకృతులు రచించిన పండితకవి. ఆంధ్ర వాల్మీకిరామాయణము రచించిన వావిలికొలను సుబ్బరాయకవి, భక్తచింతామణిశతకము మూలమున, భాషాభిమానుల నాలుకలపై సదా వర్తించు వడ్డాది సుబ్బరాయకవి, కవిత్రయమువారు కలిసి తరింపగలిగిన మహాభారతాంభోధిని ఏక బాహువుతో నీదిన గొప్ప మనీషి శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, బ్రహ్మాండపురాణాది బ్రహ్మాండకవిత్వ కృతులను రచించిన జనమంచి శేషాద్రిశర్మగారు, కాళిదాసమహాకవి కృతులకు అనువృత్తములగు కుమారోదయము, ఘనవృత్తము మున్నగు సంస్కృత కృతులను, నయప్రదీపము, రథాంగదూతము మొదలగు తెలుగు కబ్బములను గూర్చిన కోరాడ రామచంద్రశాస్త్రికవి-ఈ మొదలగు పవిత్రనామము లెన్నియో ఏకరువు పెట్టవలెను.

(ఆంధ్రభాషయందు నాటక రచన మీా యుగముననే తొలిసారి ప్రాదుర్భవించెను. ప్రసిద్ధ సంస్కృత నాటకములన్నియు నాంధ్రీకరింపబడెను. స్వతంత్ర నాటకకర్తలై విఖ్యాతిగాంచిన వారలలో ఆంధ్రనాటక పితామహ ధర్మవరం రామకృష్ణమాచార్యులవారు, కళాప్రపూర్ణ వేదం వేంకటరాయశాస్త్రిగారు, కోలాచలము శ్రీనివాసరావుగారు, చిలకమర్తి లక్ష్మీనరసింహంపంతులు, పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులు మున్నగువారు ముఖ్యులు. వేదం వేంకటరాయశాస్త్రిగారు గొప్ప విద్వాంసులు. శృంగారనైషధము, ఆముక్తమాల్యదవంటి యుద్దండ ప్రబంధములకు వీరు వ్యాఖ్యానములు రచించిరి. చిలకమర్తివారు హాస్యరసప్రధానములైన రచనలను, పెక్కు నవలలను వ్రాసి కీర్తిగాంచిరి. పానుగంటివారి 'సాక్షి' ఉపన్యాసములు, మృదుహాస్యపూరితమైన సంఘ విమర్శనమునకు మేలుబంతులు. గురజాడ అప్పారావుపంతులు కన్యాశుల్కమను అద్వితీయ వచన నాటకమును వ్రాసెను. ఈ నాటకము వ్యవహార భాషలో నుండుట యొక విశేషగుణము. చిన్నయసూరికాలము నుండియు, పండితులెల్లరును తమ రచనలను గ్రాంధికభాషలో వెలయించుచుండిరి. గ్రాంధిక భాషకును, జనులు మాట్లాడు వ్యవహార భాషకును, గొప్ప అంతరాయ మేర్పడెను. కావున సామాన్య జనులును, కొంచెపుపాటి పాండిత్యము గలవారును, వ్యాకరణభంగ భీతిచే తమ భావములను ప్రకటించుటకు, వెరచుచుండిరి. దీనివలన ఎంతయో స్వతంత్ర కల్పనాశక్తియు, భావనాపటిమయు ఆంధ్ర సారస్వతము కోల్పోవుచుండెను. భాషను ఇట్టి కృతక వ్యాకరణ శృంఖలలనుండి విడిపించి, శిష్టవ్యవహారభాషయే, ఉత్తమ కావ్య భాష యని యుద్ఘోషించిన, ధీరుడు రావుసాహెబు గిడుగు వెంకట రామమూర్తి పంతులు. వీరి సంకల్పబలముచే నేడు ఆంధ్రసరస్వతి యసంఖ్యాక కవి కుమారుల తేజో రచనలచే భూషిత మగుచున్నది.

ఇది ప్రధానముగ గద్యయుగము, రసోదంచితమైన రచనలకు మాత్రమే పద్యము ప్రయోగార్హ మని ఈనాడు తలపబడుచున్నది.

గద్య మెన్నిరీతుల నడుపవలెనో అన్ని రీతులలో వీరేశలింగము పంతులు నడిపించి మార్గదర్శకు డయ్యెను. నవలారచనయందు వెనుకటి తరము వారిలో చిలకమర్తి లక్ష్మీనరసింహము, భోగరాజు నారాయణమూర్తి, కేతవరపు వెంకటశాస్త్రి మున్నగువారును, ఇప్పటితరములో ఉన్నవ లక్ష్మీనారాయణపంతులు, వెంకటపార్వతీశ్వరకవులు, విశ్వనాథ సత్యనారాయణ, అడవి బాపిరాజు మొదలగు పలువురును పేర్కొనదగినవారు. ఏకాంకనాటికలు, కథానికా రచనలు అర్వాచీన కాలమున యువ రచయితలను విశేషముగా ఆకర్షించుచున్నవి. స్వతంత్ర కథకులలో గురజాడ, మాడపాటి హనుమంతరావు పంతులు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, కరుణకుమార, మునిమాణిక్యం, నరసింహారావు మున్నగువారు ఉదాహరింపదగినవారు. హాస్యరస మనోజ్ఞములైన రచనలీ యుగమున నొక ప్రత్యేకస్థానము నందుకొన్నవి. మునిమాణిక్యం నరసింహారావు, భమిడిపాటి కామేశ్వరరావువంటివారీ శాఖలో సిద్ధహస్తులు. సాహిత్య విమర్శనము, చారిత్రక విమర్శనము ఈ యుగమున నెంతయో వచన రచనకు మూలములైనవి. తెలుగులో అచ్చపు సారస్వత విమర్శనమునకు పునాదులు వైచిన విజ్ఞుడు డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారు వీరి యడుగుజాడలలో నడచినవారు పెక్కురు గలరు. నష్టప్రాయమైన ఆంధ్రసంస్కృత గ్రంథములను కనిపెట్టి, వెల్లడిచేసినవారు శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు నన్నెచోడుని కుమారసంభవము, వల్లభరాయని క్రీడాభిరామము, కౌముదీ మహోత్సవమను సంస్కృతనాటకము, లీలావతీ పరిణయమను ప్రాకృతకావ్యము—ఇంకను పెక్కులు వీరి కృషివలన లోకమున కెరుకపడెను. ప్రాచీన పాండిత్యభూషితులయ్యు, ఆధునిక విమర్శనా పద్ధతులలో నారితేరి, అనేక ప్రామాణిక రచనలు చేసినవారు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రులవారు. ఆంధ్రవాఙ్మయచరిత్ర నిర్మాణము, పలువురు పరిశోధకుల కృషికి ఆలవాలమైనది. గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు, వంగూరి సుబ్బారావుగారు

కురుగంటి సీతారామ భట్టాచార్యులవారు ఈ క్షేత్రమునం దధినేతలు.

చారిత్రక పరిశోధనమునందు కనిష్ఠికాధిష్ఠితుడు శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుపంతులుగారు. వీరేశలింగము పంతులు ప్రజ్ఞవలె లక్ష్మణరావుప్రజ్ఞ శతముఖమైనది. సంస్కృతాంధ్ర మహారాష్ట్రభాషలును, ఆంగ్లమును ఈ మనీషికి కొట్టినపిండి. పక్షపాతరహితమై, అనుద్వేగకరమై సశాస్త్రీయమైన చరిత్ర రచనకు తెలుగువారిలో లక్ష్మణరావుపంతులను ముందు చెప్పవలెను. వీరి హిందూ మహమ్మదీయ మహాయుగములు చరిత్రలే కావు, ఆదర్శ వచనకావ్యములు. విజ్ఞానచంద్రికా గ్రంథమండలిని స్థాపించి, ఎందరో ఉత్తమ రచయితలను ఆంధ్రలోకమున కీయన సమర్పించెను. విజ్ఞాన సర్వస్వముకొరకై తన జీవిత సర్వస్వమును ధారవోసిన త్యాగధనుడు, నాటికిని నేటికిని ఆంధ్రులు సంపూర్ణ విజ్ఞాన సర్వస్వమును సృష్టించుకొనలేకపోవుట భాషకు గొప్ప కొఱతగా నున్నది. మొదటితరము చారిత్రక పరిశోధకులలో జయంతి రామయ్యపంతులుగారికి అత్యున్నతస్థానము కలదు. ఆంధ్రభాషా వికాసమున కీ యుగమున అతిమాత్రముగ తోడ్పడుచున్న సంస్థలు పండిత పరిషత్తులు. వీనిలో పేర్కొనదగినవి ఆంధ్ర సాహిత్య పరిషత్తు, సాహితీ సమితి, నవ్యసాహిత్య పరిషత్తువంటివి చాలగలవు. ఆంధ్ర చరిత్ర పరిశోధక సంస్థ (Andhra Historical Research Society) కూడ ఈ కోటిలోనికే చేరినది. సాహిత్యాభివృద్ధితోపాటు భాషాతత్త్వ పరిశోధన మీ కాలమున నొక విశిష్ట ప్రాధాన్యమును గడించినది. దాక్షిణాత్య భాషలలో ఈ శాస్త్రమునకు పునాదులు వైచినవాడు బిషప్పు కాల్డ్వెల్లు అను మిషనరీ పండితుడు. డాక్టరు చిలుకూరి నారాయణరావు, శ్రీ కోరాడ రామకృష్ణయ్య, శ్రీగంటి జోగి సోమయాజులువంటి వారీక్షేత్రమునందు సాధికార వ్యవసాయకులు. ఆధునిక సిద్ధాంతముల కనుగుణముగ తెలుగు వ్యాకరణమును దిద్దిన పండితప్రకాండులు బ్రహ్మశ్రీ వఝుల

చిన సీతారామశాస్త్రి, బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారివంటి వారలు.

వర్తమానశతాబ్ది ప్రారంభమునుండియు, ఆంధ్రుల హృదయ ధనుస్సులను నమ్రీకరించు అల్లెత్రాడులు రెండైనవి. అందు మొదటిది యావద్భారతదేశభక్తి. రెండవది స్వరాష్ట్రాభిమానము. ఆంధ్రు లిప్పుడు ద్వైమాతురులైనారు. ఒకవంక అఖిలభారత మాతయు, మరొకవంక ఆంధ్రమాతయు, ఆంధ్రుల నుపలాలనము చేయుచున్నారు. ఇట్టిసన్ని వేశము ఆంధ్రులకే కాదు, వంగదేశీయులకు, మహారాష్ట్రులకు, గుజరాతీ వారికి, కన్నడులకు, అరవలకు భారత దేశపు అన్ని ప్రాంతములవారికిని వర్తించుచున్నది. హ్రస్వదృష్టిగల కొందరు వ్యక్తులు – అఖండదేశాభిమానము – స్వరాష్ట్రప్రేమ – ఈ రెండు భావములును పరస్పరవిరుద్ధము లనియు, రాష్ట్రాభిమానము దేశభక్తికి కుఠారము వంటిదనియు, తప్పుగా తలపోసి, వైముఖ్యమును ప్రదర్శించుచున్నారు. ఇవి రెండును మిత్రభావములుగాని, వైరభావములు కావనియు, అన్యోన్య సంవర్ధకములు పోషకములు నని, ఈ గ్రంథారంభముననే నుడివియుంటిమి. ఆంధ్రరాష్ట్రోద్యమముయొక్క పుట్టు పూర్వోత్తరములను సంగ్రహముగ పరికింతము. ఆంధ్రుల కాంధ్రదేశముపై భక్తిగౌరవములు, కాకతీయులనాటినుండియే యంకురించెనని వర్ణింపనైనది. విజయనగరయుగమున ఆంధ్రులు దక్షిణాపథమునంతయు శాసించిరి. 17-వ శతాబ్ది దక్షిణదేశపు చరిత్రయనగా తెలుగువారి చరిత్రయే యని ఫాదరు హీరాసుపండితుడు సముచితముగ నిర్వచించెను. ఇట్టి శూరజాతికి ఒకింత యాత్మాభిమానము, తన ప్రత్యేకాస్తిత్వమును నిలువబెట్టుకొనవలెనను కాంక్ష, యుండుట ప్రకృతివిరుద్ధము కాదు. భారతదేశమందలి భిన్నప్రాంతీయులకు, అఖిలభారత సంస్కృతితో బాటు, తమ తమ ప్రత్యేక సంస్కృతులను నిలబెట్టుకొనవలెనను దీక్ష, సహజమై యున్నది. ప్రాంతీయాభిమానమనగా ప్రాంతసంస్కృతి సంరక్షణోద్యోగ మన్నమాట. ఆ సంస్కృతికి మూలాలవాలమైన ప్రజానీకముయొక్క ప్రత్యేకావసరములను, సంరక్షించుటగూడ ప్రాంతీయాభిమానము

క్రిందనే వచ్చును. ఇదియు దోషము కాదు. ఏలన ప్రజలు లేక సంస్కృతి లేదు.

రాజకీయావసరములనుబట్టి ఇప్పుడు కొంచెము నిందార్థములో వాడబడుచున్న ప్రాంతీయాభిమానము లేక స్వరాష్ట్రాభిమానము, వంగదేశీయులలో మొదట నుదయించినది. భారతదేశపుటితర ప్రాంతములవారికన్న ఆధునిక సంస్కృతియందు వీరు ముందడుగు పెట్టుటయే దీనికి కారణము, కర్జనుప్రభువు రాజప్రతినిధిగా నున్న కాలమున, వంగరాష్ట్ర విభజనమును నిరంకుశపద్ధతిపై గావించి, బ్రిటిషువారు వంగీయులలో గొప్ప యలజడి కలిగించిరి. వంగదేశ ప్రజలొకరనియు, వారి రాష్ట్రమును విభజించుట ప్రజలను విడదీయుట యనియు, అది తమ సంస్కృతి వినాశమునకు హేతువు కాగదలనియు, బెంగాలుప్రజలు తీవ్రముగ ఆందోళన సల్పిరి. ఎట్టకేలకు 1912 లో వంగ విభజనము రద్దుచేయబడెను. రాష్ట్ర విభజనమునందు భాషాసూత్రమును పాటించుట యుక్తమని, హార్డింగు ప్రభువుకూడ అంగీకరించెను. బెంగాలు విభజనోద్యమము, బాబు బిపిన్ చంద్రపాలుగారి ఆంధ్రదేశ పర్యటనము, వారి గంభీరోపన్యాసములు ఆంధ్రులయందు జాతీయభావమును, స్వరాష్ట్రనిర్మాణ వాంఛను పురిగొల్పెను. బందరు నగరమునందు కోపల్లె మాధవరావుగారు జాతీయ కళాశాల స్థాపించిరి. తెలుగువారిలో విద్యావైజ్ఞానిక వ్యాప్తికై, శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యపంతులుగారు సార్వజనీన గ్రంథాలయోద్యమమును ప్రారంభించిరి. గ్రంథాలయ సర్వస్వ మను త్రైమాసిక పత్రికను, దీని కంగముగ నెలకొల్పిరి. బరోడా సంస్థానము తరువాత గ్రంథాలయోద్యమ వ్యాప్తికి, ఆంధ్రదేశమే పేరు పొందుటకు కారణము శ్రీ వెంకటరమణయ్యగారి యకుంఠితదీక్ష యని చెప్పవలెను. ఈ కాలముననే ఆంధ్రమహాసభ ఏర్పడి (1913లో) ఆంధ్రరాష్ట్ర నిర్మాణము కావింపవలె నని తీర్మానించెను.

ఆంధ్రమహాజనులలో విద్య, సంస్కృతి వ్యాప్తికై కృషిచేయుటయు, దేశపువ్యవసాయ వాణిజ్యపరిస్థితులను పరిశీలించి, వాటిపురోభి

వృద్ధికై సహకారభావమును ప్రోత్సహించుటయు, తెలుగువారి యందు శరీరవ్యాయామప్రీతిని గలిగించి, జాతి ఆరోగ్యసంరక్షణకై యత్నించుటయు, ఆంధ్రవాఙ్మయాభివృద్ధికై గ్రంథప్రకటన మూలమున దోహదము చేయుటయు, ప్రభుత్వోద్యోగములలో ఆంధ్రుల న్యాయమైన హక్కులను అంగీకరింప జేయుటయు— ఈ మొదలైనవి ఆంధ్రరాష్ట్రోద్యమ లక్ష్యములుగా ప్రకటింపబడెను. నాటినుండియు వీనివిషయమై చాల ప్రచారము జరిగెను. ఆంధ్రప్రముఖులలో పలువురు ఆంధ్రభీష్మ న్యాయపతి సుబ్బారావుపంతులు, సర్. బి. యన్. శర్మ, సర్ కూర్మా వెంకటరెడ్డినాయుడు, సర్ సర్వేపల్లి రాధాకృష్ణయ్య, సర్ మోచర్ల రామచంద్రరావుపంతులు మున్నగు వారెందరో అప్పటప్పట ఆంధ్రమహాసభ కధ్యక్షులయి ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకై కృషి సల్పిరి. ఆంధ్రమహాసభతోపాటు గ్రంథాలయ సభలు, సంఘసంస్కార సభలును, సమావేశ మయి ప్రజానీకమునందు గొప్పజాగృతి యేర్పడెను. అఖిలభారత దేశీయమహాసభవారు భాషాప్రయుక్తరాష్ట్ర నిర్మాణసూచనమును మన్నించి, ఆంధ్రప్రాంతమును ప్రత్యేక కాంగ్రెసు రాష్ట్రముగా గుర్తించిరి. కాంగ్రెసువారు మొదటి పర్యాయము మంత్రిపదవులు స్వీకరించినప్పుడు మద్రాసు శాసనసభవారు (1938 లో) ఆంధ్రరాష్ట్ర నిర్మాణమున కనుకూలముగ తీర్మానించిరి. కాని లండను ప్రభుత్వము ఆంధ్రుల యభిమతమును కొనసాగనీయలేదు. ఆంధ్రమహాజనులు విదేశపరిపాలనకు తీవ్రవిముఖత్వముతో పోరాడుచుండుట వలన, ఈ నూతనరాష్ట్రకల్పనముచే జాతీయశక్తులు పుంజీభవించునని, సామ్రాజ్యవాదులు దీనిని వ్యతిరేకించి యుందురు. బ్రిటిషు వారి పరిపాలనకు లోబడిన తెలుగుజిల్లాలను మాత్రము చేర్చి, ఆంధ్రరాష్ట్రము నిర్మించదగునని యాంధ్రు లానాడు కోరిరి. తెలంగాణము, మైసూరు ప్రాంతమునందలి తెలుగు జిల్లాలును, స్వదేశ సంస్థానములకు లోబడియుండుటచే, రాజకీయ కారణములవలన వీనిని ఆంధ్రరాష్ట్రములో చేర్చవలెనను సూచన యానాడు చేయబడలేదు. బ్రిటిషు తెలుగు జిల్లాలవారిలోకూడ, ఆంధ్రరాష్ట్ర విష

యమైకొన్ని యపోహ లుండెను. సాగరసీమవాసులు విద్యావిష యములందును, రాజకీయ సమరమునందును మున్ముందు పోవుచుండు టచే, రాబోవు ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వమునందు వీరి ప్రాధాన్యము హెచ్చి, రాయలసీమవంటి వెనుకబడిన ప్రాంతముల కన్యాయము జరుగు ననుభయసందేహములు ఆ మండలవాసులలో వినబడు చుండెను. ఇట్టి శంకానివృత్తికొరకై 'శ్రీబాగుసమాఖ్య'(1937 లో) ఏర్పరుపబడెను. రాష్ట్ర ప్రభుత్వముయొక్క ముఖ్యసంస్థలైన రాజకీయ కార్యాలయములు, ఉన్నత న్యాయస్థానము, విశ్వవిద్యా లయము మొదలైనవి ఆంధ్రదేశమందలి వివిధప్రాంతములలో, నెల కొల్పబడుననియు, ఏ యొక్క ప్రాంతమునకును, ప్రత్యేక ప్రధాన్య మీయబడదనియు, శ్రీబాగుసమాఖ్య సూత్రించెను. జాతీయ ప్రభుత్వ మేర్పడినప్పుడే యాంధ్రరాష్ట్ర నిర్మాణము జరిగి, యాంధ్రు లకు న్యాయము జరుగునని తెలుగువారు సమాధానపడి యాశుభ ముహూర్తమునకై కృషి సల్పుచు వేచియుండిరి.

ఇరువదవ శతాబ్ది ప్రారంభమునుండియు, ఆంధ్రుల కళాజీవిత మునం దొక నూతన శకము విరిసెను. శిల్పము, సంగీతము, నాట్యము, చిత్రలేఖనము, మున్నగు లలిత కళలలో ప్రాచీనాం ధ్రులు మహోన్నత శిఖరము లందుకొని రని, ఆయా యుగ చరిత్ర లయందు వర్ణింపనైనది. పారతంత్ర్య కాలమునందు ఆంధ్రుల కళాభినిరతికి దోహద మిచ్చు పెద్ద ప్రభుత్వములుకాని, సంస్థలు కాని లేకుండెను. ఆంధ్రదేశపు జమీందారులును, చిన్నచిన్న సంస్థానాధిపతులును, కళావిదుల పోషించు బాధ్యతను యథాశక్తిగ నిర్వహించుచుండిరి రని, కృతజ్ఞతతో, ప్రశంసింపక తీరదు. కళా క్షేత్రమునందు నూతన చైతన్యము నవజీవిత వికాస ఫలితముగా కలిగినది. ప్రాచీన కాలమునందు వలె, ఈ నాడు బ్రహ్మాండమైన దేవాలయాది శిల్ప నిర్మాణములు జరుగుట లేదు. మతము, భక్తి ఆనాటి శిల్పమునకు ప్రాణవాయువులు. ఈనాడు సౌందర్యా రాధనమే కళయొక్క ఉత్కృష్టాదర్శము. కర్ణాటక సంగీత మునకు జన్మస్థానమైన అన్నమాచార్యులు, క్షేత్రయ్య, త్యాగయ్య

వంటి దివ్యగానమూర్తులను గన్న ఆంధ్రదేశము, ఈనాడు సంగీతమునందు వెనుకబడి యున్నదని, గాంధర్వవిదులు తలచుచున్నారు. శాస్త్రపద్ధతిని సంగీతకళ నభ్యసించుటలో ఆంధ్రు లుపేక్ష చూపుచున్నారు. బహుజనాకర్షణమునే లక్ష్యముగా పెట్టుకొన్న సినీమా సంగీతము, హిందూస్తానీ బాణీలకు మక్కికి మక్కి యను కరణములను గావింపుచు, శుద్ధగానరీతికి అపకార మొనర్చుచున్నది. తమిళసోదరు లీ యంశమున ఆంధ్రులకు మార్గదర్శకులు కాగలిగి యున్నారు. వారిలో ఇప్పటికిని, పెక్కురు సంగీతవిద్వాంసులు గలరు. వారు మిక్కిలి సాధన చేసి త్యాగయ్యగారి గానవిద్యాసంప్రదాయమును నిలబెట్టుకొని వచ్చుచుండుట ప్రశంసనీయము. తెలుగువారిలో ప్రతిభావంతులైన నాదోపాసకులు లేకపోలేదు. నందిగాన వెంకన్న, వీణ వెంకటరమణదాసు, తుమరాడ సంగమేశ్వరశాస్త్రి, మొదలైనవారు గొప్ప వీణావిద్వాంసులుగా నుండిరి. వీరు దాక్షిణాత్యుల మన్ననలను పొందినవారు. ఫిడేలు వాద్యమునందు హిమాలయ శృంగసన్నిభుడు ద్వారం వెంకటస్వామినాయుడుగారు, వాగ్గేయకారులు హరినాగభూషణముగారుకూడ పేరెన్నిక గన్నవారు. ఈ కాలమున గ్రామఫోను, రేడియో మొదలగునవి సంగీతవ్యాప్తికి గొప్ప సాధనములుగానున్నవి. ఆంధ్రుల యమూల్యమగు వారసత్వమైన శుద్ధ కర్ణాటక సంగీతమును పోషించి, ప్రచారము చేసినప్పుడే వీని సార్థక్యత ఇనుమడించును.

వర్తమానయుగముయొక్క విశిష్ట లక్షణములలో నాటక కళావిర్భావ మొక్కటి యని చెప్పనైనది. పూర్వ మాంధ్రదేశమున యక్షగానములును, సంగీత ప్రధానములైన నాటకములును మాత్రముండెడివి. నాయకరాజుల కాలమున, తంజావూరు, మధుర ఆస్థానములలో, రంగస్థలము లుండి యక్షగాన ప్రదర్శనములు జరుగుచుండెడివని తెలియవచ్చుచున్నది. కాని సంగీత ప్రాచుర్యము గల వానిలో చతుర్విధాభినయాత్మకమును, రసాభినయబహుళమునగు, నాట్యకళకు ప్రసక్తి తక్కువ యుండెను. ఈనాటి నాటకములలో

సంస్కృత రూపకముల యొక్కయు, పాశ్చాత్య నాటక కళ యొక్కయు, ముఖ్యధర్మము లన్నియు చక్కగా మేళవింపబడినవి. కావున రసాభినయమున కిప్పుడు సంపూర్ణ ప్రసక్తి యేర్పడి 'నాటకాంతంహి సాహిత్యం' అన్నట్లు 'నాటకాంతము కళాప్రవీణత' యని చెప్ప నొప్పినది. ఆంధ్ర దేశము నాటకప్రదర్శనములందు, ఘనకీర్తి గాంచిన దని నిస్సందేహముగ చెప్పవచ్చును. దక్షిణదేశములో ఆంధ్రనాటక రంగమునకు సాటిగాని మేటిగాని లేదు. పందొమ్మిదవ శతాబ్ది చతుర్థపాదము నుండియు మనలో గొప్పనటకులు వెలసిరి. వీరందరును సాత్త్వికాభినయము నొక గొప్ప కళగా, ఒక మహత్తర సాధనముగా ఆరాధించిన వారే. రంగస్థలముమీద సంగీతము ఉండవలెనా లేదా యనుటలో, మన నటకావతంసులు భిన్నమతముల దాల్చుచున్నారు. మొత్తముమీద అభినయమునకు సంగీతము లోబడి యుండవలెనుగాని దానిని క్రమ్మివేయు నంతటి ప్రాముఖ్యము గానమున కీయరాదని వీరిలో పలువురు తలచిరి. ఈ హేతువు చేతనే కాబోలు ఆంధ్రులలో సంగీత సాధనము వెనుకబడినది. ఆంధ్రనాటక పితామహ ధర్మవరము రామకృష్ణమాచార్యులవారు నాటక రచయితలును, సమర్థులైన నటశ్రేష్ఠులును గూడ అయి యుండిరి. బళ్ళారిలో వీరొకనాటక సమాజమును స్థాపించి, తమ నాటకములలో తామే భూమికలు దాల్చుచుండిరి. రాజమహేంద్రవరము, ఏలూరు మున్నగు గొప్ప నగరములలో, సంపన్నులును, జమీందారులును, నాటక సమాజములు నెలకొల్పి నటకావతంసులను ఆకర్షించి, గొప్పనాటక ప్రదర్శనములను జరిపించుచుండిరి. నేలయీనినట్లు జనులు వీనిని సందర్శించి, రసానందాభిషిక్తులగుచుండిరి. ఆంధ్రనటకులలో యశోభూషితు లెందరో గలరు. శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులు, హరిప్రసాదరావు, బలిజేపల్లి లక్ష్మీకాంతము, ముప్పడి జగ్గరాజు, ఎడవల్లి సూర్యనారాయణ, ఉప్పులూరి సంజీవరావు, స్థానం నరసింహారావు, డి. వి. సుబ్బారావు, బెల్లంకొండ సుబ్బారావు, టి. వి. రాఘవాచారి ఇట్లెన్నియో నామములను గ్రుక్క త్రిప్పుకొనకుండ చెప్పుచు

పోవచ్చును, వీరిలో కొందరు గానమాధుర్యముచేతను, కొందరు అభినయ కౌశలముచేతను నాటకరంగమునకు వన్నె తెచ్చినవారు. టి. వి. రాఘవాచారి (బళ్ళారి) గారు శుద్ధ సాత్త్వికాభినయమునకు గొప్పపేరు మోసిరి. నాటకప్రదర్శనముల మొదటిదశలో స్త్రీపాత్రములనుకూడ పురుషులే ధరించుచుండిరి. స్థానం నరసింహారావుగారు స్త్రీపాత్రల నిర్వహించుటలో వనితాలోకమునుగూడ మెప్పించిన వారని చెప్పుకొందురు.

రూపకాభినయమునందువలెనే ఆంధ్రులు నృత్యకళయందును విజయములను సాధించిరి. నందికేశ్వర విరచితమైన 'అభినయదర్పణము' భరతుని నాట్యశాస్త్రముకన్న ప్రాచీనమైన గ్రంథమని కొందరు పండితులు వాదించుచున్నారు. అభినయదర్పణము పూర్తిగా తెలుగువారి సొమ్ము. ఇంతవరకును ఈ గ్రంథము తెలుగు లిపిలో దప్ప మరి యే లిపిలోను దొరకలేదు. లభించినప్రతులన్నియు ఆంధ్రదేశములోనివే. నృత్యము భావాశ్రయమైనది. నాట్యము రసాశ్రయమైనది, నృత్తము భావారహితమై, తాళ లయాన్వితము మాత్రమైనది. ఇది లాస్యతాండవభేదమున ద్వివిధము. లాస్యము లలిత నృత్తము, తాండవము సంధ్యాకాలమునందు మహేశ్వరుడనుష్ఠించునట్టిది. ఇది ఉద్ధతము. పురుషులు నర్తించదగినది. నృత్య సంగీతము లిటీవలివరకును, వేశ్యాజనముయొక్క ప్రత్యేకవృత్తులుగ పరిగణింపబడుచుండెను. కావున కులస్త్రీజనము వానివంక పోరాదనియో, పోయినను సభాముఖమున ప్రదర్శింపరాదనియో భావింపబడుచుండెను. కాని ఈనాడు ఈ దివ్యకళల నభ్యసించి ప్రదర్శించుట స్త్రీలకు శీలదోషము కాదని సంఘము తలచుచున్నది. కావున ఈ కళలకు మంచి భవిష్యత్తు కలదని మన మెంచవచ్చును. ప్రాచీన భరతనాట్య సంప్రదాయమును అనూచానముగ నిలబెట్టుకొని వచ్చుచున్న కూచిపూడివారిని మన మిక్కడ స్మరింపవలెను. కూచిపూడి భరతాచార్యులు ఆంధ్రదేశమున కపూర్వాలంకారము, గౌరవహేతువుగా నున్నారు. వారి భరతనాట్యప్రదర్శనము నయనా

నందకరము. ఆత్మోత్తేజకరము. అదియొక పవిత్రానుభూతి. వీరు తమ 'భామాకలాప'నాటకప్రదర్శనమునందు నందికేశ్వరుని అభినయదర్పణమును ప్రమాణముగా స్వీకరించి నటింతురు. సినీమాలయం దీకాలమున నృత్యప్రదర్శనము తప్పని యాచారమైనది. కాని అది శాస్త్రపద్ధతి నతిక్రమించినదని తజ్ఞులు చెప్పుదురు.

ఆధునికయుగమున నూత్నవికాసముతో రంజిల్లిన కళలలో చిత్రలేఖనమునుకూడ ఉదాహరింపవలెను. అజంతా, లేపాక్షిమున్నగు స్థలములలో ఆంధ్రుల చిత్రకళామహోన్నతి ప్రదర్శింపబడినది. ఈనాడు పాశ్చాత్యచిత్రకళాప్రభావముచే దేశీయపద్ధతికొంతకాలము మోటుపనిగా భావింపబడి తిరిగి తొంటిప్రాశస్త్యము నందుకొన్నది. చిత్రలేఖనమునయనపర్వమొనరించుదివ్యకళ. దీనిలోభావమునకును, రూపమునకునుగూడ తుల్యప్రాధాన్యముగలదు. తరువాత వర్ణములను మేళవించుటలోను, చిరకాలము నిల్వగల్గునట్లు రంగుల తయారు చేయుటలోను, శాస్త్రజ్ఞానము, లౌకికజ్ఞానముగూడ మిక్కిలి యవసరములు. ఆంధ్రదేశమున ఈనాడు రెండు మూడు చిత్రకళా కేంద్రములును అక్కడ ప్రభవించిన సంప్రదాయములును గలవు. తెలుగు చిత్రకళకు దేశమునందును, ఖండాంతర దేశములందును గూడ, పేరు సంపాదించిన కళారాధకుడు దామెర్ల రామారావు గారు. జన్మతః చిత్రకారులైన వీరు, భావచిత్రరచన, రూపచిత్రరచన, దృశ్యచిత్రరచన లనుత్రివిధ మార్గములందు, మహోత్కృష్ట శిల్ప నైపుణ్యమును సాధించిరి. వీరిది రాజమహేంద్రవరము. తరుణవయస్సునందే రామారావుగారు దివంగతు లయిరి. వీరిదొక చిత్రలేఖన సంప్రదాయము. మచిలీపట్టణము జాతీయకళాశాలలో ప్రమోదకుమార చటర్జీచేతిక్రింద మెదిగినవారు, ప్రఖ్యాతాంధ్ర చిత్రకారులు కొందరు కలరు. వీరిలో శ్రీ అడవి బాపిరాజుగారు ముఖ్యులని చెప్పబడుచున్నది. బాపిరాజుగారి హృదయమునందలి కళాసౌరభము బహిర్గత మగుటకు కారణము కూల్డ్రేదొరగారు. వీరు రాజమండ్రి కళాశాల ప్రిన్సిపాలుగా నుండి, ఎందరో తెలుగు యువకులను కళాక్షేత్రమునందు ప్రవేశపెట్టి, ప్రోత్స

హించిరట. జానపదకళ యన్నను, గేయము లన్నను కూడ్లెగారు చెవికోసికొనువారు. మరికొందరు ఆంధ్రచిత్రకారులు శాంతిని కేతనములో కళారహస్యముల నవగతము చేసికొని వచ్చి చిత్రముల వ్రాయుచున్నారు. ఆంధ్రచిత్రకారులలో సిద్ధహస్తులు చాలమంది కలరు. శ్రీ వరదా వెంకటరత్నం, చామకూర సత్యనారాయణ, చావలి నాగేశ్వరరావు, కవుతా రామమోహనశాస్త్రి, ఆనంద మోహనశాస్త్రి, వి. ఆర్. చిత్ర; భగీరథి, దామెర్ల సత్యవాణి, ఆర్. కమలాబాయి మొదలగువారు ప్రసిద్ధులు. ఏకళయైనను వృద్ధిపొందవలెనన్నచో కళావిదులు గ్రాసవాసోదైన్యములకు గురికానక్కరలేకుండ పోషించవలసిన బాధ్యత సంఘముపై నున్నది. కళయే జీవితవృత్తియైననా డది స్వతంత్రమై తారాపథముల విహరింపజాలదు.

ఇచ్చట మనజానపద చిత్రకళనుగురించి కూడ కొంచెము ముచ్చటించవలెను. జానపదకళ యని ఇక్కడ వ్యవహరించినను, నిజమరసినచో ఇదియే మన దేశీయమైన ప్రాచీనసంప్రదాయ మని యెంచవలెను. పాశ్చాత్య నాగరికతయు, కళలును, మనదేశములో వ్యాపించినప్పుడు వానికి లొంగిపోయి,విదేశసంస్కృతిప్రవాహములో కొట్టుకొని పోయినవారు, విద్యాధికులైనవారు మాత్రమే. మన దేశపు స్త్రీలును, పల్లెటూరి ప్రజయు, తమ పూర్వ సంస్కృతిని సభ్యతను విడనాడక, విద్యాధికులు పరిహాసించినను, ఈసడించినను, వాటినే యంటిపెట్టుకొని వచ్చినారు. జాతీయ భావము దేశములో వ్యాపించిన తరువాత జానపద కళకును, సంప్రదాయములకును గౌర వాదరములు లభించుచున్నవి. దేశీయ చిత్రకళకు ఇప్పుడు ప్రతినిధులైనవారు [1]'ముచ్చెవారు' అనబడు జనులు. వీరు ముఖ్యముగ చిత్ర కళనే వృత్తిచేసికొని క్రీ. శ. ఐదారు శతాబ్దులనుండి కృష్ణా గోదావరి జిల్లాలలో నివసించుచుండినట్లు నిదర్శనములు గలవు. దేవాలయపు గోడలమీద పురాణ గాథలను చిత్రించుట, దేవతల వాహన

1. చూడు వ్యాసము. తెలుగు చిత్రకళ-అందలి సొగసులు. భారతి. రజతోత్సవ సంచిక.

ములు మొదలగునవి నిర్మించి రంగులతో అలంకరించుట వీరి ముఖ్య విధి. ముచ్చీలు సంస్థానాధీశులయొక్కయు, వారి సామంతులయొక్కయు రూపములు చిత్రించుచుండిరి. 'దశావతారి' ఆటకొరకు గుండ్రని పేకముక్కలను తోలుతోగాని, అట్టతోగాని, కత్తిరించి వాటిమీద చిత్రచిత్రవర్ణములతో బొమ్మలు వ్రాసెడివారు. వీరికి కావలసిన రంగులు వీరే తయారు చేసికొందురు. తగుప్రోత్సాహము లేకపోవుటచే, వీరిలోని చిత్రకళ సన్నగిల్లుచున్నది. ప్రఖ్యాతిగాంచిన కొండపల్లి బొమ్మలు ఈశిల్పులు సిద్ధము చేయుచున్నవే. ఈ యదనున, తెలుగువారి అద్దకపు పరిశ్రమను కూడ పేర్కొనవలెను. వస్త్రములకుగాని, నేతకుపయోగించు నూలుకుగాని రంగు వేయుట అద్దక మనబడును. ఇది ప్రాచీన కాలమునుండియు తెలుగు దేశమున వెలసిన గొప్పకళ. దీనికే కలంకారీ అద్దక మని పేరు. అనేకరంగులలో కల్పనా చిత్రములను అద్దుటయే, కలంకారీ అద్దకమునందలి విశేషము. రంగరేజులు, జీనిగరులు, ఉనువులవాండ్రు అనబడువారు ఈ అద్దకమే వృత్తిగా గలవారు. నాగరకుల యాదరము లేక వీరి కళయు క్షీణించినది. కలంకారీ అద్దకములో నేర్పరులైన జనులు ఇప్పటికిని బందరు, పాలకొల్లు, కాళహస్తి, కొండపల్లి మున్నగు పట్టణములలో నివసించుచున్నారు.

ప్రజావినోదములు :—ఈనాటికిని తెలుగువారిలో విజ్ఞానమునకును, వినోదమునకును, ఎన్నియో సాధనములు గలవు. హరికథలు, పురాణ పఠనము సత్కాలక్షేపములకు, మార్గములు. హరికథ యొక అద్వితీయ విజ్ఞాన సాధనము. దీనిలో సంగీతము, కవిత్వము, నృత్యము మొదలగు పెక్కు కళలకు సన్నివేశము కలదు. అన్నిరసములకును ప్రధానముగ భక్తికిని దీనిలో ప్రవేశ మున్నది. ఆంధ్రదేశమున హరికథలను వ్రాసి సత్కాలక్షేపము చేయుటలో గొప్ప ప్రఖ్యాతి గన్నవారు అజ్జాడాదిభట్లనారాయణదాసుగారు. వీరు గొప్ప సంగీతవేత్తలు. 'లయబ్రహ్మ' యనునది వీరి బిరుదము. నారాయణదాసుగారి శిష్య ప్రశిష్యగణము, తెలుగుదేశమునం దల్లుకొని

పోయినది. భారత భాగవతాది పూర్వగ్రంథములను రాగములతో చదివి, సులభ వ్యాఖ్యానరీతిలో చెప్పుట పురాణపఠనము. ఇదియు నీతిదాయకమైన విజ్ఞాన ప్రచారము. రాంభొట్ల అప్పన్నశాస్త్రిగారు అను మహనీయులు కోనసీమయందు పురాణ ప్రవచన కళలో, గొప్పపేరు గడించిరి. జనసామాన్యమునందు వీరగాథలు (బొబ్బిలి పాటవంటివి) జాలికథలు (బాలనాగమ్మకథ, లక్ష్మమ్మకథ వంటివి) చెప్పించుకొని వినుట, నేటికిని వ్యాప్తిలో ఉన్న వినోదము. గొల్ల సుద్దులు కూడ ఈ తరగతిలో చేరినవే. జనసమూహము ఈ గేయములందు తన్మయులై, వినుచుందురు. ఇటీవల బుఱ్ఱకథ యను మరొక వినోద మార్గము ప్రచారములోనికి వచ్చినది. బుఱ్ఱకథను నాగరకులుకూడ విజ్ఞాన ప్రచారమునకును, రాజకీయ భావాందోళన మునకును, వాడుకొనుచున్నారు. వీధి భాగవతములు, తోలు బొమ్మ లాటలు కూడ ప్రజా వినోదమునందు, ప్రముఖస్థానము వహించి యున్నవి. అందును తోలు బొమ్మలాట ఎక్కువ ప్రజాదరణమును చూరగొనినది. ఇది యొక మూగ సినిమా ప్రదర్శనము వంటిది. మాట్లాడు సినిమాలు రాకముందు మూగ సినిమాలు నడిపించెడి వారు. రామాయణ, మహాభారత కథలీ తోలుబొమ్మ నాటక ములకు కథా వస్తువులు. రామ రావణాది పాత్రములను తోలు బొమ్మలుగా కత్తిరించి, వాటికి రంగులు వేసి, కర చరణాదులకు పుల్లలు కట్టి తెరచాటునుండి నటకులు వీని నాడింతురు. దీపములు తెరచాటున నుండును. దీపకాంతిలో తెరమీద కనబడు బొమ్మలు, జీవకళ ఉట్టిపడుచుండును. ఆట నాడించువారు సమయోచిత సంభా షణములు, సంగీతము జతగూర్చి, నాటక ప్రదర్శనమువలె నిర్వ హింతురు. ఈనాడు మూడవరకము చవక సినిమాలు పల్లెపట్టులలో వ్యాపించి ఈ యపూర్వ కళను-తోలుబొమ్మలాటను-దిగత్రొక్కి వేయుచుండుట విచారకరము.

ఆధునిక యుగము సంఘసంస్కారమునందు పలుత్రోవలు త్రొక్కినది. బ్రహ్మసమాజము, ఆర్యసమాజము మొదలగు సంస్కా

రోద్యమముల ఫలితముగ, వర్ణాశ్రమ ధర్మవిధానముయొక్క ఇనుప కౌగిలింత కొలదిగా సడలినది. వర్ణవ్యవస్థను, అది పుట్టించిన తారతమ్యములను, సమర్థించువా రీనాడు అరుదుగా గాన్పింతురు. అయినను ప్రాచీన వైష్ణవ వీరశైవమతకర్తలవలె, వర్ణవ్యవస్థను నిరసించి, సాంఘిక విప్లవమును యత్నించినవారును, ఇప్పుడు లేరు. గాంధి మహాత్మునివంటివాడు వర్ణవ్యవస్థలోని సంఘభేదములను ఖండించినను, ఈ ప్రాచీన వ్యవస్థలో గుణములు లేకపోలేదని వచించెను. వర్ణాంతర వివాహము లెక్కువ యాదరము నింకను పొందుటలేదు. కాని అంతర్వర్ణభోజనములు, సఖ్యతాగౌరవములు నిరాఘాటముగ సాగుచున్నవి. హరిజనోద్ధరణ కార్యకలాపము తెలుగుదేశమున చక్కగ సాగుచున్నది. తిరుపతి మున్నగు ఆంధ్రదేశస్థ దివ్యక్షేత్రములలో హరిజనులకు దేవాలయ కవాటములు తెరువబడినవి. వర్తమానయుగమునందలి సాంఘికోద్యమములలో ముఖ్యమైనవి స్త్రీలకు సంబంధించినవి. స్త్రీవిద్య, వితంతు వివాహములు, బాల్య వివాహనిషేధము, రజస్వలానంతర పరిణయములు, ఆస్తిలో స్త్రీలకు భాగమునిచ్చు పర్యాలోచనము–ఈ మొదలైన వన్నియు యుగయుగములనుండి, స్త్రీలు అనుభవించు కష్టనిష్ఠురములను కొంత వరకు తొలగించుచున్నవి. వీరేశలింగముపంతులుగారు పెక్కు దూషణభూషణములకు గురియయి, స్త్రీ పునర్వివాహాచారమును ఆంధ్రదేశమునందు జనామోదము నొందించిరి.

ఇట్లెన్నియో నూతనసాంఘికభావములును, జాతీయభావమును, దేశీయుల మనస్సులను కల్లోలితము చేయుచున్నను కవితాప్రపంచమునందు వీని ప్రతిధ్వనులు ఇరువదవ శతాబ్దప్రారంభమువరకును, అంతగా వినబడలేదు. కవిత్వమును పాండిత్య శిఖరాగ్రముల నుంచి దింపి జనసామాన్యమున కందుబాటులోనికి దెచ్చినవారు శ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులు. కానైతే వీరు పూర్వకవితా సంప్రదాయములోనివారే. జగజెట్టులైన ఈ విద్వాంసులు కవిత్వమును, పాండిత్యమునుండి విడదీసి సర్వజనాహ్లాదకరమైన కవితాశైలిని

ప్రచారములోనికి గొనివచ్చిరి. కావ్యములందు వీరు గ్రాంథికశైలినే పాటించిరి. అయినను, లోకవ్యవహార భాషకు వీలైనంత సన్నిహిత మగు శైలినిచేపట్టుటయే, వీరి విశిష్టత. నానారాజ సందర్శనమువల నను, ఆశుకవిత్వము, అవధానతంత్రము మూలమునను ఈ మహా కవులు ఆంధ్రదేశపు మూలమూలలయందు, గొప్ప కవితోద్బోధ మునకు కారకులైరి. బుద్ధచరిత్రము, దేవీభాగవతము మొదలైనవి వీరి యుత్తమరచనలు. ఆధునిక కవులలో పలువురు వీరి శిష్య సంప్రదాయములోనివారు.

పూర్వకవిత్వరీతికి భిన్నమైన కవితాప్రపంచము ఆధునిక కవిత్వము, భావకవిత్వము, నవ్యసాహిత్యము మొదలగు పేరులతో బరగుచున్నది. ఇది కావ్యవస్తువులందును, శైలియందును, ఛందస్సు లందును, ఆదర్శములందును కూడ ప్రాచీనసంప్రదాయముకంటె వైలక్షణ్యమును చూపుచున్నది. నవ్యసాహిత్యమునకు ప్రధాన 'కారణము–ఉద్బోధకము' ఆంగ్లసాహిత్యజ్ఞాన మని చెప్పవచ్చును. రాజులను, రాణులను విడిచి, ప్రజాసామాన్యమును వారి జీవిత పురాణమును కవితావస్తువుగా దీసికొనుట; సులభశైలిని పాటించుట; గేయఛందస్సుల నెక్కువగా ఆదరించుట–ఇవి నవ్యకవిత్వపు ముఖ్య చిహ్నములు. జాతీయ భావ ప్రేరితమై, ఇంచుక వీర రసాత్మకమైన రచన కూడ దీనిలో చేరుచున్నది. దీనిని కొందరు తిరుగుబాటు కవిత్వ మనికూడ పేర్కొందురు. ప్రాచీనాదర్శములమీదను, కట్టు బాట్లమీదను కలిగిన వైముఖ్యమే, ఈ తిరుగుబాటు తత్త్వము. గురజాడ అప్పారావుపంతులుగారు తమ 'ముత్యాలసరముల'లో ఈరీతి మధురకవితాసృష్టికి నాంది పఠించిరి. శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు, స్వామి శివశంకరశాస్త్రిగారు పింగళి కాటూరి కవులు నవ్యకవిత్వమునకు పుష్టి నిచ్చిరి. శ్రీ దువ్వూరు రామిరెడ్డి గారును, తెలంగాణములో గంగుల శాయిరెడ్డిగారును రైతు దైన్య జీవితమును కావ్యప్రపంచములోనికి మొదటిమారు గొనివచ్చిరి. శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు, కొడాలి సుబ్బారావును ఆంధ్రాభిమానమును రేకెత్తించు రచనలు గావించిరి. శ్రీ దేవులపల్లి

కృష్ణశాస్త్రి, వేదుల సత్యనారాయణశాస్త్రిగారలు మధుర వేదనతో గూడిన కవితాశిల్పము నావిర్భవింపజేసిరి. శ్రీ నండూరి వెంకట సుబ్బారావుగారి 'యెంకిపాటలు' బసవరాజు అప్పారావుగారి గీతములును, ఇంటింట నోట నోట నాట్యమాడుచున్నవి. తిరుగుబాటు కవిత్వమైన భావకవిత్వముపైగూడ మరియొక తిరుగుబాటు తలయెత్తి ప్రచారములో నున్నది. దీనికే అభ్యుదయ కవిత్వము, అతివాస్తవికకవిత్వము అని నామకరణము చేయబడినది. వీటన్నిటియందును సమకాలిక ఆంగ్ల కవిత్వపు పోకడలు దోబూచులాడుచుండును.

ఇది ప్రజాయుగము. ప్రజలే ప్రభుత్వము. శాసన నిర్మాణాధికారము వారిది. సర్వతంత్ర స్వతంత్రులైన ప్రజలలో విద్యావిజ్ఞాన వ్యాప్తిగాంచుట ఈనాటి గొప్ప అవసరము, క్లిష్టసమస్య. ఈ భారమును విస్తారముగా వహించునవి వార్తాపత్రికలు. పత్రికానిర్వహణము పందొమ్మిదవ శతాబ్దముననే తెలుగు దేశమున తలయెత్తినది. ప్రారంభమునందు మాసపత్రికలు మాత్రమే యుండెడివి. వీనిలో పూండ్ల రామకృష్ణయ్యగారు నిర్వహించిన 'అముద్రిత గ్రంథ చింతామణి'యను పత్రిక సారస్వత విమర్శనలకు ప్రసిద్ధికెక్కినది. వీరేశలింగముపంతులుగారు, కొక్కొండ వేంకటరత్నంపంతులుగారు, వేదము వెంకటరాయశాస్త్రిగారు మొదలైనవారు తమ తమ రచనలను ప్రకటించుటకును, స్వపక్షమండనము పరపక్ష ఖండనమునకును వేర్వేరు పత్రికల నిర్వహించుచుండిరి. తెలుగు దేశమున పత్రికా నిర్వహణమునకు గొప్పస్థాయిని కల్పించినవారు దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు. ఆంధ్రపత్రికయే ఆంధ్రులకు పత్రికా నిర్వహణమునందు ఓనమాలు నేర్పినది. ఈ సంస్కృతి, చరిత్ర, విజ్ఞానము మున్నగు రాజకీయేతరాంశములనుగూర్చిన రచనలను ప్రోత్సహించుటకై నాగేశ్వరరావు 'భారతి'ని స్థాపించిరి. ఇది గొప్ప సారస్వత సేవ చేసినది. చేయుచున్నది. సమర్థులైన వారెందరో ఇతర మాసపత్రికలనుగూడ నడుప నారంభించిరి. కాని తెలుగుపత్రిక లెన్నియో పుబ్బలో పుట్టి మఖలో మాడిపోవుచుండునని

పలువురు తలచుచున్నారు. ఆంధ్రులు నిర్వాహణచాతుర్యము నింకను ఎక్కువగా అభ్యసింపవలె ననుటయే దీని నీతి. ఈనాటి గొప్ప దిన పత్రికలలో ఆంధ్రప్రభకూడ పేరు వహించినది. ఉత్తమస్థాయి రచన లకు కృష్ణాపత్రిక వాహినిగా నున్నది. బాలసారస్వతమునకు చెందిన 'బాల' 'చందమామ, పత్రికలును, సినిమాకళా విమర్శనము చేయు పత్రికలును బహుళ ప్రచారములో నున్నవి.

ఆంధ్ర దేశపు టార్థికపరిస్థితియందు గత నూటయేబది సంవత్స రములలో చెప్పుకోదగిన మార్పు లేవియు రాలేదు. ఈ గ్రంథా రంభమున చేయబడిన ఆంధ్ర దేశపు సిరిసంపదల వర్ణననుబట్టి, ఈ దేశము ప్రధానముగ వ్యవసాయవృత్తి యాధారము గలది యని చెప్పవలెను. పరిశ్రమావకాశములు గలవు కాని వీటిని ఏకదీక్షతో ఉపయోగించుకొను ప్రభుత్వముకాని, ప్రభుత్వేతర సంస్థలుకాని లేవు. ఆంధ్ర దేశపు ఆర్థికావకాశములను సంపూర్ణముగా తరచి, వినియో గించు కొనగల రాష్ట్రప్రభుత్వ ముండవలయు ననుటయే, ఆంధ్ర రాష్ట్ర నిర్మాణ వాంఛలోని యాంతర్యము. తెలుగు దేశమునందు సహకారోద్యమము జయప్రదముగనే పనిచేయుచున్నది. వేమవరపు రామదాసుపంతులు, నృసింహదేవర సత్యనారాయణగారు మొద లైనవారు, ఆంధ్ర దేశపు సహకారోద్యమమున గొప్ప వ్యవస్థాపకులు. జనసంఖ్య యపారముగ పెరిగిపోవుటవలని యనర్థములను ప్రజలకు తెలియజెప్పుచు, జనాభా పెరుగుదలను అరికట్టుటకై సంతాన నిరోధ మవసరమని బోధించినవారు, న్యాయమూర్తి వేపా రామేశంపంతులు గారు. ప్రకృతి వైరుధ్యముచే ఆంధ్ర దేశము ధన ప్రాణనష్టముల కప్పు టప్పుట గురియగుచుండుట గాంతుము. రాయలసీమ కరువు ప్రాంత మని చెప్పియున్నాము. సాగరసీమ రత్నాకరుని యాగ్రహామునకు పాత్ర మగుచుండుట సామాన్య విషయము. గత శతాబ్దమున (1864 లో) మచిలీపట్టణ ప్రాంతమున పెద్ద యుప్పెన సంభవించి,

ఆ నగరము దిబ్బయయ్యెను. ఇటీవల తూర్పుతీరమునందలి పెనుగాలి వానచే ఆంధ్ర దేశము పెద్ద దిబ్బతినెను. ఇట్టి సంఘోపద్రవములందు ఆంధ్రు లన్ని ప్రాంతములవారును, నష్టపడిన స్వజనుల కండవైు నిల్చి, యాదుకొనుట ప్రశంసావహమై యున్నది. ఈ యొక్క అంశమే ఆంధ్రుల రక్తబాంధవ్యమును రుజువు చేయగలదు.

[1] తెలంగాణము—దాదాపు కోటి జనాభా గలిగి, ఆంధ్ర దేశముయొక్క అత్యంతప్రాచీన చరిత్రకు రంగమైన భూభాగములో నివసించు, తెలంగాణా ఆంధ్రు లీ యుగమున నెట్లుండిరో గమనింతము. మొగలాయి ప్రభుత్వానంతర మీ ప్రాంతము నిజాము నవాబుల యధీనమునం దుండినది. నిజాముల పరిపాలనము అభివృద్ధి నిరోధక ముగ నుండెనని చారిత్రకులు చెప్పుచున్నారు. బ్రిటిషు ఇండియా ప్రాంతముకన్న స్వదేశ సంస్థానములు విద్యా వైజ్ఞానిక విషయ ములలో మిక్కిలి వెనుకపడి యుండెడివి. స్వదేశ రాజ్యములలోకూడ హైదరాబాదు రాజ్యము కడగొట్టు చెల్లెలై యుండెను. ఇరువదవ శతాబ్దివరకును, నిజాములు మత సహనమునకు మంచిపేరు వహించి యుండిరి. నవాబు నిజామలీఖాను (1762—1803) కాలములో భద్రాచల శ్రీరామ దేవాలయమునకు సంవత్సరమునకు నలుబది వేల రూపాయల ఆదాయము రాగల జాగీరు ఈయబడెను. నాజరుద్దౌలా నిజాముగా నుండిన కాలమున, స్వామివారి సంవత్సర కళ్యాణోత్సవ మునకై కానుకలు పంపు ఆచారము నెలకొల్పబడెను. మీరు మహా బూబు అలీఖాను పాదుషాగారు వితరణమునకును, ఔదార్యమున కును, ప్రసిద్ధి గడించిరి. బ్రిటిషు భారత దేశమునందు దేశీయ మహా సభకు ప్రతికక్షిగ ముస్లింలీగు పక్షము ఏర్పడినప్పటినుండియు, హైద రాబాదు రాజకీయములు కలుషితములు కాజొచ్చెను. ప్రభుత్వము

1. సమగ్రాంశములకొరకు చూడు. "తెలంగాణా ఆంధ్రోద్యమ చరిత్ర" ప్రథమ ద్వితీయభాగములు. కర్త—శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులు గారు.

యొక్క అండను ప్రాపకమును జూచుకొని మత తత్త్వ భూయిష్ఠులైన మహమ్మదీయులు హిందూప్రజల పురోభివృద్ధికి తీరని యడ్డంకులు కల్పింప నారంభించిరి. వీరిలో స్థానికులైన ముసల్మానులకన్న పరప్రాంతములనుండి వచ్చిన మహమ్మదీయాధికారులు రాజకీయ కౌటిల్యమునందు ఆరితేరినవారుగా నుండిరి. రాష్ట్రమునందలి ఇతర హిందూప్రజలతోపాటు, తెలంగాణా ఆంధ్రులుకూడ పెక్కు సిలుగులకు లోనుగావలసి వచ్చెను. మరాట్వాడా ప్రాంతముకన్న తెలంగాణా ప్రాంతము మరియు వెనుకబడియుండెను. ప్రభుత్వమునందు ఉన్నతాధికారములలో కొందరైనను మహారాష్ట్రులుండిరి. కాని తెలుగువారు మచ్చుకైనను కానరాకుండిరి. ఈ కారణముచే తెనుగు వారి గోడు ఆలించువారును, పాలించువారును లేకపోయిరి.

ఈ కాలమున తెలంగాణా ఆంధ్రులకు బాధాకరములైన శతాధిక విషయములలో కొన్నిటిని మాత్రమే పేర్కొందుము. జనులలో అత్యధిక సంఖ్యాకుల మాతృభాషలను త్రోసిరాజని అల్పసంఖ్యాకుల భాషయైన ఉర్దూను, రాజభాషగా నిర్ణయించి, దాని ప్రచారమును నిర్బంధము చేయుట; విద్యాసంస్థలయం దీ భాషనే బోధన భాషగా విధించుట; ప్రజా ఉద్యమములను రంధ్రాన్వేషణ దృష్టితో జూచుచు అణచివేయుట; వాక్స్వాతంత్ర్యము, పత్రికా స్వాతంత్ర్యము, సమావేశ స్వాతంత్ర్యములపై ఎన్నియో ఆంక్షలు విధించుట; తుదకు గ్రంథాలయములు తెరచుట, ప్రాథమిక పాఠశాలల నిర్వహించుటగూడ రాజద్రోహ చర్యలుగ పరిగణింపబడుట—ఇట్లెన్నియో విధి నిషేధములు తెలంగాణా ప్రజలను వేధించుచుండెను. దీనికి తోడు ప్రజల ఆర్థికస్థితికూడ హీనముగ నేయుండెను. తెలంగాణమునందు జాగీరు ప్రాంతము విస్తారముగా నుండుటయు, పన్నుల భారము, వెట్టిచాకిరి, ఉద్యోగుల దౌర్జన్యము సహింపరాని విగ ఉండుటయు గాంచెదము.

ఇట్లు సంస్కృతి విజ్ఞానములందు పాతాళమునకు క్రుంగిపోయి ఆర్థికముగ హతాశులై యున్న, తెలంగాణా ఆంధ్రులు ఆత్మోద్ధరణమునకై నడుముకట్టిరి. ఉద్యమారంభదశలో తెలుగువారియందు ఆంధ్ర భాషాభిమానము, విద్యాసక్తి, స్వసంఘోద్ధరణాభిలాష పెంపొందించుటయే ముఖ్య కర్తవ్యముగ కార్యకర్త లెన్నుకొనిరి. పాలకుల చాణక్య నీతివలన తెలంగాణమునందలి సంస్కృతి జీవితమునకు గొప్ప యాఘాతము కల్గెను. తెలుగు వారియందు నవచైతన్యము కలుగవలె నన్నచో అది వైజ్ఞానిక మార్గముననే జనించవలెనని గుర్తింపబడెను. తెలంగాణా ఆంధ్రుల యదృష్టముచే, వారికి దూరదృష్టి కలిగి ఉద్రేక రహిత మగునాయకత్వము లభించెను. ఆంధ్రపితామహ మాడపాటి హనుమంతరావుపంతులు, బూర్గుల రామకృష్ణరావుపంతులు, కొండా వెంకటరంగారెడ్డి, సురవరము ప్రతాపరెడ్డి, మందుముల నరసింగరావుపంతులు మున్నగు మహానాయకులు తెలంగాణా ఆంధ్రోద్యమ సారథులైరి. 'ఓర్పు, నిదానము' వీరి పల్లవిగానుండెను. గ్రంథాలయములు, పఠన మందిరములు స్థాపించుటతో ఉద్యమ మారంభమయ్యెను. 1901–వ సంవత్సరమున హైద్రాబాదు నగరమున స్థాపింపబడిన శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము తెలంగాణా ప్రబోధమునకు బీజావాపమయ్యెను. రెండవ దశయందు తెలంగాణా పట్టణములలో ఆంధ్ర జన సంఘములు స్థాపింపబడి ప్రజలయందు ధైర్య స్థైర్యములను, నిరంకుశాధికారము నెదుర్చు శక్తిని పెంపొందించెను. ప్రజానీకమును పీడించుచున్న చిన్నచిన సమస్యలు వర్తకుల కష్టములు, వెట్టిచాకిరి, పద్మశాలీలపై అక్రమపన్నులు—మొదలైనవి పరిష్కారము నొందుచుండెను.

ఉద్యమముయొక్క మూడవదశయందు ఆంధ్రుల వివిధ సంఘముల నేకీభవింపజేసి (నిజాంరాష్ట్ర) ఆంధ్రమహాసభలు సమావేశపరుపబడెను. వీనిమూలమున ఇంతవరకును నగరముల సరిహద్దులను దాటిపోని యాంధ్రోద్యమము తెలంగాణ మంతటను వ్యాపించి,

రైతులోకమునం దపూర్వచైతన్యమును కలిగించెను. ఉద్యమము యొక్క ప్రతిదశయందు, అప్పటి హైదరాబాదు నిరంకుశ ప్రభుత్వము ప్రజాశయములను భంగ మొనర్చుటకై, యవలంబింపని మాత్సర్యచర్య లేకుండెను. అందును గస్తీ 53 సభాసమావేశముల నిషేధించునది అని దుష్కీర్తి పడసిన శాసనము, నిరంకుశాధికారుల పాలిటి కామధేనువుగ నుండెను. కాని ప్రజాసంకల్ప మను జగన్నాథ రథము నిర్నిరోధముగ సాగిపోయెను. భారతదేశము స్వాతంత్ర్యము నొంది, బ్రిటిషువారు వైదొలగగనే, హైదరాబాదురాజ్యము సర్వస్వతంత్ర ప్రతిపత్తికై అంగలార్చెను. రాజ్యమునందలి మతద్వేష పూరిత దుష్టశక్తులు, మధ్యయుగపు టాయుధముల ధరించి, నిరపరాధులైన ప్రజలను స్వేచ్ఛతో హింసింప నారంభించిరి. తెలంగాణపు ప్రజలు, ముఖ్యముగ స్త్రీజనము భయోత్పాతములకు లోనయ్యెను. సంస్థాన కాంగ్రెసువర్గము స్వామి రామానందతీర్థ, సర్దారు జమలాపురం కేశవరావు మున్నగు నాయకుల సారథ్యమున స్వాతంత్ర్యసమరమును అచంచలదీక్షతో సాగించెను. ప్రజాపీడకుల నెదుర్కొనుటకై శ్రీ రావి నారాయణరెడ్డిగారి నాయకత్వమున, కమ్యూనిస్టు పక్షము కృషిచేసి, రైతుజనమునందు పలుకుబడి సంపాదించెను. చివరకు భారత ప్రభుత్వమువారి పోలీసుచర్య (1948) మూలమున, హైదరాబాదు ప్రజల దారుణహింసాపరీక్ష ముగిసి, శాంతి నెలకొల్పబడెను.

రాజకీయ సమరముతోపాటు తెలంగాణా సంస్కృతి ఉద్యమము తీగలు సాగుచునే యుండెను. ఇక్కడ సాహితీపరులలో శ్రీ మా. హనుమంతరావుపంతులుగారు, శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు, శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారును అగ్రేసరులు. గ్రంథాలయములతరువాత పండిత పరిషత్తులు, ప్రశంసనీయమైన భాషాసేవ చేయుచున్నవి. వీనిలో లక్ష్మణరాయ పరిశోధకమండలి, విజ్ఞానవర్ధనీ పరిషత్తు, ఆంధ్రసారస్వత పరిషత్తు కొనియాడదగినవి. రాజకీయ

పోరాటము చల్లారిన తరువాతకూడ ఆంధ్రప్రజానీకమునందు భాషా ప్రచారము చేయుచున్న ఆంధ్రసారస్వత పరిషత్తు, ఒక గొప్పసంస్థ. తెలంగాణమునందు గ్రంథప్రకటనసంస్థలు వెలసి, ఉత్తమరచనలను లోకమున కందిచ్చుచున్నవి. పత్రికా నిర్వహణమునందు కూడ తగుమాత్రమైన పురోభివృద్ధి కలిగినది. నీలగిరి పత్రిక, తెనుగు పత్రిక – ఈ రెండును ప్రారంభదశయందు ఆంధ్రోద్యమమునకు గొప్ప యూతనొసంగి యస్తమించినవి. గోలకొండపత్రిక, సుజాత, శోభ మున్నగు మంచి పత్రికలు వెలువడుచున్నవి. యువకవులలో స్వాతంత్ర్యాగ్ని స్ఫులింగము లింకను చల్లారలేదు. శ్రీ దాశరథి, కాళోజీ నారాయణరావు, పొట్లపల్లి రామారావు, వానమామలై వరదాచార్యులుగారివంటివారు రసభావ నిశితమైన రచనలు చేయుచున్నారు.

తెలంగాణా ఆంధ్రమహాసభలతోపాటు మహిళా మహాజన సభలు కూడ సమావేశమగుచుండుట ఈ యుద్యమమునొక్క విశిష్ట చిహ్నము. స్త్రీ జనాభ్యుదయమునకై ప్రశంసనీయమైన సేవచేసినవారిలో కీర్తిశేషురాలైన నడింపల్లి సుందరమ్మగారును, శ్రీమతులు టి. వరలక్ష్మమ్మ, యెల్లాప్రగడ సీతాకుమారి, సంగము లక్ష్మీబాయమ్మగారలు పేర్కొనదగినవారు. మహిళా రచయితలలో శ్రీమతులు ఇల్లిందల సరస్వతీదేవి, నందగిరి ఇందిరాదేవి, నేమాని భారతీరత్నాకరాంబగారలు అభ్యుదయపథమున వర్తించుచున్నారు. సహస్రమాస జీవియైన రాజబహద్దరు శ్రీ వెంకటరామిరెడ్డిగారొక గొప్పవ్యక్తి. వీరిప్రోపుప్రాపుల నందని యాంధ్రసంస్థ భాగ్యనగరమున లేదనుట యత్యుక్తికానేరదు. వీరి కార్యదక్షతచే జయపతాకలుగా వర్ధిల్లుచున్న సంస్థలలో, ఆంధ్రబాలికల ఉన్నతపాఠశాల, రెడ్డివిద్యార్థి వసతిగృహము చెప్పదగినవి.

ఆగస్టు 15, 1947 భారతదేశచరిత్రలో స్వర్ణాక్షరములతో లిఖింపవలసిన దినము. ఈనాటి ఉదయముహూర్తమున కమలాకరము

వలె భారతజాతి వికసితముఖారవిందమై యుండెను. నాడు బ్రిటిషు వారు భారత జాతీయప్రభుత్వమునకు అధికారదత్తత యొనర్చిరి. భారతదేశము శతాబ్దుల తరువాత, సంపూర్ణస్వాతంత్ర్య బాలాతపమున, విజయపతాకలను ఎగురవైచి, జయశంఖములను పూరించెను.

స్వాతంత్ర్యసిద్ధితోపాటు, తమ చిరకాలవాంఛితమైన ఆంధ్ర రాష్ట్రము ఏర్పడునని ఆంధ్రులు చిడిముడిపాటుతో ఎదురు చూచుచుండిరి. 'ఆంధ్రరాష్ట్రనిర్మాణమున కధిగమింప సాధ్యముకాని అవరోధము లేవియు లే'వని (నవంబరు 1947 లో) ప్రధానమంత్రి పండిత నెహ్రూ ప్రకటించెను. నూతన రాష్ట్రము నెట్లవతరింప చేయుట యని, రాజకీయ శాస్త్ర పండితులు సూత్రములు వల్లె వేయుచుండిరి. రాజ్యాంగ పరిషత్తు అధ్యక్షుని ఆదేశానుసారము (జూన్ 1948 లో) ధార్ కమిషను ఏర్పాటయి, భాషారాష్ట్ర నిర్మాణ సమస్యను దృష్టియం దుంచుకొని, ఏ రాష్ట్రములు వెంటనే నిర్మాణార్హములో సూచన చేయుటకై ఆదేశింపబడెను. సదరు కమిషనువారు దేశపర్యటనచేసి, కొండను త్రవ్వి ఎలుకను పట్టినట్లు, భాషాప్రయుక్త రాష్ట్రవిభజన సిద్ధాంతమునే ఖండన చేయుచు, నివేదిక సమర్పించిరి. మరియు ఆంధ్రరాష్ట్రము ఆర్థికముగా నిలువజాలదనియు, ఇది పుట్టుకలోనే ఋణగ్రస్తమై 6½ కోట్ల బడ్జెటు లోపముతో అవతరించుననియు,నిరాశాజనకముగ జోస్యముచెప్పెను.[1] ధార్ సంఘమువారి యార్థిక పరిగణనము లోపభూయిష్ఠ మనియు, నూతనఆంధ్రరాష్ట్రము లోటురాష్ట్రముకాదనియు, నాంధ్రులువాదించిరి. అఖిలభారత జాతీయ మహాసభవారు ఆంధ్రుల వాదమును గుర్తించి, నాయకత్రయసంఘమును (పండిత నెహ్రూ–పట్టాభి–పటేలు గార్లు) జయపూరు సమావేశములో నియామకముచేసి, ఈ సమస్యను పునఃపరిశీలన చేయగోరిరి. వీరు ఆంధ్రరాష్ట్ర నిర్మాణముకొరకు ఒక ప్రత్యేక పథకమును సిద్ధముచేసిరి. ఆంధ్రులు చెన్నపట్టణముపై

1. చూడు వ్యాసము. ధార్ కమిషన్ నివేదిక. శ్రీ వేమూరి వెంకటనాథంగారు. భారతి. సంపు. 26. సంచిక 3.

హక్కును వదలుకొన్నచో, చెన్నరాజధానిలోని నిర్వివాదమైన జిల్లాలతో, ఆంధ్ర రాష్ట్రనిర్మాణము చేయవచ్చునని నాయకత్రయ సంఘమువారు సిఫారసు చేసిరి.

మద్రాసునగరమును వదలుకొనుట మొదలు చెడిన బేరమని ఆంధ్రులు తల్లడమందిరి. ఆంధ్రప్రజల ధనమును, ఆంధ్ర కార్మికుల రెక్కల కష్టమును, అపారముగ ననుభవించి, పెరిగి, దక్షిణ దేశము నందు గొప్ప రేవుస్థానమైన చెన్నపట్టణమును, ఆంధ్రులు గొప్ప హృదయభారముతో మాత్రమే, త్యజించుటకు విధిలేక అంగీకరించిరి. దీనితో ఆంధ్ర రాష్ట్రనిర్మాణము సుకర మగునని ప్రజలు మహదా నందము నొందిరి. జనవరి 26, 1950 నాడు స్వతంత్రభారత రిపబ్లికు తోపాటు ఆంధ్ర రాష్ట్రముకూడ అవతరించునని, ఆంధ్ర దేశము ఔత్సుక్యముతో నుండెను. కాని ఆంధ్ర రాష్ట్రనిర్మాణమునకు ప్రతి కూలమైన శక్తులు బలవత్తరముగ నుండెను. తాత్కాలికముగ నైనను, ఆంధ్ర రాష్ట్ర రాజధాని చెన్నపట్టణములో నుండరాదని తమిళులు ఆందోళన లేవదీసిరి. నూతన రాష్ట్ర నిర్మాణమువలన రాయలసీమకు నష్టము కలుగుననియు, ఆ ప్రాంతమునందలి ప్రాజె క్టులు మున్నగు అభివృద్ధి కార్యకలాపము స్తంభించి పోవుననియు, కొందరు అలజడి పడిరి. ఈ వాదోపవాదములలో, పుణ్యకాలము గడచిపోయి, భారత రిపబ్లికు స్థాపనదినము ఆంధ్రరాష్ట్ర నిర్మాణ ప్రశంస లేకయే జరిగిపోయెను. ఈ సన్నివేశము ఆంధ్రప్రజలు యావన్మందికిని నిరాశాజనక మయ్యెనని చెప్పుట చర్విత చర్వణము మాత్రమే కాగలదు.

ఇండియా గవరన్మెంటువారు జె.వి.పి. నివేదికను అంగీకరించి, ఆంధ్ర రాష్ట్ర నిర్మాణము సేయుటకు తగిన ఏర్పాటుల గావింపవల యునని, మదరాసు గవరన్మెంటువారికి ఆదేశ మొసర్చిరి. అదేప్రకా రము మదరాసు ప్రభుత్వము వారొక కమిటీని నియమించిరి. ఇందులో ఆంధ్రుల పక్షమున కళావెంకటరావు, బెజవాడ గోపాల రెడ్డి, టంగుటూరు ప్రకాశంపంతులు గారలును, ఇతర భాషావర్గ

ముల తరఫున పి.యస్. కుమారస్వామిరాజా, ఎమ్. భక్తవత్సలం, టి.టి. కృష్ణమాచారి, కె.బి. మాధవమీనన్ గారలును, సభ్యులుగ నియమితులైరి. ఈ కమిటీవారు ఆంధ్రరాష్ట్ర విషయమైన సమస్యల నన్నిటిని పరిశీలించి, రాష్ట్ర విభజన నేవిధముగ జేయవలసినదియు, వివరించుచు నొక నివేదికను తయారుచేసిరి. కాని యా కమిటీవారు ఏకగ్రీవముగ నందరును ఒకసిద్ధాంతమునకు రాజాలరైరి. శ్రీ టంగుటూరు ప్రకాశం పంతులవారు, తక్కినకమిటీ సభ్యులతో నేకీభవింపక తమ యభిప్రాయ భేదమును తమయసమ్మతిని, తెలుపుచు నొక మినెటును ప్రత్యేకముగ వ్రాసి, యానివేదికతో గూడచేర్చి 1951 జనవరి నెలలో ఢిల్లీలోని కేంద్రప్రభుత్వము వారి కంపిరి. ఈ విభజన సంఘము వారి నివేదికలో చెన్నపురిని గూర్చియు, ఆస్తి పాస్తి, ఋణ పణములను గూర్చియు, ప్రబలమైన భేదాభిప్రాయములు గానవచ్చుచుండుట వలన, కేంద్రప్రభుత్వమువారు దీనియెడ నుదాసీనభావము జూపి యూరకుండిరి. తత్కారణమున ఆంధ్ర దేశమంతటను గొప్ప యాందోళనము పుట్టెను. గాడిచెర్ల హరిసర్వోత్తమ రావుగారి యధ్యక్షతక్రింద ఆంధ్రమహాసభవారు 1951 లో దేశమంతటను గాఢముగ ప్రచారముసేయ గడగిరి. బులుసు సాంబమూర్తిగారి నాయకత్వము క్రింద గొప్ప యాందోళనము లేవదీసిరి. కాని ప్రజానీక మందంతను ఆంధ్రరాష్ట్ర విషయమున నిరాశ పర్వకొనెను; జనులుత్సాహమును గోల్పోయిరి. స్థితిగతు లిట్లుండ 1951 ఆగష్టు నెలలో స్వామి సీతారాము-పూర్వాశ్రమమున గొల్లపూడి సీతారామ శాస్త్రిగారు - కేంద్ర ప్రభుత్వమువారి నొత్తిడిపెట్టి, యెట్లైన వారిని ప్రత్యేకాంధ్ర రాష్ట్ర నిర్మాణమునకు ఒడబరచవలయునని యామరణ నిరశన దీక్షనుబూని, గుంటూరుపురములో ప్రాయోపవేశము జేసిరి; కాని ఫలితము లేదయ్యెను. పండిత జవాహరులాలు నెహ్రూగారు గుంటూరునకు వచ్చియు, వీరిని సందర్శించి సంప్రతింపక పోయిరి. కొన్నిదినములు గడచినపిమ్మట, వినోబాభావేగారు తాను మధ్యస్థముచేసి, యాంధ్రరాష్ట్ర సమస్యను పరి

ష్కారము చేయించెదనని చెప్పి స్వామిగారి నొడబరచి వారిదీక్షను విరమింపజేసిరి.

ఇట్లుండగా 1951 వ సంవత్సరమున ఎన్నికలు వచ్చినవి. అన్నికక్షులవారును తమతమ కక్షుల కార్యప్రణాళికలలో, ప్రత్యే కాంధ్రరాష్ట్ర నిర్మాణమునకు ప్రధానస్థానమిచ్చి, తత్కార్య సాధనకై తమయావచ్ఛక్తిని వినియోగించి, పాటుపడెదమని యుద్ఘోషించిరి. కాంగ్రెసు పక్షమువారు మాత్రము ఆంధ్రరాష్ట్ర నిర్మాణేచ్ఛగల వారైనను, కారణాంతరముల వలన తమ కార్యానుక్రణికయం దగ్రస్థానము నీయజాలకపోయిరి. ఎన్నికల సందర్భములో ఆంధ్ర దేశమందు పర్యటనముసేయ వచ్చినపుడు కాంగ్రెసు అధ్యక్షుడైన నెహ్రూగారి నీ విషయమై ప్రశ్నింపగా నతడు సరియైన సమాధానమును జెప్పక సర్వమును ఆంధ్రులమీదనే ఆధారపడి యున్నదనెను. కావున కాంగ్రెసు పక్షమువారికి ఈ యెన్నికలలో ఘనపరాజయముగలుగుట వింతకాదు. కమ్యూనిష్టు కక్షవారు పెక్కుతావులలో విజయమునందిరి. ఆంధ్ర దేశమున ఎర్రజెండా ప్రభావము మిక్కుటముగ హెచ్చెను.

ఎన్నికలు ముగిసినవి. తత్ఫలితానుసారమేర్పడిన సమష్టి మదరాసురాష్ట్రసభలో కాంగ్రెసు పక్షము సన్నగిలినది; కాంగ్రెసు ప్రతితుల సంఖ్యయే యధికమైనను, భిన్నవర్గముల వారగుట వలన వారియం దైకమత్యము లేక పోయెను. ఈ వర్గములను తగ్గించి, కాంగ్రెసేతర పక్షములవారి నందరిని కూడగట్టుకొని, యునైటెడ్ డెమొక్రాటిక్ ఫ్రంట్ అను నూతన కక్షనేర్పరచి, కార్యానుక్రమణికను సిద్ధము చేసికొని, శ్రీ టంగుటూరు ప్రకాశంపంతులుగారు నాయకత్వము వహించి, రాష్ట్రీయ శాసనసభలో తామధికసంఖ్యాకులమనియు, కావున మంత్రాంగమును దమకప్పజెప్పవలసినదనియు తెల్పుచు గవర్నరుగారి కొక యుత్తరమును వ్రాసిరి; కానిగవర్నరు గారు ప్రకాశముగారి వేడికోలు నేకారణము వల్లనో నిరాకరించి ప్రభుత్వ పారుపత్యమును అల్పసంఖ్యాకులైన కాంగ్రెసు పక్షము

వారికే యప్పగించిరి. ఇందుమూలమున ఆంధ్ర దేశమున ప్రభుత్వ ముపై అసంతృప్తి హెచ్చినది. అఖిలభారత కేంద్ర ప్రభుత్వము వారి తటస్థ భావము దీనికి దోహదప్రాయమై యాంధ్రుల హృదయములందు నిరాశ కెడమిచ్చినది.

ఢిల్లీ అఖిలభారత శాసన సభలో తుషారఛటర్జీగారు భాషా ప్రయుక్త రాష్ట్రముల నేర్పాటు చేయవలసినదని యొక తీర్మానమును ప్రవేశపెట్టిరి. ఈ సందర్భమున పైడా వెంకటనారాయణ, పుచ్చల పల్లి సుందరయ్యలు, వివాదాస్పదములు కాని జిల్లాలనన్నిటిని చేర్చి, ప్రత్యేక ఆంధ్రరాష్ట్రమును నిర్మాణము చేయవలసినదని ప్రతిపాదించిరి. ఇట్టి తీర్మానములనే మదరాసు రాష్ట్రసభలో తెన్నేటి విశ్వనాథము, వావిలాల గోపాలకృష్ణయ్య మున్నగు ప్రముఖులు ప్రవేశపెట్టిరి. అందుమీాదట అఖిలభారత ప్రధానమంత్రియైన పండిత జవహర్‌లాలు నెహ్రూగారు మదరాసుపట్టణ విషయమై, అన్ని కక్షులవారును ఒడంబడి ఏకగ్రీవముగ నొక తీర్మానమునకు వచ్చు నందాక ఆంధ్రరాష్ట్ర నిర్మాణమును తలపెట్టజాలనని చెప్పెను.

కేంద్రప్రభుత్వమువారు చూపు ఔదాసీన్యమువలన ఆంధ్రులకు నిజవాంఛితార్థము వారిమూలమున చేకూరదను తలంపు గల్గెను. అందుమీాద కీర్తికాయులైన శ్రీ పొట్టి శ్రీరాములుగారు మదరాసు మైలాపూరులో బులుసు సాంబమూర్తిగారి వసతిగృహము నందామరణ నిరశన దీక్షగొని ప్రాయోపవేశము జేసిరి. ఆయన వివాద భూయిష్ఠముగాని ప్రాంతములన్నిటిని జేర్చి, తక్షణమే నూతనముగ నాంధ్రరాష్ట్రమును నిర్మింపవలసినదనియు, మదరాసు నగరమును ఛీఫ్‌కమీాషనరు మండలముగ నేర్పరచి, తమిళాంధ్ర ప్రదేశములు రెంటికిని రాజధానిగ జేయవలసినదనియు, నీకోరిక లీడేరువరకు తాను నిరశనవ్రతము వర్జింపజాలననియు ప్రకటించెను. పొట్టిశ్రీరాములుగారు కోరినట్లు నూతన నాంధ్రరాష్ట్రము నేర్పరచి, మదరాసును, చీఫు కమీాషనరు పరగణాగావించి, ద్రావిడాంధ్ర రాష్ట్రములకు దానిని రాజధానిగ జేయవలసినదని శ్రీ టంగుటూరు

ప్రకాశం పంతులవారి యధ్యక్షతక్రింద సకల కక్షులవారును, సమావేశమై యొక తీర్మానమును ప్రతిపాదించిరి; కాని ఢిల్లీ అఖిలభారత శాసనసభలో పొట్టి శ్రీరాములుగారి నిరశనదీక్ష విషయమై ప్రవేశ పెట్టిన యొక అంతరాయ తీర్మానమును ప్రస్తావయుక్తమైనది కాదని త్రోసిపుచ్చిరి. ఏబది యెనిమిది రోజులు నిరశనవ్రతము సాగించి పొట్టిశ్రీరాములుగారు దేహమును త్యజించిరి. ఆయన మరణ వార్త ప్రతిఆంధ్రుని హృదయమునను దుఃఖాగ్నిని రగుల్కొల్పినది; కేంద్రప్రభుత్వమువారి యుపేక్షకు గనలి, పెక్కుతావులలో నాంధ్రులు దౌర్జన్యమార్గము నవలంబించి, యల్లరులు లేపి యపారమైన ద్రవ్యనష్టమును గలిగించిరి. తెన్నేటి విశ్వనాథము మున్నగు నాంధ్రనాయకులు కొందరు మదరాసు శాసనసభయందలి తమ సభికత్వమును విసర్జించి వెలుపలికి వచ్చిరి. అప్పటికి నెహ్రూగారించుక మెత్తదనముచూపి ఢిల్లీప్రజానభలో 1952 డిసంబరు 19 వ తేదీనాడు సమష్టి మద్రాసు రాష్ట్రములోనుండి తెనుగు జనసామాన్య భాషయై వాడుకలోనుండు ప్రాంతముల నేర్పరచి, ప్రత్యేకముగ నాంధ్రరాష్ట్రమునునిర్మింప నఖిలభారత కేంద్రప్రభుత్వమువారు నిశ్చయించిరనియు నానిశ్చయప్రకారము నూతనరాష్ట్ర నిర్మాణమునలన గలుగగల ధనార్థికాది ఫలితము లెట్టివో చక్కగ పరిశీలించి తమకు నివేదించుట కొరకు రాజస్థాన ఉన్నత న్యాయస్థాన ప్రధాన న్యాయాధిపతియైన శ్రీ జస్టిస్ కె. ఎన్. వాంఛూగారిని నియోగించిరనియు ప్రకటించిరి. అదేప్రకారము జస్టిస్ వాంఛూగారు విచారణ నడపి 1953 ఫిబ్రవరి 7 వ తేదీనాడు తాము తయారుచేసిన నివేదికను కేంద్రప్రభుత్వమువారికి సమర్పించిరి. 1953 మార్చి 25 తేదీనాడు వాంఛూగారి నివేదికపై కేంద్రప్రభుత్వమువారు ఎట్టిచర్యను అమలునకు దేనిశ్చయించినదియు ప్రధానమంత్రిగారు ఢిల్లీపార్లమెంటులో విశదపరచిరి. ఈ విశదీకరణము ప్రకారము శ్రీకాకుళము, విశాఖపట్టణము, పూర్వ పశ్చిమ గోదావరులు, కృష్ణ, నెల్లూరు, చిత్తూరు, కడప, కర్నూలు, అనంతపూరు జిల్లాలును, బళ్లారి జిల్లాలోని ఆదోని, ఆలూరు, రాయదుర్గము తాలూకాలును, చేరిన భూభాగము ఆంధ్రరాష్ట్రమునందు

చేరును. బళ్లారి తప్ప, బళ్లారిజిల్లాలోని తక్కిన తాలూకాలన్నియు మైసూరు రాజ్యములో గలియును; మదరాసు నగరము పరిశిష్ట మదరాసు రాష్ట్రమునకే చెందును. కర్ణాటాంధ్ర సంకీర్ణ జనావాస మగుటవల్లను, తదితర కారణవిశేషములవల్లను, అనాలోచితముగ బళ్లారి తాలూకా విషయమై, తక్షణమే నిర్ణయము సేయుట యుక్తముగాదని యెంచి, కేంద్రప్రభుత్వమువారు హైదరాబాదు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగారైన శ్రీ జస్టిస్ లక్ష్మీశంకర మిశ్రాగారిని, తద్విషయమై విచారణాధికారిగ నియమించిరి. మిశ్రాగారు విచారణ సాగించి, తుదకు బళ్లారి తాలూకా కూడ మైసూరు రాజ్యముననే చేర్పవలయునని నివేదించిరి.

కేంద్రప్రభుత్వమువారు మిశ్రాగారి తీర్పు నొదలధరించినను, జస్టీసువాంఛూగారి నివేదికను సంపూర్ణముగ నంగీకరింపలేదు. ఆంధ్ర రాష్ట్రముయొక్క రాజధానిని బెజవాడ గుంటూరు ప్రాంతములలో నెలకొల్పుట యుక్తమనియు, దాత్కాలికముగ దానికి మదరాసు అభ్యాగతాధివాసముగ నుండవచ్చుననియు, నతఁడు చేసిన సిఫార సును ద్రోసిపుచ్చుటయేకాక, ఆంధ్రులు తమ రాజధాని ఫలాన నగరమని పేర్కొనవలసినదనియు, వారట్లు పేర్కొనినవెంటనే ఆంధ్రరాష్ట్ర నిర్మాణము జరుగగలదనియు, బ్రకటించిరి. అందు మీాద 1953 జూన్ నెలలో మదరాసు శాసనసభలోని ఆంధ్రమండల ప్రతినిధులెల్లరును సమావేశమై, శ్రీ బాగు ఒడంబడిక ప్రకారము రాయలసీమవారు ఆంధ్రరాష్ట్రముయొక్క రాజధాని తమసీమయందే ఉండవలయునని పట్టుపట్టగా, నదేప్రకారము విశాలాంధ్ర మేర్పడు నందాక ఆంధ్రరాష్ట్రమునకు కర్నూలు రాజధానియని నిష్క ర్షించిరి.

తదనంతరము అఖిలభారత ప్రభుత్వమువారు పై వివరింప బడిన రాష్ట్రవిభజన స్థిరమైనదనియు, నచటచట ఆంధ్ర మద్రాసు, ఆంధ్ర మైసూరురాష్ట్రముల మధ్యచిల్లర సరిహద్దు సరుదుబాట్లు సేయు టకు, అవసరమునుబట్టి సరిహద్దు కమిషను లేర్పరుప బడుననియు

దెలియజేసిరి. న్యాయమూర్తులు వాంఛూ మిశ్రాలు సమర్పించిన నివేదికల చొప్పున, కాంస్టిట్యూషన్ చట్టము 3 వ ఆర్టికలు ననుసరించి, ఢిల్లీ పార్లమెంటు సభవారు, మదరాసు మైసూరు శాసనసభల సమ్మతిని, 1953 సంవత్సరమున ఆంధ్రప్రదేశ చట్టమును ప్యాసుచేసిరి. ఆ చట్టప్రకారము 1953 అక్టోబరు మొదటితేదీనాడు నిరవధికముగ నందరి సమ్మతితో రాష్ట్రవిభజనము సాగినది.

ఈ నూతన రాష్ట్రమును 1953 అక్టోబరు మొదటితారీఖు నాటికి అమలులోనికి తెచ్చుటకొఱకు, అఖిలభారత ప్రభుత్వమువారు శ్రీ సి. యమ్. త్రివేదిగారిని ప్రత్యేకాధికారినిగ నియమించిరి. అతనికి సలహా చెప్పుటకొఱకు, చిన్నవిభజన కమిటీ యొకటి యేర్పరుపబడెను. అందు సర్కారు నౌకరులు మాత్రమేకాక, తెన్నేటి విశ్వనాథము, నీలంసంజీవరెడ్డి, గౌతులచ్చన్న మున్నగు ప్రజాప్రతినిధులు సభ్యులై యుండిరి. ఈ సంఘమువారెట్లో పాటుపడి, నియమిత దినము నాటికి ఆంధ్రరాష్ట్రావతరణమునకు దగిన యేర్పాటులను గావించిరి. అఖిలభారత ప్రధానామాత్యులైన పండిత జవహరులాల్ నెహ్రూ గారు, 1953 ఆగస్టు ప్రథమదివసమున కర్నూలుకు విచ్చేసి, క్రొత్త రాష్ట్రముయొక్క ప్రారంభమహోత్సవమును జయవంతముగ కొనసాగించిరి. ఇట్లవతరించిన నూతనాంధ్రరాష్ట్రమునకు ప్రత్యేకాధికారియైన సి. యం. త్రివేదిగారు ప్రథమ గవర్నరుగ నియమింపబడిరి.

## ఆంధ్రరాష్ట్రము 1953-1956

మొదట ఆంధ్రరాష్ట్రముయొక్క రాజ్యాంగమునుగూర్చి ఇంచుక విచారించుట యుక్తము. భరతఖండమందలి ఇతర రాష్ట్రములందు వలె నిచటగూడ గవర్నరు; శాసనసభ, మంత్రివర్గమును రాజ్యాంగమునకు ముఖ్యాంగములు; కాని దేశానుసారముగ నిందు కొంత భేదము గన్పించును. సమిష్టి మదరాసు రాష్ట్రమును బోలి, నూతన ఆంధ్రమునందు లెజిస్లేటివ్ అసెంబ్లీ, లెజిస్లేటివ్ కౌన్సిల్ అనురెండు శాసన సభలు లేవు. ఆ లెజిస్లేటివ్ కౌన్సిలు తమకవసరములేదని ఆంధ్రప్రతినిధు లేకగ్రీవముగా తీర్మానించుటవలన,

ఆంధ్రరాష్ట్ర శాసనసభ, ఏకచక్రముమీదనే నడచుచున్నది. ఈ కారణమువలన, సమష్టి మదరాసు రాష్ట్ర లెజిస్లేటివ్ అసెంబ్లీలోని యాంధ్రసభ్యులకును, మంత్రివర్గములోని వారికిని స్థానభ్రష్టత్వము సంభవించి యుద్వాసనమైనది. క్రొత్తగరాష్ట్రమేర్పడిసను, ఎన్నికలు మాత్రము జరుగలేదు. సమష్టి మద్రాసు శాసన సభలోని ఆంధ్ర ప్రతినిధులే నూతనరాష్ట్ర శాసనసభయందు సభికులై, శాసననిర్మాణ కార్యమును నిర్వహింప గడగిరి. ఈప్రతినిధులు ఒక రాజకీయ కక్షవారుకారు. కాంగ్రెసు, కమ్యూనిష్టు, ప్రజాసోషలిష్టు, కృషక్ లోక్ పార్టీమున్నగు బహువర్గములకు జెందినవారు. వీరిలో కమ్యూనిష్టు లధిక సంఖ్యాకులైనను, మంత్రాంగమునుకూర్చి, ప్రభుత్వము నిరవధికముగ నడుపుటకుదగిన మెజారటీ యేకక్షవారికిని చేకూర లేదు; తమకుగల సంఖ్యాధిక్యము వలన కమ్యూనిష్టు పార్టీవారు పారుపత్యము వహించి, ప్రభుత్వమును హస్తగతము జేసికొని దేశమున తమకక్షను బలపరచుకొని, సముదాయ వాద సిద్ధాంత ములను బాదుకొల్ప దృఢప్రయత్నము సేయుదురను భయము, తక్కిన కక్షుల వారినందరిని - అందును ముఖ్యముగ కాంగ్రెసువారిని బాధింప దొడగినది. దేశమును కమ్యూనిష్టుల బారి బడనీయక, సంరక్షించుట అవశ్యము కర్తవ్యమను భావము కొందరిలో అంకు రించినది. కాంగ్రెసు పక్షమువారు ముందంజవేసి, కమ్యూనిష్టు వర్గమునకు జేరని రాజకీయకక్షులవారితో సంప్రతింపులు సాగించి, సర్వసమ్మతమైన కార్యపథకము నేర్పరచుకొని, తామందర మేకీ భవించి, శ్రీటంగుటూరు ప్రకాశము పంతులవారి నాయకత్వము క్రింద, మంత్రిపరిషత్తును సమకూర్చుకొని, ప్రభుత్వమును నడుపు టకు నిశ్చయించిరి. ఈమంత్రి పరిషత్తునెడ గమనింప దగిన ముఖ్యాంశములు కొన్నికలవు. మొట్టమొదట పేర్కొనదగినది. దీని సంకీర్ణత్వము. ఈ సంకీర్ణత్వమే కాలక్రమమున దీనిమైక్యమును జెడగొట్టి, చిట్టచివర దీని పతనమునకు హేతుభూతమయినది. రెండ వది యుపప్రధానామాత్య పదవీ నిర్మాణము. ఇట్టియుద్యోగము భారతావనిలోని, ఇతర రాష్ట్రములం దెందును గానరాదు. వ్యక్తిగత

కారణములవలన, ప్రత్యేకముగ ఆంధ్రరాష్ట్రమునందిది, నిర్మింప బడినది. ప్రకాశం పంతులుగారు చేరకపోయిన మంత్రాంగ నిర్మాణము దుస్సాధ్యమనిపించినది. ప్రకాశం పంతులుగారు, గాంధిగారి యాధిపత్యము క్రింద స్వతంత్ర సంగ్రామ మారంభమైనప్పటి నుండియు, దక్షిణ భారతములోని దేశీయనాయకులలో నగ్రస్థానము వహించి, స్వతంత్రోద్యమమును నడపిన మహానీయులు. 1947 లో స్వతంత్రోదయమైన పిమ్మట, సమష్టి మద్రాసు రాష్ట్రమునకు ప్రధాన మంత్రియై, కొన్ని నెలలపాటు రాజ్యభారమును నిర్వహించిరి. తరువాత స్వపక్షమువారి కుట్రలవలన, స్థానభ్రష్టత్వమునంది, కాంగ్రెసు పక్షమును త్యజించి, ప్రజాసోషలిష్టు పక్షమున జేరి వారికి నాయకులైరి. ప్రధాన మంత్రి పదము నీ కున్నవారి సహకారము చేకూడదు. కాంగ్రెసు పక్షమువారితర పక్షములవారి నాయకత్వముక్రింద మంత్రాంగము సేయకూడదను నియమమును పాటించుచుండిన కారణమున, వారి యాధిపత్యము నంగీకరించుటకు వలను పడదాయెను. ఈ విషమావస్థను దొలగించి, మంత్రాంగ నిర్మాణమును సుకరము సేయదలపెట్టి, ప్రకాశంపంతులుగారు ప్రజాసోషలిస్టు పక్షమును ద్యజించి, మరలకాంగ్రెసు సభ్యత్వము నంగీకరించిరి; కాని యంతటితో మంత్రాంగ సమస్య తీర్మానము గాలేదు; మంత్రివర్గములో కాంగ్రెసుపక్షనాయకుడైన సంజీవరెడ్డిగారి స్థానమేదియో నిశ్చయింపవలసివచ్చెను. మంత్రాంగము సేయబూనుకొనిన పార్టీలన్నిటిలో కాంగ్రెసు పక్షము సంఖ్యాబాహుళ్యముగలది. అల్పసంఖ్యాక పక్షనాయకు లతనికి సమానస్కంధులని యెంచుట భావ్యము కాదు. కావున నతనిపక్ష బలగమునకు దగినట్లు, అన్యవర్గమంత్రులకంటె నధికమైన పదవి నొకదాని నేర్పాటు సేయుట, సముచితమైనదని నిశ్చయించి ఉపముఖ్య ప్రధాని పదమును గల్పించి యందతనిని సుప్రతిష్ఠితుని కావించిరి. ఈయుపముఖ్య ప్రధానిపదమిట్లు తాత్కాలిక కారణముల మూలమున నేర్పడినను, అది యాంధ్రరాష్ట్ర రాజ్యాంగ విధానమునందు, సుస్థిరముగ బాదుకొను సూచన

లగపడుచున్నవి. (శ్రీ) గోపాలరెడ్డిమంత్రికూటమునందుకూడ నిది యొక ముఖ్యాంగమై యొప్పినది.

ప్రకాశము పంతులవారి పారుపత్యము చాలకాలము సాగలేదు. దీనికి ముఖ్యకారణము కాంగ్రెసు మున్నగు రాజకీయ కక్షలలో నుప్పతిల్లిన యంతర్విభేదములే. 1945–వ సంవత్సరము నవంబరు నెలలో ప్రకాశం మంత్రివర్గ పరిపాలనా విధానముపై దమ యసమ్మతిని ప్రకటించుచు, తత్పూర్వ మా మంత్రివర్గమున కండయై నిలిచి యుండిన ప్రతినిధులు, కొందరు ప్రతిపక్ష వర్గముతో చేతులు కలిపి, శాసనసభయందు తీర్మానమును బ్రతిపాదించిరి. తత్ఫలితముగ ప్రకాశము మంత్రివర్గము కూలిపోయినది. అంతట ప్రతిపక్ష వర్గమువారు మంత్రాంగమును దామేర్పరచి, రాష్ట్రపాలనమును నిర్వహించెదమనియు, దమ కవకాశము కలుగ జేయవలయుననియు గోరిరి; కాని వారిలో కమ్యూనిస్టు లధిక సంఖ్యాకులగుటవలన, రాష్ట్రము వారికి హస్తగత మగుననియు, అట్లయినచో దేశమునకును, ప్రజలకును, ముప్పు వాటిల్లుననియు నెంచి, గవర్నరు త్రివేది గారు కేంద్ర ప్రభుత్వమువారి సలహా ననుసరించి, రాష్ట్రపతిపాలనను ప్రకటించి, తామే యతని పక్షమున రాష్ట్రపాలనము సాగించుచు, క్రొత్త ఎన్నికలను నడపుటకు దగిన యేర్పాటులను సేయగడగిరి. అన్నికక్షలవారును పోటీసేయ నడుముకట్టి, దేశముపై బడి ప్రచారమునకు మొదలు పెట్టిరి. కమ్యూనిస్టుల వలన భయము తక్కిన కక్షలవారిని కలవరపెట్టినది. ప్రజానీకమునందు తమకే యధికమైన పలుకుబడి గలదని యుద్ఘోషించుచుండిన కాంగ్రెసు పక్షమువారికి గూడ, ఎన్నికలందు కమ్యూనిస్టుల నెదుర్కొని జయింపగల మను నమ్మకము లేకపోయెను. కావున ఎన్నికలలో జయమును పొందుటకు ఘనప్రయత్నములు సేయదొడగిరి. మొట్టమొదట కాంగ్రెసునుండి చీలి యేర్పడిన కె. యల్. పి. ప్రజాసోషలిస్టు మున్నగు చిల్లర రాజకీయ కక్షలను కూడగట్టుకొని, యేకముఖముగ కమ్యూనిస్టులను ప్రతిఘటింప దలపడిరి. అంతటితో తృప్తినందక, ప్రజలకు కాంగ్రెసు కార్య పథకమును నచ్చజెప్పి వారివో

కారణములవలన, ప్రత్యేకముగ ఆంధ్రరాష్ట్రమునందిది, నిర్మింప బడినది. ప్రకాశం పంతులుగారు చేరకపోయిన మంత్రాంగ నిర్మాణము దుస్సాధ్యమనిపించినది. ప్రకాశం పంతులుగారు, గాంధిగారి యాధిపత్యము క్రింద స్వతంత్ర సంగ్రామ మారంభమైనప్పటి నుండియు, దక్షిణ భారతములోని దేశీయనాయకులలో నగ్రస్థానము వహించి, స్వతంత్రోద్యమమును నడపిన మహనీయులు. 1947 లో స్వతంత్రోదయమైన పిమ్మట, సమష్టి మద్రాసు రాష్ట్రమునకు ప్రధాన మంత్రియై, కొన్ని నెలలపాటు రాజ్యభారమును నిర్వహించిరి. తరువాత స్వపక్షమువారి కుట్రలవలన, స్థానభ్రష్టత్వమునంది, కాంగ్రెసు పక్షమును త్యజించి, ప్రజాసోషలిస్టు పక్షమున జేరి వారికి నాయకులైరి. ప్రధాన మంత్రి పదము నీకున్నవారి సహకారము చేకూడదు. కాంగ్రెసు పక్షమువారితర పక్షములవారి నాయకత్వముక్రింద మంత్రాంగము సేయకూడదను నియమమును పాటించుచుండిన కారణమున, వారి యాధిపత్యము నంగీకరించుటకు వలను పడదాయెను. ఈ విషమావస్థను దొలగించి, మంత్రాంగ నిర్మాణమును సుకరము సేయదలపెట్టి, ప్రకాశంపంతులుగారు ప్రజాసోషలిస్టు పక్షమును ద్యజించి, మరలకాంగ్రెసు సభ్యత్వము నంగీకరించిరి; కాని యంతటితో మంత్రాంగ సమస్య తీర్మానము గాలేదు; మంత్రి వర్గములో కాంగ్రెసుపక్షనాయకుడైన సంజీవరెడ్డిగారి స్థానమేదియో నిశ్చయింపవలసివచ్చెను. మంత్రాంగము సేయబూనుకొనిన పార్టీలన్నిటిలో కాంగ్రెసు పక్షము సంఖ్యాబాహుళ్యముగలది. అల్పసంఖ్యాక పక్షనాయకు లతనికి సమానస్కంధులని యెంచుట భావ్యము కాదు. కావున నతనిపక్ష బలగమునకు దగినట్లు, అన్యవర్గమంత్రుల కంటె నధికమైన పదవి నొకదాని నేర్పాటు సేయుట, సముచితమైన దని నిశ్చయించి ఉపముఖ్య ప్రధాని పదమును గల్పించి యందతనిని సుప్రతిష్ఠితుని కావించిరి. ఈయుపముఖ్య ప్రధానిపదమిట్లు తాత్కాలిక కారణముల మూలమున నేర్పడినను, అది యాంధ్రరాష్ట్ర రాజ్యాంగ విధానమునందు, సుస్థిరముగ బాదుకొను సూచన

వేయవలయుననియు, నాంధ్రు లుద్ఘోషింపగడగిరి. ఈ సందర్భమున విశాలాంధ్ర సమస్య ముందునకు వచ్చినది.

విశాలాంధ్రమన్నది ప్రస్తుతాంధ్రరాష్ట్రమునందు జేరక, అన్యరాష్ట్రములలో నిమిడియుండు, నాంధ్రప్రదేశముల కన్నిటికిని అనువర్తించినను, కేవలము నిజామురాజ్యాంతర్గతాంధ్ర దేశమునకే సామాన్యవ్యవహారమున చెల్లుచున్నది. ముందు నిజాము పరిపాలన క్రిందనుండిన దేశము, భాషాదృష్టితో కర్ణాటక మరాట్వాడ తెలంగాణములను మూడువిభాగములుగ విభక్తమై యుండినది. వీనిలో తెలంగాణము తక్కినవానికంటె పెద్దది; ధనసంపన్నమైనది. ఆంధ్రోద్యమము ప్రారంభమైనప్పటినుండియు, తెలంగాణమును దక్కిన యాంధ్రదేశముతో సమీకరించి, యేకైకాంధ్రరాష్ట్ర నిర్మాణము జాతీయాభివృద్ధి కత్యంత ఆవశ్యకమను భావము, ఆంధ్ర రాజకీయరంగమున ప్రచారమందుండినను, నిజాము పరిపాలన జరిగినంతకాలమును దానిని క్రియారూపమున అమలులోనికి దెచ్చుటకు, సాధ్యపడదాయెను. కాని 1948 సెప్టెంబరులో అఖిలభారత ప్రభుత్వమువారు నడపిన పోలీసుచర్యకు ప్రతిఫలముగా, నిజాము రాజ్యము కూలి, యతని యేలుబడిలోని రాష్ట్రము భారతదేశము నందు లీనమైపోయినది. విశాలాంధ్రోద్యమము పునరుజ్జీవితమై, ఆధునిక భారతీయ రాజకీయ వ్యవహారములలో నొక గడ్డుసమస్యగ పరిణామమందినది. భాషారాష్ట్రముల నభిలషించు పంజాబు, వంగ, మహారాష్ట్ర, కర్ణాటకాది, అన్యరాష్ట్రప్రజ లీ యుద్యమమునకు దోహద మొసంగిరి; వీరిలో కర్ణాట మహారాష్ట్ర ప్రాంతీయులు ముఖ్యముగ బరిగణింపదగినవారు. గతించిన నిజాము రాజ్యమునం దిమిడియుండిన కర్ణాట మరాట్వాడ జిల్లాలు, ఇప్పటి హైద్రాబాదు రాష్ట్రమును భాషా ప్రాతిపదిక ప్రకారము భగ్నము గావించిన తమకు సంక్రమించునని వీరి యభిప్రాయము. కావున హైదరాబాదు రాష్ట్రమును విభజించి, యందలి తెలుగుజిల్లాల నాంధ్రరాష్ట్రమునకును, కన్నడ మరాటి జిల్లాలను కర్ణాటకులకును, మహారాష్ట్రులకును, బంచియీయవలయుననియు, భారతదేశమునంతటిని ప్రాంతీయ

భాషల ననుసరించి, వేర్వేరు రాష్ట్రములుగ నేర్పరచవలయు ననియు, వీరు వాదింపదొడగిరి.

భాషాప్రయుక్త రాష్ట్రనిర్మాణ ఘోషణ క్రమక్రమముగ బలవత్తరమై దశదిశలను మ్రోగజొచ్చినది; భాషారాష్ట్రవాదుల ప్రభావము కేంద్రప్రాంతీయ రాజకీయములం దధికమై ప్రజల మన శ్శాంతిని భంగపెట్టి, దేశమును కలవరపెట్ట నారంభించినది. కావున కేంద్రప్రభుత్వము వా రీ సమస్య నెట్లయిన పరిష్కారముచేయుట యుక్తమని నిశ్చయించి, 1955 లో శ్రీ ఫజల్ అలీగారి యాజమాన్యము క్రింద యస్. ఆర్. సి. అని ప్రఖ్యాతి నందిన రాష్ట్రపునర్వ్యవస్థీకరణ సంఘము నొకదాని నేర్పరచి, వారిని యావద్భారతభూమి యందెల్లెడలను పర్యటనము సల్పి, యన్నిపక్షముల ప్రజల యభిప్రాయములను బరిశీలించి, తమకు నివేదింపవలయుననియు యాజ్ఞాపించిరి.

యస్. ఆర్. సి. కమిషన్ వారు కేంద్రప్రభుత్వమువారి యా దేశముచొప్పున నానాప్రదేశముల బర్యటనముచేయుచు, భాషాప్రయుక్త రాష్ట్రనిర్మాణవిషయమై విచారణ ప్రారంభించిరి. వీరి విచారణ ఇంకను సాగుచుండగనే, భాషాప్రయుక్త రాష్ట్ర నిర్మాణము సరియైన సంస్కారముగాదని, రాజకార్యమర్మజ్ఞులైన పెక్కండ్రు తమ యభిప్రాయమును వెల్లడిచేసిరి. భాషాప్రాతిపదిక ననుసరించి రాష్ట్రవిభజనము సేయుటవలన, దేశమున మేలుకలుగ దనియు, ననర్థము తప్పక చేకూరుననియు, నక్కాణించిరి. మరియు భాషారాష్ట్రములవలన ప్రజలలో అనాది సిద్ధమై వచ్చుచుండు సౌహార్దము చెడుటయేకాక, ప్రాంతీయ స్థానికాభిమానములు ప్రబలి, ఇరుగుపొరుగువారిమధ్య వైషమ్యములు పెరుగుననియు, తుదకు వీనిమూలమున అఖిలభారత రాజ్యైక్యమునకు భంగము కలుగవచ్చుననియు, దత్కారణమున భాషారాష్ట్ర నిర్మాణోద్యమము వర్జ్యమనియు వాదింపగడగిరి. వీరి యాశంక కారణరహితమైనది కాదు. ఇటీవల దేశమునందు పలుతావులలో నంభవించిన కలహ

ముల కీస్థానిక ప్రాంతీయాభిమానములే మూలకారణములు; కావున అతివాదుల యుద్ఘోషము ఇంకను మిన్నుముట్టుచున్నను, వివేకుల హృదయములలో భాషారాష్ట్రములు హానికరమను తలంపు సుస్థిర ముగా బాదుకొనినది. ఈ యభిప్రాయము యస్. ఆర్. సి. సభ్యుల మన్ననకు పాత్రమైనది. కావున వారు తమ విచారణను పూర్తిచేసి సమర్పించిన నివేదికలో భాషారాష్ట్రములను సంపూర్ణముగ నంగీకరింపరైరి. తత్కారణమున వారు ప్రతిపాదించిన తీర్మానము లొకరీతి నుండక పలువిధముల బరగుచున్నవి. వానిని గూర్చిన చర్చ యిచ్చట ప్రస్తుతముగాదు. కాని ఆంధ్రదేశమునకు సంబం ధించినంతమట్టుకు పరామర్శించుట యుక్తము.

ఆంధ్రతమిళ సరిహద్దుసమస్యను పరిష్కారము సేయుటకు యస్. ఆర్. సి. వారు పూనుకొనలేదు. ఆంధ్ర మద్రాసు రాష్ట్ర ముల మంత్రాంగములవారు తమ రాష్ట్రముల సరిహద్దులను తామే పరిశీలించి తీర్మానము జేసికొనెదమని ప్రకటించిరి. ఆ ప్రకారమే ఇరుపక్షములమంత్రి ముఖ్యులును, మద్రాసునందును, కర్నూలు నందును రెండుమూడు పర్యాయములు సమాగమమై సంప్రతింపులు సాగించిరి; కాని నేటివరకును ఏ తీర్మానమునకును రాలేదు. ఆంధ్రు లీసందర్భమున శాంతచిత్తులై రాబోవు తీర్మానమును ఎదురు చూచుచున్నను తమిళనాటి యతివాదులు బౌండరీకమీషనునేర్పాటు చేయించవలసినదని యాందోళనము సల్పుచున్నారు.

బళ్లారిని గూర్చి యస్. ఆర్. సి. వారు చేసిన తీర్మానము బహుసమంజసమైనదే. ఈ మండలము కర్ణాటక జనభూయిష్ఠమై నను, వాణిజ్యార్థికాది విషయములలో రాయలసీమకు దానితో నత్యంత సన్నిహిత సంబంధముగలదు; ఆంధ్ర జనబాహుళ్యముగల జిల్లాలు కోలారువంటివి కొన్ని మైసూరునందును గలవు. కేవలము భాషాప్రాతిపదికనే యాతచేసికొని, మైసూరువారు, బళ్ళారివారు, అవి తమకు రావలెనని పట్టుపట్టినచో, తమ రాజ్యములోని కోలారు తుముకూరు మున్నగు ప్రదేశములను ఆంధ్రుల కీయవలసివచ్చును.

అట్లగుటవలన బళ్ళారినంతటిని, ఆంధ్రరాష్ట్రమున జేర్చుట సరియని యస్. ఆర్. సి. వారు తీర్మానించిరి. కాని ఈ తీర్మానము కర్ణాట కులకు నచ్చలేదు.

ఆంధ్రదేశ విషయమున యస్. ఆర్. సి. వారు చేసిన తీర్మానములలో ముఖ్యమైనది భాషాప్రాతిపదికపై హైదరాబాదు రాజ్యవిభజనము. హైదరాబాదు రాజ్యమును, అచ్చట జనసామా న్యమునందు వాడుకలోనున్న భాషలనుబట్టి, మూడుభాగములుగ విభజింపవలయునని చెప్పిరి; కాని యచ్చటి కన్నడ మరాటిజిల్లాలను ఐక్యకర్ణాటక, సంయుక్త మహారాష్ట్రములను నూతనముగ నిర్మింప బోవు రాష్ట్రములతో గలుపవలయునని శాసించిరేకాని, తెలంగాణ మనబడు తెలుగుజిల్లాల సముదాయమును, ఆంధ్రరాష్ట్రముతో సమ్మేళన మొనర్పవలయునని చెప్పకపోయిరి. ఇంతేకాక హైదరా బాదు పట్టణము రాజధానిగ తెలంగాణ మూరు సంవత్సరముల కాలము ప్రత్యేక రాష్ట్రముగ నుండవలయుననియు, నా గడువు గడచినపిమ్మట, తెలంగాణాప్రజ సమ్మతించిన యెడల, దానినప్పు డాంధ్రరాష్ట్రములో జేర్చి, విశాలాంధ్ర రాష్ట్రము నేర్పరచుట యుక్తమనియు, ప్రతిపాదించిరి.

ఈ తీర్మానములు కేవలము యస్.ఆర్.సి.వారియొక్క భాషా రాష్ట్రవైముఖ్యమువలన చేయబడినవని యెంచుట పొరపాటు. దాని తోపాటు, ప్రబలమైన స్థానిక కారణములు వారి నీదారి కీడ్చినవి. కన్నడ మరాట్వాడల వారివలె, తెలంగాణప్రజలును ఏక కంఠ్యముగ హైదరాబాదు రాజ్య విచ్ఛిత్తికొప్పుకొనినను, విశాలాంధ్ర నిర్మాణ విషయమై భిన్నాభిప్రాయములను వెలిబుచ్చిరి; కొందరు తెలంగాణ మును ఆంధ్రరాష్ట్రమున జేర్చి విశాలాంధ్రమును నిర్మించుట ప్రజాభి వృద్ధికత్యంతము ఆవశ్యకమని వాదింపగా,కొందరుత టస్థులైయుండిరి; మరికొందరు అదివాంఛనీయము కాదనియు, ఆంధ్రప్రాంతమును, తెలంగాణమును వాని ప్రత్యేకతను, గోల్పోవక, వేర్వేరుగ రెండు

రాష్ట్రములుగ నుండుట మేలుచేకూర్చుననియు, వాదింపసాగిరి. తెలంగాణము తక్కిన ఆంధ్ర దేశముతో నేకముచేసి, విశాలాంధ్ర మును నిర్మింపవలెనని పట్టుపట్టిన వారిలో ముఖ్యులు కమ్యూనిష్టు వర్గమువారు. విశాలాంధ్ర నిర్మాణము వలన తమకక్షయొక్క బలము హెచ్చి, రాష్ట్రీయ మంత్రాంగమును వశపరచుకొని, తమ సిద్ధాంతముల ప్రకారము రాష్ట్రపాలన సాగింపవచ్చునని వారికి దృఢ మైన నమ్మకముగలదు; కావున కమ్యూనిస్టు వర్గమువారు విశా లాంధ్రనిర్మాణముకొరకు పనివడి ప్రచారము సేయదొడగిరి. వీరి తోడ పేర్కొన దగినవారు అఖిల హైదరాబాదు ట్రేడుయూనియన్ వారు. 1954 ఏప్రిలు మాసమున, వీరు హైదరాబాదు నగరమున సమావేశమై, రాష్ట్రవిభజన వెంటనే జరుగవలయుననియు నైక్య కర్ణాట సంయుక్త మహారాష్ట్రములతో బాటు, విశాలాంధ్ర నిర్మా ణము వెంటనే సాగవలెననియు, దానికొరకు కార్మికులందరు కృషి చేయ వలయుననియు దీర్మానించిరి. ట్రేడుయూనియన్ వారికిని కమ్యూనిస్టులకును సన్నిహిత సంబంధముగలదు; కావున వీరి యభి ప్రాయము లొక్కతీరున నుండుట సహజమే. వీరికంటె నెక్కుడుగ బరిగణింప దగినవారు హైదరాబాదు, సికిందరాబాదు నగరముల పురపాలక సంఘమువారు. రాజధానీ నగరవాస్తవ్యు లగుటవలన ప్రజల వాస్తవాభిప్రాయము వీరిముఖాంతర్గతముగ బ్రకటితమగునని యెంచుటభావ్యము. వీరుకూడ 1954 ఏప్రిల్ మాసములోనే సమా వేశమై, హైదరాబాదు రాజ్యమును భాషాప్రాతిపదికానుసారము విభజించి, హైదరాబాదు ముఖ్యనగరముగ విశాలాంధ్రమునుకోరిరి. ఈ సందర్భమున విశాలాంధ్ర సభవారిని పేర్కొనుట యుక్తము. వీరిలో పెక్కండ్రు హైదరాబాదు ప్రముఖులు, సభికులై యున్నను అధికసంఖ్యాకు లాంధ్రరాష్ట్రమువారే కావున, వీరికి పలుకుబడి చాలదు; దార్ఢ్యముతక్కువ—కావున వీరి యాఘోషణ చాలావర కరణ్యరోదనమైనది. తెలంగాణా ప్రజలలో ననేకులు వీరియుద్యమ మునకు దోడ్పడక మొండొడ్డిరి. విశాలాంధ్ర నిర్మాణము, తెలం గాణ పురోభివృద్ధికి సహకరింపదని వీరిభావము. విశాలాంధ్రోద్య

మమును ప్రతిఘటించిన వారిలో ముఖ్యులు హైదరాబాదు పరిషత్తు వారు. ఇది నూతనముగ నేర్పడిన సంస్థ- తెలంగాణనాయకులు కొందరును, సోషలిస్టు నాయకులు కొందరును, కొన్ని కారణముల వలన ఈ సభనుకల్పించి, విశాలాంధ్రము కూడదను వ్యతిరేక ప్రచారమును ప్రారంభించిరి. అఖిలభారత ప్రభుత్వమువారు యస్. ఆర్. సి. ని నియమించినపిమ్మట వీరు తమ యభిప్రాయము లను ప్రకటించి, విశాలాంధ్రరాష్ట్రము నేర్పడనీయక భగ్నము సేయుటకది మంచితరుణమనియెంచి, పై బేర్కొనిన హైదరా బాదు పరిషత్తును లేవదీసి తీవ్రముగ నాందోళనము సేయ దొడగిరి. వీరి ప్రతిఘటనకు ముఖ్యకారణము విశాలాంధ్రమువచ్చి నచో అన్యప్రదేశములవారు, అందును ప్రధానముగ సర్కారుల వారు, అధికారస్థానముల నాక్రమించుకొనెదరనియు, దత్కారణ మువలన దమప్రాంతముయొక్క ప్రాముఖ్యము సన్నగిల్లిపోవుననియు, భయము. ఆర్థికవిద్యావిషయములలో తెలంగాణ మాంధ్రదేశ మందలి యన్యప్రాంతములకంటె వెనుకబడియున్నది. విశాలాంధ్ర మేర్పడిన యెడల, సర్వవిషయములందును పారుపత్యము తమ చేతుల నుండి జారిపోయి, అన్యప్రదేశములవారికి హస్తగతమగును. కాబట్టి హైదరాబాదు రాజ్యవిభజనము, తదుపరి విశాలాంధ్ర నిర్మాణ మును, కొంతకాలమువరకైన ఆపిపెట్టుట యుక్తమని వీరు బోధింప దొడగిరి. వీరికి కొంతమట్టుకు రాయలసీమ నాయకులు మార్గదర్శకు లని చెప్పకతప్పదు. ఆంధ్రరాష్ట్రావతరణమునకు పూర్వము వారను సరించిన పంథకూడ ఇట్టిదే. రాయలసీమవలెనే, తెలంగాణము కూడ వెనుకబడి యున్నదనియు, విశాలాంధ్ర మేర్పడినట్లైన, రాయలసీమవారు తెలంగాణ ప్రజలతో నేకీభవించి, సర్కారుల వారిని అదుపులో నుంచవచ్చునని కొందరు తలచిరి. ప్రజాసోషలిస్టు కక్షవారు, హైదరాబాదు పరిషత్తును త్రోసి రాజనిపించిరి. పరిషత్తు వారు విశాలాంధ్ర నిర్మాణమును గొంతకాల మాపిపెట్టవలసినదని కోరగా, ప్రజాసోషలిస్టులు విశాలాంధ్రమేవలదు, తెలంగాణము స్వతంత్రరాష్ట్రముగ వర్ధిల్లవలయునని యాక్రోశింపగడగిరి; కాని

వారిలో వారికే పొత్తుకుదరక పోయినది. కావున కర్నూలునగర మున 1954 మార్చిలో జరిగిన అఖిలాంధ్ర ప్రజాసోషలిస్టు సమ్మేళ నమున, ఆంధ్రరాష్ట్ర ప్రతినిధులును, హైదరాబాదు ప్రతినిధులును ఒకదారికి వచ్చి, విశాలాంధ్ర నిర్మాణమున కొప్పుకొనిరి. కాని తెలంగాణాంధ్రుల శంక నిర్హేతుకముగాదనియు, దత్కారణమున వారికి గొన్ని 'హామీల'నిచ్చుట యావశ్యకమనియు దీర్మానించిరి. ఇట్లు ఆంధ్ర తెలంగాణనాయకులు పాలుపోక, భేదాభిప్రాయములను వెలిబుచ్చుటవలన యస్. ఆర్. సి. సభ్యులు తమ నివేదికయందు విశాలాంధ్ర విషయమై పై జెప్పినట్లు తీర్మానము గావించిరి.

యస్. ఆర్. సి. సభ్యులు తమ విచారణను పూర్తిచేసి, నివేదికను సిద్ధపరచి, అఖిలభారత కేంద్రప్రభుత్వమువారికి సమర్పించిరి. దానిని వార్తాపత్రికలలో ప్రచురించి, ఢిల్లీపార్లమెంటులో ప్రవేశపెట్టిరి. సాధ్యమగునంతమట్టుకు గొప్పమార్పులు చేయక, యస్. ఆర్. సి. తీర్మానముల నట్లే గ్రహించి యమలులోనికి దెచ్చెదమని ప్రకటించిరి. అనగా విశాలాంధ్ర విషయమున యస్. ఆర్. సి. వారి సిద్ధాంతముల నంగీకరించి, ఆంధ్రరాష్ట్రము, తెలంగాణము అను రెండు ప్రత్యేకరాష్ట్రములను నిర్మింప వీరుద్యుక్తులై యున్నారని ఇందువలన వ్యక్తపడెను. యస్. ఆర్. సి. తీర్మానములు పత్రికా ప్రపంచమున తీవ్రమైన విమర్శకు గురియైనవి. రాజకీయ రంగమున, భాషారాష్ట్ర వాదప్రతివాదములు ప్రబ్బుకొనెను. అఖిలభారత కాంగ్రెసు కార్యవర్గమువారు, 1956 జనవరినెలలో గుజరాతు, మహారాష్ట్ర బొంబాయి నగరముల పరస్పర సంబంధ స్వభావములను చర్చించి, నిర్ణయించుటకై సమావేశమై, బొంబాయి నగరము అటు గుజరాతులోగాని, ఇటు మహారాష్ట్రములోగాని, గలియక ప్రత్యేక రాష్ట్రముగ నుండవలయుననియు, యస్. ఆర్. సి. వారు ప్రతిపాదించినట్లు విదర్భను ప్రత్యేకముగ నొక రాష్ట్రముగ నిర్మింపక, మహారాష్ట్రముతో జేర్చి సంయుక్త మహారాష్ట్ర మనుపేర నేకైకరాష్ట్రము నొకదానిని రూపుగొల్పవలయుననియు,

దీర్మానించిరి. ఇట్లు విదర్భను దక్కిన మహారాష్ట్ర దేశముతో సమ్మే ళనముగావించి, సంయుక్త మహారాష్ట్రనిర్మాణమున కంగీకరించుట వలన, అఖిలభారత జాతీయసభా కార్యనిర్వాహకవర్గముకూడ విశా లాంధ్రమున విముఖులు గాజాలరని తెల్లమైనది. ఈమాసముననే ఢిల్లీ పార్లమెంటు సభలలో, రాష్ట్రపునర్నిర్మాణ సమస్యచర్చకువచ్చి నది. అప్పుడా చర్చలో పాల్గొనిన ప్రతినిధులయం దధిక సంఖ్యాకులు భాషాప్రాతిపదిక ననుసరించి, హైదరాబాదు రాజ్యమును విభజించి, విశాలాంధ్రను వెంటనే నిర్మించుట యావశ్యకమను నభిప్రాయమును వెలువరించిరి; కాని కొందరు రాజకీయ మర్మవేత్తలు ప్రత్యేక తెలం గాణ వాదమునకు దోహదము చేయుటవలన, దేశమున కొంత కల వరము పుట్టినది. వీరు చేయనారంభించిన ప్రచారమును ప్రతిఘ టించి, విశాలాంధ్రమునుగూర్చి లోకులలో వరలుచుండిన యపో హలను దొలగించు నుద్దేశముతో, 1956 జనవరి తృతీయవారమున హైదరాబాదులో నొకగొప్ప బహిరంగసభ కూడినది. కొన్నివేల జనులు సమావేశమైరి. సుప్రసిద్ధ ప్రజానాయకులు ఆ సమావేశమున పాల్గొని, విశాలాంధ్ర నిర్మాణావశ్యకతను, వివరించి చెప్పిరి. జయ జయ ధ్వానములతో నా పేరోలగము సమాప్తినందినది. తరువాత నగరమునందొక పెద్ద యూరేగింపు జరిగినది. వెంటనే విశాలాంధ్ర మేర్పడవలయునను నినాదములు, నగరమునందెల్ల యెడల వినవచ్చి నవి. ఇందుమూలమున హైదరాబాదు వాస్తవ్యులు విశాలాంధ్రము నెడ విముఖులుగారని రుజువైనది.

ఇంతలో నూతన భావమొకటి ప్రభవించి, సత్వరమ భారతీయ రాజకీయరంగమున నలముకొనినది. అదిమన ప్రధానమంత్రి నెహ్రూ గారి చిత్తవికాసజన్యము. భాషారాష్ట్రములయెడ ఆయన కభి మానము తక్కువ. చిన్న చిన్న భాషారాష్ట్రములమాట నటుండ నిచ్చి, దేశమును బహుభాషాయుక్తమైన యైదు పెద్దరాష్ట్రములుగ నిర్మించిన శ్రేయస్కరమని, ప్రసంగవశమున పార్లమెంటుసభలో వక్కాణించిరి. ఎంతలఘువుగ జెప్పినను మహనీయుల వాక్యములు వ్యర్థముగాజాలవుకదా. నెహ్రూగారినాలుక తుదనుండి యామాటలు

దొరలెనో లేదో, బంగాళ బీహారు రాష్ట్రముల ముఖ్యమంత్రులైన బి. సి. రాయ్, శ్రీకృష్ణసింహాలు 'తథాస్తు! తథాస్తు' అని పలికి, తమ రెండురాష్ట్రముల సమ్మేళనకంగీకరించిరి; కాని యటుపిమ్మట వంగదేశమున జరిగిన అవాంతరపు ఎన్నికలో, పై చెప్పబడిన రాష్ట్ర సమ్మేళనము జనసమ్మతముగాదని తేలుటవలన, వారు తమ పూని కను వీడవలసివచ్చెను. తమిళ, కర్ణాటక ప్రాంతములను గలిపి, దక్షిణ ప్రదేశమనుపేర పెద్దరాష్ట్రము రూపొందజేయవలయునని దాక్షి ణాత్యనాయకులు కొందరు వాదింపదొడగిరి. తమిళులలో పలువుర కిది రుచింపలేదు. వారు తమిళ ద్రావిడ కర్ణాటప్రాంతముల సమ్మేళ నమునకు విముఖులు. ఈ విషయమున ఆంధ్రులు కొందరు పండిత నెహ్రూగారి ప్రతిపాదనను బలపరచిరి. మహారాష్ట్రాంధ్రములను గలిపి ఏకరాష్ట్రముసేయుట యుక్తమని ఆంధ్ర ప్రధానమంత్రి సెలవిచ్చిరి; తెలంగాణాంధ్ర కర్ణాటకముల కూడిక బహుసమంజస మని హైదరాబాదు ప్రధానామాత్యులవా రభిప్రాయపడిరి. మరి యొక అయ్యగారు తెలంగాణాంధ్రోత్కళ సంయోగమే అభిలష ణీయ మనిరి. నాయకులెన్ని పోకలబోయినను, జనసామాన్యమున కిది రుచింపలేదు; వారి హృదయము భాషారాష్ట్రమునందే లగ్నమై యుండుటచేత, క్రొత్తదారుల నడువ నిచ్చగింపదాయె. తత్కారణ మున రానురాను విశాలాంధ్ర పక్షము ప్రబలము కాజొచ్చెను; కాని ప్రత్యేక తెలంగాణావాదులు తమ పట్టుదలను వదలక, తమ యావచ్ఛక్తిని వినియోగించి, పోరాడగడగిరి. ఉభయపక్షముల వారును ఢిల్లీకి పెక్కు తడవలు ప్రయాణముజేసి, కేంద్రప్రభుత్వము వారికి తమతమ వాదములను వివరించి తెలియజెప్పిరి; కేంద్రప్రభుత్వ ప్రముఖులు కొందరు తెలంగాణమునకు వచ్చి యచ్చటి వాస్తవ స్థితిగతుల నరసిపోయిరి; ప్రత్యేక తెలంగాణవాదుల నెట్లైన తృప్తి పరచి, విశాలాంధ్రమును వెంటనే నిర్మించుట సమంజసమను భావము కేంద్రప్రభుత్వవర్గమునకు గలిగెను. 1956 ఫిబ్రవరి నెలలో అమృత సరస్సునందు జరిగిన అఖలభారత కాంగ్రెసు మహాసభలో, పెద్ద రాష్ట్రముల నిర్మాణము దేశాభ్యుదయమునకు ఆవశ్యకమని తీర్మా

నింపబడెను. తరువాత కాంగ్రెసు సభకుబోయి యుండిన హైదరా బాదు నాయకులను ఢిల్లీకి బిలిపించి, తగిన రక్షణలతో తెలంగాణమును ఆంధ్రరాష్ట్రములో గలిపివేయుట సమంజసమని తీర్మానముగావించిరి. సర్కారు ఉద్యోగములందును, విద్యావైద్యాభివృద్ధి ప్రణాళికలలోను, తెలంగాణమువారి కాంధ్రరాష్ట్రమువారు తగినరక్షణల నీవలయును. ఆ రక్షణలను గాపాడుటకు ఒక ప్రత్యేక ప్రాంతీయసభను ఏర్పాటు చేయవలయును; సంయుక్తరాష్ట్రమునకు 'ఆంధ్ర తెలంగాణా' యను పేరుపెట్టవలయును; దానికి హైదరాబాదుపట్టణము రాజధానిగ నుండవలయును; అచ్చటనే ఉన్నత న్యాయస్థానమును; కేంద్రప్రభుత్వ కచ్చేరీలను నెలకొల్పవలయును. ఈ కట్టుబాట్లకు బద్ధులగుట కాంధ్రరాష్ట్రమువా రంగీకరించిరి. అంతట 1956 మార్చి నెలలో అఖిలభారత ప్రధానమంత్రి పండిత జవహర్‌లాలు నిజామాబాదుకు వచ్చియుండినప్పు డిచట జరిగిన గొప్ప బహిరంగ సభలో అఖిల భారత కేంద్రప్రభుత్వమువారు విశాలాంధ్రమును ఏర్పాటుసేయ నిశ్చయించిరని ప్రకటించెను. ఇక విశాలాంధ్రము వచ్చుననుట కావంతయేనియు సందియము లేదు. అంతరాయములన్నియు దొలగిపోయినవి. కాని 'ఆంధ్ర తెలంగాణ' నామముమాత్ర మించుకంత యసంతృప్తికి కారణభూతమైనది; గంగాయమునావాహినుల సంగమస్థానమందలి నల్లచారవలె నది యాంధ్ర తెలంగాణముల ఐక్యమునుగాక విభక్తతను సూచించుచు, వాదప్రతివాదములకు తావలమాయెను. చిట్టచివరకు ఉభయపక్షములవారును దానిని విసర్జించి 'ఆంధ్రప్రదేశ్' అనెడు నూతన నామమును స్వీకరించిరి. ఇట్లు సర్వసమస్యలును పరిష్కారములైపోయినవి. పార్లమెంటువారిచే నియమింపబడిన కాలమున విశాలాంధ్రము తప్పకరాగలదు. అప్పుడే హైదరాబాదునందును, ఇతరస్థలములందును తగుప్రయత్నములు జరుగుచున్నవి. పార్లమెంటువారు నియమించినట్లు 1956 నవంబరు 1 వ తేదినాడు ఆంధ్రప్రదేశ మవతరించినది. ఆదినము అఖిలభారత ప్రధానమంత్రివర్యులైన పండిత జవహరులాల్ నెహ్రూగారు ఢిల్లీనుండి హైదరాబాదుకు

వచ్చి నూతన రాష్ట్రము ప్రారంభమహోత్సవమును సాగించెను. తత్పూర్వము హైదరాబాదు రాజ్యమునకు పాలకుడై యుండిన రాజప్రముఖు పదవి అంతటితో రద్దయిపోయెను. ఆంధ్రరాష్ట్రము యొక్క గవర్నరుగనుండిన త్రివేదియే ఆంధ్రప్రదేశమునకు సమస్తమునకును పరిపాలకుడుగ నియమింపబడెను. దేశపాలన కార్యమును నిర్వహించుటకు పదమువ్వురు మంత్రులతో గూడిన మంత్రి సభ యేర్పడెను. ప్రస్తుతము ప్రజాప్రతినిధుల సభయొక్కటియే శాసననిర్మాణ కార్యమును నిర్వహించుచున్నది. అదియొకటి చాలదనియు దానితోపాటు శాసననిర్మాణ కార్యమును జరుపుటకు కౌంసిల్ ఒకటి కావలయుననియు ప్రజాప్రతినిధి సభవార లేకగ్రీవముగ నొక తీర్మానమును గావించి కేంద్రప్రభుత్వమునకు బంపిరి. అందుకు వారు సమ్మతించెదమని చెప్పియుండుటచేత సత్వరముగ ప్రజాప్రతినిధి సభతోపాటు లెజిస్లేటివుకౌన్సిలుగూడ ఏర్పడగలదు. ఇట్లు చిట్టచివరకు ఆంధ్రప్రదేశము ఏర్పడినను, ఆంధ్ర భూమి సమస్తమును, దానియేలుబడిక్రింది కింకను రాలేదు. ద్రావిడోత్కళకర్ణాటములలో తెలుగుసీమ లనేకములు గలిసియున్నవి. అవియన్నియు నాంధ్రప్రదేశమున జేరువరకు భాషాప్రయుక్త రాష్ట్రము సంపూర్ణరూపమును పొందెనని తలచుటకు వీలుకాదు.

"గోభూప్రజాభ్యః శుభమస్తు నిత్యమ్"



# ఆంధ్రప్రజల పురోగమనము

(1) 1953 అక్టోబరు ఒకటవ తేదీనాడు ఆంధ్రరాష్ట్ర మేర్పడినట్లును, సుమారు మూడుసంవత్సరముల తర్వాత - అనగా- 1956 వ సంవత్సరము నవంబరు ఒకటవ తేదీనాడు ఆంధ్రప్రదేశ రాష్ట్ర మేర్పడినట్లును, మనము చూచియున్నాము. ఆంధ్రప్రజానీకమునకు ప్రత్యేక రాజకీయ వ్యక్తిత్వమేర్పడి సుమారు ఒక దశాబ్ది గడచినది. ఈపదిసంవత్సరములలో ఆంధ్రప్రజలెట్టి యభివృద్ధి కావించి యున్నారో ఇంకను ఎట్టి అభివృద్ధి సాగించుటకు వారికి సావకాశముకలదో, పరిశీలించవలసిన యావశ్యకత ఇచ్చటకలదు. భారతజాతీయ నాయకులలో అగ్రగణ్యులైన పండితజవాహర్లాలు నెహ్రూగారీ సందర్భమున ప్రకటించిన అభిప్రాయము ముఖ్యముగ గమనింపదగియున్నది. "ఈదశాబ్దములో ఆంధ్రులనేక రంగములలో అభివృద్ధి సాధించినారు. అయితే ఇంతకంటె ముఖ్యవిషయ మేమనగా-ఈఅభివృద్ధి భావిదశయందు వారితోధికాభివృద్ధిని పొందగలరను విశ్వాసము కలుగజేయుచున్నది." అని వారు 1963 లో సెలవిచ్చినారు. వారియభిప్రాయమును ఆంధ్రప్రజలు ఆశీస్సుగ భావింపదగును.

(2) ఆంధ్రరాష్ట్ర మేర్పడినకాలమున (1953) భారత ప్రభుత్వమువారును, రాష్ట్రీయ ప్రభుత్వములవారును, మొదటిపంచవర్ష ప్రణాళికను అమలుకావించుచుండిరి. ఈ ప్రణాళిక ప్రకారము ఆంధ్రరాష్ట్రమునకు రావలసిన వాటా 54 కోట్ల 71 లక్షల రూపాయలు. ఈ మొత్తమును మరికొంతకాలమునకు 64 కోట్ల 32 లక్షల రూపాయలకు పెంచిరి. ఈమొత్తము నీటిపారుదల సౌకర్యములు, శక్త్యుత్పాదనము, సామాజికాభివృద్ధి వ్యవసాయము, రవాణా సౌకర్యములు, పరిశ్రమలు-వీని అభివృద్ధికై వినియోగింపబడినవి. ఆంధ్రప్రభుత్వము వారును, ప్రజలును, ప్రణాళికాకార్యక్రమమును అమలుచేయుటలో మిక్కిలి ఉత్సాహమును, కార్యాచరణపాటవ

మును, ప్రదర్శించి, ప్రణాళికా నిర్మాతలు తమకొసంగిన ధనము నంతను వినియోగించిరి. అంతేకాదు. కొంతవరకు వారు నిర్ణీతధన మునకు మించిన అభివృద్ధిపథకములకూడ చేపట్టిరి. ఆంధ్రరాష్ట్ర ములో రాయలసీమ ప్రాంతము ఆర్థికముగను, తదితర విధములు గను వెనుకపడియుండుటవలన, దాని అభివృద్ధికొరకై ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వము ప్రత్యేకశ్రద్ధ పూనినది. అందులకై కొన్నికోట్ల రూపా యలు వ్యయముచేసినది. ప్రభుత్వమువా రవలంబించిన విధానము వలన 1955-56 నాటికి ఒకకోటి డెబ్బదినాలుగు లక్షల ఎనుబదివేల ఎకరముల సాగుబడి భూమి ఒకకోటి ఎనుబదినాలుగు లక్షల డెబ్బది వేల యెకరములకు పెరిగినది. ఇదేకాలములో నీటిపారుదలసౌకర్య ములు 4,990,000 ఎకరములకు మారు 5,890,000 యెకరములకు లభించుట ప్రారంభించెను. ఆంధ్రరాష్ట్రమేర్పడుటకు పూర్వమీజిల్లా లలో 30,760,000 టన్నుల వ్యవసాయపు దినుసులుపండుచుండెను. 1955-56 నాటికి అవి 39,340,000 టన్నుల వరకు పెరిగెను. ఆంధ్ర రాష్ట్ర మాహారవిషయమున స్వయంపోషక మగుటయే కాక ఇతర రాష్ట్రములకు తిండిదినుసుల నెగుమతిచేయగల స్థితికి వచ్చెను. వర్ణింపబడుచున్న ఈ కాలములో ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులు, శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగార్లు ఆంధ్రరాష్ట్రమునకు ముఖ్యమంత్రులుగ నుండిరి. అత్యంత సమర్థులైన వీరి ప్రోత్సాహము వలన నీటిపారుదలకొరకును, శక్త్యుత్పాదనముకొరకును, చక్కని పథకములు వేయబడెను. కృష్ణా బారేజి, తుంగభద్ర దిగువ కాలువ, ఎగువ పెన్నారుప్రాజెక్టు, భైరవానితిప్ప ప్రాజెక్టు అను పథకములు ప్రారంభింపబడెను. ఈ కాలములోనే మాచ్ ఖండు జల విద్యు త్కేంద్ర పథకము పూర్తిఅయ్యెను. ఇందువలన ఆంధ్రరాష్ట్రమునకు తొల్లింటివలె 21,000 కిల్లోవాట్ల విద్యుచ్ఛక్తి కాక 62,000 కిల్లో వాట్ల విద్యుచ్ఛక్తి లభింపసాగెను. 1955-వ సంవత్సరమున ఆంధ్ర హైద్రాబాదురాష్ట్రములు రెండును కూడి, నాగార్జునసాగర బహుళార్థసాధక పథకమును ప్రారంభించెను. ఈ యభివృద్ధి సంతృప్తికరమైనదని యంగీకరింపవచ్చును. కాని విద్య, వైద్య

సహాయము మున్నగు సామాజికాభివృద్ధి రంగములలో నూతనాంధ్ర రాష్ట్రము తగినంత పురోగమనము చేయజాలకపోయెను. పరిశ్రమాభి వృద్ధికూడ ఏమంత విశేషముగ సాగలేదు.

(3) 1956-వ సంవత్సరము నవంబరున ఆంధ్రప్రదేశ రాష్ట్ర మేర్పడుట ఆంధ్రజాతి చరిత్రలో అతిముఖ్యఘట్టము. చారిత్రిక కారణములవలన ఒకరినుండి ఒకరు వేరైన మద్రాసు రాష్ట్రము నందలి ఆంధ్రులును, తెలంగాణా ఆంధ్రులును శతాబ్దుల తరువాత ఒక్క ప్రభుత్వమువారి యేలుబడిలోనికి వచ్చినారు. ఆంధ్రజీవన స్రవంతి పరిపూర్ణతనంది, ఏకముఖముగ ప్రవహించుచున్నది. భౌ గోళికముగను, చారిత్రికముగను, జాతీయసమైక్యతా విషయము నను, మిక్కిలి విఖ్యాతిచెందిన హైదరాబాదు నగరము ఆంధ్రప్రదే శమునకు రాజధాని యైనది. స్వల్పముగు అభిప్రాయభేదములును, అసూయలును, పోటీలును, ఉన్నను ఆంధ్రప్రాంతపు ప్రజలును, తెలంగాణా వాసులును, ఒకరిలో ఒకరు లీనమై పోవుచున్నారు. ఆంధ్రప్రాంతపు నాయకులును, తెలంగాణా నాయకులును, ఆంధ్ర ప్రజానీకముయొక్క సమైక్యతకొరకై సర్వవిధముల పాటుపడు చున్నారు. వారి కృషి తప్పక ఫలవంతము కాగలదు. పరిపాలనా విధానములో ఆంధ్ర తెలంగాణా ప్రాంతములలో గల విభేదములు మాయమై, ఏకైక ప్రభుత్వ విధాన మావిర్భవించుచున్నది. *ఈ రెండు ప్రాంతములును, ఆర్థికముగ సంయోగము చెందుటచే ఆంధ్ర ప్రదేశ రాష్ట్రము వ్యవసాయము, పరిశ్రమలు మున్నగు రంగము లలో చాల అభివృద్ధిని సాధింప గలుగుచున్నది. 1955-56 సంవత్స రములో ఈ రాష్ట్రముయొక్క మొత్తము ఆదాయము 920 కోట్ల రూపాయలు. ఆ ఆదాయము 1960-61 నాటికి 1062 కోట్లకు పెరు

*భూసంస్కరణలు, సహకారోద్యమము, పంచాయతీ పరిపాలనము, పుర పాలక సంఘవ్యవస్థ, విద్యావిధానములలో ఆంధ్ర తెలంగాణాలు రెండును క్రమ క్రమముగ ఒకే పంథలోనికి వచ్చుచున్నవి. కాని మద్యపాన నిరోధవిషయమున నీప్రాంతములకేకత్వ మేర్పడలేదు. తెలంగాణాలో మద్యపాననిరోధ మమలు లోనికి రావలసియున్నది.

గుట ప్రత్యేకముగ గమనింపదగియున్నది. రెండవ పంచవర్ష ప్రణాళికలో ఆంధ్రరాష్ట్రమునకు లభించిన సహాయపు మొత్తము 181 కోట్లు. మూడవ ప్రణాళికలో మన రాష్ట్రమునకు లభించుచున్న సహాయము 305 కోట్ల రూపాయలు. ఈ విధముగ లభించుచున్న అధిక ధనసహాయమువలన వ్యవసాయము ముఖ్యముగ చెప్పదగిన యభివృద్ధిని పొందినది. 1960-వ సంవత్సరమున నీరాష్ట్రమున నాహారధాన్యముల యుత్పత్తి 69 లక్షల టన్నులు, మూడవ పంచవర్ష ప్రణాళిక పూర్తియగునప్పటికి ఆహారపు దినుసులు 99 లక్షల 50 వేల టన్నులవరకు పెరుగగలదని ఆర్థిక నిపుణుల అంచనా. నూతన వ్యవసాయ పద్ధతులను అవలంబించుట ద్వారా ఈ ఉత్తమ పరిణామము సంభవించినది. పశ్చిమగోదావరి జిల్లాలో వరిపంట నూటికి 40 నుండి 50 వరకు హెచ్చినది. చెరకు, మిరపకాయలు, అరటి పండ్లు మొదలైన వ్యాపారపు దినుసుల ఉత్పత్తి నూటికి 20, 25 పాళ్లు పెరిగినది. నూతన వ్యవసాయ పద్ధతులను 1963 నుండి చెరకు, ప్రత్తి, నూనె గింజలు మొదలైన వర్తకపు సరకుల ఉత్పత్తికై వినియోగించుచున్నారు. 1962-వ సంవత్సరమున చీనా కమ్యూనిస్టు ప్రభుత్వము భారత భూమిపై దురాక్రమణ జరుపుటవలన మన దేశములో ప్రమాదపరిస్థితి యేర్పడినది. ఈ పరిస్థితిలో ఆహారవస్తువుల అభివృద్ధి ఎంతయో అవసరము. అందుకొరకై మన ప్రభుత్వము నీటిపారుదల సదుపాయములను హెచ్చు కావించుటకై ప్రత్యేక కృషి సాగించుచున్నది. మధ్యతరగతి నీటిపారుదల పథకముల కీనాడు ప్రత్యేక ప్రోత్సాహము లభించుచున్నది. బావుల త్రవ్వకముకొరకై ప్రభుత్వము రైతులకు ఒక్కబావికి 2000 రూపాయల చొప్పున ఋణము, మంజూరు చేయుచున్నది. ఆంధ్ర ప్రదేశరాష్ట్ర మేర్పడి, ప్రభుత్వము నెరపుచున్న ఈ ఏడెనిమిది సంవత్సరములలో 10 పెద్ద తరహా నీటిపారుదల పథకములును, 33 మధ్యతరహా పథకములును చేపట్టబడినవి. వీనివలన సర్కారు జిల్లాలు, తెలంగాణము, రాయలసీమ ప్రాంతములు మూడును కూడ లాభమును పొందగలవు. పై పథకములు చాలవరకు పూర్తియైనవి. ప్రస్తుతము

ఆంధ్రప్రదేశ రాష్ట్రములో నిర్మాణమగుచున్న నాగార్జున సాగరపు ఆనకట్ట ఈ రాష్ట్రమునకే కాక యావత్తు భారతదేశమునకును కూడ గొప్ప ఆర్థిక పుష్టినీయగల మహదారంభము. ఈ ఆనకట్ట నిర్మాణము పూర్తియైననాడు ఈ రాష్ట్రమందలి ముప్పదిలక్షల ఎకరముల భూమికి నీటిపారుదల సౌకర్యములు లభించును. కాని ప్రస్తుత మియ్యది నిర్మాణదశలో నుండుటచే ఆంధ్రప్రదేశ ప్రభుత్వమునకు సాలుకు పదికోట్ల రూపాయల ఖర్చుమాత్రము కానవచ్చుచున్నది. ఈ పథకము కాక తుంగభద్ర ఎగువకాలువ పథకమును, పోచంపాడు ఆనకట్ట పథకమును ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువారు చేపట్టియున్నారు. ఇందు మొదటిది రాయలసీమకును, రెండవది తెలంగాణమునకును వ్యవసాయాభివృద్ధి విషయములో విస్తారముగ తోడ్పడగలవు.

(4) ఆంధ్రప్రదేశ రాష్ట్రము వ్యవసాయాభివృద్ధి విషయములో ఇతర రాష్ట్రములకంటె పైచేయిగనున్నను, పారిశ్రామికాభివృద్ధిలో మాత్రము వెనుకపడియున్నది. 1953 కు పూర్వమిచ్చట చెప్పదగిన పారిశ్రామికాభివృద్ధి యేదియు జరుగలేదు. ఈ లోటు ఆంధ్రరాష్ట్రమందును, ఆంధ్రప్రదేశ రాష్ట్రమందును కూడ స్పష్టముగ కానవచ్చుచున్నది. ఈ రాష్ట్రమునందు వ్యవసాయ మభివృద్ధిదశలో నున్నదికావున ఇచ్చట వ్యవసాయఫలితములగు ముడిదినుసుల నాధారముగ చేసికొని, చిన్నతరహా పరిశ్రమలును, కుటీర పరిశ్రమలును, పెంపుచెందుట ప్రజాక్షేమముదృష్ట్యా యెక్కుడు వాంఛనీయమని ఆర్థికనిపుణు లభిప్రాయపడుచున్నారు. ఇట్టి పరిశ్రమలవలన వృత్తినిపుణులైన కార్మికులకును, గ్రామసీమలందు నివసించు వ్యవసాయ కుటుంబములకును కూడ చేతినిండ పని లభించి, వారి ఆర్థిక క్షేమము సాధింపబడును. ప్రస్తుతము మన రాష్ట్రములో ప్రభుత్వరంగమున రాజమహేంద్రవరములోని కాగితపు మిల్లులును, గూడూరులోని పింగాణీ కర్మాగారమును, హైద్రాబాదులోని ప్రాగాటూల్సు కర్మాగారమును ఉన్నవి. రాజమహేంద్రవరములోని కాగితపు మిల్లులను మన ప్రభుత్వమువారు ప్రైవేటు పారిశ్రామికరంగములోనికి మార్చ

పలెనని తీవ్రముగా ఆలోచించుచున్నారు. చక్కెర కర్మాగార ములు, చేనేత పరిశ్రమ, బట్టల కర్మాగారములును, సహకార పద్ధతులపై నడుపబడుచున్నవి. భారతప్రభుత్వమువారి యాజమాన్య మున నిర్వహింపబడుచున్న Synthetic Drugs కర్మాగారమును, Heavy Electricals కర్మాగారమును ఇటీవలనే హైద్రాబాదు నగరమునకు సమీపమున నెలకొల్పబడినవి. ఇవి చక్కని యభివృద్ధిని సాధించుచున్నవి. మూడవప్రణాళికాకాలమున ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువారు తమ పోషణలో మూడు పారిశ్రామిక సంస్థలను నెలకొల్పినారు. అందొకటి Industrial Development Corporation (పారిశ్రామికాభివృద్ధిసంఘము.) రెండవది Andhra Pradesh Mining Corporation (ఆంధ్రప్రదేశపు గనుల సంఘము) మూడవది Andhra-Pradesh Small Scale Industries Development Corporation (ఆంధ్రప్రదేశ లఘుపరిశ్రమల అభివృద్ధిసంఘము). మన రాష్ట్రము నందు భారీపరిశ్రమలు, మధ్యతరహా పరిశ్రమలు, లఘుపరిశ్రమ లును స్థాపించుటకై ఎట్టి అవకాశములు కలవో, వానిని నెలకొల్ప దలచిన పారిశ్రామికుల కెట్టి ధనసహాయ మావశ్యకమో విచారించి, అట్టిసహాయమును వారికందజేయుట ఈ సంస్థలయొక్క ముఖ్యోద్దేశ్యము. రెండవ ప్రణాళికాకాలమున మన రాష్ట్రమందు 7 పారిశ్రామిక కేంద్రములు నెలకొల్పబడెను. మూడవ ప్రణాళికాకాల మందు ప్రతిజిల్లాలోను ఒక పారిశ్రామిక కేంద్రము నెలకొల్పబడి నది. ఇవికాక 18 గ్రామీణ పారిశ్రామికసంస్థలు స్థాపితము లైనవి. తెలంగాణములోను, రాయలసీమయందును వెనుకపడియున్న ప్రాంత ములలో మరికొన్ని పారిశ్రామికసంస్థలు స్థాపింపబడినవి. ఖద్దరు, గ్రామీణ పరిశ్రమలును కూడ అభివృద్ధిగాంచుచున్నవి. ప్రైవేటు రంగములో ఎవ్వరైనను పారిశ్రామికులు నూతన పరిశ్రమలను నెలకొల్పదలచినచో, వారికి కావలసిన ధనసహాయమును, ఇతర విధములగు సహాయములను కావించుటకై తాము సింసిద్ధులమని ఆంధ్రప్రదేశ ప్రభుత్వము పదేపదే ప్రకటించుచున్నది. ఈరాష్ట్రము పరిశ్రమాభివృద్ధియందు వెనుకబడియున్న కారణమున ఇచ్చట

నూతన పరిశ్రమల నెలకొల్పుట చాల ఆవశ్యకమని మన ప్రభుత్వము భారతదేశపు దొరతనమువారిని తరచు హెచ్చరించుచున్నది. తత్ఫలితముగ పై వేటురంగమునందు రెండు ఎరువుల కర్మాగారములును, పబ్లికురంగమున నొక ముడియినుము కర్మాగారమును త్వరలోనే ఆంధ్రరాష్ట్రమున నెలకొనగల సావకాశములు కానవచ్చుచున్నవి. ఖమ్మంజిల్లాలో నెలకొనియున్న సింగరేణి నేలబొగ్గు పరిశ్రమ మనరాష్ట్రమందలి ముఖ్యమగు పబ్లికురంగ పరిశ్రమల కొక చక్కని ఉదాహరణము. 1960-61 సంవత్సరములలో ఇచ్చట 30 లక్షల టన్నుల బొగ్గు త్రవ్వబడెను. 1966 నాటికి బొగ్గు మొత్తము 60 లక్షల టన్నులకు పెరుగునని భావింపబడుచున్నది.

(5) ఆంధ్రప్రదేశరాష్ట్రములో వ్యవసాయాభివృద్ధికిని, పారిశ్రామికాభివృద్ధికినికూడ ముఖ్య అవరోధముగ నున్నది శక్తిసాధనము. విద్యుచ్ఛక్తి సరఫరా మన రాజ్యములో చాల పరిమితముగ నున్నది. ప్రస్తుతము హైద్రాబాదుపట్టణములో 20 Mgs విద్యుచ్ఛక్తి నుత్పాదనముచేయగల రెండు టర్బో గ్యాసు (turbo gas) కేంద్రములు నెలకొల్పబడినవి. మూడవ పంచవర్ష ప్రణాళిక పూర్తియగుసరికి ఎగువసీలేరుపథకమును, రామగుండం పథకమును, కొత్తగూడెం పథకమును పూర్తికాగలవని ఆశకలదు. ఇవికాక ధర్మతేజ అనువారు రామగుండమువద్ద విద్యుదుత్పాదక కేంద్రములను నెలకొల్పి, 200 Mgs విద్యుత్తు నుత్పాదనము కావింపగలమని వాగ్దానముచేసియున్నారు. ఈ కృషియంతయు సఫలమైనచో ఆంధ్రప్రదేశమునందు శక్తిసాధనముల కొరతయుండదు. 1966 సంవత్సరాంతమునాటికి రాష్ట్రము 500 Mgs విద్యుచ్ఛక్తిని తయారుచేసికొనగలదని మన ఇంజనీర్లు అంచనావేసినారు. శ్రీశైలం జలవిద్యుత్పథకమునుకూడ ఇటీవలనే ఆంధ్రప్రభుత్వమువారు చేపట్టినారు. 1963 వ సంవత్సరములో భారత ప్రధాని పండిత నెహ్రూగారు దీనికి ప్రారంభోత్సవము జరిపినారు. ఈ పథకము నాల్గవ పంచవర్ష ప్రణాళిక పూర్తియగుసరికి సంపూర్ణమగుననియు, ఇచ్చటినుండి 440 కిలోవాట్ల విద్యుత్తు సరఫరాకాగలదనియు

పారిశ్రామికనిపుణుల అంచనా. ఆంధ్రప్రదేశరాష్ట్రపుభావ్యభివృద్ధి-అనగా వ్యవసాయాభివృద్ధి, పారిశ్రామికాభివృద్ధి-శక్తిసాధనముల పెంపకముచేయుటతో ముడివడియున్నదని తెల్పుట సత్యదూరము కాదు. విద్యుచ్ఛక్తి నుపయోగించి, యెత్తైనప్రదేశములకుకూడ నీటిసరఫరా చేయవచ్చును. చోదకశక్తి లభ్యపడినచో, ఇంతవరకు మనము చేపట్టని యెన్నో నూతన పరిశ్రమలను నెలకొల్పవచ్చును. గ్రామసీమలకు విద్యుచ్ఛక్తిని సరఫరాచేసి, అచ్చట లఘుపరిశ్రమలను, కుటీరపరిశ్రమలను స్థాపింపనగును. ఈవిధముగ విద్యుచ్ఛక్తి సరఫరా మనకెంతయును ఆవశ్యకము. అందులకుతగిన యత్నములు కూడ సాగుచుండుట ముదావహము.

(6) పంచాయతీ రాజ్యస్థాపనములో భారతదేశమందంతటను ఆంధ్రరాష్ట్రము ముందంజవేసినది. ఆంధ్రజిల్లాలయందును, తెలంగాణా జిల్లాలయందును కూడ ఒకేవిధమైన వ్యవస్థ యేర్పాటుచేయబడినది. 1964 వ సంవత్సరములో పంచాయతీసభలకై యెన్నికలు జరిగినవి. మొత్తము ఆంధ్రప్రదేశములో 446 సామాజిక విభాగములు (Community Development Blocks) కలవు. వీనిలో 398 విభాగములలో పంచాయతీ సభలు ఏర్పాటు కావింపబడినవి. ప్రజాప్రభుత్వవిధానము విజయవంతముగ సాగుటకొరకు గ్రామసీమలలో స్వపరిపాలనాసంస్థలు నెలకొనుటయు, ప్రభుత్వాధికారము వికేంద్రీకరణము చెందుటయు, చాల అవసరము. ఈ యంశములను దృష్టియందుంచుకొని ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువారు పంచాయతీ రాజ్యపథకము నమలుపరచుచున్నారు. స్థానిక స్వపరిపాలనా సంస్థలకు విస్తృతమగు అధికారము లొసంగబడుచున్నవి. పంచాయతీసభలు వారి కొసంగబడిన బాధ్యతల పరిశీలించినచో ఈ యంశము తేటతెల్లమగును. వ్యవసాయోత్పత్తి నభివృద్ధిచేయుట, ప్రాథమిక, ఉన్నత విద్యాసంస్థల నిర్వహణము, గ్రామసీమలలోని ప్రజలకు పనిపాటుల కల్పించి, వారిద్వారా ప్రజాక్షేమమును సాధించుట, గ్రామీణప్రాంతములలో మంచినీటి వసతులు ఏర్పాటు చేయుట, గ్రామప్రాంతములలోను, జిల్లాలోని ఇతర భాగముల

లోను, రోడ్లను, చక్కనిస్థితిలో ఉంచుట, ఆరోగ్యాభివృద్ధి, వైద్య సౌకర్యములు, సామాజిక సంక్షేమము, స్త్రీలు, చిన్నబిడ్డలు, యువకులు—వీరి సంరక్షణమునకై కృషిసాగించుట మొదలైన ముఖ్య ప్రజాహితకార్యముల నీనాడు పంచాయతీసభలు కొనసాగించవలసి యున్నది. ఇంతటి మహత్తరోద్యమమునందు కొన్ని లోపము లనివార్యముగ ప్రవేశించి తీరును. వానిని తొలగించుటకై ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువారు సర్వవిధముల కృషి సాగించుచున్నారు.

(7) రాకపోకల సౌకర్యములను వృద్ధికావించువిషయమున ఆంధ్రప్రదేశప్రభుత్వము శ్రద్ధ వహించుచున్నది. ముఖ్యముగ తెలంగాణాజిల్లాలలో రహదారులు చక్కని పరిస్థితిలో లేనికారణమున వీనినిగూర్చి దొరతనమువారు ప్రత్యేక కృషిచేయుచున్నారు. గోదావరి, కృష్ణ, తుంగభద్రానదులపై బ్రిటీషుయుగమున మోటార్లు వగైరా వాహనముల కుపయోగించు రోడ్లు నిర్మింపబడలేదు. మన ఆంధ్రప్రభుత్వ మీలోపమును తొలగించుటకై పూనుకొనినది. గోదావరినదిపాయలైన గౌతమీవసిష్ఠలపై వంతెనలు సిద్ధమగుచున్నవి. ఇవి పూర్తియైనప్పుడు గోదావరి డెల్టాలోని సారవంతమైన భూములకు ఆధునిక రవాణాసౌకర్యములు ధారాళముగా చేకూరును. ఇదికాక భద్రాచలమువద్ద గోదావరిపై మరియొక వంతెన సిద్ధమగుచున్నది. బెజవాడవద్ద కృష్ణాబ్యారేజి పూర్తియగుటతో ఉత్తరాంధ్రమునుండి దక్షిణాంధ్రమునకు సూటిగ నాటు ప్రయాణము చేయు మార్గ మేర్పడినది. అట్లే కర్నూలుకు సమీపమున కృష్ణా తుంగభద్రలపై వంతెనలు కట్టుటచే తెలంగాణమును, రాయలసీమ జిల్లాలును కలిసిపోయినవి. రాష్ట్రమునందు రోడ్డు రవాణా సౌకర్యమును అభివృద్ధికావించు నిమిత్తము మనరాష్ట్ర ప్రభుత్వమువారు 1958 వ సంవత్సరమున రోడ్డు ట్రాన్సుపోర్టు కార్పొరేషనును నెలకొల్పిరి. ఈ సంస్థవారు పదికోట్లరూపాయల వ్యయముతో మూడవ పంచవర్ష ప్రణాళికాకాలమందు రవాణాసౌకర్యముల పెంపొందించు పథకములను చేపట్టినారు. రోడ్డురవాణా

సాధనములను తెలంగాణాప్రాంతములో జాతీయము కావించినారు. ఆంధ్రప్రాంతములో మూడుజిల్లాలలో మాత్రము ఈ విధానము అమలు కావించియున్నారు. ఇతర జిల్లాలలోకూడ బస్సు సర్వీసులను జాతీయము కావించుట ప్రభుత్వమువారి ఆశయము. 1965–66 నాటికి ఈ సంస్కరణము పూర్తిగ అమలులోనికి రాగలదు.

(8) ప్రజల ఆరోగ్యమును కాపాడుటయు, వ్యాధుల నివారణ మునకై ఏర్పాట్లు కావించుటయు, వార్ధక్యముచే నిరాధారులైన వారికి ఉచితమగు సహాయమును కావించుటయు, ఆధునిక నాగరక ప్రభుత్వముల ధర్మములుగ నేడు పరిగణింపబడుచున్నవి. ఆంధ్ర ప్రదేశ ప్రభుత్వమువారీ విషయము లన్నిటియందును శ్రద్ధ వూను చున్నారు. క్షయ, నేత్రరోగములు, దంతవ్యాధులు, సుఖవ్యాధులు— వీని చికిత్సకొరకై రెండవ ప్రణాళికా కాలమునుండియుకూడ ప్రభు త్వము కృషి సాగించుచునే యున్నది. మూడవ పంచవర్ష ప్రణాళిక అమలు జరుపుటలో ఈ సౌకర్యములు గ్రామసీమలకు కూడ చేకూరు చున్నవి. ప్రస్తుతము మన రాష్ట్రములో 1370 ప్రభుత్వ చికిత్సాల యములు కలవు. సుశిక్షితులైన వైద్యులు లభ్యపడినచో రాష్ట్ర మందంతటను కూడ వైద్య సౌకర్యములు వృద్ధిపొందగలవు భారత దేశపు ప్రస్తుత ఆర్థిక పరిస్థితినిబట్టి, కుటుంబ నియంత్రణము చాల ముఖ్యమైనది. ఈ విషయమును గూర్చి పట్టణములందును, పల్లె లందును కూడ ప్రచారము చేయుటకై ఆంధ్ర ప్రభుత్వమువా రేర్పాట్లు చేసియున్నారు. 1964–65 సంవత్సరపు బడ్జెట్టులో వృద్ధు లును, అసహాయులును అగువారికి ధనసహాయము చెయుటకును, తక్కువ తరగతి ఉద్యోగుల ఉపకారవేతనముల కొరకును, అట్టి ఉద్యోగులు గతించినచో వారి కుటుంబములకు సహాయము కావిం చుట కొరకును, ఇతోధికములగు ధనపు మొత్తములు కేటాయించ బడినవి.

(9) విద్యావిషయమునందు ఆంధ్రప్రభుత్వము ప్రత్యేక కృషి సాగించుచున్నది. 1961–62–వ సంవత్సరమునందు మన ప్రభుత్వము

బాలబాలికలకు నిర్బంధముగ ప్రాథమిక విద్యను నేర్పుటకై నిశ్చ యించినారు. ఈయేర్పాటు ననుసరించి రాష్ట్రములో నివసించుచున్న ట్టియు, 6–11 సంవత్సరముల నడుమ యీడు కల్గినట్టియు బాల బాలిక లందరును విధిగ పాఠశాలలకు పోయి, విద్య నేర్వవలెను. 1965–66 నాటి కీవిధముగ 16 లక్షుల అల్పవయస్కులు విద్య నభ్య సింపగలరు. చీనావారి దాడికి ఫలితముగ దేశమందేర్పడిన అత్యావ సర పరిస్థితివలన ఆర్థికమగు చిక్కులేర్పడి, ఈ విద్యాకార్యక్రమము కొరకై కావలసినంత ధనము వెచ్చించుటకు వీలుపడలేదు. కాని త్వరలోనే మన దొరతనమువారు క్రొత్తపాఠశాలలను స్థాపించుట కును, ఉపాధ్యాయుల నధిక సంఖ్యలో నియమించుటకును, ఆవశ్యక మగు ధనమును కేటాయించి యుంచగలరు. ప్రాథమిక, ఉన్నత పాఠశాలలలో విద్యాబోధన కావించునట్టి ఉపాధ్యాయులకు శిక్షణ నొసంగుటకై ట్రైనింగు శిక్షణాలయములును, కళాశాలలును స్థాపింప బడుచున్నవి. అల్పవయస్కుల శిక్షణతోపాటు, వయోధికులలో నిరక్షరాస్యత నిర్మూలించుటకుగాను ఏర్పాట్లు జరుగుచున్నవి. ఉన్నత విద్యావ్యాప్తి కొరకై మన రాష్ట్రమున మూడు విశ్వవిద్యాలయ ములు కృషి సాగించుచున్నవి. వీనిలో ఉస్మానియా విశ్వవిద్యాల యము వయోవిషయమున పెద్దది. అటు పిమ్మట ఆంధ్ర విశ్వవిద్యా లయమును లెక్కింపవలెను. తిరుపతి పుణ్యక్షేత్రమున నుద్భవించిన వేంకటేశ్వర విద్యాలయము కడగొట్టు చెల్లెలు. ఈ విద్యాకేంద్ర ములు సాగించుచున్న ఘనమైన వైజ్ఞానిక కృషినిగూర్చి వివరముగ తెల్పుట కిచట అవకాశము లేదు.

ఈ సంస్థలు దేశభాషలగు తెనుగు, కన్నడము, మహా రాష్ట్రము, తమిళము, ఉర్దూ, హిందీ, మున్నగువానిని సంస్కృ తము, అరబ్బీ, పారసీ, మున్నగు ప్రామాణికభాషలను నిష్పక్షు పాతముగను. శక్తివంచన లేకుండగను పోషించుచున్నవి. ప్రపంచ మంతయు నొక కుటుంబముగ మారుచున్న యీ కాలమున భారతీ యులు, ఇతర దేశములవారి భాషలను నేర్చుట యెంతయును ఆవశ్య

కము. ఈ యంశమును గుర్తించి ఉస్మానియా విశ్వవిద్యాలయము వారు ఫ్రెంచి, జర్మను, రష్యను, ఇటలీభాషల బోధనకొరకై ఏర్పాట్లు కావించుచున్నారు. ఆయా దేశముల ప్రభుత్వములవారు సమర్థులైన స్త్రీపురుష విద్వాంసులను మన విశ్వవిద్యాకేంద్రములకు పంపి, తమతమ భాషలను మన విద్యార్థులకు నేర్పుచున్నారు. ఆధునిక యుగమందు ప్రకృతిశాస్త్ర విజ్ఞానము, జీవశాస్త్ర విజ్ఞానము మున్నగువాని కపారమగు ప్రాముఖ్యము లభించుచున్నది. మానవ జీవితము సౌఖ్యవంతమును, ఆనందపూరితమును అగుటకై ఈ శాస్త్రములు కృషిచేయుచున్నవి. పదార్థ విజ్ఞానశాస్త్రము, రసాయన శాస్త్రము, జీవజంతుశాస్త్రములు, భూగర్భశాస్త్రము, వైద్య శాస్త్రము, జంతుచికిత్సావిజ్ఞానము, మున్నగు ఎన్నో వైజ్ఞానిక శాఖలలో మన విశ్వవిద్యాలయములు కృషి సాగించుచున్నవి. వాస్తుశాస్త్రము (Technology) ను నూర్లకొలది విద్యార్థు లభ్యసించుచున్నారు. ఉపలబ్ధముగా శాస్త్రీయవిజ్ఞానమును జీవితావసరముల సాధించుటకై యెట్లు వినియోగింపవలెనను జిజ్ఞాసను నేటి వైజ్ఞానికులు తీవ్రముగ కావించుచున్నారు. అనువర్తిత విజ్ఞానము (Applied Science) ను టెక్నాలజీ (Technology) అని వర్ణింతురు. అట్టి టెక్నాలజీశాఖయందు మన విద్యాకేంద్రములు చాల కృషి సాగించుచున్నవి. ప్రతిసంవత్సరమును పదులకొలది విద్యార్థులును, ఆచార్యులునుకూడ ఉన్నత వైజ్ఞానిక విద్యకొరకును, అనుభవమును సంపాదించుట కొరకును ఇంగ్లాండు, రష్యా, జర్మనీ, అమెరికా మున్నగు దేశములకు పోవుచున్నారు. విద్యాభివృద్ధి విషయమందు మన ఆంధ్రరాష్ట్రము మరే భారతీయరాష్ట్రమునకును తీసిపోదని ధైర్యముగ చెప్పవచ్చును. కళాశాలలకుపోయి, ఉన్నత విద్యను సాధింపజాలని బక్కవారికొరకై సాంకేతిక విద్యాకేంద్రములు, వృత్తివిద్యాకేంద్రములు, బాలబాలికల కిరువురకునుకూడ సమానముగ ఏర్పాటుచేయబడుచున్నవి.

(10) కళాభిమాన మాంధ్రజాతియందనాదినుండియు ప్రస్ఫుటముగ కానవగును. కవిత్వము, సంగీతము, నృత్యము, నాట్యము, అభినయము, చిత్రలేఖనము మున్నగునవి కళావిభాగములు. పూర్వకాలమునందు పరిస్థితు లెట్లుండినను, ఆధునికయుగమునం దివి యన్నియు సినీమారంగమునందు కేంద్రీకృతమై యున్నవి. సినీమా కళయందు మన ఆంధ్రదేశము చెప్పదగిన అభివృద్ధి సాధించినది. ఉత్తమమగు సినీమాఫిల్ములను సిద్ధముచేయుగల గొప్ప నిర్మాతలును, తమ నటనాకౌశల్యముచే ప్రేక్షకుల నానందసముద్రమున నోలలాడించగల నటశ్రేష్ఠులగు స్త్రీపురుష తారలును, శ్రోతల తమ గానమాధురిచే స్వర్గసీమల తలపింపజేయగల గాయనీగాయకులును, మననాట అనేకులు కలరు. వారి శుభనామములను ఆబాలగోపాలమును ఎరుంగుదురు కావున గ్రంథవిస్తరభీతిచే వానిని మేము పేర్కొనుటలేదు. తెనుగువారు సిద్ధము కావించిన కొన్ని ఉత్తమ చిత్రములనుమాత్రము ఉదహరించుచున్నాము. ఇవియన్నియుకూడ భారతప్రభుత్వమువారినుండి బహుమతులను పొందియున్నవి. పెద్ద మనుష్యులు, బంగారుపాప, తెనాలిరామకృష్ణ, పెళ్ళినాటి ప్రమాణాలు, నమ్మినబంటు, మహాకవి కాళిదాసు, భార్యాభర్తలు, మహామంత్రి తిమ్మరుసు, నర్తనశాల, లవకుశ అనునవి. ఇవికాక మూగమనసులు మొదలైన ఉత్తమచిత్రము లెన్నియో మన తెలుగునాట వెలసినవి.

(11) వ్యక్తులుకాని, సంఘములుకాని అభివృద్ధిని సాధింపవలె నన్నచో వారికి ఆర్థికపుష్టి చాల యవసరము. అట్టి ఆర్థికపుష్టిని రెండుమార్గములద్వారా సాధింపవచ్చును. ఇందు మొదటిది వ్యవసాయము. రెండవది పరిశ్రమలు. ఈ రెండింటికిని ఆంధ్రప్రదేశ ప్రభుత్వము పునాదులు వేసినదని చెప్పవచ్చును. మన రాష్ట్రము నందు పెక్కునదులపై ఆనకట్టలు నిర్మించుటకు సన్నాహములు సాగుచున్న ట్లీవరకే తెలుపబడినది. అవియన్నియుకూడ మూడవ పంచవర్ష ప్రణాళికతోపాటు పూర్తియగును. ఇందువలన నీటిపారు

దల సౌకర్యము లేర్పడి వ్యవసాయోత్పత్తి హెచ్చుటయు, జలవిద్యుత్పథకములమూలముగ విద్యుత్తుయొక్క సరఫరా బాగుగా జరగుటయు సంభవించును. ఇవి పరిశ్రమాభివృద్ధికి మూలాధారమగును. మన మాసించుచున్న వ్యవసాయాభివృద్ధియు, పారిశ్రామిక వికాసమును, 1971 నాటికి తప్పక సాధింపబడునని ఆర్థికనిపుణులు భావించుచున్నారు. ప్రభుత్వమువారు చేపట్టుచున్న ప్రణాళికలు ఈ అభివృద్ధికి దోహదమొసంగగలవు. ప్రభుత్వమువారి వివిధశాఖలును, పంచాయతీసమితులును దేశపుటార్థికాభివృద్ధివలన ప్రజానీకమునకు సౌఖ్యసంతోషములు లభించునట్లు చూడగలవని మన మాసింపదగును. ఆంధ్రభూమి వర్ధిల్లుగాక.



# అవశ్య పఠనీయ గ్రంథములు

1. ఆంధ్రుల చరిత్ర 1, 2, 3 భాగములు—చిలుకూరి వీరభద్రరావు.
2. ఆంధ్రదేశచరిత్ర సంగ్రహము—మల్లంపల్లి సోమశేఖరశర్మ.
3. Early History of the Deccan-Bhandarkar.
4. Ancient Deccan-Dubrenil.
5. ఆంధ్రులు - చరిత్ర—నేలటూరి వెంకటరమణయ్య.
6. Glimpses of Deccan History—M. Rama Rao.
7. ఆంధ్ర సర్వస్వము—మాగంటి బాపినీడు.
8. సాతవాహన సంచిక—మారేమండ రామారావు.
9. Satavahana Commemoration Volume-M. Rama Rao.
10. Early History of the Andhra Country—K. Gopalachary.
11. Successors of Satavahanas—D. C. Sircar.
12. Early Dynasties of Andhradesa—B. V. Krishna Rao.
13. Budhist remains in Andhra—K. R. Subrahmanian.
14. Eastern Chalukyas—D. C. Ganguly.
15. Eastern Chalukyas—of Vengi—N. V. Ramanayya.
16. కాకతీయ సంచిక—మారేమండ రామారావు.
17. Kakatiyas of Warangal—M. Rama Rao.
18. కాకతీయాంధ్రరాజయుగ చరిత్ర—చిలుకూరి వీరభద్రరావు.
19. History of the Reddy Kingdoms—M. Somasekhara Sarma.
20. A forgotten Chapter of Andhra History—M. S. Sarma
21. వెలుగోటివారి వంశావళి—నే. వెంకటరమణయ్య,
22. శృంగార శ్రీనాథము—వేటూరి ప్రభాకరశాస్త్రి.
23. Sources of Vizianagar History—Krishnaswamy Aiyangar.
24. Further sources of Vizianagar History—Nilakantha Sastry and N. V. Ramanayya.

25. Studies in the Third Dynasty of Vizianagar
N. V. Ramanayya
26. Social and Political life in Vizianagar Times—Salatore.
27. Vizianagar—Sencentenary Volume.
28. Aravidu Dynasty—Father Heras.
29. తంజాపురాంధ్రనాయక రాజచరిత్రము—కురుగంటి సీతారామయ్య.
30. Nayaks of Madhura—Satyanatha Iyer.
31. Briggs Ferishta.
32. The Nizam and his History—Briggs.
33. ఆంధ్రుల సాంఘిక చరిత్ర—సురవరము ప్రతాపరెడ్డి.
34. తెలంగాణా ఆంధ్రోద్యమ చరిత్ర - 1, 2 భాగములు.—మాడపాటి హను మంతరావు.
35. ఆంధ్ర కవి తరంగిణి—చాగంటి శేషయ్య.
36. ఆంధ్రకవుల చరిత్ర—కందుకూరి వీరేశలింగము.
37. తెలంగాణా శాసనములు—లక్ష్మణరాయ పరిశోధకమండలి.
38. Corpus of Inscriptions of the Nizam's Dominions—
P. Sreenivasachary.
39. ప్రాచీనాంధ్ర నగరములు—ఆదిరాజు వీరభద్రరావు.
40. నవకథామంజరి—పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి.